# ఆంధ్ర వేదములు.

[ఋగ్వేదము.]



ప్రథమ సంపుటము



అనువాదకులు:—

బంకుపల్లె మల్లయ్యశాస్త్రి



[illegible] వారిచే [illegible] ముద్రింపబడి,

ప్రకటింపబడినది.

౧౯౪౦.



మొదటి కూర్పు 3000 ప్రతులు.

ఓం.

పరమాత్మనే నమః

ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషకును, ఆంధ్రులకును, ఆంధ్రపరిచితులకును, స్వభాష, పరభాషలు, నేర్చినను, నేఱకున్నను, సర్వులకును, సర్వులలో లీనమైన సర్వేశ్వరునకును, సర్వజ్ఞానప్రబోధకరమగు **యీ ఆంధ్రవేదములను** భక్తిపురస్సరముగా సమర్పణ మొనర్చుచున్నాము.

* * *

## ఋగ్వేదకృతి.

గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా మంతెనవారిపాలెము కాపురస్థులును, అసహాయోద్యమ కాలమున గ్రామోద్యోగమును త్యజించి సత్యాగ్రహములో కఠినశిక్ష ననుభవించినవారును, తనతండ్రి బాపిరాజుగారి జ్ఞాపకార్థము "ఋగ్వేద" ప్రచురణకై అయిదువే లర్పించుచున్న త్యాగ, ధానశీలురగు శ్రీయుత మంతెన సుబ్బరాజుగారికి "ఋగ్వేదము" కృతి నిచ్చుచున్నాము.

* * *

## మాలవీయాజీ మహదాశీర్వచనము.

"వేదవేదాంగములను, ఉపనిషత్తులను ఆంధ్రభాషలోనికి అనువదించి ప్రకటించుటకు తాముచేయుకృషి ఎంతయు ఎన్నదగియున్నది. పరమేశ్వరుడు ఈ కార్యమునందు తమకు సాఫల్యము ప్రసాదించుగాక!"

భవదీయ,

(సం.) మదన మోహన మాలవీయ

౨౫—౭—౨౦.

# ప్రకాశకుల తొలిపలుకు.

—:-o-:—

౧౯౧౮ లో బొంబాయిలో "ఋగ్వేదము"ను ఆంగ్లములోనికిని, మహారాష్ట్రములోనికిని భాషాంతరీకరించి ప్రకటించుచుండిరి. గుంటూరులో నూతనోద్యమములకు ప్రోత్సాహకరుడుగా నుండిన శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు మొదలగు స్నేహితులము వేదముల నాల్గింటిని ఆంధ్రభాషలోనికి అనువదింపవలెనని తలంచితిమి. కాని అప్పుడే ఐరోపా మహాసంగ్రామము ప్రారంభమగుటచేతను, బళ్ళారిలోని ప్రముఖులుకొందరు ఆంధ్రానువాదము ఆరంభించిరని తెలియుటచేతను మేము విరమించితిమి. బళ్ళారివారిపని కొంతవరకుజరిగి ఆగిపోయెను. యుద్ధము నాలుగేండ్లు సాగెను. అది ముగిసినపిదప దీనిని సాగించ మరల సంకల్పము కలిగెను. గుంటూరునుండి భావపురికి (బాపట్ల) పోవు న్యాయస్థానముతో పాటు అచట ఈ కార్యమును నిర్వహింపవచ్చునని ఆశకలిగెను. ఆ సమయముననే పూజనీయులగు మహాత్మా గాంధీగారు మోహన వేణుగానముపూరించి దేశీయమహాజనసభతో పాటు భారతజాతినంతను స్వాతంత్ర్య సమరరంగమున కాకర్షించెను. అంతటితో రెండవ సంకల్పము వీగిపోయెను. అసహాయోద్యమ తీవ్రప్రచారము సాగుచుండగనే బ్రాహ్మణ, బ్రాహ్మణేతర అసమానత్వమును తొలగించుటకు వేదవేదాంగములను ఆంధ్రీకరించి ఆంధ్రులకెల్లరకు హస్తగతమొనర్చుట భావ్యమని తెలుపుచుంటిమి. కాని ఆసమయమున సహాయమొనర్చుటకు పూనిన ఒకానొక స్నేహితుని పవిత్ర సంకల్పము దురదృష్టవశమున కొనసాగదయ్యె. సాయమొనర్తుమనిన మరియొకరు అకాలమృత్యు వాతబడిరి. స్వాతంత్ర్యోద్యమము నిమ్నోన్నతస్థాయిలలో నడుచుచుండెను. ఇంతలో వినయాశ్రమమును శ్రీముఖ సం॥ మార్గశిర బహుళ సప్తమి స్థిరవాసరమున (౨౩—౧౨—33) మహాత్ములు ప్రారంభించిరి. ఆంధ్రవేదానువాదము ఆశ్రమోద్దేశములలో నొకటియై వరలుచుండెను. సత్యాగ్రహ సిద్ధాంతములోని సర్వధర్మ సమానత్వమను ముఖ్యసూత్రమునకు సర్వమత గ్రంథములను సమానభక్తి

గౌరవములతో స్వభాషలో సమర్పించు సమున్నతమొనర్చి సదాచరణతో ప్రవర్తిల్లచేయుట పరమకర్తవ్యముగా ప్రత్యక్షమయ్యెను. తదుద్దేశ్యముతో ఆర్య, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయమతగ్రంథముల నాంధ్రీకరించుటకు పూనితిమి. జొరాష్ట్ర, కన్‌ఫ్యూషియస్ ప్రవక్తల ప్రబోధగ్రంథములనుగూడ ఆంధ్రీకరింపదల చితిమి. పశుధర్మమునుండి దైవధర్మమునకు పరిణామమునొందుచున్న మానవకోటి నుద్ధరింప యుగయుగాంతరముల పరమేశ్వరుడు ప్రసాదించిన మహాప్రబోధములను సర్వజనసులభముగా లభింపజేయుట, విశ్వసందేశమని భాషితమయ్యెను.

మతములలోనికెల్ల ఆది ఆర్యమతము. ఆర్యధర్మమునకు వేదముమూలము. వేదములు షడంగములతో సహా ప్రకటించుట జ్ఞానవిజ్ఞానములకు సాధనమార్గము. "ఆంధ్రావని మోదముస్ బొరయ" ఆంధ్రవాఙ్మయము పరిపూర్ణతనొంద, ఆంధ్రుల జ్ఞానవైరాగ్యములు సర్వతోముఖవ్యాప్తిపొంద, లోకోద్భవమునకు కారణభూతుడైన పరమేశ్వరునుండి వెలువడిన ఋగ్యజుస్సామాథర్వవేదంబుల తదంగ సమేతంబుగా సుబోధకమగు శైలిలో యనువదించి ఆంధ్రవేదంబులు"గా ఆంధ్రలోకంబునకు లభింపజేయుట పరమకర్తవ్యము. ఇట్లు మనోవీధిలో తాండవమాడుచున్న భావపరంపరలకు కాలపరిణామముబట్టి కార్యరూపమొందు కాలము సంఘటిల్లెను. ఒకానొక స్నేహితుని వాగ్దత్తము అవలంబనమయ్యెను. చిరకాల స్నేహితులును, సంపన్న గృహస్థులును, అగు శ్రీయుత ఆలపాటి దేవయ్యగారు యజుర్వేద శాఖలలో నొకదానికి పూనుకొని తనకుమారుడు వెంకటకృష్ణయ్యగారిద్వారా ౨౩-౧౨-౩౭ తేదీన జరుపబడిన వార్షికోత్సవమువుడు చదివించిన ధనము కార్యోపక్రమణకు తోడ్పడెను. తాతలనాటినుండి మాకుటుంబమునకు పోషకులుగానున్న శ్రీ రాచూరు జమీందారగు శ్రీరాజా మాణిక్యారావు వెంకటమహీపతి గ్రీవరావుబహద్దూరుగారు గత ముక్కోటిఏకాదశినాడు తమతల్లి శ్రీరాజా రాజలక్ష్మమ్మగారి జ్ఞాపకార్థమై శుక్లయజుర్వేదమునకై యిచ్చిన సహాయమరింతప్రోత్సాహ మొనర్చెను. ఆశ్రమ రాజపోషకుడు శ్రీయుతమద్ది వెంకటరంగయ్యగారు సామవేదమును భరించసమకట్టుట

సంతోషప్రదమయ్యెను. బాల్యస్నేహితుడు శ్రీయుతవంతెన సుబ్బరాజుగారు తనతండ్రి జ్ఞాపకార్థమై ఋగ్వేద భారమును వహించి కార్యలోపము రాకుండ రక్షించె. అధర్వ వేదమును పూనుకొన్న ఒకానొకస్నేహితుని కృషి ఈ కార్యసమాప్తికి తోడ్పడ నున్నది. అనాదిగా ఈ వేదమంత్రములను పండితవరేణ్యులు భద్రపరచియున్నారు. అందునిగూఢములైన భావపరంపరలు పండితపామరులకెల్ల సులభముగా బోధపడు నట్లు మధురమైన శైలిలో తేలికయైన పదములగూర్చి ఆంధ్రానువాదము జరుగుచున్నది. వేదవిమర్శకుల భావములును, ప్రకాశకుల స్వంతభావములును ప్రత్యేక సంపుటము లలో తెలుపబడును. కరుణామయుని అపారమైన అనుగ్రహముచేతనే సనాతనులైన పండితులు యీ అనువాదమునకు పూనుకొనిరి. ఋగ్వేదమును సుప్రసిద్ధసంస్కృ తాంధ్రపండితులును, సంస్కర్తలును, పురాణవాచస్పతి బిరుదాంకితులును నగు బ్రహ్మశ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు ఆంధ్రీకరించియున్నారు. సామ, అధర్వ వేదములను వారే అనువదింతురు. సాహిత్యశిరోమణి బ్రహ్మశ్రీ రామవరపు కృష్ణ మూర్తి శాస్త్రిగారు కృష్ణయజుర్వేదమునువదించిరి. శుక్ల యజుర్వేదమును గూడ అనువదింతురు.

ఆంధ్రవేదప్రకటనకు అనివార్యములైన చోటతప్ప స్వదేశవస్తువులనే వాడు చున్నాము. యుద్ధకాలమగుటచేత వస్తువుల ధరలు పెరుగుటయు, వస్తువులు సులభ ముగా లభింపకుండుటయు కొంత ఆటంకమును కల్పించుచున్నవి మూడేండ్లనుండి జరియుచున్న ప్రకటన అంతరాయములచే అప్పటప్పటికి ఆలస్యమగుచుండెను. కాని పరుచూరు ప్రాంతవాసులు మా ఆలస్యమునకు జంకక, మా వాయిదాలను గిర సింపక, వేలకొలదిగా ధనమిచ్చి ఆదరాభిమానములతో తోడ్పడుటచేతనే ఈపని యిప్పటికి సాధ్యమైనది. ఆంధ్రవేదములు సంపూర్తియగుసరికి కొన్నియేండ్లుపట్టును ఆంధ్రులందరును, ఆరంభశూరులుగాక సుస్థిరసమగ్రోత్సాహముతో ఈ కార్య క్రమమునకు తోడ్పడుదురుగాక యని ఆశించుచున్నాము.

మొదటి ఐరోపామహాసంగ్రామమునకు పూర్వము తలపెట్టిన కార్యము, రెండవ సంగ్రామకాలమున కార్యరూపము నొందుట కరుణామయుని కార్యలీలయే గదా !

[illegible]
మంగళవారము ౨౧-౫-౪౦.

ఇట్లు,
గం॥ పూడి సీతారామశాస్త్రి.

# ఉపోద్ఘాతము.

—(•)—

ఋగ్వేదము, (శుక్ల - కృష్ణ) యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము నని నాల్గువేదములు. యజుర్వేదము వచనశైలి, తక్కినవి పద్యశైలిలో నున్నవి. ప్రతివేదము సంహిత, బ్రాహ్మణము, అని రెండువిధములు. అన్నిటిలోను బ్రాహ్మణములు వచనశైలులు. సంహితలలో దేవతాప్రార్థనలు, మఱికొన్ని ప్రకృతివైచిత్ర్య వర్ణనములుకలవు. సామవేదము గేయము, తక్కినవి పాఠ్యములు.

బ్రాహ్మణములలో యాగముల విధులు, నిషేధములునుగలవు. అథర్వవేదమున మానవుఁడు తాను ప్రపంచమునఁగోరెడు సమస్తమయిన కోర్కెలను సాధించు జపహోమాదులుగలవు. తదితర వేదములందు స్వర్గాదిపారలౌకికఫలములు విశేషించి కలవు. ఐహికములును గలవు. అందు వ్యవసాయము, గోరక్ష, శత్రువుల నెదిరించుట మొదలగు విషయములు పదేపదే వర్ణింపఁబడినవి.

ప్రస్తుతము మేము తెనిఁగించినవి సంహితలుమాత్రమే. మున్ముందు బ్రాహ్మణములుగూడ దెలిగింతుము.

వేదము ప్రాచీనగీర్వాణభాషలోనున్నది. దాని భాష్యములు సంస్కృతభాషలోనున్నవి. నిరుక్తమను వేదపదనిఘంటువును యాస్కముని సంస్కృతభాషలోనే వ్రాసినాడు. దానింబట్టియే వ్యాఖ్యాతలు వేదమున కర్థమువ్రాసినారు. ఉవ్వటుడు, మహీధరుఁడు, శ్రీ విద్యారణ్యస్వామియు భాష్యములు వ్రాసినారు విద్యారణ్యభాష్యమే యన్నిటిలో విపులము. శుక్లయజుర్వేదమునకు మాత్రమే ఉవ్వటభాష్యము ననుసరించితిమి. తక్కిన యన్నిటియర్థమునకు విద్యారణ్యభాష్యమునే అనుసరించినారము. అందు మాస్వంత యభిప్రాయములు రవ్వంతయును సూచింపనైనలేదు. ఆ యాస్కుఁడొకొక్కపదమున కనేకార్థములు వ్రాసినాఁడు. భాష్యకర్తలుకూడ దానింబట్టి "యద్వా అథవా" ఇత్యాదిగా ననేకములర్థములు వ్రాసినారు. దానింబట్టి వారు వేదార్థమిదేయని నిర్ణయింప శక్యముకానట్టులూహింపవచ్చును. ఒకర్థమునే నిర్ణయించితే వికల్పములు వ్రాసియుండరు. కావున బుద్ధిమంతులు ఇంకొక యర్థమునుగూడఁ జెప్పవీలున్నది. దయానందసరస్వతి, తిలక్

పండితుఁడు, మాక్సుముల్లరు మొదలగు ప్రాచ్యప్రతీచ్య నవీనపండితులు తమతమ యర్థములు భిన్నభిన్నములుగాఁ గొన్ని వ్రాసిరి. వాటిని, మాస్వంతయభిప్రాయము ను, చివరసంపుటమునం దే ప్రకటింతుము.

ఋగ్వేదమున విభాగము రెండువిధములు, ఒకటి-పదిమండలములు, మండలములలో అంతర్భాగములు అనువాకములు, వాటిలో సూక్తములు, అందులో మంత్రములు, మంత్రమున కే ఋక్కనిపేరు.

రెండవది. అష్టకము లెనిమిది, అందధ్యాయములు, అందువర్గములు. వర్గము లనుపయోగములని వదలివేసితిమి.

ఋక్కులకు వరుససంఖ్యనిచ్చితిమి.

( ) ఇందువ్రాసిన గ్రంథముమూలమున లేదనియు సందర్భానుసారము భాష్యకర్తలు సంధించినది యనియు తెలియనగును. మఱియు తాత్పర్యవివరణములునుగలవు. దం॥ ఇది దండాన్వయమని తా. అంటే తాత్పర్యమని యెఱుంగనగును.

పాఠకమహాశయులారా! నిత్యములైన ప్రకృతిచిత్రములు వేదమందుఁగలవు. వేదమనఁగా జ్ఞానము, అపౌరుషేయమును, పదముల ఆనుపూర్విఋషులు రచించినది కావచ్చును అందలి తాత్పర్యము మాత్రమునాది. కనుక నే యపౌరుషేయము. ప్రకృతిని బలురీతుల వర్ణించును. ఇందు గొన్నిగూఢార్థములు కలవు. అశ్వ = సూర్యుఁడు, గో = మేఘములోని యుదకము, హవిస్సు = ఆవిరి, సోమరసము = పచ్చివస్తువులలోని రసము దేవ = సూర్యకిరణములు, ఆ రసమును అవి గ్రహించుట యజ్ఞము, ఈయర్థములును నిరుక్తమునసున్న వే. ఇట్టి యర్థవిశేషములు, చివరసంపుటమం దే చూపుదుము. ఇపుడే యేలచూపలేదంటే, ఒకయర్థము సమగ్ర గ్రంథమునకుఁ దెలిసినతర్వాత నర్థాన్తరము లాయాప్రకరణాది సామగ్రింబట్టి బుద్ధిమంతులకు విమర్శింప వీలుచిక్కునని.

వేదార్థముయొక్క యుపయోగము.

మంత్రముల యర్థమును గుర్తించుచునే కర్మలాచరింపవలెను. అపుడే కర్మఫలము కలుగును. అని పూర్వులసిద్ధాన్తము. అందుకనే గీర్వాణభాషకు సంస్కృతార్థము భాష్యకర్తలు వ్రాసిరి- అప్పటికి సంస్కృతము కర్మలుచేయువారికెల్లను

తెలియుచుండెను. రానురాను సంస్కృతము నెఱుగనివారు ఇప్పటికి నూటికిఁ దొంబది మంది కలరు. నూటికి డెబ్బదిమంది కర్మలయందాసక్తి కలవారే, వారికి అర్థమెట్లు తెలియనగును? సంస్కృత గ్రంథములు పాఠములు చెప్పినప్పుడు ప్రారంభ విద్యార్థులకు గురువులు స్వభాషలోనే అర్థము చెప్పుచున్నారుకదా! ఆ సంస్కృత భాష్యములలోని వేదార్థముకూడ దేశభాషలోనే చెప్పవలసియున్నది.

మఱియుఁ గర్మలాచరించితే వచ్చుఫలము ఆమంత్రార్థము నెఱింగినవానికిం గూడ వచ్చునని "యఉచైన దేవంవేద"= ఎవఁడు దీనినిట్లు తెలిసికొనునో అని శ్రుతియుఁగలదు. ఇది యిట్లుండ;

వేదము తెలిగించుట కవసరమేమివచ్చె? అని కొందఱు ప్రశ్నింతురు. ఇది వరకు మీఁదవివరించినదేయవసరమని ఉత్తరము కనఁబడుచున్నను ప్రత్యేకించి మరలఁ జెప్పుచున్నాను.

1. పలుజాతీయములయిన యితర భాషాగ్రంథములు తెలిగించుచున్నట్టే భారతీయుల మతమునకుఁ బ్రధానమయిన వేదమును దెలిగించుట ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధి కననగును

2. తెలుగునఁ బురాణేతిహాసములు చదువువారలకు ఆ కథలమూలములు కల వేదముల యర్థము నెఱుఁగుట అత్యవసరము.

3. ప్రాచీనదేశపరిస్థితి, అప్పటివారి యాచారములు వర్తనములు దెలిసినచో నాచారవర్తనముల పరివర్తనకాలమగు నిపుడు హేయోపాదేయములు గ్రహించుట సులభము.

4. ధర్మనిర్ణయగ్రంథముల ప్రామాణ్యనిర్ణయము. వివిధదేశాచార మతాచార సంఘర్షణకల యీ శతాబ్దమున స్వమత పరిజ్ఞాన సాకల్యము స్వమత క్షేమంకరము.

5. ఆంధ్రలోకమున జిజ్ఞాసయుఁగలదు. ఎట్లన- గతయేబది సంవత్సరముల నుండి ఆంధ్రులలో ముగ్గురు నలుగ్వురు వేదమునకు ఆంధ్రానువాద మారంభించి కొద్ది

లోనే విఘ్నితులైనట్లు వారిగ్రంథములు తెల్పుచున్నవి. గంజాంమండలవాసు లొకరు పద్యరూపమున ఋగ్వేదము తెనిఁగించిరి. అంతకుముందే శ్రీ బసవాచార్యులవారి యాంధ్రగ్రంథమున ననేక శ్రుతుల యర్థములు, వానిచర్చలును గలవు. ముఖ్యముగా వివిధమత సామరస్యమునకైన యేకేశ్వరారాధనమే యీ వేదమునఁ గలదు. కూలంకషముగాఁ జూడక కొందఱు వేదములలో అనేక దేవతలు చెప్పఁబడినవి అని అన్నారు కాని యీ ఋగ్వేద ప్రథమ మండలము నూటయరువదినాల్గవసూక్తమున నలువదియాఱవ మంత్రమున- "ఏకంసద్విప్రాబహుధావదంతి=" వరుణ మిత్ర, వాయు, ఇత్యాది దేవతలంజెప్పి ఒకేవస్తువును విప్రులు పలువిధములుగాఁ బలుకుచున్నారు అని యున్నది. ఇట్టివనేకములు కలవు.

6. ఇంకొకటిచెప్పి ముగింతును. భూతభవిష్యత్తులంగూడ గోచరించుకొన్న మంత్రద్రష్టల పలుకులలోనుండి దేశకాల పరిస్థితుల గమనించిన బుద్ధిమంతులు, సంస్కృతముగానివారు, ఆంధ్రవేదముచదివి క్రొత్తవిశేషములంగూడఁ గనిపెట్టఁ గలరు. కనుక యీయుద్యమము సాధిష్ఠము, సఫలము.

ఇట్లు,

బంకుపల్లె మల్లయ్యశాస్త్రి.

౨౧-౫-౮౦



ఋక్సామాథర్వ వేద అనువాదకర్తలు :

శ్రీ బంకుపల్లె మల్లయ్యశాస్త్రిగారు



యజుర్వేద అనువాద కర్తలు :

వ్యాకరణ శిరోమణి

శ్రీ రామపరపు కృష్ణమూర్తి శాస్త్రిగారు



ఋగ్వేద ప్రచురణకై తమతండ్రి బాపిరాజుగారి జ్ఞాపకార్థము

రు ౧౦౦౦/-లు అర్పించిన దాతలు

శ్రీ మంతెన సుబ్బరాజుగారు

మంతెనవారిపాలెం.



శుక్లయజుర్వేద ప్రచురణకై తమతల్లి శ్రీరాజా రాజ లక్ష్మయమ్మ బహదూరుగారి
జ్ఞాపకార్థము రు ౨౧౦౦/-లు అర్పించిన దాతలు
శ్రీరాజా మాణిక్యారావు వెంకట హయగ్రీవరావు బహద్దరు
జమీందారుగారు రాచూరు.



కృష్ణయజుర్వేద ప్రచురణకై శ్రీబాలకోటీశ్వరస్వామి ప్రీత్యర్థం రు॥౧౦౦/-లు

అర్పించిన దాతలు

శ్రీ ఆలపాటి దేవయ్య గారు,

గోవాడ.



సామవేదప్రచురణకై తమతల్లి లక్ష్మీదేవమ్మగారి జ్ఞాపకార్థమై రు ౨౫౦౦/-లు
అర్పించిన దాతలు

శ్రీ మద్ది వెంకట రంగయ్య గారు,

గుంటూరు.

ఓమ్.

# ఆంధ్ర వేదములు.

—:00:—

ప్రథమాష్టకము
ప్రథమాధ్యాయము } సూక్తము ౧ { ప్రథమమండలము
ప్రథమానువాకము

(ఋషి-విశ్వామిత్ర పుత్రుఁడగు మధుచ్ఛన్దసుఁడు; దేవత-అగ్ని
ఛందస్సు-గాయత్రి.)

ఋక్కు-౧. అగ్నిమీళే పురోహితం । యజ్ఞస్య దేవమృత్విజమ్

హోతారం రత్నధాతమమ్ ॥

పురోహితునివలె యజ్ఞమును నడిపించువాఁడును (దేవతలను) పిలుచుకొని వచ్చువాఁడును, ఋత్విజుడై (యజ్ఞమును సాధించువాఁడును) రత్నములను (యజ్ఞఫలములను) ధరించువాఁడునగు నగ్ని దేవుని స్తుతించుచున్నాను.

౨. అగ్నిః పూర్వేభి ఋషిభిరీడ్యో నూతనైరుత । స దేవాఁ ఏహవక్షతి ॥

అగ్ని పూర్వర్షులచేతను, మఱియునూతనర్షులచేతను స్తుతింపఁదగినవాఁడు. అతఁడు దేవతలను ఈ యజ్ఞమునొద్దకుఁ దీసికొని వచ్చుచున్నాడు.

౩. అగ్నినారయిమశ్నవ త్పోషమేవ దివేదివే । యశసం వీరవత్తమమ్ ॥

ఆయగ్నిచేతనే (యజమానుడు) ధనమును బొందుచున్నాఁడు. ప్రతిదినమును తప్పక పుష్టిని బొందుచున్నాఁడు. కీర్తిని, వీరులైన పుత్రభృత్యులను బొందుచున్నాఁడు.

౪. అగ్నేయం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి । స ఇద్దేవేషు గచ్ఛతి ॥

ఓయగ్నీ! ఏయజ్ఞమును నీవు అన్నివిధములను బాధలేనిదానిఁగాఁ బరిపాలించుచున్నావో ఆయజ్ఞమే దేవతలను జెందుచున్నది.

## ౨ వ సూక్తము.

(ఋషి-మధుచ్ఛందసుఁడు. దేవతలు ౧-౩ వాయువు ౪-౬ ఇంద్రవాయువులు. ౭-౯ మిత్రావరుణులు. ఛందస్సు-గాయిత్రి.)

౧౦. వాయవాయాహి దర్శతేమే సోమా అరంకృతాః । తేషాంపాహి శ్రుధీహవమ్॥

దం॥ దర్శనీయుఁడవయిన (సొగసయిన) ఓవాయువా! ఈయజ్ఞముదరికిరమ్ము. నీకొఱకీసోమములు అలంకరింపఁబడియున్నవి. వాటిని పానము చేయుము. మాపిలుపు వినుము.

౧౧. వాయ ఉక్థేభిర్జరంతే త్వామచ్ఛా జరితారః । సుతసోమా అహర్విదః ॥

దం॥ యజ్ఞమునెఱింగి స్తుతించు ఋత్విజులు సోమమును సిద్ధముచేసి చక్కగా ఋగ్వేదమంత్రములతో నిన్ను స్తుతించుచున్నారు.

౧౨. వాయోతవప్రపృంచతీ ధేనాజిగాతిదాశుషే । ఉరూచీసోమపీతయే ॥

దం॥ ఓవాయూ! యజమానులవద్దకుఁ బోవునదియు, సోమగుణమును వర్ణించునదియునగు నీవాక్కు సోమపానము కొఱకు (యజమానుని సమీపమునకు) బోవుచున్నది.

౧౩. ఇంద్రవాయూ ఇమేసుతా ఉపప్రయోభిరాగతమ్ । ఇందవో వాముశంతిహి ॥

దం॥ ఓయింద్రవాయువులారా! (మీకొఱకు) ఈసోమములను సిద్ధపఱచితిమి. (మాకు) వలసిన అన్నములతో మీరు మాసమీపమునకు రండు. సోమములు మీరాకను గోరుచున్నవి, (మీరు సోమములఁ ద్రావుమని తా॥)

౧౪, వాయవింద్రశ్చ చేతథః సుతానాంవాజినీవసూ । తావాయాతముపద్రవత్

దం॥ ఓవాయువా! ఇంద్రుఁడా! మీరిద్దఱును అన్నములతోఁ గూడినవారై సోమములు సిద్ధమయినవని గుర్తెఱుంగుఁడు. అట్టిమీరు శీఘ్రముగా మాసమీపమునకురండు

౧౫. వాయవింద్రశ్చసున్వత ఆయాతముపనిష్కృతమ్ । మక్ష్విత్థాధియానరా ॥

దం॥ వాయూ! ఇంద్రా! సోమముసంపాదించిన (యజమానుని) యొక్క సంస్కరించిపట్టి సోమమువద్దకురండు. పురుషరూపములతో మీరిద్దఱు వచ్చినంతలో ఈ కర్మచేత సంస్కారము శీఘ్రముగా సంపన్నమగును. (పూర్తియగునని తా॥) సత్యము.

౧౬. మిత్రంహువేపూతదక్షం వరుణంచరిశాదసమ్ । ధియం ఘృతాచీంసాధంతా॥

తా॥ పవిత్రమగు బలముకలవాఁడగు మిత్రుని, శత్రువులను హింసించునట్టివరుణుని, వర్షమునుగురిపించు పనిని సాధించువారిని నేనుబిలచుచున్నాను.

౧౭. ఋతేనమిత్రావరుణావృతా వృధావృతస్పృశా । క్రతుంబృహంతమాశాథే॥

తా॥ ఓమిత్రావరుణులారా! వర్షమును గురిపించువారును, ఉదకమును వహించియున్నవారునగు మీరిద్దఱును యజ్ఞఫలముతో (అనఁగా ఫలములనిచ్చుటకనితా॥) గొప్పదగు నీయజ్ఞమునకు రండు.

౧౮. కవీనోమిత్రావరుణాతువిజాతాఉరుక్షయా । దక్షందధాతేఅపసమ్ ॥

తా॥ మేధావంతులును, బహుమందికుపకారమొనర్పువారును, గొప్పనివాసములుకలవారును అగు మిత్రావరుణులు మాబలమును, కర్మనుబోషింతురుగాక!

3 వ సూక్తము.

(ఋషి-మధుచ్ఛన్దసుఁడు; ౧-3 అశ్వినీదేవతలు: ౪-౬. ఇంద్రుఁడు: ౭-౯ విశ్వేదేవతలు; ౧౦-౧౨ సరస్వతీదేవత; ఛందస్సు-గాయత్రి.)

౧౯. అశ్వినాయజ్వరీరిషోద్రవత్పాణీశుభస్పతీ । పురుభుజాచనస్యతమ్ ॥

తా॥ (హవిస్సులనందుకొనుటకు) తత్తరపడు చేతులుకలిగి శుభకర్మలను బరిపాలించువారును, విశాలమైన భుజములుకలవారునగు నోయశ్వినీదేవతలారా! అన్నములను గోరుదురుగాక!

౨౦. అశ్వినాపురుదంససానరాశవీరయాధియా । ధిష్ణ్యావనతంగిరః ॥

తా॥ బహుకర్మలుకలవారును, నాయకులును, బుద్ధిమంతులునగు అశ్వినీదేవతలిద్దఱును, అడ్డులేని యాదరబుద్ధితో మాచేయుస్తుతులను అంగీకరింతురుగాక.

౨౧. దస్రాయువాకవః సుతానాసత్యావృక్తబర్హిషః ॥ ఆయాతంరుద్రవర్తనీ ॥

తా॥ కోసితెచ్చిపరచిన బర్హిస్సులమీఁదనుంచి మీనిమిత్తముగా మేమభిషవించినసోమరసమును స్వీకరించుటకు సత్యవంతులును, వీరమార్గమవలంబించిన వారునగు నోయశ్వినులారా! ఈ మాయజ్ఞమునకు రండు.

౨౨. ఇంద్రాయాహిచిత్రభానోసుతాఇమేత్వాయవః ॥ అణ్వీభిస్తనాపూతాసః ॥

దం॥ ఓచిత్రమైనకాంతులుగల యింద్రా! నిత్యపవిత్రములును, ఆకారకై ఋత్విజుల వ్రేళ్లతో గిలకొట్టఁబడినవియు, నగుసోమరసములివిగో! ఇచటికిరమ్ము.

౨౩. ఇంద్రాయాహిధియేషితోవిప్రజూతస్సుతావతః । ఉపబ్రహ్మాణివాఘతః

దం॥ ఓయింద్రా! అభిషవించిన సోమములుగల ఋత్విజుఁడొనర్చు మంత్రరూపమగు స్తవములను బొందుటకు మాబుద్ధిచేతఁ బ్రేరేపింపఁబడి నవాడవై బ్రాహ్మణులచే స్తుతింపఁబడు వాడవునయి యిచటికిరమ్ము.

౨౪. ఇంద్రా యాహితూతుజాన ఉపబ్రహ్మాణిహరివః । సుతే దధిష్వనశ్చనః॥

దం॥ ఇంద్రా! హరియను అశ్వములతోఁగూడిన వాఁడవై త్వరగల్గిస్తుతులనందుకొనుటకు రమ్ము. యజ్ఞమందభిషవించిన సోమరూపమయిన యన్నమ్మును దీసికొమ్ము.

౨౫. ఓమాసశ్చర్షణీ ధృతోవిశ్వేదేవాస ఆగత । దాశ్వాంసో దాశుషస్సుతమ్॥

దం॥ రక్షకులును, మనుష్యులఁబోషించువారును, (యజ్ఞ)ఫలమునిచ్చువారును. అగునో యశ్వినులారా! హవిస్సులనిచ్చు యజమానుని సోమములను గూర్చిరండు.

౨౬. విశ్వేదేవాసో అప్తురః సుతమాగంత తూర్ణయః । ఉస్రాఇవస్వసరాణి॥

దం॥ సూర్యకిరణములు పగళ్లనుగూర్చి యెంతత్వరగావచ్చునో యంతత్వరతోవర్షమును గలిగించు విశ్వేదేవతలు (యజమానుని) సోమమునుగూర్చి వత్తురుగాక.

౨౭. విశ్వేదేవాసో అస్రిధఏహి మాయాసో అద్రుహః । మేధంజుషంత వహ్నయః॥

దం॥ క్షయరహితులును, సర్వవ్యాపకులును, ద్రోహములేనివారును, (ధనాదులను) వహించువారునగు విశ్వేదేవతలు హవిస్సులను బొందుదురుగాక.

౨౮. పావకానస్సరస్వతీ వాజేభిర్వాజినీవతీ । యజ్ఞంవష్టు ధియావసుః॥

దం॥ పవిత్రతనుగలిగించునట్టియు అన్నమును గర్మలను చేయించునదియు, ధనములకునిమిత్తమయినదియు, నగుసరస్వతి హవీరూపమయిన యన్నములతోఁగూడిన మాయజ్ఞమును గోరునుగాక.

౨౯. చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనామ్ । యజ్ఞం దధే సరస్వతీ ॥

దం॥ సత్యప్రియవాక్యములను గలిగించునదియు, శుభకర్మలనుజేయు బుద్ధిని గలిగించు నట్టిసరస్వతి యీయజ్ఞమును ధరించుచున్నది. (ఈరెండునునదీరూపసరస్వతీపక్షములుకావు.)

౩౦. మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా । ధియో విశ్వా విరాజతి ॥

దం॥ (ప్రవాహరూప) కర్మచేతగొప్ప నీటినిగలిగించునదియు, (కర్మలుసేయువారికి) సమస్తబుద్ధులను ప్రకాశింపఁజేయునదియు నగుచుసరస్వతి విరాజిల్లుచున్నది.

(ఇదినదీరూప సరస్వతివర్ణనము) (౧వ అనువాకములో ౩సూక్తములు.)

ఇట్లు ప్రథమమండలమున మొదటియనువాకము ॥ శ్రీ ॥

—: ౧ :—

అనువాకము. ౨.

సూక్తము. ౪.

(ఋషి-మధుచ్ఛన్దసుఁడు, దేవత-ఇంద్రుఁడు; ఛందస్సు-గాయత్రి)

౩౧. సురూపకృత్నుమూతయే సుదుఘామివ గోదుహే । జుహూమసి ద్యవిద్యవి ॥

దం॥ మంచిపాలిచ్చుగోవును బాలుపిదుకువానికు (పాలుదీయువాఁడు) పిలుచునట్లు మంచి రూపముగల కర్మలను జేయునట్టి యింద్రుని మారక్షణకొఱకు మేము ప్రతిదినమును బిలుచుచున్నాము.

౩౨. ఉపనస్సవనాగహి సోమస్యసోమపాఃపిబ । గోదాఇద్రేవతోమదః ॥

దం॥ సోమపానముచేయు నోయింద్రా! మాయజ్ఞములవద్దకురమ్ము సోమమును ద్రావుము, నీసంతోషము (మాకు) తప్పక గోవుల నిచ్చును.

౩౩. అథా తేఅంతమానాం విద్యామసుమతీనామ్। మానో అతిఖ్యఆగహి ॥

దం॥ సోమపానానన్తరము నీవద్దనున్న మంచి బుద్ధులను మేము తెలిసికొందుము. నీకు నీసమీపమందున్న పురుషులమధ్యను నిన్నుదెలిసికొందుము. నీవుమాకుఁదప్ప నితరులకుఁ దెలియఁబడకుము. మావద్దకేరమ్ము.

౩౪. పరేహివిగ్రమస్తృతమింద్రంపృచ్ఛావిపశ్చితమ్ । యస్తే సఖిభ్యఆవరమ్॥

ద౦॥ ఓయజమానుఁడా! (హోతపలుకుచున్నాడు) విద్వాంసుఁడును మేధావియు హింసారహితుఁడును అగు నింద్రునివద్దకుఁ బొమ్ము. పోయి యీమాహోత నిన్ను బక్కగా స్తుతించినాఁడా? లేదా? యని యడుగుము, అట్లడిగినచో నీస్నేహితులకు (మాకు) వరమును బూర్తిగానిచ్చును. (ధనపుత్రాదులఁ గలిగించునని తాత్ప).

౩౫. ఉతబ్రువంతునో నిదోనిరన్యతశ్చిదారత । దధానా ఇంద్ర ఇద్దువః॥

ద౦॥ ఇంద్రుని పరిచర్య చేయుచున్న మాఋత్విజులు ఇంద్రునిస్తుతింతురుగాక. మఱియు నిందించు పురుషులిచోటునుండియు, నితరస్థలమునుండియుఁ దొలంగుదురుగాక.

౩౬. ఉతనస్సుభగాఁ అరిర్వోచేయుర్దస్మ కృష్టయః । స్యామేదింద్రస్య శర్మణి.

ద౦॥ శత్రువులనణఁచునట్టి యోయింద్రా! శత్రువులుకూడ మమ్ములను (నీదయవల్ల) చక్కని ధనవంతులుగాఁ బలుకుదురుగాక. మామిత్రు (లికచెప్పనేల?) ఇంద్రుఁడిచ్చిన శుభసంపదతోనే మేముందుముగాక.

౩౭. ఏమాశుమాశవే భరయజ్ఞ శ్రియంనృమాదనమ్। పతయన్మందయత్సఖమ్॥

ద౦॥ ఓయజమానుఁడా! సవనత్రయమునందు వ్యాపించునదియు; యజ్ఞసంపద్రూపముయినదియు మనుష్యులకు హర్ష (మద)మును గలిగించునదియుఁ గర్మలలోఁ బనిచేయించునదియు నగు నీసోమమును ఇంద్రునికొఱకిమ్ము. ఆసోమము సఖులనుహర్షింపఁజేయును. (ఇంద్రునకు సోమమునకు సఖుఁడని తా॥).

౩౮. అస్యపీత్వా శతక్రతో ఘనోవృత్రాణామభవః । ప్రావోవాజేషు వాజినమ్॥

ద౦॥ ఇంద్రా! ఈ సోమములోని భాగము త్రాగి వృత్రులను (అసురులను) జంపు వాఁడవైతివి. యుద్ధముచేయుచున్న నీభక్తుని రణరంగమున రక్షింపుము.

౩౯. తంత్వావాజేషువాజినం వాజయామశ్శతక్రతో । ధనానామింద్రసాతయే॥

ద౦॥ ఓశతక్రతూ! (బహుకర్మలుచేయు నింద్రా!) ధనముల ప్రాప్తికొఱకు యుద్ధములలో బలవంతుఁడవగు ఆ నిన్ను హవిర్భాగములాహారముగాఁ గొనునట్లు చేయుచున్నాము. (హవిస్సులనిచ్చుచున్నామని తా.)

౪౬. త్వంసుతస్య పీతయే సద్యోవృద్ధో అజాయథాః। ఇంద్ర జ్యైష్ఠ్యాయసుక్రతో॥

వ॥ శుభమగు కర్మలను జేయునో యింద్రా! అభిషవించిన సోమమును పానము చేయుటకును దేవతలలో నుత్తమత్వము కొఱకును వెంటనే (సంతోషముతో) ఉబ్బినవాఁడవు కమ్ము.

౪౭. ఆత్వావిశంత్వాశవః సోమాస ఇంద్ర గిర్వణః। శంతేసంతు ప్రచేతసే॥

వ॥ స్తుతులకు సంతసించునో యింద్రా! (యజ్ఞమంతటను) వ్యాపించియున్న సోమములు అధిక జ్ఞానముగల నీకు సుఖములగుఁగాక.

౪౮. త్వాంస్తోమా అవీవృధన్ త్వాముక్థా శతక్రతో। త్వాంవర్ధంతు నో గిరః॥

వ॥ ఓ శతక్రతూ! (అధిక ప్రజ్ఞావంతుఁడని కాని బహు కర్మకారియని కాని యర్థము. ఇంద్రునికే చెల్లును) స్తోమములు (సామవేద స్తుతులు) నీకు హర్షము గలిగించెను. ఉక్థలు (ఋగ్వేదస్తుతులు) నిన్ను ఉప్పొంగించెను. కనుక మా స్తుతులు నిన్ను హర్షింపఁ జేయుఁగాక.

౪౯. అక్షితోతిః సనేదిమం వాజమింద్రః సహస్రిణమ్। యస్మిన్విశ్వాని పౌంస్యా॥

వ॥ ఏదానియందు సమస్త పౌరుషములు కలవో, యజ్ఞమందేది బహుసంఖ్యగాఁ బ్రవర్తించునో, యట్టి సోమరూపమగు నీ యన్నమును రక్షణ నెప్పుడును విడువని యింద్రుఁడు పొందుఁగాక.

౫౦. మానోమర్తా అభిద్రుహంతనూనామింద్రగిర్వణః। ఈశానోయవయావధమ్॥

వ॥ స్తుతులకు సంతసిల్లునో యింద్రా! శత్రువులు మా శరీరములకు ద్రోహము చేయకుందురుగాక. ఓ సమర్థుఁడా! (మారణము చేయు) వధను తొలఁగించుము.

—(౦)—

గూడుకొని నీవు గుహలో దాచఁబడిన గోవులను సంపాదించితివి. (పణులనువారు దేవతల యావులను గుహలో దాఁచినారట! ఇంద్రుఁడు మరుత్తుల సాయముతో పణుల జయించి గోవులందెచ్చెనట! కథ).

౫౬ దేవయంతో యథామతి మచ్ఛావిదద్వసుంగిరః । మహామనూషత శ్రుతమ్॥

దం॥ బుద్ధిమంతుఁడైన (ఇంద్రుని) స్తుతించునట్లు తమకు దేవతలభిముఖులుగాఁ గోరుచు స్తుతించు ఋత్విజులు ప్రసిద్ధమయిన ధనములు కలిగి విఖ్యాతులై ప్రౌఢు లయిన మరుద్గణములను తమదగ్గఱకు వచ్చుటకు స్తుతించిరి.

౫౭ ఇంద్రేణసంహి దృక్షసే సంజగ్మానో అబిభ్యుషా । మందూ సమానవర్చసా॥

దం॥ (ఓమరుద్గణమా!) భయరహితుఁడగు నింద్రునితోఁ గూడుకొని సమాన కాంతియు నిత్యసంతోషముగల మీ యిద్దఱును (ఇంద్రమరుత్తులని తా॥) ప్రత్యక్షు మగుదురుగాక.

౫౮ అనవద్యైరభిద్యుభిర్మఖస్సహస్వ దర్చతి । గణైరింద్రస్య కామ్యైః॥

దం॥ ఈ యజ్ఞము దోషరహితులైనట్టియు ద్యులోక (ఆకాశ) మందు వ్యాపించు నట్టియుఁ గోరఁదగినట్టి మరుద్గణములతోఁ గూడిన యింద్రుని బలవంతుఁడగునట్లు పూజించుచున్నది.

౫౯. అతఃపరిజ్మన్నాగహి దివోవారోచనాదధి । సమస్మిన్నృంజతే గిరః॥

దం॥ సర్వత్ర సంచరించునట్టి మరుద్గణమా! ఈ యజ్ఞకర్మయందు ఋత్విజుల స్తుతులు ప్రవర్తిల్లుచున్నవి కావున ద్యులోకమునుండియో సూర్యమండలము నుండియో దయసేయుఁడు. (ఎక్కడనుంటే అక్కడనుండియే రండని తా॥)

౬౦. ఇతోవాసాతి మీమహే దివోవాపార్థివాదధి । ఇంద్రంమహోవార జసః॥

దం॥ ఈ కనఁబడుచున్న భూలోకమునుండికాని ఆద్యులోకమునుండికాని మహారజో లోకము (అంతరిక్షము ధూళిపక్షులు ఎగిరేలోకమని తా॥) నుండికాని వచ్చు నింద్రునిధనమిమ్మని కోరుచున్నాము.

—:-0-:—

## సూక్తము ౭.

(ఋషి-మధుచ్ఛన్దసుఁడు; దేవత-ఇంద్రుఁడు; ఛందస్సు-గాయత్రి.)

౬౧. ఇంద్రమిద్గాథినో బృహదింద్ర మర్కేభిరర్కిణః ॥ ఇంద్రం వాణీ రనూషత॥

ద॥ గాయకులగు ఉద్గాతలు బృహన్నామ సామమంత్రములతోను హోతలు ఋగ్వేద మంత్రములతోను తదితరులు (అధ్వర్యులు) యజుర్వేద మంత్రములతోను ఇంద్రునిస్తుతించిరి.

౬౨. ఇంద్ర ఇద్ధర్యోః సచా సంమిశ్ల ఆవచో యుజా। ఇంద్రో వజ్రీ హిరణ్యయః॥

ద॥ వజ్రముకలవాఁడును, బంగారముతో నిండిన కాంతి గలవాఁడును, అయి యింద్రుఁడున్నాఁడు. ఇంద్రుఁడే హరులను నేర్పుగల గుఱ్ఱములను రెంటిని తనమాటతో తనరథమునకు పూన్చువాఁడు. (హరులకు వచనమాత్రమున నియోగమునకుఁ బరము లేదని తా॥)

౬౩. ఇంద్రో దీర్ఘాయ చక్షస ఆసూర్యం రోహయద్దివి । వి గోభి రద్రిమైరయత్ ॥

ద॥ ఈ యింద్రుఁడు ఎడతెగని దర్శనముకొఱకు సూర్యుని ద్యులోకమున నెక్కించెను. కిరణములతో పర్వతాది సర్వవస్తువులను ప్రకాశింపఁజేసెను.

ద॥ ఇంకొకయర్థము- అద్రి=మేఘము, పర్వతము, గోవులు, కిరణము. సూర్యుఁడు మేఘములను ప్రేరేపించును అని చివరి వాక్యమునకర్థము చెప్పవచ్చును. (ఈయర్థము సాయణ భాష్యములో వ్రాసినదే.)

౬౪. ఇంద్రవాజేషు నోఽవ సహస్రప్రధనేషుచ । ఉగ్ర ఉగ్రాభిరూతిభిః॥

ద॥ ఓ యింద్రా! నీవుగ్రుఁడవై ఉగ్రమయిన సంరక్షణలతో సామాన్య యుద్ధములందును గొప్పయుద్ధములందును, మమ్ములను గాపాడుము. (రక్షింపదగిన యాయుధముల కే రక్షణలని సర్వత్ర వాడుక.)

౬౫. ఇంద్రంవయం మహాధన ఇంద్ర మర్భే హవామహే ।
యుజం వృత్రేషు వజ్రిణమ్॥

ద॥ అల్పధనము కొఱకును మహాధనము కొఱకునుగూడ యుద్ధములందు వజ్రముధరించి సాహాయ్యమొనరించు నింద్రుని బిలుచుచున్నాము.

౧౬. సనోవృషన్నముం చరుం సత్రాదావన్నపావృధి । అస్మభ్యమప్రతిష్కుతః॥

దం॥ **మా** యభీష్టములనిచ్చునట్టి వర్షముఁగురిపించునట్టి యో (యింద్రా!) మాకై యీ మేఘమును ప్రతిధ్వనింపకుండ బ్రద్దలుకొట్టుము. లేక తెరువుము. (చరు=మేఘము).

౧౭. తుంజే తుంజే యఉత్తరే స్తోమా ఇంద్రస్యవజ్రిణః । నవింధే అస్యసుష్టుతిమ్॥

దం॥ ఇతర దేవతల విషయమై యేయే స్తవము లుత్తమములో అవి వజ్రధరుఁడయిన యింద్రునకుఁ దగిన స్తుతులు కానేరవు. (అతిశయగుణవంతుఁ డింద్రుఁడని తా.)

౧౮. వృషాయూథేవ వంసగః కృష్టీరియర్త్యోజసా । ఈశానో అప్రతిష్కుతః॥

దం॥ ముచ్చటగానడచు వృషభము ఆలమందకుఁ జేసునట్లు సమర్థుఁడును, కాదనని వాఁడును అగు నింద్రుఁడు [కోర్కెలను] వర్షింపఁగోరి తనబలముతో మనుష్యులనుజేసును. (ఇచట వర్షించుట యనునది వృషభపక్షమున రేతస్సేకమునకుఁగూడ నర్థమిచ్చును).

౧౯. యఏకశ్చర్షణీనాం వసూనా మిరజ్యతి । ఇంద్రః పంచక్షితీనామ్॥

దం॥ ఏయింద్రుఁడు ఒక్కఁడే మనుష్యులకు ధనములకు అధికారియో, అతఁడు అయిదు వర్ణములవారికిని ఈశుఁడు. (బ్రహ్మ-క్షత్ర-వైశ్య-శూద్ర-నిషాద).

౨౦. ఇంద్రంవో విశ్వతస్పరి హవామహే జనేభ్యః । అస్మాకమస్తు కేవలః॥

దం॥ ఓ ఋత్విజులారా! జనులందఱికి దరిని దిరుగునట్టి యింద్రుని మీ కొఱకు పిలుచుచున్నాము. అతఁడు మనకే చెందుగాక.

ఇట్లు ప్రథమమండలమున ద్వితీయానువాకము, శ్రీ శ్రీ శ్రీ

—:o:—

అనువాకము 3.

సూక్తము, ౮.

(ఋషి-మధుచ్ఛన్దసుఁడు; దేవత-ఇంద్రుఁడు; ఛందస్సు-గాయత్రి.)

౨౧. ఏంద్రసానసిం రయిం సజిత్వానం సదాసహమ్ । వర్షిష్ఠమూతయేభర॥

దం॥ ఓ యింద్రా! సంపాదించఁదగినది, సమాన శత్రువులను జయించునది, ఎల్లపుడు (శత్రువుల) నోడించునది యగు నెక్కుడు ధనమును మా రక్షణకొఱకు దీసికొనిరమ్ము.

౨౨. ని యేన ముష్టిహత్యయా ని వృత్రారుణధామహై । త్వోతాసో న్యర్వతా॥

దం॥ నీచే రక్షితులమగు మేము ఏధనముతో (సంపాదించిన భటులు) పిడికిళ్ల పోట్లతోను, అశ్వములతోను శత్రువులను నిరోధించుచున్నామో (ఆధనమును మాకిమ్ము అని పూర్వాన్వయము.)

23. ఇంద్ర త్వోతాస ఆవయం వజ్రం ఘనాదదీమహి । జయేమ సంయుధి స్పృధః॥

దం॥ ఓ యింద్రా! నీచే రక్షితులమగు మేము ఘనమైన వజ్రమును దీసికొనుచున్నాము. (ఆవజ్రముతో) యుద్ధములందు శత్రువులను జయింతుము.

౨౪. వయం శూరేభిరస్తృభిరింద్ర త్వయా యుజా వయమ్ ।
సాసహ్యామ పృతన్యతః॥

దం॥ శూరులై ఆయుధహస్తులయిన భటులతోను నీతోను గూడినవారమై ఓ యింద్రా! సేనలతోఁగూడిన శత్రువులను మేమోడింతుము.

౨౫. మహాఁ ఇంద్రః పరశ్చను మహిత్వమస్తు వజ్రిణే । ద్యౌర్న ప్రథినా శవః॥

దం॥ ఇంద్రుఁడు గొప్పశరీరము గొప్పగుణములు కలవాఁడు, అయినను వజ్రము ధరించిన యింద్రునకు అవి (శరీరము, గుణము) అధికములగుఁగాక, ద్యులోక మెంత విస్తారమో అంతగా బలము విస్తరించుఁగాక.

౭౬. సమ్హోహేవాయఆశత నరస్తోకస్యసనితౌ । విప్రాసోవాధియాయవః॥

దం– ఏనరులు (ఇంద్రుని స్తుతించి) యుద్ధములందు (సాయమును) సంతానమును గోరుచున్నారో (వారువాటిని బొందుదురు) బుద్ధినిగోరు విప్రులును ప్రార్థింతురు.

౭౭. యఃకుక్షిస్సోమపాతమః సముద్రఇవపిన్వతే । ఉర్వీరాపోనకాకుదః॥

దం॥ (ఇంద్రుని) యేకడుపు సోమపానముచేసి సముద్రునివలె పొంగినదో యది బహూదకములతో నాలుకను బోలి (ఎల్లపుడును) చెమర్చుచునే యుండును.

౭౮. ఏవాహ్యస్య సూనృతా విరప్శీగోమతీమహీ । పక్వాశాఖానదాశుషే॥

దం॥ యుద్ధములలో హెచ్చరించునదియు, గోవులనిచ్చునదియు, గొప్పదియు సత్యప్రియమైనదియునగు నా యింద్రుని వాక్కు యజమానునకు బండ్లతో నిండిన కొమ్మవంటిదగుంగదా!

౭౯. ఏవాహితే విభూతయ ఊతయ ఇంద్రమావతే । సద్యశ్చిత్సంతి దాశుషే॥

దం॥ ఓ యింద్రుడా! నీయైశ్వర్యసంపదలు ఈలాంటివికదా! నావలె (హవిస్సులనిచ్చు) యజమానులకు రక్షణలు వెంటనే (కర్మకాలమందని తా॥) కలిగించునవియైయున్నవి.

౮౦. ఏవాహ్యస్య కామ్యాస్తోమ ఉక్థంచశంస్యా । ఇంద్రాయ సోమపీతయే॥

దం॥ ఈ యింద్రుని స్తుతించునట్టి ఉక్థలు (ఋగ్వేదమంత్రములు) స్తోమములు (సామమంత్రములు) అను రెండును ఇంద్రుని సోమపానముకొఱకు ఋత్విక్కులు కోరదగినవై యున్నవి.

—:-౦-:—

సూక్తము. ౯.

(ఋషి.-మధుచ్ఛన్దసుఁడు; దేవత-ఇంద్రుఁడు; ఛందస్సు-గాయత్రి.)

౮౧. ఇంద్రేహిమత్స్యంధసో విశ్వేభిస్సోమపర్వభిః । మహాఁ అభిష్టిరోజసా॥

దం॥ ఇంద్రుడా! రమ్ము. సోమరసముతోఁగూడిన సకలాన్నములచేతను మదించుము. (తరువాత) బలముచే గొప్పవాఁడవయి శత్రువులనోడించుము.

౯౨. ఏమేనం సృజతాసుతే మందిమింద్రాయ మందినే। చక్రింవిశ్వాని చక్రయే॥

దం॥ ఓ యధ్వర్యుఋత్విజులారా! ఈయభిషవించి చమస (పాత్ర)లలోఁ బోసినట్టి, మదమునుగలిగించి సమస్తకర్మలను జేయుచునట్టి సోమమును మదించి సర్వకర్మలను జేయునట్టి యింద్రునకు ఇంకొకమాఱుఇండు (పాత్రలతో రసమెత్తి మాటి మాటికింజూపుదురు. ఆపాత్రలపేరు-చమసలు.)

౯౩. మత్స్వా సుశిప్రమందిభిః స్తోమేభిర్విశ్వచర్షణే। సచైషుసవనేష్వా॥

దం॥ చక్కనిదవుడలుగల ఓ యింద్రా! హర్షమును గలిగించు స్తోమములతో మదించుము. సకలజనులచేఁ బూజనీయుఁడవగు నింద్రా! యితరదేవతలతో నీమాయజ్ఞమునకు దయచేయుము.

౯౪. అసృగ్రమింద్ర తేగిరః ప్రతిత్వాముదహాసత। అజోషా వృషభంపతిమ్॥

దం॥ ఓ యింద్రుఁడా! నీస్తుతులను నేను సృజించితిని. ఆస్తుతులు (స్వర్గకామందున్నట్టి) కోర్కుల వర్షించునట్టి రక్షకుండవైనట్టి నిన్ను గూర్చి వచ్చినవి. నీవు వాటిని గ్రహించితివి.

౯౫. సంచోదయ చిత్రమర్వాగ్రాధ ఇంద్రవరేణ్యమ్। అసదిత్తే విభుప్రభు॥

దం॥ ఇంద్రుఁడా! నానారూపమగు ధనమును (మాకు) బంపుము. శ్రేష్ఠమై విభువు, ప్రభువును అంతటి కధికమునగు ధనము నీకేకలదు.

౯౬. అస్మాన్సు తత్రచోదయేంద్ర రాయే రభస్వతః। తువిద్యుమ్న యశస్వతః॥

దం॥ అధికధనముగల యో యింద్రా! ధనము కొఱకు ఆకర్మలోఁ బ్రయత్నవంతులము కీర్తిమంతులము నగునట్లు చక్కఁగా మమ్ముఁ బ్రేరింపుము.

౯౭. సంగోమదింద్ర వాజవదస్మే పృథు శ్రవోబృహత్। విశ్వాయుర్ధేహ్యక్షితమ్॥

దం॥ అధికధనముగల యింద్రా! గోవులు కలదియు అన్నముకలదియు అపరిమితమును అధికగుణవంతమును సంపూర్ణాయుష్కరమును నాశరహితము నగు ధనమును (మాకు) గలిగింపుము.

౧౮. అస్మే ధేహి శ్రవో బృహద్ద్యుమ్నం సహస్రసాతమమ్ । ఇంద్ర తా రథినీరిషః॥

టీ॥ ఓ యింద్రా! గొప్ప కీర్తిని వేలకొలంది ధనమును బండ్లతో అన్నమును (ధాన్యమని తా॥) మాకుంగలిగించుము.

౧౯. వసోరింద్రం వసుపతిం గీర్భిర్గృణంత ఋగ్మియమ్ ।
హోమ గంతార మూతయే॥

టీ॥ ధనపాలకుండును, ఋక్కులను దెలిసినవాండును, యజ్ఞమునకుం బోవు వాండును అగు నింద్రుని మా ధనముల రక్షణకై స్తవములతో స్తుతించుచుం బిలుచు చున్నాము.

౨౦. సుతే సుతే న్యోకసే బృహద్బృహత ఏదరిః । ఇంద్రాయ శూషమర్చతి॥

టీ॥ యజమానులందఱును నియతస్థానమందు బలవంతుండై యున్న యింద్రునికై అభిషవించిన ప్రతి సోమమందును గల గొప్పబలమును స్తుతింతురు.

—:-౦-:—

సూ క్త ము. ౧౦.

(ఋషి-మధుచ్ఛందసుండు, దేవత-ఇంద్రుండు, ఛందస్సు-అనుష్టుప్పు.)

౨౧. గాయంతి త్వా గాయత్రిణో ఽర్చంత్యర్కమర్కిణః ।
బ్రహ్మాణస్త్వా శతక్రత ఉద్వంశమివ యేమిరే॥

టీ॥ బహుకార్యములొనర్చు నింద్రుండా! ఉద్గాతలు (సామమంత్రపాఠకులు) నిన్ను బాడుదురు. పూజకులు పూజనీయుండవగు నిన్ను బూజింతురు. (స్తుతియే పూజయని తా॥) బ్రహ్మ (ఋత్విజులలో నొకండు) మొదలగువారు వెదురంతటి పొడవుగా నిన్నుం బొగడుదురు. (వెదురెంతపొడవుండునో యంత ఉన్నతస్థానమున నుంతురని తా॥)

౯౨. యత్సానోస్సాను మారుహ ద్భూర్యస్పష్టకర్త్వమ్ ।
తదింద్రో అర్థంచేతతియూథేన వృష్ణి రేజతి॥

దం॥ ఒక కొండచఱియనుండి యింకొక చఱియకు నెపుడుపోవునో (సమిధలు—సోమలత తెచ్చుటకని తా॥) అట్లే యెపుడు విస్తారమయిన (సోమయాగ) కర్మను ప్రారంభించునో యప్పుడే యింద్రుడు ప్రయోజనమును దెలిసికొనును. తనచోటి నుండి మరుద్గణములతో (కోర్కెలు) వర్షించుటకు బయలు దేరును.

౯౩. యుక్ష్వాహి కేశినాహరీ వృషణాకక్ష్యప్రా ।
అథాన ఇంద్ర సోమపాగిరాము- పశ్రుతించర।

దం॥ సోమపానముచేసిన ఓయింద్రా! మూపున వెండ్రుకలుకలిగి నడుమున పట్టాలున్నవై వర్షించు స్వభావముగల హరియను పేరుగల నీరెండు గుఱ్ఱములను రథమునకుంబూన్చి మా స్తోత్రములు వినుటకు నడువుము. (రమ్ము.)

౯౪. ఏహిస్తోమాఁ అభిస్వరా భిగృణీహ్యారువ ।
బ్రహ్మచనో వసోసచేంద్ర యజ్ఞంచవర్ధయ॥

దం॥ నివాసమునకుఁ గారణభూతుఁడవయిన ఓ యింద్రా! మాచేయు స్తవములను మెచ్చుకొనుము. పొగడుము. సెబాసని పలుకుము. అన్నముతో మాయజ్ఞమును వృద్ధినొందింపుము.

౯౫. ఉక్థమింద్రాయశంస్యం వర్ధనంపురునిష్షిధే ।
శక్రోయథాసుతేషుణో రారణత్సఖ్యేషుచ॥

దం॥ ఎట్లు ఇంద్రుఁడు స్నేహితులను పుత్రులను మాకుఁ గలుగునట్లు మెచ్చుకొనునో అట్లు శత్రుసంహారకుఁడగు నింద్రుని సంతోషముకొఱకు ఉక్థను (శస్త్ర మంత్రము) చెప్పి స్తుతింపవలెను.

౯౬. తమిత్సఖిత్వ ఈమహేతంరాయే తంసువీర్యే ।

సశక్ర ఉతన శ్శకదింద్రో వసుదయమానః॥

ద॥ స్నేహము కావలసినపుడా యింద్రునే యాశ్రయింతుము. ధనము కావలసినపుడును పరాక్రమింపవలసినపుడు నతనినే యాశ్రయింతుము. మఱియు నాశక్రుండు మాకు ధనమునిచ్చుచు రక్షించును.

౯౭. సువివృతం సునిరజ మింద్రత్వాదాత మిద్యశః ।

గవామపవ్రజం వృధీకృణుష్వ రాధో అద్రివః॥

ద॥ పర్వతములభేదించు నో యింద్రా! బాగుగాఁ దెరువఁబడినదిగాను బూర్ణమయినదిగాను నీచేత శోధింపఁబడినదిగాను దొరకునట్లుగాను అన్నము నుచేయుము. తరువాత ఆలమందను (మాకొఱకు) తెరువుము. ధనమును గలిగింపుము.

౯౮. నహిత్వా రోదసీఉభే ఋఘాయమాణ మిన్వతః ।

జేషస్స్వర్వతీరపః సంగాఅస్మభ్యం ధూనుహి॥

ద॥ ఓ యింద్రా! శత్రువుల జయించుచున్న నిన్ను భూమ్యాకాశములు రెండును భరింపఁజాలవు. అట్టినీవు స్వర్గలోకమందున్న యుదకమును బ్రేరేపించుము. మాకొఱకు గోవులను బ్రసాదింపుము.

౯౯. ఆశ్రుత్కర్ణ శ్రుధీహవం నూచిద్దధిష్వ మేగిరః ।

ఇంద్ర స్తోమమిమం మమ కృష్వాయుజశ్చిదంతరమ్॥

ద॥ అంతటను జెవులుగల ఓ యింద్రా! మాపిలుపును వెంటనే వినుము. (మాగీతియొక్క) స్తుతులను గూడ మనసున కెక్కించుకొనుము. నీ స్నేహితుల మాటలనుగూడ సూరముగానుంచి యీ నాస్తుతులను ఆదరింపుము.

౧౦౦. విద్మాహిత్వా వృషంతమం వాజేషు హవనశ్రుతమ్ ।
వృషంతమస్య హూమహ ఊతింసహస్రసాతమామ్॥

ద॥ ఇంద్రా! ఉత్తమముగా వర్షించువాడవనియు యుద్ధములలో మాపిలుపులను వినువాడవనియు నిన్ను మేమెఱుంగుదుము. ఉత్తమముగా వర్షించుచు వేలకొలందిగా నిచ్చు రక్షణములనుగోరి నిన్ను పిలచుచున్నాము.

౧౦౧. ఆతూన ఇంద్రకౌశిక మందసానస్సుతంపిబ ।
నవ్యమాయుః ప్రసూతిర కృధీ సహస్రసామృషిమ్॥

ద॥ ఓ యింద్రా! శీఘ్రముగా మావద్దకురమ్ము. కుశికపుత్రుండా! హర్షముగలిగి అభిషవించిన (సోమలతను చిదుకగొట్టి పిండిన) సోమరసమును ద్రావుము. మెచ్చుకొనదగిన ఆయువును పూర్తిగానిమ్ము. నన్ను వేలకొలంది లాభముగల ఋషిని (ఇంద్రియములకు గోచరముగాని విషయములనుగూడ దెలియువానిని) చేయుము. (కుశికుడు తానో యింద్రునివంటికొడుకు కావలెనని బ్రహ్మచర్య వ్రతము జేయుచుండగా నింద్రుడంశమున నతనిభార్య గాధియనుదుండు బుత్రుడుపుట్టెను. దానంజేసి యింద్రుడు కౌశికుడయ్యె).

౧౦౨. పరిత్వాగిర్వణోగిర ఇమాభవంతు విశ్వతః ।
వృద్ధాయుమను వృద్ధయో జుష్టాభవంతు జుష్టయః॥

ద॥ ఈ స్తుతులకుం బాత్రుండవయిన యో యింద్రా! మా స్తుతులంతటను నీచుట్టుం బ్రసరించుగాక. అధికాయుర్దాయముగల నిన్ను సరించి వృద్ధినొందుచున్నట్టియు నీచే సేవింపబడుచున్నట్టియు స్తుతులు మాయందు సంప్రీతిగలుగుటకు హేతువులగుంగాక.

## సూక్తము ౧౧.

(ఋషి-మధుచ్ఛన్దసుఁడుఅను వానికొడుకు జేతయనువాఁడు; దేవత-ఇంద్రుఁడు; ఛందస్సు-అనుష్టుప్.)

౧౦౩. ఇంద్రం విశ్వాఅవీవృధన్త్సముద్రవ్యచసం గిరః ।

రథీతమంరథీనాం వాజానాం సత్పతిం పతిమ్॥

దం॥ సముద్రమువలె వ్యాప్తుఁడయినవాఁడు రథికులలో నుత్తమరథికుఁడు అన్నములకు నీశ్వరుడు సత్పురుషులకుఁ బాలకుండు నగు నింద్రుని (మా) స్తుతులన్నియు వృద్ధిపొందించినవి.

౧౦౪. సఖ్యేత ఇంద్ర వాజినో మాభేమ శవసస్పతే ।

త్వామభిప్రణోనుమో జేతారమ పరాజితమ్॥

దం॥ బలమును బరిపాలించు నింద్రుడా! నీసఖ్యమందుఁ బ్రవర్తించిన మేము అన్నవంతులమై (శత్రువులవల్ల) భయపడము. (కనుక) యుద్ధములందు జయశీలుఁడవును పరాజయము లేనివాఁడవును అగునిన్ను అంతటను హెచ్చుగా స్తుతింతుము.

౧౦౫. పూర్వీరింద్రస్య రాతయో నవిదస్యం త్యూతయః ।

యదీ వాజస్యగోమతః స్తోతృభ్యో మంహతే మఘమ్॥

దం॥ ఇంద్రునియొక్క దానములు అనాదిసిద్ధములు. (పూర్వ యజమానులకు ధనాదులు చాలగానిచ్చెనని తా.) ఇట్లు కాఁగా (ఇప్పటి యజమానులుకూడ) ఋత్విజులకు గోవులతోఁగూడిన యన్నమునకు (సరిపడినంత) ధనమును (దక్షిణగా) ఇచ్చినట్లయితే (మనకు ధనాదుల నిచ్చునట్టి) యింద్రుని రక్షణలు కొంతయుం గొఱఁతపడవు.

౧౦౬. పురాంభిందుర్యువా కవిరమితౌజా అజాయత ।

ఇంద్రోవిశ్వస్య కర్మణో ధర్తావజ్రీ పురుష్టుతః॥

దం॥ ఇంద్రుఁడు అసురుల పట్టణములను భేదించువాఁడు, చిన్నవయసువాఁడు, మేధావంతుఁడు, అధిక బలవంతుఁడు, సర్వకర్మలను పోషించువాఁడు, వజ్రమును ధరించువాఁడు, బహువిధముల స్తుతింపఁబడినవాఁడునయి యున్నాఁడు.

౧౦౭. త్వంవలస్య గోమతోఽపావరద్రివో బిలమ్ ।
త్వాం దేవా అబిభ్యుష స్తుజ్యమానాస ఆవిషుః॥

దం॥ వజ్రముధరించిన యింద్రా! గోవులతోఁగూడిన బలాసురుని బిలమును (గుహ) తెరచితివి. అపుడు శత్రువులచే హింసింపఁబడిన దేవతలు నిర్భయులై నిన్నుఁ జేరిరి (దేవతల గోవులను గుహాలో బలాసురుడు దాచితే యింద్రుఁడు విడిపించెనట.)

౧౦౮. తవాహంశూర రాతిభిః ప్రత్యాయం సింధుమావదన్ ।
ఉపాతిష్ఠన్త గిర్వణో విదుష్టే తస్య కారవః॥

దం॥ శూరుఁడవగు నో యింద్రా! (ఇదివఱకుఁ జేసిన) నీదానముల చేత సోమరసమును వర్ణించుచు నీవద్దకువచ్చితిని. స్తుతిప్రియుఁడవగు నో యింద్రా! (ఋత్విగ్యజమానులు) నిన్ను (బూర్వము) సమీపించిరి. (అని హోత పలుకుచున్నాఁడు.)

౧౦౯, మాయాభిరింద్రమాయినం త్వంశుష్ణమవాతిరః ।
విదుష్టే తస్యమేధిరాస్తేషాం శ్రవాంస్యుత్తిర॥

దం॥ ఇంద్రా! మాయావంతుఁడయిన శుష్ణాసురుని మాయలతో హింసించితివి. నీ యాపనిని మేధావంతు లెఱుఁగుదురు. వారి యన్నములను వృద్ధిపఱచుము.

౧౧౦. ఇంద్రమీశానమోజ సాభిస్తోమా అనూషత ।
సహస్రం యస్యరాతయ ఉతవాసంతిభూయసీః॥

దం॥ బలముచేత నీశుఁడయిన యింద్రుని ఋత్విజులు సర్వత్రా స్తుతించిరి ఏ యింద్రుని (వర) దానములు వేలకొలఁది, అంతకధికమును, గలవో.

ఇట్లు ప్రథమమండలమున తృతీయానువాకము శ్రీ శ్రీ శ్రీ

—:00:—

## అ ను వా క ము. ౪.

### సూ క్తము. ౧౨.

(ఋషి-కణ్వ పుత్రుఁడగు మేధాతిథి; దేవత-అగ్ని; ఛందస్సు-గాయత్రి.)

౧౧౧. అగ్నిందూతంవృణీమహేహోతారం విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥

దం॥ (దేవతలనుబిలుచు) దూతయును సర్వధనములు గలవాఁడును జరుగుచున్న యీ యజ్ఞకర్మను జక్కఁగా నడిపించువాఁడును అగు నగ్నిని సేవించుచున్నాము.

౧౧౨. అగ్నిమగ్నింహవీమభి స్సదా హవంతవిశ్పతిమ్। హవ్యవాహం పురుప్రియమ్॥

దం॥ ప్రజలను పాలించువాఁడును, యజమానుఁడిచ్చిన హవిస్సును (హోమద్రవ్యము) దేవతలకుఁ గొనిపోవువాఁడును, బహుమందికిఁ బ్రియుఁడగువాఁడును, అగు ప్రతియగ్నిని ఆహ్వాన మంత్రములతోఁ బిలుచుచున్నారు.

౧౧౩ అగ్నే దేవాఁ ఇహావహ జజ్ఞానోవృక్తబర్హిషే। అసిహోతాన ఈడ్యః॥

దం॥ ఓ యగ్నీ! (అరణులనుండి) పుట్టిననీవు దర్భలుపరుచుకొని కూర్చుండిన (యజమానునికొఱకు) ఈ కర్మయందు దేవతలను బిలచుకొనిరమ్ము. నీవు మాకు మెచ్చఁదగిన హోతవయి యున్నావు.

౧౧౪. తాఁ ఉశతో విబోధయ యదగ్నేయాసిదూత్యమ్। దేవైరాసత్సి బర్హిషి।

దం॥ ఏకారణముచేత నో యగ్నీ! నీవు దూత్యమునవలంబించితివో ఆకారణముచేత హవిస్సులఁగోరుచున్న (దేవతలకు) చెప్పి వారితో నీకర్మయందుఁ గూరుచుండుము.

౧౧౫. ఘృతాహవన దీదివః ప్రతిష్మరి షతోదహ। అగ్నేత్వం రక్షస్వినః॥

దం॥ నేతితోఁబిలువఁబడి దీపించు నో యగ్నీ! నీవు రాక్షసులతోఁగూడిన హింసకులను దహింపుము.

౧౧౬. అగ్నినాగ్నిస్సమిధ్యతే కవిర్గృహపతిర్యువా।
హవ్యవాడ్ జుహ్వాస్యః॥

దం॥ అగ్నిచేత నగ్ని చక్కగామండును. (ఆహవనీయమను నగ్నిలో మధించితీసిన నిర్మంథ్య-అను నగ్నిని జేర్తురు.) ఆయాహావనీయాగ్ని మేధావియు గృహమును బాలించువాఁడును నిత్యయౌవనుఁడును హవిస్సును మోసికొనిపోవువాఁడును జుహూముఖుఁడును అయియున్నాఁడు. (జుహువు=హోమద్రవ్యము నగ్నిలోఁబోయుటకు సాధనము. గరిటెవలెనున్న కఱ్ఱవస్తువు).

౧౧౭. కవిమగ్ని ముపస్తుహి సత్యధర్మాణమధ్వరే। దేవమమీవ చాతనమ్॥

దం॥ ఓ స్తుతిపాఠకులారా! కవియు సత్యధర్ముఁడు వెలుఁగుచున్నవాఁడు రోగములను నశింపఁజేయువాఁడు నగు నగ్నిని యజ్ఞమునందు స్తుతింపుఁడు.

౧౧౮. యస్త్వామగ్నే హవిష్పతి ర్దూతం దేవసపర్యతి। తస్యస్మ ప్రావితాభవ॥

దం॥ ఓ యగ్నిదేవా! ఏ యజమానుఁడు నిన్ను దేవదూతగా సేవించునో ఆతని రక్షించువాఁడవుకమ్ము.

౧౧౯. యోఅగ్నిం దేవవీతయే హవిష్మాఆవివాసతి। తస్మైపావక మృళయ॥

దం॥ దేవతలు హవిస్సును భక్షించుటకు నే యజమానుఁడు సమీపమునుండి యగ్నిని సేవించునో యా యజమానుని ఓ పావకుఁడా! సుఖింపఁజేయుము. (అగ్నిలో హోమముచేసినదే హవిస్సనఁబడును.)

౧౨౦. సనఃపావకదీదివోఽగ్నే దేవాఇహావహ। ఉపయజ్ఞం హవిశ్చనః॥

దం॥ మండుచున్న యగ్నీ! శుద్ధినిగలిగించువాఁడా! ఈ కర్మస్థలమునకు దేవతలను దీసికొనిరమ్ము. మేమిచ్చిన హవిస్సును యజ్ఞమును దేవతలకడకు (తీసుకొని) దీసికొనిపొమ్ము.

౧౨౧. సనః స్తవాన ఆభరగాయత్రేణ నవీయసా । రయింవీరవతీమిషమ్॥

టీ॥ ఓ యగ్నీ! క్రొత్తది గాయత్రీ ఛందస్సుగలది యగు నీ సూక్తముతో స్తుతింపఁబడినవాఁడవై మాకు ధనమును శూరులుగల యన్నమును (కొడుకులు మనుమలునని తా.) సంపాదింపుము.

౧౨౨. అగ్నే శుక్రేణ శోచిషా విశ్వాభి ర్దేవ హూతిభిః । ఇమం స్తోమం జుషస్వనః॥

టీ॥ ఓ యగ్నీ! నీ తెల్లనికాంతితోను దేవతలంబిలచు స్తుతులతోను గూడి నీవు మా యీ స్తోత్రమును సేవింపుము.

—;o;—

## సూక్తము. ౧౩.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి; దేవత - ప్రతి ఋక్కునందుఁ జెప్పఁబడు నాయాదేవతలు; ఛందస్సు - గాయత్రి.)

౧౨౩. సుసమిద్ధో న ఆవహ దేవాఁ అగ్నే హవిష్మతే । హోతః పావక యక్షిచ॥

టీ॥ ఓ సమిద్ధ (=మండిన) నామకాగ్నీ! దేవతలను మా యజమానుని యెదుటికిఁ దీసికొనిరమ్ము. శుద్ధినిగలిగించువాఁడా! హోమమును జరిపించువాఁడా! నీవు యాగమును గావింపుము.

౧౨౪. మధుమంతం తనూనపా ద్యజ్ఞం దేవేషు నఃకవే । అద్యా కృణుహి వీతయే॥

టీ॥ ఓ కవీ! తనూనపాన్నామముగలయగ్నీ! ఈనాఁడు మా రసవంతమైన హవిస్సును దేవతలు భక్షించుటకుఁ బట్టుకొనిపొమ్ము.

౧౨౫. నరాశంస మిహ ప్రియ మస్మిన్యజ్ఞ ఉపహ్వయే । మధుజిహ్వం హవిష్కృతమ్

టీ॥ (దేవతలకుఁ) బ్రియుఁడును, మధురజిహ్వగలవాఁడును, హవిస్సును గలిగించువాఁడును అగు-నరాశంస-యను పేరుగల యగ్నిని నేను బిలుచుచున్నాను.

౧౨౬. అగ్నే సుఖతమే రథే దేవాఁ ఈళిత ఆవహ । అసి హోతా మనుర్హితః॥

దం॥ ఇట్టను పేరుగలయగ్నీ! (ఇడగ్ని) మాచే స్తుతింపఁబడి అతిసుఖమయిన రథము మీఁద దేవతలను దీసికొనిరమ్ము. మంత్రములతో స్థాపింపఁబడిన దేవతలను బిలుచువాఁడవయి యున్నావు. (మనుష్యులచే స్థాపింపఁబడిన యనియు నర్థము.)

౧౨౭. స్తృణీత బర్హిరానుషగ్ఘృతపృష్ఠం మనీషిణః । యత్రామృతస్య చక్షణమ్॥

దం॥ ఓ తెలివిగల (ఋత్విజులారా!) వేటిమీఁద నుంచిన నేయి చక్కఁగాఁ గనఁబడునో యట్టి దర్భలను ఒకదాని నొకటి యంటునట్లుగా నేతికుండలక్రిందఁ బరువుఁడు.

౧౨౮. విశ్రయంతామృతావృధో ద్వారో దేవీరసశ్చతః।అద్యానూనంచ యష్టవే॥

దం॥ యజ్ఞమును లేక సత్యమును వృద్ధిపఱచునట్టి, ప్రకాశించునట్టి, సమ్మర్దము లేనట్టి యజ్ఞశాలాద్వారములను ఈనాడును, ఇంకొకనాడును అవశ్యము యాగము చేయుటకై తెరతురుగాక.

౧౨౯. నక్తోషాసా సుపేశసాస్మిన్యజ్ఞ ఉపహ్వయే। ఇదంనో బర్హిరాసదే ॥

దం॥ (నక్త=రాత్రి. ఉషస్=ఉదయకాలము అయినను ఇచట నగ్నినామములుగా వాడఁబడెను.) మంచిరూపములుగల నక్తోషసాగ్నులను ఈ యజ్ఞమందు మా (వేదిపైనున్న) దర్భను సమీపించుటకుఁ బిలచుచున్నాను.

౧౩౦. తా సుజిహ్వా ఉపహ్వయే హోతారా దైవ్యా కవీ ।
యజ్ఞంనో యక్షతామిమమ్॥

దం॥ శోభనజిహ్వాలు కలిగి హోమముఁ బ్రవర్తింపఁజేయువారును, దేవతల సంబంధము కలవారును మేధాశాలురును, అగు ఆ రెండగ్నులును, మా యజ్ఞము జరుపుదురుగాక.

౧౩౧. ఇళా సరస్వతీ మహీ తిస్రో దేవీ ర్మయోభువః । బర్హిః సీదం త్వస్రిధః॥

దం॥ ఇళ, సరస్వతి, మహీ, యను ముప్వురు దేవతలు సుఖమునిచ్చువారై, నాశరహితలై దర్భలమీఁదఁ గూరుచుండురుగాక. (ఈ మూఁడును అగ్నిమూర్తులే యని గ్రహింపవలె.)

౧౩౨. ఇహ త్వష్టార మగ్రియం విశ్వరూప ముపహ్వయే । అస్మాక మస్తు కేవలః॥

దం॥ శ్రేష్ఠుఁడును బహురూపములు గలవాఁడును అగు త్వష్టయను నగ్నిని యిచటికిఁ బిలుచుచున్నాను. మావద్దనే యుండుఁగాక !

౧౩౩. అవసృజా వనస్పతే దేవ దేవేభ్యో హవిః । ప్రదాతు రస్తు చేతనమ్॥

దం॥ వనస్పతియను పేరుగల యో యగ్నీ ! దేవా ! హవిస్సును దేవతలకు సమర్పింపుము. యజమానునకు విజ్ఞానము (పరలోకజ్ఞానము కలుగునుగాక !)

౧౩౪. స్వాహా యజ్ఞం కృణోత నేంద్రాయ యజ్వనో గృహే । తత్ర దేవాఁ ఉపహ్వయే॥

దం॥ ఓ యాజకులారా ! యాగకర్త గృహమందు స్వాహానామకాగ్నికల యాగమును ఇంద్రునికొఱకు సమర్పింపుడు. ఆ యజ్ఞమునకు దేవతలను బిలుచుచున్నాను.

—(౦)—

సూ క్త ము ౧౪.

(ఋషి - కణ్వపుత్రుఁడు, మేధాతిథి; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి.)

౧౩౫. ఏభి రగ్నే దువో గిరో విశ్వేభి స్సోమ పీతయే । దేవేభి ర్యాహి యక్షి చ॥

దం॥ ఓ యగ్నీ ! యీ యజ్ఞమునకు దేవతలందఱితోను నాపరిచర్యను, స్తోత్రలను గూర్చిరమ్ము. యజ్ఞము గావింపుము.

౧౩౬. ఆ త్వా కణ్వా అహూషత గృణంతి విప్ర తే ధియః । దేవేభి రగ్న ఆ గహి॥

దం॥ ఓ మేధావంతుఁడా ! అగ్నీ ! మేధావంతులగు (యాజకులు) నిన్నుఁ బిలుచుచున్నారు. నీవుచేయు కార్యములను జెప్పుచున్నారు. దేవతలతోఁ గలిసిరమ్ము.

౧౩౭. ఇంద్ర వాయూ బృహస్పతిం మిత్రాగ్నిం పూషణం భగమ్ ।
ఆదిత్యా న్మారుతం గణమ్॥

దం॥ ఓ యగ్నీ! ఇంద్రవాయువులను, బృహస్పతిని, మిత్రుని, అగ్నిని, పూష దేవుని, భగుని, ఆదిత్యులను, మరుద్గణమును, యజించుము. (ఆవాహనచేసి వీరిని బూజించుము.)

౧౩౮. ప్రవో భ్రియంత ఇందవో మత్సరా మాదయిష్ణవః ।
ద్రప్సా మధ్వ శ్చమూషదః॥

దం॥ (ఓ యింద్రాది దేవతలారా!) మీకొఱకుఁ దృప్తికరమైనవి, హర్షమును గలిగించునవి, (=మాదయిష్ణు) బిందువుల రూపముగా నున్నవి, మధురమయినవి, పాత్రలలోఁ బోయఁబడినవి యగు సోమరసములు సంపాదింపఁబడుచున్నవి.

౧౩౯. ఈళతే త్వా మవస్యవః కణ్వాసో వృక్తబర్హిషః । హవిష్మంతో అరంకృతః॥

దం॥ అగ్నీ! రక్షణమునుగోరి మేధావంతులయి, దర్భలను పరిచినవారై, హవిస్సులను గూర్చుకొని అలంకరించి (ఋత్విజులు) నిన్ను స్తుతించుచున్నారు.

౧౪౦. ఘృతపృష్ఠా మనోయుజో యేత్వా వహంతి వహ్నయః
ఆదేవాన్ సోమపీతయే॥

దం॥ అగ్నీ! నేతిరంగు వీపులుగల్గి, తలఁచినంతలో రథము నెత్తుకొనునట్టి, మోయునట్టి, నిన్ను మోయుచున్న గుఱ్ఱములతో దేవతలను సోమపానము కొఱకుఁ దీసికొనిరమ్ము.

౧౪౧. తాన్యజత్రాఁ ఋతావృధోఽగ్నే పత్నీవత స్కృధి । మధ్వః సుజిహ్వ పాయయ

దం॥ చక్కని నాలుకలుగల యోయగ్నీ! పూజనీయులగు దేవతలను యజ్ఞమును వృద్ధిపఱచునట్టివారిగాను భార్యలతోఁ గూడుకొనునట్టివారినిగాను జేయుము. మధురమగు సోమమును ద్రావించుము.

౧౪౨. యే యజత్రా య ఈడ్యా స్తే తే పిబంతు జిహ్వయా । మధో రగ్నే వషట్కృతి॥

దం॥ ఏ దేవతలు యజింపఁదగియున్నారో ఎవరు స్తుతింప నర్హులో, వారందఱును "వషట్" అని పలికినకాలమందు నీజిహ్వతో మధురమగు సోమమును ద్రావుదురు గాక.

౧౪౩. ఆకీం సూర్యస్య రోచనా ద్విశ్వా న్దేవాఁ ఉషర్బుధః ।
విప్రో హోతేహ వక్షతి॥

దం॥ మేధావియై హోమముగలిగించు నగ్ని తెల్లవాఱఁగానే మేల్కొనియున్న దేవతలను అందఱిని సూర్యలోకమునుండి యీచోటికిఁ దెచ్చును.

౧౪౪. విశ్వేభి స్సోమ్యం మధ్వగ్న ఇంద్రేణ వాయునా । పిబా మిత్రస్య ధామభిః॥

దం॥ అగ్నీ! సర్వదేవతలతోను, ఇంద్రునితోను, వాయువుతోను, మిత్రుని (=సూర్యుని) కిరణములతోను సోమరసమందలి మాధుర్యమును ద్రావుము.

౧౪౫. త్వంహోతా మను ర్హితోఽగ్నే యజ్ఞేషు సీదసి । సేమంనో అధ్వరం యజ॥

దం॥ అగ్నీ! నీవు మంత్రములతో, లేక మనుష్యులచే. స్థాపింపఁబడి యజ్ఞము లందుఁ గూర్చుందువు. ఆ నీవు మా యజ్ఞమును గావింపుము.

౧౪౬. యుక్ష్వా హ్యరుషీ రథే హరితో దేవరోహితః । తాభి ర్దేవాఁ ఇహా వహ॥

దం॥ ఓ అగ్నిదేవా! రోహితములనే పేరుగలవి, వేగముగా నడచునవి, రథము మీఁద నున్నవారిం దీసికొనిపోవునవియగు నీ వేసడములను నీరథమునకుఁ బూన్పుము వాటితో దేవతల నిచటికిఁ దీసికొనిరమ్ము.

—:-o-:—

## సూక్తము. ౧౫.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి; ఛందస్సు - గాయత్రి; దేవతలు - ఋతువులు; అయినను ప్రతి ఋక్కునందును వేఱ్వేఱుగ నింద్రాదిదేవతలు ప్రతిపాదింపఁబడుదురు.)

౧౪౭. ఇంద్ర సోమం పిబ ఋతునా త్వావిశంత్విందవః । మత్సరాస స్తదోకసః ॥

దం॥ ఓ యింద్రా! ఋతు (దేవత)తోఁగూడ సోమరసము త్రాగుము. తృప్తిని గలిగించునట్టి, ఆ ఋతువునందుండునట్టి సోమములు నిన్నుఁ జెందుఁగాక.

౧౪౮. మరుతః పిబత ఋతునా పోత్రా ద్యజ్ఞం పునీతన ।
యూయం హిష్ఠా సుదానవః॥

దం॥ మంచిదాతలగు ఓమరుత్తులారా! పోతయను పేరుగల యాజకునిపాత్రలో ఋతు (దేవత) తోఁ గలిసి మీరు సోమపానము చేయుఁడు. యజ్ఞమును బవిత్రము సేయుఁడు. ఏమంటే మీరు పవిత్రులు అయి యున్నారు కనుక.

౧౪౯. అభి యజ్ఞం గృణీహినో గ్నావో నేష్టః పిబ ఋతునా । త్వంహి రత్నధా అసి॥

దం॥ భార్యతోఁగూడిన ఓ త్వష్టా! మాయజ్ఞమును స్తుతింపుము. ఋతువుతోఁ గలిసి సోమము త్రాగుము. ఏమంటే-నీవు రత్నముల నిచ్చువాఁడవయి యున్నావు కనుక.

౧౫౦. అగ్నే దేవా ఇహా వహ సాదయా యోనిషు త్రిషు । పరిభూష పిబ ఋతునా॥

దం॥ ఓ యగ్నీ! దేవతల నిచటికిఁ దీసికొనిరా! మూఁడుయోనులందుఁ (ప్రాతస్సవన-మాధ్యందిన సవన-సాయంసవనములని ఆయాకాలములందుఁ జేయుకర్మలకు పేరు, యోని= స్థానము) (వారిని) కూర్చుండఁ బెట్టుము. అలంకరింపుము. ఋతుదేవతతోఁ గలిసి సోమముం ద్రావుము.

౧౫౧. బ్రాహ్మణా దింద్ర రాధసః పిబా సోమ మృతూఁరను । తవేద్ధి సఖ్య మస్తృతమ్॥

దం॥ ఓ యింద్రా! బ్రాహ్మణాచ్ఛంసియను యాజకుని ధనరూపమయిన పాత్రతో ఋతు దేవతలు పానముచేసిన తరువాత నీవుకూడ సోమమును ద్రావుము. ఏమంటే నీస్నేహమే ఋతువులతో నెడఁదెగనిదై యున్నది.

౧౫౨. యువం దక్షం ధృతవ్రత మిత్రావరుణ దూళభమ్ ।
ఋతునా యజ్ఞ మాశాథే॥

వం॥ వ్రతమును ధరించిన మిత్రావరుణులారా! (అనగాఁ గర్మలుచేయుచున్నారని తా॥) మీరిద్దఱును ఋతువుతోఁ గలిసి శత్రువులు హింసింపలేని గొప్పదగు మా యజ్ఞమునందు సంచరింపుడు.

౧౫౩. ద్రవిణోదా ద్రవిణసో గ్రావహస్తాసో అధ్వరే । యజ్ఞేషు దేవ మీళతే॥

వం॥ ధనమును గోరుచున్నవారును చేతిలోరాతిని ధరించిన వారును అగు ఋత్విజులు ధనదాతయగు నగ్నిదేవుని యజ్ఞములలో స్తుతింతురు. (రాతితో సోమ లతను జిదుకఁగొట్టి రసము పిండుదురు.)

౧౫౪. ద్రవిణోదా దదాతునో వసూని యాని శృణ్విరే । దేవేషు తావనామహే॥

వం॥ ఏధనములు దేవతలందుగలవని విన్నామో ఆధనములు (హోమసాధన వస్తువులని తా.) ధనదాతలగు దేవతలు మాకిత్తురుగాక. ఆధనములను దేవతల నిమిత్తమే మేము కోరుచున్నాము.

౧౫౫. ద్రవిణోదాః పిపీషతి జుహోత ప్రచతిష్ఠత । నేష్ట్రా దృతుభి రిష్యత॥

వం॥ ధనమునిచ్చు దేవత(అగ్నియే) ఋతువులతోఁగూడ నేష్టయను యాజకుని పాత్రతో సోమము త్రాగగోరును. కనుక యాజకులారా! (హోమస్థలమునకు) జేరుఁడు. (చేరి) హోమముచేయుఁడు. (చేసి) నడువుఁడు. (ఇంకొకచోటికని తా.)

౧౫౬. యత్వా తురీయ మృతుభి ర్ద్రవిణోదో యజామహే । అధస్మానో దదిర్భవ॥

వం॥ ద్రవ్యదాతవగు నో యగ్నీ! ఋతువులతో నాల్గవవాఁడవైన (మూఁడే ఋతువులని తా,) నిన్ను ఏకారణముచేత యజించుచున్నామో ఆ కారణముచేత నీవు ధనమిచ్చువాఁడవుకమ్ము,

౧౫౭. అశ్వినా పిబతం మధు దీద్యగ్నీ శుచివ్రతా। ఋతునా యజ్ఞవాహసా॥

దం॥ మండుచున్న అగ్నులతోఁగూడినవారును పవిత్రకర్మలు కలవారును అగు నశ్వినీ దేవతలారా! యజ్ఞము నిర్వహించు ఋతు దేవతతోఁ గలిసి తియ్యని సోమమును పానముసేయుఁడు.

౧౫౮. గార్హపత్యేన సంత్య ఋతునా యజ్ఞనీరసి। దేవాన్దేవయతే యజ॥

దం॥ ఫలప్రదాతవగు నోయగ్నీ! గార్హపత్య రూపముననుండి ఋతు దేవతతోఁ గూడ యజ్ఞమును నిర్వహించువాఁడవగుచున్నవు. కనుక కోర్కెలతో నున్న (యజమానుని) కొఱకు దేవతలను యజింపుము. (దక్షిణాగ్ని-గార్హపత్యము-ఆహవనీయము-అని అగ్నులు మూఁడు.)

—:-o-:—

సూక్తము. ౧౬.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - గాయత్రి.)

౧౫౯. ఆ త్వా వహంతు హరయో వృషణం సోమపీతయే। ఇంద్ర త్వా సూరచక్షసః॥

దం॥ ఓ యింద్రా! వర్షించునిన్ను హరులు (గుఱ్ఱములపేర్లు) నిన్ను మోసి తెచ్చుఁ గాక! సూర్య సమానకాంతిగల నిన్ను (ఋత్విజులు మంత్రములతోఁ) బ్రకాశింపఁ జేతురుగాక.

౧౬౦. ఇమా ధానా ఘృతస్నువో హరీ ఇహోప వక్షతః। ఇంద్రం సుఖతమే రథే॥

దం॥ హరియను పేరుగల యింద్రుని రెండుగుఱ్ఱములు నేతినిగారుచున్న ఈ (వేదిపైనున్న) పేలాలను గూర్చి సుఖతమమయిన రథమందింద్రుని నీచోటికి మోసి కొని వచ్చుఁగాక.

౧౬౧. ఇంద్రం ప్రాతర్హవామహ ఇంద్రం ప్రయత్యధ్వరే। ఇంద్రం సోమస్య పీతయే॥

దం॥ ప్రాతఃకాలమందింద్రునిఁ బిలుచుచున్నాము. (ఇది ప్రాతస్సవనము) అధ్వరము జరుగుచుండఁగా (మాధ్యందిన సవనమందు సోమయాగము జరుగు

నపుడని తా॥) ఇంద్రునింబిలుచుచున్నాము. సోమపానమున కింద్రునిం బిలుచు చున్నాము. (సోమపానము సాయంసవనమందు).

౧౬-౨. ఉపనః సుత మాగహి హరిభి రింద్ర కేశిభిః । సుతే హి త్వా హవామహే॥

ద॥ ఓ యింద్రా! ।మూపునందు బొచ్చుగల గుఱ్ఱములతో నీవు అభిషవించిన మా సోమసమీపమునకు రమ్ము. అభిషవించిన సోమమునిమిత్తమే సుమా! నిన్నుఁ బిలుచుచున్నాము.

౧౬-౩. సేమంనః స్తోమ మాగ హ్యుపేదం సవనం సుతమ్ । గౌరోన తృషితః పిబ॥

ద॥ ఇంద్రా! ఆ నీవు ఈ మా స్తుతినిగూర్చిరమ్ము. ఏమంటే- దేవయజనసమీప మందు సోమము నభిషవించియుంచి యీ చేయుకర్మ (ప్రాతస్సవనాది) జరుగు చున్నది. కనుక దప్పిగొన్న గోవువలెను ఈ సోమమును ద్రావుము.

౧౬-౪. ఇమే సోమాస ఇందవ స్సుతాసో అధిబర్హిషి । తా ఇంద్ర సహసే పిబ॥

ద॥ ఇంద్రా! రసవంతమయిన సోమములివిగో దర్భలమీఁద నభిషవించి యున్నవి! వాటిని బలముకొఱకుఁ ద్రావుము.

౧౬-౫. అయం తే స్తోమో అగ్రియో హృది స్పృగస్తు శంతమః ।

అథా సోమం సుతం పిబ॥

ద॥ ఈ స్తవము శ్రేష్ఠమయినది, నీమనస్సున కెక్కునది, అతి సుఖమయినది, అగుఁ గాక! తరువాత (స్తవానన్తరమని తా॥) అభిషవించిన సోమమును ద్రావుము.

౧౬-౬. విశ్వ మిత్సవనం సుత మింద్రో మదాయగచ్ఛతి । వృత్రహా సోమపీతయే॥

ద॥ శత్రునాశకుఁడగు నింద్రుఁడు అభిషవించిన సోమముగల (ప్రాతస్సవనాది) సవనములన్నిటిని గూర్చి మదము కొఱకు సోమపానము చేయఁబోవుచున్నాడు.

౧౬౭. సేమంనః కామ మాపృణ గోభిర శ్వైః శతక్రతో । స్తవామ త్వా స్వాధ్యః॥

వం॥ ఓ శతక్రతూ! (ఇంద్రుఁడు) ఆయీమాకోరికను గోవులతోను అశ్వములతోను బూరించుము. సరియైన ధ్యానముతో నిన్ను స్తుతించుచున్నాము.

—:-౦-:—

## సూక్తము. ౧౭.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి ; దేవత - ఇంద్రావరుణులు ; ఛందస్సు - గాయత్రి.)

౧౬౮. ఇంద్రావరుణయో రహంసం రాజో రవ ఆవృణే। తానో మృళాత ఈదృశే॥

వం॥ నేను (యాగకర్త) మంచి రాజ్యముగల యింద్రావరుణులను రక్షను గోరుచున్నాను. ఈలాంటివిషయమునవారు మమ్ము సుఖింపఁ జేతురు.

౧౬౯, గంతారా హి స్థోఽవసే హవం విప్రస్య మావతః । ధర్తారా చర్షణీనామ్॥

వం॥ ఇంద్రవరుణులారా! (యాగకర్తను) రక్షింపఁగోరి మావంటి యాజకులు పిలుచు పిలుపులను గూర్చి వచ్చెడు స్వభావముగల మీరు మనుష్యుల యోగక్షేమములను సంపాదింతురుగదా!

౧౭౦, అనుకామం తర్పయేథా మింద్రావరుణ రాయఆ । తావాం నేదిష్ఠ మీమహే॥

వం। ఇంద్రవరుణులారా! కోర్కె ననుసరించి ధనము తృప్తిగానిండు. ఆ మిమ్మును దగ్గఱకు రమ్మని కోరుచున్నాము.

౧౭౧, యువాకుహి శచీనాం యువాకు సుమతీనామ్ । భూయామ వాజదావ్నామ్॥

వం॥ ఏమంటే-కర్మల సంబంధమైన సోమరూప హవిస్సుల మొత్తమును, మంచి బుద్ధులుకల యాజకుల స్తుతుల మొత్తమును, (ఇచట) గలవు. (మీరుకటాక్షించితే) మేముధనదాతలలో (పేరుపొందినవారము) అగుదుముగాక.

౧౭ ౨. ఇంద్రః సహస్రదావ్నాం వరుణః శంస్యానామ్ । క్రతుర్భవ త్యుక్థ్యః॥

దం॥ వేలకొలందిని నిచ్చువారిలో నింద్రుండు పనివాండు. (శ్రేష్ఠుండని తా॥) స్తుతింపం దగినవారిలో వరుణుండు స్తుతింపందగినవాడు.

౧౭౩. తయోరి దవసా వయం సనేమ నిచధీమహి । స్యాదుత ప్రరేచనమ్॥

దం॥ ఆ యింద్ర వరుణుల యొక్క రక్షణచేతనే మేము (ధనము) పొందుదుము. అది (=తినగా మిగిలి దాంచుకొన్నది) మిక్కిలి వృద్ధిపొందునుగాక.

౧౩౪. ఇంద్రా వరుణ వామహం హువే చిత్రాయ రాధసే ।

అస్మాన్త్సు జిగ్యుష స్కృతమ్॥

దం॥ ఇంద్రావరుణులారా! నానావిధములయిన ధనములకొఱకు మీయిద్దఱిని బిలుచుచున్నాను. అంతటను మమ్ము జయశీలురం జేయుండు.

౧౭౫. ఇంద్రా వరుణ నూనువాం సిషాసంతీషు ధీష్వా । అస్మభ్యం శర్మ యచ్ఛతమ్॥

దం॥ ఇంద్రావరుణులారా! మాబుద్ధులు మిమ్ము సేవింప నిశ్చయించుచుండంగా సన్నిచోట్ల సుఖమును మాకు నిండు.

౧౭౬. ప్రవా మశ్నోతు సుష్టుతి రింద్రా వరుణ యాంహువే ।

యామృధాథే సథ స్తుతిమ్॥

దం॥ ఇంద్రవరుణులారా! ఏస్తుతి మంత్రముతోం బిలుచుచున్నానో, దేనిసివిని మీరుపొంగుచున్నారో, ఏది మీయిద్దఱకును జోడుగా స్తుతియయ్యెనో, ఆ మంచి స్తుతి మీ యిద్దఱిని జెందుంగాక.

ఇట్లు ప్రథమ మండలమునం జతుర్థానువాకము. శ్రీ శ్రీ శ్రీ

———:00:———

## అనువాకము. ౫.

### సూక్తము ౧౮.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి; దేవత - ౧ - ౫ బ్రహ్మణస్పతి, ౬ - ౯ సదసస్పతి; ఛన్దస్సు - గాయత్రి.)

౧౭౭. సోమానం స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే । కక్షీవంతం య ఔశిజః ॥

దం॥ ఓ బ్రహ్మణస్పతీ! (దేవతాసవమున) సోమమును అభిషవించుచున్న నన్ను ఉశిజ పుత్రుఁడైన కక్షీవంతునివలె దేవతలలో ప్రసిద్ధుఁడగునట్లు చేయుము.

౧౭౮. యో రేవాన్యో అమీవహా వసువిత్పుష్టివర్ధనః । స నః సిషక్తు యస్తురః ॥

దం॥ ఏ బ్రహ్మణస్పతి ధనవంతుఁడో, ఎవఁడు రోగముల హరించునో, ఎవఁడు ధనముల నొసఁగునో, ఎవఁడు పుష్టిని వృద్ధినొందించునో, ఎవఁడు త్వరగలవాఁడో యతఁడు మమ్మనుగ్రహించుఁగాక.

౧౭౯. మా నః శంసో అరరుషో ధూర్తిః ప్రణఙ్మర్త్యస్య । రక్షా ణో బ్రహ్మణస్పతే ॥

దం॥ హింసించుటకు వచ్చిన మనుష్యుని పరుషవాక్యము (తిట్టు) మాకుఁ దగులకుండునట్లు బ్రహ్మణస్పతీ! మమ్ము రక్షింపుము.

౧౮౦. స ఘా వీరో న రిష్యతి యమింద్రో బ్రహ్మణస్పతిః । సోమో హినోతి మర్త్యమ్ ॥

దం॥ బ్రహ్మణస్పతియు నింద్రుఁడును ఎవనిని (యజమానుని) వృద్ధినొందింతురో, సోముఁడెవనిని వృద్ధినొందించునో, ఆతఁడే వీరుఁడై నశింపఁడు.

౧౮౧. త్వంతం బ్రహ్మణస్పతే సోమ ఇంద్రశ్చ మర్త్యమ్ । దక్షిణా పాత్వంహసః ॥

దం॥ బ్రహ్మణస్పతీ! నీవును, ఇంద్రుఁడును, సోముఁడును, దక్షిణాదేవతయును, ఆమనుష్యుని పాపమునుండి రక్షింపుఁడు.

౧౮.౨. సదస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యమ్ ॥ సనిం మేధా మయాసిషమ్

ద౦॥ ఆశ్చర్యకరుఁడును, ఇంద్రునకుఁ బ్రియుఁ డును, అందమైనవాఁడును, ధన దాతయునగు సదసస్పతిని మేధ (బుద్ధి) కొఱకు పొందితిని- (సేవించితినని తా॥ సదస్=సభకు, పతి, అగ్ని కేయీ పేరు.)

౧౮౩. యస్మా దృతే నసిధ్యతి యజ్ఞో విపశ్చి తశ్చన । సధీనాం యోగ మిన్వతి॥

ద౦॥ ఎవనిని వినాగా యజ్ఞము విద్వాంసునకు (యజమానుఁడు) గూడ సిద్ధింపదో యాతఁడు (సదసస్పతి) మాబుద్ధుల సంబంధమును బొందియున్నాఁడు.

౧౮ ౪. ఆదృధ్నోతి హవిష్కృతిం ప్రాంచం కృణో త్యధ్వరమ్

హోత్రా దేవేషు గచ్ఛతి॥

ద౦॥ ఆ తరువాతనే (హవిర్దానానన్తరమని తా॥) హవిస్సును సంపాదించిన యజమానుని వృద్ధిచేయును- (సదసస్పతి కర్త) యజ్ఞమును నిర్విఘ్నముగా సమాప్తి నొందించును. స్తోత్రముకూడ దేవతలవఱకుఁ బోవును.

౧౮౫. నరాశంసం సుధృష్టమ మపశ్యం సప్రథ స్తమమ్ । దివో న సద్మమఖసమ్॥

ద౦॥ మిక్కిలి ధార్ష్ట్యముగలవాఁడు, (ధార్ష్ట్యము=పెంకితనము) అతిప్రసిద్ధుఁడు, దేవ లోకమువలె మిక్కిలి తేజస్సుకలవాఁడు, నరులచేఁ బొగడువడువాఁడునగు సదసస్పతిని నేను జూచితిని (శాస్త్రదృష్టితోనని తా॥)

—:-o-:—

## సూ క్త ము. ౧౯.

(ఋ షి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి ; దేవత - అగ్నివాయువులు ; ఛన్దస్సు - గాయత్రి.)

౧౯౧. ప్రతిత్యం చారు మధ్వరం గోపీథాయ ప్రహూయసే । మరుద్భిరగ్న ఆగహి॥

ద౦॥ అగ్నీ ! ప్రీతికరమై ప్రసిద్ధమయిన యజ్ఞమునందు సోమపానము సేయుటకు నీవు పిలువఁబడుచున్నావు. కనుక మరుత్తులతోఁగూడి రమ్ము.

౧౮౭. నహి దేవో నమర్త్యో మహా స్తవక్రతుం పరః । మరుద్భిరగ్న ఆగహి॥

దం॥ నీసంబంధముగల క్రతువును మించిన దేవుఁడుగాని మానవుఁడుగాని లేఁడు. కనుక మరుత్తులతోఁ గలిసిరమ్ము.

౧౮౮. యేమహో రజసో విదు ర్విశ్వేదేవాసో అద్రుహః । మరుద్భిరగ్న ఆగహి॥

దం॥ అగ్నీ ! ఎవరు ఉదకవర్షణ ప్రకారము నెఱుఁగుదురో, ఎవరు ప్రకాశవంతులై ద్రోహము నెవ్వరికిం జేయరో, ఆ గొప్ప మరుత్తులతోఁ (ఏకోనపంచాశన్మరుత్తులని) గలిసి రమ్ము.

౧౮౯. యఉగ్రా అర్క మానృచు రనాధృష్టాస ఓజసా । మరుద్భిరగ్న ఆగహి॥

దం॥ తీవ్రమయిన యే మరుత్తులు ఉదకమును సంపాదించిరో, ఎవరు బలముచేత నితరులకు లొంగరో, అట్టి మరుత్తులతోఁగూడి రమ్ము.

౧౯౦. యేశుభ్రా ఘోరవర్పసః సుక్షత్రాసో రిశాదసః । మరుద్భిరగ్న ఆగహి॥

దం॥ ఎవరు శోభనులును, ఉగ్రరూపులును, మంచిధనముగలవారును, హింసకులను (శత్రువులని తా॥) దినువారును, అయియున్నారో, అట్టి మరుత్తులతోఁ గలిసి యో యగ్నీ ! రమ్ము.

౧౯౧. యేనాకస్యాధి రోచనే దివి దేవాస ఆసతే । మరుద్భిరగ్న ఆగహి।

దం॥ ఎవరు నాకలోకము మీఁది ప్రకాశముగల ద్యులోకమందు ఉన్నారో, ఆ మరుద్దేవతలతోఁ గలిసి యగ్నీ ! రమ్ము.

౧౯౨. యఈఙ్ఖయంతి పర్వతాం తిరః సముద్ర మర్ణవమ్ । మరుద్భిరగ్న ఆగహి॥

దం॥ ఏ వాయువులు పర్వతములను (=మేఘములని యర్థమును గలదు) కదలింతురో, ఉదకముతో నిండిన సముద్రము నెవ్వరు తిరస్కరింతురో, అట్టి మరుత్తులతోఁగూడి యో యగ్నీ ! రమ్ము.

౧౯౩. ఆయేతన్వంతి రశ్మిభి స్తిరః సముద్ర మోజసా । మరు ద్భిరగ్న ఆగహి॥

దం॥ ఎవరు సూర్యకిరణములతోఁగూడ నాకసమందంతట వ్యాపింతురో, ఎవరు బలముచేత సముద్రమును దిరస్కరింతురో, అట్టి మరుత్తులతోఁగూడి యగ్నీ ! రమ్ము.

౧౯౪. అభిత్వా పూర్వపీతయే సృజామి సోమ్యం మధు । మరు ద్భిరగ్న ఆగహి॥

దం॥ మొట్టమొదఁటనే పానముచేయుటకు నీకై మధురమగు సోమరసమును సిద్ధపఱచినాను, కనుక నో యగ్నీ ! మరుత్తులతోఁ గలిసి రమ్మా !

—:-౦-:—

## ద్వితీయాధ్యాయము.

---

### సూక్తము. ౨౦.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి ; దేవత - ఋభువులు ; ఛన్దస్సు - గాయత్రి,)

౧-౫. అయం దేవాయ జన్మనే స్తోమో విప్రేభి రాసయా । అకారి రత్నధాతమః ॥

తా॥ జన్మ (కల) దేవతకొఱకు నీ స్తవము విప్రులచేత నోటితోఁ జేయఁబడినది-ఇది అతిశయముగా ధనమును గలిగించును. (ఋభువులను దేవతలు జన్మకలవారట ! వారికై చేసిన స్తవమిది.)

౧-౬. య ఇంద్రాయ వచోయుజా తతక్షు ర్మనసా హరీ । శమీభి ర్యజ్ఞ మాశత ॥

తా॥ ఏ ఋభువులు ఇంద్రుని కొఱకు మాటచెప్పగానే తమంత తాము రథమును బూన్చుకొనునట్టి హరియను పేర్లుగల రెండు గుఱ్ఱములను మనసుతోనే తయారు చేసిరో, వారు పనులలో యజ్ఞమందు వ్యాపించిరి-(యజ్ఞమునకు గావలసిన పనులు చేతురని తా॥)

౧-౭. తక్ష న్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథమ్ । తక్షం ధేనుం సబర్దుఘామ్ ॥

తా॥ సర్వత్రాగమనముకలది, కూర్చుండుటకు సుఖమైనది, అగు రథమును అశ్వినీ దేవతల కొఱకు ఋభువులు చెక్కి- తయారు చేసిరి. బాగుగఁ బాలిచ్చు నావునుగూడఁ దయారుచేసిరి.

౧-౮. యువానా పితరా పునః సత్యమంత్రా ఋజూయవః । ఋభవో విష్ట్యక్రత ॥

తా॥ సత్యమయిన మంత్రసామర్థ్యము కలిగి కపటములేని వారును, సర్వకార్యసిద్ధి కలవారునగు, ఋభువులు తలిదండ్రులను (ముదిసినవారిని) మరల యౌవనవంతులుగాఁ జేసిరి.

౧-౯. సంవో మదాసో అగ్మ తేంద్రేణ చ మరుత్వతా । ఆదిత్యేభిశ్చ రాజభిః ॥

తా॥ ఋభువులారా ! మీకు హర్షముగలిగించు సోమము మరుత్తులతోఁ గూడిన యింద్రునితోను, ప్రకాశించు నాదిత్యులతోను, గలిసికొన్నది.

౨౦౦. ఉతత్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతమ్ । అకర్త చతురః పునః॥

ద॥ మఱియు త్వష్టతనకొఱకుఁగాఁ జేసికొన్న చమసను (శిష్యులైన) ఋభువులు ఆ ఒక్క పాత్రను నాలుగు పాత్రలుగాఁ జేసిరి. (దేవతల చెక్కడపు పనివాఁడు త్వష్ట చమస=సోమరసము పానముచేయుటకుఁగాఁ గఱ్ఱతోఁ జేసిన పాత్రికుఁ బేరు.)

౨౦౧. తేనో రత్నాని ధత్తన త్రిరా సాప్తాని సున్వతే । ఏకమేకం సుశస్తిభిః॥

ద॥ ఆ యో ఋభువులారా! శోభనమయిన మా స్తవములచేత ఒక్కొక్కదానిని (కర్మను) మూఁడు ఏడు నగునట్లు ఉత్తమములను గలుగఁ జేయుఁడు.

(౧ పాకయజ్ఞములు ఏడువిధములు-ఔపాసనము-వైశ్వదేవము-పార్వణము-అష్టకాశ్రాద్ధము-మాసశ్రాద్ధము-సర్పబలి-ఈశానబలి యని. ౨. సప్తహవిర్యజ్ఞములు- ౧ అగ్నిహోత్రము- ౨ దర్శపూర్ణమాసలు- అగ్న్యాధేయము- ౩ ఆగ్రయణము- ౪ చాతుర్మాస్యలు- ౫ నిరూఢ పశుబంధము- ౬ సౌత్రామణి- ౭ ఆశ్వయుజ శూలగవాదులు. ౩. సప్తసోమయాగములు- ౧ అగ్నిష్టోమ- ౨ అత్యగ్నిష్టోమ- ౩ ఉక్థ్య- ౪ షోడశి- ౫ వాజపేయ- ౬ అతిరాత్రి- ౭ అప్తోర్యామము-అని, మొత్తమిరువది యొకటి)

౨౦౨. అధారయంత వహ్నయోఽభజంత సుకృత్యయా। భాగం దేవేషు యజ్ఞియమ్॥

ద॥ ఋభువులు (తాముమర్త్యులయ్యును) చమసాది పాత్రిలు చేయుటవల్ల దేవతలయి దేవతలతోపాటు యజ్ఞభాగమునుగూడఁ బొందిరి,

---

## సూక్తము, ౨౧.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి ; దేవత -ఇంద్రాగ్నులు ; ఛన్దస్సు - గాయత్రి.)

౨౦౩. ఇహేంద్రాగ్నీ ఉపహ్వయే తయోరిత్స్తోమముశ్మసి। తా సోమం సోమపాతమా॥

ద॥ ఈకర్మలో నింద్రాగ్నులను బిలుచుచున్నాను. వారికే సోమమును గోరుచున్నాను. వారు ఉత్తమముగా సోమము త్రాగుదురుగాక.

౨౦౪. తా యజ్ఞేషు ప్రశంసతేంద్రాగ్నీ శుంభతా నరః । తా గాయత్రేషు గాయత॥

టీ॥ ఓ ఋత్విజులారా! ఆ యింద్రాగ్నులను యజ్ఞములందు స్తుతింపుఁడు. అలంకరింపుడు, గాయత్రీ ఛన్దస్సులో నున్న సామమంత్రములతో వారిని గానము చేయుఁడు.

౨౦౫. తా మిత్రస్య ప్రశస్తయ ఇంద్రాగ్నీ తా హవామహే । సోమపా సోమపీతయే॥

టీ॥ స్నేహితుఁడయిన (యజమానుని యొక్క) క్షేమముకొఱకు నింద్రాగ్నుల స్తుతింతుము. సోమపానముసేయఁగల వారిద్దఱిని సోమపానముకొఱకుఁ బిలుచుచున్నాము.

౨౦౬. ఉగ్రా సంతా హవామహ ఉపేదం సవనం సుతమ్। ఇంద్రాగ్నీ ఏహ గచ్ఛతామ్॥

టీ॥ (శత్రువులను వధించుటలో) ఉగ్రులయిన యింద్రాగ్నులను అభిషవించిన సోమముగల యీసవనము వద్దకుఁ బిలుచుచున్నాము. వారు ఇచటికి వత్తురుగాక.

౨౦౭. తా మహాంతా సదస్పతీ ఇంద్రాగ్నీ రక్ష ఉబ్జతమ్ । అప్రజాః సంత్వత్రిణః॥

టీ॥ గొప్పవారును సభాపాలకులు నయిన యింద్రాగ్నులు రాక్షసులను క్రౌర్యము విడుచునట్లు చేయుదురుగాక. ఆరాక్షసులు సంతానము లేకుందురుగాక.

౨౦౮. తేన సత్యేన జాగృత మధి ప్రచేతునే పదే । ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్॥

టీ॥ ఓ యింద్రాగ్నులారా! మీరు ఫలములననుభవించు లోకములను వ్యక్తపఱచి కాని ఫలము లిచ్చుటకు సిద్ధులై యుందురుగాక! ఇంద్రాగ్నులు సుఖమునిత్తురుగాక!

---

సూక్తము. ౨౨.

(ఋషి - కణ్వపుత్రుఁడగు మేధాతిథి; దేవత ౧ - ౪ అశ్వినీదేవతలు, ౫-౮ సూర్యుఁడు, ౯-౧౦ అగ్ని, ౧౧ దేవతలు, ౧౨ ఇంద్రాణి, వరుణాని, అగ్నాయి, ౧౩-౧౪ భూమ్యంతరిక్షములు, ౧౫ పృథివి, ౧౬-౨౧ విష్ణువు; ఛన్దస్సు గాయత్రి)

౨౦౯. ప్రాతర్యుజా వి బోధయాశ్వినా వేహ గచ్ఛతామ్ । అస్య సోమస్య పీతయే॥

టీ॥ (అధ్వర్యునుద్దేశించి హోత పలుకుచున్నాఁడు) ఓ యీ! ప్రాతస్సవనమునందు కూడుకొన్న యశ్వినీ దేవతలిద్దఱికిని యీ సోమము త్రాగుటకు బోధింపుము, (నిద్ర లేపుమని తా॥) వారు ఈ చోటికి వత్తురుగాక.

౨౧౦. యాసురథా రథీతమోభా దేవా దివిస్పృశా । అశ్వినా తాహవామహే॥

దం॥ ఏ యిద్దఱశ్వినులు మంచిరథముగల వారును, ద్యులోకమందు నివసించు వారును, ప్రకాశించువారు నయి యున్నారో, ఆ యిద్దఱిని నేను బిలుచుచున్నాను-

౨౧౧. యావాం కశా మధుమ త్యశ్వినా సూనృతావతీ । తయా యజ్ఞం మిమిక్షతమ్॥

దం॥ ఓ యశ్వినులారా! సత్యమయినదియు, నీటిచే దడిసినదియునగు మీ యిద్దఱి చేతినుండు కొరడా యేదికలదో దానితో యజ్ఞమును నడుపుదురుగాక. (కమ్చాకిఁ గొరడా యని తెలుగు)

౨౧౨. నహి వామ స్తి దూరకే యత్రా రథేన గచ్ఛథః । అశ్వినా సోమినో గృహమ్॥

దం॥ ఓ యశ్వినులారా! సోమముతో యాగముచేయు నే (యజమానుని గృహమునకు రథముతో మీరుపోవుదురురో, ఆ గృహము మీకు దూరముగా లేదు. (మీరథము వేగముగలదని తా॥)

౨౧౩. హిరణ్యపాణి మూతయే సవితార ముపహ్వయే । సచేత్తా దేవతా పదమ్॥

దం॥ బంగారము చేతియందుఁగల సవితృ దేవతను (యజమానుని) రక్షించుటకుఁ బిలుచుచున్నాము. అతఁడు (యజమానుఁడు) చేరఁదగిన దేవతాస్థానమేదో తెలుపును.

౨౧౪. అపాం నపాత మవసే సవితార ముపస్తుహి । తస్య వ్రతా న్యుశ్మసి॥

దం॥ (హోత సామగ ఋత్విజునితోఁ బల్కుచున్నాఁడు) ఓ యీ! నీటిని యిగిరించువాఁడగు సవితను రక్షణముకొఱకు స్తుతింపుము. అతని వ్రతములను (=సోమయాగాదులు) గోరుచున్నాము.

౨౧౫. విభక్తారం హవామహే వసో శ్చిత్రస్య రాధసః । సవితారం నృచక్షసమ్॥

దం॥ నివాసమునకుఁ గావలసిన నానావిధ ధనములను (యజమానులకు) బంచి యిచ్చువాఁడగునట్టి, మానవులను ప్రకాశింపఁజేయునట్టి, సవితృ దేవతను (=సూర్యుని) బిలుచుచున్నాము.

౨౨౨. తయోరిద్ఘృతవత్పయో విప్రా రిహంతి ధీతిభిః । గంధర్వస్య ధ్రువేపదే॥

వ॥ స్థిరమయిన గంధర్వస్థానమందు (అనఁగా నంతరిక్షమని తా) ఉన్నవారిద్దఱి యొక్క (భూమ్యంతరిక్షములని తా॥) నేతివంటి ఉదకమునే విప్రులుకర్మలతోఁ జవిచూతురుగాక॥ (నాకుదురు=రిహన్తి)

౨౨౩. స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ । యచ్ఛానః శర్మ సప్రథః॥

వ॥ ఓపృథివీ! విస్తారాది గుణములు కలదానవుకమ్ము. ముండ్లులేనిదానవుకమ్ము. నివశించుటకుపయోగము కలదానవు కమ్ము. విస్తారముకలిగి మాకు సుఖమిమ్ము.

౨౨౪. అతో దేవా అవంతు నోయతో విష్ణుర్విచక్రమే । పృథివ్యాః సప్తధామభిః॥

వ॥ ఏకారణము చేత విష్ణువు ఏడుసాధనములతోఁ బృథివినుండి అనేక పాదవిన్యాసములు (=నడకలు) చేసెనో, ఆకారణము చేత దేవతలు పృథివినుండి మమ్ము రక్షింతురుగాక॥ (త్రివిక్రమావతారవర్ణన)

౨౨౫. ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ । సమూఢమస్య పాంసురే॥

వ॥ విష్ణువీ జగత్తునంతయు నడచెను. మూఁడువిధముల నడుగు పెట్టెను. ధూళియుక్తమైన యీతని పాదమందు ఈసర్వజగత్తు నిమిడియున్నది.

౨౨౬. త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః । అతో ధర్మాణి ధారయన్॥

వ॥ ఇతరులచేతహింసింపశక్యముకానివాఁడును, సర్వజగత్తునుపాలించువాఁడును, అగు విష్ణువు ధర్మములను (=కర్మలను) పోషించుచు మూఁడులోకములందు మూఁడడుగులు పెట్టెను.

౨౨౭. విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే । ఇంద్రస్య యుజ్యః సఖా॥

వ॥ ఓఋత్విజులారా! విష్ణువుయొక్క కర్మలను చూడుఁడు. ఏకర్మలచేత (ప్రతి యజమానుఁడును) అగ్నిహోత్రాది కర్మలను జేయుచున్నాఁడో, ఆవిష్ణువు ఇంద్రునకు విడువని సఖుఁడు.

౨౨౮. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః । దివీవ చక్షు రాతతమ్॥

వ॥ ఆకాశమందుఁ బ్రసరించు దృష్టి యెట్లు సర్వమును జూడఁగలదో, అట్లు విద్వాంసులు ఆవిష్ణుని ఉత్కృష్టస్థానమును ఎల్లపుడును జూతురు.

౨౨౯. తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే । విష్ణో ర్యత్పరమం పదమ్॥

వ॥ పొరపాటులేని స్తుతికర్తలగు విప్రులు (బుద్ధిమంతులని వ్యుత్పత్త్యర్థము) ఆవిష్ణుని యొక్క పరమస్థానమును జక్కఁగాఁ బ్రకాశింపఁజేతురు.

---

## సూక్తము. ౨౩.

(ఋషి - కణ్వపుత్రుండగు మేధాతిథి; దేవత- ౧ - వాయుదేవత, ౨-౩- ఇంద్రవాయువులు, ౪ - ౬ - మిత్రావరుణులు, ౭ - ౯ మరుద్గణవిశిష్టుండగు నింద్రుండు, ౧౦ - ౧౨ విశ్వేదేవుండు, ౧౩ - ౧౫ - పూష్ణుండు, ౧౬ - ౨౨ - ఉదకదేవత, ౨౪ - అగ్ని; ఛందస్సు - ౧-౧౮-౨౧-గాయత్రి, ౧౯- ఉష్ణిక్, ౨౦-౨౨-౨౪- అనుష్టుప్. )

౨౩౦. తీవ్రాః సోమాస ఆ గ హ్యాశీర్వంతః సుతా ఇమే । వాయో తా ప్రస్థితా న్పిబ॥

వ॥ ఓ వాయువా! ఈసోమములు అభిషవింపఁబడినవి. అవి తీవ్రములగుటవలన తృప్తినిగలిగించును. ఆశీరము గలిగియున్నవి. (ఆశీరమని మాఱిగించిన పాలు పెరుగుతో జేసినవస్తువు) ఉత్తరవేదికిఁ దేబడిన యీ రసములను పానముసేయుము.

౨౩౧. ఉభా దేవా దివిస్పృశేంద్రవాయూ హవామహే । అస్య సోమస్య పీతయే॥

వ॥ ద్యులోకమంటుచున్న ఇంద్రుఁడు వాయువు ననునిద్దఱు దేవతలను యీసోమము త్రాగుటకుఁ బిలుచుచున్నాము.

౨౩౨. ఇంద్రవాయూ మనోజువా విప్రా హవంత ఊతయే । సహస్రాక్షా ధియస్పతీ॥

వ॥ మనోవేగముకలవారును, వేయికన్నులు కలవారును, బుద్ధులకు అధిపతులును, అగు నింద్రవాయువులను రక్షణముకొఱకు ఓ ఋత్విజులారా! పిలువుఁడు.

౨౩౩. మిత్రం వయం హవామహే వరుణం సోమపీతయే । జజ్ఞానా పూతదక్షసా॥

వ॥ (యజ్ఞస్థలమం) దవతరించిన వారును, పవిత్రమగు బలము కలవారును, అగు మిత్రుని వరుణుని సోమపానమునకై మేము పిలుచుచున్నాము.

౨౩౪. ఋతేనయా వృతావృధా వృతస్య జ్యోతిషస్పతీ । తా మిత్రావరుణా హువే॥

వం॥ ఏమిత్రావరుణులు సత్యము చేత (ఫలమును) వృద్ధిచేయునట్టి ప్రశస్తమయిన తేజస్సును బాలించునట్టి వారో ఆవారిని బిలుచుచున్నాము.

౨౩౫. వరుణః ప్రావితా భువ న్మిత్రో విశ్వాభి రూతిభిః । కరతాంనః సురాధసః॥

వం॥ ఈవరుణుండు మమ్ము బాగుగా రక్షించు వాఁడగుఁగాక॥ మిత్రుఁడు సమస్త రక్షణలతో మమ్ము మంచిధనవంతులఁగా జేయునుగాక.

౨౩౬. మరుత్వంతం హవామహ ఇంద్రమా సోమపీతయే । సజూ ర్గణేన తృంపతు॥

వం॥ మరుత్తులతోఁ గూడిన యింద్రుని సోమపానము చేయుటకుఁ బిలుచుచున్నాము. అతఁడు మరుద్గణములతో (గలిసి తృప్తి నందుఁగాక.

౨౩౭. ఇంద్రజ్యేష్ఠా మరుద్గణా దేవాసః పూషరాతయః।విశ్వేమమ శ్రుతా హవమ్॥

వం॥ ఇంద్రుఁడు ముఖ్యుఁడుగాఁ గలవారును, ధనమునిచ్చుపూష దేవతతమలోఁ గలవారును, అగు నోమరుద్గణములారా! మీరందఱును నాపిలుపు వినుఁడు.

౨౩౮. హతవృత్రం సుదానవ ఇంద్రేణసహసాయుజా।మానోదుశ్శంస ఈశత॥

వం॥ మంచి దాతలగు మరుద్గణములారా! బలవంతుఁడు యోగ్యుఁడు నగు నింద్రునితోఁగలసి శత్రువును నశింపఁ జేయుఁడు. దుష్కీర్తిగల వృత్రుఁడు మమ్ము (నెదిరింపఁ) జాలకుండుఁగాక.

౨౩౯. విశ్వాన్దేవాన్హవామహే మరుతః సోమపీతయే।ఉగ్రాహిపృశ్నిమాతరః॥

వం॥ మరుత్తులనెడు దేవతల నందఱిని సోమపానమునకై పిలుచుచున్నాము. వారు ఉగ్రులును పృథివికిఁ బుత్రులును గదా!

౨౪౦. జయతామివ తన్యతుర్మరుతామేతి ధృష్ణుయా। యచ్ఛుభం యాథనా నరః॥

తా॥ శూరుల యొక్క వలె ఎవ్వరి ధ్వని దృఢముగ మ్రోగుచున్నదో అట్టి నాయకులైన ఓ మరుత్తులారా! ఎల్లప్పుడు శుభమయిన (దేవయజన స్థానమునకు) రండు.

౨౪౧. హస్కారాద్విద్యుతస్పర్యతో జాతా అవంతు నః। మరుతో మృడయంతు నః॥

తా॥ కాంతిని కలిగించునట్టి, ప్రకాశించునట్టి, ఆకసమునందలి మెరుపునుండి జనించి నట్టి మరుత్తులారా! మమ్ము రక్షింపుడు. మమ్ము సుఖింపజేయుడు.

౨౪౨. ఆ పూషన్ చిత్రబర్హిషమాఘృణే ధరుణం దివః। ఆజా నష్టం యథా పశుమ్॥

తా॥ కాంతులను కలిగియుండి గమనశీలుడవగునో పూషా! తప్పిపోయిన పశువును తెచ్చునట్లు విచిత్ర దర్భలు కలిగిన యాగమును బోషించునట్టి సోమమును అంతరిక్షమునుండి తెమ్ము.

౨౪౩. పూషా రాజానమాఘృణిరపగూఢం గుహాహితమ్। అవిందచ్చిత్రబర్హిషమ్॥

తా॥ గుహలో నుంచినదికనుకనే (గుహాంతర్గత ద్యులోకమని తా॥) అత్యంత గూఢమయినదియు, చిత్రమైన దర్భలు కలదియు నగు ప్రకాశించుచున్న సోమమును కాంతిగల పూష దేవత పొందెను.

(సంపాదించెనని తా॥) పూష = సూర్యుడు.

౨౪౪. ఉతో స మహ్యమిందుభిః షడ్యుక్తాఁ అనుసేషిధత్। గోభిర్యవం న చర్కృషత్॥

తా॥ మఱియు ప్రతియేటను మేము ధాన్యమునకై ఎద్దులతో దున్నినట్లు ఆ పూషుడు నాకొఱకు (యజమానునకు) సోమముగల యాగయుక్త ఋతువులను వరుసగా దిరిగి కొని వచ్చును.

౨౪౫. అంబయో యంత్యధ్వభిర్జామయో అధ్వరీయతామ్।
పృంచతీర్మధునా పయః॥

దం॥ యజ్ఞము చేయఁగోరిన (మాకు) ఉదకములు దేవయజన స్థానములద్వారా హితవును గలుగఁజేయునవియు, మాధుర్యము గలవియు నగు పాలను (గవాదులందు) గలిగించుఁగాక!

౨౮౬, అమూర్యా ఉపసూర్యే యాభిర్వా సూర్యస్సహ । తానో హిన్వ న్త్వధ్వరమ్॥

దం॥ ఏయీయుదకములు సూర్యుని యందున్నవో ఏయుదకముతో సూర్యుఁడు గూడనుండునో అవి మాయజ్ఞమును దృప్తినొందించుఁగాక.

౨౮౭. అపో దేవీ రుపహ్వయే యత్ర గావః పిబంతినః । సింధుభ్యః క ర్త్వం హవిః॥

దం॥ మాగోవులే యుదకములను ద్రావునో యీ యుదక దేవతలను బిలుచు చున్నాను. స్రవించు స్వభావము గలయా యుదకములనుండి హవిస్సు తయారు చేయవలసి యున్నది.

౨౮౮. అప్స్వ౨ంత రమృత మప్సు భేషజ మపా ముత ప్రశ స్తయే ।
దేవా భవత వాజినః॥

దం॥ ఉదకముల మధ్యను అమృతమున్నది. ఉదకములందు ఔషధమున్నది. మఱియు నుదకముల ప్రాశస్త్యము కొఱకు ఓ ఋత్విజులారా (=దేవాః !) త్వరగలవారుకండు.

౨౮౯. అప్సుమే సోమో అబ్రవీ దంత ర్విశ్వాని భేషజా ।
అగ్నించ విశ్వశంభువ మాపశ్చ విశ్వభేషజీః॥

దం॥ ఉదకముల మధ్యను సమస్తౌషధములునుగలవు. వాటియందుఁ బ్రపంచము నకు సుఖకరుఁడగు నగ్నికలదని సోముఁడు నాకుఁ జెప్పెను, ఉదకములు సర్వౌషధములు. (ఔషధులన్నియు నుదకముతోనే బ్రతికెనుగనుక ఉదక మహౌషధమే)

౨౯౦. ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౩మమ । జ్యోక్ చ సూర్యం దృశే॥

దం॥ ఉదకములు నాశరీరమునకు రోగముబు బోఁగొట్టు నౌషధమును బూరించుఁగాక. చిరకాలము మేము సూర్యుని జూచు నట్లు (చేయుఁగాక) .

౨౫౧. ఇద మాపః ప్రవహత యత్కించ దురితం మయి।

యద్వాహ మభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్॥

తా॥ ఓ ఉదకములారా! నా యందేదైన పాపముండెనో? లేక నేను ఎవనికైన ద్రోహము చేసితినో? తిట్టితినో, అనృతమాడితినో, ఆపాపమును నా నుండి మీరు కడిగి వేతురు గాక.

౨౫౨. ఆపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి।

పయస్వానగ్న ఆగహి తంమా సంసృజ వర్చసా॥

తా॥ ఈనాడు (అవభృథ స్నానము నాడని తా॥) ఉదకములలో స్నానము చేసితిని. రసముతోఁ గలిసితిమి. అగ్నీ! ఉదకములతోఁ గూడిరమ్ము. అట్లు స్నానము చేసిన నన్ను తేజస్సుతోఁ గూర్చుము.

౨౫౩. సంమాగ్నే వర్చసా సృజ సంప్రజయా సమాయుషా।

విద్యుర్మే అస్య దేవా ఇంద్రో విద్యాత్సహ ఋషిభిః॥

తా॥ అగ్నీ! వర్చస్సుతో సంతానముతో ఆయుర్దాయముతో నన్ను కూర్చుము. దేవతలు ఈ నాయొక్క కర్మనెఱుంగుదురు గాక. ఇంద్రుఁడుఁగూడ నా యనుష్ఠానమును తెలియునుగాక.

ఇట్లు ప్రథమమండలమున అయిదవ అనువాకము. శ్రీ శ్రీ శ్రీ

---

## అనువాకము. ౬.

### సూక్తము, ౨౪.

(ఋషి - అజీగర్తపుత్రుఁడగు శునశ్శేపుఁడు; దేవత - ౧. ప్రజాపతి, ౨. అగ్ని, ౩ - ౫. సవిత, ౬ - ౧౫. వరుణుఁడు; ఛన్దస్సు - ౧, ౨, ౬, ౧౫. త్రిష్టుప్, ౩, ౫. గాయత్రి.)

౨౫౪. కస్య నూనం కతమస్యామృతానాం మనామహే చారుదేవస్య నామ।

కో నో మహ్యా అదితయే పునర్దాత్పితరంచ దృశేయం మాతరంచ॥

దం॥ మేము దేవతలమధ్యను ఎన్నవవానియొక్క యెవనియొక్క శోభనమయిన నామమును ఉచ్చరింతుము? ఏదేవుఁడు నన్ను గొప్పదియగు పృథివికినిచ్చును? (అట్లయితే) తండ్రినిందల్లినింజూతును.

(యూపస్తంభమునఁ గట్టబడి శునశ్శేఫుడు అనుకొనుచున్నాఁడు)

౨౪౨. అగ్నేర్వయం ప్రథమ స్యామృతానాం మనామహే చారుదేవస్యనామ ।
సనో మహ్యా అదితయే పునర్దాత్పితరంచ దృశేయం మాతరంచ॥

దం॥ దేవతలలో మొదటి వాఁడయిన యగ్నిదేవుని యొక్క శోభనమయిన నామమునుచ్చరింతును. అతఁడు మరలనన్ను గొప్పదగు భూమికప్పగించును. తల్లినిఁదండ్రినిఁ జూతును.

౨౪౩. అభిత్వా దేవ సవిత రీశానం వార్యాణామ్ । సదావ న్భాగ మీమహే॥

దం॥ సదారక్షకుఁడవయిన ఓ సవితృదేవా ! కోరఁదగిన వాఁటికీశ్వరుఁడ వగునిన్ను ధనమును గోరుచున్నాను.

౨౪౪. యశ్చిద్ధిత ఇత్థా భగః శశమానః పురా నిదః । అద్వేషో హస్తయో ర్దధే॥

దం॥ కోరఁదగినదై యేది నీహస్తమునందు ధరింపఁబడినదో, పూజనీయమగు నేధనము నిందించుటకుఁ బూర్వము ద్వేషము లేనిదై యున్నదో, (శత్రువుల చేతిలోఁ బడిన ధనము నందఱునిందింతురు. అంతకు ముందు తనదైయున్నపుడు ద్వేషించరు అని తా॥) ఆధనమును సవితా! మేము గోరుచున్నాము.

౨౪౫. భగభక్తస్య తేవయ ముదశేమ తవావసా । మూర్ధానం రాయ ఆరభే॥

దం॥ ఓ సవితా! నీ వారమైన మేము ధనముతోఁ గూడిన నీరక్షణచేత ధనము యొక్క వృద్ధిని జేయుటకుఁ బ్రయత్నించుచున్నాము.

౨౪౬. నహితే క్షత్రం నసహో నమన్యుం వయశ్చనామీ పతయంత ఆపుః ।
నేమా ఆపో అనిమిషం చరంతీ ర్నయే వాతస్య ప్రమిన స్త్యభ్వమ్॥

వ॥ ఓ వరుణుడా! ఆకసమునందెగురు పక్షులు గూడ నీశరీర బలమును బొందలేదు. (అనఁగా నిరాధారాకాశమునందెగురఁ గలవి కూడను అనిత్రా) పరాక్రమమును బొంద లేదు. నీకోపము నోర్వఁజాలవు

ఎల్లప్పుడు గమనించుచున్న యీ యుదకములును వాయువు యొక్క వేగములును ఎదిరింపఁజాలవు.

౨౬౦. అబుధ్నే రాజా వరుణో వనస్యోర్ధ్వం స్తూపం దదతే పూతదక్షః ।
నీచీనాః స్థురుపరి బుధ్న ఏషా మస్మే అంతర్నిహితాః కేతవః స్యుః ॥

వ॥ శుద్ధమయిన బలముగల రాజైన వరుణదేవుఁడు మూలములేని అంతరిక్షమునందుండి కోరఁదగిన తేజోరాశిని మీఁదుగా ధరించుచున్నాఁడు. మీఁదనున్న కిరణములు క్రిందికిఁ బ్రసరించినవి. ఈ కిరణములకు మూలము మీఁదను గలదు. వీనుకిఁ ప్రాణములు మాయందు నిలుపఁబడి యున్నవి.

౨౬౧. ఉరుంహి రాజా వరుణశ్చకార సూర్యాయ పంథా మన్వేతవా ఉ ।
అపదే పాదా ప్రతిధాతవే౽కరుతాపవక్తా హృదయావిధశ్చిత్ ॥

వ॥ వరుణరాజు సూర్యుని మార్గమును విశాలముగాఁ జేసెను గదా! ఎందుకంటె - క్రమముగా నుదయాస్తమయములు పొందుటకు. అడుగు పాదములు లేని (అంతరిక్ష) మునను పాదములుంచుటకు దారిచేసెను. మఱియు నతఁడు మా శత్రువును నిరాకరించుఁగాక! (ఇంతటి వరుణుఁడు నాకెట్లు మనవిచ్చి భూమిమీఁద నన్ను నడిపించుగాకయని శునశ్శేఫుడు కోరుచున్నాఁడు.)

౨౬౨. శతం తే రాజన్భిషజః సహస్రముర్వీ గభీరా సుమతిష్టే అస్తు ।
బాధస్వ దూరే నిరృతిం పరాచైః కృతం చిదేనః ప్రముముగ్ధ్యస్మత్ ॥

వ॥ ఓ రాజయిన వరుణుఁడా! నీవద్ద నూర్లు వేలు ఔషధములు కలవు. నీ మంచి బుద్ధి మిక్కిలి గంభీరమయియుండుగాక. మాకుఁ బాపమొసరించు పాపదేవతను దూరముగాఁ గొనిపోయి పడమార్పుము. మేము చేయు పాపమునుండి మమ్మును తొలఁగించుము.

౨౬౩. అమీ యఋక్షా నిహితాస ఉచ్చా నక్తం దదృశ్రే కుహచిద్దివేయుః ।

అదబ్ధాని వరుణస్య వ్రతాని విచాకశ చ్చంద్రమా నక్తమేతి॥

దం॥ ఏ నక్షత్రములు రాత్రిభాగమందు పరిభాగమందు స్థాపించఁబడినవై కనఁబడుచున్నవో అవి పగటియం దెక్కడకో పోవును. వరుణదేవుని యీ పనులెవరును జెరుపలేరు. చంద్రుఁడు రాత్రియందు విశేషకాన్తి గలిగి వచ్చుచున్నాడు.

(ఇవన్నియు వరుణదేవుఁడుచేసిన పనులని తా॥)

౨౬౪. తత్వాయామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః ।

అహేళమానో వరుణేహ బోధ్యురుశంస మాన ఆయుః ప్రమోషీః॥

దం॥ ఓ వరుణుఁడా! స్తుతులతోఁ బొగడుచు నిన్ను ఆయువును గోరుచున్నాను. యజమానుఁడు హవిస్సులిచ్చి దానినేకోరును. అనాదరణచూపక దీనిం దెలియుము. మిగుల స్తవనీయుఁడా! మా అయువును దొంగిలింపకుము,

౨౬౫. తదిన్నక్తం తద్దివా మహ్యమాహు స్తదయం కేతో హృద ఆవిచష్టే ।

శునశ్శేఫో యమహ్వద్గృభీతః సో అస్మాన్రాజా వరుణో ముమోక్తు॥

దం॥ ఆవరుణస్తవమే రాత్రియందు నాకుఁజెప్పినారు. పగలుకూడఁ జెప్పుదురు. నా మనసులోనే యీ ప్రజ్ఞ ప్రకాశించినది. పట్టుకొనంబడిన శునశ్శేఫుఁడే వరుణుని బిలిచెనో ఆ వరుణరాజు మమ్ములను విడిపించుగాక.

౨౬౬. శునః శేఫో హ్యహ్వద్గృభీత స్త్రిష్వాదిత్యం ద్రుపదేషు బద్ధః ।

అవైనం రాజా వరుణః ససృజ్యాద్విద్వాఁ అదబ్ధో విముమోక్తు పాశాన్॥

దం॥ మూఁడు బొండకొయ్యలలోఁ గట్టబడి శునశ్శేఫుఁ డదితిపుత్రుఁడగు వరుణుని స్తుతించెను. కనుక వరుణరాజీతనిని విడిపించుగాక. తెలివిగలవాఁడును (ఒకరికి) లొంగనివాడునగు వరుణుఁడు కట్టుత్రాళ్లను విప్పునుగాక. (కఱ్ఱతోఁ జేసిన సంకెలకు బొండకొయ్య యని పేరు.)

౨౬౭. అవతే హేళో వరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహే హవిర్భిః ।
క్షయన్నస్మభ్యమసుర ప్రచేతా రాజన్నేనాంసి శిశ్రథః కృతాని॥

వం॥ రాజగు వరుణుఁడా! నీకోపమును నమస్కారములతోఁ బోఁగొట్టుకొను చున్నాము. యజ్ఞములచేతను హవిస్సులచేతను బోఁగొట్టుకొనుచున్నాము. అనిష్టమును దొలఁగించునట్టి అధిక ప్రజ్ఞగలిగినట్టి యో వరుణా! మాకొఱకిచట నివసించుచు మేము చేసిన పాపములను వదలించుము.

౨౬౮. ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం విమధ్యమం శ్రథాయ ।
అథావయమాదిత్యవ్రతే తవానాగసో అదితయే స్యామ॥

వం॥ వరుణుఁడా! ఉత్కృష్టమైన పాశమును నానుండి విప్పివేయుము. పాదములపాశమును, నాభిదగ్గరనున్న పాశమును, దొలఁగించుము. పిమ్మట నో యదితిపుత్రా! మేము నీవ్రతమందు దండన లేకుండుటకు అపరాధము లేనివారమగుదుము,
(ఈ మంత్రములన్నియు శునశ్శేఫుఁడు స్తుతించినవే.)

—:-o-:—

## సూక్తము. ౨౫.

ఋషి - శునఃశేఫుఁడు; దేవత - వరుణుఁడు; ఛన్దస్సు - గాయత్రీ.)

౨౬౯. యచ్చిద్ధితే విశో యథా ప్రదేవ వరుణ వ్రతమ్ । మినీమసి ద్యవిద్యవి॥

వం। ఓ వరుణుఁడా! ప్రజలు ఏలాగు పొరబడుదురో ఆలాగుమేమును నీవ్రతమందుఁ బ్రతిదినము బొరబడుదుము. (దానిని నీవు నిర్విఘ్నముగాఁ బూర్తిసేయుము.)

౨౭౦. మానో వధాయ హత్నవే జిహీళానస్య రీరధః । మాహృణానస్య మన్యవే॥

వం॥ ఓ వరుణా! నిన్ను అవమానించిన వానింజేయు నీవధకుఁ బాత్రులనుగా మమ్ముఁ జేయకుము. నీకుఁగోపముగలప్పటి కోపమునకు బాలుగా మమ్ము జేయకుము

౨౮౧. విమృళీకాయ తేమనోరథీ రశ్వం నసందితమ్ । గీర్భిర్వరుణ సీమహి॥

దం॥ అలసిన గుఱ్ఱమును రథికుఁడు సేదదేర్చినట్లు నీమనస్సును మా సుఖము కొఱకు స్తుతులతోఁ బ్రసన్నముసేయుచున్నాము.

౨౮౨. పరా హి మే విమన్యవః పతంతి వస్య ఇష్టయే । వయో న వసతీరుప॥

దం॥ వరుణా! నాయొక్క క్రోధరహితమయిన బుద్ధులు జీవనముకొఱకుఁ బునరావృత్తిలేనివై పక్షులు నివాసమునకుఁ బోవునట్లు పోవుచున్నవి.

౨౮౩. కదా క్షత్రశ్రియం నరమావరుణం కరామహే । మృళీకాయోరుచక్షసమ్।

దం॥ బహుమందినిజూచునట్టి బలవంతుడగునట్టి వరుణుని మా సుఖముకోరి యీ కర్మలోనికి వచ్చునట్లు ఎప్పుడుచేయుదుమో?.

౨౮౪, తదిత్సమానమాశాతే వేనంతా న ప్రయుచ్ఛతః । ధృతవ్రతాయ దాశుషే॥

దం॥ కర్మచేయుచు హవిస్సునిచ్చుచున్న యజమానునికొఱకు ప్రేమించుచున్న మిత్రావరుణులు హవిస్సును చెరిసమానముగాఁ దిందురు. వద్దనిచెప్పరు.

౨౮౫. వేదా యో వీనాం పదమంతరిక్షేణ పతతామ్ । వేద నావః సముద్రియః॥

దం॥ ఆకాశమున నెగురుచున్న పక్షులపాదమును ఏ వరుణుడెఱుగునో, సముద్రములో నున్నవాఁడయి యెవఁడు నావల గమనము నెఱుఁగునో, అతఁడు మా బంధనము విప్పునుగాక.

౨౮౬. వేద మాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః । వేదాయ ఉపజాయతే॥

దం॥ వ్రతమును ధరించిన వరుణుఁడు అపుడపుడు పుట్టుచున్న ప్రజలతోఁగూడిన పండ్రెండు మాసములను, సమీపమునఁ బుట్టుచున్న (పదమూఁడవ) మాసమును గూడ నెఱుంగును. (అధికమాసం)

౨౮౩. ఉతయో మానుషేష్వాయశశ్చక్రే అసామ్యా । అస్మాకముదరేష్వా॥

దం॥ మఱియు నే వరుణుఁడు మనుష్యులలో నన్నమును గల్పించెనో ఆవరుణుఁడు మాకడుపులలో నెక్కువగా నన్నమును జేసెను.

౨౮౪. పరా మే యంతి ధీతయో గావోన గవ్యూతీరను । ఇచ్ఛన్తీరురుచక్షసమ్॥

దం॥ బహుమంది చూడఁదగిన (వరుణునిగూర్చి) నాబుద్ధులు గోవులు మందలకుం జేరునట్లు వెనుకఁ దిరుగక నడచుచున్నవి.

౨౮౫. సం ను వోచావహై పునర్యతో మే మధ్వాభృతమ్।హోతేవ క్షదసే ప్రియమ్॥

దం॥ ఏకారణముచేత నా జీవనము కొఱకు మధురమైనహావిస్సు సంపాదించఁబడ్డదో, అందు వల్ల హోమకర్తవలె నీవును గూడఁ బ్రియమయిన హావిస్సును దినుచున్నావు. తరువాత నీవును, నేనును కులాసాగా మాట్లాడు కొందుము. (బ్రతికిన తరువాత నేనును హావిస్సునిస్తతరువాత నీవును అని శునశ్శేఫునిమాట. అంజస్నవమను కర్మలో వరుణునకుహావిస్సు నిచ్చునపుడు వరుణునితో నన్నమాట)

౨౮౬. దర్శం ను విశ్వదర్శతం దర్శం రథమధిక్షమి । ఏతా జుషత మే గిరః॥

దం॥ అందఱిచేతఁ జూడఁదగియిక్కడ నావిర్భవించిన వరుణుని నేను జూచితినిగదా! భూమిమీఁద వరుణుని రథముచూచితిని. ఈనాస్తుతులువరుణుఁడాలకించెను.

౨౮౭. ఇమం మే వరుణ శ్రుధీహవమద్యాచ మృళయ । త్వామవస్యురాచకే॥

దం॥ వరుణా! నాయొక్క యీయాహ్వానమును వినుము. మఱియు ఈనాఁడు నన్ను సుఖింపఁజేయుము. రక్షణను గోరినిన్ను బిలుచుచున్నాను.

౨౮౮. త్వం విశ్వస్య మేధిర దివశ్చగ్మశ్చ రాజసి । సయామని ప్రతిశ్రుధి॥

దం॥ మేధావంతుఁడవగు నోవరుణా! నీవుద్యులోకముయొక్కయు, భూమియొక్కయు, సర్వజగత్తు యొక్కయు మధ్యను బ్రకాశించుచున్నావు. ఆనీవు క్షేమముగలిగించు వాగ్దానము సేయుము.

౨౮౩. ఉతయో మానుషేష్వాయశశ్చక్రే అసామ్యా । అస్మాకముదరేష్వా॥

దం॥ మఱియు నేవరుణుఁడు మనుష్యులలో నన్నమును గల్పించెనో ఆవరుణుఁడు మాకడుపులలో నెక్కువగా నన్నమును జేసెను.

౨౮౪. పరా మే యంతి ధీతయో గావోన గవ్యూతీరను । ఇచ్ఛంతీరురుచక్షసమ్॥

దం॥ బహుమంది చూడఁదగిన (వరుణునిగూర్చి) నాబుద్ధులు గోవులు మందలకుం జేరునట్లు వెనుకకుఁ దిరుగక నడచుచున్నవి.

౨౮౫. సం ను వోచావహై పునర్యతో మే మధ్వాభృతమ్।హోతేవ క్షదసే ప్రియమ్॥

దం॥ ఏకారణముచేత నా జీవనము కొఱకు మధురమైనహవిస్సు సంపాదించఁబడ్డదో, అందు ఎల్ల హోమకర్తవలె నీవును గూడఁ బ్రియమయిన హవిస్సును దినుచున్నావు. తరువాత నీవును, నేనును కులాసాగా మాట్లాడుకొందుము. (బ్రతికిన తరువాత నేనును హవిస్సుతిన్నతరువాత నీవును అని శునశ్శేఫునిమాట. అంజస్సవమను కర్మలో వరుణునకుహవిస్సు నిచ్చునపుడు వరుణునితో నన్నమాట)

౨౮౬. దర్శం ను విశ్వదర్శతం దర్శం రథమధిక్షమి । ఏతా జుషత మే గిరః॥

దం॥ అందఱిచేతఁ జూడఁదగియుండు నావిర్భవించిన వరుణుని నేను జూచితినిగదా! భూమిమీఁద వరుణుని రథముచూచితిని. ఈనాస్తుతులువరుణుఁడాలకించెను.

౨౮౭. ఇమం మే వరుణ శ్రుధీహవమద్యాచ మృళయ । త్వామవస్యురాచకే॥

దం॥ వరుణా! నాయొక్క యీయాహ్వానమును వినుము. మఱియు ఈనాఁడు నన్ను సుఖింపఁజేయుము. రక్షణను గోరినిన్ను బిలుచుచున్నాను.

౨౮౮. త్వం విశ్వస్య మేధిర దివశ్చగ్మశ్చ రాజసి । సయామని ప్రతిశ్రుధి॥

దం॥ మేధావంతుఁడవగు నోవరుణా! నీవుద్యులోకముయొక్కయు, భూమియొక్కయు, సర్వజగత్తుయొక్కయు మధ్యనుబ్రకాశించుచున్నావు. ఆనీవు క్షేమముగలిగించు వాగ్దానము సేయుము.

౨౬౯. ఉదుత్తమం ముముగ్ధినో విపాశం మధ్యమం చృత । అవాధమాని జీవసే॥

దం॥ మా యొక్క శిరస్సునందున్న పాశమును విడిపింపుము. నడుమనున్న దానిం ద్రెంచుము. జీవనముకొఱకుఁ బాదమందున్న పాశమును గూడ విడిపింపుము.

—:-౦-:—

## సూక్తము. ౨౬.

(ఋషి - శునశ్శేపుఁడు, దేవత - అగ్ని, ఛన్దస్సు - గాయత్రి.)

౨౭౦. వసిష్వాహి మియేధ్య వస్త్రాణ్యూర్జాంపతే । సేమం నో అధ్వరం యజ॥

దం॥ యజ్ఞమును నడిపించువాఁడవు అన్నములను బరిపాలించువాఁడవు నగు నో యగ్నీ! అంతటిని గప్పి వుచ్చుచున్న తేజస్సులను నీవు ధరింపుము. అట్టి తేజస్వివై మా యజ్ఞమును బరిపాలింపుము.

౨౭౧. నినో హోతా వరేణ్యః సదాయవిష్ఠమన్మభిః । అగ్నే దివిత్మతా వచః॥

దం॥ ఎల్లప్పుడును యౌవనవంతుఁడవగు నో యగ్నీ! వరింపఁదగిన నీవు తేజస్సులతోఁ గూడుకొని మా హోమమును గలిగించి దీపించు వాక్కుతో స్తుతింపఁబడిన హోతవగుము.

౨౭౨. ఆహిష్మా సూనవే పితాపిర్యజత్యాపయే । సఖా సఖ్యే వరేణ్యః॥

దం॥ తండ్రి కొడుకునకిచ్చునట్లు, బంధువు బంధువునకిచ్చునట్లు, స్నేహితుఁడు స్నేహితునకిచ్చునట్లు, శ్రేష్ఠుఁడవయిన నీవు నాకుఁ గోర్కెలనిమ్ము.

౨౭౩. ఆనో బర్హీరిశాదసో వరుణో మిత్రో అర్యమా । సీదన్తు మనుషో యథా॥

దం॥ అగ్నీ! వరుణుఁడు మిత్రుఁడు అర్యముఁడు అను (నీ బంధువుల చేత ప్రేరింపఁబడి) శత్రువుల నోడించుచు ప్రజాపతి యజ్ఞమునకు వలెను మా యజ్ఞమునకు రమ్ము.

౨౭౪. పూర్వ్య హోతరస్య నో మన్దస్వ సఖ్యస్య చ । ఇమా ఉషు శ్రుధీ గిరః॥

దం॥ ఓ పెద్దవాఁడా ! హోమమునుగలిగించు నగ్నీ ! మమ్ము ననుగ్రహింపుటకు మాయీయజ్ఞముతో సంతసింపుము. మా స్తుతులనుగూడఁ జక్కఁగా ఊకొట్టుచు వినుము.

౨౬౫. యచ్చిద్ధి శశ్వతా తనా దేవందేవం యజామహే । త్వే ఇద్ధూయతే హవిః

దం॥ ఆలోచింపఁగా నిత్యమై విస్తారమయిన (హవిస్సుతో) యితర దేవతలను ప్రత్యేకము పూజించుచున్నాము. అయినను ఆహవిస్సంతయు నీయందే హోమమగు చున్నది.

౨౬౭. ప్రియోనో అస్తు విశ్పతిర్హోతా మన్ద్రో వరేణ్యః । ప్రియాః స్వగ్నయో వయమ్

దం॥ ప్రజలకుఁ బాలకుఁడయినట్టియు, హోమమునుసంపాదించునట్టియు, శ్రేష్ఠుఁడైన యగ్ని హర్షముకలిగి మాకుఁబ్రియుఁడగునుగాక. మేమును శోభనమయిన అగ్నికల వారమవుదుముగాక.

౨౬౮. స్వగ్నయో హి వార్యం దేవాసో దధిరే చనః । స్వగ్నయో మనామహే॥

దం॥ మంచి యగ్నులుగలిగి ప్రకాశించు ఋత్విజులు కోరఁదగిన మాహవిస్సును ధరించినందువల్ల మేము శోభనాగ్నులు కలవారమయి నిన్ను యాచించుచున్నాము.

౨౬౯. అథాన ఉభయేషా మమృత మర్త్యానామ్ । మిథః సన్తు ప్రశస్తయః॥

దం॥ మరణములేని యగ్నీ ! మనుష్యులమయిన మాకును నీకును హోమాన స్తరము అన్యోన్యము పొగడికలు జరుగునుగాక.

౨౭౦. విశ్వేభి రగ్నే అగ్నిభి రిమంయజ్ఞ మిదంవచః । చనోధాః సహసోయహో॥

దం॥ బలమునకుఁ గొడుకవయిన యోయగ్నీ ! సమస్తాగ్నులతోఁ (ఆహవనీయ-గార్హపత్య-దక్షిణాగ్ని) గూడి నీవు మాయజ్ఞమును ఈ మాస్తుతిని సేవించుచు మాకు అన్నమునిమ్ము.

——:00:——

## సూక్తము. ౨౭.

(ఋషి - శునఃశేఫుఁడు, దేవత - ౧-౧౨ అగ్ని, ౧౩ విశ్వేదేవులు; ఛన్దస్సు - ౧-౧౨ గాయత్రి, ౧౩ - త్రిష్టుప్.)

౩౦౦. అశ్వంన త్వా వారవన్తం వన్దధ్యా అగ్నిం నమోభిః ।
సమ్రాజన్త మధ్వరాణామ్॥

ప॥ యజ్ఞములకు రాజైన ఓ యగ్నీ! నిన్ను నమస్కారములతో తోఁకగల గుఱ్ఱమునువలె సేవించుచున్నాము. (తోఁకసాయమువల్ల ఈఁగలు మొదలగునవాఁటిని దోలుకొన్నట్లు నీ సాయమువల్ల శత్రువులం దోలుకొనుచున్నామని తా॥)

౩౦౧. సఘాసః సూనుః శవసా పృథుప్రగామా సుశేవః ।
మీఢ్వాఁ అస్మాకం బభూయాత్॥

ప॥ ఆ యగ్నియే మాకు సుఖముగా సేవింపఁబడువాఁడు. ఆతఁడు బలమునకుఁ బుత్త్రుఁడు. గమనవేగమధికముగాఁ గలవాఁడు. అతఁడు మాకోర్కెలు వర్షించుఁగాక.

౩౦౨. సనో దూరాచ్చాసాచ్చ ని మర్త్యాదఘాయోః । పాహి సదమి ద్విశ్వాయుః॥

ప॥ సర్వత్రగమనముగల హో యగ్నీ! దూరమునుండియు దగ్గరనుండియు కష్టమును గలిగించు మనుష్యులనుండి యెల్లప్పుడును మమ్మురక్షింపుము.

౩౦౩. ఇమమూషు త్వమస్మాకం సనిం గాయత్రం నవ్యాంసమ్ ।
అగ్నే దేవేషు ప్రవోచః।

ప॥ ఓ యగ్నీ! ఈ యెదుట జరుగుచున్న మాహావిర్దానమును, గాయత్రీఛందముగల క్రొత్తస్తుతిని, దేవతల యెదుటఁ జెప్పుము.

౩౦౪. ఆనో భజ పరమేష్వావాజేషు మధ్యమేషు । శిక్షా వస్వో అంతమస్య॥

దం॥ అగ్నీ! ఉత్కృష్టమయిన (ద్యులోకమందలి) అన్నములను, అంతరిక్షమందున్న యన్నములను, మాకుఁగూర్పుము. భూలోకమందున్న ధనములను గలిగింపుము.

౩౦౫. విభక్తాసి చిత్రభానో సింధోరూర్మా ఉపాక ఆ । సద్యో దాశుషే క్షరసి॥

దం॥ విచిత్రకాంతులుగల ఓ యగ్నీ! నదీసమీపమునకు చిన్నచిన్న కాల్వలు సాగునట్లు యజమానునకుఁ గోర్కెను వర్షింతువు.

౩౦౬. యమగ్నే పృత్సు మర్త్యమవా వాజేషు యంజునాః । సయంతా శశ్వతీరిషః॥

దం॥ యుద్ధములలో నేయజమానుని రక్షించుచున్నావో, యేమనుష్యుని యుద్ధము లందుఁ బ్రేరింతువో, ఆనరుఁడు శాశ్వతమయిన యన్నముల నిచ్చువాఁడగును.

౩౦౭. నకిరస్య సహంత్య పర్యేతా కయస్యచిత్ । వాజో అస్తి శ్రవాయ్యః॥

దం॥ శత్రువులఁ దిరస్కరింపఁగల ఓ యగ్నీ! యీ నీభక్తుఁడగు యజమానుని ఆక్రమించువాఁడు లేడు. ఈయజమానునకు వినఁదగిన బలముగలదు. (వినిమెచ్చుకొనఁ దగినయని తా॥)

౩౦౮. సవాజం విశ్వచర్షణి రర్వద్భిరస్తు తరుతా । విప్రేభి రస్తు సనితా॥

దం॥ అందఱి మనుష్యులతోఁగూడిన ఆయగ్ని గుఱ్ఱములతో యుద్ధమును దరింపఁ జేయుఁగాక. బుద్ధిమంతులయిన ఋత్విక్కులతోఁ దుష్టినందినవాఁడై ఫలదాతయగుఁ గాక.

౩౦౯. జరాబోధ తద్వివిడ్ఢి విశేవిశే యజ్ఞియాయ । స్తోమం రుద్రాయ దృశీకమ్॥

దం॥ స్తవములతో బోధింపఁదగిన అగ్నీ! ఆయా యజమానుల ననుగ్రహించుటకు యజ్ఞానుష్ఠాన సిద్ధికై ఆదేవయజనస్థానమును బ్రవేశింపుము. యజమానుఁడుకూడ క్రూరుఁడవయిన నీకొఱకు ఉత్తమమయిన స్తుతిని జేయుచున్నాఁడు.

౩౧౦. సనోమహాఁ అనిమానో ధూమకేతుః పురుశ్చంద్రః । ధియే వాజాయ హిన్వతు॥

వ॥ గుణాధికుఁడును, నిమానము (కొల) లేనివాఁడును, ధూమముచే గుర్తింపఁ దగినవాఁడును, మిక్కిలి కాంతిగలవాఁడును, అగునగ్ని కర్మకొఱకు నన్నముకొఱకును బ్రీతిగలవారినిగా మమ్ము చేయుఁగాక.

౩౧౧. సరేవాఁ ఇవ విశ్పతి ర్దైవ్యః కేతుః శృణోతు నః। ఉక్థై రగ్ని ర్బృహద్భానుః॥

వ॥ ప్రజలను బాలించువాఁడును, దేవసంబంధియును, దేవదూతయును, ప్రౌఢ మయిన కిరణములుగలవాఁడును, నగు నగ్నిధనవంతునివలె మాస్తుతులను వినుఁగాక.

౩౧౨. నమోమహద్భ్యో నమోఅర్భకేభ్యో నమోయువభ్యో నమఆశినేభ్యః ।
యజామ దేవాన్యదిశక్నవామ మాజ్యాయసః శంస మావృక్షి దేవాః॥

వ॥ దేవతలారా! గుణాధికులకును, గుణహీనులకును, నమస్కారము. వయసు వారికిని వృద్ధులకును నమస్కారము. సమర్థులమయితిమేని దేవతలను యజింతుము. దేవతలారా! శ్రేష్ఠుఁడయినవాని స్తుతిని మే మెపుడును జెఱుపలేదు.

---

సూక్తము ౨౮.

(ఋషి - శునఃశేఫుఁడు; దేవత - ౧-౪ ఇంద్రుఁడు, ౫-౬ ఉలూఖలము, ౭-౮ ఉలూఖల ముసలములు, ౯- హరిశ్చంద్ర, అధిషవణ, చర్మసోములతో నెవ్వఁడైననొకండు; ఛన్దస్సు - ౧-౬ అనుష్టుప్, ౭-౯ గాయత్రి.)

౩౧౩. యత్ర గ్రావా పృథుబుధ్న ఊర్ధ్వో భవతి సోతవే
ఉలూఖలసుతానా మవేద్విన్ద్ర జల్గులః॥

వ॥ ఓ యింద్రా! యేకర్మయందు (అంజస్సవమనుకర్మ) దంచుట కుపయోగించు రాతిబండ మొదట గొప్పదిగాను చివరకుఁ బొడవయినదిగాను నేలఁ బోలుకలదో, ఆకర్మ యందు ఆరోటిలో దంచి పిండిన సోమరసమును నీదేయని తెలిసికొని భక్షింపుము.

౩౧౪. యత్ర ద్వావివ జఘనాధిషవణ్యా కృతా।
ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః॥

తా॥ ఏకర్మలో (అధిషవణి) అధిషవణఫలకములవలె పిరుదులు రెండును విస్తీర్ణము లగునో, అట్టి రోటిలోదంపి పిడిచి సంపాదించిన రసమును నీదేయని యో యింద్రా! త్రాగుము. (రెండు చాతిపలకలు విశాలమయినవి యుండును. వాటిమధ్యను సోమ లత దంచిన ముద్దనుంచి రసమును బిండుదురు)

౩౧౫. యత్ర నార్యపచ్యవ ముపచ్యవంచ శిక్షతే।
ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః॥

తా॥ ఏకర్మలో బత్ని శాలాప్రవేశమును శాలానిర్గమనమును (శాలలోనుండి బయటికి వచ్చుట) నేర్పించుకునో, ఆకర్మలో రోటిలోదంపిన,...... త్రావుము.

౩౧౬. యత్ర మంథాం విబధ్నతే రశ్మీన్యమితవా ఇవ।
ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః॥

తా॥ ఏకర్మయందు గళ్లెములను గట్టునట్టు కవ్వమునకు త్రాళ్లను గట్టుదురో, ఆకర్మలో రోటిలో...... త్రాగుము. (సోమరసమును మజ్జిగ చిలకరించినట్లు దరిచుదురు.)

౩౧౭. యచ్చిద్ధి త్వం గృహేగృహ ఉలూఖలక యుజ్యసే।
ఇహ ద్యుమత్తమం వద జయతామివ దుందుభిః॥

తా॥ ఓరోలా! ఆలోచింపగా ధాన్యము దంచుకొనుటకు బ్రతియింటిలోను ఉందువు. అయినను ఈవైదికకర్మలో జయశీలుర దుందుభివలె గొప్పధ్వనిని జేయుము.

౩౧౮. ఉత స్మ తే వనస్పతే వాతో వివాత్యగ్రమిత్।
అథో ఇంద్రాయ పాతవే సును సోమ ములూఖల॥

దం॥ మఱియు ఓవనస్పతీ! (కఱ్ఱరోలు- చెట్టువల్ల వచ్చినందున వనస్పతియనె) నీయెదుటనే గాలివీచుచున్నది. (అనఁగా రోకలి యెగురుచున్నపుడు ఆవేగమువల్లఁ గలిగినగాలియని తా॥) తరువాత ఓరోలా! ఇంద్రునికై త్రాఁవుటకుఁగా సోమ రసమును బిండుము.

౩౧౯. ఆయజీ వా జసాతమా తా హ్యు౯చ్చా విజర్భృతః ।
హరీ ఇవాంధాంసి బప్సతా॥

దం॥ యజ్ఞమున కంతటికిని సాధనములరై యతిశయముగ నన్నమునిచ్చునో రోలు రోకళ్లలారా! (సెనగలు మొదలగు) నాహారములనుదిను నిందుని గుఱ్ఱములవలె బాగుగా మీరిద్దఱు విహరించుచున్నారు.

౩౨౦. తా నో అద్య వనస్పతీ ఋష్వా వృష్వేభిః సోతృభిః ।
ఇంద్రాయ మధుమత్సుతమ్॥

దం॥ (రోలు రోకలి రూపమయిన) వృక్షభాగములారా! ఈ కర్మలో మీరిద్దఱును రమ్యమయి పిండుటకుఁ దగుసాధనములతోఁ గూడి (యంత్రము) చూడఁదగినవారై మావద్దనున్న సోమలతను ఇంద్రునికొఱకు దంచి రసమును బిండుదురుగాక.

౩౨౧. ఉచ్ఛిష్టంచ మ్వోర్భరసోమం పవిత్ర ఆసృజ । నిధేహి గోరధిత్వచి॥

దం॥ ఓయీ! (ఋత్విజులలో నొకఁడయిన-హరిశ్చంద్రుఁడు-వీని పేరు.) అభిషవణ ఫలకములలోఁ గార్చగా మిగిలిన సోమమును (బండిమీఁద) నుంపుము. కార్చిన సోమమును పవిత్రమందుఁ దెచ్చియుంచుము. మిగిలిన సోమమును ఎఱ్ఱ తోలులోఁ బోయుము. (బద్దెతోఁగూడిన వస్త్రమునకుఁ బవిత్రమని సంజ్ఞ.)

సూక్తము. ౨౯.

(ఋషి - శునఃశేపుఁడు; ఛన్దస్సు - పఙ్క్తి; దేవత - ఇంద్రుడు)

౩౨౨. యచ్చిద్ధిసత్య సోమపా అనాశస్తా ఇవస్మసి।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషుసహస్రేషు తువీమఘ॥

దం॥ సోమపానము సేయునట్టి సత్యవాది వయినట్టి యింద్రా! విచారింపఁగా మేము అప్రశస్తులుగా నుంటిమి. అయినను బహుధనములు గలఓ యింద్రా! నీవు గోవులతోను, అశ్వములతోను, శోభనములగు వేలకొలఁది యితర వస్తువులతోను, ప్రశస్తి నొందువారముగా మమ్ముఁ జేయుము.

౩౨౩. శిప్రిన్వాజానాం పతే శచీవ స్తవదంసనా।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

దం॥ శక్తిమంతుఁడవై చక్కని దవుడలుగల అన్నపతీ! ఇంద్రా! నీవు గొప్ప పనివాఁడవు. గోవులతో నశ్వములతో నిత్యాది పూర్వవత్.

౩౨౪. నిష్వాపయా మిథుదృశా సస్తామబుధ్యమానే।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

దం॥ అన్యోన్యము కలిసియున్నట్లు కనఁబడుచున్న యమదూతలను నిద్రబోవునట్లు చేయుము. (ఎందుకంటే) వారు తెలివిలేక నిద్రలోనుండి మమ్ముఁ జంపుటకు శక్తి లేని వారగుదురు. మఱియు వేలకొలఁది గుఱ్ఱములతోను ఆవులతోను ఇత్యాది పూర్వవత్.

౩౨౫. ససంతు త్యా అరాతయో బోధంతు శూరరాతయః॥

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

దం॥ ఆశత్రువులు నిద్రింతురు (చత్తురని) గాక. ఓ శూరుడా! మిత్రులు తెలివి గల్గి యుందురుగాక. వేలకొలది గుఱ్ఱములతోను, గోవులతోను,మమ్ము నిత్యాది పూర్వవత్.

౩౨౬. సమింద్రగర్దభం మృణనువంతం పాపయాముయా ।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

వం॥ మాకు వినఁబడుచున్న నిందావచనములతో నపకీర్తిని గలిగించు గాడిదల వంటి మాశత్రువులను ఓయింద్రా! సంహరింపుము. వేలకొలఁది గుఱ్ఱములతోను గోవులతోను ఇత్యాది పూర్వవత్.

౩౨౭. పతాతికుండృణాచ్యా దూరంవాతోవనాదధి ।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

వం॥ వంకర వంకరగా నడచుచు నెడునుగా వీఁచు జంఝామారుతము మమ్ము విడచి యెక్కడకో అడవులదాఁటి పోవుఁగాక. వేలకొలఁది యశ్వములతో గోవుల ఇత్యాది పూర్వవత్.

౩౨౮. సర్వం పరిక్రోశం జహిజంభయా కృకదాశ్వమ్ ।

ఆతూన ఇంద్రశంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ॥

వం॥ మామీఁదఁ బగబట్టినవారి నందఱిని యింద్రా! చంపుము. మమ్ముఁ హింసింపఁ దలచినవానినిఁగూడఁ జంపుము. మమ్ము గోవులతోను, అశ్వములతోను, ఇత్యాది పూర్వవత్.

—:-౦-:—

సూక్తము. ౩౦.

(ఋషి - శునశ్శేఫుడు; ఛన్దస్సు - ౧౬ త్రిష్టుప్; తక్కినవన్నియు గాయత్రి; దేవత ౧-౧౬ ఇంద్రుఁడు; ౧౭-౧౯ అశ్వినీదేవతలు; ౨౦-౨౨ ఉషస్సులు.)

౩౨౯. ఆవఇన్ద్రం క్రివింయథా వాజయన్తః శతక్రతుమ్ । మంహిష్ఠంసిఞ్చ ఇన్దుభిః॥

వం॥ ఓ ఋత్విజులారా! అన్నమును గోరుచున్న మేము మీసంబంధియు, గొప్పవాఁడును, అనేక కర్మలొనర్చువాఁడును, అగు నింద్రుని నీటితో గోతినినింపినట్లు సోమరసములతో అభిషేకింతుము. (అనఁగా తృప్తిగాఁ ద్రావింతుమని తా॥)

౩౩౦. శతంవాయః శుచీనాం సహస్రంవా సమాశిరామ్ । ఏదునిమ్నం నరీయతే॥

దం॥ నూర్లకొలఁది వేలకొలఁది పవిత్రమయిన ఆశిరముతోఁ (మరగించిన పాలు మొదలగు వస్తువులు సోమములోఁ గల్పుదురు. వానికాశిరమని నామము) గూడిన సోమముల మొత్తము పల్లపునేలను నీళ్లుచేరునట్లు ఏయింద్రునిఁ జేరునో, యా యింద్రుఁడు మమ్ము (అనుగ్రహించుఁగాక.)

౩౩౧. సంయన్మదాయ శుష్మిణ ఏనాహ్యస్యోదరే । సముద్రో నవ్యచోదధే॥

దం॥ సముద్రములో నీరుచేరినట్లు పూర్వోక్తమయిన యేశతసహస్ర సోమములు బలవంతుఁడయిన యే యింద్రుని మదముకొఱకగునో, ఆయింద్రుని యుదరమందు ఈరసము వ్యాప్తిని జెందుఁగాక.

౩౩౨. అయము తే సమతసికపోతఇవ గర్భధిమ్ । వచస్తచ్చిన్న ఓహసే॥

దం॥ గర్భధారణ యోగ్యతకల ఆడ పావురమును మగపావురము చేరునట్లు నీ కొఱకుఁ జేయఁబడిన ఈ కనఁబడుచున్న సోమముకూడ నోయింద్రా! నిన్ను జేరును. కనుక నే మాస్తుతులను నీవు బొందుచున్నావు.

౩౩౩. స్తోత్రంరాధానాం పతేగిర్వాహో వీరయస్య తే । విభూతిరస్తు సూనృతా॥

దం॥ ఇంద్రా! నీవు ధనములకుఁ బతివి. వీరుఁడా! ఏ నీస్తోత్రమును ,సంపదయు సత్యము-ప్రియము-నగునుగాక,

౩౩౪. ఊర్ధ్వస్తిష్ఠానఊతయే స్మిన్వాజేశతక్రతో । సమన్యేషు బ్రవావహై॥

దం॥ ఓ శతక్రతూ! (=అనేక పనులుచేయువాఁడు) ఈ సంభవించిన యుద్ధమందు మారక్షణకొఱకు ఉత్సుకుఁడవై యుండుము. నీవును నేనును ఇతర కార్యముల విషయమై మాట్లాడుకొందము.

౩౩౫. యోగేయోగేతవ స్తరంవాజే వాజేహవామహే ।

సఖాయ ఇన్ద్రమూతయే॥

వ॥ ప్రతికర్మ ప్రారంభమందును ప్రతి యుద్ధమందును మిక్కిలి బలవంతుఁడగు నింద్రుని మారక్షణకొఱకు సఖులలెఁ బిలుచుచున్నాము.

౩౩౬. ఆఘాగమద్యది శ్రవత్సహస్రిణీభిరూతిభిః । వాజేభిరుపనో హవమ్॥

వ॥ ఇంద్రుఁడుగాని మాపిలుపులు వింటె వెంటనే వేలకొలది రక్షణలతోను, అన్నములతోను, మాసమీపమునకు వచ్చును.

౩౩౭. అను ప్రత్నస్యౌకసో హువే తువిప్రతింనరమ్ । యంతే పూర్వంపితా హువే॥

వ॥ ఏ నిన్ను మాతండ్రి పూర్వము పిలిచెనో ఆనిన్ను పురాతన స్థానమునుండి (అనఁగా స్వర్గము) అందఱి యజమానులవద్దకుఁ బోవుచుండు యింద్రా! పిలుచుచున్నాను. అందఱిచేతఁ గోరఁదగినవాఁడవును బహుమందిచేతఁ బిలువఁబడువాఁడవును అయి సఖుఁడవయిన యింద్రా! ఆ నిన్ను స్తుతికర్తల కొఱకుఁ బ్రార్థించుచున్నాము.

౩౩౮. తంత్వావయం విశ్వవారాశాస్మహే పురుహూతా । సఖేవసోజరితృభ్యః॥

వ॥ అందఱిచేతఁ గోరఁదగినవాఁడవును బహుమందిచేతఁ బిలువఁబడువాఁడవును అయి సఖుఁడవయిన యింద్రా! ఆనిన్ను స్తుతికర్తలకొఱకుఁ బ్రార్థించుచున్నాము

౩౩౯. అస్మాకం శిప్రిణీనాం సోమపాః సోమపావ్నామ్ । సఖేవజ్రి న్త్సఖీనామ్।

వ॥ సోమపానముచేయునట్టియు, సఖుఁడవయినట్టియు, వజ్రముతోఁ గూడినట్టియు, నోయింద్రా! సఖులమయి సోమపానము సేయుమాకు పొడుగాటి ముక్కులుగల వాటిని (గవాశ్వములని తా॥) ఇమ్ము.

౩౪౦. తథాతదస్తు సోమపాః సఖేవజ్రి న్తథాకృణు ।యథాత ఉశ్మసీష్టయే॥

వ॥ సోమపాయివియు, సఖుఁడవును, వజ్రముగల వాఁడవునగు నోయింద్రా! మే మెట్లు కోరుచున్నామో అట్లు, (మా) కావలసిన విషయము అగునుగాక.

౩౮౧. రేవతీర్నః సధమాద ఇన్ద్రేసన్తుతువివాజాః । క్షుమన్తోయాభిర్మదేమ॥

దం॥ అన్నవంతులమగు మేము ఏగోవులతో ఆనందించుచున్నామో, ఇంద్రుఁడు కూడ మాతో నానందించితే, ఆగోవులు మాకు ధనవంతములై యుండును. (ఇచట ధనము లన్నవి పాలునేయిమొదలగునవే.)

౩౮౨. ఆఘత్వావాన్త్మనాప్తస్తోతృభ్యో ధృష్ణవియానః । ఋణోరక్షన్న చక్ర్యోః॥

దం॥ ప్రగల్భుఁడవయిన ఓ యింద్రా! నీవంటివాఁడు ప్రార్థింపఁబడి తనంతతానే ఆప్తుఁడయి ఈమంత్రములతో స్తుతించినవారికి అవశ్యము (కోరికలు) రథచక్రములకు ఇరుసు (=అక్షము) అమర్చినట్లు తెచ్చియిచ్చునుగాక.

౩౮౩. ఆయద్దువః శతక్రతవా కామంజరితౄణామ్ । ఋణోరక్షం నశచీభిః॥

దం॥ స్తుతించువారు ఏధనమును బొందఁదగుదురో, ఆకోర్కెను స్తుతికర్తలకు ఓ శతక్రతూ! (ఇంద్రా!) ఇరుసును ఆపనులతో (బండికి)ఁగూర్చునట్లు కూర్చుదువు.

౩౮౪. శశ్వదిన్ద్రః పోప్రుథద్భిర్జిగాయనానదద్భిః శాశ్వసద్భిర్ధనాని ।
సనోహిరణ్యరథం దంసనావాన్త్సనః సనితాసనయే సనోదాత్॥

దం॥ ఫూ అని (నోటితో) ధ్వనించుచున్నట్టి, సకిలించుచున్నట్టి, శ్వాసలువదులు చున్నట్టి, గుఱ్ఱములతో సర్వదా ధనములను జయించెను. పనివాఁడును దాతయునగు నాయింద్రుఁడు మేము వాడుకొనుటకై బంగారు రథము నిచ్చెను.

౩౮౫. అశ్వినా వశ్వావత్యేషా యాతం శవీరయా । గోమద్దస్రా హిరణ్యవత్॥

దం॥ ఓ యశ్వినులారా! గుఱ్ఱములనేకములు గలిగిన రథమున ననేకములన్నములు మోయించుకొనుచు రండు. అశ్వినులారా! (మాయిల్లు) గోవులుకలది బంగారము కలది యగునుగాక.

౩౮౬. సమానయోజనో హి వాంరథో దస్రావమర్త్యః । సముద్రే అశ్వినేయతే॥

సం॥ ఓ యశ్వినులారా! మీయిద్దఱికి నొక్కతే రథము ఏవోటను అడ్డులేని గమనముకలదై కూర్పఁబడినది. అది సముద్రమునందును నడచుచున్నది కదా!

౩౪౭. న్యఘ్న్యస్య మూర్ధని చక్రం రథస్య యేమథుః । పరి ద్యామన్యదీయతే॥

దం॥ అశ్వినులారా! విరుగఁగొట్టుటకు శక్యముకాని పర్వతశిఖరమున నొకచక్రమును, ద్యులోక మంతట నొకచక్రమును ఉంచి, మీరు తిరుగుచున్నారు.

౩౪౮. కస్త ఉషః కధప్రియే భుజే మర్తో అమర్త్యే । కన్నక్షసే విభావరి॥

దం॥ స్తుతిప్రియురాలవు మరణములేని ఓ ఉషస్సా! (దేవతగాఁ జెప్పఁబడు) నీ భోగమునకు మనుష్యుఁడెవ్వఁడు? విశేష కాంతిగలదానా! ఎవ్వనిఁ బొందుచున్నావు? (నిన్ను సుఖింపఁజేయఁ జాలిన పురుషుఁడెవ్వఁడు లేనంతటి మహిమనీకుఁ గలదని తా॥)

౩౪౯. వయం హి తే అమన్మహ్యాన్తాదా పరాకాత్ । అశ్వే న చిత్రే అరుషి॥

దం॥ వ్యాపించు స్వభావమును చిత్రమయిన రంగులును గల ఓ ఉషస్సా! దగ్గరగాఁ గాని దూరముగాఁగాని నీస్వరూపము తెలియలేము.

౩౫౦. త్వం త్యేభిరా గహి వాజేభిర్దుహితర్దివః । అస్మే రయిం నిధారయ॥

దం॥ ద్యులోక దేవతకు గూతురవైన ఉషోదేవీ! ఆయన్నములతో రమ్ము. మాకు ధనముగలుగఁ జేయుము.

దం॥ (శునశ్శేఫుడను ఋషికుమారుని యజ్ఞ పశువునుగాఁ గట్టినపుడు అతఁడు వరుణుని మరుత్తులను అగ్నిని అశ్వినులు మొదలగు నాయా దేవతలను స్తుతించినాఁడని కథ. ఆవెనుక నా యా దేవతల మంత్రములన్నియు నాతడు దేవతలను స్తుతించినవే యని.)

—:-o-:—

## అ ను వా క ము. ౭.

---

### సూ క్త ము. ౩౧.

(ఋషి - అంగిరసపుత్రుఁడగు హిరణ్యస్తూపుఁడు; ఛన్దస్సు - ౮-౧౬, ౧౮, త్రిష్టుప్; తక్కినవి జగతీఛన్దస్సు; దేవత - అగ్ని.)

౩౫౧. త్వమగ్నే ప్రథమో అఙ్గిరా ఋషిర్దేవో దేవానామభవః శివః సఖా ।
తవ వ్రతే కవయో విద్మనాపసోఽజాయన్త మరుతో భ్రాజదృష్టయః॥

దం॥ ఓ యగ్నీ! నీవు మొదటి యాంగిరస ఋషివయితివి. నీవు దేవుఁడవయి యితర దేవతలకు సఖుఁడవయితివి. మేధావంతులును జ్ఞానముకలవారును ప్రకాశించు నాయుధములు కలవారునై మరుత్తులు, నీవ్రతమందు (=కర్మలోఁ) బుట్టిరి.

౩౫౨. త్వమగ్నే ప్రథమో అఙ్గిరస్తమః కవిర్దేవానాం పరిభూషసి వ్రతమ్ ।
విభుర్విశ్వస్మై భువనాయ మేధిరో ద్విమాతా శయుః కతిధా చిదాయవే॥

దం॥ ఓ యగ్నీ! నీవు అంగిరసులలో ముఖ్యుఁడవు. మేధావంతుఁడవు. ఇతర దేవతల వ్రతము నలంకరించుచున్నావు. సర్వప్రపంచమునకు బహువిధమయి, యిద్దఱు తల్లులవాఁడవై (భూలోక-ద్యులోకములుగాని-రెండరణులుగాని) మానవులకొఱకు ననేక ప్రకారములుగా నంతట నుందువు.

౩౫౩. త్వమగ్నే ప్రథమో మాతరిశ్వన ఆవిర్భవ సుక్రతూయా వివస్వతే ।
అరేజేతాం రోదసీ హోతృవూర్యే సఘ్నోర్భారమయజో మహో వసో॥

దం॥ ఓ యగ్నీ! నీవు వాయువునకు ముందుండువాఁడవు. సత్కర్మ చేయుచున్న యజమానునికొఱకావిర్భవింపుము. భూమ్యాకాశములు (నీసామర్థ్యముఁజూచి) గడగడ వడఁకుచున్నవి. హోతలలో శ్రేష్ఠుఁడయినవాని కర్మలో భారమును సహించితివి. నివాసహేతువగు నోయగ్నీ! పూజ్యులయిన దేవతలకొఱకు యాగము చేసితివి. దేవతల యజించితివి.

౩౫౪. త్వమగ్నే మనవే ద్యామవాశయః పురూరవసే సుకృతే సుకృత్తరః ।

శ్వాత్రేణ యత్పిత్రో ర్ముచ్యసే పర్యా త్వా పూర్వమనయ న్నాపరం పునః॥

దం॥ ఓ యగ్నీ! నీవు మనువునకు ద్యులోకము తెలియఁజెప్పితివి. (కర్మలవల్ల ద్యులోకము వచ్చునని చెప్పెనట) సత్కర్మ చేసిన పురూరవునకు శోభనఫలము నిచ్చితివి. గట్టిగా మథింపఁగాఁ దల్లిదండ్రులనుండి (=అరణులనుండి) పుట్టినప్పుడు నిన్ను (వేదికి) తూర్పుదిక్కునకుఁ దెచ్చిరి. (అదే యాహవనీయము) తరువాతఁ బశ్చిమ దిక్కున నిల్పిరి. (అది గార్హపత్యము)

౩౫౫. త్వమగ్నే వృషభః పుష్టివర్ధన ఉద్యతస్రుచే భవసి శ్రవాయ్యః ।

య ఆహుతిం పరి వేదా వషట్కృతి మేకాయు రగ్రే విశ ఆవివాససి॥

దం॥ ఓ యగ్నీ! నీవు మా కోర్కెలను వర్షింతువు. పుష్టినివృద్ధిసేతువు. ఎత్తిన స్రుక్కుగల (యజమానుఁడు) మంత్రములు నీకు వినిపించును. వషట్కారముతో నాహుతిని సమర్పించును. ముఖ్యాన్నముగల యో యగ్నీ! నీవు ముందుగా యజమానునకుఁ బ్రజలను (సంతతిని-సేవకులను) కలిగింతువు.

౩౫౬. త్వమగ్నే వృజినవర్తనిం నరం సక్మన్ పిపర్షి విదథే విచర్షణే ।

యః శూరసాతా పరితక్మ్యే ధనే దభ్రేభిశ్చిత్సమృతా హంసి భూయసః॥

దం॥ విశేషజ్ఞానముగల యగ్నీ! పాపవర్తనముగల నరుని యోగ్యకర్మయందుఁ గూర్తువు. ధనముపొందునిమిత్తము శూరులుచేయఁదగిన యుద్ధము చేయవలసివచ్చి నపుడు ప్రాభులయిన శత్రువులను నీవు చంపుచున్నావు.

౩౫౭. త్వం తమగ్నే అమృతత్వ ఉత్తమే మర్తం దధాసి శ్రవసే దివేదివే ।

యస్తాతృషాణ ఉభయాయ జన్మనే మయః కృణోషి ప్రయ ఆ చ సూరయే॥

దం॥ ఓ యగ్నీ! నీవు అట్టి మనుష్యుని ప్రతిదినమందును అన్నమునిమిత్తము మరణరహితపదవియందుంతువు. ఏ యజమానుడు ద్విపాదచతుష్పాదజంతువుల కొఱకుఁ గోర్కెగలవాఁడో, వానికి సుఖమును అన్నమును బూర్తిగానిత్తువు.

౩౫౮. త్వంనో అగ్నేసనయే ధనానాం యశసంకారుం కృణుహి స్తవానః ।

ఋధ్యామకర్మాపసానవేనదేవై ద్యావాపృథివీ ప్రావతంనః॥

వం॥ ఓ యగ్నీ! స్తుతింపఁబడి మాకుధనము లిచ్చుటకై కీర్తివంతుఁడును, కర్మల నాచరించువాఁడునగు కొమారునిమ్ము. (కుటుంబములో) క్రొత్తగా వచ్చినవానితోఁ గూడి యాగములాచరింతుము. భూమ్యంతరిక్షములు మమ్ము రక్షించుఁగాక.

౩౫౯. త్వంనో అగ్నే పిత్రోరుపస్థ ఆదేవో దేవేష్వనవద్య జాగృవిః॥

తనూకృద్బోధిప్రమతిశ్చ కారవేత్వం కల్యాణవసువిశ్వ మోపిషే॥

దం॥ దోషరహితాగ్నీ! దేవతోత్తముఁడా! తెలివిగలవాఁడా! తలిదండ్రుల (ద్యావాభూముల) సమీపమందుండినవాఁడవై మాకుఁ (బుత్రరూప) శరీరమును బుట్టించి యనుగ్రహించుము. కర్మజేయువానియందు మంచిమనసుతో నుండుము. మంగళరూపుఁడవగు నగ్నీ! సర్వధనమును గ్రుమ్మరించుము.

౩౬౦. త్వమగ్నే ప్రమతి స్త్వం పితాసిన స్త్వం వయస్కృత్తవ జామయో వయమ్ ।

సంత్వారాయః శతినః సంసహస్రిణః సువీరంయంతి వ్రతపామదాభ్య॥

జందు॥ అగ్నీ! నీవు మంచిబుద్ధిగలవాఁడవు. మాకునీవు పాలకుఁడవు. ఆయుస్సు నిచ్చువాఁడవు. మేము (కర్మకులము) నీకు బంధువులము. ఇతరులకు లొంగనివాఁడా! నూర్లకొలఁది వేలకొలఁది ధనములు; మంచిపురుషులు కలిగి కర్మను బరిపాలించు నిన్ను; బొందుచున్నవి.

౩౬౧. త్వామగ్నే ప్రథమమాయు మాయవే దేవా అకృణ్వన్నహుషస్య విశ్పతిమ్ ।

ఇళామకృణ్వ న్మనుషస్య శాసనీంపితుర్యత్పుత్రో మమకస్యజాయతే॥

దం॥ అగ్నీ! పూర్వము దేవతలు మనుష్యరూపుఁడగు నహుషునకు మనుష్య రూపసేనాపతిగానిన్నుఁ జేసిరి- అగ్ని మనుష్యరూపుఁడయినమనుచక్రవర్తికి ఇళ యను పేరుగల కూతురిని ధర్మోపదేశము చేయుదానిని గలిగించిరి. ఎప్పుడు నా

తండ్రి (నావిషయము) ధనరూప సంబంధముగలవాఁడయినాఁడో, యాపురుష నీవు (నీవే) అతనికిఁ గొమారుఁడవు. (నేను కానని తా॥)

౩౧-౧౨. త్వంనో అగ్నే తవ దేవ పాయుభిర్మఘోనో రక్షతన్వశ్చ వన్ద్య ।

త్రాతా తోకస్య తనయే గవామస్య నిమేషం రక్షమాణ స్తవవ్రతే॥

భా॥ స్తుతింపఁదగిన ఓ యగ్నీ! దేవా! నీరక్షణలచేత ధనవంతులమైన మమ్మును బాలించుము. కొమాళులనుగూడ రక్షింపుము. మనుమలు నీవ్రతమునందు నిరంతరమును రక్షింపఁబడుచుండ వారి గోవులను రక్షించువాఁడవయియుండుము.

౩౧-౧౩. త్వమగ్నే యజ్యవే పాయు రన్తరోఽనిషఙ్గాయ చతురక్ష ఇధ్యసే ।

యో రాతహవ్యోఽవృకాయ ధాయసే కీరేశ్చిన్మన్త్రం మనసా వనోషి తమ్॥

భా॥ ఓ యగ్నీ! యజమానునిఁ బాలించువాఁడవై సమీపమున నుండుచు విఘ్నములు లేని యజ్ఞమునకు నాలుగింద్రియములతో మండుచున్నావు. ఎవఁడు (నీకు) హవిస్సు నిచ్చునో, ఆస్తుతికర్త పలికిన మంత్రమును మనసుతో యాచించుచున్నావు.

౩౧-౧౪. త్వమగ్న ఉరుశంసాయ వాఘతే స్పార్హం యద్రేక్ణః పరమం వనోషి తత్ ।

ఆధ్రస్య చిత్ప్రమతి రుచ్యసే పితా ప్రపాకం శాస్సి ప్రదిశో విదుష్టరః॥

భా॥ ఓ యగ్నీ! అనేకులు మెచ్చుకొన్న ఋత్విజునికొఱకు ఉత్తమమయి కోరఁదగిన ధనమేదో దానిని (అతనికి దొరుకవలెనని) కోరుచున్నావు. అన్నివిధములఁ బోషింపఁదగిన (దుర్బల) యజమానునిఁగూడ మద్ధిమంతుఁడగు తండ్రివలె పాలింతువని జెప్పఁబడుచున్నావు. బహుగాఁ దెలిసిన నీవు చిన్నవాఁడయిన యజమానునకు (కర్మలు) నేర్పుచున్నావు. దిక్కులను శాసించుచున్నావు.

౩౧-౧౫. త్వమగ్నే ప్రయతదక్షిణం నరం వర్మేవ స్యూతం పరిపాసి విశ్వతః ।

స్వాదుక్షద్మా యో వసతౌ స్యోనకృజ్జీవయాజం యజతే సోపమా దివః॥

దం॥ అగ్నీ! దక్షిణలను ఇచ్చిన యజమానునిఁ జక్కఁగాఁ గట్టిన కవచమువలె నంతటను రక్షించుచున్నావు. ఎవఁడు రుచియగు నన్నముగలవాఁడయి తనయింట నతిథులకు సుఖము గలిగించుచు జీవయజ్ఞమును (=జీవయాత్ర) గడపుచున్నాఁడో వాఁడు స్వర్గముతో సమానుఁడు.

౩౬౬. ఇమా మగ్నే శరణిం మీమృషో న ఇమ మధ్వానం యమగామ దూరాత్ ।
ఆపిః పితా ప్రమతిః సోమ్యానాం భృమి రస్యృషికృ న్మర్త్యానామ్॥

దం॥ ఓ యగ్నీ! మా వ్రతలోపమును క్షమించుము. (నీ సేవమాని) ఈ దూర మార్గమునకు వచ్చితిమి. దానినిఁగూడ క్షమింపుము. సోమార్హులయిన మనుష్యులాశ్రయింపఁదగిన తండ్రివి. బహుబుద్ధిమంతుఁడవు. కర్మనిర్వాహకుఁడవు. దర్శనమిచ్చువాఁడవును.

౩౬౭. మనుష్వ దగ్నే అఙ్గిరస్వ దఙ్గిరో యయాతివ త్సదనే పూర్వవచ్ఛుచే ।
అచ్ఛ యాహ్యావహా దైవ్యం జన మాసాదయ బర్హిషి యక్షి చ ప్రియమ్॥

దం॥ శుచివగు నో యగ్నీ! గమనించు స్వభావముకలవాఁడా! ఎదురుగా మా దేవసదన స్థానమునకు; మనువుయొక్క యయాతియొక్క అంగిరునియొక్క సదనములకుఁ బూర్వము పోయినట్లు; నడువుము. దేవసంఘమును దీసికొనిరమ్ము. దర్భలమీఁద గూర్చుండఁబెట్టుము. ఇష్టమగు హవిస్సులనిమ్ము.

౩౬౮. ఏతేనాగ్నే బ్రహ్మణా వావృధస్వ శక్తీ వా యత్తే చకృమా విదా వా ।
ఉత ప్రణేష్య భివస్యో అస్మాన్త్సం నః సృజ సుమత్యా వాజవత్యా॥

దం॥ ఓ యగ్నీ! మా సామర్థ్యముచేతను జ్ఞానముచేతను నేనిని జేసితిమో ఆయీ మంత్రముచేత వృద్ధినందుము. మఱియు మమ్ములను ధనముగల శ్రీయముగలవారిం జేయుము. అన్నముగలిగించు మంచిబుద్ధికలవారినిగాఁ జేయుము.

—:-O-:—

## సూక్తము. ౩౨.

(ఋషి - ఆంగిరస పుత్రుండగు హిరణ్యస్తూపుండు; ఛన్దస్సు - త్రిష్టుప్; దేవత - ఇంద్రుండు)

౩౬౯. ఇన్ద్రస్యను వీర్యాణి ప్రవోచం యాని చకార ప్రథమాని వజ్రీ ।
అహన్నహి మన్వప స్తతర్ద ప్రవక్షణా అభిన త్పర్వతానామ్॥

వం॥ వజ్రమునుగలిగిన యింద్రుండు పూర్వమేకార్యములను చేసెనో, ఆముఖ్యములను శీఘ్రముగాం జెప్పెదను. అవేవనంగా- మేఘమును గొట్టెనాండు. ఉదకములను జీల్చి పడవేసెను. పర్వతములమీందనున్న నదులను బయలువఱచెను.

౩౭౦. అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష ।
వాశ్రా ఇవ ధేనవః స్యన్దమానా అఞ్జః సముద్ర మవజగ్ము రాపః॥

వం॥ పర్వతముమీందనున్న మేఘమును భేదించెను. బాగుగ విసరదగిన వజ్రమును త్వష్ట యీ యింద్రునికొఱకుం దయారుచేసెను. (మేఘమునుండి) స్రవించిన యుదకములు, దూడలనుగూర్చి గోవులుపడచునట్లు; సముద్రమునుగూర్చి చక్కంగా నడచినవి.

౩౭౧. వృషాయమాణో వృణీత సోమం త్రికద్రుకే ష్వపిబ త్సుతస్య ।
ఆసాయకం మఘవా దత్త వజ్ర మహ న్నేనం ప్రథమజా మహీనామ్॥

వం॥ వృషభమువలె నడుచుచు నింద్రుండు సోమమును గోరెను. త్రికద్రుకములను యాగములందు (ఇవి మూండుయాగములు) అభిషవించి సోమమును బానము చేసెను. ధనవంతుండయిన యింద్రుడు (శత్రు) బంధకమయిన వజ్రమును జేకొనెను. (దానితో) మేఘములన్నిటిలో మొట్టమొదటపుట్టిన మేఘమును గొట్టెను.

౩౭౨. యదిన్ద్రాహ న్ప్రథమజా మహీనామాన్మాయినా మమినాః ప్రోతమాయాః ।
ఆత్సూర్యం జనయ న్ద్యాముషాసం తాదీత్నా శత్రుం నకిలా వివిత్సే॥

ఎం॥ మఱియు నోయింద్రా! ఎపుడు మేఘములలో మొదటఁబుట్టిన మేఘమును గొట్టితివో, ఆతరువాత మాయావంతులయిన (అసురుల) మాయలను బాగుగాఁ బడఁగొట్టితివి. అనన్తరము. సూర్యుని, ఉషస్సును, ఆకాశమును, బుట్టించుచున్నావు. అపుడు నీశత్రువు మఱికనఁబడ లేదుకదా!

౩౨౩. అహన్వృత్రం వృత్రతరం వ్యంస మింద్రో వజ్రేణ మహతా వధేన ।
స్కంధాంసీవ కులిశేనా వివృక్ణాహిః శయత ఉపపృక్ పృథివ్యాః॥

దం॥ ఈయింద్రుఁడు గొప్పవధనొనరించునట్టి సూవజ్రముతో నంతట నావరించు వృత్రుని భుజములు తెగినవానిఁగా; బాగుగా ఛేదించు గొడ్డలితోఁ జెట్లస్కంధములు తెగఁగొట్టునట్లు; కొట్టెను. అంతటితో వృత్రుఁడు భూమిమీఁద సమీపమందుఁబడి యుండెను.

౩౨౪. అయోద్ధేవ దుర్మద ఆహి జుహ్వే మహావీరం తువిబాధ మృజీషమ్ ।
నాతారీ దస్యసమృతిం వధానాంసంరుజానాః పిపిష ఇన్ద్రశత్రుః॥

దం॥ దుర్గర్వముగల (వృత్రుఁడు) యుద్ధముచేయువారు లేనివాఁడువలె, మహావీరుఁడును, జాలమంది శత్రువులను సంహరించినవాఁడును, అగునింద్రుని (యుద్ధమునకు)ఁ బిలచెను. ఈ యింద్రుని దెబ్బలబాధను సహింపలేక (చంపఁబడినతరువాత) ఇంద్రశత్రువగు వృత్రుఁడు నదులను నలగఁగొట్టెను (అనఁగాఁ జచ్చిపోవునపుడు దొర్లినాఁడని తా॥)

౩౨౫. అపాదహస్తో అపృతన్య దిన్ద్ర మాస్య వజ్ర మధిసానౌ జఘాన ।
వృష్ణో వధ్రిః ప్రతిమానం బుభూషన్పురుత్రా వృత్రో అశయ ద్వ్యస్తః॥

దం॥ వృత్రుఁడు పాదములు హస్తములు లేనివాఁడయ్యును, నపుంసకుఁడు పుంస్త్వముగలవాఁడుగాఁగోరునట్లు; ఇంద్రునిపై యుద్ధమునకుఱికెను. కొండ చఱియవంటి వృత్రుని వక్షస్థలమందు (ఇంద్రుఁడు) వజ్రమును విసరెను. వృత్రుఁడన్ని యవయవములు చెదరి భూమిమీఁదఁ బడెను.

౩౭౬. నదంన భిన్న మముయా శయానం మనోరుహాణా అతి యన్త్యాపః ।
యాశ్చి ద్వృత్రో మహినా పర్యతిష్ఠ త్తాసామహిః పత్సుతఃశీ ర్బభూవ॥

దం॥ (బ్రతికియున్నపుడు) వృత్రుఁడు తనమహిమచేత నేయుదకమును చుట్టుకొని (క్రిందఁబడకుండఁ) బట్టియుండెనో, యాయుదకములు మనోహరములగుచు జనులకుఁ (గనఁబడుచు); ఒడ్డువిరిగిన చెఱువుదాటి పాఱునట్లు; ఈభూమియందుఁ బడియున్న వృత్రునిమీఁదనుండి పాఱినవి. వృత్రుఁడాయుదకముల పాదముల క్రిందఁబడి యుండెనట.

౩౭౭. నీచావయా అభవ ద్వృత్రపుత్రేన్ద్రో అస్యా అవవధ ర్జభార ।
ఉత్తరాసూ రధరః పుత్ర ఆసీ ద్దానుః శయే సహవత్సా న ధేనుః॥

దం॥ వృత్రునితల్లి వానిమీఁదఁ దనయవయవములు కప్పియుండెను. ఇంద్రుఁడు ఆమెక్రిందనున్న వృత్రునిమీఁద వజ్రమును విసరెను. దూడమీఁదనావు పడియుండు నట్లు వానిమీఁదఁ దల్లి చచ్చిపడియుండెను.

౩౭౮. అతిష్ఠన్తీనా మనివేశనానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరమ్ ।
వృత్రస్య నిణ్యం విచరన్త్యాపో దీర్ఘం తమ ఆశయ దిన్ద్రశత్రుః॥

దం॥ ఒకచోట నిలుకడలేక నడచు స్వభావములుగల యుదకముల మధ్యను మునిఁగియున్నందునఁ బేరులేక (కనఁబడక) యున్నవృత్రుని శరీరము నాక్రమించి యాయుదకములు ప్రవహించినవి. వృత్రుఁడచట దీర్ఘనిద్రను బొందెను. (చచ్చెను అని తా॥)

౩౭౯. దాసపత్నీ రహిగోపా అతిష్ఠన్ని రుద్ధా ఆపః పణినేవ గావః ।
అపాం బిలమపిహితం యదాసీద్వృత్రం జఘన్వాఁ అప తద్వవార॥

వ॥ దాసుఁడు తమకుఁబతిగాఁ గలవియు, వృత్రుని రక్షించినవియు,నగు నుదకములు పణియను రాక్షసునిచేత గుహాలో నావులునిరోధింపఁబడినట్లు నిరోధింపఁబడినవి. ఉదకముల ప్రవాహద్వారము మూఁతబడియున్నపుడు వృత్రహంతయగు నింద్రుఁడు ఆద్వారమును దెఱచెను. (దాసః=జగత్తును నశింపఁజేయువాఁడు అనివ్యుత్పత్తి).

౩౮౦. అశ్వ్యోవారో అభవస్తదిన్ద్ర సృకేయత్వా ప్రత్యహన్దేవ ఏకః।

అజయోగా అజయః శూరసోమమవా సృజఃసర్తవే సప్తసిన్ధూన్॥

వ॥ అద్వితీయుఁడై దీపించుచున్న వృత్రుఁడెపుడు వజ్రమందు నీకట్టుగాఁగొట్టెనో, అపుడు నీవు గుఱ్ఱముతోఁకవంటి వాడవయితివి. (అనఁగా గుఱ్ఱము తోఁకతో నీఁగల నెంత సులభముగాఁ దోలుకొనునో, అంత సులభముగా నాదెబ్బను ద్రోసివేసితి వని తా॥) ఓశూర! గోవులను (పణిగుహాలోదాఁచిన వాటినని తా॥) జయించి తెచ్చితివి. సోమమును దెచ్చితివి. ప్రవహించుటకై యేడునదులను సృజించితివి.

౩౮౧. నాస్మై విద్యున్నతన్యతుః సిషేధనయాం మిహమకిరద్ధ్రాదునించ।

ఇన్ద్రశ్చ యద్యుయుధాతే అహిశ్చోతా పరీభ్యో మఘవావిజిగ్యే॥

వ॥ (ఇంద్రవృత్రుల యుద్ధమున వృత్రుఁడు తన మాయతోఁ గల్పించి పంపిన) విద్యుత్తు ఇంద్రునిపైని బనిచేయలేకపోయెను. (అనఁగా నష్టములేదని తా॥) గర్జన నష్టలేకపోయెను. కురిపించిన వర్షముకూడ నష్టలేకపోయెను. మఱియు ధనవంతుఁడైన యింద్రుఁడు (వాఁడువేసిన) యితరములంగూడ జయించెను.

౩౮౨. అహేర్యాతారంకమపశ్య ఇన్ద్ర హృదియత్తే జఘ్నుషో భీరగచ్ఛత్।

నవచయన్నవతిం చస్రవన్తీః శ్యేనోనభీతో అతరోరజాంసి॥

వ॥ ఇంద్రుఁడా! తొంబదితొమ్మిది నదులను డేగవలె దాటితివి. వృత్రునిఁ జంపిన నీమనసునందు భయముకలిగితే వృత్రునిఁజంప దగువాని నితర పురుషునెవని జూచితివి: (ఎవరును లేరుగనుక భయముట్టు కలిగినని తా॥) కనుక భయము (వద్దు.)

# తృతీయాధ్యాయము.

—:-o-:—

## సూక్తము. 33.

(ఋషి-అంగిరస పుత్రుండగు హిరణ్యస్తూపుండు; దేవత - ఇంద్రుండు; ఛందస్సు - త్రిష్టుప్)

౩౭౪. ఓమ్ ఏతాయామోపగవ్యన్త ఇన్ద్రమస్మాకం సుప్రమతిం వావృధాతి ।

అనామృణః కువిదాదస్య రాయో గవాం కేతం పరమావర్జతేనః॥

దం॥ ఓ దేవతలారా! గోవులను దెచ్చుటకు రండు. మనమందఱముకలిసి యింద్రుని దగ్గఱకుం బోవుదము. ఆయింద్రుండు హింసకులు లేనివాడయి మనకు మనస్సంతోషమును బాగుగ వృద్ధిపఱచును. అనన్తరము ఆ యింద్రుడు ఈధనముయొక్కయు గోవులయొక్కయు, నుత్కృష్టమైన జ్ఞానమును మనకిచ్చును.

౩౭౫. ఉపేదహం ధనదామప్రతీతం జుష్టాం నశ్యేనో వసతిం పతామి ।

ఇన్ద్రం నమస్యన్నుపమేభిరర్కైర్యః స్తోతృభ్యో హవ్యో అస్తి యామన్॥

దం॥ స్తుతికర్తలకై నెవండు యుద్ధములలోం బిలువంబడునో, ధనమునిచ్చునట్టియు, నెదురులేనట్టియు, నాయింద్రుని; ఉపమానముగల స్తోత్రములతో నమస్కరించుచు నేను (యజమానుండు) తనపూర్వులు గట్టిన గూంటిని డేగ చేరునట్లు; చేరుదును.

౩౭౬. నిసర్వసేన ఇషుధీరసక్త సమర్యోగా అజతి యస్యవష్టి ।

చోష్కూయమాణ ఇన్ద్ర భూరివామం మాపణిర్భూరస్మదధిప్రవృద్ధ॥

దం॥ సమస్తసేనలతోం గూడినవాండయి ఇంద్రుండు అమ్ములపొదులను వీంపున సంధించెను. ఎవరిగోవులను (విడిపించుమని) గోరిన వాటినిం దెచ్చును. వృద్ధినొందునట్టి ఓ యింద్రా! విస్తారమయిన (గో) ధనమునిచ్చుచు మావిషయమై వర్తకుండవు కాకుము. (అనంగాం క్రయమును గోరకుమని తా॥)

దం॥ ఏడ్చుచున్నట్టియుఁ దినివేయుటకుఁ బూనినట్టియు నీవృత్రానుచరులను ఓ యింద్రా! నీవు ఆకాశము వెనుకప్రక్కను జంపితివి. వృత్రుని ద్యులోకము నుండి లాగి ఉత్కర్షతో దహించితివి. తరువాత సోమమునభిషవించి స్తుతించు యజమానుని స్తుతిని రక్షించితివి.

౩౯౧. చక్రాణాసః పరీణహం పృథివ్యా హిరణ్యేన మణినా శుంభమానాః ।
నహిన్వానాస స్తితిరుస్త ఇన్ద్రం పరిస్పశో అదధాత్సూర్యేణ॥

దం॥ ఏవృత్రుని పరివారము భూమి నాచ్ఛాదించుచు బంగారముతోఁగూడిన మణులతోఁ బ్రకాశించుచు వృద్ధినొందుచున్నవారునై యుండిరో, వారు ఇంద్రుని జయింపలేకపోయిరి. అపుడింద్రుఁడు బాధకులయినవారిని సూర్యునివెనుకకుఁ దూలఁగొట్టెను.

౩౯౨. పరియదిన్ద్ర రోదసీ ఉభే అబుభోజీ ర్మహినా విశ్వతః సీమ్ ।
అమన్యమానా అభిమన్యమానై ర్నిర్బ్రహ్మభి రధమో దస్యు మిన్ద్ర॥

దం॥ ఇంద్రుఁడా! నీమహిమచేత భూమ్యాకాశముల రెంటినంతట నెపుడాక్రమించి అనుభవించితివో, యపుడు మంత్రార్థము నెఱుఁగని యజమానులనుగూడ నభిమానించుచున్న మంత్రములతో దొంగయగు (వృత్రుని) మథించితివి.

౩౯౩. న యేదివః పృథివ్యా అన్తమాపుర్న మాయాభి ర్ధనదాం పర్యభూవన్ ।
యుజం వజ్రం వృషభశ్చక్ర ఇన్ద్రో నిర్జ్యోతిషా తమసో గా అదుక్షత్॥

దం॥ ఏయుదకములు ద్యులోకమునుండి ఎపుడు భూలోకముయొక్క అంతమునకు రాలేకపోయినవో; ధనప్రదయగు భూమిని సస్యోపకార కర్మలచేత వ్యాపింపలేకపోయినవో; అపుడు ఇంద్రుఁడు వజ్రమును (చేతిలో) సంధిచెను. ఆయుదకములను వెలుగుచున్న వజ్రముతో నంధకారమునుండి (మేఘమునుండియని తా॥) శేషము లేకపిండఁ గార్చెను.

౩౮౪. అనుస్వధా మక్షరన్నాపో అస్యావర్ధత మధ్య ఆ నావ్యానామ్ ।

సధ్రీచీనేన మనసా తమిన్ద్ర ఓజిష్ఠేన హన్మనాహన్నభిద్యూన్ ॥

వం॥ జలములు ఈ యింద్రుని అన్నమునుగుఱించి (మేఘములనుండి) కారినవి. అపుడీవృత్రుఁడు ఓడలతో దాటఁదగిన (లోతగు) ఉదకములమధ్య సంతతము వృద్ధి పొందెను. తరువాత సరిచుచున్న మనసుగల ఇంద్రుని మిక్కిలి దృఢమై సంహారమునకు సాధనమయిన వజ్రముతో కొన్నిదినములు కనిపెట్టి; మఱియుం జంపెను.

౩౮౫. న్యావిధ్య దిలీబిశస్య దృళ్హా విశృఙ్గిణ మభినచ్ఛుష్ణమిన్ద్రః ।

యావత్తరో మఘవ న్యావదోజో వజ్రేణ శత్రు మవధీః పృతన్యుమ్ ॥

వం॥ భూబిలమునందు శయనించియున్న వృత్రునిచేత నిరోధింపఁబడిన(ఉదకములను) ఇంద్రుఁడు బాగుగాఁ బొడిచెను. తరువాత జగత్తును శోషింపఁజేయుచున్న కొమ్ములు గల (కొమ్ములవంటి ఆయుధములని తా॥) వృత్రుని భేదించెను. ధనవంతుఁడవగు నోయింద్రా! నీకెంత బలమును వేగమును గలవో వాటియంతటితోను గూడికొని నీవు యుద్ధముఁ గోరుచున్న శత్రువుని వజ్రముతోఁ జంపితివి.

౩౮౬. అభిసిధ్మో అజిగా దస్య శత్రూ న్వితిగ్మేన వృషభేణా పురోభేత్ ।

సంవజ్రే ణాసృజ ద్వృత్రమిన్ద్రః ప్రస్వాం మతిమతిర చ్ఛాశదానః ॥

వం॥ ఈయింద్రుని సాధనమగు వజ్రము శత్రువులను గుఱిచూచి పడెను. ఆయింద్రుఁడు తీక్ష్ణము; శ్రేష్ఠమునగు నావజ్రముతో శత్రుపట్టణములను చిందరవందరచేసెను. తరువాత నింద్రుఁడు వృత్రునిమీఁద వజ్రమునైచెను. వృత్రుని హింసించుచుఁ దనబుద్ధిని మిక్కిలి వృద్ధిపఱచెను. (అనఁగా సంతసించెనని తా॥)

౩౮౭. ఆవః కుత్స మిన్ద్ర యస్మిఞ్చాక న్ప్రావో యుధ్యన్తం వృషభం దశద్యుమ్ ।

శఫచ్యుతో రేణు ర్నక్షత ద్యాముచ్ఛ్వైత్రేయో నృషాహ్యాయ తస్థౌ ॥

వ॥ ఇంద్రా! ఎవనియందు స్తుతిని గోరితివో; ఆ శ్రేష్ఠుఁడును యుద్ధముచేయుచున్న వాఁడునగు కుత్సుని రక్షించితివి. నీగుఱ్ఱపు డెక్కలనుండి యెగిరిన ధూళి ద్యులోకము నావరించినది. (శత్రుభయమువల్ల నీటిలోదాగియున్న) శ్విత్రాపుత్రుఁడు (నీదయవల్ల) బయటికివచ్చి శత్రువుని నోడించెను.

౩౯౮. ఆవః శమం వృషభం తుగ్ర్యాసు క్షేత్రజేషే మఘవ ఞ్ఛ్విత్ర్యంగామ్ ।
జ్యోక్చిదత్ర తస్థివాంసో అక్ర ఞ్ఛత్రూయతా మధరా వేదనాకః॥

వ॥ ధనవంతుఁడవగు నింద్రా! భూమినిమిత్తము శత్రువులతో యుద్ధము చేయునపుడు శాంతుఁడును గుణశ్రేష్ఠుఁడునగు శ్విత్రియుని, నీటిలోమునిఁగినవానిని రక్షించితివి. మాయుద్ధమందుఁ జిరకాలమువఱకు నిలచియున్నవారై పగఁబట్టినవారికి హీనమగు దుఃఖమును గలిగించితివి.

—:-౦-:—

## సూక్తము. ౩౪.

(ఋషి - హిరణ్యస్తూపుఁడు; దేవత - అశ్వినీదేవతలు. ఛన్దస్సు - ౯. ౧౨ త్రిష్టుప్; తక్కినవి జగతీ.)

౩౯౯. త్రిశ్చిన్నో అద్యాభవతం నవేదసా విభుర్వాం యామ ఉతరాతి రశ్వినా ।
యువోర్హి యన్త్రంహిమ్యేవ వాససో భ్యాయంసేన్యాభవతం మనీషిభిః॥

వ॥ మేధావంతులయిన యశ్వినీదేవతలారా! మూఁడుమార్లును (సవనత్రయమందని తా॥) ఈకర్మలో మాకొఱకురండు. మీగమనమునకు సాధనమయినరథము సర్వత్ర సంచరించును. మీదానముకూడ సర్వవ్యాపియే. మీయిద్దఱి యన్యోన్య సంబధము; (సూర్యకిరణములతోఁ గూడిన) పగఁటికి, మంచుతోఁగూడినరాత్రికిని, గల సంబంధమువలె విడువనిది. మీరు ఋత్విజులచేత నియమింపఁబడినవారు కండు. (వారియధీనులయి యుండుడని తా॥)

౪౦౦. త్రయః పవయో మధువాహనే రథే సోమస్య వేనామను విశ్వఇద్విదుః ।
త్రయః స్కమ్భాసః స్కభితాస ఆరభే త్రిర్నక్తంయాథ స్త్రి ర్వశ్వినాదివా॥

వ॥ మధురవస్తువులను మోయుచున్న (అశ్వినుల) రథమునకు మూఁడుచక్రములు వజ్రమువలె కఠినములైనవి కలవు. సర్వదేవతలును (మీప్రయాణమును) సుందరముగా చంద్రునిభార్య వేనను గురించియే యని యనుకొనుచున్నారు. రథమును మీరు పట్టుకొనుటకు మూఁడు స్తంభములు నిలుపఁబడినవి. మూఁడుమార్లు రాత్రియందును, మూఁడుమార్లు పగటియందును, (ఆరథముతోఁ) దిరుగుచున్నారు, (అనగాఁ జంద్రుఁడు వేనను పెండ్లియాడునపుడు ఆపెండ్లి చూచుట కశ్వినులు ప్రయాణమైరట!)

౪౦౧. సమానే అహన్త్రి రవద్యగోహనా త్రిరద్యయజ్ఞం మధునా మిమిక్షతమ్ ।

త్రిర్వాజవతీరిషో అశ్వినా యువం దోషా అస్మభ్య ముషసశ్చ పిన్వతమ్॥

వ॥ అశ్వినులారా! మీరిద్దఱు ఒక్కదినమందు మూఁడుమార్లు (కర్మలలోని) దోషములను గప్పిపుచ్చువారు కండు. ఈనాఁటి యజ్ఞమందు పాలిన్నియు మూఁడు మార్లు ఇండు. రాత్రులందును, దినములందును, మాకు బలమును కలిగించు అన్నములనిండు.

౪౦౨. త్రిర్వర్తి ర్యాతం త్రిరనువ్రతే జనే త్రిస్సుప్రావ్యే త్రేధేవ శిక్షతమ్ ।

త్రిర్నాన్ద్యం వహత మశ్వినా యువం త్రిఃపృక్షో అస్మే అక్షరేవ పిన్వతమ్॥

వ॥ అశ్వినులారా! మాజీవనాధారమగు గృహమునకు మీరిద్దఱును మూఁడు మార్లు రండు. మాస్నేహితునింటికి మూఁడుమార్లు రండు. సంరక్షణీయులమగు మాకు మూఁడువిధముల కర్మలను నేర్పుఁడు. సంతోషకరమయిన కర్మఫలములను మూఁడు మార్లిండు. మేఘముదకమునిచ్చినట్లు మూఁడుమార్లు మాకన్నమునిండు.

౪౦౩. త్రిర్నోరయిం వహత మశ్వినా యువం త్రిర్దేవతాతా త్రిరుతావతంధియః ।

త్రిఃసౌభగత్వం త్రిరుతశ్రవాంసిన స్త్రిష్ఠంవాం సూరేదుహితారుహద్రథమ్॥

వ॥ అశ్వినులారా! మాకుధనమును ముమ్మార్లిండు. దేవయుక్త కర్మయందు ముమ్మార్లురండు. మఱియు మాబుద్ధులను ముమ్మార్లు రక్షింపుఁడు. సౌభాగ్యము కూడ ముమ్మార్లిండు. మాకు నన్నములు ముమ్మార్లీండు. మూఁడుచక్రాలమీఁద నున్న మీరథమును సూర్యుని కూతురు ఎక్కియున్నది.

౪౦౪. త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా త్రిఃపార్థివాని త్రిరుదత్త మద్భ్యః ।

ఓమానంశం యోర్మమకాయసూనవే త్రిధాతుశర్మవహతంశుభస్పతీ॥

ద౧॥ అశ్వినులారా! ద్యులోకమందుఁబుట్టిన యౌషధములు, మూఁడు మార్లు పృథివియందుఁ బుట్టినవి, మూఁడుమార్లు ఆకాశమందుఁ బుట్టినవి, మూఁడుమార్లు ఇండు. (బృహస్పతికొడుకయిన) శంయువనువాని కిచ్చిన సుఖమును నాకొడుకునకిండు. శుభమయిన యౌషధములకధికారులారా! మూఁడు ధాతువులకును (వాతపిత్త కఫ) సుఖమును గలిగించుఁడు.

౪౦౫. త్రిర్నో అశ్వినా యజతా దివేదివే పరిత్రిధాతు పృథివీ మశాయతమ్ ।

త్రిస్రో నాసత్యా రథ్యా పరావత ఆత్మేవ వాతః స్వసరాణి గచ్ఛతమ్॥

దం॥ అశ్వినులారా! పూజనీయులగు మీరు ప్రతి దినమును మా (వేది) భూమి యందు సంతటను మూఁడు పదనలుగాఁ బరువఁ బడిన దర్భలందు శయనింపుఁడు. ఓ రథస్వాములారా! ప్రాణవాయువులు శరీరావయవములను జేరునట్లు మూఁడు వేదులను జేరుదురుగాక. (ఐష్టిక- పాశుక-సౌమిక-అని మూఁడు.)

౪౦౬. త్రిరశ్వినా సింధుభిః సప్తమాతృభి స్త్రయఆహావా స్త్రేధా హవిష్కృతమ్ ।

తిస్రః పృథివీ రుపరిప్రవా దివో నాకం రక్షేథే ద్యుభి రక్తుభి ర్హితమ్॥

దం॥ ఏడుచోట్ల పుట్టిస్రవించు నీటితో (అభిషవము చేయఁబడెను.) మూఁడు ఆహవనములలో (=సోమముంచుకొను పాత్రలు-ద్రోణకలశ- ఆధవనీయ-పూతభృతు-) మూఁడువిధములుగా హవిస్సు చేయఁబడెను. పృథివ్యాది మూఁడులోకములమీఁదను నడచుచున్న మీరు ద్యులోకమందున్నటువంటియు, పగళ్లచేతను రాత్రులచేతను స్థాపింపఁబడినట్టియు, నాదిత్యుని రక్షించుచున్నారు.

౪౦౭. క్వ౩త్రీచక్రా త్రివృతో రథస్య క్వ౩త్రయో వన్ధురో యేసనీళాః ।

కదా యోగో వాజినో రాసభస్య యేనయజ్ఞం నాసత్యోపయాథః॥

దం॥ ఏరథముతో మాయజ్ఞసమీపమునకు వచ్చుచున్నారో; ఆమీరథమున ఓ యశ్వినులారా! మూఁడుచుట్లుగాఁజుట్ట ముక్కోణమైన నొగలు ఎక్కడనున్నదో,

మూఁడు చక్రములు మీరథమునకెక్కడనున్నవో; కూర్చుండుతావులలో నాధారముగా మూఁడు దండెలెక్కడఁగలవో; బలిష్ఠమయిన గాడిదె మీరథమున కెపుడు కూర్పఁబడెనో; ఇట్లుమాకెఱుఁగఁబడని రథముతో మాయజ్ఞమునకు రండు. (త్రిసికిలు= పిల్లవాళ్లు ప్రతిచోట వాడుకొనుచున్న మూఁడు చక్రాలబండివంటిదే యశ్వినులరథమట! దానికి గాడిదను పూన్తురట!)

౮౦౯. ఆనాసత్యా గచ్ఛతం హూయతే హవిర్మధ్వః పిబతం మధుపేభిరాసభిః ।
యువోర్హి పూర్వం సవితోషసో రథమృతాయ చిత్రం ఘృతవంత మిష్యతి॥

వ॥ ఓ యశ్వినులారా! (ఊకర్మనిష్ఠకు) రండు. మేమిచటికిఁ బిలుచుచున్నాము. మధురవస్తువులు త్రావఁదగిన మీనోటిలతో మధురమైన హవిస్సులను పానము సేయుఁడు. చిత్రమైన నేయిపూసిన మీరథమును సూర్యుఁడు ఉషఃకాలమునకు ముందె మాయజ్ఞమునకుఁ దోలునుగదా! (చక్రము తిరుగుచోట ఇరుసునకు ఆముదముఁ బూసినట్లు అశ్వినులరథమునకు నేయిపూసిరని తా॥)

౮౧౦. ఆనాసత్యా త్రిభి రేకాదశై రిహ దేవేభి ర్యాతం మధుపేయమశ్వినా ।
ప్రాయు స్తారిష్టం నీరపాంసి మృక్షతం సేధతం ద్వేషో భవతం సచాభువా॥

వ॥ ఓ అశ్వినులారా! ముప్పదిముగ్గురు దేవతలతోడను మధురమయిన సోమపానము కొఱకు ఈదేవయజనస్థానమునకు రండు. మాయాయుస్సును వృద్ధిసేయుఁడు. మాపాపములను నిర్మూలింపుఁడు. మామీఁద ద్వేషించినవారిని నశింపఁజేయుఁడు. మాతోఁ గలిసి యుండుఁడు.

౮౧౧. ఆనో అశ్వినా త్రివృతా రథేనా ర్వాఞ్చంరయిం వహతం సువీరమ్ ।
శృణ్వన్తా వామవసే జోహవీమి వృధే చనో భవతం వాజసాతౌ॥

వ॥ అశ్వినీదేవతలారా! త్రివృతరథముతో (ముప్పేకలుగాఁ గూర్చిన నొగలుకల) మాకభిముఖులై మంచివీరులుగల (పుత్ర-భృత్య) ధనమును గలుగఁజేయుఁడు. మేము చేయుస్తుతిని వినుచు, మారక్షణమునకై (రండని) మిమ్ముఁ బిలుచుచున్నాను. మాయుద్ధమందు జయమునకు మీరు కారణము కండు. (సాయపడుఁడని తా॥)

—:-౦-:—

## సూక్తము. ౩౫.

(ఋషి-హిరణ్యస్తూపుఁడు; ఛన్దస్సు - ౧. ౯; జగతీఛన్దస్సు; తక్కిన-త్రిష్టుప్; దేవత - సవితృఁడు)

౪.౧౧. హ్వయామ్యగ్నిం ప్రథమం స్వస్తయే హ్వయామి మిత్రావరుణా విహావసే ।
హ్వయామి రాత్రీం జగతోనివేశనీం హ్వయామి దేవం సవితారమూతయే॥

వం॥ మాకునాశము లేకుండుటకు మొట్టమొదఁట నగ్నిని బిలుచుచున్నాను. తరువాత మారక్షణకొఱకు మిత్రావరుణులఁ బిలుచుచున్నాను. నడచు జంతువులను స్వస్థానమునునుంచునట్టి రాత్రినిఁ బిలుచుచున్నాను. రక్షణకొఱకు సవితృ (సూర్య) దేవతను బిలుచుచున్నాను.

౪౧౨. ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ ।
హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్॥

వం॥ నల్లని లోకమునుండి మాటిమాటికి వచ్చుచు దేవతలను మనుష్యులను వారివారి చోట్లనుంచుచు; లేక, ప్రాణమును, శరీరమును, వాటివాటి చోట్లనుంచుచు, ఆసవితృదేవుఁడు సర్వలోకములను జూచుచు సువర్ణనిర్మిత రథముతో (మాసన్నిధికు) వచ్చుచున్నాఁడు.

౪౧౩. యాతిదేవః ప్రవతా యాత్యుద్వతా యాతిశుభ్రాభ్యాం యజతోహరిభ్యామ్ ।
ఆదేవో యాతు సవితా పరావతోపవిశ్వాదురితా బాధమానః॥

వం॥ ప్రకాశించుచున్న సూర్యుఁడు ఆకసము దిగుడుమార్గమున నడచుచున్నాఁడు. ఎక్కుడు దారినిగూడ నడచుచున్నాఁడు. తెల్లని రెండు గుఱ్ఱములతోఁ బూజనీయుఁడగు నాదేవుఁడు దేవయజనస్థానమునకు వచ్చును. సవితృదేవుఁడు సర్వపాపముల నశింపఁజేయుచు దూరదేశమునుండి (ద్యులోకమునుండి) వచ్చుచున్నాఁడు. (ఉదయమున ఎక్కుదారి-సాయముదిగుడుదారియని తా॥)

౪౧౪. అభీవృతం కృశనైర్వి శ్వరూపం హిరణ్యశమ్యం యజతో బృహంతమ్ ।
ఆస్థాద్రథం సవితా చిత్రభానుః కృష్ణారజాంసి తవిషీం దధానః॥

దం॥ అంతటను దిరుగునదియు, బంగారువస్తువులతో నిండినదియు, బంగారుశమ్యలు గలదియు, గొప్పదియు, నగురథమును బూజనీయుఁడును, జిత్రకిరణములు కలవాఁడును, నల్లని (చీకటికల) లోకములంగూర్చి స్వప్రకాశమును బంపునట్టి సవితృదేవుఁడు ఎక్కెను. (బంగారు ఏనుగులు, గుఱ్ఱములు, బొమ్మలు రథమున నున్నవట. గుఱ్ఱము మెడకిరువంకల నవతలను ఉండు కొయ్యలకు "శమ్యల"ని పేరు.)

౪౧౫. విజనాఞ్ఛ్యావాః శితిపాదో అఖ్యన్రథం హిరణ్యప్రఉగం వహన్తః।

శశ్వద్విశః సవితుర్దైవ్యస్యోపస్థే విశ్వా భువనాని తస్థుః॥

దం॥ శ్యావములను పేర్లుగల సూర్యాశ్వములు తెల్లని పాదములుకలవియు, బంగారు నొగలుగల రథమును మోయుచు జనులను బ్రకాశింపఁజేయుచున్నవియు, దేవతలతోఁ గూడి సూర్యుని యొక్క సమీపస్థానమునందున్నవియునై లోకములన్నింటిని బ్రకాశింపఁ జేసినవి. (శ్యావ=నల్లని.)

౪౧౬. తిస్రో ద్యావః సవితుర్ద్వా ఉపస్థా ఏకా యమస్య భువనే విరాషాట్।

ఆణిం న రథ్యమమృతాధి తస్థురిహ బ్రవీతు య ఉ తచ్చికేతత్॥

దం॥ మూఁడులోకములుగలవు. రెండు సూర్యసమీపమునున్నవి. (భూలోకద్యులోకములని తా॥) ఒకటి యమలోకమునకుఁ బోవువారు నడచునది (అంతరిక్షమని తా॥) రథచక్రము శీలపైనాధారపడినట్లు చంద్రనక్షత్రాదులు సూర్యునిచుట్టు నాధారపడి యున్నవి. ఏమనుష్యుఁడా సూర్యస్వరూపమును దెలియునో అతఁడీవిషయమును చెప్పఁగలఁడు.

౪౧౭. వి సుపర్ణో అన్తరిక్షాణ్యఖ్యద్గభీరవేపా అసురః సునీథః।

క్వేదానీం సూర్యః కశ్చికేత కతమాం ద్యాం రశ్మిరస్యా తతాన॥

దం॥ యోగ్యప్రసారముగల సుపర్ణయను సూర్యరశ్మి (పదియేనిటిలో నొకదానిపేరు) గంభీరమయిన కదలికగలది. అన్నింటికిఁ బ్రాణము నిచ్చునది. చక్కని దారిని నడిపించునదియై మూఁడులోకములను వ్యాపించెను. ఆసూర్యుఁడిప్పుడు (=రాత్రి) ఎక్కడనున్నాఁడో? ఇతనికిరణమెచట వ్యాపించెనో? ఎవఁడెఱుంగును?

౪౧౮. అష్టౌ వ్యఖ్య త్కకుభః పృథివ్యాస్త్రీధన్వ యోజనా సప్తసింధూన్ ।
హిరణ్యాక్షః సవితా దేవఆగా ద్దధద్రత్నా దాశుషే వార్యాణి॥

దం॥ భూమికి సంబంధించిన యెనిమిది దిక్కులను సవితృదేవుఁడు ప్రకాశింపఁ జేసెను. ప్రాణులనెచట నుంచవలసిన-వాని నచటనుంచునట్టి మూఁడులోకములను, ఏడుసముద్రములను, లేక, నదులను; ప్రకాశింపఁజేసెను. బంగారుకన్నులుగల సవితృ దేవుఁడు యజమానునికొఱకు కోరిన రత్నములను బట్టుకొనుచు వచ్చుఁగాక.

౪౧౯. హిరణ్యపాణిః సవితా విచర్షణి రుభేద్యావాపృథివీ అన్తరీయతే ।
అపామీవాం బాధతే వేతి సూర్య మభి కృష్ణేన రజసా ద్యామృణోతి॥

దం॥ బంగారుచేతులుగల, లేక, బంగారముచేతఁబట్టిన, బహువిధదర్శనముగల సమస్తమును జూచుచున్న సవితృదేవుఁడు ద్యావాపృథివీలోకముల రెంటిమధ్యను నడచుచున్నాఁడు. రోగాదిబాధలను జక్కఁగా శమింపఁజేయును. సూర్యుని సమీపించును. చీకటిని నశింపఁజేయునట్టి తేజస్సుతో ఆకాశమంతటను వ్యాపించెను. (ఇచట సూర్యుని వేఱుగాను సవితను వేఱుగాను జెప్పినాఁడు.)

౪౨౦. హిరణ్యహస్తో అసురః సునీథః సుమృళీకః స్వవాఁయా త్వర్వాఙ్ ।
అపసేధ న్రక్షసో యాతుధానా నస్థాద్దేవః ప్రతిదోషం గృణానః॥

దం॥ బంగారము హస్తమందుఁగల ప్రాణదాతయుఁ జక్కఁగ నడిపించునట్టియు, బాగుగసుఖింపఁజేయునట్టియు, ధనవంతుఁడగునట్టి సవితృదేవుఁడు ప్రతిరాత్రియు స్తుతింపఁబడిన వాఁడయి రాక్షసులను యాతుధానులను నిరాకరించుచు కర్మస్థలమున కభిముఖుఁడై వచ్చునుగాక.

౪౨౧. యే తేపంథాః సవితః పూర్వ్యాసో౽రేణవః సుకృతా అన్తరిక్షే ।
తేభిర్నో అద్యపథిభిః సుగేభీ రక్షాచనో అధిచ బ్రూహి దేవ॥

దం॥ ఓ సవితా! నీమార్గములు పూర్వసిద్ధములు, ధూళిలేనివి, అంతరిక్షమునం దక్కఁగాఁ జేయఁబడినవి. సుఖముగాఁ నడువఁదగిన ఆమార్గములవెంబడి యీదినమునం దు వచ్చి మమ్ము రక్షింపుము. ఓ దేవా! మమ్మును (దేవతలతో) అధికులనుగాఁ జెప్పుము.

ఇట్లు ప్రథమమండలమున సప్తమానువాకము పూర్తి. శ్రీ శ్రీ శ్రీ

—:-O-:—

## అనువాకము. ౮.

## సూక్తము. ౩౬.

(ఋషి - ఘోరపుత్త్రుఁడగు కణ్వుఁడు; ఛన్దస్సు - బృహతి. దేవత - అగ్ని.)

౪౨౨. ప్రవో॑ యహ్వం పు॑రూ॒ణాం వి॒శాం దే॑వయ॒తీనా॑మ్ ।

అ॒గ్నిం సూ॒క్తేభి॒ర్వచో॑భిరీమహే॒ యం సీ॒మిద॒న్య ఈళ॑తే॥

దం॥ ఇతరఋషులు ఏయగ్నిని స్తుతించిరో, (ఆగొప్పవాఁడగు) నగ్నిని దేవతలను గోరు బహుసంఖ్యాకు మనుష్యులగు మీయందనుగ్రహింపుటకై నో ఋత్విగ్యజమానులారా! సూక్తరూపములయిన వాక్యములతో నధికముగాఁ బ్రార్థించుచున్నాము.

౪౨౩. జనా॑సో అ॒గ్నిం ద॑ధిరే సహో॒వృధం॑ హ॒విష్మ॑న్తో విధేమ తే ।

సత్వం నో॑ అ॒ద్య సు॒మనా॑ ఇ॒హావి॒తా భవా॒ వాజే॑షు సన్త్య॥

దం॥ (అనుష్ఠాతలయిన) జనులారా! బలమును వృద్ధిసేయునట్టి యగ్నినిధరించినారు. (ధరించుటయనగా నగ్నిని నిలువచేసికొనుట) హవిస్సులతోఁగూడిన మేము ఓయగ్నీ! నీకుఁ బరిచర్య చేతుము. అన్నములనిచ్చుదాతా! అగ్నీ! ఈదినమున నీకర్మయందు మమ్ముఁగూర్చి మంచిమనసుకలిగి రక్షించువాఁడవుకమ్ము.

౪౨౪. ప్రత్వా॑ దూ॒తం వృ॑ణీమహే॒ హోతా॑రం వి॒శ్వవే॑దసమ్ ।

మ॒హస్తే॑ స॒తో విచ॑రన్త్య॒ర్చయో॑ ది॒విస్పృ॑శన్తి భా॒నవః॑॥

వం॥ ఓ యగ్నీ! హోమముకలిగించువాఁడవు, సర్వజ్ఞుఁడవు, దేవదూతవునగునిన్ను స్థిరగాఁ బ్రార్థించుచున్నాము. గొప్పవాఁడవయి ప్రవర్తించు నీవెలుఁగులు వివిధ ముగాఁబ్రసరించుచున్నవి. నీకిరణములు ద్యులోకమునంటుచున్నవి.

౩౨౪. దేవాసస్త్వా వరుణో మిత్రో అర్యమా సందూతం ప్రత్నమింధతే!
విశ్వంసో అగ్నే జయతి త్వయా ధనం యస్తే దదాశ మర్త్యః॥

వం ఓ యగ్నీ! వరుణుఁడు, మిత్రుఁడు, అర్యముఁడు (అనుముగ్గురు) దేవతలుపురాతనుఁడగు దూతను జక్కఁగా వెలిఁగించుచున్నారు. ఏయజమానుఁడు నీకై హవిస్సు నిచ్చెనో, యతఁడు నీసాహాయ్యముకల్గి సమస్తధనమును సంపాదించును.

౩౨౫. మంద్రో హోతా గృహపతి రగ్నే దూతో విశామసి।
త్వేవిశ్వా సంగతాని వ్రతా ధ్రువాయాని దేవా అకృణ్వత॥

దం॥ అగ్నీ! నీవుహర్షమునకుఁగారణమవు. దేవతలంబిలుచువాఁడవు. యజమానులగు (అనఁగా యజ్ఞములుచేయువారు) ప్రజలకుఁ బతివి, సర్వకర్మలును నీయందున్నవి. (పృథివ్యాది) దేవతలేకర్మలను జేసిరో, యవి నీయందున్నవి.

౩౨౬. త్వేఇదగ్నే సుభగే యవిష్ఠ్య విశ్వ మాహూయతే హవిః।
సత్వంనో అద్య సుమనా ఉతాపరం యక్షి దేవాన్త్సువీర్యా॥

దం॥ యౌవనవంతుఁడవగునగ్నీ! సౌభాగ్యవంతుఁడవయిన నీయందే సమస్త హవిస్సులు హోమముచేయఁబడుచున్నవి. ఆ నీవునేఁయందు మంచిమనసుకలిగి యీనాఁడును అటుతర్వాతను మంచివీర్యవంతులయిన దేవతలకొఱకు యాగ మొనర్పుము.

౩౨౭. తం ఘేమిత్థా నమస్విన ఉపస్వరాజ మాసతే।
హోత్రాభి రగ్నిం మనుషః సమింధతే తితిర్వాంసో అతిస్రిధః॥

వం॥ ఓ యగ్నీ! నమస్కరించుచున్న (యజమానులు) స్వప్రకాశుఁడవగు ఆనిన్నే యీవిధముగా నుపాసించుచున్నారు. శతృవుల జయించు యజమానులు హోతలేన్నురితోఁగూడి నిన్నుదీపింపఁజేతురు.

౮౨౯. ఘ్నన్తో వృత్ర మతర న్రోదసీ అపఉరుక్షయాయ చక్రిరే ।

భువత్కణ్వే వృషా ద్యుమ్న్యాహుతః క్రన్దదశ్వో గవిష్టిషు॥

వం॥ ఓ యగ్నీ! శత్రువులను బాధించోలడు దేవతలు తమశతృవును గెల్చిరి. స్వర్లోకభూలోకములను అంతరిక్షమును ప్రాణుల నివాసమునకు విశాలముగునట్లు చేసిరి. కణ్వుఁడనుఋషికిఁ గోర్కెలనొసంగితివి. ధనముగలవాఁడవు. హోమము కలవాఁడవు. గోవిషయమైన యుద్ధములందు ధ్వనించునట్టి గుఱ్ఱమువలెఁ గోర్కెల నొసంగుము.

౮౩౦. సంసీదస్వ మహాఁఅసి శోచస్వ దేవవీతమః ।

విధూమమగ్నే అరుషం మియేధ్యసృజ ప్రశస్త దర్శతమ్॥

వం॥ ఓ యగ్నీ! దర్భలమీఁదఁగూర్చుండుము. గుణాధికుఁడవు. మిక్కిలిగా దేవతలం గోరుచు వెలుంగుము. ఓ మేధాశాలీ! మహాత్మా! చూడఁదగి ప్రసరించు ధూమము విడువుము.

౮౩౧. యంత్వా దేవాసోమ నవేదధురిహ యజిష్ఠం హవ్యవాహన ॥

యంకణ్వో మేధ్యాతిథి ర్ధనస్పృతంయం వృషాయ ముపస్తుతః॥

వం॥ హవిస్సును మోయునట్టి ఓ యగ్నీ! మనుచక్రవర్తిననుగ్రహించుటకు దేవతలు మిక్కిలిపూజ్యుఁడవయిన యేనిన్ను ఈ దేవయజనస్థానమున ధరించిరో, పవిత్రమయిన యతిథులతోఁగూడ కణ్వుఁడేనిన్ను ధనమిచ్చువానిఁగాఁజేసి ధరించెనో, ఇంద్రుఁడే నిన్ను ధరించెనో, ఇతర స్తవకర్తలును ధరించిరో ఆ నీవు దర్భలమీఁదఁ గూర్చుండుమని పూర్వాన్వయము (ధరించు=సంగ్రహించు).

౪౩౨. యమగ్నిం మేధ్యాతిథిః కణ్వ ఈధ ఋతాదధి ।

తస్య ప్రేషో దీదియు స్తమిమాఋ చ స్తమగ్నిం వర్ధయామసి॥

దం॥ ఏయగ్నిని మేధ్యాతిథియగు కణ్వుఁడు సూర్యునిలోనుండి తెచ్చిమండించెనో; ఆయగ్నికిరణములు మిక్కిలి ప్రకాశించుచున్నవి. ఆయగ్నిని యీ మా ఋక్కులు వృద్ధిపఱచుచున్నవి. మేమును వృద్ధిపొందుచున్నాము.

౪౩౩. రాయస్పూర్ధి స్వధావో స్తిహి తేగ్నే దేవే ష్వాప్యమ్ ।

త్వం వాజస్య శ్రుత్యస్య రాజసి సనోమృళ మహాం అసి॥

దం॥ అన్నవంతుఁడవగునగ్నీ! ధనములిమ్ము. అగ్నీ! దేవతలందఱికొనిరాఁగలంత స్నేహము (వారితో) నీకుఁగలదుకదా! మెచ్చుకొనఁదగిన యన్నమునకీశ్వరుఁడవు. గుణములచేత నధికుఁడవు. మమ్ముల సుఖింపఁజేయుము.

౪౩౪. ఊర్ధ్వఊషుణ ఊతయే తిష్ఠా దేవోన సవితా ।

ఊర్ధ్వోవాజస్య సనితా యదంజిభి ర్వాఘద్భి ర్విహ్వయామహే॥

దం॥ ఓ యూప స్తంభమా! మారక్షణకొఱకు సూర్యుఁడెంతయున్నతుఁడో, యంతే యున్నతమవుకమ్ము. అన్నమిచ్చువాఁడవుకాఁగలవు. యూపమునకు నేయి పూయుచున్న ఋత్విజులతోఁగూడ నిన్నుఁ బిలుచుచున్నాము. (యూపము=యజ్ఞపశువును గట్టుస్తంభము.)

౪౩౫. ఊర్ధ్వోనః పాహ్యంహసో నికేతునా విశ్వం సమత్రిణం దహ ।

కృధీన ఊర్ధ్వా స్చరథాయ జీవసే విదా దేవేషు నోదువః ।

దం॥ ఓ యూప స్తంభమా! ఉన్నతమైనదానవై మమ్ములను జ్ఞానమిచ్చి పాపమునుండి తొలఁగించిరక్షించుము. సమస్తమును దినివేయునట్టి (రాక్షసుని) దహించుము. లోకములోఁ దిరుగుటకు జీవించుటకు మమ్మునున్నతులం జేయుము. హవిరూపధనమును దేవతలకుఁ బొందించుము.

౪౩౬. పాహినో అగ్నే రక్షసః పాహి ధూర్తే రరావ్ణః ।

పాహి రీషత ఉతవా జిఘాంసతో బృహద్భానో యవిష్ఠ్య॥

వం॥ పడుచువాఁడవగునగ్నీ! గొప్పకిరణములవాఁడా! ఇవ్వవలసిన ధనమివ్వక మమ్ము బాధించు వారలనుండియు; రాక్షసులనుండియు; క్రూరజంతువులనుండియు, శత్రువులనుండియు, రక్షింపుము.

౪౩౭. ఘనేవ విష్వగ్విజ హ్యరావ్ణ స్తపుర్జంభ యో అస్మధ్రుక్ ।

యోమర్త్యః శిశీతే అత్యక్తుభి ర్మానః సరిపు రీశత॥

వం॥ తపింపఁజేయు కిరణములుగలయగ్నీ! ఇవ్వవలసిన ధనమివ్వక బాధించు వారిని, రాళ్ళతోఁ గట్టెలతోఁ గుండలు బ్రద్దలుగొట్టినట్లు; కొట్టి చంపుము. మాకు ద్రోహముచేయునట్టి యాయుధములతోఁ గొట్టవచ్చినట్టి యితర మనుష్యశత్రువులు మాతోఁ జాలకుందురుగాక.

౪౩౮. అగ్నిర్వవ్నే సువీర్య మగ్నిః కణ్వాయ సౌభగమ్ ।

అగ్నిః ప్రావన్మిత్రోత మేధ్యాతిథి మగ్నిః సాతా ఉపస్తుతమ్॥

వం॥ అగ్నిదేవుఁడు మంచివీర్యసంపన్నమయిన ధనముకొఱకు యాచింపఁబడెను. కణ్వమహర్షికతఁడు మంచిభాగ్యమునిచ్చెను. మామిత్రులను రక్షించెను. అగ్ని మేధాతిథిని స్తుతించు నితరయజమానుని ధనాదులనిచ్చి రక్షించెను.

౪౩౯. అగ్నినా తుర్వశం యదుం పరావత ఉగ్రాదేవం హవామహే ।

అగ్నిర్నయన్నవవాస్త్వం బృహద్రథం తుర్వీతిం దస్యవే సహః॥

వం॥ అగ్నితోఁగలిసియున్న తుర్వశుని, యదువును, ఉగ్రదేవుని (పేరురాజన్యులు) దూరదేశమునుండి పిలుచుచున్నాము. శత్రువుల నోడించునట్టి ఆయగ్ని నవవాస్త్వుని, బృహద్రథుని, తుర్వీతిని (రాజన్యులను) ఇచటికిఁ దీసికొనివచ్చుఁగాక.

౪౪౦. నిత్వామగ్నే మనుర్దధే జ్యోతిర్జనాయ శశ్వతే ।
దీదేథ కణ్వ ఋత జాత ఉక్షితో యం నమస్యంతి కృష్టయః॥

వ॥ ఓయగ్నీ! నిన్ను బహుజనులకొఱకు (ప్రజాపతియగు) మనువుస్థాపించెను. యజ్ఞముకొఱకుఁ బుట్టినవాఁడవయి హవిస్సులతోఁ దృప్తినొందింపఁబడి కణ్వర్షి దగ్గఱఁ బ్రకాశించితివి. మనుష్యులునీకు నమస్కరింతురు.

౪౪౧. త్వేషాసో అగ్నే రమవంతో అర్చయో భీమాసో న ప్రతీతయే ।
రక్షస్వినః సదమి ద్యాతుమావతో విశ్వం సమత్రిణం దహ॥

వ॥ అగ్నిజ్వాలలు ప్రకాశించుచు బలవంతములై భయంకరములై తెలిసికొన శక్యముకాకయున్నవి. అగ్నీ! బలవంతులయిన యసురులను ఎల్లప్పుడును బాగుగ భస్మముచేయుము. మమ్ముఁ బాధించు శత్రువులనందఱిని రూపుమాపుము.

---

## సూ క్త ము. ౩౭.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు: ఛన్దస్సు - గాయత్రి; దేవత - మరుత్తు)

౪౪౨. క్రీళంవః శర్ధోమారుత మనర్వాణం రథేశుభమ్ । కణ్వాఅభిప్రగాయత॥

వ॥ ఓ కణ్వవంశీయులారా! లేక, ఋత్విజులారా! విహరించు స్వభావముగల్గి శత్రువులు లేక రథముమీఁదఁ బ్రకాశించునట్టి బలముమీకుఁగల్గుటకై మరుద్గణమును బాగుగ స్తుతింపుడు.

౪౪౩. యేపృషతీభి రృష్టిభిః సాకం వాశీభి రంజిభిః । అజాయన్త స్వభానవః॥

వ॥ ఏమరుత్తులు పొడలుగల దుప్పులమీఁద ఆయుధములతో సింహనాదములు సేయుచు నలంకారవంతులై తమకాంతులతోఁగూడి ఉద్భవించిరో ఆమరుత్తుల స్తుతింపుడని పూర్వాన్వయము.

౪౪౪. ఇహేవ శ్రుణ్వ ఏషాం కశా హస్తేషు యద్వదాన్ । నియామంచిత్ర మృంజతే॥

టీ॥ ఈ మరుత్తుల చేతులలోనున్న కొరడాలు ఏధ్వనిని జేయుచున్నవో ఆధ్వని నిచ్చటనుండియే వినుచున్నాను. ఆధ్వని యుద్ధములలో ననేకవిధములు శౌర్యము నలంకరించును.

౪౪౫. ప్రవః శర్ధాయ ఘృష్వయే త్వేషద్యుమ్నాయ శుష్మిణే ।

దేవత్తం బ్రహ్మగాయత॥

టీ॥ ఋత్విజులారా! మీకు సంబంధించినవారును నన్వేలాడు స్వభావముకల వారును, శత్రువులను రాసివేయువారును, బలవంతులునగు మరుత్తులను దేవతలచేత నివ్వఁబడునన్నమునుగోరి స్తుతింపుడు.

౪౪౬. ప్రశంసా గోష్వఘ్న్యం క్రీళం యచ్ఛర్ధో మారుతమ్ । జంభే రసస్య వావృధే॥

టీ॥ గోవులయందున్నట్టి (పృశ్ని మొదలగు గోవులు మరుత్తుల తల్లులట!) ఎదుటి వారికి లొంగనట్టి, విహారముగలట్టి, శత్రువులఁ దిరస్కరించునట్టి మరుత్సంబంధమగుచున తేజస్సును ఓ ఋత్విగ్బృందమా! స్తుతింపుము. (గోక్షీరాది) రసముయొక్క తేజస్సు ఉదరమందు వృద్ధినందినది.

౪౪౭. కోవోవర్షిష్ఠ ఆనరో దివశ్చగ్మశ్చ ధూతయః । యత్సీమంతం నధూనుథ॥

టీ॥ ద్యులోక భూలోకములంగూడఁ గదలించుచుఁ గానిపోవునట్టి యో మరుత్తులారా! వృక్షాగ్రమునుంబోలె సర్వమును గదలించుచున్నారుగదా! మీలో బలవంతు లెవరు?

౪౪౮. నివో యామాయ మానుషో దధ్ర ఉగ్రాయ మన్యవే । జిహీత పర్వతో గిరిః॥

టీ॥ మరుత్తులారా! తీవ్రమయిన పట్టుదలగలిగిన మీ వేగమునకు గృహస్థుఁడు దృఢమగు స్తంభములను నిలుపుకొనెను. ఏమంటే అనేక శిఖరములుగల కొండ కూడఁ గదలిపోవుచున్నది.

౪౪౯. యేషామజ్మేషు పృథివీ జుజుర్వాఁ ఇవ విశ్పతిః । భియా యామేషు రేజతే॥

వం॥ ఏ మీ గమనములు గదలించుచుండఁగా భూమి భయముతో; యుద్ధములలో ముసలిరాజువలె; వణంకును.

౪౫౦. స్థిరంహి జానమేషాం వయో మాతుర్నిరేతవే । యత్సీమను ద్వితా శవః॥

దం॥ మరుత్తులారా! మీబలము ఎందుచేత భూమ్యాకాశముల విభజించుకొని నిండియున్నదో, అందుచేత మీ జన్మస్థానమగు నాకాశము స్థిరమయినది. మీ తల్లియగు నాకాశమునఁ బక్షులెగురుచున్నవి.

౪౫౧. ఉదు త్యే సూనవో గిరః కాష్ఠా అజ్మేష్వత్నత । వాశ్రా అభిజ్ఞు యాతవే॥

దం॥ మాటలను బుట్టించు వాయువులు వీఁచునపుడు ఉదకములను మిక్కిలి చెదరగొట్టెను. హంభాధ్వనులుచేయు గోవులను కాళ్లెగురవేసుకొని పరుగెత్తునట్లుచేసెను.

౪౫౨. త్యంచిద్ఘా దీర్ఘం పృథుంమిహో నపాతమమృధ్రమ్। ప్రచ్యావయన్తి యామభిః॥

దం॥ పొడవై విశాలమయిన జలమును గ్రిందఁబడకుండఁ బట్టి యితరులకు లొంగని మేఘమును మరుత్తులు స్వకీయగమనముచేతఁ బరుగెత్తించుచున్నారు.

౪౫౩. మరుతో యద్ధవోబలం జనాఁ అచుచ్యవీతన । గిరీఁరచుచ్యవీతన॥

దం॥ ఓ మరుత్తులారా! మీకుబలమున్నది కనుక జనులను దమతమవ్యాపారములలోఁ బ్రేరించుడు. అట్లే మేఘములను బ్రేరించుడు.

౪౫౪. యద్ధయాన్తి మరుతః సంహ బ్రువతే ధ్వన్నా । శృణోతికశ్చిదేషామ్॥

దం॥ ఎపుడు వాయువులు వీఁచుచుండునో అపుడు మార్గమంతటను గలిసిధ్వనించుచున్నవి. వీఁటిధ్వని నెవరోవిందురు.

౪౫౫. ప్రయాతశీభమాశుభిః సన్తికణ్వేషు వోదువః । తత్రోషు మాదయాధ్వై॥

వం॥ మరుత్తులారా! వేగముగల్గిన (రథముమీఁద) శీఘ్రము బయలుదేరుఁడు. మేధావంతులగు (యజమానులందు) మీపరిచర్యలుకలవు. ఆసేవకులను దృప్తి నొందించుడు.

౪౨౬. అస్తిహిష్మా మదాయవః స్మసిష్మావయమేషామ్ । విశ్వంచిదాయుర్జీవసే॥

వం॥ ఓ మరుత్తులారా! మీతృప్తికి (మేమిచ్చిన హవిస్సు) ఉన్నదికదా! మీకు మేము భృత్యులమయితిమికదా! జీవించుటకు సంపూర్ణాయుస్సును ఇండు.

—:-o-:—

## సూక్తము. ౩౮.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు; ఛన్దస్సు - గాయత్రీ; దేవత - మరుత్తులు.)

౪౨౭, కద్ధనూనంకధప్రియః పితాపుత్రంనహస్తయోః । దధిధ్వేవృక్తబర్హిషః॥

వం॥ ఓ మరుత్తులారా! స్తుతిప్రియులును దర్భలను (గూఁడ) గోయువారునగుమీరు నిశ్చితముగా మమ్ము మీచేతులలో నెపుడు; తండ్రికొమారుని ధరించినట్లు; ధరింతురో?

౪౨౮. క్వనూనంకద్వో అర్థంగన్తాదివోనపృథివ్యాః । క్వవోగావోనరణ్యన్తి॥

వం॥ ఓ మరుత్తులారా! నిశ్చితముగా మీరెక్కడనున్నారు? మీరెప్పుడువత్తురు? ద్యులోకమునుండిరండు. భూలోకమునుండి రావద్దు. యజమానులు స్తుతులను గోవులు ధ్వనించునట్లు ధ్వనించుచున్నారు.

౪౨౯. క్వవః సుమ్నా నవ్యాంసి మరుతః క్వసువితా । క్వోవిశ్వాని సౌభగా॥

వం॥ మరుత్తులారా! మీరియొక్క నరిక్రొత్తలగు సుమ్నములు (ప్రజా పశురూప ధనములని తా॥) ఎచటనున్నవి? సంపాదింపఁదగిన సువితలు (మణి ముక్తాదులు) ఎక్కడనున్నవి? సమస్త సౌభగములు (గజాశ్వాదులు) ఎచటగలవు? వాటినన్నింటిని తోనురండు.

౪౬౦. యద్యూయం పృశ్ని మాతరో మర్తాసః స్యాతన ! స్తోతావో అమృతః స్యాత్

దం॥ పృశ్నిపుత్రులారా ! విచారింపఁగా మీరు మర్త్యులే (చావుగలవారని తా అయినను మిమ్ము స్తుతించినవాఁడమృతుఁడగును.

౪౬౧. మావో మృగోనయ వసే జరితా భూదజోష్యః । పథాయ మస్యగాదుప॥

దం॥ మరుత్తులారా ! మిమ్ము స్తుతించువాఁడు గడ్డిని మృగము వదలలేనట్లు మిమ్ము వదలలేకుండ నుండునుగాక. వాఁడు యమునిత్రోవను బోకుండుఁగాక,

౪౬౨. మోషుణః పరాపరానిర్ఋతిర్దుర్హణా వధీత్ । పదీష్ట తృష్ణయా సహ॥

దం॥ మరుత్తులారా ! గొప్పదియు నెవ్వరు నెదిరింపఁజాలనిది యగు నిర్ఋ యను రాక్షసి మమ్ము బాధించునాశతో నశించుఁగాక. మమ్ములను జంపకుండుఁగాక

౪౬౩. సత్యం త్వేషా అమవన్తో ధన్వఞ్చి దారుద్రియాసః । మిహం కృణ్వన్త్యవాతాం

దం॥ ప్రకాశించువారును, బలవంతులును, రుద్రునిచేఁ బాలింపఁబడినవారునగు మరుత్తులు ఎడారిలోఁగూడ సర్వత్రవాయువులేని వర్షమును గలిగించుచున్నారు ఇది సత్యము.

౪౬౪. వాశ్రేవ విద్యున్మిమాతివత్సం నమాతాసిషక్తి । యదేషాం వృష్టిరసర్జి॥

దం॥ పాలుచేఁపుచు నఱచునట్టి గోవువలె విద్యుత్తు ధ్వనిచేయుచున్నది. తల్లి దూడను తడిపినట్లు తడుపుచున్నది. ఈ మరుత్తులవర్షము గర్జనతోఁగూడి మెఱుపు మెఱయునపుడే కురియును.

౪౬౫. దివాచిత్తమః కృణ్వన్తి పర్జన్యేనో దవాహేన । యత్పృథివీం వ్యున్దన్తి॥

దం॥ మరుత్తులారా ! ఉదకమును మోయుచున్న మేఘముచేత మీరు పగల గూడఁ జీఁకటిని గలిగించుచున్నారు. అపుడు భూమిని దడుపుచున్నారు.

౪౬౬. అధస్వ నాన్మరుతాం విశ్వ మాసద్మ పార్థివమ్ । అరేజన్త ప్రమానుషాః॥

వం॥ మరుత్తుల ధ్వనితరువాత (గర్జనానంతరము) పృథివిలోనున్న గృహములన్నియుఁ గదలును. మనుష్యులుకూడ మిగులవణంకుదురు.

౪౬౭. మరుతో వీళుపాణి భిశ్చిత్రారో ధస్వతీరను । యాతే మఖిద్ర యామభిః॥

వం॥ మరుత్తులారా! మీరు దృఢహస్తములతో ఒడ్డుగల నానావిధములగు నదులంగూర్చి యెడతెగని గమనములతోఁ దప్పక చేరుదురుగాక.

౩౬౮. స్థిరావః సన్తునేమయోరథా అశ్వాసఏషామ్ । సుసంస్కృతా అభీశవః॥

వం॥ మరుత్తులారా! మీరథచక్రములయంచులు దృఢములై యుండుఁగాక. రథములు అశ్వములంగూడి స్థిరములై యుండుంగాక. కళ్లెములు సరిగా సవరింపఁబడుఁ గాక.

౪౬౯. అచ్ఛావదాత నాగిరాజరాయై బ్రహ్మణస్పతిమ్ । అగ్నిం మిత్రం నదర్శతమ్॥

వం॥ ఋత్విజులారా! విస్తరించిన వాక్కుచేత రక్షితమయిన మరుద్గణమును, అగ్నిని, దర్శనీయుఁడగు మిత్రుని, స్తుతింపుడు.

౪౭౦. మిమీహిశ్లోకమాస్యే పర్జన్యఇవత తనః । గాయగాయత్రముక్థ్యమ్॥

వం॥ ఋత్విక్సమూహమా! మీనోట స్తుతిని నిర్మింపుఁడు. ఆశ్లోకమును మేఘుఁడు వర్షమును విస్తరించునట్లు మాకు విస్తరింపుఁడు. శస్త్రములకు (సోమమంత్రముల) పనికివచ్చిన గాయత్రి ఛందస్సును గానముసేయుడు.

౪౭౧. వన్దస్వ మారుతం గణం త్వేషం పనస్యుమర్కిణమ్ । అస్మేవృద్ధా అసన్నిహ॥

వం॥ ఋత్విక్సమూహమా! దీపించుచున్నదియు, స్తవనీయమయినదియుఁ, బూజనీయమయినదియు, నగు మరుద్గణమును నమస్కరించుఁడు. మా యీ కర్మయందు మరుత్తులును వృద్ధినొందుదురుగాక.

—:-o-:—

## సూక్తము ౩౯.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు ; దేవత - మరుత్తులు ; ఛందస్సు - బృహతి)

౪౭౨. ప్రయద్ధిత్థాపరావతః శోచిర్నమానమస్యథ ।

కస్యక్రత్వామరుతః కస్యవర్పసాకంయాథ కంహధూతయః॥

దం॥ (అన్నిటిని) కదలించు స్వభావముగల మరుత్తులారా! తలంచుకోఁదగిన మీబలమును దూరమగు నీ యంతరిక్షమునుండి సూర్య తేజస్సువలె నెపుడు పడ వేయుదురో? అపుడు మీరే యజమానుని క్రతువులోనుందురో? ఏ యజమానుని స్తవమును విందురో? ఎవని దేవయజనస్థానమునకుఁ బోవుదురో!

౪౭౩. స్థిరావః సంత్వాయుధా పరాణు దేవీళూ ఉతప్రతిష్కభే ॥

యుష్మాకమస్తుతవిషీ పనీయసీమా మర్త్యస్యమాయినః॥

దం॥ ఓ మరుత్తులారా! మీ యాయుధములు శత్రువుల సంహరించుటకు స్థిరములగుఁగాక. మఱియు శత్రువుల ప్రతిబంధించుటకు దృఢములగుఁగాక. మీ బలము మిక్కిలి స్తవనీయమగుఁగాక. మాయందుఁ గపటముఁజూపిన మనుష్యునకు బలము లేకుండుఁగాక.

౪౭౪. పరాహయత్స్థిర రంహథనరోనర్తయథా గురు ।

వియాథనవనినః పృథివ్యావ్యాశాః పర్వతానామ్॥

దం॥ (పతివస్తువును) మోసికొనిపోవు స్వభావముగల మరుత్తులారా! ఎపుడు స్థిరమయిన (చెట్లు మొదలగువాటిని) విరచివేయుదురో; భారమయిన వాటిని విసరివేతురో; అపుడు భూమిమీఁదనున్న వృక్షములను పర్వతపార్శ్వ భాగములను సందుచేసుకొని మధ్యనుండి గమనించుఁడు. (అనఁగాఁ ద్రోసివేయవద్దని తా॥)

౪౭౫. నహివః శత్రుర్వివిదే అధిద్యవినభూమ్యాం రిశాదసః ।

యుష్మాకమస్తు తవిషీతనాయుజా రుద్రాసోనూచిదాధృషే॥

తా॥ శత్రుహింసకులగు నోమరుత్తులారా! ద్యులోకముమీఁదనుగాని భూమిమీఁదనుగాని మీకుశత్రువుండుట తెలియరాదు. రుద్రపుత్రులారా! మీసమైకసత్త్వముచేత మీబలము విస్తరించునదై యుండుఁగాక. మీబలము శీఘ్రముగా శత్రువుల నణంచుటకగుఁగాక.

౪౭౬. ప్రవేపయన్తి పర్వతా న్వివించన్తి వనస్పతీన్ ।
ప్రోఆరతమరుతో దుర్మదా ఇవ దేవాసః సర్వయావిశా॥

తా॥ పర్వతములను మరుత్తులు బాగుగఁ గదలింతురు. వనస్పతులను (పుష్పములు లేకనే కాచునట్టి మఱ్ఱి, మేడి, జువ్విరావి, మొ॥) ఒకదాని నొకటికలియనీయకుండఁ జేయుదురు. మరుద్దేవతలారా! సర్వమనుష్యులతోఁగూడి మీరు గర్వపోతులవలె సర్వత్రా మత్తమువచ్చినట్లు తిరుగుదు.

౪౭౭. ఉపోరథేషు పృషతీరయుగ్ధ్వం ప్రష్టిర్వహతిరోహితః ।
ఆవోయామాయపృథివీ చిదశ్రోద బీభయన్తమానుషాః॥

తా॥ మరుత్తులారా! రథములందు ఆఁడుదుప్పులను గూర్చినారు. మూఁడుగుఱ్ఱములకుపయోగించు కాడియు ఎఱ్ఱని మగదుప్పియు (రథము) నీడ్చును. అంతరిక్షము మీగమనము నంగీకరించుచున్నది. మనుష్యులు (తామభయమునంది) [illegible] భయపెట్టుచున్నారు.

౪౭౮. ఆవోమక్షూతనాయకం రుద్రా అవోవృణీమహే ।
గన్తానూనం నోవసాయథాపురేత్థా కణ్వాయబిభ్యుషే॥

తా॥ రుద్రపుత్రులారా! మాపుత్రులకొఱకు మీరక్షసంతతను శీఘ్రముగాఁ గోరుచున్నాము. పూర్వకాలమందు మారక్షణకొఱకు నెట్లువచ్చితిరో, భయపడిన యజమానుని కొఱకు నట్లేరండు. (కణ్వ=బుద్ధిశాలి.)

౪౨౯. యుష్మేషితో మరుతో మర్త్యేషిత ఆయోనో అభ్వఈషతే ।
వితంయుయోతశవసా వ్యోజసావియుష్మాకాభిరూతిభిః॥

దం॥ మరుత్తులారా! మీచేతనో మారకులగు నితరులచేతనో ప్రేరింపఁబడి యేశత్రువు మామీఁదఁబడుచున్నాఁడో వానికన్నము లేకుండఁ జేయుఁడు. బలము లేకుండఁ జేయుఁడు. మీరక్షణలువానికి లేకుండఁ జేయుఁడు.

౪౩౦. అసామిహిప్రయజ్యవః కణ్వందద ప్రచేతసః ।
అసామిభిర్మరుతఆన ఊతిభిర్గంతా వృష్టింనవిద్యుతః॥

దం॥ పూర్తిగా సంపూర్ణముగా యజింపదగినవారును, అధిక జ్ఞానముగలవారునగు నో మరుత్తులారా! యజమానుని బోషించుచున్నారుకదా! మెఱుపులు వర్షమున కభిముఖములయినట్లు సంపూర్ణ రక్షణలతో మా కభిముఖులుకండు.

౪౩౧. అసామ్యోజోబిభృథా సుదానవో సామిధూతయః శవః ।
ఋషిద్విషే మరుతః పరిమన్యవ ఇషుం నసృజతద్విషమ్॥

దం॥ మంచిదాతలగు మరుత్తులారా! సంపూర్ణ బలము ధరించుచున్నారు. కదలించు వారలారా! సంపూర్ణబలమును గోపమునుగల్గి ఋషులద్వేషించువానిమీఁద; బాణమువలెఁ జంపునట్టి యాయుధము విసరుఁడు.

—:-o-:—

సూక్తము. ౪౦.

(ఋషి - కణ్వుఁడు. దేవత - బ్రహ్మణస్పతి ఛందస్సు - బృహతి.)

౪౩౨. ఉత్తిష్ఠబ్రహ్మణస్పతే దేవయన్త స్త్వేమహే ।
ఉపప్రయంతు మరుతః సుదానవ ఇంద్రప్రాశూర్భవాసచా॥

దం॥ బ్రహ్మణస్పతీ! లెమ్ము. దేవతలను గోరుచున్న మేము పిలుచుచున్నాము. మంచిదాతలగు మరుత్తులారా! సమీపమునకురండు. ఇంద్రా! నీవు బ్రహ్మణస్పతితో సోమపానము సేయుము.

౪౩. త్వామిద్ధి సహసస్పుత్ర మర్త్య ఉపబ్రూతే ధనేహితే ।

సువీర్యం మరుత ఆ స్వశ్వ్యం దధీత యోవ ఆచకే॥

వ॥ బలమును వృద్ధిసేయు బ్రహ్మణస్పతీ! శత్రువులందున్న ధనమునిమిత్తము మనుష్యుఁడు సమీపమున నిన్నే స్తుతించుచున్నాఁడుగదా! మరుత్తులారా! ఎవఁడు మిమ్ములను స్తుతించుచున్నాఁడో, వాఁడు మంచిగుఱ్ఱములుగల, మంచిపరాక్రమము గలధనమును ధరించును.

౪౪. ప్రైతు బ్రహ్మణస్పతిః ప్రదేవ్యేతు సూనృతా ।

అచ్ఛా వీరం నర్యం పఙ్క్తిరాధసం దేవా యజ్ఞం నయంతునః

వ॥ బ్రహ్మణస్పతి మమ్ము సమీపించుఁగాక. సత్యప్రియమగు వాగ్దేవి మమ్ముఁ బొందునుగాక. వీర్యవంతమును, నరులకు హితమును, పంక్తి (భోజనములకు) సమృద్ధము, నగు యజ్ఞమున కభిముఖముగా దేవతలు మమ్ముఁ గొనిపోదురుగాక.

౪౫. యో వాఘతే దదాతి సూనరం వసు సధత్తే అక్షితి శ్రవః ।

తస్మా ఇళాం సువీరా మాయజామహే సుప్రతూర్తి మనేహసమ్॥

వ॥ ఏ యజమానుఁడు ఋత్విజునికొఱకుఁ జక్కఁగా నివ్వఁదగిన ధనమునిచ్చునో ఆయజమానుఁడక్షయమైన యన్నమును బొందును. మంచివీరులనిచ్చునది, శత్రువుల బాగుగహింసించునది, ఇతరులకు బొందగనిది యగు నిళాదేవి (యనుపుత్రి)ని ఈ యజమానునికొఱకుఁ బూజించుచున్నాము (ఋత్విజులమని తా॥)

౪౬. ప్రనూనం బ్రహ్మణస్పతి ర్మంత్రం వదత్యుక్థ్యమ్ ।

యస్మిన్నింద్రో వరుణో మిత్రో అర్యమా దేవాఓకాంసిచక్రిరే॥

వ॥ ఏమన్త్రమందు ఇంద్ర, వరుణ, మిత్ర, అర్యమ దేవతలు నివాసమొనరించిరో ఆశస్త్రయోగ్యమగు ఉక్థ్య (సామవేద) మంత్రమును బ్రహ్మణస్పతి (హోతవాక్కునందున్నవాఁడు) అవశ్యము ఉచ్చరించుఁగాక.

౪౮౯. తమిద్వోచేమా విదథేషు శంభువం మంత్రం దేవా అనేహసమ్॥

ఇమాంచ వాచం ప్రతిహర్యథా నరో విశ్వేద్వామావో అశ్నవత్॥

దం॥ బ్రహ్మణస్పత్యాది దేవతలారా! సుఖము గలిగించునది నిర్దుష్టమును అగు నామంత్రమును యజ్ఞములందుఁ బఠింతుము. నాయకులగు దేవతలారా! మీరు కోరితిరేని కోరఁదగిన యీసమస్త మంత్రములును మిమ్ముఁజేరును.

౪౯౦. కో దేవయన్త మశ్నవజ్జనం కో వృక్తబర్హిషమ్।

ప్రప్ర దాశ్వాన్పస్త్యాభి రస్థి తాంతర్వావత్క్షయం దధే॥

దం॥ దేవతలను గోరుచున్నజనుని (బ్రహ్మణస్పతికంటె నితరుఁడు) ఎవఁడు పొందఁగలఁడు? అట్లే, దర్భలనుకోసియున్న యజమానుని ఏయితరదేవుఁడు పొందఁగలఁడు? హవిర్దాతయగువాఁడు మనుష్యులతో (ఋత్విజులతో) దేవయజనస్థానమునకు బయలుదేరెను. అతఁడు పుత్రపౌత్రాదులుగల యంతర్గృహము కలవాఁడగును.

౪౯౧. ఉప క్షత్రం పృంచీత హన్తి రాజభి ర్భయేచిత్సుక్షితిం దధే

నాస్య వర్తా న తరుతా మహాధనే నార్భే అస్తి వజ్రిణః॥

దం॥ (బ్రహ్మణస్పతి) బలమును దనయందు ధరించి వరుణాది దేవతలతోఁగూడి శత్రువులఁజంపును. భయముగల్గినపుడుమంచి ధైర్యమునిచ్చును. వజ్రాద్యాయుధములుగల యతఁడుతప్ప నితరులెవ్వరు యుద్ధములందుఁ బ్రవర్తింపఁజేయువారుగలరు? గొప్పయుద్ధమందుగాని స్వల్పయుద్ధమందుఁగాని నతని నతిక్రమించువాఁడెవ్వఁడును లేడు.

—:-0-:—

## సూ క్త ము. ౪౧.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు; దేవత - ౧, ౨, ౩-కి వరుణుఁడు, అర్యముఁడు మిత్రుడు; ౪, ౫, ౬ ద్వాదశాదిత్యులు; ౭, ౮, ౯, వరుణుఁడు, అర్యముఁడు, మిత్రుఁడు; ఛందస్సు - గాయత్రి)

౪౯౨. యం రక్షన్తి ప్రచేతసో వరుణో మిత్రో అర్యమా। నూచిత్స దభ్యతే జనః॥

వం॥ అధిక జ్ఞానవంతులైన వరుణమిత్రార్యములు ఎవనిని రక్షించుచున్నారో యతఁడు శీఘ్రముగానే శత్రువుల నోడించును.

౪౯౧. యం బాహుతేవ పిప్రతి పాంతి మర్త్యం రిషః । అరిష్టః సర్వ ఏధతే॥

వం॥ వరుణాదులు తమ బాహులవలె ఏయజమానునకు ధనములను ఇత్తురో (తనచేతిలోని ధనము ఒకరి అపేక్ష లేకుండ నుపయోగించుకొన్నట్లని తా॥) ఏయజమానుని శత్రువులనుండి కాపాడుదురో ఆయజమానులందరును ఎవరిచేతను హింసింపఁబడక వృద్ధినందుదురు.

౪౯౨. వి దుర్గా విద్విషః పురో ఘ్నంతి రాజాన ఏషామ్ । నయంతి దురితా తిరః॥

వం॥ వరుణాదులు ఈయజమానులయెదుట జోరరాసి (శత్రునగరమున) నశింపఁజేతురు. శత్రువులంగూడ నశింపఁజేతురు. పాపములను నశింపఁజేతురు.

౪౯౩. సుగః పంథా అనృక్షర ఆదిత్యాస ఋతం యతే । నాత్రావఖాదో అస్తి వః॥

వం॥ ఆదిత్యులారా! యజ్ఞమునకు వచ్చుచున్న మీమార్గము సుఖముగా నడువఁదగినది, ముళ్లు మొదలగునవి లేనిదియగును. ఈకర్మయందు మీకు అసహ్యమగునట్టి (తినరాని) హవిస్సు లేదు.

౪౯౪. యం యజ్ఞం నయథా నర ఆదిత్యా ఋజునా పథా । ప్రవః సధీతయే నశత్॥

వం॥ నాయకులైన యాదిత్యులారా! ఏయజ్ఞమును తిన్ననిదారిని మీరు పూర్తిగా నడిపింతురో యాయజ్ఞము మీపానముకొఱకగునుగాక.

౪౯౫. స రత్నం మర్త్యో వసు విశ్వం తోకముత త్మనా । అచ్ఛా గచ్ఛత్యస్తృతః

వం॥ ఆదిత్యులారా! అట్టి (యజ్ఞకర్త) మనుష్యుఁడు ఎవరిచేతను హింసిపఁబడక రమణీయమయిన సర్వధనమును, తనతో సమానమైన సంతానమును బొందును.

౪౯౬. కథా రాధామ సఖాయః స్తోమం మిత్రస్యార్యమ్ణః । మహి ప్సరో వరుణస్య॥

దం॥ ఓ స్నేహితులారా! (ఋత్విజులారా!) మిత్రవరుణార్యములయొక్క గొప్ప రూపమునకుఁదగిన స్తోత్రమును ఎట్లుసాధింతుము?

౪౯౮. మావోఘ్నంతం మాశపంతం ప్రతివోచే దేవయంతమ్। సుమ్నైరిద్వ ఆవివాసే॥

దం॥ ఓ మిత్రాది దేవతలారా! దేవతలఁగోరుచున్న యజమానునెవఁడు హింసించునో ఆహింసకునిపేరు నేను జెప్పను. యజమానునెవఁడుతిట్టునో వానినిగూడఁ జెప్పను. (మీరేతెలిసికొని దండిపుడుఅని తా॥) నేను ధనములతోనే మిమ్ములను సర్వత్రా సేవింతును. (ధనములంటే హవిస్సులని తా॥)

౪౯౯. చతురశ్చిద్దద మానాద్బిభీయదానిధాతోః। నదురుక్తాయ స్పృహయేత్॥

దం॥ ఏమంటే దుష్టవాక్యములకొఱకుఁ గోరరాదు. నాలుగుగవ్వలు పందెము పడువఱకు అట్టి కోర్కెకలవాఁడు బయటికిఁ జెప్పుటకు భయపడునట్లు దుర్వాక్కుల నుండి భయపడవలెను. (వెల్లక్రిందుగా నాలుగుగవ్వలుపడితే తనకు గెలుపువస్తుందని ఆశించుచున్నను, పడుతుందో లేదోయని పైకి అనుటకు భయపడెదరు. ఇది జూదములో వ్యవహారము. ఉపమానముగాఁ జెప్పఁబడెను.)

---

## సూక్తము. ౪౨.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు; దేవత - పూష; ఛందస్సు - గాయత్రి)

౫౦౦. సంపూషన్నధ్వనస్తిరవ్యంహోవిముచోనపాత్। సక్ష్వాదేవ ప్రణస్పురః॥

దం॥ ఓ పూషా! (=సూర్యుఁడు, జగత్పోషకుఁడనివ్యుత్ప॥ పృథివికభిమానదేవత) నీటినివిడుచునట్టి మేఘమునకుఁ బుత్రుఁడా! మార్గమునుండి (మేముగోరినస్థలమునకు) కొనిపొమ్ము. పాపమును దొలఁగింపుము. మాముందు నడువుము.

౫౦౧. యోనఃపూషన్నఘోవృకోదుఃశేవ ఆదిదేశతి। అపస్మతంపథోజహి॥

దం॥ పూషా! హింసించువాఁడును మాధనమును, దీసికొనువాఁడును, మేము ఓర్వశక్యముకానివాఁడు నగు నేశత్రువుమమ్ము (ఈదారినడువవద్దని) యాజ్ఞాపించునో వానిని మార్గమునుండి తొలఁగింపుము.

౫౦౨. అపత్యం పరిపంథినం ముషీవాణం హురశ్చితమ్ । దూరమధిస్రుతేరజ॥

వం॥ మార్గప్రతిబంధముచేయునట్టి దొంగయు, కుతంత్రముపన్నునట్టి మాశత్రువును మార్గమునుండి దూరముగాఁ దొలఁగింపుము.

౫౦౩. త్వంతస్య ద్వయావినోఽఘ శంసస్య కస్యచిత్ । పదాభితిష్ఠ తపుషిమ్॥

వం॥ ఓ పూషా! తెలియునట్లును, తెలియకుండఁగను, దొంగిలించువాఁడును, మా కనిష్టములు కోరువాఁడును, ఫలానావాఁడని చెప్పవీలుగానివాఁడును అగువానియొక్క పరులకు సంతాపము గలిగించు దేహమును నీవు కాలితో మట్టిపెట్టి అణఁచివేయుము.

౫౦౪. ఆతత్తే దస్రమంతుమః పూషన్నవో వృణీమహే । యేనపితౄ నచోదయః॥

వం॥ జ్ఞానవంతుఁడవగు నో పూషా! ఏ రక్షణలతో మాపితరులను నడిపించితివో ఆ శత్రుసంహారికారివగు నీరక్షణను అంతటను గోరుచున్నాము.

౫౦౫. అధానో విశ్వసౌభగ హిరణ్యవాశీమత్తమ । ధనాని సుషణాకృధి॥

వం॥ సర్వసౌభాగ్యములుకలవాఁడా! సువర్ణమయాయుధములవాఁడా! పూషా! (పూర్వోక్తమగు) మాప్రార్థన నెఱవేర్చి యోగ్యమయిన దానములతో ధనములను గలుగఁజేయుము.

౫౦౬. అతినః సశ్చతోనయసుగానః సుపథాకృణు । పూషన్నిహ క్రతుం విదః॥

వం॥ మమ్ము బాధింపవచ్చిన శత్రువులను మాకుదూరముగాఁ దీసికొనిపొమ్ము. మమ్ము మంచిదారిని నడిపింపుము. ఈదారిలో మమ్ము నెట్లు సంరక్షింపవలెనో తెలిసికొనుము.

౫౦౭. అభిసూయవసం నయనవజ్వారో అధ్వనే । పూషన్నిహ క్రతుం విదః॥

వం॥ ఓ పూషా! మంచి సస్యములుగల ప్రదేశమునకు మమ్ము కొనిపొమ్ము. దారికై క్రొత్తసంతాపము లేకుండుఁగాక. ఈదారిలో మమ్ము నెట్లురక్షింపవలెనో తెలిసికొమ్ము.

౫౦౮. శగ్ధిపూర్ధి ప్రయంసిచ శిశీహి ప్రాస్యుదరమ్ । పూషన్నిహ క్రతుం విదః॥

ద॥ పూషా! మమ్మనుగ్రహింపసమర్థుడవుకమ్ము. (మాగృహమును) ధనము తోఁ బూరింపుము. అందఱిలో మమ్ము తేజోవంతులం జేయుము. మాకడుపునన్నము తో నిండింపుము: తక్కినది పూర్వవత్.

౫౦౯. నపూషణం మేథామసి సూక్తై రభి గృణీమసి । వసూనిదస్మమీమహే॥

ద॥ పూష దేవుని మేము నిందింపము. వేదములోని సూక్తములతో స్తుతింతుము. దర్శనీయుఁడగు పూషదేవుని ధనములను గోరుచున్నాము.

---

సూక్తము, ౪౩.

(ఋషి - ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు; దేవత - ౧, ౨, ౪, ౫, ౬, రుద్రుఁడు; ౩, మిత్రావరుణులు; ౭, ౮, ౯, సోముఁడు; ఛందస్సు - గాయత్రి. ౯, అనుష్టుప్.)

౫౧౦. కద్రుద్రాయ ప్రచేతసే మీళ్హుష్టమాయ తవ్యసే । వోచేమశంతమం హృదే॥

ద॥ మిక్కిలి జ్ఞానముకలవాఁడును, (కోర్కెల) వర్షించువాఁడును, బాగుగవృద్ధిఁ బొందినవాఁడును, మామనస్సులో నిల్చినవాఁడునగు రుద్రునికొఱకు మిక్కిలి సుఖకరమగు స్తోత్రము నెప్పుడు ఉచ్చరింతుమో?

౫౧౧. యథానో అదితిః కరత్పశ్వే నృభ్యో యథాగవే । యథా తోకాయరుద్రియమ్॥

ద॥ భూమి మాకు రుద్రసంబంధమగు ఔషధములను గలుగఁజేయుఁగాక. మాబంట్లకుఁ, బశువులకును, మాసంతానమునకును, రుద్రీయమగు నౌషధములు సిద్ధించుఁగాక.

౫౧౨. యథానో మిత్రోవరుణో యథారుద్రశ్చికేతతి । యథా విశ్వే సజోషసః॥

ద॥ మిత్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు, సమానప్రీతిగల సర్వదేవతలు మమ్ము ననుగ్రహించుట యెట్లో తెలిసికొందురుగాక.

౫౧౩. గాథపతిం మేధపతిం రుద్రం జలాషభేషజమ్ । తచ్ఛంయోః సుమ్నమీమహే॥

తా॥ స్తుతులను బాలించువాఁడును, యజ్ఞపాలకుఁడును, సుఖరూపములగు నౌషధములుకలవాఁడునగు, లేక, జలరూపౌషధముకలవాఁడునగు రుద్రుని ఉద్దేశించి (బృహస్పతికొడుకు) శంయువనువాఁడు పొందినసుఖమును మాకుఁ గోరుచున్నాము.

౫౧౪. యఃశుక్ర ఇవసూర్యోహిరణ్యమివ రోచతే । శ్రేష్ఠోదేవానాం వసుః॥

తా॥ ఏరుద్రుఁడు సూర్యునివలె దీపించుచు బంగారువలెఁ బ్రియమయినవాఁడును, నివాసహేతువై దేవతలలో శ్రేష్ఠుఁడై యున్నాఁడో?

౫౧౫. శంనః కరత్యర్వతే సుగం మేషాయమేష్యే । నృభ్యోనారిభ్యోగవే॥

తా॥ మాయొక్క గుఱ్ఱములకు, మగగొఱ్ఱెలకు, ఆడగొఱ్ఱెలకు, మగవారికి, స్త్రీలకు, గోవులకును, సులభమగు సుఖమును గలుగఁజేయునుగాక. (రుద్రుఁడనితా॥)

౫౧౬. అస్మే సోమశ్రియమధిని ధేహిశతస్యనృణామ్ । మహిశ్రవస్తు విస్నృమ్ణమ్॥

తా॥ ఓ సోమదేవా! నూఱుగురు మనుష్యులకు సరిపడినంత సంపద మాకిమ్ము. అధికబలముతోఁ గూడినయన్నమునిమ్ము.

౫౧౭. మానః సోమపరిబాధో మారాతయో జుహురంత । ఆన ఇందోవాజే భజ॥

తా॥ ఓ సోముఁడా! యజ్ఞముచెఱుపువారు మమ్ము హింసింపకుందురుగాక. శత్రువులును మమ్ము హింసింపకుందురుగాక. మాయన్నమునకు బలమునకు మమ్ము సంతతము సేవింపుము.

౫౧౮. యాస్తేప్రజా అమృతస్య పరస్మిన్ధామన్నృతస్య ।
మూర్ధానాభా సోమవేన ఆభూషంతీః సోమవేదః॥

తా॥ ఓ సోముఁడా! అమరణధర్మముకలవాఁడవును ఉత్తమస్థానమందున్నవాఁడవునగు నిన్ను, నీప్రజలను, సర్వసన్నాహములుగల యజ్ఞగృహమందు ముఖ్యుఁడవయిన నిన్ను అన్నివిధముల నలంకరించుచున్నవారినిగాఁ దెలిసికొనుము.

ఇట్లు ప్రథమమండలమున అష్టమానువాకము. శ్రీ శ్రీ శ్రీ

—;o;—

## అనువాకము. ౯.

## సూక్తము ౪౪.

(ఋషి - కణ్వపుత్రుఁడగు ప్రస్కణ్వుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - బృహతి.)

౫౧౯. అగ్నే వివస్వ దుషస శ్చిత్రం రాధో అమర్త్య ।

ఆదాశుషే. జాతవేదో వహా త్వమద్యా దేవాఁ ఉషర్బుధః॥

తా॥ ఓయగ్నీ! ఉషస్సునుండి నానావిధమయిన నివాసయోగ్యమయిన యన్నమును యజమానునకుఁ దెచ్చియిమ్ము. మరణములేనివాఁడా! జంతువులన్నిటినిం దెలిసినవాఁడా! తెల్లవాఱువఱకు మేల్కొనియున్న దేవతలను ఈదినమందుఁ దీసికొనిరమ్ము.

౫౨౦. జుష్టో హిదూతో అసి హవ్యవాహనోఽగ్నే రథీ రధ్వరాణామ్ ।

సజూ రశ్విభ్యా ముషసా సువీర్య మస్మే ధేహి శ్రవో బృహత్॥

తా॥ ఓయగ్నీ! నీవు సేవింపఁబడువాఁడవు. దేవదూతవు. హవిస్సును మోసికొని పోవువాఁడవు. యజ్ఞమునకు రథమువంటివాఁడవు. అశ్వినీదేవతలతోను ఉషస్సుతోను గూడుకొని మంచివీర్యముగల గొప్పయన్నమును మాకొఱకునిమ్ము.

౫౨౧. అద్యా దూతం వృణీమహే వసు మగ్నిం పురుప్రియమ్ ।

ధూమకేతుం భాఋజీకం వ్యుష్టిషు యజ్ఞానా మధ్వరశ్రియమ్॥

తా॥ దూతయు, నివాసహేతువును, బహుమందికిఁ బ్రియుఁడును, పొగధ్వజము గాఁగలవాఁడును, ప్రసిద్ధ కాంతిగలవాఁడును, ఉషఃకాలములందు యజమానుని యాగమును సేవించు వాఁడును అగు నగ్నినిపుడు ప్రార్థించుచున్నాము.

౫౨౨. శ్రేష్ఠం యవిష్ఠ మతిథిం స్వాహుతం జుష్టం జనాయ దాశుషే ।

దేవాఁ అచ్ఛా యాతవే జాతవేదసమగ్ని మీళే వ్యుష్టిషు॥

దం॥ శ్రేష్ఠుఁడును, వయసులోనున్నవాఁడును, ఎల్లప్పుడు నడచువాఁడును, హోమమునకు సర్వత్ర ఆధారమయినవాఁడును, యజమానునకుఁ బ్రియుఁడును, సర్వవస్తుజ్ఞానముకలవాఁడును, అగునగ్నిని అందఱిదేవతలను, ఉపయుక్తకాలమున సభిముఖులం జేయుటకుఁ బ్రార్థించుచున్నాను.

ఋ.౨౩. స్తవిష్యామి త్వామహం విశ్వస్యామృతభోజన।
అగ్నే త్రాతార మమృతం మియేధ్య యజిష్ఠం హవ్యవాహన॥

దం॥ మరణములేనివాఁడా! సమస్తమును దినువాఁడా! హవిస్సును మోసికొనిపోవువాఁడా! యజ్ఞమునకర్హుఁడా! అగ్నీ! సర్వజగద్రక్షకుఁడవును, మరణధర్మములేనివాఁడవునయి యజ్ఞమును బాగుజేయునిన్ను నేను స్తుతించుచున్నాను.

ఋ.౨౪. సుశంసో బోధి గృణతే యవిష్ఠ్య మధుజిహ్వః స్వాహుతః।
ప్రస్కణ్వస్య ప్రతిరన్నాయు ర్జీవసే నమస్యా దైవ్యం జనమ్॥

దం॥ పూర్ణవయసువాఁడవగు నగ్నీ! స్తుతికర్తయగు యజమానునకు బాగుగ స్తుతింపఁదగినవాఁడవును హవ్యమునుగ్రహించు జిహ్వలుగలిగి అభిముఖముగా హోమము చేయంబడువాఁడవన్న నై మాయభిప్రాయమును దెలిసికొనుము. ప్రస్కణ్వుని (కణ్వపుత్రుఁడు) జీవనముకొఱకు నాయుర్దాయమును వృద్ధిసేయుచు దేవసంబంధిజనమును బూజింపుము.

ఋ.౨౫. హోతారం విశ్వవేదసం సంహిత్వా విశ ఇన్ధతే।
స ఆవహ పురుహూత ప్రచేతసోఽగ్నే దేవాఁ ఇహ ద్రవత్॥

దం॥ హోమమును గలిగించువాఁడును సర్వజ్ఞుఁడునగు నిన్ను బ్రజలు చక్కఁగా వెలిఁగింతురుగదా! బహుమందిచేఁ బిలువఁబడువాఁడా! అగ్నీ! మిక్కిలి జ్ఞానముకల దేవతలను ఈకర్మయందు శీఘ్రము అభిముఖులగునట్లు నీవురప్పింపుము.

ఋ.౨౬. సవితార ముషస మశ్వినా భగ మగ్నిం వ్యుష్టిషు క్షపః।
కణ్వాసస్త్వా సుతసోమాస ఇన్ధతే హవ్యవాహం స్వధ్వర॥

దం॥ శుభమగు యాగముకలవాఁడా! అగ్నీ! (ఆహవనీయ) ఉషఃకాలమందు ఆహుతిరూపమయిన యన్నమునుగూర్చి సవితను, ఉషస్సును, అశ్వినులను, భగుని, అగ్నిని, రాత్రి దేవతను, దీసికొనిరమ్ము. మేధావంతులయి సోమమునభిషవించిన ఋత్విజులు హవిస్సును మోసికొనిపోవు నిన్ను మండించుచున్నారు.

౫.౨౭. పతిర్హ్యధ్వరాణా మగ్నే దూతో విశామసి ।
ఉషర్బుధ ఆవహ సోమపీతయే దేవాఅద్య స్వర్దృశః॥

దం॥ ఓ యగ్నీ! ప్రజల సంబంధమయిన యాగములఁ బరిపాలించు నీవు దేవ దూతవుగదా! ఉషఃకాలమున మేల్కొని సూర్యునివలె గనంబడు దేవతలను సోమ పానమున కీదినమందు నెదురుగాఁ దీసికొనిరమ్ము.

౫.౨౮. అగ్నే పూర్వా అనూషసో విభావసో దీదేథ విశ్వదర్శతః ।
అసి గ్రామేష్వవితా పురోహితోఽసి యజ్ఞేషు మానుషః॥

దం॥ విశేషకాన్తి ధనముగాఁగల యగ్నీ! అందఱిచేతఁ జూడఁదగిననీవు జరిగి పోయిన ఉషఃకాలములనుగూర్చి చక్కగా మండినవాఁడవయితివి. అట్టినీవు గ్రామము లందు రక్షకుఁడవగుచున్నావు. చేయవలసిన కర్మలలో వేదికయొక్క పూర్వ భాగమందున్నవాఁడవయి మనుష్యులకు మేలుచేయువాఁడవగుచున్నావు.

౫.౨౯. నిత్వా యజ్ఞస్య సాధన మగ్నే హోతార మృత్విజమ్ ।
మనుష్వ ద్దేవ ధీమహి ప్రచేతసం జీరం దూతమమర్త్యమ్॥

దం॥ ఓయగ్ని దేవా! యజ్ఞమును గలిగించునట్టి, ఋత్విజుఁడవగునట్టి, అధికజ్ఞానము గలిగినట్టి, శత్రువుల వయసునకు హానిగలిగించునట్టి, మరణములేనట్టి, దేవదూతవగు నిన్ను మనువునిలిపినట్లు మేము (వేదిపై) నిలుపుచున్నాము.

౫.౩౦. యద్దేవానాం మిత్రమహః పురోహితో న్తరో యాసి దూత్యమ్ ।
సిన్ధోరివ ప్రస్వనితాస ఊర్మయోఽగ్నే ర్భ్రాజన్తే అర్చయః॥

వ॥ మిత్రులనన్నించువాఁడవును, (వేది) పూర్వభాగమున నుంచఁబడినవాఁడవును, దేవయజనస్థానమధ్యమున నున్నవాఁడవును అగు ఓ యగ్నీ! నీవు దేవతలకు దూతకార్యము సేయుచున్నావు. అప్పుడు నీకాంతులు మిక్కిలి ధ్వనించు సముద్రతరంగములవలెఁ బ్రకాశించుచున్నవి.

౫౩౧. శ్రుధి శ్రుత్కర్ణ వహ్నిభిర్దేవైరగ్నే సయావభిః ।

ఆ సీదంతు బర్హిషి మిత్రో అర్యమా ప్రాతర్యావాణో అధ్వరమ్॥

వ॥ వినుచున్న చెవులుగల యగ్నీ! మామాటలు వినుము. నీతో సమానముగా నడచు మిత్ర-అర్యమ దేవతలును ఫలమును, బట్టుకొని ప్రాతఃకాలమున దేవయజనస్థానమునకువచ్చు నితర దేవతలును, నీవునుంగూడి యజ్ఞమునకుఁగాను దర్భలమీఁద గూర్చుండుడు.

౫౩౨. శృణ్వంతు స్తోమం మరుతః సుదానవోఽగ్నిజిహ్వా ఋతావృధః ।

పిబతు సోమం వరుణో ధృతవ్రతోఽశ్విభ్యాముషసా సజూః॥

వ॥ చక్కఁగా ఫలమునిచ్చువారును, అగ్నియే నాలుకగాఁ గలవారును, యజ్ఞమునువృద్ధిసేయువారును నగు మరుత్తులు మాస్తోత్రమును విందురుగాక. కర్మచేయఁ బూనిన వరుణదేవుఁడు అశ్వినీదేవతలతోను ఉషస్సుతోను గూడుకొని సోమమును త్రావుగాక.

—:-౦-:—

సూక్తము. ౪౫.

(ఋషి - ప్రస్కణ్వుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - అనుష్టుప్.)

౫౩౩. త్వమగ్నే వసూఁరిహ రుద్రాఁ ఆదిత్యాఁ ఉత ।

యజా స్వధ్వరం జనం మనుజాతం ఘృతప్రుషమ్॥

వ॥ అగ్నీ! ఉదకమును వర్షించునట్టి, శుభమయిన యాగమును చేయునట్టి, మనువను ప్రజాపతిచే సృజింపఁబడినట్టి యితర దేవతలను, వసువులను, రుద్రులను, ఆదిత్యులను, ఈకర్మవద్దకుఁ (దెచ్చి) నీవు యజింపుము.

౫౩౪. శ్రుష్టీవానో హి దాశుషే దేవా అగ్నే విచేతసః ।
తాన్రోహిదశ్వ గిర్వణ స్త్రయస్త్రింశత మావహ॥

వ॥ రోహితములను నశ్వములుగలవాఁడా! స్తుతులను మెచ్చువాఁడా! అగ్నీ! విశేషజ్ఞానవంతులై యజమానునకు ఫలమునిచ్చు దేవతలను, ముప్పదిముగ్గురిని యీ చోటికిఁ దీసికొనిరమ్ము.

౫౩౫. ప్రియమేధవ దత్రివజ్జాత వేదో విరూపవత్ ।
అఙ్గిరస్వన్మహివ్రత ప్రస్కణ్వస్య శ్రుధీ హవమ్॥

వ॥ బహువిధ కర్మలుగల జాతవేదా! కణ్వపుత్రుని యాహ్వానమును, ప్రియమేధునియొక్కయు, అత్రియొక్కయు, విరూపునియొక్కయు, అంగిరునియొక్కయు, ఆహ్వానములు వినినట్లు వినుము.

౫౩౬. మహికేరవ ఊతయే ప్రియమేధా అహూషత ।
రాజంత మధ్వరాణా మగ్నిం శుక్రేణ శోచిషా॥

వ॥ ప్రౌఢమయిన కర్మలుగలవారై యజ్ఞమందుఁ బ్రీతికలఋషులు యజ్ఞముల మధ్యను శుద్ధమయిన ప్రకాశముతో దీపించు నగ్నిని రక్షణకొఱకుఁ బిలిచిరి.

౫౩౭. ఘృతాహవన సంత్యే మా ఉషు శ్రుధీ గిరః ।
యాభిః కణ్వస్య సూనవో హవంతే వసేత్వా॥

వ॥ నేతితోఁ బిలువఁబడువాఁడా! సత్యఫలదాతా! అగ్నీ! రక్షణకొఱకుఁ గణ్వపుత్రులు ఏస్తుతులతో నిన్నుఁబిలిచిరో, యా యీ స్తుతుల బాగుగ వినుము.

౫౩౮. త్వాం చిత్రశ్రవ స్తమ హవంతే విక్షు జంతవః ।
శోచిష్కేశం పురుప్రియాగ్నే హవ్యాయ వోఢవే॥

వ॥ వివిధమయిన యన్నములతోఁగూడినవాఁడా! బహుమందికిఁ బ్రియుఁడా! అగ్నీ! హవిస్సును మోసికొనిపోవు యజమానులు ప్రకాశించు కేశములుగల నిన్నుఁ బిలుచుచున్నారు.

౪౩౯. నిత్వా హోతార మృత్విజం దధిరే వసువిత్తమమ్।
శ్రుత్కర్ణం సప్రథస్తమం విప్రా అగ్నే దివిష్టిషు॥

వ॥ ఓ యగ్నీ! దేవతలంబిలుచువాఁడవు, ఋతువులందు యాగము సేయువాఁడవు, అధికధనము గల్గించువాఁడవు, వినదగిన చెవులుగలవాఁడవు, ప్రఖ్యాతిగలవాఁడవు నగు నిన్ను మేధావంతులు యాగములందు స్థాపించిరి.

౪౪౦. ఆత్వా విప్రా అచుచ్యవుః సుతసోమా అభిప్రయః।
బృహద్భా బిభ్రతో హవి రగ్నే మర్తాయ దాశుషే॥

వ॥ గొప్పవాఁడవు, ప్రకాశించువాఁడవు నగు నగ్నీ! యజమానుని హవిస్సును ధరించినవారును, అభిషవించినసోమముకలవారును, మేధావంతులునగు (ఋత్విజులు) హవిస్సురూపమయిన యన్నములకై నిన్నుఁ దీసికొనివచ్చుచున్నారు.

౪౪౧. ప్రాతర్యావ్ణః సహస్కృత సోమపేయాయ సంత్య।
ఇహాద్య దైవ్యం జనం బర్హి రాసాదయావసో॥

వ॥ బలముతో మథించి చేయఁబడి ఫలదాతవై నివాసమునకు హేతుభూతుఁడవగు నో యగ్నీ! ఈ దేవయజనస్థానమున నీదినమందు సోమపానముకొఱకుఁ బ్రాతఃకాలమున వచ్చునట్టి దేవతలను, ఇతర దేవతలను, యజ్ఞమునకుఁ దీసికొనిరమ్ము.

౪౪౨. అర్వాంచం దైవ్యం జనమగ్నే యక్ష్వ సహూతిభిః।
అయం సోమః సుదానవస్తం పాత తిరోఅహ్న్యమ్॥

వ॥ ఓ యగ్నీ! అభిముఖుఁడవై ఆహ్వానముతో వచ్చు దేవతలతోఁగూడవచ్చు నితరదేవతలనుగూడ యజింపుము. బాగుగఫలమునిచ్చు దేవతలారా! ఇదిగో సోమము. తిరోఅహ్న్యమను (నిన్నసభిషవించి యీదినము హోమము చేయఁబడునది) ఈసోమమును పానము చేయుఁడు.

—:-o-:—

## సూక్తము, ౪౬.

(ఋషి - ప్రస్కణ్వుఁడు; దేవత - అశ్వినీదేవతలు; ఛందస్సు - గాయత్రి.)

౫౪౩. ఏషో ఉషా అపూర్వ్యా వ్యుచ్ఛతి ప్రియా దివః ।

స్తుషే. వామశ్వినా బృహత్॥

దం॥ మాకుఁగనిపించుచున్నదియుఁ బ్రియమగునదియు నగు నీక్రొత్తయుషస్సు ద్యులోకమునుండి వచ్చి చీఁకటిని బోఁగొట్టుచున్నది. ఓయశ్వినీదేవతలారా! మిమ్ముల నధికముగా స్తుతించుచున్నాను.

౫౪౪. యా దస్రా సింధుమాతరా మనోతరా రయీణామ్ । ధియా దేవా వసువిదా॥

దం॥ దర్శనీయులును సముద్రమందుఁబుట్టినవారును, (కొందఱిమతమున సూర్యచంద్రులే యశ్వినీదేవతలని) ధనములను మనసుతోనే యిచ్చువారును, కర్మచేత నివాసస్థానమును బొందించువారునగు నశ్వినుల నిద్దఱిని స్తుతించుచున్నానని పూర్వాన్వయము.

౫౪౫. వచ్యన్తే వాంకకుహాసో జూర్ణాయామధివిష్టపి । యద్వాం రథో విభిష్పతాత్॥

దం॥ ఓయశ్వినులారా! మీరథము సకలశాస్త్రములచేత స్తుతింపఁబడిన స్వర్గలోకమందు అశ్వములతో నడచునపుడు మీయొక్క స్తుతులు మాచే నుచ్చరింపఁబడుచున్నవి.

౫౪౬. హవిషా జారో అపాం పిపర్తి పపురిర్నరా । పితా కుటస్య చర్షణిః॥

దం॥ ఓయశ్వినులారా! ఉదకములగార్చువాఁడును, నీటిని బూరించువాఁడును, పాలకుఁడును, గర్మద్రష్టయునగు సూర్యుఁడు మేమిచ్చు హవిస్సులతో దేవతలను దృప్తిపఱచును.

౫౪౭. ఆదారో వాం మతీనాం నాసత్యామతవచసా । పాతం సోమస్య ధృష్ణుయా॥

దం॥ స్తోత్రమందిష్టముకలవారగు నశ్వినులారా! మీ బుద్ధులను బ్రేరించుచు, మదమునుగలిగించు సోమమును మీరిద్దఱును బానము సేయుఁడు.

౫౪౮. యా నః పీపర దశ్వినా జ్యోతిష్మతీ తమ స్తిరః । తా మస్మే రాసాథా మిషమ్॥

దం॥ అశ్వినులారా! ఏది (దారిద్ర్యా)ంధకారమును నశింపఁజేసి మమ్ముఁ దృప్తి పఱచునో, (రసవీర్యాదిరూపమగు) తేజస్సుగల యా యన్నమును మమ్ముఁ దృప్తి నొందించుఁగాక.

౫౪౯. ఆ నో నావా మతీనాం యాతం పారాయ గంతవే । యుంజాథా మశ్వినా రథమ్॥

దం॥ అశ్వినులారా! స్తుతులయొక్క అవతలియొడ్డునకుఁ జేరుటకు నోడతో మమ్ముఁ జేరుడు. మీ రథమునకు గుఱ్ఱములఁ బూన్పుడు. (అనఁగా స్తుతుల సాకల్యముగా నాలకింపనని)

౫౫౦. అరిత్రం వాం దివస్పృథు తీర్థే సింధూనాం రథః । ధియా యుయుజ్ర ఇందవః॥

దం॥ సముద్రముల రేవునందు ద్యులోకముకంటెఁ బెద్దదగు ఓడఁగడుపు తెడ్డును రథమును మీయిద్దఱకుంగలవు. సోమములు మిమ్ముఁదలఁచుచుండెను,

౫౫౧. దివస్కణ్వాస ఇందవో వసు సింధూనాం పదే । స్వం వవ్రిం కుహ ధిత్సథః॥

దం॥ ద్యులోకమునుండి సూర్యకిరణములు (పుట్టినవి.) మా నివాసములకు సోపానముగు నుషఃకాల తేజస్సు అంతరిక్షమందు (పుట్టినది.) ఓ ఋత్విజులారా! (ఈసమయమున) మీ స్వరూపము నెక్కడను ంచదలచిరి? (అని యశ్విను లడుగుచుండు.)

౫౫౨. అభూదు భా ఉ అంశవే హిరణ్యం ప్రతి సూర్యః । వ్యఖ్యజ్జిహ్వయా సితః॥

దం॥ ఉషఃకాలకిరణస్థితికి సూర్యకాంతియయ్యెను. బంగారముకొఱకు బుట్టినందున సూర్యుఁడు బంగారుకాంతి వాఁడయ్యెను. (అగ్ని) తన కాంతితో సూర్యునిలోఁ బ్రవేశించినందున జ్వాలతో నల్లనివాఁడయి వెలింగెను.

౫౫౩. అభూదు పార మేతవే పంథా ఋతస్య సాధుయా । అదర్శి వి స్రుతిర్దివః॥

దం॥ (రాత్రియంతమగు నుదయాద్రిని) పొందుటకు సూర్యునియొక్క మార్గము చక్కనిదియయ్యెను. సూర్యునియొక్క కాన్తి విశేషముగాఁ గనబడెను. (కనుక నశ్వినులారా! మీరు రావలసిన కాలమిదియని తా॥)

౫౪౪. తత్తదిదశ్వినో రవో జరితా ప్రతి భూషతి । మదే సోమస్య పిప్రతోః॥

వ॥ అశ్వినులుమాటిమాటికిఁ జేయుచున్నరక్షణ లన్నిటిలో నాకొకదానిని, సోమము త్రాగుచున్న యశ్వినుల హర్షముకొఱకు స్తుతిపాఠకుఁడు ప్రశంసించుచున్నాఁడు. (పాడుచున్నాఁడని తా॥)

౫౪౫. వావసానా వివస్వతి సోమస్య పీత్యాగిరా । మనుష్వచ్ఛంభూ ఆగతమ్॥

వ॥ సుఖమునుగలిగించు నశ్వినులారా! పరిచరించు యజమానునందు మనువు నందు వలె నివసించువారై, మీరు సోమపానముకొఱకును, స్తుతికొఱకును, రండు.

౫౪౬. యువో రుషా అనుశ్రియం పరిజ్మనో రుపాచరత్ । ఋతా వనథో అక్తుభిః॥

వ॥ అశ్వినులారా! అంతటసుదిరుగు మీయుభయులయొక్క రాకను అనుసరించి ఉషయిచ్చటికి వచ్చుఁగాక. మీరిద్దఱును రాత్రులతోఁగలిసి యజ్ఞమందలి హవిస్సులను గోరుకొనుఁడు.

౫౪౭. ఉభా పిబత మశ్వినోభా నః శర్మయచ్ఛతమ్ । అవిద్రియాభి రూతిభిః॥

వ॥ ఓయశ్వినులారా! ప్రశస్తమయిన రక్షణలతో మీరిద్దఱు సోమపానము సేయుఁడు. మాకు సుఖమిండు.

ఇట్లు తృతీయాధ్యాయము సమాప్తము శ్రీ శ్రీ శ్రీ

—:–O–:—

## చతుర్థాధ్యాయము.

—:-౦-:—

### అనువాకము. ౯.

### సూక్తము. ౪౭.

(ఋషి - కణ్వపుత్రుఁడు ప్రస్కణ్వుఁడు; దేవత - అశ్వినీదేవతలు; ఛందస్సు - బృహతీ.)

౫౫౮. ఓం అయం వాం మధుమత్తమః సుతః సోమ ఋతావృధా।

తమశ్వినా పిబతం తిరోఅహ్న్యం ధత్తం రత్నాని దాశుషే॥

దం॥ యజ్ఞమునువృద్ధిసేయు నశ్వినులారా! మిగుల తియ్యని తిరోఅహ్న్యమును (నిన్నఅభిషవించి యీనాఁడు తయారుచేసినది) సోమము ఇదిగో. మీ యుద్దేశింపఁబడుచు నున్నది. దానిని మీరుత్రావుఁడు. యజమానునకు రమణీయ ధనములిండు.

౫౫౯. త్రివన్ధురేణ త్రివృతా సుపేశసా రథేనా యాతమశ్వినా।

కణ్వాసో వాం బ్రహ్మ కృణ్వన్త్యధ్వరే తేషాం సుశ్రుణుతం హవమ్॥

దం॥ అశ్వినులారా! ఎత్తుపల్లములుగా మూఁడు కూర్చొనుచోట్లుగలిగి, మూఁడు లోకములందు సంచారమును గల్గిన చక్కని బంగారముకల రథముతో రండు. జ్ఞానవంతులయిన ఋత్విజులు మీస్తుతిమంత్రములఁజదువుచున్నారు. యజ్ఞములోని వారి యాహ్వానమువినుఁడు.

౫౬౦. అశ్వినా మధుమత్తమం పాతం సోమమృతావృధా।

అథాద్య దస్రా వసు బిభ్రతా రథే దాశ్వాంస ముపగచ్ఛతమ్॥

దం॥ క్రతువు వృద్ధిసేయు నశ్వినులారా! అతిమధురమగు సోమమునుద్రావుఁడు. ఆహ్వానము విన్నతరువాత నశ్వినులారా! ధనమునునింపిన రథముతో యజమానుని దగ్గఱకురండు.

౩౬౧ త్రిపధస్థే బర్హిషి విశ్వవేదసా మధ్వా యజ్ఞం మిమిక్షతమ్ ।
కణ్వాసో వాం సుత సోమా అభిద్యవో యువాం హవన్తే అశ్వినా॥

ద॥ సర్వజ్ఞులగు నశ్వినులారా! మూఁడు వరుసలుగాఁ బఱువఁబడిన దర్భల యందుఁగూర్చొని మధురరసముతో యజ్ఞమును దడిపి వేయుఁడు. అశ్వినులారా! మీకొఱకభిషవించిన సోమము కలవారును, కాంతిమంతులునగు ఋత్విజులు మిమ్ముఁ బిలుచుచున్నారు.

౩౬౨. యాభిః కణ్వమభిష్టిభిః ప్రావతం యువమశ్వినా ।
తాభిః ష్వ౩స్మాఁ అవతం శుభస్పతీ పాతం సోమ మృతావృధా॥

ద॥ అశ్వినులారా। ఏస్తుతులచేత మీరు కణ్వషిఁని రక్షించితిరో, ఆస్తుతుల చేతనే మమ్ముఁ బాగుగా రక్షింపుడు. శుభకర్మలను బాలించునట్టి, యజ్ఞమును వృద్ధిసేయునట్టివారై సోమపానము సేయుఁడు.

౩౬౩. సుదాసే దస్రావసు బిభ్రతా రథే పృక్షో వహతమశ్వినా ।
రయిం సముద్రాదుత వా దివస్పర్యస్మే ధత్తం పురుస్పృహమ్॥

ద॥ సొగసయిన యశ్వినులారా! సుదాసుఁడను రాజునకు ధనవంతమగు రథమం దన్నమును గొనియిచ్చితిరి. అంతరిక్షమునుండియో, స్వర్గమునుండియో బహుమంది కోరఁదగినయన్నమును మాకిండు.

౩౬౪. యన్నాసత్యా పరావతి యద్వాస్థో అధితుర్వశే ।
అతో రథేన సువృతాన ఆగతంసాకం సూర్యస్యరశ్మిభిః॥

ద॥ అశ్వినులారా! మీరు దూరస్థలమందుండిగాని మిగుల దగ్గఱచోటినుండిగాని ఈ చోట్లనుండి చక్కఁగానడచునట్టి రథముతో సూర్యకిరణములతోఁగూడ (తెల్లవారఁగానే అని తా॥) మావద్దకురండు.

౫౬౫. అర్వాఞ్చా వాం సప్తయో౽ధ్వరశ్రియో వహన్తు సవనేదుప ।
ఇషం పృఞ్చన్తా సుకృతే సుదానవ ఆబర్హిః సీదతం నరా॥

దం॥ అశ్వినులారా! యాగమును సేవించునట్టి యశ్వములు మీము చేయు మూఁడు సవనములందు అభిముఖముగా మిమ్ముఁ దెచ్చుగాక. ఓ నాయకులారా! బాగుగఁ గర్మ చేయుచున్న (యజమానునకు) అన్నమును గూర్చువారై మీరాగు దర్భల పైని గూర్చుండుడు.

౫౬౬. తేన నాసత్యాగతం రథేన సూర్యత్వచా ।
యేన శశ్వదూహథుర్దాశుషే వసు మధ్వః సోమస్య పీతయే॥

దం॥ ఓ సత్యవంతులారా! హవిర్దాతకు ధనము నెల్లప్పుడును సంగ్రహముతోఁ బొందింతురో సూర్యరశ్మిలతోఁ గప్పిన యారథముతో మధురమగు సోమమును ద్రావుటకు రండు.

౫౬౭. ఉక్థేభి రర్వాగవసే పురూవసూ అర్కైశ్చ నిహ్వయామహే ।
శశ్వత్కణ్వానాం సదసి ప్రియే హికం సోమం పపథు రశ్వినా॥

దం॥ విశేషధనవంతులగు నశ్వినులారా! మమ్ము రక్షించుటకు స్తుతిమంత్రములతోను, పూజార్హ మంత్రములతోను, మాకభిముఖముగా మిమ్ము బిలుచుచున్నాము. అశ్వినులారా! మేధావంతులకుఁ (ఋత్విజు) ప్రియమైన యజ్ఞస్థలమందు నెల్లప్పుడు సోమమును ద్రావుదురుగాక. ఏ సోమము త్రాగుదురు?

—;o;—

## సూక్తము. ౪౮.

(ఋషి - ప్రస్కణ్వుఁడు; దేవత - ఉష; ఛందస్సు - బృహతి.)

౫౬౮. సహ వామేన న ఉషో వ్యుచ్ఛా దుహితర్దివః ।
సహ ద్యుమ్నేన బృహతా విభావరి రాయా దేవి దాస్వతీ॥

## ఉష

మం ౧. అను ౯. సూ ౪౮.] ఋగ్వేదము.

సహ వామేన న ఉషో వ్యుచ్ఛా దుహితర్దివః। సహ ద్యుమ్నేన బృహతా విభావరి రాయా దేవి దాస్వతీ

దం॥ ద్యుదేవతకూతురగు నోఉషా! మాకొఱకు ధనముతోఁగూడఁ బ్రభాతము కావింపుము. ఓఉషద్దేవతా! విస్తారముయిన అన్నముతోఁగూడఁ బ్రభాతము కావింపుము. ఓదేవి! నీవుదానముకలదానవై ధనముతోఁగూడఁ బ్రభాతము కావింపుము. (ప్రభాతము=ఉదయకాలము.)

౫౧౯. అశ్వావతీ ర్గోమతీ ర్విశ్వసువిదో భూరి చ్యవన్త వస్తవే ।

ఉదీరయ ప్రతి మా సూనృతా ఉష శ్చోద రాధో మఘోనామ్॥

దం॥ అశ్వములుగల్గి, గోవులుగల్గి, ధనము గలిగించునో ఉషోదేవతలారా! నివాసము విస్తారమగునట్లు దయచేయుఁడు. ఓఉషోదేవతా! నన్నుగూర్చి ప్రియహిత వాక్కులంబల్కుము. ధనవంతులధనము (మా) కిమ్ము.

౫౨౦. ఉవాసోషా ఉచ్ఛాచ్చను దేవీ జీరా రథానామ్ ।

యే అస్యా ఆచరణేషు దధ్రిరే సముద్రే న శ్రవస్యవః॥

దం॥ ధనముఁగోరినవారు సముద్రమునందు (నావలను) నడిపించునట్లు ఉషఃకాలము వచ్చినపు డేరథమును నడిపింతురో ఆరథమును నడిపించు ఉషోదేవి పూర్వమం దుండెను. ఇప్పటికిని బ్రభాతముసేయుచు నున్నది.

౫౨౧. ఉషో యే తే ప్ర యామేషు యుఞ్జతే మనో దానాయ సూరయః ।

అత్రాహ తత్కణ్వ ఏషాం కణ్వతమో నామ గృణాతి నృణామ్॥

దం॥ ఉషోదేవతా! నీవు నడచునపుడు ఏవిద్వాంసులు దానముకొఱకు మనస్సు ప్రేరింతురో ఆనరులయొక్క ఆపేరు కణ్వతముఁడని పిలుతురు. కణ్వమహర్షి యిట్లు చెప్పెను.

౫౨౨. ఆ ఘా యోషేవ సూనర్యుషా యాతి ప్రభుఞ్జతీ ।

జరయన్తీ వృజనం పద్వదీయత ఉత్పాతయతి పక్షిణః॥

దం॥ నడచునట్లి, ప్రాణులవయస్సును హరించునట్టి, ఉషాదేవి బాగుగ సర్వమును బాలించుచు గృహకృత్యములు నిర్వహించు స్త్రీవలె వచ్చుచున్నదికదా! పాద ములుకల జంతువులు ఉషఃకాలమందు నడచును. ఈయుషస్సు పక్షులనెగిరించును.

౫౭౩. వియాసృజతి సమనం వ్యర్థినః పదం న వేత్యోదతీ।
వయోనకిష్టే పప్తివాంస ఆసతే వ్యుష్టౌ వాజినీవతి॥

దం॥ ఏదేవత మంచినడవడికల వానిని (పనులలో) ప్రేరించునో, యాచకులను (దాతలయిండ్లకుఁబొమ్మని) ప్రేరించునో; ఒకచోట నిలుకడలేనట్టి, ఓఉషస్సా! అన్నముగలదానా! నీప్రభాతమందుఁ బక్షులు నివాసమందుండవు. (ఉషఃకాల మొతోనేపుండుమానుత నిలుకడలేదని తా॥)

౫౭౪. ఏషాయుక్త పరావతః సూర్యస్యోదయనాదధి।
శతం రథేభిః సుభగోషా ఇయం వియాత్యభి మానుషాన్॥

దం॥ ఈఉషాదేవత (తన) నూఱురథములను బూన్చినది. సౌభాగ్యవతియగు నీమె దూరమందున్న సూర్యుని ఉదయస్థానమునకు మీఁదనుండి మనుష్యులనుగూర్చి (నూఱు) రథములతో విశేషముగా నడచును.

౫౭౫. విశ్వమస్యా నానామ చక్షసే జగజ్జ్యోతిష్కృణోతి సూనరీ॥
అప ద్వేషో మఘోనీ దుహితా దివ ఉషా ఉచ్ఛదప స్రిధః॥

దం॥ ఈయుషస్సుయొక్క ప్రకాశమునకు సర్వజగత్తును నమస్కరించును. (ఏమంటే) ఈయుషస్సు (కార్యములందు) చక్కగాఁ బ్రేరించును. సర్వమునుసంచలించును. ధనవంతురాలును, ద్యుదేవతకుఁగూతురునగు నుషస్సు శత్రువులం దోలి వేయుచున్నది. (చీకటినణఁచు) బాధకులంగూడఁ (దొంగలని) దోలివేయుచున్నది.

౫౭౬. ఉష ఆభాహి భానునా చంద్రేణ దుహితర్దివః।
ఆవహంతీ భూర్యస్మభ్యం సౌభగం వ్యుచ్ఛంతీ దివిష్టిషు॥

దం॥ దివసములందు మాకు విస్తారముగా సౌభాగ్యమును గూర్చుచు ఓద్యు దేవతా పుత్రికా! చంద్రునిచేతను, సూర్యునిచేతను, ప్రకాశించుము.

౫౮౭. విశ్వస్య హి ప్రాణనం జీవనం త్వే వియ దుచ్ఛసి సూనరి ।
సానో రథేన బృహతా విభావరి శ్రుధి చిత్రామఘే హవమ్॥

దం॥ ఓఉషా! నీవు ఏకారణమునఁ ప్రకాశముగల్గి ప్రభాతమునిచ్చుచున్నావో అందుచేత సర్వప్రాణులయొక్క చలనము జీవనము నీయందే కలవు. అట్టినీవు మమ్ములఁ గూర్చి ప్రౌఢమయిన రథముతో (రమ్ము.) నానావిధ ధనములుగలదానా! మా ఆహ్వానములను వినుము.

౫౮౮. ఉషో వాజం హి వంస్వ యశ్చిత్రో మానుషే జనే ।
తే నావహ సుకృతో అధ్వరాఁ ఉపయే త్వాగృణన్తి వహ్నయః॥

దం॥ ఓఉషస్సా! ఏయన్నము మనుష్యునందుఁగలదో; యాయన్నమును స్వీకరింపుము. అందుచేత నేయజమానులు యజ్ఞనిర్వాహకులై నిన్ను స్తుతింతురో, ఆసత్కర్మలుగల (యజమానుల) అధ్వరముల నిర్వహింపుము (అధ్వర=హింసా రహితము. యాగమని తా॥)

౫౮౯. విశ్వాన్దేవాఁ ఆవహ సోమపీతయే న్తరిక్షా దుష స్త్వమ్ ।
సా స్మాసుధా గోమ దశ్వావ దుక్థ్య3 ముషో వాజంసువీర్యమ్॥

దం॥ ఓఉషా! సోమపానముకొఱకు సర్వదేవతలను అంతరిక్షమునుండి నీవు తీసికొనిరమ్ము. ఓఉషా! గోవులుగలదియు, నశ్వములుగలదియు, ప్రశస్తము శోభనమునైన వీర్యముగలదియునైన యన్నమును మాయందుఁ గలుగఁజేయుము.

౫౯౦. యస్యా రుశంతో అర్చయః ప్రతి భద్రా అదృక్షత ।
సా నో రయిం విశ్వవారం సుపేశస ముషా దదాతు సుగ్మ్యమ్॥

## సూక్తము. ౪౯.

(ఋషి - కణ్వపుత్రుఁడగు ప్రస్కణ్వుఁడు; ఛందస్సు - అనుష్టుప్; దేవత - ఉషస్సు.)

౫౭౩. ఉషో భద్రేభి రాగహి దివశ్చిద్రోచనా దధి।

వహన్త్వరుణప్సవ ఉపత్వా సోమినో గృహమ్॥

దం॥ ఉషో దేవతా! శోభనమార్గములద్వారా ప్రకాశించుచు మీఁదుగానున్నట్టి అంతరిక్షమునుండిరమ్ము. ఎఱ్ఱనిగోవులు యజమానుని దేవయజన గృహమునకు నిన్ను బొందించును.

౫౭౪. సుపేశసం సుఖం రథం యమధ్యస్థా ఉషస్త్వమ్।

తేనా సుశ్రవసం జనం ప్రావాద్య దుహితర్దివః॥

దం॥ ద్యుదేవతాపుత్రివగు నోఉషా! శోభనావయవములుగల్గి సుఖమైన యేరథమును నీవెక్కితివో ఆరథముతో శోభనహవిస్సులుగల జనుని యిపుడు సమీపించుము.

౫౭౫. వయశ్చిత్తే పతత్రిణో ద్విపచ్చతుష్పదర్జుని।

ఉషః ప్రారన్నృతూరను దివో అన్తేభ్యస్పరి॥

దం॥ తెల్లనికాన్తిగల ఉషోదేవీ! నిన్ననుసరించి నడుచుటకు ద్విపాదచతుష్పాద జంతువులును, అంతరిక్షము చివరల మీదినుండి ఱెక్కలుగల పక్షులును బాగుగ నడచుచున్నవి.

౫౭౬. వ్యుచ్ఛన్తీ హిరశ్మిభి ర్విశ్వమాభాసి రోచనమ్।

తాం త్వాముష ర్వసూయవో గీర్భిః కణ్వా అహూషత॥

దం॥ ఓఉషస్సా! చీకటిని బోగొట్టుచు నీవు నీతేజస్సులతో సకల ప్రపంచమును ప్రకాశించునట్లు వెలుంగుటచేత నిన్ను ధనకాములగు మేధావులు (ఋత్విజులు) వాక్కులతో స్తుతించుచున్నారు.

సూక్తము. ౫౦.

(ఋషి - ప్రస్కణ్వుఁడు; ఛందస్సు - ౧, ౯, గాయత్రి; ౧౦, ౧౩, అనుష్టుప్; దేవత - సూర్యుఁడు.)

౫౧౭. ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః । దృశే విశ్వాయ సూర్యమ్॥

దం॥ తెలివినిగలిగించు సూర్యాశ్వములు-లేక-సూర్యకిరణములు జంతువులకు జ్ఞానమిచ్చుట్టి ఆ సూర్యదేవుని అందఱును జూచుటకు మీఁదుగా వహించుచున్నవి.

౫౧౮. అప త్యే తాయవో యథా నక్షత్రా యన్త్యక్తుభిః । సూరాయ విశ్వచక్షసే॥

దం॥ ప్రసిద్ధమయిన దొంగవలె నక్షత్రములు రాత్రులతోఁగూడ విశ్వప్రకాశకుఁడగు సూర్యుని (రాకచూచి) పాఱిపోవుచున్నవి.

౫౧౯. అదృశ్ర మస్య కేతవో విరశ్మయో జనాఁ అను । భ్రాజన్తో అగ్నయో యథా॥

దం॥ సూర్యుని జండాలనందగిన కిరణములు ప్రకాశించు నగ్నులవలె జనులనందఱిని వరుసగాఁ జూచుచున్నవి.

౫౨౦. తరణి ర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య । విశ్వమాభాసి రోచనమ్॥

దం॥ ఓ సూర్యుఁడా! నీవు తరణివి. (ఎవరుగమనింపలేని మార్గమునడుచు) (లేక-ఓడవు.) అయితివి. అందఱిచేతను జూడఁదగినవాఁడవు. వెలుఁగును గలిగింతువు. చంద్ర నక్షత్రాదులను గలిగించువాఁడవు. కనుకనే ప్రపంచమునంతను బ్రకాశించుచున్నావు. లేక, ఆకాశమునంతటను బ్రకాశించుచున్నావు. (రాత్రి సూర్యకాన్తి పడినందుననే చంద్ర నక్షత్రాదులు వెలుగుచున్నవి.

౫౨౧. ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్ । ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే॥

దం॥ ఓ సూర్యుఁడా! దేవవిశులకు (మరుత్తులకు) అభిముఖముగాను, మనుష్యులకు అభిముఖముగాను, స్వర్గమునకు నభిముఖముగాను, గనఁబడుచు నుదయింతువు. (అందఱికిని సూర్యుఁడభిముఖముగానే యుండును.)

ఋ-౨. యేనా పావక చక్షసా భురణ్యన్తం జనాఁ అను । త్వం వరుణ పశ్యసి॥

దం॥ అన్నిటిని బవిత్రముచేయునట్టి, అనిష్టములనివారించునట్టివాఁడా! (సూర్యా! జనులను బోషించుచున్న ఏప్రకాశముతోఁ జూచుచున్నావో దానిని (స్తుతింతుము. అని ముందుకన్వయము.)

ఋ-౩. విద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః । పశ్యఞ్జన్మాని సూర్య॥

దం॥ ఓసూర్యా! రాత్రులతోఁగూడఁ బగళ్లనుజేయుచు జన్మించినవారినెల్లఁ జూచుచు విశాలమయిన అంతరిక్షలోకమును విశేషముగా గమనించుచున్నావు. (సూర్య=ప్రేరించువాఁడని వ్యు.)

ఋ-౪. సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య । శోచిష్కేశం విచక్షణ॥

దం॥ ఓ సూర్యదేవ! ప్రకాశించువాఁడా! కాంతులే కేశములుగాఁగలవాఁడా! ఏడుగుఱ్ఱములు (లేక కిరణములు) నిన్ను నడిపించుచున్నవి. లేక కొనిపోవుచున్నవి.

ఋ-౫. అయుక్త సప్త శున్ధ్యువః సూరో రథస్య నప్త్యః । తాభిర్యాతి స్వయుక్తిభిః॥

దం॥ రథమును బడకుండనిలిపిన యేడు ఆడుగుఱ్ఱములను రథమునఁబూన్చెను. ఆరథము తమంతామే పూన్చుకొన్న ఆగుఱ్ఱములతోఁ నడచుచున్నది.

ఋ-౬. ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యన్త ఉత్తరమ్ ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥

దం॥ చీకటితరువాతనుండు-లేక-పాపములవెలుపలను ఉండునట్టి తేజోవంతుఁడును, ఉత్కృష్టదేవతలలో దానశీలుఁడునైన సూర్యునిఁజూచుచున్నవారమై మేము ఉత్కృష్టతమమయిన తేజస్సును బొందుచున్నాము.

ఋ-౭. ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్ ।
హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥

దం॥ అందఱకునను కూలమగు దీప్తికల సూర్య! ఇపుడుదయించుచున్న నెత్తుగుచు యంతరిక్షమం దెక్కుచు నీవు నాహృదయరోగమును; కాంతినిదగ్గించునట్టి, పచ్చని కాన్తికలిగించునట్టి, కామెలపాండు- మొదలగు (బాహ్యరోగములను) నశింపఁ జేయుము.

౫౮. శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి ।

అథో హారిద్రవేషు మే హరిమాణం నిదధ్మసి॥

దం॥ నాపచ్చఁదనమును చిల్కలందు గోరువంకలందును ఉంచుచున్నాము. మఱియు హారిద్రవము చెట్లయందుఁ బచ్చదనము నుంచుచున్నాము.

౫౯. ఉదగాదయ మాదిత్యో విశ్వేన సహసాసహ ।

ద్విషన్తం మహ్యాం రన్ధయన్మో అహంద్విషతే రధమ్॥

దం॥ ఈయెదుటఁ గనఁబడుచున్న సూర్యుఁడు నాతో విరోధించినవారిని, లేక, నన్ను బాధించురోగములను, హింసించుచు సమస్తబలముతో నుదయించుచున్నాఁడు. నన్ను బాధించువారిని, లేక. బాధించువాటిని నేను హింసింపను. (సూర్యుఁడేహింసించుఁ గాకని తా॥)

ఇట్లు ప్రథమమండలమునఁ దొమ్మిదవ అనువాకము. శ్రీ శ్రీ శ్రీ

—:-o-:—

అనువాకము. ౧౦.

సూక్తము ౫౧.

(ఋషి - అంగిరసుని కౌమారుఁడు సవ్యుఁడు; ఛందస్సు - ౧ - ౧౩ జగతి; ౧౪, ౧౫ త్రిష్టుప్; దేవత - ఇంద్రుఁడు.)

౬౦. అభిత్యంమేషం పురుహూతమృగ్మియ మిన్ద్రంగీర్భిర్మదతావస్వో అర్ణవమ్ ।

యస్యద్యావో నవిచరన్తి మానుషాభుజే మంహిష్ఠ మభివిప్ర మర్చత॥

తా॥ శత్రువులతో యుద్ధము చేయుచున్న బహుమంది చే బిలువఁబడుచున్న ఋత్విక్కుల చేత స్తుతింపఁదగిన ధనమునకుఁ జోటయిన యింద్రుని వాక్కులతో స్తుతింపుము. (ఋత్విక్కులారా! అని సంబోధన) మఱియు ఎవని కార్యములందు సూర్యకిరణము లందువలె మనుష్యుల సకల హితములుగలవో, భోగములకెవఁడు మహనీయుఁడో, బుద్ధిశాలియగు నాయింద్రునిఁ బూజింపుఁడు.

౬౦౧. అభీ మవన్వ న్త్స్వభిష్టి మూతయో న్తరిక్షప్రాంతవిషీభి రావృతమ్ ।
ఇన్ద్రందక్షాసఋ భవో మద చ్యుతం శతక్రతుంజవనీ సూనృతారుహత్ ॥

తా॥ రక్షించువారును, వృద్ధిపఱచువారును, అగు ఋభవులు (మరుత్తులు) శుభ మయిన రాకగలవాఁడును, తన తేజస్సుతో ద్యులోకమును బ్రకాశింపఁజేయు వాఁడును, బలముతోఁగూడినవాఁడును, గర్వమునణంచువాఁడును, బహువిధకర్మ లాచరింపఁజేయువాఁడును, అగు నింద్రునకభిముఖులై యనుసరించిరి. (దేవతలందఱు ఇంద్రుని విడిచి యుద్ధములోఁ బాఱిపోఁగా మరుత్తులు మాత్రమే నిలిచి సహాయు లయిరని తా॥) సత్యప్రియమైన హెచ్చరికవాక్కు బయలువెడలినది. (వృత్రవధ సందర్భములోనే హెచ్చరించిరని తా॥)

౬౦౨. త్వం గోత్ర మఙ్గిరోభ్యో వృణో రపోతా త్రయే శతదురేషు గాతువిత్ ।
ససేన చిద్విమదాయా వహో వస్వాజా వద్రిం వావసానస్య నర్తయన్ ॥

తా॥ ఇంద్రా! నీవు అంగిరులకు గోత్రమును (=మేఘమును) తెఱచితివి. మఱియు శతద్వారయన్త్రములలో (బడవేయఁబడిన) అత్త్రికిమార్గమును చెల్పితివి. విమదు డను ఋషికి అన్నమును గలుగఁజేసితివి. యుద్ధములలో నున్న (ఇతరర్థులకు) వజ్రము నాడించుచు ధనమిచ్చితివి.

౬౦౩. త్వమపా మపిధానా వృణో రపాధారయః పర్వతే దానుమద్వసు ।
వృత్రం యదిన్ద్ర శవసా వధీరహిం మాదిత్సూర్యం దివ్యారోహయోదృశే ॥

వం॥ ఇంద్రా! ఉదకముల నాచ్ఛాదించియున్న (మేఘములను) విడఁదీసితివి. పర్వతమందుండి హింసచేయుచున్న (శత్రువుల) ధనములను దీసికొని యుంటివి. (మూఁడులోకములావరించియున్న) వృత్రుని అన్నిఁటిని బాధచేయుచున్న వానిని నీవెపుడు చంపితివో, ఆతరువాతనే కనఁబడుటకు సూర్యుని ద్యులోక మెక్కించితివి. (వృత్రుఁడనఁగా మేఘమే అని తా॥)

౬౧౪. త్వం మాయాభిరపమాయినో ధమః స్వధాభి ర్యేఅధి శుప్తావజుహ్వత।

త్వంపిప్రోర్నృమణః ప్రారుజః పురః ప్రఋజిశ్వానం దస్యుహత్యేష్వావిథ॥

వం॥ ఎవరు హవిస్సులతోఁ దమచక్కని నోరులయందు హోమము చేసికొనిరో, (అనఁగా నగ్నియందుఁ గాదని) ఆమాయావంతులగు నసురులను నీవు మాయలతో (వధోపాయములతో నని తా॥) మర్దించితివి. నరులను రక్షించువాఁడా! పిప్రువను వానియొక్క గృహములను బ్రద్దలుకొట్టితివి. ఋజిశ్వానుఁడనెడువానిని శత్రువుల యుద్ధములలో రక్షించితివి.

౬౦౫. త్వం కుత్సం శుష్ణహత్యేష్వావిథా రన్ధయో௨తిథిగ్వాయ శమ్బరమ్ ।

మహాన్తం చిదర్బుదం నిక్రమీః పదా సనాదేవ దస్యుహత్యాయజజ్ఞిషే॥

వం॥ ఇంద్రా! శుష్ణుఁడనువాని యుద్ధమందు కుత్సుఁడనువానిని రక్షించితివి. అట్లే అతిథిగ్వుఁడనువానికై శంబరుని నిరోధించితివి. ఎంతగొప్పవాఁడయ్యును అర్బుదుని నీపాదముచే నణఁచివేసితివి. కావున దస్యులఁ జంపుటకే చాలకాలమునుండి అవతరించితివి. (దస్యు=క్షయింపఁజేయువాఁడు అని తా॥)

౬౦౬. త్వే విశ్వా తవిషీ సధ్ర్యగ్ఘితా తవ రాధః సోమపీథాయ హర్షతే।

తవ వజ్రశ్చికితే బాహ్వోర్హితో వృశ్చా శత్రోరవ విశ్వాని వృష్ణ్యా॥

వం॥ ఓ యింద్రా! నీయందు బలమంతయు నభిముఖముగా నుంచఁబడినది. నీ మనస్సు సోమపానమునకు త్వరపడుచున్నది. నీబాహువులరెంటియందు వజ్రముంచఁబడి కనఁబడుచున్నది. కనుక శత్రువుయొక్క సర్వవీర్యమును ఛేదించితివి.

౬౦౭. విజానీహ్యార్యా న్యేచ దస్యవో బర్హిష్మతే రన్ధయా శాసదవ్రతాౕ ।

శాకీభవ యజమానస్య చోదితా విశ్వేత్తాతే సధమాదేషు చాకన॥

దం॥ ఇంద్రా! ఆర్యులెవరో తెలిసికొనుము. ఎవరుదస్యులోఁ దెలిసికొనుము. యజమానుని కర్మలను భగ్నముచేయువారిని శాసించుచు యజమానునకుఁ గర్మ యందుత్సాహము గలిగించుము. నీయాపనులన్నిఁటిని స్తుతింపఁగోరుచున్నాను. (ఆర్య=కర్మలుచేయువాఁడు.)

౬౦౮. అనువ్రతాయ రన్ధయ న్నపవ్రతా నాభూభి రిన్ద్రః శ్నథయన్న నాభువః ।

వృద్ధస్య చిద్వర్ధతో ద్యామినక్షతః స్తవానో వమ్రో విజఘాన సన్దిహః॥

దం॥ వ్రతములొనరించు యజ్ఞకర్తకొఱకుఁ గర్మలుచేయనివారిని లొంగఁదీయుచు, స్తుతిచేయువారికై స్తుతిచేయనివారిని హింసించుచు నింద్రుఁడు ఉన్నాఁడు. అదివఱకు వృద్ధినొందినవాఁడయ్యును మరల వృద్ధినొందుచు నంతరిక్షమునందున్న యింద్రునియొక్క స్తుతిని జేయు వమ్రఋషి బాగుగఁబెఱిగిన వల్మీకవపను (అదొక యజ్ఞసంభారమట) తెచ్చెను.

౬౦౯. తక్షద్యత్త ఉశనా సహసా సహో విరోదసీ మజ్మనా బాధతే శవః ।

ఆత్వావాతస్య నృమణో మనోయుజ ఆపూర్యమాణమవహన్నభిశ్రవః॥

దం॥ ఇంద్రా! శుక్రుఁడు తనబలముచేత నిన్నెపుడు సానఁబట్టెనో. అపుడు నీబలము తీక్ష్ణమై భూమ్యంతరిక్షముల రెంటిని బాధించెను. నరులను బాలించువాఁడా! తలఁచినమాత్రాన రథమును బూన్చుకొను వాయువుయొక్క గుఱ్ఱములు హవిస్సుల కొఱకు నిన్నభిముఖముగాఁదెచ్చెను.

౬౧౦. మన్దిష్ట యదుశనే కావ్యే సచాఁ ఇన్ద్రో వఙ్కూ వఙ్కుతరాధితిష్ఠతి ।

ఉగ్రో యయిం నిరపః స్రోతసాసృజద్విశుష్ణస్య దృంహితా ఐరయత్పురః॥

వ౦॥ ఎపుడు శుక్రుఁడు స్తుతించుచుఁగోరెనో, అపుడు ఇంద్రుఁడు దారితప్పించి వంకరగానడచు గుఱ్ఱములను (బూన్చిన) రథమెక్కెను. పరుగెత్తుచున్న (మేఘముల నుండి) ఉగ్రుఁడై యుదకములను బయలువెడలించెను. శుష్ణాసురుని గొప్పపట్టణములను నానావిధములఁ జెదరఁగొట్టెను. (ఇచట శుక్రుఁడు అనఁగా యజమానుఁడని భాష్యం)

౬౧౧. ఆస్మారథం వృషపాణేషు తిష్ఠసి శార్యాతస్య ప్రభృతా యేషు మన్దసే ।
ఇన్ద్ర యథా సుతసోమేషు చాకనో నర్వాణం శ్లోకమారోహసే దివి॥

వ౦॥ ఇంద్రా! సోమపానముల నిమిత్తము రథమునెక్కితివి. వేటినిమిత్తము నీవు హర్షించితివో, యాసోమములు శర్యాతునిచేత సంపాదింపఁబడినవి. ఎట్లు అభిషవించిన సోమములుగల యజ్ఞములందుఁ గోరికగల్గితివో! అట్లు స్థిరమైన స్తుతినిఁబొందుచు ద్యులోకమందు నిలిచితివి.

౬౧౨. అదదా అర్భాం మహతే వచస్యవే కక్షీవతే వృచయామిన్ద్ర సున్వతే ।
మేనాభవో వృషణశ్వస్య సుక్రతో విశ్వేత్తా తే సవనేషు ప్రవాచ్యా॥

వ౦॥ గొప్పవాఁడును స్తుతించువాఁడును, యజ్ఞముచేయఁదలఁచినవాఁడును, అగు కక్షీవంతునికొఱకు ఇంద్రా! వృచయయను చిన్నదానిని యిచ్చితివి. శుభకర్మ మాచరించువాఁడా! వృషణశ్వుని కూతురగు మేనయను కన్యను కామించితివి. అట్టి నీ పనులన్నియు యజ్ఞములందుఁ జెప్పఁదగియున్నవి. (ముసలివాఁడై పని యేమియుఁ జేయలేని దీర్ఘతముఁడను ఋషిని భార్యాపుత్రులు ఏటిలోఁ గట్టెలకుఁ గట్టి పాఱవేసిరట, అది యేటఁగొట్టుకొని వచ్చుచుండెను. అప్పుడంగరాజు భార్యలతో జలక్రీడ లాడుచుండెను. అతనిని విప్పి తనయింటికిఁ గొంపోయి అతని మహిమ దెలిసికొని తన భార్యయందొక కొమారుని గనుమని కోరెనట! భార్య అప్పటికంగీకరించి ఆసమయమున దాసిని బంపెనట! అతఁడామెను నీళ్ళుచల్లి మంత్రించి యామెతో భోగించెనట! ఆమెకి కక్షీవంతుఁడు పుట్టెను. కక్షీవంతుఁడు యజ్ఞము చేయఁదలఁచినపుడు ఇంద్రుఁడు వృచయ యనుదాని నిచ్చెనట!

౬౧౩. ఇన్ద్రో అశ్రాయి సుధ్యో నిరేకే పజ్రేషు స్తోమో దుర్యో న యూపః ।
అశ్వయుర్గవ్యూ రథయుర్వసూయురిన్ద్ర ఇద్రాయః క్షయతి ప్రయన్తా॥

దం॥ ఇంద్రుఁడు శోభనకర్మలు చేయుఁ యజమానుల లేమిఁ (బోగొట్టు) నిమిత్తము వారి నాశ్రయించెను. పజ్రుల (=అంగిరసులు). యందు స్తంభమువలె స్తవము పాదుకొని యున్నది. (ఇపుడుఁగూడ) ధనమిచ్చువాఁడై యింద్రుఁడే అశ్వములఁగోరుచు గోవులఁగోరుచుఁ బ్రశంసింపఁబడుచున్నాఁడు.

౬౧౪ ఇదం నమో వృషభాయ స్వరాజే సత్యశుష్మాయ తవసే వాచి।
అస్మిన్నింద్ర వృజనే సర్వవీరా స్మత్సూరిభి స్తవ శర్మన్త్స్యామ॥

దం॥ వర్షించుస్వభావముకల్గి నీయంత నీవు విరాజిల్లునట్టియు, సత్యమయిన బలము గలిగినట్టియు, మిక్కిలివృద్ధినొందినట్టి, నీకొఱకు ఈనమస్కారమంత్రము ఉచ్చరింపఁబడెను. ఈయుద్ధమందలి వీరులతోఁగూడి మేము నీవిచ్చిన శుభమయిన యజ్ఞగృహమందు విద్వాంసులతో (ఋత్విజులతోఁ)గూడియున్నాము.

సూక్తము. ౫౨.

(ఋషి - సవ్యుఁడు, దేవత - ఇంద్రుఁడు ఛందస్సు - ౧౩, ౧౫ త్రిష్టుప్; తక్కినవి జగతి)

౬.౧౫. త్యం సుమేషం మహయా స్వర్విదం శతం యస్య సుభ్వః సాకమీరతే।
అత్యం న వాజం హవనస్యదం రథమేంద్రం వవృత్యా మవసే సువృక్తిభిః॥

దం॥ స్తుతికర్తలు నూర్గురు నొక్కమాఱే యెవనినిస్తుతించుచున్నారో లేక ఎవనిని నూరుగుఱ్ఱములు లాగుచున్నవో, అట్టి శత్రువులతోఁ బోట్లాడుచున్నవాఁడును స్వర్గమందున్నవాఁడును అగు నింద్రుని మనరక్షణకొఱకుఁ జక్కని స్తవముతో స్తుతించుచున్నాను. వేగముగల గుఱ్ఱమువలె యాగమునకై పోవుచున్న యాతని రథమునుగూడ స్తుతించుచున్నాము.

౬౧౬. సపర్వతో న ధరుణే ష్వచ్యుతః సహస్రమూతి స్తవిషీషు వావృధే।
ఇన్ద్రో యద్వృత్రమవధీ న్నదీవృత ముబ్జన్నర్ణాంసి జర్హృషాణో అన్ధసా॥

దం॥ హవిస్సుగానిచ్చిన యన్నములతో హర్షించును; నదుల నరికట్టియున్న వృత్రుం డెప్పుడు వధించెనో అప్పు డాయింద్రుండు ధనములను వర్షించును. జలములతోఁ బర్వతము వలెఁ గదలక నిలచి అనేక రక్షణములు గలవాఁడయి బలమున పెంపొందెను.

౬.౧౭. సహి ద్వరో ద్వరిషు వవ్ర ఊధని చన్ద్రబుధ్నో మదవృద్ధో మనీషిభిః।
ఇన్ద్రం తమహ్వే స్వపస్యయా ధియా మంహిష్ఠరాతిం సహి పప్రిరన్ధసః॥

దం॥ యుద్ధములలోఁ దనకెదురుగా నావరించినవారిపై ఇంద్రుండు ఉండును. నీరు లేని యాకసమును వ్యాపించును కనుకనే సర్వప్రజలకు సంతోషము గూర్చును (సోమముచేత) మదించియుండును ఎక్కుడు ధనములు గలదిగా యింద్రుని బుద్ధిమంతులతోఁ గలిసి నేను మంచికర్మల నుపయోగించు బుద్ధితోఁ బిలుచుచున్నాను. అతఁడుగదా! అన్నమును బూరించువాఁడు.

౬.౧౮. ఆ యం పృణన్తి దివి సద్మబర్హిషః సముద్రం న సుభ్వః స్వా అభిష్టయః।
తం వృత్రహత్యే అను తస్థురూతయః శుష్మా ఇన్ద్రమవాతా అహ్రుతప్సవః॥

దం॥ చక్కగా జన్మించిన తన నదులు సముద్రమునింబూరించునట్లు యజ్ఞస్థానమందున్న సోమరసములు స్వర్గమందున్న యింద్రుని బూరించుచున్నవి. శత్రువులను శోషింపఁజేయునట్టియు, ఎదురు తగులువారు లేనట్టియు, నిష్కపట రూపములు గలట్టియు, మరుత్తులు వృత్రునితోటి యుద్ధములలో అభిముఖులగుచు, రక్షకులగుచు ఆయింద్రు ననుసరించిరి.

౬.౧౯. అభి స్వవృష్టిం మదే అస్య యుధ్యతో రఘ్వీరివ ప్రవణే సస్రురూతయః।
ఇన్ద్రో యద్వజ్రీ ధృషమాణో అన్ధసా భినద్వలస్య పరిధీఁరివ త్రితః॥

దం॥ మరుత్తులు (సోమపాన) మత్తులైయుండి (వృత్రునితో) యుద్ధము చేయుచున్న యింద్రు నెదుట; ఉదకములు పల్లపునేలకుఁ బోవునట్లు; వర్షమునకు స్థానమయియున్న (వృత్రుని)కెదురుగా నడిచిరి. ఇంద్రుండు సోమపానముచేతఁ బ్రగల్భుఁడయియున్నందున త్రితుఁడు (పూర్వము) మూఁడు పరిధులను భేదించినట్లు; బలుడనువానిని భేదించెను. (హోమాగ్నికణములను అగ్ని మువ్వురకు నీటవేయగా. ఏకత, ద్వితి త్రితులను వారు పుట్టిరట! అందు త్రితుని రాక్షసులు నూతఁ ద్రోసివేసి మూఁతబెట్టిరట మూఁడుమూఁతలట! ఆమూఁటిని బ్రద్దలుచేసుకొని త్రితుఁడు బయటఁబడెనట.)

౬౨౦. పరీం ఘృణా చరతి తిత్విషే శవోపో వృత్వీ రజసో బుధ్నమాశయత్ ।

వృత్రస్య యత్ప్రవణే దుర్గృభిశ్వనో నిజఘన్థ హన్వో రిన్ద్ర తన్యతుమ్॥

దం॥ ఉదకములనావరించిన వృత్రుఁడు అంతరిక్షమునుపరిభాగమందాశ్రయించి యుండెను. ఆకాశము నొరయుచు నితరులకుఁ దెలియకయున్న యా వృత్రుని దవుడలు ఇంద్రా! ధ్వనించుచున్న వజ్రాయుధముతోఁ గొట్టితివి. అపుడు నిన్ను సర్వత్రా జయలక్ష్మీవల్లగల్గిన దీప్తి వ్యాపించెను. నీబలముకూడఁ బ్రదీపించెను.

౬౨౧. హ్రదంన హి త్వా న్యృషన్త్యూర్మయో బ్రహ్మాణీన్ద్ర తవయాని వర్ధనా ।

త్వష్టాచిత్తే యుజ్యం వావృధే శవ స్తతక్ష వజ్ర మభిభూత్యోజసమ్॥

దం॥ ఇంద్రా! ఏ స్తుతిమంత్రములు నిన్ను వృద్ధిపఱచునో అవి; ప్రవాహములు మడుగును జేరినట్లు; నిన్ను జేరుచున్నవి. త్వష్ట్ర దేవతయే నీయోగ్యమయిన బలమును వృద్ధిపఱచెను. శత్రువులం దిరస్కరించు వజ్రము నతఁడే సానఁబట్టెను.

౬౨౨. జఘన్వాఁ ఉ హరిభిః సంభృతక్రతవిన్ద్ర వృత్రం మనుషే గాతుయన్నపః ।

అయచ్ఛథా బాహ్వో ర్వజ్రమాయసమ ధారయో దివ్యాసూర్యం దృశే॥

దం॥ కర్మలను సంపాదించునట్టి యింద్రా! మనుష్యులకై మార్గమును వెదకుచు గుఱ్ఱములందుఁ గూర్చొని వృత్రుని సంహరించితివిగదా! తరువాత వర్షోదకములను (గారించితివి.) నీరెండుచేతులందు నినుముతోఁ దయారుచేసిన వజ్రమును ధరించితివి. అందఱికిని గనంబడుటకై అంతరిక్షమున సూర్యుని నిల్పితివి

౬౨౩. బృహత్స్వ శ్చంద్రమమ వద్యదుక్థ్య౩ మకృణ్వత భియసా రోహణందివః ।

యన్మానుష ప్రధనా ఇన్ద్రమూతయఃస్వర్నృషాచోమరుతో మదన్నను॥

దం॥ ఆహ్లాదకములును, బలముగలవియు, స్వర్గము నెక్కింపఁదగినవియు నగు బృహత్సామ మంత్రములు పఠించుచు (యజమాను) వృత్రభయముచేత ఉక్థ్యము లను పేరుగల స్తుతిమంత్రములను ఒనర్చిరి. మనుష్యులకు మేలుగూర్చు యుద్ధములు చేయువారును, స్వర్గకర్తలును, మనుష్యులను (ప్రాణరూపమున) సేవించువారును అగు మరు[illegible] ఇంద్రునింగూడ ముదింపఁజేసిరి.

౬౨౮. ద్యౌశ్చి దస్యామవాఁ అహేః స్వనాదయోయవీ ద్భియసా వజ్ర ఇన్ద్ర తే ।

వృత్రస్య యద్బద్బధానస్య రోదసీమదే సుతస్య శవసాభిన చ్ఛిరః॥

వం॥ దృఢమయిన ద్యులోకముకూడ నీవృత్రుని ధ్వనివల్ల భయపడి కంపించెను. ఓ యింద్రా! అభిమానించిన సోమునమునుగల నీయొక్క వజ్రాయుధము భూమ్యంతరిక్షములు బాధించునట్టి వృత్రుని శిరస్సును బలముతో భేదించునపుడు (ద్యులోకము నిశ్చలముగా నుండెను.)

౬౨౯. యది న్విన్ద్ర పృథివీ దశభుజి రహాని విశ్వా తతన న్త కృష్టయః ।

అత్రాహ తే మఘవ న్విశ్రుతం సహో ద్యామను శవసా బర్హణా భువత్॥

వం॥ ఎప్పుడు భూమి పదిరెట్లు వృద్ధిపొందెనో, ఎప్పుడు మనుష్యులందరును దినములను విస్తరింపజేసిరో అప్పుడు ధనవంతుండవగు నింద్రా! ఇక్కడనే ప్రసిద్ధముగు నీ బలమున్ను ఆ నీ బలముచేగల్గిన వృత్రాదివధయును ప్రఖ్యాతిపొందినవి. ద్యులోకమంతను నీవనుభవించితివి,

౬౩౦. త్వమస్య పారే రజసో వ్యోమనః స్వభూత్యోజా అవసే ధృషన్మనః ।

చకృషే భూమిం ప్రతిమానమోజసోపః స్వః పరిభూరేష్యా దివమ్॥

వం॥ శత్రువులందిరస్కరించు మనసుగల యింద్రా! ఈ కనబడు నంతరిక్షలోకమున కవతలనున్నవాడవై బలమే ధనముగాగలనీవు మమ్ము రక్షించుటకు భూలోకమును జేసితివి. బలవంతుల బలమునకు సాటిచెప్పబడిన బలముగలవాడవయితివి. (ఇంద్రునివంటిబలము అని) శుభముగా నడువదగిన అంతరిక్షలోకమును స్వాధీనపఱచుకొనియుంటివి.

౬౩౧. త్వంభువః ప్రతిమానం పృథివ్యా ఋష్వవీరస్య బృహతః పతిర్భూః ।

విశ్వమాప్రా అంతరిక్షం మహిత్వా సత్యమద్ధా నకి రన్య స్త్వావాన్ ॥

వం॥ ఇంద్రా! నీవు పృథివితోసాటియగు విస్తీర్ణత కలవాఁడవు. దర్శనీయులగు వీరులుగల గొప్పదగు ద్యులోకమునకు అధిపతివైతివి. మహిమచేత నంతరిక్షము నంతటను నిండియున్నావు. కనుక నీవంటివాఁడు ఇతరుఁడెవఁడును లేడు అన్నమాట సత్యమేయగును.

ఋ.౫౮. నయస్యద్యావా పృథివీ అనువ్యచో న సింధవో రజసో అంతమానశుః।

నోతస్వవృష్టింమదే అస్య యుధ్యత ఏకో అన్యచ్చకృషే విశ్వమానుషక్॥

వం॥ ఏ ఇంద్రుని వ్యాప్తిని భూమ్యంతరిక్షములు పొంద సమర్థములు కాలేక పోయెనో, ఏయింద్రుని తేజస్సునంతము అంతరిక్షలోకమునఁ బ్రవహించునుదకములు పొందలేకపోయెనో అట్టి యింద్రా! సోమపానమదమెక్కి యుద్ధము చేయునపుడు నీబలమును వర్షమునాపిన వృత్రాదులు (కూడ) సహింపలేకపోయిరి. కనుక నీవొక్కఁడవే యితర సర్వలోకమును ఆక్రమించుకొనియుంటివి.

ఋ.౫౯. ఆర్చన్నత్ర మరుతః సస్మిన్నాజౌ విశ్వే దేవాసో అమద న్ననుత్వా।

వృత్రస్య యద్భృష్టిమతా వధేన నిత్వమింద్ర ప్రత్యానం జఘన్థ॥

వం॥ ఓ యింద్రా! మరుత్తులు నిన్ను ఈ యుద్ధమందు హెచ్చరించిరి. అన్ని యుద్ధములందును దేవతలందఱును నిన్ననుసరించి మదించిరి. అపుడింద్రుఁడా! అంచులుకల వజ్రముతో వృత్రుని ముఖమందుగొట్టితివి.

—(;-o-;)—

## సూక్తము. ౫౩.

(ఋషి - సవ్యుఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - ౧౦, ౧౧ త్రిష్టుప్; ౧, - ౯, జగతి.)

ఋ.౬౦. న్యూషువాచం ప్రమహే భరామహే గిర ఇంద్రాయ సదనే వివస్వతః।

నూచిద్ధి రత్నం ససతామివావిదన్న దుష్టుతిర్ద్రవిణోదేషు శస్యతే॥

వం॥ నిదురపోయినవాని ధనము నపహరించినట్లు ఇంద్రుఁడసురుల ధనముల నపహరించును గావునఁ బరిచర్యచేయు యజమానుని యజ్ఞగృహమందు గొప్ప

వాఁడగు నింద్రునికై స్తుతులు చేయఁబడుచున్నవి. కావుననే, మేమింద్రుని జక్కఁగా స్తుతింతుము. దాతలగువారల చెడుస్తుతి చేయరాదు. (అనఁగా అవతవక స్తోత్ర పాఠాలు చేయరాదని తా॥)

౬౩౧. దురో అశ్వస్య దుర ఇంద్ర గోరసి దురో యవస్య వసున ఇనస్పతిః।

శిక్షానరః ప్రదివో అకామకర్శనః సఖా సఖిభ్యస్తమిదం గృణీమసి॥

వ॥ ఓ యింద్రా! నీవు అశ్వదాతవు, గోదాతవు, ధాన్యదాతవు, ధనమునకధిపతివి. అందఱిని పాలింతువు. దాతృత్వము నడుపువాఁడవు. పురాతనుఁడవు. కోరిన కోరికలు త్రోసివేయనివాఁడవు. నీసఖులగు (యజమానులకు) ప్రియుఁడవు. కనుక నిన్నుగూర్చి యీవాక్యము బలుకుచున్నాము.

౬౩౨. శచీవ ఇంద్ర పురుకృద్ద్యుమత్తమ తవేదిదమభితశ్చేకితే వసు।

అతః సంగృభ్యాభిభూత ఆభర మా త్వాయతో జరితుః కామమూనయీః॥

వ॥ ప్రజ్ఞాశాలివగు నోయింద్రా! గొప్పకార్యములు చేసినవాఁడవు. అతిదీప్తిమంతుఁడవు. సర్వత్రానుండు ధనమంతయు నీదేయని తెలియఁబడుచున్నది. కనుక శత్రువులఁ దిరస్కరించి ధనమును స్వీకరించి మాకిమ్ము. నిన్ను ధనవానిగాఁ గోరు యజమానుని కోరికను దగ్గింపకుము.

౬౩౩. ఏభిర్ద్యుభిః సుమనా ఏభిరిందుభిర్నిరుంధానో అమతిం గోభిరశ్వినా।

ఇంద్రేణ దస్యుం దరయంత ఇందుభిర్యుతద్వేషసః సమిషా రభేమహి॥

వ॥ ఓ యింద్రా! ఈ ప్రకాశించు హవిస్సులచేతను, ఈ సోమములచేతను (ప్రీతినొంది) గోవులతోను, అశ్వములతోను, గూడిన ధనముచేత దారిద్ర్యమును తొలఁగొట్టుచు మంచిమనస్సు కలిగియుండుము. సోమములచేతఁ బ్రీతుఁడయిన ఇంద్రునిచేత శత్రువులను హింసించుచు శత్రువులకు దూరులమై యన్నముతో గూడికొందుము. (హాయిగా నన్నముతిందుమని తా॥)

౬౩౪. సమింద్ర రాయా సమిషారభేమహి సంవాజేభిః పురుశ్చంద్రైరభిద్యుభిః।
సందేవ్యా ప్రమత్యా వీరశుష్మయా గోఅగ్రయాశ్వావత్యారభేమహి॥

ద॥ ఇంద్రా! ధనముతోఁగూడుకొందుము. అనేకుల నానందింపజేయునట్టియు దీపించునట్టియు, అన్నములతోఁ గూడియుందుము. ప్రకాశించునట్టి గోవులముందిడుకొనునట్టి, అశ్వములుగలిగినట్టి, నీయుత్కృష్టబుద్ధితో గూడియుందుము. (అనఁగా మాకీయన్నిటిని యిచ్చుబుద్ధి నీకుంబుట్టుగాకని తా॥)

౬౩౫. తే త్వా మదా అమదన్తాని వృష్ణ్యా తే సోమాసో వృత్రహత్యేషు సత్పతే।
యత్కారవే దశ వృత్రాణ్యప్రతి బర్హిష్మతే ని సహస్రాణి బర్హయః॥

ద॥ సత్పురుషులఁ బాలించువాఁడా! వృత్రునిఁజంపునిమిత్తము ఆ మరుత్తులపుడు నన్ను హెచ్చరించిరి. వర్షణస్వభావముగల ఆ చరుపురోడాశాదులు నిన్ను మదింపఁజేసినవి. ఆ సోమములుకూడ నిన్ను హెచ్చరించినవి. (ఎపుడంటే) యజ్ఞకర్తకు పదివేల శత్రువులబాధలు ఎదురులేక నీవు తొలఁగించినపుడు.

౬౩౬. యుధా యుధముప ఘేదేషి ధృష్ణుయా పురా పురం సమిదం హంస్యోజసా।
నమ్యా యదింద్ర సఖ్యా పరావతి నిబర్హయో నముచిం నామ మాయినమ్॥

ద॥ ఓ యింద్రా! శత్రువులను జయించునీవు యుద్ధముతరువాత యుద్ధమును జేయుచుంటివి. (అసురుల) పురములతోఁబాటు ఈ శత్రుపురములనుకూడ బలముచేత బాగుగ నశింపఁజేసితివి ఇంద్రా! శత్రువుల వంచునట్టి వజ్రముచేత దూరదేశమందు నముచియను మాయాశీలుని నీవు హింసించినందున (నింతగా స్తవనీయుఁడవయితివని తా॥)

౬౩౭. త్వం కరంజముత పర్ణయం వధీస్తేజిష్ఠయాతిథిగ్వస్య వర్తనీ।
త్వం శతా వంగృదస్యాభినత్పురోఽనానుదః పరిషూతా ఋజిశ్వనా॥

ద॥ ఇంద్రా! నీవు అతిథిగ్వుఁడను రాజుకొఱకు కరంజుఁడనువానిని పర్ణయుఁడనువానిని మిక్కిలి తేజస్సుగల వర్తని (ఆయుధము)తో వధించితివి. ఋజిశ్వయను రాజు ఎదిరించునపుడు నూర్గురకాలఁది వంగృదునిపట్టణములను భేదించితివి.

దం॥ ఇంద్రా! యీపాపములందును యుద్ధములందును మమ్ముఁబడవేయకుము. ఏమంటే, నీబలమున కంతము నెవ్వరును బొందలేరు. నీవు ధ్వనించుచు నదులనువాటి యుదకములను ధ్వనింప జేయుచున్నావు. నీభయముచేత మూఁడులోకములును ఎట్లు భయపడకుండఁగలవు ;

౬౪౨. అర్చాశక్రాయ శాకినే శచీవతే శృణ్వన్తమిన్ద్రం మహయన్నభిష్టుహి।
యోధృష్ణునా శవసా రోదసీ ఉభే వృషా వృషత్వా వృషభో న్యృఞ్జతే॥

దం॥ ఓయధ్వర్యుఁడా! శక్తిమంతుఁడు ప్రజ్ఞావంతుఁడునగు నింద్రునిఁబూజింపుము. స్తుతులను వినుచున్న యింద్రునిఁ బూజించుచు నభిముఖముగా స్తుతించుము. శత్రువులనోడించు బలముచేత నతఁడు భూమ్యాకాశముల నలంకరించును. వర్షమును గురిపించును. కోర్కెలను వర్షించును.

౬౪౩. అర్చాదివే బృహతే శూష్యం౩వచః స్వక్షత్రం యస్య ధృషతో ధృషన్మనః।
బృహచ్ఛ్రవా అసురో బర్హణా కృతః పురో హరిభ్యాంవృషభో రథోహిషః॥

దం॥ ఓ స్తోతా! దీప్తిమంతుఁడును గొప్పవాడును అగు నింద్రునికొఱకు సుఖము నిచ్చునట్టి వాక్కును ఉచ్చరింపుము. అతఁడు యుద్ధముసేయునపుడు తన బలముగల మనసు కఠినమగును. ఆయింద్రుఁడేకదా! గొప్పకీర్తి గలవాడు, అసురుఁడు (=బలముగలవాఁడని వ్యుత్పత్తి) శత్రువుల నోడించువాడు, రెండుగుఱ్ఱములచేత మన్నింపఁబడువాఁడు, కోర్కెల వర్షించువాఁడు, పరుగెత్తువాఁడును అయియున్నాడు.

౬౪౪. త్వందివో బృహతః సాను కోపయో వత్మనా ధృషతా శంబరం భినత్ ।
యన్మాయినో వ్రన్దినో మన్దినా ధృషచ్ఛితాం గభస్తి మశనిం పృతన్యసి॥

దం॥ ఇంద్రా! నీవుఎపుడు రాక్షససేనలుకల మాయావంతులగు రాక్షసుల మీఁదను సంతోషప్రాగల్భ్యములుగలమనసుతోవాడికిరణములుగలవజ్రాయుధమునువిసరితివో, అపుడు గొప్పదగు ద్యులోకము నుపరిభాగమును గంపింపఁజేసితివి. శత్రుభయంకరుఁడ వైన నీయంత నీవే శంబరుని సంహరించితివి.

౬౮౫. నియద్వృణక్షి శ్వసనస్య మూర్ధని శుష్ణస్య చిద్వ్రన్దినో రోరువద్వనా ।
ప్రాచీనేన మనసా బర్హణావతా యదద్యాచిత్కృణవః కస్త్వాపరి ॥

దం॥ ఓ యింద్రా! నీవు మేఘములచేత ధ్వనించుచు వాయువుయొక్కయు, ఫలములఁ బాకమునకుఁ దెచ్చునట్టి సర్వరసములను ఎండింపజేయునట్టి సూర్యుని యొక్కయు, నుపరిప్రదేశమందు నుదకములను నిలుపుచున్నావు. అడ్డులేక నడచుచున్న శత్రువుల హింసించునట్టి మనస్సుతో నర్షింపఁజేయుచున్నావు. కనుక నిన్ను మించినవాఁడున్నాఁడు?

౬౮౬. త్వమావిథ నర్యం తుర్వశం యదుం త్వం తుర్వీతిం వయ్యం శతక్రతో ।
త్వం రథమేతశం కృత్వ్యే ధనే త్వం పురో నవతిం దమ్భయో నవ ॥

దం॥ ఇంద్రా! నీవు నర్యుని, తుర్వశుని, యదుని (రాజులు) రక్షించితివి. ఓ శతక్రతూ! వయ్యకులమునఁ బుట్టిన తుర్వీతుని రక్షించితివి. రథుఁడు, ఏతశుఁడు అను (ఋషులను) ధననిమిత్తము యుద్ధమందు రక్షించితివి. శంబరుని తొంబదితొమ్మిది పురములను వినాశ మొనరించితివి.

౬౮౭. స ఘా రాజా సత్పతిః శూశువజ్జనో రాతహవ్యః ప్రతి యః శాసమిన్వతి ।
ఉక్థా వా యో అభిగృణాతి రాధసా దానురస్మా ఉపరా పిన్వతే దివః ॥

దం॥ ఎవఁడు ఇంద్రునిగూర్చి హవిస్సునిచ్చుచు స్తుతినిబల్కునో, ఉక్థలను బఠించునో, హవీరూపమగు నన్నముతో నతని నభిముఖముగాఁ జేయునో, ఆజనుఁడు గదా సత్పురుషులఁ బాలించువాఁడు! తన్ను వృద్ధిపఱచుకొన్నవాఁడగును. అట్టివానికి ఫలదాతయగు నింద్రుఁడు ద్యులోకమునుండి మేఘములను వర్షింపఁజేయును.

౬౮౮. అసమం క్షత్రమసమా మనీషా ప్ర సోమపా అపసా సన్తు నేమే ।
యే త ఇన్ద్ర దదుషో వర్ధయన్తి మహి క్షత్రం స్థవిరం వృష్ణ్యం చ ॥

దం॥ ఇంద్రునిబలము అసమానము. బుద్ధియు నసమానము. ఈ సోమపానము చేయువారు కర్మలచేత వృద్ధినొందుదురుగాక. ఓ యింద్రా! నీకు హవిస్సుల నిచ్చువారు మహత్త్వమును, బలమును, స్థిరమయిన పుంస్త్వమును, వృద్ధినొందింతురు.

౬౪౯. తుభ్యేదేతే బహులా అద్రిదుగ్ధా శ్చమూషద శ్చమసా ఇన్ద్రపానాః ।

వ్యశ్నుహి తర్పయా కామమేషా మథామనో వసుదేయాయ కృష్వ॥

దం॥ ఇంద్రా! ఱాతితో విస్తారముగాఁ బిండి చమస(=పాత్రకళ్ల)లలోఁ బోయఁబడినట్టి సోమములు (ఇంద్రుని) పానమునకై ఇవిగో, నీకొఱకే, తీసికొనుము. వీటితోఁ దృప్తిపఱచుకొమ్ము. (తరువాత) ధనము నిచ్చుటకుఁ దలంపుము.

౬౫౦. అపామతిష్ఠ ద్ధరుణ హ్వారంతమో న్తర్వృత్రస్య జఠరేషుపర్వతః ।

అభీమిన్ద్రో నద్యోవవ్రిణాహితా విశ్వా అనుష్ఠాః ప్రవణేషుజిఘ్నతే॥

దం॥ వర్షోదకములను, నిరోధించిన యొకతమస్సుకలదు. ఆతమస్సేవృత్రుడు. ఆ వృత్రుని కడుపులో మేఘమున్నది. ఈనదులు (=వర్షజలములు) ఆవరించిన వృత్రుని చేత మూయఁబడినవి. వరుసలు తీర్చియున్న సర్వోదకములును ఇంద్రుఁడు పల్లపునేలలందుఁ బడవేయుచున్నాఁడు (అనఁగా వర్షము కురిపించుచున్నాఁడని తా॥)

౬౫౧. సశేవృధ మధిధాద్యుమ్న మస్మేమహిక్షత్రంజనా షాళిన్ద్ర తవ్యమ్ ।

రక్షాచనో మఘోనః పాహిసూరీన్రా యేచనః స్వపత్యా ఇషేధాః॥

దం॥ ఇంద్రా! ఆ నీవు మాకు సుఖకరమయినది, గొప్పకీర్తిని గల్గించునది, శత్రువులఁ దిరస్కరించునది యగు గొప్పబలమును గలుగఁజేయుము. ఇంద్రా! మఱియు మమ్ములను ధనవంతులుగాఁజేసి పాలించుము. విద్వాంసులను బాలింపుము. ధనమును, అన్నమును, మంచి సంతానమును, మాకు నిమ్ము.

—:-0-:—

## సూక్తము. ౫౫.

(ఋషి - సవ్యుఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - జగతీ.)

౬౫౨. దివశ్చిదస్య వరిమా విపప్రథ ఇన్ద్రం నమహ్నా పృథివీ చన ప్రతి ।
భీమ స్తువిష్మాఞ్ చర్షణిభ్య ఆతపః శిశీతే వజ్రం తేజసే నవంసగః॥

దం॥ ఈ యింద్రుని ప్రభావము ద్యులోకమునకంటెను విస్తారమైయున్నది. పృథివి కూడ మహత్త్వముచేత నింద్రుని మించలేదు. శత్రుభయంకరుఁడై బలవంతుఁడై మనుష్యులకై శత్రువులను దపింపఁజేయును. ఎంబోతు తనకొమ్ములను వాడిపెట్టునట్లు; ఇంద్రుఁడు తనవజ్రమును వాడిపెట్టుటకై సానఁబట్టుచున్నాఁడు.

౬౫౩. సోఅర్ణవో ననద్యః సముద్రియః ప్రతిగృభ్ణాతి విశ్రితా వరీమభిః ।
ఇన్ద్రః సోమస్య పీతయే వృషాయతే సనాత్సయుధ్మ ఓజసా పనస్యతే॥

దం॥ ఆ యింద్రుఁడు అంతరిక్షమున నున్నవాఁడయి తమమహత్తలతో విస్తరించిన యుదకములను సముద్రుఁడువలెఁ దీసికొనుచున్నాఁడు. ఆతఁడు సోమపానముకొఱకు నుత్సహించుచున్నాఁడు. యోధుఁడయిన ఆయింద్రుఁడు చిరగాలమునుండి బలము నందుఁ బేరువడెను.

౬౫౪. త్వంతమిన్ద్ర పర్వతం సభోజసే మహోనృమ్ణస్య ధర్మణా మిరజ్యసి ।
ప్రవీర్యేణ దేవతాతి చేకితే విశ్వస్మా ఉగ్రః కర్మణే పురోహితః॥

దం॥ ఇంద్రుఁడా! నీవు నీభోజనముకొఱకు మేఘములను జేయలేదా. (లోకోపకారార్థమని తా॥) గొప్ప ధనవంతులను ఏలుచున్నావు. ఇంద్రుఁడు వీర్యముచేత నతిశయించినవాఁడుగాఁ దెలియఁబడుచున్నాఁడు. ఉగ్రుఁడైన యింద్రుఁడు అన్ని కార్యములకును ముందుంచఁబడెను. (దేవతలచేతనని తా॥)

౬౫౫. సఇద్వనే నమస్యుభి ర్వచస్యతే చారు జనేషు ప్రబ్రువాణ ఇన్ద్రియమ్ ।
వృషాఛన్దు ర్భవతి హర్యతో వృషా క్షేమేణ ధేనాం మఘవా యదిన్వతి॥

దం॥ ఆ యింద్రుఁడే అరణ్యమందు నమస్కరించువారిచేత స్తుతింపబడెను. అతఁడు జనులందుఁ దనవీర్యమును బ్రకటించుచుఁ జక్కగా వర్తించుచున్నాఁడు. హవిస్సులను సమర్పించునట్టి ధనవంతుఁడగు యజమానుఁడు (ఇంద్రుని) రక్షణగలిగి స్తుతివాక్కు నెప్పుడుపల్కునో, అప్పుడు కోర్కెలు వర్షించువాఁడును యాగకర్తలకు హెచ్చుటక గల్గించువాఁడును అగును.

౬౫౬. స ఇన్మహాని సమిథాని మజ్మనా కృణోతి యుధ్మ ఓజసా జనేభ్యః ।
అధాచన శ్రద్దధతి త్విషీమత ఇన్ద్రాయ వజ్రం నిఘనిఘ్నతే వధమ్॥

దం॥ ఏయింద్రుఁడు జనులకొఱకు వధసాధనమయిన వజ్రమును (మేఘములమీఁద) గొట్టుచున్నాఁడో, అతఁడే యోధుఁడు. అంతటినిశోధించు తేజముతో గొప్పయుద్ధములను జేయుచున్నాఁడు. తరువాతనే దీప్తిమంతుఁడైన యింద్రునందు జనులు నమ్మకముగలవారగుదురు. (అనఁగా గొప్పవాఁడన్న నమ్మకము.)

౬౫౭. స హి శ్రవస్యుః సదనాని కృత్రిమా క్ష్మయా వృధాన ఓజసావినాశయన్ ।
జ్యోతీంషి కృణ్వ న్నవృకాణి యజ్యవేఽవ సుక్రతుః సర్తవా అపః సృజత్॥

దం॥ యశస్సును గోరుచున్నవాఁడై కృత్రిమములయిన శత్రుపురములను బలముచేత నశింపఁజేయుచు భూమితోఁగూడఁ బెఱుగుచు జ్యోతిస్సులను (సూర్య చంద్ర నక్షత్రములని) ఆవరణము లేనివానిగాఁ జేయుచు శోభనకర్మలను జేయువాఁడై యాగకర్తకొఱకు రక్షకమగునని తలఁచి ఉదకములను విడచెను. (వర్షించెను.)

౬౫౮. దానాయ మనః సోమపావన్నస్తు తేఽర్వాఞ్చా హరీ వన్దన శ్రుదాకృధి ।
యమిష్ఠాసః సారథయో య ఇన్ద్ర తే న త్వా కేతా ఆదభ్నువన్తి భూర్ణయః॥

దం॥ సోమపానముచేయు నింద్రా! నీమనసు (మాయిష్టముల) నిచ్చుటకగుఁగాక. స్తుతులను వినునట్టివాఁడా! నీరెండు గుఱ్ఱములు మాకు నభిముఖములగునట్లు చేయుము. నీసారథులు చక్కగా నడిపించువారును ప్రమాదములు కాచుకోఁదగినవారును అయియున్నారు. ఇంద్రా! నిన్ను శత్రువులు హింసింపలేరు.

౬౫౯. అప్రక్షితం వసుబిభర్షి హస్తయో రషాహ్ళం సహస్తన్వి శ్రుతో దధే ।

ఆవృతాసోవతాసో నకర్తృభిస్తనూషు తేక్రతవ ఇంద్ర భూరయః॥

దం॥ ఇంద్రుఁడా! నశించనిధనమును చేతిలోఁబట్టుకొన్నావు. ప్రసిద్ధుఁడవగు నీవు (నీ) శరీరమందు శత్రులకు లొంగని బలమును ధరించియున్నావు. నీరుతోడుకొను వారు నూతిచుట్టు మూఁగినట్లు; బలముచేఁ జేయఁబడినపనులు నీశరీరముల చుట్టును ఆవరించియున్నవి. కనుకనే నీశరీరములందనేకకర్మలు కలవు.

---

## సూక్తము, ౫౬.

(ఋషి - సవ్యుఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - జగతి.)

౬౬౦. ఏష ప్రపూర్వీరవతస్య చమ్రిషోత్యోన యోషాముదయంస్త భుర్వణిః ।

దక్షంమహే పాయయతే హిరణ్యయం రథమావృత్యా హరియోగమృభ్వసమ్॥

దం॥ ఈ యింద్రుఁడా యజమానునివద్ద చమసలలోఁబోసిన విస్తారములైన సోమ రూపాన్నములను; మగగుఱ్ఱమాఁడుగుఱ్ఱమును జేరఁదీసికొన్నట్లు; దీసికొన్నాఁడు. సువర్ణమయాశ్వముల రథము నెక్కి సర్వకార్య సాధకమగు సోమమును ద్రావుచున్నాఁడు.

౬౬౧. తంగూర్తయో నేమన్నిషః పరీణసః సముద్రంన సంచరణే సనిష్యవః ।

పతిం దక్షస్య విదథస్య నూసహో గిరిం నవేనా అధిరోహ తేజసా ।

దం॥ ధనమును గోరినవర్తకులు ప్రయాణము చేయవలసివచ్చినపుడు (ఓడతో) సముద్రము నాశ్రయించినట్లు; స్తుతికర్తలు నమస్కరించుచునడుచుచు అంతటను వ్యాపించుచు, నింద్రునాశ్రయించుచున్నారు. ఓ స్తోతా! వృద్ధిపొందినట్టి యజ్ఞము నకుఁ బతియయినట్టి వానిని సహించుము. స్త్రీలు పర్వతమునధిరోహించినట్లు; (పూవులు పండ్లు కోసికొనుటకని తా॥) ఆయింద్రుని నీస్తుతులచేత నాశ్రయింపుము.

౬౬౨. సతుర్వణి ర్మహాఀఅరేణుపౌంస్యేగిరేర్భృష్టిర్నభ్రాజతేతుజాశవః ।
యేనశుష్ణం మాయిన మాయసో మదేదుధ్ర ఆభూషు రామయన్నిదామని॥

దం॥ ఆయింద్రుఁడు శత్రువులను హింసించువాఁడయి వృద్ధినొందుచున్నాఁడు. ఇనుప కవచమును దొడిగినవాఁడును, దుష్టశాత్రవులను దూలించువాఁడును, అగుచు (సోమపాన) మదమెక్కి; యేబలముచేత సర్వమును శోషింపఁజేయు మాయావియగు (అసురుని); సంకెళ్లలోఁ బడవేసెనో ఆయింద్రునిబలము యుద్ధమందు దోషము లేనిదియు, శత్రువుల హింసించునదియునయి పర్వతశిఖరమువలెఁ బ్రకాశించుచున్నది.

౫౬౩. దేవీయదితవిషీత్వావృధోతయ ఇన్ద్రంసిషక్త్యుషసంనసూర్యః ।
యోధృష్ణునాశవసాబాధతేతమ ఇయర్తిరేణుంబృహదర్హరిష్వణిః॥

దం॥ ఏయింద్రుఁడు ఎదురులేని బలముచేత చీఁకటిరూపుఁడయిన (వృత్రుని) బాధించెనో; రక్షించుమని నీచేసినస్తుతిచే వృద్ధినొందిన యా యింద్రుని దివ్యమయిన బలము; సూర్యుఁడుషస్సును బొందినట్లు; ఎపుడుపొందెనో; అపుడు శత్రుబాధకుఁడగు నింద్రుఁడు శత్రువులకు గొప్ప హింసను గలిగించెను.

౬౬౪. వియత్తిరో ధరుణ మచ్యుతం రజోతిష్ఠిపో దివ ఆతాసు బర్హణా ।
స్వర్మీళ్హే యన్మద ఇన్ద్ర హర్ష్యాహన్వృత్రం నిరపామౌబ్జో అర్ణవమ్॥

దం॥ వృత్రునిచే మూఁతవేయఁబడిన, అందఱకుఁ బ్రాణాధారమైన, నాశరహితమయిన ఉదకమును బ్రద్దలకొట్టి నీవు ఎపుడు ద్యులోకమునుండి విశాలమయిన దిక్కులందు నిలిపితివో; ఎపుడు ధనార్థమయిన యుద్ధమందు (సోమపాన) మదమెక్కి హర్షముగల శక్తితో వృత్రుసంగొట్టితివో అపుడు ఉదకములతోనిండిన మేఘమును గ్రిందికభిముఖమగునట్లు చేసితివి. (అనఁగా వర్షాభిముఖమొనర్చితివని తా॥)

౬౬౫. త్వం దివో ధరుణం ధిష ఓజసా పృథివ్యా ఇన్ద్ర సదనేషు మాహినః ।
త్వం సుతస్య మదే అరిణా అపో వివృత్రస్య సమయా పాష్యా రుజః॥

దం॥ వృద్ధినొందిననీవో యింద్రా! బలముచేత ద్యులోకమునుండి భూమియందు (జగత్తున) కాధారమయిన జలమును ధరించుచున్నావు; కనుకనే అభిషవించిన సోమము యొక్క మదమెక్కి మేఘములనుండి ఉదకములను బయలుదేర్చితివి. వృత్రునిం గట్టి శిలతోం బ్రద్దలుకొట్టితివి.

—:-౦-:—

## సూక్తము ౫౭.

(ఋషి - సవ్యుఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - జగతి.)

౬౬౬. ప్రమంహిష్ఠాయ బృహతే బృహద్రయే సత్యశుష్మాయ తవసే మతిం భరే।

అపామివ ప్రవణే యస్య దుర్ధరం రాధో విశ్వాయు శవసే అపావృతమ్॥

దం॥ ఉత్తమదాతయు గుణములచే గొప్పవాఁడును, మహాధనవంతుఁడును, సత్యమగు బలముకలవాఁడును, గొప్పఆకారముగలవాడును, అగు నెవనిబలమును, పల్లపునేలకుఁబోవు జలము నాపలేనట్లు ఆపలేరో, మఱియు నే యింద్రునిచేత సర్వత్రానిండిన ధనముబలముకొఱకు తెరవబడెనో ఆయింద్రునికై యుత్తమస్తుతిని సంపాదించితిని.

౬౬౭. అధ తే విశ్వమను హాసదిష్టయ ఆపో నిమ్నేవ సవనా హవిష్మతః।

యత్పర్వతే న సమశీత హర్యత ఇన్ద్రస్య వజ్రః శ్నథితా హిరణ్యయః॥

దం॥ ఎప్పుడు శత్రువులఁజంపఁదలచిన యింద్రునియొక్క బంగారువజ్రము శత్రుసంహారకమై వృత్రుని విషయమై జాగ్రతగానుండెనో ఆ తరువాతనే ఇంద్రా! జగత్తంతయు నీయిష్టికొఱకయ్యెను. యజమానుని సవనములు పల్లపునేలకుదకములు చేరునట్లు నన్ను జెందినవి.

౬౬౮. అస్మై భీమాయ నమసా సమధ్వర ఉషో న శుభ్ర ఆభరా పనీయసే।

యస్య ధామ శ్రవసే నామేన్ద్రియం జ్యోతి రకారి హరితో నాయసే॥

దం॥ ఓ ఉషాదేవతా! శోభనయగు నీవు భయంకరమైనట్టి, కొనియాడఁదగినట్టి, ఈ యింద్రునికై చేయుయాగమందు హవిస్సు రూపాన్నముల నిపుడు చక్కగా

సంపాదించుము ఇంద్రా! ప్రాణాధారకమగు నీ జ్యోతిస్సును సారథి గుఱ్ఱముల నడిపించునట్లు అన్నముకొఱకు నిటునటు వ్యాపించుటకు నడిపించుము.

౬౬౯. ఇమేత ఇన్ద్ర తే వయం పురుష్టుత యే త్వారభ్య చరామసి ప్రభూవసో ।
నహి త్వదన్యో గిర్వణో గిరః సఘత్క్షోణీరివ ప్రతినో హర్య తద్వచః॥

తా॥ అమితధనముకల యింద్రా! బహుయజమానులచేత స్తుతింపఁబడినవాఁడా! ఏ మేము నిన్నాధారముగాఁ జేసికొని (యాగమందు) ప్రవర్తించుచున్నామో, ఆ యీ మేము నీవారము. స్తుతులతోఁ బ్రార్థింపదగినవాఁడా! నీకంటె నితరుఁడు స్తుతులఁబొందలేఁడు. కనుక ఆ మా వాక్కును భూమికోరినట్లు కోరుము.

౬౭౦. భూరిత ఇన్ద్ర వీర్యం౩తవ స్మస్యస్య స్తోతుర్మఘవ న్కామమాపృణ ।
అను తే ద్యౌర్బృహతీ వీర్యం మమ ఇయంచ తే పృథివీ నేమ ఓజసే॥

తా॥ ఇంద్రా! నీవీర్యము విస్తారము. అట్టి నీవారము మేము. ఓ మఘవా! (=ధనవంతుఁడా.) ఈస్తుతిపాఠకుని కోర్కెనుబూరింపుము. గొప్ప ద్యులోకముగూడ నీవీర్యమును గొనియాడుచున్నది. ఈ పృథివికూడ నీబలమునకు వంగిపోయినది.

౬౭౧. త్వం తమిన్ద్ర పర్వతం మహాముురుం వజ్రేణ వజ్రిన్పర్వశ శ్చకర్తిథ ।
అవాసృజోనివృతాః స ర్తవాఅపః సత్రావిశ్వం దధిషే కేవలం సహః॥

తా॥ వజ్రాయుధముగల యింద్రా! నీవు విశాలము పొడవునగు మేఘమును ప్రతి పర్వమందును (అనఁగా-కణుపులందు) కణుపునకొకొక్కముక్క యగునట్లు ఛేదించితివి. ఆమేఘముచే నావరింపఁబడిన యుదకములును ప్రవహించుటకుఁ గ్రిందుగాఁగార్చితివి. కనుకఁ బ్రపంచమంతటను వ్యాపించిన బలమును నీవే ధరించింతివి. ఇదిసత్యము.

ఇట్లు ప్రథమమండలమునఁ బదియవ యనువాకము సమాప్తము. శ్రీ శ్రీ శ్రీ

అనువాకము. ౧౧.

సూక్తము. ౫౮.

(ఋషి - నోధస్సు; దేవత - అగ్ని; ఛందస్సు - ౧-౫ జగతి; ౬-౯ త్రిష్టుప్.)

౬౭౨. నూచిత్సహోజా అమృతో నితున్దతే హోతాయద్దూతో అభవద్వివస్వతః

విసాధిష్ఠేభిః పథిభీ రజో మమ ఆదేవతాతా హవిషా వివాసతి॥

వ॥ బలముచేఁబుట్టినవాఁడును (అనఁగా అరణులుబలముతో మథించి నిప్పు తీయుదురు.) మరణములేనివాఁడును అగునగ్ని శీఘ్రముగానే కాలుచున్నది. హోత యెప్పుడు యజమానుని దూతయయ్యెనో, యప్పుడు యోగ్యమయిన మార్గములవెంట అంతరిక్షలోకమును నిర్మించెను. యజమానుడు దేవతలను యజ్ఞమందు సేవించెను.

౬౭3. ఆ స్వమద్మ యువమానో అజర స్తృష్వ విష్యన్న తసేషు తిష్ఠతి।

అత్యో న పృష్ఠం ప్రుషితస్య రోచతే దివో నసాను స్తనయన్నచిక్రదత్।

వ॥ ముదిమిలేని యగ్ని తానుదినవలసినదానిని దనలోఁగలుపుకొని తరువాతఁ దినఁబోవు ననేక కట్టెలలో శీఘ్రముగాఁగలియుచున్నాడు. కాల్పఁబడుటకేయినటు తిరుగునగ్ని మీఁదిమంటలు గుఱ్ఱమువలె నిలుచుటు పరిగెత్తుచుఁ బ్రకాశించును. అప్పుడు ద్యులోకముయొక్క ఎత్తైన యాకాశమును ధ్వనింపఁజేయుచున్నది.

౬౭౪. క్రాణారుద్రేభిర్వసుభిః పురోహితో హోతా నిషత్తో రయిషాళమర్త్యః।

రథో నవిక్ష్వృఞ్జసాన ఆయుషు వ్యానుషగ్వార్యా దేవ ఋణ్వతి॥

వ॥ హవిస్సును మోసికొనుచు రుద్రులచేతను, వసువులచేతను ముందుంచుకొనఁ బడినవాఁడు, దేవతలను బిలుచుకొనివచ్చువాఁడు, శత్రుధనములను దీసికొనివచ్చు వాడు, మరణములేనివాఁడు, ప్రకాశవంతుఁడునగు' నగ్ని యజమానులచేత స్తుతింప బడుచు వారికిఁగావలసిన ధనములను; లౌకిక జనులకు రథము (కావలసిన వస్తువు లను దెచ్చిపెట్టు) రీతిని దెచ్చిపెట్టును.

౬౭౫. వివాతజూతో అతసేషు తిష్ఠతే వృథా జుహూభిః సృణ్యాతు విష్వణిః ।

తృషుయదగ్నే వనినో వృషాయసే కృష్ణంత ఏమ రుశదూర్మే అజర॥

దం॥ వాయువుచేఁ ప్రేరింపఁబడి మహాధ్వనికల్గి అగ్ని తన జిహ్వాలతో ప్రసరించునట్టి తేజస్సులమొత్తముతో అనాయాసముగ నున్నత వృక్షములందు విశేషించియుండును. నీస్తజ్వాలలుగల ఓ యగ్నీ! అడవిలోని చెట్లను నీవు దహించునపుడు వృషభమువలె గమనింతువు. ముదిమిలేనివాఁడా! నీ నడచుదారి నల్లనగును.

౬౭౬. తపుర్జమ్భో వన ఆవాతచోదితో యూథేన సాహ్వాఁ అవవాతి వంసగః ।

అభివ్రజన్నక్షితం పాజసా రజః స్థాతుశ్చరథం భయతే పతత్రిణః॥

దం॥ జ్వాలలే ఆయుధములుగాఁ గలవాఁడును వాయువుచేతఁ బ్రేరేపింపఁబడిన వాఁడునగు అగ్ని మంటలసముదాయముగలిగి యతిశయించి (పచ్చిచెట్లలోని) రసము నణకి తేజోబలముచేత నభిముఖముగాఁబోవుచు నరణ్యమందు సర్వమును దిరస్కరించుచు; ఇతరుల దిరస్కరించుచు నాలమందనుగూర్చి వృషభము నడచునట్లు నడచుచున్నది. కనుక నెగిరిపడుచున్న యగ్నినుండి స్థావరములును జరములును భయపడుచున్నవి.

౬౭౭. దధుష్ట్వా భృగవో మానుషేష్వా రయిం న చారుం సుహవం జనేభ్యః ।

హోతారమగ్నే అతిథిం వరేణ్యం మిత్రం న శేవం దివ్యాయ జన్మనే॥

దం॥ ఓ యగ్నీ! యజమానునికొఱకుఁ బిలువఁదగిన దేవతలంబిలుచునట్టివాఁడవు. యజ్ఞముచేయుచోట నెల్లపుడు నుండువాఁడవు. కోరఁదగినవాడవు. స్నేహితునింబోలి యెక్కుడు సుఖమునిచ్చువాఁడవు. నిన్ను మనుష్యులలో భృగువంశఋషులు తమకు దేవజన్మకోరి శుభమయిన ధనమునుంబోలె స్థాపించిరి.

౬౭౮. హోతారం సప్త జుహ్వో యజిష్ఠం యంవాఘతో వృణతే అధ్వరేషు ।

అగ్నిం విశ్వేషామరతిం వసూనాం సపర్యామి ప్రయసా యామిరత్నమ్॥

దం॥ హోమముచేయు నేడుగురు ఋత్విజులు యాగములందు; యజ్ఞకర్తలలో శ్రేష్ఠుడును, దేవతలను బిలుచువాఁడును, అగు, యగ్నినినే సేవించుచున్నారో సమస్త ధనములు దొరికింపఁజేయునట్టి ఆయగ్నిని హవిస్సులచేత సేవింతును. రమణీయముగు కర్మఫలములను బొందుదును.

౬౭౯. అచ్ఛిద్రా సూనో సహసో నో అద్య స్తోతృభ్యో మిత్రమహః శర్మ యచ్ఛ ।

అగ్నే గృణన్తమంహస ఉరుష్యోర్జో నపాత్పూర్భిరాయసీభిః॥

దం॥ బలపుత్రుఁడవయి యనుకూలకాంతులుగల ఓయగ్నీ! (బలముతో నరణి మథించితే పుట్టినందున బలపుత్రుఁడని తా॥) మాకు నేడ తెగని సుఖములనిమ్ము. ఓఅన్నపుత్రుఁడా! (అన్నము జఠరాగ్నిని బెంచుచునుక అన్నము తండ్రియని తా॥) నిన్ను స్తుతించువానిని యినుమువలె దృఢమయిన రక్షణలతో పాపమునుండి రక్షింపుము.

౬౮౦. భవా వరూథం గృణతే విభావో భవా మఘవన్మఘవద్భ్యః శర్మ ।

ఉరుష్యాగ్నే అంహసో గృణన్తం ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్॥

దం॥ విశేష ప్రకాశముగల యగ్నీ! నిన్ను స్తుతించినవానికి గృహమవుకమ్ము. ఓ ధనవన్తుఁడా! యజమానునకు సుఖకరుండవుకమ్ము. పాపాత్ములనుండి నిన్ను స్తుతించు వానిని రక్షింపుము. కర్మలచేత ధనముల నార్జించునగ్ని ప్రాతఃకాలమున వచ్చుఁగాక.

---

సూక్తము. ౫౯.

(ఋషి - నోధసుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్)

౬౮౧. వయా ఇదగ్నే అగ్నయస్తే అన్యే త్వే విశ్వే అమృతా మాదయన్తే ।

వైశ్వానర నాభిరసి క్షితీనాం స్థూణేవ జనాఁ ఉపమిద్యయన్థ॥

దం॥ ఓ యగ్నీ! ఇతరాగ్నులు నీశాఖలే, నీవున్నపుడే సర్వదేవతులును హర్షింతురు. సకలజంతువుల జఠరములందుండు నగ్నీ! జనులకు నాభివై స్థాపింపఁబడితివి. జనులకు నీవు గృహములకు స్తంభమువంటివాఁడవై యాధారమగుచున్నావు.

ఋ౨. మూర్ధా దివో నాభి రగ్నిః పృథివ్యా అథాభవదరతీ రోదస్యోః ।
తం త్వా దేవాసో జనయన్త దేవం వైశ్వానర జ్యోతిరిదార్యాయ॥

దం॥ ఈయగ్ని ద్యులోకమునకు శిరస్సువంటిది, భూమికి నాభివంటిది, (ఆధారమని తా॥) ఆపిమ్మట భూమ్యాకాశములకు అధిపతియయ్యెను. ఓవైశ్వానరుఁడా! (జఠ రాగ్నిపేరు వైశ్వానరుఁడని తా॥) ఆ నిన్ను సర్వదేవతలును ఆర్యునికొఱకు (=విద్వాంసుడు) సర్వదేవతలును తేజోరూపునిగానే పుట్టించిరిః (ఆర్య శబ్దమునకు మనుష్యుఁడనికూడ నర్థముగలదు.)

ఋ౩. ఆసూర్యే నరశ్మయో ధ్రువాసో వైశ్వానరే దధిరేగ్నా వసూని ।
యాపర్వతే ష్వోషధీ ష్వప్సుయా మానుషే ష్వసితస్య రాజా॥

దం॥ సూర్యునియందు నిశ్చలమయిన కిరణములు నిల్చినట్లు అగ్నియందు ధనములు నిల్పియున్నారు. కనుక నీవు పర్వతములందు నున్న ధనములకు రాజువు. అట్లే ఓషధులందు, ఉదకములందు, మనుష్యులందు, ఉన్నధనములకురాజువయితివి.

ఋ౪. బృహతీఇవ సూనవే రోదసీ గిరోహోతా మనుష్యో౩ నదక్షః ।
స్వర్వతే సత్యశుష్మాయ పూర్వీ ర్వైశ్వానరాయ నృతమాయ యహ్వీః॥

దం॥ భూమ్యంతరిక్షములు తన కొడుకైన వైశ్వానరునికై మఱింతపెఱిగినవివలె నున్నవి. (కొడుకు గుణములంజూచి తలిదండ్రులు ఉప్పొంగుచునుగాన) (బందిఖానాలో వేయబడిన) మనుష్యుఁడు రాజును స్తుతించునట్లు; సత్యమయిన బలముగలవాఁడును శోభనగమనుఁడునగు నగ్నిని యీ హోత (ఋత్విజులలో నొకనిపేరు) బహువిధము లయిన గొప్ప స్తుతులను జేసెను.

ఋ౫. దివశ్చిత్తే బృహతో జాతవేదో వైశ్వానర ప్రరిరిచే మహిత్వమ్ ।
రాజా కృష్టీనా మసి మానుషీణాం యుధా దేవేభ్యో వరివ శ్చకర్థ॥

దం॥ జాతవేద! వైశ్వానర! నీమాహాత్మ్యము గొప్పదగు ద్యులోకముకంటెను హెచ్చెను. మనువువల్లఁబుట్టిన జనులయొక్క రాజువయితివి. అసురులచేత హరింపబడిన ధనమును దేవతలకొఱకుఁ దెచ్చియిచ్చితివి. (జాత=పుట్టినవారిని-జాత=తెలిసినవాఁడు)

౬౭౬. ప్ర నూ మహిత్వం వృషభస్య వోచం యం పూరవో వృత్రహణం సచన్తే ।
వైశ్వానరో దస్యుమగ్నిర్జఘన్వాఁ అధూనోత్కాష్ఠా అవ శంబరం భేత్॥

దం॥ వృత్రుని (=మేఘమును) సంహరించిన యే వైశ్వానరుని మనుష్యులు సేవించుచున్నారో ఆవర్షమును గురిపించు వైశ్వానరుని మాహాత్మ్యమును శీఘ్రముగాఁ జెప్పుచున్నాను. ఈవైశ్వానరాగ్ని దస్యునిఁ (=రసమును హరించునట్టి) జంపెను. శంబరుని (ఉదకములను నిరోధించినవాఁడని) భేదించెను. ఉదకములను క్రిందఁబడునట్లుచేసెను. (ఇచట వైశ్వానర శబ్దమునకు వైద్యుతాగ్ని యర్థము చేయవలెను. జఠరాగ్నియని చెప్పరాదు.)

—(;-o-;)—

సూక్తము. ౬౦.

(ఋషి - నోధస్సుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౬౭౭. వైశ్వానరో మహిమ్నా విశ్వకృష్టి ర్భరద్వాజేషు యజతో విభావా ।
శాతవనేయే శతినీభి రగ్నిః పురుణీథే జరతే సూనృతావాన్॥

దం॥ వైశ్వానరాగ్ని మహిమచేత ప్రజలందఱు తనవారుగాఁ జేసికొన్నాఁడు. పుష్టికరమైన యాగములందు యజింపఁదగినవాఁడు, విశేషముగాఁ బ్రకాశించువాఁడు, ప్రియసత్యవాక్కులుకలవాఁడు, శతవనునికొడుకయిన పురునీథుని యందనేక స్తుతులచేత స్తుతింపఁబడినవాఁడునయ్యెను.

౬౭౮. వహ్నిం యశసం విదథస్య కేతుం సుప్రావ్యం దూతం సద్యోఅర్థమ్ ।
ద్విజన్మానం రయిమివ ప్రశస్తం రాతిం భరద్భృగవే మాతరిశ్వా॥

దం॥ హవిస్సులు మోయునట్టి, యజ్ఞమును బ్రకాశింపఁజేయునట్టి, యశస్సుగలట్టి, ఉత్తమముగా రక్షించునట్టి, వెంటనే (దేవతలవద్దకు) నడచునట్టి, రెండిఁటివల్లఁబుట్టి నట్టి, (అరణులుగాని ద్యావాపృథువులుగాని రెండు) ధనముంబోలి శ్రేష్ఠమయినట్టి, యగ్నిని వాయువు, భృగుమహర్షికి మిత్రునిగాఁజేసెను.

౬౮౯. అస్య శాసురుభయాసః సచన్తే హవిష్మన్త ఉశిజో యే చ మర్తాః ।

దివశ్చిత్పూర్వో న్యసాది హోతా పృచ్ఛ్యో విశ్పతిర్విక్షు వేధాః॥

దం॥ యజమాన ఋత్విక్కులయిన రెండు తెగల మనుష్యులు స్తుతికర్తలు హవిస్సుతోఁగూడిన యజమానులును, అనునట్టిమనుష్యులును, శాసకుఁడగు నగ్నిని సేవింతురు. (అగ్ని) సూర్యునికంటెఁ బూర్వుఁడు. ప్రజలందు హోమమునిమిత్త ముంచఁబడెను. అతఁడు హోతయు, పూజ్యుఁడు, ప్రజలకుఁబతి, కోరికలనిచ్చు వాఁడును, (అగును.)

౬౯౦. తం నవ్యసీ హృద ఆజాయమాన మస్మత్సుకీర్తి ర్మధుజిహ్వ మశ్యాః ।

యమృత్విజో వృజనే మానుషాసః ప్రయస్వన్త ఆయవో జీజనన్త॥

దం॥ ఋత్విజులును, మనువంశ్యులును, హవిరూపాన్నములు గలవారగు జనులు యుద్ధము తటస్థించినపుడు, ఏయగ్నిని బుట్టించిరో? అట్టి; మాహృదయములనుండి పుట్టినదై మధింపఁజేయు జ్వాలలుకల యగ్నిని గ్రొత్తదగు చక్కని మాస్తుతి అభి ముఖమయి వ్యాపించుఁగాక.

౬౯౧. ఉశిక్పావకో వసు ర్మానుషేషు వరేణ్యో హోతాధాయి విక్షు ।

దమూనా గృహపతి ర్దమ ఆ అగ్ని ర్భువద్రయిపతీ రయీణామ్॥

దం॥ (ఆహుతులను) కోరుచున్నవాఁడు, పవిత్రతనుగలిగించువాఁడు, కాపురమున కాధారమయినవాఁడు, కోరఁదగినవాఁడు నగు నగ్నిమనుష్యులవద్ద నుంచఁబడెను. ఆయగ్ని శత్రుహింసాకరమగు మనసుతో గృహపాలకుఁడగుచు యజ్ఞగృహమందు ధనములలో నుత్తమధనమును బాలించువాఁడయ్యెను.

౬౯-౨. తం త్వావయం పతిమగ్నే రయీణాం ప్రశంసామో మతిభిర్గోతమాసః ।

ఆశుంనవాజమ్భరం మర్జయన్తః ప్రాతర్మక్షూ ధియావసు ర్జగమ్యాత్॥

వ॥ గోతమగోత్రమందుఁబుట్టిన మేము స్తుతించుచున్నవారమై యోయగ్నీ! అన్నమును భరించిన ధనములకుఁ బతివగు నిన్ను దలంపఁదగిన స్తుతులతో; గుఱ్ఱమును దుడుచునట్లు తుడుచుచున్నాము. (అగ్నిచుట్టును శుభ్రపఱచియుంతుమని, గుఱ్ఱమును జక్కఁగా శరీరము తుడచిలాలించునట్లని ఉపమానము) బుద్ధిచే ధనమును సంపాదించు నగ్ని ప్రాతఃకాలమందు శీఘ్రముగా వచ్చుఁగాక.

—:-o-:—

సూక్తము. ౬౧.

(ఋషి - నోధసుఁడు ; దేవత - ఇంద్రుఁడు ; ఛందస్సు - త్రిష్టుప్.)

౬౯-౩. అస్మా ఇదు ప్రతవసే తురాయ ప్రయోన హర్మి స్తోమం మాహినాయ ।

ఋచీషమా యాధ్రిగవ ఓహ మిన్ద్రాయ బ్రహ్మాణి రాతతమా॥

వ॥ వృద్ధినొందినవాఁడును, త్వరగలవాఁడును, గుణాధికుఁడును, ఋక్కులలోఁ జెప్పినట్లున్నవాఁడును, అడ్డులేని గమనముకలవాఁడును, అగు నీయింద్రునకై; ఆకలి గొన్నవానికన్నమును నిర్మించునట్లు ఉత్తమమయిన స్తుతులను పూర్వులతిశయముగా నిచ్చిన హవిస్సులను నేను సిద్ధముచేయుచున్నాను.

౬౯-౪. అస్మాఇదు ప్రయఇవ ప్రయంసి భరామ్యాంగూషం బాధే సువృక్తి ।

ఇన్ద్రాయ హృదా మనసా మనీషా ప్రత్నాయ పత్యే ధియో మర్జయన్త॥

వ॥ ఈ యింద్రునకు అన్నమునువలె స్తుతిని సమర్పించుచున్నాను. శత్రువులను బాధింపఁదగి చక్కఁగా మనస్సునాకర్షించు స్తోత్రధ్వనిని సమకూర్చుచున్నాను. పురాతనుండును స్వామియునగు నింద్రునికొఱకు మనస్సుతో బుద్ధితో స్తుతులను సంస్కరించుచున్నారు. (ఇతర స్తోతలుకర్త.)

౬౯౫. అస్మా ఇదు త్యముపమం స్వర్షాం భరామ్యాఙ్గూష మాస్యేన ।
మంహిష్ఠ మచ్ఛోక్తిభి ర్మతీనాం సువృక్తిభిః సూరిం వావృధధ్యై॥

దం॥ ప్రసిద్ధుఁడును, ఉపమింప హేతువయినవాఁడును, మంచి ధనదాతయు, పండితుఁడునగు నింద్రునికొఱకై అతని వృద్ధిఁగోరి మంచియర్థముగల్గి స్వచ్ఛమైన మాటలతో గొప్పదగు ధ్వనిని నోటితోఁ జేయుచున్నాను.

౬౯౬. అస్మా ఇదు ప్రయమివ ప్ర యంసి భరామ్యాఙ్గూషం బాధే సువృక్తి ।

౬౯౬. అస్మా ఇదు స్తోమం సంహినోమి రథం న తష్టేవ తత్సినాయ ।
గిరశ్చ గిర్వాహసే సువృక్తీంద్రాయ విశ్వమిన్వం మేధిరాయ॥

దం॥ ఈ యింద్రునికొఱకే; చెక్కడపుపనివాఁడు రథమును జేయునట్లు శస్త్రరూపమయిన స్తుతిని జేయుచున్నాను. స్తుతులను వహించువాడును, మేధావంతుఁడును అగు నింద్రునికొఱకుఁ జక్కగా మనసు నాకర్షించుటకై ఋక్కులను గూర్చుచున్నాను. ఉత్కృష్టమైన హవిస్సునుగూడఁ గూర్చుచున్నాను.

౬౯౭. అస్మా ఇదు సప్తిమివ శ్రవస్యేన్ద్రా యార్కం జుహ్వా౩ సమఞ్జే ।
వీరం దానౌకసం వన్దధ్యై పురాం గూర్తశ్రవసం దర్మాణమ్॥

దం॥ ఈ యింద్రునికొఱకే స్తుతిమంత్రమును అన్నలాభమునకు;గుఱ్ఱమును రథమునకుఁగూర్చునట్లు; నాలుకతోఁ గూర్చుచున్నాను. శత్రువులఁ దిరస్కరించునట్టి, దానమునకుఁ జోటయినట్టి, శత్రుపురములను బ్రద్దలుచేసి ప్రశస్తాన్నమును గొనునట్టి యింద్రుని స్తుతికై పూనితిని.

౬౯౮. అస్మా ఇదు త్వష్టా తక్షద్వజ్రం స్వపస్తమం స్వర్యం౩రణాయ ।
వృత్రస్య చిద్విదద్యేన మర్మ తుజన్నీశానస్తుజతా కియేధాః॥

దం॥ శత్రుహింసకుడును, నైశ్వర్యవంతుడును, బలవంతుడును అగు నింద్రుఁడు వృత్రునియొక్క ఆయువుపట్టును నొప్పించునట్లు యే వజ్రాయుధముతోఁ గొట్టెనో ఆ శుభకర్మల నుత్తమముగాఁ జేయునట్టి, శత్రుసంహారకమయినట్టి, వజ్రాయుధమును విశ్వకర్మ యీ యింద్రునికొఱకే చేసి సానబట్టెను.

౧౯౯. అస్యేదుమాతుః సవనేషుసద్యో మహఃపితుం పపివాఞ్చార్వన్నా ।

ముషాయద్విష్ణుః పచతం సహీయా న్విధ్యద్వరాహం తిరో అద్రిమస్తా॥

దం॥ (వర్షముతో సకలజగత్తును) నిర్మించునట్టి గొప్పదగు నీయజ్ఞముయొక్క సవనములందు సోమమును (ఇంద్రుడు) పానముచేసెను. వెంటనే హవిస్సులను భక్షించెను. సర్వజగత్తును వ్యాపించినవాడై అసుర ధనముల నపహరించెను. శత్రువుల నోడించు వజ్రాయుధమును అడ్డుగానుంచుచు విసరి మేఘమునుగొట్టెను.

౨౦౦. అస్మాఇదుగ్నా శ్చిద్దేవపత్నీ రిన్ద్రాయార్క మహిహత్య ఊవుః ।

పరిద్యావా పృథివీ జభ్ర ఉర్వీనాస్య తే మహిమానంపరిష్టః॥

దం॥ ఈ యింద్రునికొఱకే దేవతలను పాలించునట్టి, నడిచే స్వభావముగలట్టి (ఛందోదేవతలు) వృత్రవధసమయమందు స్తోత్రమంత్రమును అల్లిరి (రచించిరని తా॥) ఆయుక్క భూమ్యంతరిక్షముల నతిక్రమించినది. విస్తారములగు ఆ భూమ్యంతరిక్షములు ఈ యింద్రుని మహిమను అతిక్రమింపలేక పోయినవి.

౨౦౧. అస్యే దేవప్రరిరిచే మహిత్వం దివస్పృథివ్యాః పర్యన్తరిక్షాత్ ।

స్వరాళిన్ద్రో దమ ఆవిశ్వగూర్తః స్వరిరమత్రో వవక్షే రణాయ॥

దం॥ ఈ యింద్రునియొక్క మహిమయే ద్యులోకముకంటెను, భూమికంటెను, అంతరిక్షముకంటెను, (భూమి, ద్యులోకమధ్య నంతరిక్షము) అతిక్రమించెను. ఇంద్రుడు శత్రువుల మర్దించువిషయమున తన తేజస్సుతోనే విరాజిల్లువాడును సర్వసమర్థుడును, శోభనశత్రువులు కలవాడును, కొలలేనివాడును అయి యుద్ధమును గలుగజేసెను. (అనగా మేఘముతో మేఘమును దెబ్బలాడించెనని కాని, తనబటులం బురికొల్పెనని కాని తా॥)

౨౦౨. అస్యే దేవశవసా శుషన్తం వివృశ్చ ద్వజ్రేణ వృత్రమిన్ద్రః ।

గానవ్రాణా అవనీరముఞ్చ దభిశ్రవోదా వనేసచేతాః॥

దం|| ఈ యింద్రునిబలముచేత నెండిపోవుచున్న వృత్రుని ఇంద్రుడు వజ్రముచేత; దొంగలు ఆవులను ఛేదించునట్లు ఛేదించెను. వృత్రుడు దాగుకొనుటకుఁ జోటుగా నుండిన యుదకములను విడఁగొట్టెను, ఆయింద్రుఁడు హవిస్సునిచ్చిన యజమానునకు సమానబుద్ధితో నన్నమును అభిముఖముగా నిచ్చెను.

౨౦౩. అస్యేదు త్వేషసా రన్త సిన్ధవః పరియద్వజ్రేణ సీమయచ్ఛత్ ।
ఈశానకృద్దాశుషే దశస్యం తుర్వీతయే గాధం తుర్వణిః కః॥

దం|| ఈ యింద్రుని ప్రకాశించుబలముచేత సముద్రములు విలాసముగా నున్నవి. ఏమంటే ఇంద్రుఁడు వజ్రముచేత నీ సముద్రములను అంతటను నియమించెను. (ఏదెక్కడ నుండవలెనోయట్లు) మఱియు ఐశ్వర్యము గలుగఁజేసికొనుచు నింద్రుఁడు యజమానునకిచ్చుచు శత్రువుల హింసించువాఁడై తుర్వీతునికొఱకు నివాసమును ఇచ్చెను.

౨౦౪. అస్మా ఇదు ప్రభరా తూతుజానో వృత్రాయ వజ్రమీశానః కియేధాః ।
గోర్న పర్వ విరదా తిరశ్చేష్యన్నర్ణాంస్యపాం చరధ్యై॥

దం|| త్వరకలవాఁడును, ఈశ్వరుఁడును, అమిత బలవంతుఁడును అగు నోయింద్రా! యీ వృత్రునికొఱకు వజ్రమును ప్రహరించుము. ఉదకములను దీసికొనఁగోరుచు ఆయుదకములు ప్రవహించుటకు అడ్డుగానుంచిన వజ్రాయుధముతో; పశువులను ఛేదించునట్లు, మేఘముల యవయవసంధుల ఛేదించుము.

౨౦౫. అస్యేదు ప్రబ్రూహి పూర్వ్యాణి తురస్య కర్మాణి నవ్య ఉక్థైః ।
యుధే యదిష్ణాన ఆయుధా న్యృఘాయమాణో నిరిణాతి శత్రూన్॥

దం|| ఎప్పుడు యుద్ధమునకై యాయుధములను విసరుచు, శత్రువుల హింసించుచు నింద్రుఁడెదురుగా నడచునో అపుడు ఉక్థ (=స్తుతిచేయు సామమంత్రము)లతో స్తుతింపఁ దగిన యుద్ధమునకుఁ ద్వరపడుచున్న (యీ యింద్రుని) వీరకృత్యమును ఓ ఋత్విజుఁడా! స్తుతింపుము.

౨౦౬. అస్యేదు భియా గిరయశ్చ దృహ్ళా ద్యావాచ భూమా జనుషస్తుజేతే।
ఉపో వేనస్య జోగువాన ఓణిం సద్యో భువద్వీర్యాయ నోధాః॥

ద౦॥ ఈ యింద్రుని భయముచేత పర్వతములుకూడ నిశ్చలములై యున్నవి. ఇంద్రుని యవతరించుటచేత ద్యులోకభూలోకములు కంపించుచున్నవి. ప్రకాశించుచున్న యితని రక్షణను మాటిమాటికిఁ గీర్తించుచు నోధర్షి అపుడే వీర్యవంతుఁడయ్యెను.

౨౦౭. అస్మా ఇదు త్యదను దాయ్యేషా మేకో యద్వవ్నే భూరేరీశానః।
ప్రైతశం సూర్యే పస్పృధానం సౌవశ్వ్యే సుష్విమావ దిన్ద్రః॥

ద౦॥ సమర్థుఁడును, బహువిధధనములకు స్వామియునగు నింద్రుఁడు దేనిని గోరునో వీరి ఆస్తోత్రము ఈ యింద్రునికొఱకుఁ జేయఁబడెను. ఈ యింద్రుఁడు సువశ్వపుత్రుడగు సూర్యుని విషయమున స్పర్ధనొందినట్టి; సోమములను అభిషవించినట్టి ఏతశుఁడను ఋషిని రక్షించెను. (శువశ్వనరాజు తపసుచేసి సూర్యాంశతోఁ గొడుకునుగనెను. ఆకొడుకు ఏతశునితో యుద్ధముచేసెను. అతనిని యింద్రుఁడు రక్షించెనట.)

౨౦౮. ఏవా తే హారియోజనా సువృక్తీన్ద్ర బ్రహ్మాణి గోతమాసో అక్రన్।
ఏషువిశ్వపేశసం ధియంధాః ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్॥

ద౦॥ గుఱ్ఱములంబూన్చిన రథముల యో యింద్రా! గోతమవంశీయులగు ఋషులు చక్కఁగా నభిముఖముగాఁజేయు స్తుతిమంత్రములను నీకై చేసినారు. ఈ స్తుతికర్తకు బహువిధరూపములుగల ధనమునిమ్ము. ప్రాతఃకాలమున (నేడువచ్చినట్లు) తేపును వచ్చుఁగాక.

—:-౦-:—

## పంచమాధ్యాయము.

---

### సూక్తము. ౬౨.

(ఋషి - నోధసుఁడు ; దేవత - ఇంద్రుఁడు ; ఛందస్సు - త్రిష్టుప్.)

౭౦౯. ఓమ్ । ప్రమన్మహే శవసానాయ శూషమాఙ్గూషం గిర్వణసే అఙ్గిరస్వత్ ।
సువృక్తిభిః స్తువత ఋగ్మియాయార్చామార్కం నరే విశ్రుతాయ॥

దం॥ బలముతో శత్రువులసంహరించునట్టి, స్తుతులతో సేవింపదగినట్టి, యింద్రుని కొఱకు సుఖహేతువయిన స్తోత్రమును అంగిరస ఋషివలెఁ దెలిసికొనుచున్నాము. చక్కని స్తుతులతో స్తుతించు ఋషికొఱకు నే యింద్రుఁడు పూజింపఁదగినవాఁడో అందఱిని నడిపించు ప్రసిద్ధుఁడగు నాయింద్రుని స్తుతిమంత్రము నుచ్చరింతుము.

౭౧౦. ప్రవో మహే మహినమో భరధ్వమాఙ్గూష్యం శవసానాయ సామ ।
యేనానః పూర్వే పితరః పదజ్ఞా అర్చన్తో అఙ్గిరసో గా అవిన్దన్॥

దం॥ మనతండ్రులు, పూర్వర్షులు, అంగిరసులు మార్గములను గుర్తెఱిఁగి తమగోవులను ఏ యింద్రునిచేతఁ బొందిరో గొప్పవాఁడును, అతిబలుఁడును అగు ఆ యింద్రునికై ప్రౌఢమై పాడఁదగిన స్తోత్రమును ఓ ఋత్విజులారా! బాగుగ సంపాదించుడు.

౭౧౧. ఇన్ద్రస్యాఙ్గిరసాం చేష్టౌ విదత్సరమా తనయాయ ధాసిమ్ ।
బృహస్పతి ర్భినదద్రిం విదద్గాః సముస్రియాభి ర్వావశన్త నరః॥

దం॥ ఇంద్రునకై యంగిరసులొనరించు నిష్టిలో (యాగము) దేవతల కుక్క (ఆడుది) తనకొడుకునకు అన్నమును బొందెను. తరువాత దేవతలపతియగు నింద్రుఁడు అసురుని భేదించెను. గోవులను దెలిసికొనెను. వాటిని దోలుకొనుపోవు దేవతలు గోవులతోఁగూడ సంతోషధ్వనులుచేసిరి. (పణియనువాఁడు దేవతల గోవులంగుహలో దాఁచెను దేవతలు కనుక్కొనలేకపోయిరి. ఇంద్రుఁడు తనవద్దనున్న ఆడకుక్కను గోవుల వెదకిరమ్మనెను. అది తన కొడుకున కన్నముపెట్టితే వెదకెదననెను. అట్లు అన్నముపెట్టఁగా కుక్క వెళ్లి పసిపట్టి గోవులం దెలిసికొని వచ్చెననికథ)

౭౧౨. సనుష్టుభా సస్తుభా స స్తవిప్రైః స్వరేణాద్రిం స్వర్యో౽త్ర సవగ్వైః ।
సరణ్యుభిః ఫలిగమింద్ర శక్రవలంరవేణ దరయో దశగ్వైః॥

ద॥ శోభనగతిని గోరుచున్న యోగ్యరు మేధావంతులైన నవగ్వులు, దశగ్వులు అను అంగిరసులచేత సస్వరమై శోభనస్తుతిగల స్తుతిమంత్రమును బొందదగినవాఁడవును, శక్తిమంతుఁడవునగు నింద్రా! ఛేదింపఁదగిన స్వచ్ఛమగు నుదకముగల మేఘమును నీధ్వనితో భయపెట్టితివి. (అంగిరసులు రెండుతెగలవారు. తొమ్మిదినెలలు యజ్ఞమొనర్చినవారు నవగ్వులు. పదినెలలుచేసినవారు దశగ్వులట)

౭౧౩. గృణానో అఙ్గిరోభి ర్దస్మ విపరుషసా సూర్యేణ గోభిరన్ధః ।
విభూమ్యా అప్రథయ ఇన్ద్ర సాను దివోరజ ఉపర మస్తభాయః॥

ద॥ శత్రునాశనుఁడవగు నో యింద్రా! అంగిరసస్సులచేత స్తుతింపఁబడినవాఁడవై ఉషస్సుతోను, సూర్యునితోఁడనుగూడి కిరణములచేత నంధకారమును బోనడఁచితివి. మఱియు నీవు భూమియొక్క యున్నతప్రదేశమును విశాలమొనర్చితివి. అంతరిక్షమూలమును దృఢపఱచితివి.

౭౧౪. తదు ప్రయక్షత మమస్య కర్మ దస్మస్య చారుతమ మస్తిదంసః ।
ఉపహ్వరే యదుపరా అపిన్వ న్మధ్వర్ణసో నద్య౹శ్చతస్రః॥

ద॥ ఈ యింద్రుఁడు భూమియొక్క సమీపస్థలమందు స్థాపింపబడి మధురోదకముగల నాలుగునదులను బ్రవహింపజేసెను. అత్యంతప్రశస్తమై సొగసయిన యీ కర్మనొనర్చిన యింద్రునిపని మెన్నఁదగినది.

౭౧౫. ద్వితా వివవ్రే సనజా సనీళే అయాస్యః స్తవమానేభిరర్కైః ।
భగోన మేనే పరమే వ్యోమ న్నధారయ ద్రోదసీ సుదంసాః॥

ద॥ దగ్గఱుటకు శక్యముకాని యింద్రుఁడు స్తుతిమంత్రములతో స్తుతికర్తలు పొందఁదగువాఁడగును. నిత్యజాతములై యొకేచోటనున్న ద్యావాపృథువులరెంటిని

విడఁదీసెను. జ్ఞాపకముంచుకొనఁదగిన ఉత్కృష్టమయిన యంతరిక్షమందలి సూర్యునిం బోలి శోభనకర్మలుసేయు నింద్రుఁడు ద్యావాపృథువుల ధరించెను.

౨౧౬. సనాద్దివం పరిభూమా విరూపే పునర్భువా యువతీ స్వేభిరేవైః ।
కృష్ణేభి రక్తోషా రుశద్భి ర్వపుర్భి రాచరతో అన్యాన్యా॥

దం॥ వేర్వేఱు రూపములుగలిగి ప్రతిదినమును బుట్టుచున్నట్టి పడుచులైన (రాత్రి-ఉషస్సులు) ద్యులోకమును, భూలోకమును చిరకాలమునుండి తమ గమనములచేత మరల తిరిగివచ్చుచున్నవి. రాత్రిచీఁకట్లుచేతను, ఉష ప్రకాశ శరీరముచేతను, ఒకరులేనప్పుడింకొకరుగామాఱి తిరుగుచున్నారు. (ఇదంతయు నింద్రా! నీమహాత్మ్యమని తా॥)

౨౧౭. సనేమిసఖ్యం స్వపస్యమానః సూనుర్దాధార శవసాసుదంసాః ।
ఆమాసుచి ద్దధిషే పక్వమన్తః పయః కృష్ణాసురుశ ద్రోహిణీషు॥

దం॥ చక్కఁగాఁ గంటితోఁ జూడశక్యముగానట్టివాఁడవును, యోగ్యకర్మల నాచరించునట్టివాఁడవును, బలమునకుఁ బుత్రుఁడవును, శోభనయాగ కర్మలను జేయువాఁడవునగు నింద్రా! యజమానుల సఖ్యమును జిరకాలమునుండి పోషించుచున్నావు. అపక్వమయిన గోవులలోపలను పక్వమయిన పాలను పోషించుచున్నావు. నల్లని, యెఱ్ఱని, గోవులలోఁ గూడఁ దెల్లనిపాలను, చక్కనిపాలను, గలిగించుచున్నావు.

౨౧౮. సనాత్సనీళా అవనీరవాతా వ్రతారక్షన్తే అమృతాః
పురూ సహస్రా జనయోనపత్నీ ర్దువస్యన్తిస్వసారో అహ్రయాణమ్॥

దం॥ చిరకాలమునుండి సమాన నివాసములు కలవియు, గమనములేనట్టి ఇంద్రుచేతివ్రేళ్లు (=అంగుళులు) అనేకవేల కర్మలను ఆలస్యములేక తమతమబలములచేతను, బరిపాలించుచున్నవి. తమంతతామే ప్రసరించుచు వ్రేళ్లు (కర్మలను బరిపాలించుచు) ప్రౌఢుఁడగు నింద్రుని దేవభార్యలవలె సేవించుచున్న

౭౧౯. సనాయువో నమసా నవ్యో అర్కైర్వసూయవో మతయో దస్మదద్రుః ।
పతింన పత్నీ రుశతీ రుశన్తం స్పృశన్తి త్వాశవసావన్మనీషాః॥

టీ॥ చూడఁదగినవారిలో నుత్తముఁడవగు నింద్రా! స్తుతిమంత్రముల చేతను, నమస్కారముల చేతను, ఏ నీవు స్తుతింపఁబడుచున్నావో; నిత్యకర్మలను (అగ్నిహోత్రాదులని తా॥) కోరుచున్న ధనకాముకులయిన మేధావతులు (యజమానులని తా॥) ఆ నిన్ను; బహుప్రయాసముతో నాశ్రయించుచున్నారు. ఓబలవంతుఁడా! వారిచేఁ బ్రయోగింపఁబడిన స్తుతులు; కాముకలయిన భార్యలు కాముకులగు భర్తలనువలె; నిన్ను సేవించుచున్నవి.

౭౨౦. సనాదేవ తవరాయో గభస్తౌ నక్షీయన్తే నోపదస్యన్తిదస్మ ।
ద్యుమాఁ అసిక్రతుమాఁ ఇన్ద్ర ధీరః శిక్షాశచీవ స్తవనః శచీభిః

టీ॥ అత్యంతము చూడఁదగినవాఁడా! (సుందరుఁడని తా॥) ఇంద్రా! నీహుబ్బా వందుఁ జిరకాలమునుండియు (నన్ను) ధనములు నశింపలేదు. స్తుతించువారికిచ్చినను తరుగలేదు. పెరుగుచునేయున్నదని తా॥) యింద్రా! బుద్ధిమంతుఁడవగు నీవు దీప్తిమంతుఁడవై యుంటివి. (లోకరక్షార్థ) కర్మలకు హేతువగుచున్నావు. కర్మవంతుఁడా! నీ పనులవల్ల మాకుధనముఁగలుగ జేయుము.

౭౨౧. సనాయతే గోతమ ఇన్ద్ర నవ్యమతక్షద్బ్రహ్మ హరియోజనాయ ।
సునీథాయ నః శవసాన నోధాః ప్రాతర్మక్షూధియావసుర్జగమ్యాత్॥

టీ॥ ఆ యింద్రుఁడందఱకును మొదటివాఁడు అగును ఓ బలవంతుడగు నింద్రా! గుఱ్ఱములను (రథమునకుఁ) బూన్చి చక్కగా నడిపించు నీకొఱకు గోతముఋషి పుత్రుఁడగు నోధయనువాఁడు నూతనమయిన, సూక్తరూపమయిన స్తోత్రమును మాకొఱకుఁజేసెను. తలచినంతలో ధనముకలిగించుకొనువాఁడా! ప్రాతఃకాలమందు శీఘ్రముగారమ్ము.

—:-o-:—

సూ క్త ము, ౬౩.

(ఋషి - నోధసు్స ; దేవత - ఇంద్రుఁడు ; ఛందసు్స - త్రిష్టుప్.)

౭౨౨. త్వంమహాఁ ఇన్ద్ర యోహ శుష్మైర్ద్యావా జజ్ఞానః పృథివీ అమేధాః ।
యద్ధతే విశ్వాగిరయశ్చిదభ్వా భియాదృళ్హాసః కిరణా నైజన్॥

తా॥ ఓ యింద్రా! నీవు గుణములచే నధికుఁడవు. ఏ నీవు (అసురుల) భయము కలిగిన వెంటనే పుట్టినవాఁడవై (శత్రువులను) శోషింపఁజేయు నీబలముచేత ద్యులోక భూలోకములను ధరించుచున్నావు. ఏనీయొక్క భయముచేతఁ బ్రపంచమునందున్న భూతములన్నియుఁ బర్వతములును, ఇతర గొప్పవస్తువులును, దృఢములయ్యును, సూర్యకిరణములవలెఁ గంపించెను.

౭౨౩. ఆ యద్ధరీ ఇన్ద్ర వివ్రతావేరా తేవజ్రంజరితా బాహ్వోర్ధాత్ ।
యేనా విహర్యతక్రతో అమిత్రాన్ పురఇష్ణాసి పురుహూత పూర్వీః॥

తా॥ ఓ యింద్రా! వివిధకర్మలొనరించు నీగుఱ్ఱములను (రథమందు) గూర్చుచున్నావో, అపుడు నీ రెండుబాహువులందు స్తోత (స్తుతిచేయువాఁడు) వజ్రమును ధరింపఁజేయుచున్నాఁడు. (స్తుతించుసరికి చేతిలో వచ్చిపడునని తా॥) కర్మలను గోరునట్టి యింద్రా! శత్రువులనుగూర్చి ఏవజ్రముతో గమనించుచున్నావో, అపుడు ఓ పురుహూతా! నీవనేకములగు (అసుర) పురములను (భేదింపఁ) బోవుచున్నావు.

౭౨౪. త్వంసత్య ఇన్ద్ర ధృష్ణురేతాన్ త్వమృభుక్షా నర్యస్త్వంషాట్ ।
త్వంశుష్ణం వృజనే పృక్ష ఆణౌ యూనేకుత్సాయ ద్యుమతే సచాహన్॥

తా॥ ఓ యింద్రా! సర్వోత్కృష్టుఁడవయిన నీవు ఋభువుల కధిపతివి. నరులకు హితకారివి. శత్రువుల సంహరింతువు. నిర్లక్ష్యస్వభావుఁడవు. హింసాకరమైన వీరులు పోఁదగిన యుద్ధమందు దీప్తిమంతుఁడయి పిన్నవయసువాఁడగు కుత్సునకు సహాయుఁడవు అయి శుష్ణుఁడనువానిని వధించితివి.

౭౩౫. త్వంహత్య దింద్రచోదీః సఖావృత్రం యద్వజ్రిన్ వృషకర్మన్నుభ్నాః ।
యద్ధశూర వృషమణః పరాచైర్విదస్యూర్యోనావకృతో వృథాషాట్ ॥

దం॥ ఇంద్రా! నీవు (కుత్సునకు) సహాయుఁడవై ఆ ప్రసిద్ధమయిన ధనమును ఇచ్చితివి. వర్షమును గురిపించువాఁడా! వజ్రాయుధముకలవాఁడా! అనాయాసముగా శత్రువుల నణంచునట్టి నీవు ఎపుడు యుద్ధమందు దస్యులను వెనుకఁదిరిగి పాఱిపోవునట్లు చేసితివో? (అపుడు కుత్సుఁడు కీర్తినందెనని తా॥)

౭౩౬. త్వంహత్య దిన్ద్రారిషణ్యన్ దృళ్హస్య చిన్మర్తానా మజుష్టౌ ।
వ్యస్మ దాకాష్ఠా అర్వతేవర్ఘనేవ వజ్రిఞ్ఛ్నథి హ్యమిత్రాన్ ॥

దం॥ ఇంద్రా! నీవు ఆ దృఢమయిన దేనికైన హింసకోరకనే యుందువు. స్తుతించు మాకష్టములందు మాగుఱ్ఱమునకు దిక్కులనంతటను దెఱుపుము. (అడ్డు లేనిగమనము కనితా॥) ఓ వజ్రాయుధధారీ! పర్వతమును వలె నీవజ్రాయుధము చేత శత్రువులను ధ్వంస మొనర్పుము.

౭౩౭. త్వాంహత్య దిన్ద్రార్ణసాతౌ స్వర్మీళ్హే నరఆజాహవన్తే ।
తవ స్వధావఇయమాసమర్య ఊతి ర్వాజేష్వత సాయ్యాభూత్ ॥

దం॥ ఓ యింద్రా! యుద్ధపురుషుల ప్రాప్తికలట్టి, ఉదకములను సంపాదించుట కయినట్టి, యుద్ధమందుఁ బ్రసిద్ధుఁడవయిన నిన్నే యుద్ధముగోరువారు (సహాయార్థము) పిలుతురు. కనుక ఓ అన్నవంతుఁడా! యుద్ధమందు నీసంరక్షణము మాకభిముఖముగా నగుఁగాక. యుద్ధములందు సంపాదించినదీరక్షయే.

౭౩౮. త్వంహత్యదిన్ద్ర సప్తయుధ్యన్ పురోవజ్రిన్ పురుకుత్సాయదర్దః ।
బర్హి ర్నరయత్సు దాసే వృథావర్గంహోరా జ న్వరివః పూరవేకః ॥

దం॥ వజ్రాయుధము కలవాఁడా! ఇంద్రుఁడా! పురుకుత్సు ఋషికై యుద్ధము సేయుచు ఆ ఏడు పట్టణములను భేదించితివి. మఱియు సుదాసుఁడను రాజునిమిత్తము

అంహూుఁడనువాని ధనమును అనాయాసముగా దర్భకోసినట్లు కోసి తెచ్చితివి. ఓ స్వామీ ? పూరువంశీయుఁడగు (సుదాసునకు) ధనమును గలుగఁ జేసితివి.

౭౨౯. త్వంత్యాంన ఇన్ద్రదేవ చిత్రామిషమాపోన పీపయః పరిజ్మన్ ।

యయాశూర ప్రత్యస్మభ్యం యంసి త్మనమూర్జంన విశ్వధక్షరధ్యై॥

దం॥ ఓ యింద్రదేవ ! నీవు మాకు సంపాదింపఁదగిన నానావిధమయిన యన్నమును భూమియంతటను; ఉదకములు వర్షించి వృద్ధిపఱుచునట్లు; వృద్ధిపఱుపుము. ఓశూరుఁడా! ఏయన్నముతో మాజీవమును; అంతటను బ్రవహించుటకు నుదకము నిచ్చినట్లు; ఇమ్ము.

౭౩౦. అకారితే ఇన్ద్ర గోతమేభిర్బ్రహ్మాణ్యోక్తానమసా హరిభ్యామ్ ।

సుపేశసం వాజ మాభరా నః ప్రాతర్మక్షూధియావసు ర్జగమ్యాత్॥

దం॥ ఓ యింద్రా ! గోతమ వంశర్షులు నీస్తుతులు రచించిరి. హవిస్సులరూపమయిన అన్నముతో, గుఱ్ఱములతోఁగూడిన నీ కొఱకు అభిముఖముగా మంత్రములు పలుకఁ బడినవి. నీవు బహువిధములగు నన్నములను మాకిమ్ము. తలఁచినంతలో ధనముగల యింద్రుఁడు ప్రాతఃకాలమందు (మారక్షకు) వచ్చుఁగాక.

---

## సూ క్త ము. ౬౮.

(ఋషి - నోధస్సు ; దేవత - వాయువు ; ఛందస్సు - ౧-౧౪, జగతి ; ౧౫, త్రిష్టుప్.)

౭౩౧. వృష్ణే శర్ధాయ సుమఖాయ వేధసే నోధః సువృక్తిం ప్రభరా మరుద్భ్యః ।

అపోన ధీరో మనసా సుహస్త్యో గిరః సమఞ్జేవిదథే ష్వాభువః॥

దం॥ ఓ నోధర్షీ ! వర్షించునట్టి, శుభమయిన యజ్ఞముగల సృష్టినొనర్చునట్టి వాయువుల సమూహమును జక్కఁగా నాకర్షించు స్తుతిని బ్రయోగింపుము. (పుష్ప ఫలాదులను సృష్టిచేయుపని వాయువులదని తా॥) (ఓ మరుత్తులారా !) ధీమంతుఁడను శోభించిన చేతులు కలవాఁడనగు నేను స్తుతివాక్కులను మనసుతోఁ జక్కఁగా వ్యా

పఱతును. యజ్ఞములందు: మేఘుడుదకముల వర్షించునట్లు; స్తుతులను చేయుదును. (ఇందు మొదటివాక్యము మరుత్తులుపల్కిరి. తరువాత వాక్యములు నోధర్షివి. వర్ష ధారలెన్నియో యన్ని స్తుతులని యతిశయోక్తి.)

౨౩౨. తేజజ్ఞిరే దివ ఋష్వాస ఉక్షణో రుద్రస్యమర్యా అసురా అరేపసః

పావకాసః శుచయః సూర్యాఇవ సత్వానోన ద్రప్సినో ఘోరవర్పసః॥

దం॥ చూడందగినట్టి, యౌవనవంతులయినట్టి, రుద్రపుత్రులయినట్టి, శత్రువుల నిరసించునట్టి, పాపరహితులయినట్టి, పవిత్రతను గలిగించునట్టి, సూర్యునివలెఁ బ్రకాశించునట్టి, భూతగణములవలె భయంకరులగునట్టి, వర్షించునట్టి, ఆ మరుత్తులు (అనఁగా వాయువులని తా॥) పుట్టినవి.

౨౩౩. యువానో రుద్రా అజరా అభోఘ్నో వవక్షురధ్రిగావః పర్వతా ఇవ ।

దృళ్హాచిద్విశ్వా భువనాని పార్థివా ప్రచ్యావయన్తి దివ్యాని మజ్మనా॥

దం॥ యౌవనవంతులు రుద్రపుత్రులు, ముదిమిలేనివారు, హవిస్సులఁదిననీకుండఁజేయు (అసురులను) సంహారించువారు, వారింపరాని గమనముగలవారు, పర్వతమువలె దృఢగాత్రులు నగు మరుత్తులు స్తుతిచేయువారి కోర్కెలు సమకూర్తురు. సమస్తభువనములను పృథివియందును, ద్యులోకమందును, దృఢమయిన వస్తువులను తమబలముచేతఁ గదలింతురు.

౨౩౪. చిత్రైరఞ్జిభిర్వపుషే వ్యంజతే వక్షః సురుక్మాఁ అధియేతిరే శుభే।

అంసేష్వేషాం నిమిమృక్షు ర్ఋష్టయః సాకంజజ్ఞిరే స్వధయా దివోనరః ॥

దం॥ శోభకొఱకు (మరుత్తులు) నానావిధములయిన యలంకారములతో నలంకరించుకొనిరి. వక్షస్థలములందు మెఱయుచున్న (హారాదులను) శోభార్థము ధరించుకొనిరి. వీరి మూఁపులందు నాయుధములుగలవు. వాటితోఁగూడి మరుత్తులు నాయకులై యంతరిక్షమునుండి తమబలముతోఁ బుట్టిరి.

౭౩౫. ఈశానకృతో ధునయో రిశాదసో వాతాన్విద్యుత స్తవిషీభి రక్రత ।

దుహన్త్యూధ ర్దివ్యాని ధూతయో భూమిం పిన్వన్తి పయసా పరిజ్రయః ॥

దం॥ (స్తుతించువారిని) ధనపతులగాఁజేయునట్టి, (అన్యులను) గదలించునట్టి, హింసకులం దినివేయునట్టి, మరుత్తులు తమబలముతో గాలులను, మెఱుపులను, బుట్టించుచున్నారు. సర్వత్రాగమనించునట్టి, కదలించునట్టి, (మరుత్తులు) అంతరిక్షమందలి పొదుగులను (బోలిన మేఘములను) పిదుకుచున్నారు. తరువాత, ఉదకములతో భూమినిం దడుపుచున్నారు.

౭౩౬. పిన్వన్త్యపో మరుతః సుదానవః పయోఘృతవ ద్విదథేష్వాభువః ।

అత్యం నమిహే వినయన్తి వాజినముత్సం దుహంతి స్తనయన్త మక్షితమ్ ॥

దం॥ చక్కని దాతృత్వముకల మరుత్తులు పాలవలె సారమయిన ఉదకములను; యజ్ఞములందు ఋత్విజులు నేతినివర్షించునట్లు; వర్షింతురు. అశ్వమును (సాదులు) లోఁగఁదీయునట్లు; వేగవంతమయిన మేఘమును లోఁగఁదీసి వర్షింపఁజేతురు. గర్జించుచున్న అక్షయమయిన మేఘమును పిదుకుచున్నారు.

౭౩౭. మహిషాసో మాయినశ్చిత్రభానవో గిరయో నస్వతవసో రఘుష్యదః ।

మృగాఇవ హస్తినః ఖాదథావనాయ దారుణీషు తవిషీ రయుగ్ధ్వమ్ ॥

దం॥ గొప్పవారును, జ్ఞానులును, మంచికాంతులు గలవారును, పర్వతములవలె స్వంత బలముతోఁగూడినవారును, శీఘ్రగమనులును, అగు నోమరుత్తులారా! తుండములుగల మృగములవలె (ఏనుగులన్న తా॥) వనములను విరచుకొని తినుచున్నారు. ఏ మంటే ఎఱ్ఱనిరంగుగల ఆడగుఱ్ఱములందు మీవేగమును గూర్చినారు గనుక (వారివాహనములు ఆడ గుఱ్ఱములట!)

౭౩౮. సింహా ఇవ నానదతి ప్రచేతసః పిశాఇవ సుపిశో విశ్వవేదసః ।

క్షపో జిన్వన్తః పృషతీభి రృష్టిభిః సమిత్సబాధః శవసా హిమన్యవః ॥

దం॥ ఉత్కృష్టజ్ఞానముగల (మరుత్తులారా!) సింహములవలె మిక్కిలి ధ్వనించు చున్నారు. మగలేఁడి శరీరమందు తెల్లని పొడలలంకరించినట్లు; మీశరీరములు కాంతులచేత నలంకరింపఁబడినవి. సర్వజ్ఞులై స్తుతికర్తలను రక్షించుచున్నవారును, తమ్మును గోపగింపఁజేసినవారిని జంపువారును, అగు మరుత్తులు తెల్లనిపొడల యీఁడు లేండ్ల కాంతులు తమమీఁదఁ బ్రసరించు (అని విద్యారణ్యవ్యాఖ్య, నానావిధ మేఘ కాంతులని యాస్కవ్యాఖ్యానము.) వారును, ఆయుధములుగలవారును, అగుచు శత్రులబాధకలిగిన యజమానుల నొక్కమాఱుగా రక్షింతురు.

౭౩౯. రోదసీ ఆవదతా గణశ్రియో నృషాచః శూరాః శవసాహిమన్యవః ।

ఆవన్ధురేష్వమతి ర్నదర్శతా విద్యున్నతస్థౌ మరుతో రథేషువః ॥

దం॥ (ఏడుగురేసిగా) గణములై యొకరినొకరాశ్రయించుకొన్నవారును, యజమానుల నాశ్రయించుకొన్నవారును, శౌర్యవంతులును, అగు మరుత్తులారా! బలముచేతఁ జంపఁదగినంత కోపముగలవారై ద్యులోకభూలోకములనంతటను ధ్వనింపుఁడు. స్వచ్ఛకాంతిగల వస్తువునువలెను మెఱుపునువలెను, నొగలతోఁగూడిన రథములందు కూర్చున్న మిమ్ము సర్వజనులును, జూచుచున్నారు.

౭౪౦. విశ్వవేదసో రయిభిః సమోకసః సమ్మిశ్లాసః స్తవిషీభిర్విరప్శినః॥

అస్తార ఇషుం దధిరే గభస్త్యో రనన్తశుష్మా వృషఖాదయోనరః॥

దం॥ సర్వజ్ఞులును, ధనము నివాసమందుఁ గలవారును, (నిధిపతులని తా॥) బలవంతులును, గొప్పవారును, శత్రులఁదూలించువారును, ఎడతెగనిబలముకలవారును, సోమమునుభక్షించువారును, (ప్రీతివస్తువును,) సహింపువారును అగు మరుత్తులు బాహులందు బాణధనుస్సులను ధరించిరి.

౭౪౧. హిరణ్యయేభిః పవిభిః పయోవృధ ఉజ్జిఘ్నన్త ఆపథ్యో౽నపర్వతాన్ ।

మఖా అయాసఃస్వసృతో ధ్రువచ్యుతో దుధ్రకృతో మరుతో భ్రాజదృష్టయః॥

దం॥ వర్షోదకమును వృద్ధినొందించుచున్నవారును, యజ్ఞముకలవారును, యజ్ఞస్థలమునకు నడచువారును, స్వయముగానే (శత్రువులపై) నడఁచువారు అచలములను గూడఁ గదలించువారలు, తమ్మితరులు మోయశక్యముగాని వారును, దీపించు

చూపులుకలవారును, అగు మరుత్తులు; మార్గమందు రథచక్రము (తృణాదుల) నెగురఁగొట్టునట్లు సువర్ణమయ రథచక్రములతో మేఘములను, ఎగురఁగొట్టుచున్నారు.

౭౪౨. ఘృషుం పావకం వనినం విచర్షణిం రుద్రస్యసూనుం హవసా గృణీమసి ।
రజస్తురం తవసం మారుతం గణ మృజీషిణం వృషణం సశ్చతశ్రియే॥

దం॥ శత్రువులనణఁచునట్టి, పవిత్రతఁగలిగించునట్టి, వర్షోదకముగలట్టి, సమస్తమును దర్శించునట్టి, రుద్రుని కొమారులగు మరుద్గణములను, ఆహ్వాన (=పిలుచుటకు) సాధనములగు స్తుతిమంత్రములతో ఓ ఋత్విగ్యజమానులారా! ధూళినెగురఁజిమ్మునట్టి, బలసియున్నట్టి, ఋజీషముగలట్టి, వర్షించునట్టి, మరుత్తులను ధనముకొఱకు స్తుతింతుము. (ఋజీషము=బూర్లెమూకుడు. తృతీయసవనములో మూకుటిలో వంట జరుగును.)

౭౪౩. ప్రనూసమర్తః శవసా జనా అతితస్థౌవ ఊతీ మరుతో యమావత ।
అర్వద్భిర్వాజం భరతే ధనా నృభి రాపృచ్ఛ్యం క్రతు మాక్షేతి పుష్యతి॥

దం॥ ఓ మరుత్తులారా! ఎవ్వఁడు మీరక్షణలచేత రక్షింపఁబడునో, గుఱ్ఱములతో నన్నమును, బురుషులతో ధనమును, సంపాదించునో, శుభప్రశ్నచేయఁదగిన క్రతువును జేయునో, పుష్టినివహించునో, ఆ మర్త్యుఁడు బలముచేత నితరుల నతిక్రమించి యుండును.

౭౪౪. చర్కృత్యం మరుతః పృత్సు దుష్టరం ద్యుమన్తం శుష్మంమఘవత్సు ధత్తన ।
ధనస్పృతముక్థ్యం విశ్వచర్షణింతోకంపుష్యేమతనయం శతంహిమాః॥

దం॥ ఓ మరుత్తులారా! సర్వకర్మ కుశలుఁడును, యుద్ధమందు జయింపశక్యము గానివాఁడును, కాంతిమంతుఁడును, శత్రువుల మాడుచువాఁడును, ధనవంతుఁడును, స్తుతింపఁదగినవాఁడును, సర్వజ్ఞుఁడును, అగు పుత్రునిఁ, బౌత్రుని నూఱు హేమంత ఋతువులు (నూఱుపంటకాలములని తా॥) మేము పోషించు కొన్నట్లు దయ సేయుఁడు.

౭౪౫. నూష్ఠిరం మరుతో వీరవన్త మృతీషాహం రయి మస్మాసుధత్త ।
సహస్రిణం శతినం శూశువాంసం ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్॥

దం॥ ఓ మరుత్తులారా! స్థిరమైన వీర్యవంతమైన శత్రువులను దిరస్కరించునట్టి, (పుత్రరూప) ధనమును నూర్లకొలంది వేలకొలది ధనములుకలిగి వర్ధిల్లునట్లు మా యందుఁగలుగఁజేయుఁడు. తలంచినంతలో ధనముకల (మరుత్తులు) ప్రాతఃకాల మందు శీఘ్రముగా వత్తురుగాక.

—:-o-:—

## అనువాకము. ౧౨.

### సూక్తము. ౬౫.

(ఋషి - పరాశరుఁడు ; దేవత - అగ్ని ; ఛందస్సు - విరాట్టు.)

౨౪౬. పశ్వానతాయుం గుహాచతన్తమ్ నమో యుజానం నమో వహన్తమ్ ।

సజోషా ధీరాః పదైరనుగ్మన్నుప త్వాసీదన్ విశ్వేయజత్రాః ॥

దం॥ (ఉదకరూపమగు) గుహతోఁ బ్రవేశించినట్టి, అన్నముతోఁ గూడినట్టి, హవిస్సుల వహించునట్టి, నిన్ను; ఓయగ్ని! మేధావంతులగు (దేవతలు) నీయడుగు జాడలనుబట్టి, (దొంగిలించిన) పశువులతోఁ గూడినదొంగ ననుసరించినట్లు; అనుస రించిరి. యజింపఁదగిన సర్వదేవతలును నిన్ను సమీపించిరి.

౨౪౭. ఋతస్య దేవా అనువ్రతా గుర్భువత్పరిష్టిర్ద్యౌర్నభూమ ।

వర్ధన్తీమాపః పన్వాసుశిశ్వి మృతస్యయోనాగర్భే సుజాతమ్ ॥

దం॥ పాఱిపోయిన యగ్నియొక్క జాడలను దేవతలనుసరించుచుఁ బోయిరి. అంత టను, వెదకుటయయ్యెను. భూమికూడ స్వర్గమువలె నయ్యెను. స్తుతులచేఁ బెరిగినట్టి, యజ్ఞమునకుఁగారణమయినట్టి, జలమధ్యమున చక్కగా నిలిచియున్నట్టి, యీ యగ్నిని ఉదకములు దాఁచినవి.

౨౪౮. పుష్టిర్నరణ్వా క్షితిర్నపృథ్వీ గిరిర్నభుజ్మక్షోదోనశమ్భు ।

అత్యోనాజ్మన్సర్గప్రతక్తః సిన్ధుర్నక్షోదఃక ఈం వరాతే ॥

దం॥ రమణీయమయిన పుష్టివలెను, విస్తీర్ణమైన భూమివలెను, పర్వతమువలెను, అందఱకును భోజనము సమకూర్చునట్టి; ఉదకమువలె సుఖకరమయినట్టి; యుద్ధమందలి గుఱ్ఱమువలె నెల్లపుడు గమనించునట్టి; నీటివలెఁ బరువెత్తు స్వభావముగలట్టి; యీయగ్ని నెవఁడు వారింపగలడు?

౭౪౯. జామిస్సింధూనాం భ్రాతేవ స్వస్రా మిభ్యాన్న రాజావనా న్యత్తి ।
యద్వాతజూతో వనా వ్యస్థా దగ్నిర్హా దాతిరోమా పృథివ్యాః॥

దం॥ అక్కసెల్లెండ్ర కన్నదమ్ముఁడువలె నగ్ని యుదకములకు బంధువు. రాజు ధనవంతులను బీడించునట్లు వనముల నగ్ని తినును. వాయువుచేతఁ బ్రేరింపబడి యెపుడు వనములను జీకాకుపఱచునో యపుడు అగ్నియే పృథివియొక్క రోమములను (అనగాఁ జెట్లు చేమలని తా॥) ఛేదించును.

౭౫౦. శ్వసిత్యప్సు హంసోన సీదన్ క్రత్వాచేతిష్ఠో విశాముషర్భుత్ ।
సోమోనవేధా ఋత ప్రజాతః పశుర్న శిశ్వావిభుర్దూరేభాః॥

దం॥ దూరమునకుగూడఁ బ్రకాశముగలిగించునట్టి, సర్వవ్యాపకుఁడగునట్టి, యీయగ్ని (దేవతలనుండి పారిపోయి) ఉదకములందు హంసవలె నణఁగియున్నది. రాజు ధనవంతులను బీడించునట్లు అగ్ని వనములను దినును. వాయువుచేతఁ బ్రేరింపఁబడినవాఁడై యెపుడు వనములను జీకాకుపఱచునో యపుడు అగ్నియే పృథివియొక్క రోమములను (చెట్లు చేమలని తా॥) ఛేదించును.

---

## సూక్తము. ౬౬.

(ఋషి - పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - విరాట్టు)

౭౫౧. రయిర్నచిత్రా సూరోన సందృగా యుర్నప్రాణో నిత్యోన సూనుః ।
తక్వాన భూర్ణిర్వనా సిషక్తి పయోన ధేనుః శుచిర్విభావా॥

తం॥ ఈయగ్ని ధనమువలె సంపాదింపదగినది. సూర్యునివలె సర్వవస్తువులఁ జూపించునది. ఆయుర్దాయమువలె జీవనాధారము. కొడుకునివలె నిత్యము (ప్రీతికరుఁ డని తా॥) గుఱ్ఱమువలె రక్షకము, పాలవలెఁ బ్రీతికరము, విశేష ప్రకాశముకలదై వనముల నంటుకొనుచున్నది.

౬౬.౨. దాధార క్షేమ మోకో న రణ్వో యవో న పక్వో జేతా జనానామ్ ।
ఋషిర్న స్తుభ్వా విక్షు ప్రశస్తో వాజీన ప్రీతో వయో దధాతి॥

తం॥ ఈయగ్ని క్షేమమును ధరించుచున్నాఁడు. (సర్వవస్తువులను గాపాడుట క్షేమము) నివాసస్థానమువలె ఆశ్రయింపదగినది. ధాన్యమువలెఁ బాకము పొందియున్నది. శత్రుల జయించును. ఋషివలె దేవతల స్తుతించును. యజమానులందఱిచేతను ఎన్నఁబడును. (మంచి) గుఱ్ఱమువలె సామర్థ్యము కలిగించును. అట్టియగ్ని (మాకు) అన్నము నిచ్చుఁగాక.

౬౬.౩. దురోకశోచిః క్రతుర్న నిత్యో జాయేవ యోనా వరం విశ్వస్మై ।
చిత్రో యదభ్రాట్ ఛ్వేతో న విక్షు రథో న రుక్మీ త్వేషః సమత్సు॥

తం॥ ఇతరులు పొంద శక్యముగాని తేజస్సుగలవాఁడు, యజ్ఞకర్తవలెనే నిత్యుఁడు (=జాగ్రతగలవాఁడని తా॥) గృహమందు భార్యవలె జనులందఱికిని అలంకార మగును. చిత్రదీప్తికలవాఁడై ప్రకాశించునపుడు తెల్లకాంతిగల సూర్యునివలె నగును. ప్రజలవద్ద రథమువలె బంగారుకాంతితో మెఱయును. యుద్ధములలో దీపించువాఁ డును (అయియున్నాఁడు).

౬౬.౪. సేనేవ సృష్టామం దధాత్యస్తుర్న దిద్యుత్ త్వేషప్రతీకా ।
యమో హ జాతో యమో జనిత్వం జారః కనీనాం పతిర్జనీనామ్॥

తం॥ ప్రభువుపంపించిన సేనవలె, విలుకానియొక్క వాడిబాణమువలెను, అగ్ని భయముం గలిగించును. పుట్టినది యగ్నియే, పుట్టఁబోవునది యగ్నియే (సర్వజంతువులు నగ్నిరూపములని తా॥) కన్యలకుఁ గన్యాత్వమును బోగొట్టును. భార్యలయిన వారికి రక్షకుఁడు.

౭౫౫. తం॒ త్వ్వరాథా వ॒యుం వ॒సత్యా॒స్తం నగావో న॒క్ష॒న్త ఇ॒ద్ధమ్ ।

సిన్ధు॒ ర్న క్షోదః ప్రనీచీ రై॒నోన్నవ॒న్తగావః స్వ॒ర్ద్రశీకే॥

దం॥ చరజంతువుల హవిస్సులచేతను, స్థిరజంతువుల (చెట్లు మొదలగు) హావిస్సులచేత (అనఁగా ధాన్యమనియు తా॥) దీపించిన యీయగ్నిని మేము ఆవులు ఇల్లుసేరునట్లు చేరుదుము. ప్రవహించు నుదకమువలె నీయగ్ని ఇటునటుపరుగిడుచు జ్వాలలను ప్రేరించును. స్వర్గమందుఁగనిపించు నగ్నియందుఁ (అనఁగా సూర్యునందు) గిరణములు కూడియున్నవి.

—:-o-:—

సూ క్తము. ౬౭.

(ఋషి - పరాశరుఁడు ; దేవత - అగ్ని; ఛందస్సు - విరాట్టు.)

౭౫౬. వ॒నేషుజాయు ర్మ॒ర్తేషు మి॒త్రో వృణీతే శ్రుష్టిం రాజేవా జుర్యమ్ ।

క్షే॒మోనసా॒ధుః క్రతు॒ర్నభ॒ద్రో భువత్స్వాధీర్హోతా హవ్య॒వాట్॥

దం॥ వనమందుబుట్టి మనుష్యులకుఁ బ్రియుఁడయిన యగ్ని హవిస్సులనిచ్చు యజమానుని; రాజు దృఢకాయుని గోరునట్లు కోరును. అగ్ని రక్షకునియట్లు (కార్యములు) సాధించువాఁడు. కర్మలఁజేయువానివలెఁ గల్యాణము గూర్చువాఁడు. దేవతలం బిలుచువాడు. హావిస్సుల మోసికొనిపోవువాఁడు.

౭౫౭. హ॒స్తే దధా॑నో నృ॒మ్ణా విశ్వా॒న్యమే దేవా॒న్ధా॒ద్గుహా॑ ని॒షీద॑న్ ।

వి॒దన్తీ॒మత్ర॒ నరో॒ ధియంధా హృ॒దా యత్తష్టా॒న్మన్త్రా॒ అశం॑సన్॥

దం॥ సకల (హవీరూపమగు) నన్నములను దనహస్తమందు ధరించునగ్ని గుహయందు (అనఁగా నుదకమందు) ఉన్నవాఁడై దేవతలను భయమునందించెను. (హవిస్సుల నగ్నిపట్టుకొని పాఱిపోయినందున దేవతలకు భయముకలిగెనని తా॥) నడిపించువారును, కర్మల బోషించువారును అగు దేవతలు ఈకాలమందు నీయగ్నిని దెలియుచున్నారు. అపుడు హృదయమందున్న బుద్ధితో నిర్మింపఁబడిన (స్తుతి) మంత్రములను స్తుతించిరి.

౭౫౮. అజో న క్షాం దాధార పృథివీం తస్తంభ ద్యాం మంత్రేభిః సత్యైః ।

ప్రియా పదాని పశ్వో ని పాహి విశ్వాయు రగ్నే గుహా గుహం గాః॥

టీ॥ భూమిని, అంతరిక్షములను సూర్యుఁడు ధరించినట్లే అగ్ని ధరించెను. ద్యులోకమును సత్యమయిన మంత్రములతో నిలిపెను. ఓ యగ్నీ! సర్వభక్షకుఁడా! పశువులకుఁ బ్రియమయిన చోట్లను (గడ్డి, నీరుగలవని తా॥) పాలించుము. గుహలోని గుహను బ్రవేశించియుండుము. (గోవులు సంచరించని అంతర్గుహలోనే యుండుము అని తా॥)

౭౫౯. య ఈం చికేత గుహా భవంతమా యః ససాద ధారామృతస్య ।

వి యే చృతం త్యృతా సపంత ఆదిద్వసూని ప్రవవాచాస్మై॥

టీ॥ ఎవఁడీయగ్నిని గుహాయందున్నవానిగాఁ దెలిసికొనునో, యజ్ఞమును ధరించు వానిగా నుపాసించునో (సేవించునో యని తా॥) ఎవరు యజ్ఞముల నాచరింతురో వారు అగ్నినిగూర్చి స్తుతులు కావింతురు. అగ్ని స్తుతికర్తలందఱకు ధనము (గలచోటు) చెప్పెను.

౭౬౦. వి యో వీరుత్సు రోధ న్మహిత్వోత ప్రజా ఉత ప్రసూష్వంతః ।

చిత్తి రపాం దమే విశ్వాయుః సద్మేవ ధీరాః సమ్మాయ చక్రుః॥

టీ॥ ఏయగ్ని చెట్లచేమలలో గొప్పవానినన్నిటి నావరించును. వాటి ఫలాంధకముల మధ్యనున్న బీజములనుకూడ మిగల్చదు. కదలికను గలిగించునట్టి జలమందున్న గృహమందు సర్వభక్షకముగు నగ్నిని మేధావంతులు పూజించి (కర్మను) చేయుదురు.

—:-o-:—

సూక్తము, ౬౮.

(ఋషి - పరాశరుడు; దేవత - అగ్ని; ఛందస్సు - విరాట్టు.)

౭౬౧. శ్రీణ న్నుపస్థా ద్దివం భురణ్యుః స్థాతు శ్చరథమక్తూ న్వ్యూర్ణోత్ ।

పరి య దేషా మేకో విశ్వేషాం భువద్దేవో దేవానాం మహిత్వా॥

దం॥ హవిస్సులను భరించుచు వాటితోఁగలియుచుఁ బ్రాప్తించును సర్వదేవతలలోను బ్రకాశించును నీయగ్నియొక్కఁ దేజే (స్థిరచర) జంతువుల మహత్తులను ఆక్రమించును గనుకనే అన్నిరాత్రులందు స్థిరచరజగత్తును బ్రకాశింపఁజేయును.

౬౮.౨. ఆదిత్తే విశ్వే క్రతుం జుషన్త శుష్కా ద్యద్దేవ జీవో జనిష్ఠాః ।
భజన్త విశ్వే దేవత్వ న్నామ ఋతం సపన్తో అమృత మేవైః॥

దం॥ ఓ యగ్ని దేవా! జ్వలించుచు నెండినకట్టెనుండి యెపుడు పుట్టితివో ఆవెంటనే యజమానులందఱును నీకొఱకుఁ గ్రతువులను చేయుచున్నారు. మరణములేని నిన్ను జెందిన (స్తుతులచేత) సేవించుచు నందఱును బ్రసిద్ధమగు దేవత్వమును బొందుచున్నారు.

౬౮.౩. ఋతస్య ప్రేషా ఋతస్య ధీతి ర్విశ్వాయు ర్విశ్వే అపాంసి చక్రుః ।
యస్తుభ్యం దాశా ద్యోవాతే శిక్షా త్తస్మై చికిత్వా న్రయిం దయస్వ॥

దం॥ యజ్ఞస్థలమునకు వచ్చిన యగ్నికి స్తుతులొనర్పఁబడుచున్నవి. యాగముకూడఁ జేయఁబడుచున్నది. అగ్ని సర్వభక్షకుఁడు. అందఱు యజమానులును గర్మలు నేతురు. ఓ యగ్నీ! నీకెవఁడు హవిస్సులనిచ్చునో, యెవఁడు కర్మసేయఁగోరునో అట్టివారి నెఱిఁగి ధనమునిమ్ము.

౬౮.౪. హోతా నిషత్తో మనోరపత్యే సచిన్న్వాసాం పతీరయీణాం ।
ఇచ్ఛన్త రేతో మిథస్తనూషు సంజానత స్వైర్దక్షై రమూరాః॥

దం॥ అగ్నీ! దేవతలంబిలుచువాఁడవై నీవు మానవుల నాశ్రయింతువు. అనీవే యాప్రజల ధనములఁ బాలింతువు. ఆప్రజలు రేతస్స్వరూపమునఁ దమశరీరములలోఁ గలిసియున్నట్లుగా నిన్నుగోరుదురు. వారు మూఢత్వము లేనివారై సమర్థులైన తమ పుత్రులతోఁగూడఁ జిరముగా నిన్ను దెలియుచుందురు.

౭౬౫. పితుర్న పుత్రాః క్రతుం జుషన్త శ్రోషన్యే అస్య శాసం తురాసః ।

విరాయ ఔర్ణోద్దురః పురుక్షుః పిపేశ నాకం స్తృభిర్దమూనాః॥

ద॥ ఏ యజమానులు ఈ యగ్ని శాసనమును; త్వరతోఁ దండ్రి శాసనమును వలెఁ సేవించుచున్నారో; బహ్వన్నములు గల యగ్ని (ఈ యజమానుల యజ్ఞమునకు) సాధనములగు ధనములను గనఁబఱచును. యజ్ఞగృహమునందు మనస్సుగల యగ్ని నక్షత్రములతో ద్యులోకమును అసుర్చెను. (పుత్రః=బహుకర్మలలో సహాయుఁడు అని యాస్క-)

---

సూక్తము. ౬౯.

(ఋషి - పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - విరాట్టు)

౭౬౬. శుక్రః శుశుక్వాఁ ఉషో న జారః పప్రా సమీచీ దివో న జ్యోతిః ।

పరిప్రజాతః క్రత్వా బభూథ భువో దేవానాం పితా పుత్రః సన్॥

దం॥ శుభ్రవర్ణముగల యీ యగ్ని ఉషస్సును దొలఁగించు సూర్యునివలె సర్వ ప్రకాశకుఁడయి యున్నాఁడు. కలిసియున్న ద్యులోక భూలోకములఁ దు ప్రకాశించు సూర్యకాంతివలె నిండియున్నది. ఓ యగ్నీ! నీవు పుట్టినవాఁడవయి కర్మచేతను జగత్తంతను వ్యాపించితివి. ఋత్విజులకుఁ బుత్రుఁడవయి పాలించుచున్నావు.

౭౬౭. వేధా అదృప్తో అగ్నిర్విజానన్నూధర్న గోనాం స్వాద్మా పితూనామ్ ।

జనే న శేవ ఆహూర్యః సన్మధ్యే నిషత్తో రణ్వో దురోణే॥

దం॥ సర్వకర్తవై, గర్వములేనివాఁడవై మంచిచెష్టలను దెలియునట్టి ఓ యగ్నీ! ఆవులయొక్క పొదుగువలె నన్నములకు రుచిగలిగింతువు. (పొదుగట్లు పాలిచ్చి రుచి గలిగించునో యట్లు పాకమిచ్చి అన్నమును రుచిపుట్టించునని తా॥) గ్రామములలో నుపకారియగు పురుషునివలె నందఱుచేతఁ బిలువఁబడినవాఁడవై యజ్ఞగృహమందుండి స్తుతింపబడుచున్నావు.

౭౬౮. పుత్రోన జాతో రణ్వో దురోణే వాజీన ప్రీతోవిశో వితారీత్ ।
విశో యదహ్వే నృభిః సనీళా అగ్నిర్దేవత్వా విశ్వాన్యశ్యాః॥

దం॥ కొమారునివలె గృహమందుఁబుట్టిన (పత్నీ యజమానులు మథించి పుట్టిన యగ్నిని జీవితాంతము ఇంటగాపాడుచుండుటచేత) యగ్ని సంతోషము గలిగించుచున్నాఁడు. గుఱ్ఱమువలెఁ బ్రజలను దరింపఁజేయును. (సహాయుడని తా॥) ఋత్విజులతోఁగూడి యొక్కచోట నివసించుప్రజలను (దేవసంబంధులను) నే నెప్పుడు పిలుతునో అపుడీయగ్ని సర్వదేవతారూపము నొందుచున్నాడు.

౭౬౯. నకిష్ట ఏతా వ్రతా మినన్తి నృభ్యో యదేభ్యః శ్రుష్టిం చకర్థ ।
తత్తుతేదంసో యదహన్త్సమానైర్నృభిర్యద్యుక్తో వివే రపాంసి॥

దం॥ ఏకారణముచేత నీవు యజ్ఞము నడిపించు నీమనుష్యులకొఱకు సుఖమును గలిగించుచున్నావో, మఱియేకారణముచేత ఓ యగ్నీ! ఆ నీ కర్మలను (రాక్షసాదులు) హరించుచునపుడు నీతోసమానులైన మరుత్తులతోఁగూడి బాధకులను దోలుచున్నావో; ఆ కారణముచేత నీ కర్మలన్నియు (దర్శపూర్ణమాసాదులని తా॥) బాధకులు బాధింపకుండ జరుగును,

౭౭౦. ఉషోన జారో విభావోస్రః సంజ్ఞాతరూప శ్చికేతదస్మై ।
త్మనా వహన్తో దురో వ్యృణ్వన్నవన్త విశ్వే స్వర్దృశీకే॥

దం॥ ఉషస్సులదొలఁగించు సూర్యునింబోలి విశేషప్రకాశముగల్గి నివాసభూతుఁడవై యజమానునకుఁ దెలియబడుచున్నావు. ఇతని కిరణములు హవిస్సులను మోయుచు (యజ్ఞ గృహద్వారములను వ్యాపించెను. తరువాతఁ జూడదగిన యంతరిక్షమందు ఆరశ్ములన్నియు (కిరణములు) వ్యాపించెను.

—:-0-:—

సూక్తము. ౭౦.

(ఋషి - పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - విరాట్టు)

౭౭౧. వనేమ పూర్వీరర్యో మనీషా అగ్నిః సుశోకో విశ్వాన్యశ్యాః ।
ఆ దైవ్యాని వ్రతా చికిత్వా నామానుషస్య జనస్య జన్మ॥

దం॥ విస్తారమయిన యన్నములను బొందుదుముగాక. బుద్ధిచేతఁ బొందఁదగిన వాఁడును, (ముట్టుటకు వీలులేదని తా॥) శోభన కాంతిమంతుఁడును అగు నగ్ని దేవతల కర్మలన్నిటిని దెలియఁజేయుచు మనుష్యుల పుట్టుకగూపమయిన కర్మలను దెలియుచు నన్నికర్మలలోఁ దానేయున్నాఁడు.

౭౭౨. గర్భోయో అపాం గర్భో వనానాం గర్భశ్చ స్థాతాం గర్భశ్చరథామ్ ।
అద్రౌ చిదస్మా అన్తర్దురోణే విశాంన విశ్వో అమృతః స్వాధీః॥

దం॥ ఉదకములగర్భము, అరణ్యముల గర్భము, స్థావరముల గర్భము, చరజంతువుల గర్భము నయి గృహమందుఁ బర్వతమందును లోపల నేయగ్ని యుణఁగియున్నదో యీ యగ్నికే (హవిస్సుల నిత్తురు) ఈయగ్ని రాజు ప్రజలనువలె అమృతుఁడు, శోభనకర్మకారియు నగుచున్నాఁడు.

౭౭౩. సహిక్షపావా అగ్నీ రయీణాం దాశద్యో అస్మా అరం సూక్తైః ।
ఏతా చికిత్వో భూమా నిపాహి దేవానాం జన్మ మర్తాంశ్చ విద్వాన్॥

దం॥ ఆయగ్ని యేరాత్రియున్నాఁడు. ఏయజమానుఁడు యోగ్యమయిన స్తుతిమంత్రములతో నగ్నిని స్తుతించునో అతనికి ధనములిచ్చును. చైతన్యము గలిగించు నో యగ్నీ ! (ఇంద్రాది) దేవతలను జన్మచేత మనుష్యులను దెలియుచు నీభూమియందలి జంతువులను బాగుగ రక్షించుము.

౭౭౪. వర్ధాన్యం పూర్వీః క్షపో విరూపాః స్థాతుశ్చరథ మృత ప్రవీతమ్ ।
అరాధి హోతా స్వర్నిషత్తః కృణ్వన్విశ్వాన్యపాంసి సత్యా॥

దం॥ అనేకములగు నుషస్సులును, రాత్రులును వివిధరూపములు గలవి. ఏవి స్థిరరూపమై, చరరూపమై ఉదకముచేత నావరించియున్న యగ్నిని వృద్ధినొందించుచున్నవో యాయగ్ని సత్యఫలముగల సర్వకర్మలనుజేయుచు సుఖముగా గమ్యమైన దేవయజన స్థానమందుండి యారాధింపఁ బడుచున్నాఁడు.

౭౭౫. గోషు ప్రశ స్తిం వనేషు ధిషే భర న్త విశ్వే బలిం స్వర్ణః ।
వి త్వా నరః పురుత్రా సపర్య న్పితుర్న జి వ్రేర్వి వేదో భర న్త॥

దం॥ ఓ యగ్నీ! కోరదగిన మాపశువులకు శుభమును గలిగించుచున్నావు. సమస్తజనులు మాకు మంచి కానుకగాఁ బొందఁదగు ధనమును దెచ్చియిత్తురుగాక. ఓ యగ్నీ! నిన్ను మనుష్యులు అనేక దేవయజనస్థానములందుఁ బూజింతురు. ముసలివాఁడయిన తండ్రినుండి కొడుకులు తీసికొనునట్లు; నీనుండి మనుష్యులు ధనమును దీసికొనుచున్నారు.

౭౭౬. సాధుర్న గృధ్ను ర స్తేవ శూరో యాతేవ భీమ స్త్వేషః సమత్సు॥

దం॥ ఈయగ్ని సాధకుఁడవలెను, (సాధ్యఫలమును) దీసికొనును. బాణములను జిమ్ము శూరుఁడువలెను (శత్రువులనుగొట్టును) హింసకుఁడువలె భయంకరుడగు నగ్ని యుద్ధమందు వెలుఁగుచు (మమ్మురక్షించుఁగాక)

—:-o-:—

సూక్తము. ౭౧.

(ఋషి - శక్తిపుత్రుడగు పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్)

౭౭౭. ఉపప్రజిన్వన్నుశతీ రుశ న్తం పతింన నిత్యం జనయః సనీళాః ।
స్వసారః శ్యావీ మరుషీ మజుశ్రం చిత్ర ముచ్ఛ న్తీ ముషసంన గావః॥

దం॥ (అన్యోన్యము) కామించుచున్నట్టి (అక్కసెల్లెండ్రవలె) ఒకేచోటనున్నట్టి చేతివ్రేళ్ళు కామించుచున్న యగ్నిని; భార్యలు నిత్యుఁడయిన పతినివలెను (ఏకపత్నీవ్రతుఁడని తా॥) పూజనీయుఁడయిన యగ్నిని నల్లనైన చీకటినిబోఁగొట్టుచుఁ బ్రకాశముగల స్వచ్ఛరూపమగు ఉషస్సును. గిరణములువలెను సేవించుచున్నవి.

౨౨౮. వీళుచిద్దృళ్హా పితరో న ఉక్థైరద్రిం రుజన్నఙ్గిరసో రవేణ ।
చక్రుర్దివో బృహతో గాతు మస్మే అహః స్వర్విविదుః కేతు ముస్రాః॥

దం॥ మా పితరులగు నాంగిరసస్సులు ఉక్థలతో (నగ్నిని స్తుతించి) బలవంతుఁడు దృఢగాత్రుఁడు నగు అద్రిని (=అన్నిటిం దినువాఁడు - పణియను రాక్షసుఁడు) స్తుతి ధ్వనితోనే భంజించిరి. (వీరు గొట్టిరి) గొప్ప ద్యులోకమార్గమును మాకుఁగలిగించిరి. సుఖముగాఁ బొందఁదగిన పగటిని తెలిసికొనిరి. పగళ్ళను తెలియఁజేయునట్టి సూర్యుని యొక్క (పణిదాఁచిన) గోవులనుగూడఁ దెలిసికొనిరి.

౨౨౯. దధన్నృతం ధనయన్నస్య ధీతి మాదిదర్యో దిధిష్వో విభృత్రాః ॥
అతృష్యన్తీ రపసో యన్త్యచ్ఛా దేవాఞ్జన్మ ప్రయసా వర్ధయన్తీః॥

దం॥ (దేవయజనస్థానమును) బొందినయగ్నిని (అంగిరసస్సులు) ధరించిరి. (అనగా నిలువఁజేసిరని తా॥) ఈ యగ్నియొక్క కర్మను సంపాదించిరి. తరువాతనే ధనమున కధిపతులయి అగ్న్యాధానముచేసి (ఆయగ్నుల) విహరించుచు (విహరించుటయన జ్వాలఁజేసి యని పరిభాష) ఇతరాశలు లేనివారై, కర్మలుచేయువారై, హవిరూపమైన యన్నముతో దేవతలను, మనుష్యులను వృద్ధిసంధించు చున్నవారయి (అగ్నిని) అభిముఖముగా సేవించుచున్నారు.

౨౩౦. మథీద్యదీం విభృతో మాతరిశ్వా గృహేగృహే శ్యేతో జేన్యోభూత్ ।
ఆదీంరాజ్ఞే న సహీయసే సచా సన్నా దూత్యం భృగవాణో వివాయ॥

దం॥ (అయిదు విధములుగా) విభజింపఁబడిన ప్రాణవాయువు ఈయగ్ని నెపుడు మథించెనో; ఎపుడీ తెల్లనియగ్ని ప్రతిగృహమందుఁ బుట్టునో; ఆతరువాత; ఇతర రాజుచేతఁ బరాభవింపఁబడిన తన మిత్రుఁడగు నొకరాజు నద్దకునువలెను; భృగు మహర్షివంటి యజమానుఁడీ యగ్నిని దూత్యమునకుఁ బంపెను (దూత్యము= రాయబారము)

౨౩౧. మహే యత్పిత్ర ఈంరసం దివే కరవత్సరత్పృశన్యశ్చికిత్వాన్ ।
సృజదస్తా ధృషతా దిద్యుమస్మై స్వాయాం దేవో దుహితరి త్విషిం ధాత్॥

దం॥ గొప్పవారును, పాలకులును అగు దేవగణముకొఱకు (ఈ పృథివీసారమగు) రసమును (అనఁగా హవిస్సును) యజమానుఁడెపుడిచ్చునో అపుడు కినిపెట్టి నేర్పును తెలివిగల (రాక్షసుఁడు) పాఱిపోవుచున్నాఁడు. బాణమును ప్రయోగింపఁగలట్టి యగ్ని పాఱిపోవుచున్న వీనిమీఁద దీపించుబాణమును విడిచెను. దీపించుచున్న యీ యగ్ని తన కూతురగు (ఉషస్సునందు)తన కాంతి నుంచెను.

౭౧-౬. స్వ ఆయస్తుభ్యం దమ ఆవిభాతి నమో వా దాశా దుశతో అనుద్యూన్ ।

వర్ధో అగ్నే వయోఅస్యద్విబర్హాయాసద్రాయా సరథం యంజునాసి॥

దం॥ ఓ యగ్నీ ! నిన్ను దన యజ్ఞగృహమందు ఏయజమానుఁడు యథాశాస్త్రముగాఁ బ్రజ్వలింపజేయునో, ఎవఁడు ప్రతిదినమును కోరుచున్న నీకు నమస్కారముగాని చేయునో; అట్టివానికిని రెండుచోట్ల వర్ధిల్లునీవు (అనఁగాఁ జివరను మధ్యను మంట ఉండును.) అన్నమును వృద్ధిసేయుము. (యుద్ధార్థియై) రథముతోఁగూడిన యెవనిం బ్రేరింతువో వాఁడు ధనవంతుఁడగును.

౭౧-౭. అగ్నిం విశ్వా అభిపృక్షః సచన్తే సముద్రం న స్రవతః సప్తయహ్వీః ।

నజామిభిర్విచికితే వయోనో విదా దేవేషు ప్రమతిం చికిత్వాన్॥

దం॥ (చరుపురోడాశాది) సర్వాన్నములు అగ్నిని; ఏడు గొప్పనదులు సముద్రునిం బలె; అభిముఖములై పొందుచున్నవి. (ఓ యగ్నీ !) జ్ఞాతులతోఁగూడ (జామి=ఏకపాత్రలో భుజించువారని వ్యుత్పత్తి) తినుటకు మాయన్నము చాలదుకనుక ధనవంతుల నెఱిఁగి నీవు వారిధనమును (మాకుఁ) దెచ్చియిమ్ము.

౭౧ ౮. ఆయదిషే నృపతిం తేజ ఆనట్ శుచిరేతో నిషిక్తం ద్యౌరభీకే :

అగ్నిః శర్ధమనవద్యం యువానం స్వాధ్యంజనయత్సూదయచ్చ॥

దం॥ అగ్నీ ! శుద్ధమయిన, దీపించుచున్న యే నీతేజస్సు యజమానుని యన్నముకొఱకు వ్యాపించుచున్నదో (జఠరాగ్ని యని తా॥) ఆ యన్నరసరూపమును నీ తేజోరూపమును అగు నతని వీర్యము గర్భమందు (నిషిక్తము) తడుపఁబడినదై (పుత్రుని) బుట్టించును. (కనుకనే అగ్నియే పుత్రరూపుఁడని తా॥) బలవంతుఁడు,

దోషరహితుఁడు, చిన్నవయసువాఁడు, మంచికర్మలు సేయువాఁడు నగు పుత్రుని కర్మలలో ప్రేరేంచుము. వర్షోదకము సస్యములఁ బెంపొందించి యన్నముగలిగించునని యింకొక యర్థముగలదు.

౭౮౫. మనో నయోధ్వనః సద్య ఏత్యేకః సత్రా సూరోవస్వ ఈశే।

రాజానా మిత్రావరుణా సుపాణీ గోషు ప్రియ మమృతం రక్షమాణా॥

దం॥ ఏసూర్యుఁడొక్కఁడే (దివ్య) మార్గములను శీఘ్రముగా మనసువలెను గమనించును. కనుకనే ఆసూర్యుఁడు ధనమునంతయు నొక్కమారే తీసికొనును. ప్రకాశించునట్టి, శోభన బాహువులుకలట్టి, మిత్రావరుణులు (మా) గోవులందు ప్రియమై యమృతమువంటి పాలను రక్షించువారై యున్నారు.

౭౮౬. మానో అగ్నే సఖ్యా పిత్ర్యాణి ప్రమర్షిష్ఠా అభి విదుష్కవిః సన్।

నభో నరూపం జరిమా మినాతి పురా తస్యా అభిశస్తే రధీహి॥

దం॥ ఓ యగ్ని ! పిత్ర్యమయిన మా సఖ్యములు పాడుచేయకుము. ఏమంటే నీవు కవివై నీకభిముఖముగా సర్వమును దెలియుదువు. అంతరిక్షమును సూర్యకిరణములు ఆవరించినట్లు ముదిమి నన్నావరించి బాధించుచున్నది. హింసాహేతువయిన యా ముదిమిని నీవు ముందుగానే తెలిసికొనుము. (అమృతత్వమునిమ్మని తా॥)

——:00:——

## సూక్తము. ౭౨.

(ఋషి - శక్తిపుత్రుఁడగు పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్)

౭౮౭. నికావ్యా వేధసః శశ్వత స్కర్హస్తే దధానో నర్యాపురూణి।

అగ్నిర్భువ ద్రయిపతీ రయీణాం సత్రా చక్రాణో అమృతానివిశ్వా॥

దం॥ శాశ్వతమయిన బ్రహ్మయొక్క కార్యములను (అనఁగా మంత్రములు) ఈయగ్ని మనుష్యులకుఁ బనికివచ్చిన బహుధనములను హస్తమందు ధరించుచున్నదై; అభిముఖ

ముగాఁ జేసికొనుచున్నది, ఈయగ్ని సమస్తధనములను ఒక్కమాఱుగానే చేయుచు నుత్తమధనముల కధికారియై యున్నాఁడు.

౭౭౮. అస్మే వత్సం పరిషన్తం నవిన్దన్నిచ్ఛన్తో విశ్వే అమృతా అమూరాః ।
శ్రమయువః పదవ్యో ధియంధా స్తస్థుః పదేపరమే చార్వగ్నేః॥

దం॥ మాకుఁ బుత్రునివలెఁ బ్రియమైనట్టి; అంతటను వర్తించునట్టి; అగ్నిని దేవతలందఱును మూఢులుకాని (మరుత్తులు) పట్టుకొనలేకపోయిరి. వారు అలసినవారై కాలినడకతో నగ్నిజాడలు కనుక్కొనుచు సుందరమైన, యుత్తమమయిన యగ్ని యున్నచోట నుండిరి.

౭౭౯. త్రిస్రో యదగ్నే శరదస్త్వామిచ్ఛుచిం ఘృతేన శుచయః సపర్యాన్ ।
నామాని చిద్దధిరే యజ్ఞియా న్యసూదయన్త తన్వః సుజాతాః॥

దం॥ పవిత్రతగల (మరుత్తులు) ఓయగ్నీ! పవిత్రుఁడవైన నిన్ను గూర్చియే మూఁడుసంవత్సరములు నేతితో నెపుడు పూజించిరో యపుడు (నీవుపుట్టితివి.) వారు యజ్ఞార్హమైన నామములనుగూడ ధరించిరి. తరువాతఁ గ్రొత్తగాఁ బుట్టినవారై (నిన్నుకలిసిన తరువాత తమరూపము మారినవారని తా॥) తమశరీరములను స్వర్గముఁబొందించిరి.

౭౮౦. ఆరోదసీ బృహతీ వేవిదానాః ప్రరుద్రియా జభ్రిరే యజ్ఞియాసః ।
విదన్మర్తో నేమధితా చికిత్వానగ్నిం పదే పరమేతస్థివాంసమ్॥

దం॥ విశాలమయిన ద్యావాపృథువులకు నొకరితో నొకరికిఁ జెప్పుచు యజ్ఞార్హులయిన దేవతలు రుద్రునకర్హములయిన (స్తుతులు) చేసిరి. (రుద్రపదమిచట నగ్నికే చెల్లును.) సగభాగమును దీసికొనునట్టి (యింద్రునితోఁ గలిసి మరుత్తులగణము ఉత్తమస్థానమందు (అనఁగా నశ్వత్థవృక్షమందని తా॥) ఉన్నటువంటి యాయగ్నిని తెలిసికొని చేరెను. (ఆహుతిలో సగమింద్రుఁడు తీసికొనును. తక్కిన దేవతలు మిగిలినసగము పంచుకొందురట.)

వ౦॥ మంచికార్యములు సేయునట్టి, యేడు గొప్పనదులు ద్యులోకమునుండి వచ్చి (భూమియందుఁ (బ్రవహించుచున్నవి. యజ్ఞమెఱింగిన (అంగిరసులు) ధనమువచ్చు మార్గములను నీవల్ల దెలిసికొనిరి. ఏ పాలతో మానవులు భుజింతురో ఆ గోవులవల్ల బుట్టిన అధికమయిన పాలను దేవశుని (దేవతలు పెంచిన ఆడుకుక్క) పొందెను.

౭౯౫. ఆయేవిశ్వా స్వపత్యాని తస్థుః కృణ్వానాసో అమృతత్వాయ గాతుమ్ ।
మహ్నామహద్భిః పృథివీ వితస్థే మాతాపుత్రై రదితిర్ధాయసే వేః॥

వ౦॥ ఏ యాదిత్యు లమృతత్వముకొఱకు నుపాయములు చేయుచున్నవారై పతనము లేని (అనఁగా విఘ్నము లేని) సకల కర్మలను జేసిరో ఆగొప్ప కుమారులచేత నుత్సాహించుచున్న వారితల్లియగు పృథివి సర్వజగత్తులు ధరించుటకు ఁదనమహిమచే సమర్థురాలయ్యెను. (దేవతలందఱు పృథివి పుత్రులట!) ఓయగ్నీ! నీవు (ఆదిత్యులిచ్చిన చరుపురోడాశములను) భక్షించితివి. (అందుచేతనే యిది కలిగెనని తా॥)

౭౯౬. అధిశ్రియం నిదధు శ్చారుమస్మిన్ దివోయదక్షీ అమృతా అకృణ్వన్ ।
అధక్షరన్తి సింధవో నసృష్టాః ప్రసీచీ రగ్నే అరుషీరజానన్॥

వ౦॥ ఈ యగ్నియందు శోభనమగు యజ్ఞసంపదను (దర్భలు పఱుచుట మొదలగు పరిచర్య) యజమానులొనర్చిరి. (ఎపుడు) రెండు నేత్రములను యాగమున నిర్మించిరో (రెండు ఆజ్యాహుతులు అగ్నిలో వేతురు. అవి అగ్ని రెండు నేత్రములను భావించి వేతురు) అపుడు దేవతలు ద్యులోకమునుండి వెంటనే వత్తురు. ఆతరువాతనే అగ్ని జ్వాలలు నదులవలె శీఘ్రగమనము కలిగినవై యన్నిదిక్కుల వ్యాపించుచున్నవై వెలుంగుచు సంచలించును. దానిని దేవతలు తెలిసికొనుచున్నారు.

---

## సూక్తము ౭౩.

(ఋషి - పరాశరుఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౭౯౭. రయిర్నయః పితృవిత్తో వయోధాః సుప్రణీతి శ్చికితుషో నశాసుః ।
స్యోనశీ రతిథిర్న ప్రీణానో హోతేవసద్మ విధతో వితారీత్॥

దం॥ పిత్ర్యమయిన ధనమువలెను ఏయగ్ని అన్నమునిచ్చును. విద్వాంసుని శాసనము వలె సుఖముగాఁ బ్రణయింపఁదగినవాఁడు. (ప్రణయించుట=మండించుట) అతిథివలె శాలలో సుఖముగా శయనించును. ప్రీతిచెందిన యగ్ని యజమానగృహమును హోత (పురోహితుఁడు) వలె వృద్ధినొందించును.

౯౮. దేవోనయః సవితా సత్యమన్మా క్రత్వాని పాతి వృజనాని విశ్వా।
పురుప్రశస్తో అమతిర్నసత్య ఆత్మేవ శేవో దిధిషాయ్యోభూత్॥

దం॥ సూర్యునివలె నెవఁడు ప్రకాశించుచు యథార్థమును గుర్తెఱింగిన ఏయగ్నితన కర్మచేత సకలయుద్ధములను (ప్రజలకు) దాటించును. బహుగా స్తుతింపబడిన యగ్ని (పృథివ్యాదుల) స్వరూపమువలె నిత్యుఁడై (ఆకారములు మాఱినను పృథివీత్వ జలత్వాది స్వరూపమొక్కటే యని తా॥ ఉ॥ నూయి, నది, చెఱువు, సముద్రము, సర్వము జలరూపమే, ఆకారము వేఱు) ఆత్మవలె సుఖకరుఁడై ధరింపదగిన వాఁడయ్యెను. (ధరించుట=నిలువచేసుకొని యుంచుటని తా॥)

౯౯. దేవోనయః పృథివీం విశ్వధాయా ఉపక్షేతి హితమిత్రోన రాజా।
పురః సదః శర్మసదోనవీరా అనవద్యాపతిజుష్టేవనారీ॥

దం॥ సూర్యునివలెనే యగ్ని సర్వమును ధరించును. మేలుకూర్చు మిత్రులుగల రాజువలెఁ బ్రీతినిగలిగించుచు (దేవగృహమందు) ఉండును. ఏ యగ్ని యెదుటఁ గూర్చొన్న యజమాన ఋత్విజులు తండ్రియింటనున్న కొమాళ్లవలె నుందురో యాయగ్ని పెనిమిటితోఁగూడిన శుద్ధురాలయిన స్త్రీలవలెఁ బవిత్రుఁడగును.

౧౦౦. తంత్వా నరోదమ ఆనిత్యమిద్ధ మగ్నే సచన్త క్షితిషు ధ్రువాసు।
అధిద్యుమ్నం నిదధు ర్భూర్యస్మిన్‌భవా విశ్వాయుర్ధరుణో రయీణామ్॥

దం॥ ఓయగ్నీ! ఆనిన్ను యజమానులు గ్రామములందు, యజ్ఞగృహములందును, బ్రజ్వలింపఁజేయుచు నభిముఖముగా సేవింతురు. ఈయగ్నియందు బహువిధానములను (హవిస్సులని తా॥) ఉంచుదురు. అట్టి యగ్నీ! సర్వాన్నములుకలవాఁడవై ధనముల ధరించువాఁడవుకమ్ము.

౨౦౧. విపృక్షో అగ్నే మఘవానో అశ్యు ర్విసూరయో దదతో విశ్వమాయుః ।
సనేమవాజం సమిథేష్వర్యో భాగం దేవేషు శ్రవసే దధానాః॥

దం॥ ఓ యగ్నీ! యజమానులందఱును అన్నముల బొందుదురుగాక. ఏ విద్వాంసులు నిన్ను స్తుతింతురో, ఎవరు హవిస్సులిత్తురో వారందఱు సంపూర్ణాయువును బొందుదురు. శత్రువుల యన్నమును యుద్ధములందు మేము పొందుదుముగాక. కీర్తికొఱకు దేవతలకు హవిర్భాగముల ధరింతుముగాక. (హవిస్సులిచ్చి కీర్తివంతుల మగుదుముగాకని తా॥)

౨౦౨. ఋతస్యహి ధేనవో వావశానాః స్మదూధ్నీః పీపయన్త ద్యుభక్తాః ।
పరావతః సుమతిం భిక్షమాణా విసిన్ధవః సమయా సస్రు రద్రిమ్॥

దం॥ దేవయజనస్థానమందున్న యగ్నినే కామించుచున్నట్టి, పొదుగులెల్లపుడు గలట్టి మంచి తేజస్సుకలట్టి ధేనువులు పాలను ద్రాగఁబెట్టును. నదులు దయాస్వభావముకల్గి పర్వతములనుండి ప్రవహించుచున్నవి.

౨౦౩. త్వే అగ్నే సుమతిం భిక్షమాణా దివిశ్రవో దధిరే యజ్ఞియాసః ।
నక్తాచ చక్రు రుషసా విరూపే కృష్ణంచ వర్ణమరుణంచ సంధుః॥

దం॥ ఓ యగ్నీ! నీ యనుగ్రహమును గోరుచున్న యజ్ఞార్హులయిన సర్వ దేవతలును ద్యులోకమందున్న నీయందు (హవీరూపముగు) అన్నములనుంచిరి. వేఱువేఱు రూపములుగల రాత్రిని ఉషస్సును జేసిరి. (వాటికి) నలుపు ఎఱుపు రంగులు కలిగించిరి.

౨౦౪. యాన్రాయే మర్తాన్సుషూదో అగ్నే తే స్యామమఘవానో వయంచ ।
ఛాయేవ విశ్వం భువనంసిసక్ష్యా పప్రివాన్రోదసీ అన్తరిక్షమ్॥

దం॥ ఓ యగ్నీ! మనుష్యులమైన యేమమ్ము ధనముకొఱకుఁ బ్రేరించుచున్నావో యా మేము ధనవంతులమగుదుముగాక. ద్యులోక భూలోకాంతరిక్షలోకములనుండిన నీవు జగత్తునంతను నీడవలె సేవించుచున్నావు.

౮౦౫. అర్వద్భిరగ్నే అర్వతో నృభిర్నౄన్వీరైర్వీరాన్వనుయామా త్వోతాః।

ఈశానాసః పితృవిత్తస్య రాయో వి సూరయః శతహిమా నో అశ్యుః॥

దం॥ ఓ యగ్నీ! నీచేత రక్షింపబడినవారమై మేము మాగుఱ్ఱములతో (శత్రువుల) గుఱ్ఱములను మాభటులచేత (శత్రు) భటులను మావీరులచేతను (వీర్యముచే బుట్టిన వాఁడు=కొడుకని తా॥) శత్రువీరులను జంపుదుము. మాకొడుకులు పిత్ర్యధనముల కధిపతులగుచు విద్యావంతులయి నూఱేండ్లు జీవింతురుగాక.

౮౦౬. ఏతా తే అగ్న ఉచథాని వేధో జుష్టాని సన్తు మనసే హృదే చ।

శకేమ రాయః సుధురో యమం తేఽధి శ్రవో దేవభక్తం దధానాః॥

దం॥ మేధావంతుఁడవగు నో యగ్నీ! ఇపుడు మేముచేసిన స్తుతులు నీ మనసునకు హృదయమునకు ప్రియములగుగాక. నీలోని ఆజ్యాది హవిస్సులను దేవతలకిచ్చు నీసంబంధమయిన మంచి యుపయోగకరమైన ధనములను నియమించుటకు శక్తుల మగుదుముగాక. (నీధనము మా యధీనములోనుండుఁగాకని తా॥)

ఇట్లు పండ్రెండవ యనువాకము శ్రీ శ్రీ శ్రీ

—:-o-:—

## అనువాకము. ౧౩.

## సూక్తము. ౭౪.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి)

౮౦౭. ఉపప్రయన్తో అధ్వరం మన్త్రం వోచేమాగ్నయే। ఆరే అస్మే చ శృణ్వతే॥

దం॥ హింసాదోషములేని యజ్ఞములను (అధ్వర=హింసలేని) చేయుచున్న మేము దూరముగానుండి వినుచున్న అగ్నిదేవునికొఱకు (స్తుతి) మంత్రములను పఠించుచున్నాము.

౮౦౮. యః స్నీహితీషు పూర్వ్యః సంజగ్మానాసు కృష్టిషు। అరక్షద్దాశుషే గయమ్॥

దం॥ చాలాకాలమునాటి యేయగ్ని చంపదలచి కుట్రలుపన్ను శత్రులుండఁగాఁ గూడ యజమానునకు ధనము వర్షించునో యట్టి మంత్రమును బఠింతుము. (అని ఋత్విజుల మాట)

౮౯. ఉత త్రువన్తు జన్తవ ఉదగ్ని ర్వృత్రహాజని । ధనం జ్జయో రణేరణే॥

దం॥ (నీటి నావరించి మూఁతవేసిన) వృత్రుని సంహరించునట్టి, ప్రతియుద్ధమందు ధనములను సంపాదించునట్టి అగ్ని పుట్టినది. ఆతరువాత బుట్టినజంతువులు అగ్నిని స్తుతించుచున్నారు.

౮౧౦. యస్య దూతో అసిక్షయే వేషి హవ్యాని వీతయే। దస్మత్కృణో ష్యధ్వరమ్॥

దం॥ ఓ యగ్నీ! ఏ యజమానునింట నీవు దేవతల దూతవయితివో ఎవని హవ్యములను (చరుపురోడాశాది హవిస్సులు) భక్షించుటకై (దేవతలకుఁ) గొనిపోవుచున్నావో ఎవని యధ్వరమును (హింసలేనియాగము) చూడఁదగినవానిగాఁ జేయుచున్నావో.

౮౧౧. తమిత్సు హవ్య మఙ్గిరః సుదేవం సహసోయహో। జనా ఆహుః సుబర్హిషమ్॥

దం॥ బలమువల్ల బుట్టినవాఁడా! (మథించుటచేఁ బుట్టెనని తా॥) అంగిరుఁడా! (=రమ్యకాంతిగలవాఁడు) (మీఁద వివరించిన) ఆయజమానుని శోభన హవిస్సులు కలవానిగాను, శోభనదేవతలు కలవానిగాను, శోభనయజ్ఞము కలవానిఁగాను జనులు చెప్పుచున్నారు.

౮౧౨. ఆచవహాసి తాఁ ఇహ దేవాఁ ఉపప్రశస్తయే! హవ్యాసు శ్చన్ద్ర వీతయే॥

దం॥ మంచి యాహ్లాదమును గలిగించు నగ్నీ! ఆ దేవతల నీయజ్ఞముచోటికి మేము స్తుతించుటకుఁగాఁ దీసికొనిరమ్ము. (వారి) భక్షణముకొఱకు హవ్యములను ఇమ్ము.

౮౧౩. నయో రుపబ్ది రశ్వ్యః శృణ్వే రథస్య కచ్చన। యదగ్నే యాసిదూత్యమ్॥

ద॥ ఓ యగ్నీ! ఏపురుష దూత్యముగవలంబించితివో ఆకాలమందెల్లపుడును నడచుచున్న నీరథముయొక్క గుఱ్ఱములనుండి పుట్టిన వినందగిన (ధ్వని) వినఁబడలేదు. (గమనము శీఘ్రముగుటచే ధ్వని వినబడలేదని తా॥)

౮.౧౨౮. త్వోతో వాజ్యహ్రయోఽభి పూర్వస్మాదపరః। ప్రదాశ్వా అగ్నే అస్థాత్॥

ద॥ ఏపురుషుఁడు దబివఱకుఁ దక్కువవాఁడుగా నెంచఁబడునో అతఁడు ఓ యగ్నీ! యిపుడు నీకు హవిస్సులనిచ్చుచు నీచే సంరక్షింపఁబడి అన్నముకలిగి లజ్జలేనివాఁడై (ఐశ్వర్యములు లేకపోతే సిగ్గుకల్గునని తా॥) ప్రతిష్ఠావంతుఁడగుచున్నాఁడు.

౮.౧౨౯. ఉత ద్యుమత్సువీర్యం బృహదగ్నే వివాససి। దేవేభ్యో దేవ దాశుషే॥

ద॥ మఱియు నో యగ్నిదేవ! దేవతలకొరకు (హవిస్సుల)నిచ్చునట్టివానికి ప్రశస్తవీర్యము గల్గి దీప్తిమంతమగు గొప్పధనమును ఇచ్చుచున్నావు.

—:-o-:—

## సూక్తము. ౭౫.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి)

౮.౧౩౦. జుషస్వ సప్రథస్తమం వచో దేవప్సరస్తమమ్। హవ్యా జుహ్వాన ఆసని॥

ద॥ నీనోటను హవ్యములు హోమముసేయుచు నో యగ్నీ! బహువిస్తరమయిన వాక్కులను, దేవతలను ప్రీతినొందించునట్టి దానిని సేవింపుము.

౮.౧౩౧. అథా తే అఙ్గిరస్తమాగ్నే వేధస్తమ ప్రియమ్। వోచేమ బ్రహ్మ సానసి॥

ద॥ మిక్కిలి ప్రకాశించువాఁడా! అగ్నీ! మేధాశాలీ! తరువాత నీ కొరకుఁ బొందఁదగిన ప్రీతికరమయిన స్తోత్రమును మేము పఠింతుము.

౮.౧౩౨. కస్తే జామిర్జనానామగ్నే కో దాశ్వధ్వరః। కో హ కస్మిన్నసి శ్రితః॥

ద॥ ఓ యగ్నీ! జనులలో నెవరు నీబంధువు? నీకెవఁడు యాగమునిచ్చును? నీవెవఁడవు? ఏచోటు నాశ్రయించియుంటివి? (అనఁగా నీ సమానుఁడులేఁడు. నీకు దగిన యజ్ఞము చేయలేదు. నీవెచటనుందువో యెఱుఁగరని తా॥)

౮౧౯. త్వం జామి ర్జనానా మగ్నేమిత్రో అసిప్రియః । సఖా సఖిభ్య ఈడ్యః॥

దం॥ ఓ యగ్నీ! నీవు జనులకు బంధుఁడవు, ప్రియమిత్రుఁడవు, స్తుతింపదగిన వాఁడవు. సఖులయిన (ఋత్విజులకు) సఖుడవగుచున్నావు (ఋత్విజుల పేర్లును, అగ్ని పేర్లులు సమానములు కనుక మిత్రులని తా॥)

౮౨౦. యజానో మిత్రావరుణా యజా దేవా ఋతం బృహత్ । అగ్నే యక్షిస్వందమమ్॥

దం॥ ఓ యగ్నీ! మిత్రావరుణులను మా నిమిత్తము యజింపుము. అట్లే దేవతలను యజింపుము. యజ్ఞమునొనరింపుము. గొప్పదగు నీయాగగృహమందు ఉండుము.

---

## సూక్తము. ౭౬.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని, ఛందస్సు - త్రిష్టుప్.)

౮౨౧. కాత ఉపేతి ర్మనసో వరాయ భువదగ్నే శంతమా కామనీషా ।
కోవా యజ్ఞైః పరిదక్షంత ఆప కేన వా తే మనసాదాశేమ॥

దం॥ ఓ యగ్నీ! నీమనస్సు మాయందునిలుపుకొనుటకు మాకేమి యుపాయము కలదు? నీమనస్సును సంతోషపెట్టు స్తుతిమంత్రమేది? యజ్ఞములతో నెవడు వృద్ధి పొందదగును? ఏ బుద్ధితో నీకు హవిస్సుల నిత్తుము? (ఇవేవియు మాకు శక్యములు కావని తా॥)

౮౨౨. ఏహ్యగ్న ఇహహోతా నిషీ దాదబ్ధః సుపుర ఏతా భవానః ।
అవతాం త్వారోదసీ విశ్వమిన్వే యజామహే సౌమనసాయ దేవాన్॥

దం॥ ఓ యగ్నీ! రమ్ము. ఈయజ్ఞమందు దేవతలంబిలుచువాఁడవై కూర్చుండుము. మాముందు నడుచువాఁడవుకమ్ము. నీవు (రాక్షసులకు) లొంగవు కనుక అట్టినిన్ను సర్వవ్యాపులగు ద్యావాపృథువులు రక్షించునుగాక. తరువాత (మామీఁద) కరుణించి యభిప్రాయము కలుగుటకు దేవతలను బూజింపుము.

## సూక్తము, ౭౭.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గౌతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - త్రిష్టుప్.)

౧౨౬. కథా దాశేమాగ్నయే కాస్మై దేవజుష్టోచ్యతే భామినేగీః ।
యో మర్త్యేష్వమృత ఋతావా హోతా యజిష్ఠ ఇత్కృణోతి దేవాన్ ॥

దం॥ ఈయగ్నికి (హవిస్సు) లెట్లిత్తుము? తేజోవంతుఁడయినయగ్నికొఱకు దేవతలు సేవింపఁదగిన మంత్రమెట్టిది పఠింపవలెనో? మరణరహితుఁడును, సత్యవంతుఁడును, దేవదూతయు, యజ్ఞకర్తయు నగు నగ్నియే మరణధర్మముగల మాయందుండి దేవతలకు హవిస్సులనిచ్చును.

౧౨౭. యో అధ్వరేషు శంతమ ఋతావా హోతా తమూ నమోభిరాకృణుధ్వమ్ ।
అగ్నిర్యద్వేర్మర్తాయ దేవాన్త్సచా బోధాతి మనసా యజాతి ॥

దం॥ ఏ యగ్ని యజ్ఞములందు మిక్కిలి సుఖముగలిగించునో యథార్థము నెఱిఁగినవాఁడు, దేవతల నాహ్వానించువాఁడు నెవ్వఁడగుచున్నాఁడో యా యగ్నినే (ఓ ఋత్విగ్యజమానులారా) మీరు స్తోత్రములచేత నభిముఖునిగాఁ జేయుడు. ఈ యగ్ని యజమానునినిమిత్తము దేవతలవద్దకుఁబోవునపుడు అతఁడే దేవతలను బోధించును.

౧౨౮. సహి క్రతుః సమర్యః ససాధుర్మిత్రో న భూదద్భుతస్యరథీః ।
తం మేధేషు ప్రథమం దేవయన్తీర్విశ ఉపబ్రువతే దస్మమారీః ॥

దం॥ ఆయగ్నియే కర్మలుచేయువాఁడు, అతఁడే (ప్రపంచము) నాశమొందించువాఁడు, అతఁడే పుట్టించువాఁడు, లేనిధనమును, మిత్రుఁడు దెచ్చియిచ్చునట్లు తెచ్చియిచ్చును. యాగములందు దేవతలను గోరుచున్న ప్రజలు దర్శనీయుఁడయిన యాయగ్నిని సేవించుచు నతనినే ప్రధానునిగాఁ జెప్పుదురు.

౧౨౯. సనో నృణాం నృతమో రిశాదా అగ్నిర్గిరోవసా వేతుధీతిమ్ ।
తనా చ యే మఘవానః శవిష్ఠా వాజప్రసూతా ఇషయన్త మన్మ ॥

దం॥ యజ్ఞమునడుపువారిలో నాయకశ్రేష్ఠుఁడును, శత్రువుఁ బెండించువాఁడును అగు నాయగ్ని మా స్తవములను, (హవీరూపమగు) నన్నములతోఁగూడిన కర్మలను, గోరుఁగాక. ఏయజమానులు విస్తారమగు ధనముతో ధనికులగుచున్నారో, బలవంతులు నగుచున్నారో, హవిస్సులనిచ్చువారో, వారు స్తుతులఁజేయించుచున్నారు. (ఋత్విజులచేతనని తా॥)

ఋ౩౦. ఏవాగ్నిర్గోతమేభిర్ ఋతావా విప్రేభిరస్తోష్ట జాతవేదాః ।

సఏషు ద్యుమ్నం పీపయత్సవాజం సపుష్టిం యాతి జోషమాచికిత్వాన్ ॥

దం॥ యజ్ఞముగల జాతవేదుఁడు (=అగ్ని, ధనము, లేక, కలవాఁడని వ్యుత్పత్తి) మేధావంతులయిన గోతమ ఋషులచే స్తుతింపఁబడెను. ఆయగ్ని యీ గోతమర్షుల వద్దనున్న చక్కని (సోమమును) పానముచేసెను. అన్నములను (=హవిస్సులను) భక్షించెను. మాసేవనెఱిఁగి యీ యగ్ని పుష్టినొందెను.

---

సూక్తము. ౭౮.

(ఋషి - రహూగణపుత్రుఁడగు గోతముఁడు; దేవత - అగ్ని; ఛందస్సు - గాయత్రి.)

ఋ౩౧. అభిత్వా గోతమాగిరా జాతవేదో విచర్షణే । ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

దం॥ ఓ యగ్నీ ! సర్వము నెఱిఁగినవాఁడా ! గోతములు స్తుతిరూపమైన వాక్కులతో నిన్ను అభిముఖమగునట్లు స్తుతించిరి. మేముగూడ నీగుణములఁ బ్రకటించు మంత్రములతో స్తుతింతుము.

ఋ౩౨. తముత్వాగోతమోగిరా రాయస్కామోదువస్యతి । ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

దం॥ ధనకాముఁడైన గోతముఁడు స్తుతివాక్కులతో సేవించిన యగ్నినే స్తుతి మంత్రములతో మేము స్తుతింతుము.

ఋ౩౩. తముత్వా వాజసాతమ మఙ్గిరస్వద్ధవామహే । ద్యుమ్నైరభి ప్రణోనుమః॥

దం॥ అగ్నీ! అన్నములు విశేషముగా నిచ్చు నిన్ను అంగిరస్సువలె స్తుతమంత్రములతోఁ బిలుతుము. స్తుతింతుము గూడను.

౭౩౭. తము త్వా వృత్రహన్తమం యో దస్యూ రవధూనుషే । ద్యుమ్నై రభి ప్రణోనుమః॥

దం॥ ఓ యగ్నీ! దస్యులను (=నాశకులని వ్యా॥) నీవు తూలఁగొట్టుచున్నావు. వృత్రుహంతవగు నిన్ను స్తుతిమంత్రములతో నుతింతుము. (వృత్రశబ్దమునకిచట పాపమని సాయనార్థము.)

౭౩౮. అవోచామ రహూగణా అగ్నయే మధుమద్వచః । ద్యుమ్నై రభి ప్రణోనుమః॥

దం॥ రహూగణుని కొమారులమగు మేము (=గౌతములు) అగ్ని దేవునికొఱకు మధురమైన స్తుతులను బఠించితిమి. స్తుతిమంత్రములతో నగ్నిని మాటిమాటికి స్తుతించుచున్నాము.

---

## సూక్తము. ౭౯.

(ఋషి — రహూగణ పుత్రుఁడగు గౌతముఁడు; దేవత - ౧, ౨, ౩, వైద్యుతాగ్ని; ౪, ౫ కేవలాగ్ని; ఛందస్సు ౧-౩. త్రిష్టుప్, ౪, ౫, ౬ ఉష్ణిక్, తక్కినవి గాయత్రి.)

౭౩౯. హిరణ్యకేశో రజసో విసారే ऽహిర్ధునిర్వాత ఇవ ధ్రజీమాన్ ।
శుచిభ్రాజా ఉషసో నవేదా యశస్వతీ రపస్యువో న సత్యాః॥

దం॥ బంగారువంటి (జ్వాలారూప) కేశములుగలవాఁడు, సమీపించితే బాధించువాఁడు, మేఘములను గదలించువాఁడు, వాయువువలె శీఘ్రగమనముగలవాఁడు, నగు నగ్నిని (అనఁగా మెఱుపు) ఉదకములను వర్షించుటకు తెలియకున్న మెఱయుచు నన్నములతో సఫలకర్మలు సేయఁగోరిన ప్రజలెఱింగినట్లు ఉషస్సులెఱుఁగవు.

౭౪౦. ఆ తే సుపర్ణా అమినన్తఁ ఏవైః కృష్ణో నోనావ వృషభో యదీదమ్ ।
శివాభి ర్న స్మయమానాభి రాగా త్పతన్తి మిహః స్తనయ న్త్యభ్రా॥

దం॥ ఓ యగ్నీ! మంచిపతనముగల కిరణములు గమనస్వభావముగల మరుత్తులతోఁగూడ (మేఘమును) గొట్టును. గొట్టఁగానే కృష్ణమేఘము ధ్వనించును. ఈ లాఁటిపని జరిగినపుడు చిఱునవ్వు నవ్వు కాంతులవలె మఱియు మెఱుపులతోఁగూడ వర్షమేఘము బయలుదేరును. ఉదకములు కురియును. నీటిమేఘము ధ్వనించును.

౮౩౮. యదీమృతస్య పయసా పియానో నయన్నృతస్య పథిభీ రజిష్ఠైః ।

అర్యమా మిత్రో వరుణః పరిజ్మా త్వచం పృఞ్చన్త్యుపరస్య యోనౌ॥

దం॥ ఎప్పుడు ఈయగ్ని ఉదకముయొక్క పాలవంటి సారమగు రసముతో (జగత్తును) తృప్తిపఱచునో, ఎప్పుడు [illegible] వర్షముకురిపించునో యపుడు అర్యముఁడు మిత్రుఁడు, వరుణుఁడును, మరుత్తులును, మేఘముయొక్క ఉత్పత్తి స్థానమందున చర్మమును జీల్చుదురు.

౮౩౯. అగ్నే వాజస్య గోమత ఈశానః సహసో యహో ।

అస్మే ధేహి జాతవేదో మహి శ్రవః॥

దం॥ బలముయొక్క పుత్రుఁడవయిన యోయగ్నీ! బహుగోవులతోఁగూడిన యన్నమునకు నీ వీశ్వరుఁడవయియున్నావు. కనుక మాయందు ఓ జాతవేదా! (=పుట్టిన సర్వము తెలిసిన) విశేషధనమును గలుగఁజేయుమా.

౮౪౦. స ఇధానో వసుష్కవి రగ్ని రీళేన్యో గిరా । రేవ దస్మభ్యం పుర్వణీక దీదిహి॥

దం॥ ఆ యగ్ని ప్రకాశించువాఁడును, నివాసమునకు హేతువును (అగ్ని లేకుండఁగా కాపురమే చేయలేరని తా॥) బుద్ధిమంతుఁడునుఅయి స్తుతిమంత్రముతోఁగొనియాడఁదగి యున్నాఁడు. జ్వాలారూపమగు బహుముఖములవాఁడా! ధనముతోఁగూడిన యన్నము మాకుఁగలుగునట్లు ప్రకాశించుము.

౮౪౧. క్షపో రాజన్నుత త్మనాగ్నే వస్తో రుతోషసః । సతిగ్మ జమ్భ రక్షసో దహ ప్రతి॥

దం॥ అన్నిదినములందు నన్నిరాత్రులందు నోయగ్నీ! రాక్షసులను స్వయముగా సంహరింపుము. తీక్ష్ణముఖముగలవాఁడా! ఒకరినైన వదలకుండ రక్షస్సులను దహింపుము.

౭౪౨. అవానోఅగ్న ఊతిభి ర్గాయత్రస్య ప్రభర్మణి । విశ్వాసుధీషు వంద్య॥

దం॥ సర్వకర్మలందును, స్తుతింపఁదగినయగ్నీ! గాయత్రీఛందముగల సామమంత్ర పాఠము గలుగునపుడు నీరక్షలతో మమ్ముఁ గాపాడుము.

౭౪౩. ఆనో అగ్నే రయింభర సత్రాసాహం వరేణ్యమ్ । విశ్వాసు పృత్సు దుష్టరమ్॥

దం॥ ఓ యగ్నీ! ఒక్కమాఱుగా దారిద్ర్యమునణఁచునట్టి, అందఱును కోరందగినట్టి, సర్వయుద్ధములందును శత్రువులకు లొంగని ధనమునిమ్ము.

౭౪౪. ఆనోఅగ్నే సుచేతునా రయిం విశ్వాయు పోషసమ్ । మార్డీకం ధేహి జీవసే॥

దా॥ ఓ యగ్నీ! సుఖమును కలిగించునట్టి, బ్రతికియున్నన్నాళ్లు దేహములను పోషించునట్టి, మంచిజ్ఞానముతోఁగూడిన ధనమును మాజీవనముకొఱకు నిమ్ము.

౭౪౫. ప్రపూతా స్తిగ్మశోచిషే వాచో గోతమాగ్నయే । భరస్వ సుమ్న యుర్గిరః॥

దం॥ ఓ గోతమర్షీ! ధనముకావలెనని కోరిన నీవు తీక్ష్ణజ్వాలలుకల అగ్ని విషయమై పవిత్రవర్ణనలుకల స్తుతులను సమకూర్పుము.

౭౪౬. యోనోఅగ్నే భిదాసత్యన్తి దూరే పదీష్టసః । అస్మాక మిద్వృధే భవ॥

ఙం॥ ఓ గోతమర్షీ! మమ్ము సమీపమందును; దూరమందును ఉండి ఏశత్రువు బాధించునో ఆతఁడు నశించుగాక!

౭౪౭. సహస్రాక్షో విచర్షణి రగ్నీ రక్షాంసి సేధతి । హోతా గృణీత ఉక్థ్యః॥

దం॥ అసంఖ్యాక జ్వాలలనెడు కన్నులు గలవాఁడై సర్వమునుఁజూచునట్టి యే యగ్ని రక్షస్సులను (యాగస్థలమునందుండి తోలివేయునో) ఆయగ్ని సామమంత్రములతో స్తుతింపబడినవాఁడై దేవతలంబిలుచు వాఁడగుచు (వారిని) స్తుతించును.

—:-౦-:—

## సూక్తము ౮౦.

(ఋషి - గౌతముఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - పఙ్క్తి.)

౮౪౮. ఇత్థాహిసోమ ఇన్మదే బ్రహ్మా చకారవర్ధనమ్ ।

శవిష్ఠవజ్రి న్నోజసా పృథివ్యా నిఃశశా అహిమర్చన్నను స్వరాజ్యమ్॥

వ॥ మిక్కిలి బలవంతుఁడవగు వజ్రహస్తుఁడా! (ఇంద్రా) ఈవిధముగా మదముఁ గలిగించు సోమమును (నీవు త్రాగగా) నీకు వృద్ధిని గలిగించు స్తుతిని బ్రహ్మయును ఋత్విజుఁడును సేయుచున్నారు. కనుకనే నీరాజ్యమును బ్రకటించుకొనుచు బలము చేత భూమినుండి వృత్రునిఁ బూర్తిగా శాసించితివి.

౮౪౯. స త్వా మదద్వృషా మదఃసోమః శ్యేనాభృతః సుతః ।

యేనా వృత్రం నిరద్భ్యో జఘన్థ వజ్రి న్నోజసార్చన్నను స్వరాజ్యమ్॥

వ॥ వజ్రముధరించినవాఁడా! ఏసోమము పానము చేసినందున గలిగిన బలముతో వృత్రుని సంహరించితివో ఆ మదముగలిగించునట్టి, చల్లఁదనమునిచ్చునట్టి, డేగ రూపముం బొందిన గాయత్రిచేత ద్యులోకమునుండి తేఁబడి యభిషవించిన; సోమము నిన్ను మదింపఁజేసెను.

౮౫౦. ప్రేహ్యభీహి ధృష్ణుహి న తే వజ్రో నియంసతే ।

ఇన్ద్ర నృమ్ణంహి తే శవోహనో వృత్రంజయా అపోఽర్చన్నను స్వరాజ్యమ్॥

వ॥ ఇంద్రా! హెచ్చుగాగమనింపుము. (శత్రుల) కభిముఖముకమ్ము. వారిందిర స్కరింపుము. నీవజ్రము శత్రువులకసాధ్యము. నీబలము పురుషులను లొంగఁదీయును. కనుక మేఘమును గొట్టుము. ఉదకముల గెల్చుకొమ్ము. నీవే సర్వాధికారివని ప్రకటన యగునట్లుచేసి స్వరాజ్యము సాగింపుము.

౮౫౧. నిరిన్ద్ర భూమ్యా అధివృత్రం జఘన్థ నిర్దివః ।

సృజా మరుత్వతీ రవ జీవధన్యా ఇమా అపోఽర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రుఁడా! భూమిమీఁద మేఘమును నిశ్శేషముగాఁ గొట్టితివి. ద్యులోకము నుండి వెడలఁగొట్టితివి. ప్రాణులందు ప్తిపజుచునట్టి, గాలితోఁగూడినట్టి, యీ వర్షోదకమును గ్రిందికిఁ బడవేయుము. నీదే స్వారాజ్యమను నట్లు ఇత్యాది పూర్వవతు.

౮౫౨. ఇన్ద్రో వృత్రస్య దోధతః సానుం వజ్రేణ హీళితః ।

అభిక్రమ్యావ జిఘ్నతే ఽపః సర్మాయ చోదయన్నర్చన్ను స్వరాజ్యమ్॥

దం॥ కోపముగల యింద్రుఁడెదురునడిచి గడగడ వడఁకించుచున్న వృత్రుని దవుడను (అనఁగా మేఘముమీఁదిభాగమును) ఉదకములం బ్రవహించుటకై; కొట్టెను. తనదే స్వారాజ్యమిత్యాదిపూర్వవతు.

౮౫౩. అధిసానౌ నిజిఘ్నతే వజ్రేణ శతపర్వణా ।

మన్దాన ఇన్ద్రో అన్ధసః సఖిభ్యో గాతుమిచ్ఛ త్యర్చన్ను స్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రుఁడు నూరంచులవజ్రముతో (వృత్రుని) దవుడలమీఁద గట్టిగాఁ గొట్టెను ఆ యింద్రుఁడు స్తుతింపఁబడి తనమిత్రులకు (అనఁగా ఋత్విగ్యజమానులకని తా॥) అన్నముగలుగు నుపాయమును గోరుచున్నాఁడు. తనదే స్వారాజ్యమను కొన్నట్లు ఇత్యాదిపూర్వవతు.

౮౫౪. ఇన్ద్ర తుభ్య మిదద్రివో నుత్తం వజ్రి న్వీర్యమ్ ।

యద్ధత్యం మాయినమ్మృగం తము త్వం మాయయావధీరర్చన్ను స్వరాజ్యమ్॥

దం॥ ఓ మేఘవాహనా! వజ్రధారీ! ఇంద్ర! నీసామర్థ్యము శత్రువులకులొంగదు. కనుకనే ఆ సామర్థ్యముతో మాయావియయిన, మృగరూపము బొందిన ఆ వృత్రుని నీవుఁగూడ మాయతోనే వధించితివి. (మాయ=జయోపాయము) నీదే స్వారాజ్యమను కొనునట్లు ఇత్యాదియథా పూర్వము.

౮౫౫. వి తే వజ్రాసో అస్థిర న్నవతిం నావ్యా౩ అను ।

మహత్త ఇన్ద్ర వీర్యం బాహ్వోస్తే బలం హితమర్చన్ను స్వరాజ్యమ్॥

దం॥ నీవద్దనుండి బయలు వెడలిన వజ్రాయుధములు; ఓడలతో దాటఁదగిన తొంబది తొమ్మిది నదులను గుఱిచూచి (వృత్రుఁడు వాటిని బయటకి రాకుండఁ బట్టుకొని యున్నాఁడు అని తెలిసి) వివిధరూపములం చెదరి (సంహరించినవి.) ఇంద్రా! నీ వీర్యము గొప్పది. నీ బాహువులందు బలము యుంచఁబడినది. నీదే స్వరాజ్యమనుకొను నిత్యాది పూర్వవతు.

౭౫౬. సహస్రం సాకమర్చత పరిష్టోభత వింశతిః।

శతైనమన్వనోనవు రిన్ద్రాయ బ్రహ్మోద్యత మర్చన్ననుస్వరాజ్యమ్॥

దం॥ వేయిమంది కలిసి యింద్రుని బూజించిరి. ఇరువదిమంది (పదారుగురు ఋత్విజులు, యజమాని, పత్ని, సదస్య, శమితలు) స్తుతించిరి. నూరుమంది (ఋషులు) యింద్రుని మాటిమాటికి స్తుతించిరి. ఈ యింద్రునికొఱకు (హవిస్సురూపమున) నిచ్చుటకు అన్నము మీఁదికెత్తి పెట్టుకొనంబడెను. తనదే స్వరాజ్య మిత్యాది పూర్వవతు.

౭౫౭. ఇన్ద్రో వృత్రస్య తవిషీం నిరహన్ సహసా సహః।

మహత్తదస్య పౌంస్యం వృత్రంజఘన్వాఁ అసృజ దర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రుఁడు వృత్రుని బలమును (తన) బలముతోఁ గొట్టివేసెను. ఆయుధము తో నాయుధమును గొట్టివేసెను. ఆ యింద్రుని బలము గొప్పది, కనుకనే వృత్రుని గొట్టెను. ఉదకములఁ గార్చెను. తనదే స్వరాజ్యమనునట్లు ఇత్యాదిపూర్వవతు.

౭౫౮. ఇమేచిత్తవమన్యవే వేపేతే భియసా మహీ।

యదిన్ద్ర వజ్రిన్నోజసా వృత్రం మరుత్వాఁ అవధీ రర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఓ యింద్రా! మరుత్తులతోఁ గూడి నీవు బలముచేత వృత్రుని నెప్పుడు చంపితివో అపుడు గొప్పవియగు నీద్యులోక భూలోకములు నీ కోపమునకు భయమునంది వణఁకు చుండెను. నీదే స్వరాజ్యమనుకొనునట్లు ఇత్యాది పూర్వవతు.

౮౫౯. నవేపసా నతన్యతేన్ద్రం వృత్రో విభీభయత్ ।
అభ్యేనం వజ్ర ఆయసః సహస్రభృష్టి రాయతా ర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ వృత్రుఁడు తనకదలించుటచేతను, తనగర్జనధ్వనిచేతను, వృత్రుఁడింద్రుని భయపెట్ట లేక పోయెను. ఇనుముతో చేసిన వేయంచుల వజ్రాయుధము వృత్రునింగొట్టెను. తనదే స్వరాజ్య మిత్యాదిపూర్వవతు.

౮౬౦. యద్వృత్రం తవచాశనిం వజ్రేణ సమయోధయః ।
అహిమిన్ద్ర జిఘాంసతో దివి తేబద్బదే శవోర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఇంద్రా ! వృత్రుని వజ్రాయుధమును నీవజ్రాయుధముతో నెపుడుకొట్టితివో యపుడు వృత్రునిఁజంపఁదలఁచిన నీబలము ద్యులోకమును వ్యాపించెను. నీదే స్వరాజ్యమన్నట్లు ఇత్యాదిపూర్వవతు.

౮౬౧. అభిష్టనే తే అద్రివో యత్థ్సాజగచ్చ రేజతే ।
త్వష్టాచిత్తవమన్యవ ఇన్ద్ర వేవిజ్యతే భియార్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ ఓ వజ్రధారీ ! నీవు సింహనాదము చేయఁగానే స్థిరచరములన్నియుఁ గంపించెను. త్వష్టకూడ. (=వజ్రాయుధము చేసినపనివాఁడు) నీకోపమునకు భయపడి కంపించెను. నీదే స్వరాజ్యమనునట్లు ఇత్యాది పూర్వవతు.

౮౬౨. నహినుయాదధీమ సీన్ద్రం కోవీర్యాపరః ।
తస్మిన్నృమ్ణ ముతక్రతుం దేవా ఓజాంసి సందధు రర్చన్నను స్వరాజ్యమ్॥

దం॥ సర్వత్రా వ్యాపించియున్న యింద్రుని మేము తెలియ లేకున్నాము. వీర్యవంతుఁడై యెవరికిని దెలియనిచోట నున్న యింద్రుని మనుష్యుఁడెవఁడు గుర్తెరుఁగఁ గలఁడు ? (ఏమంటే=) ఆ యింద్రునందు దేవతలు ధనమును, కర్మను, మఱియుం బలమును, నిల్పియున్నారు. తనదే స్వరాజ్య మిత్యాది పూర్వవతు.

౮౬౩. యామథర్వా మనుష్పితా దధ్యఙ్ ధియమత్నత।
తస్మిన్ బ్రహ్మాణి పూర్వథేన్ద్ర ఉక్థా సమగ్మతార్చన్ననుస్వరాజ్యమ్॥

వం॥ అథర్వర్షియుః బృహలంధటి తండ్రియగు మనువును దధ్యఙ్ఞుషియు (=ఇతఁడథర్వపుత్రుఁడు) ఏకర్మ నొనర్చిరో ఆకర్మయందు (హవిస్సురూపమయిన) అన్నములు ఉక్థలు (సామమంత్రాలు) పూర్వలయజ్ఞములందువలె ఇంద్రునికే చెందియున్నవి.

## షష్ఠమాధ్యాయము.

—:-o-:—

### సూక్తము ౮౧.

(ఋషి - రహూగణపుత్రుండగు గౌతముండు. దేవత - ఇంద్రుండు. ఛందస్సు - పఙ్క్తి.)

౮౬౪. ఓమ్ ఇన్ద్రో మదాయ వావృధే శవసే వృత్రహా నృభిః ।

తమిన్మహత్స్వాజిషూతేమర్భే హవామహే స వాజేషు ప్ర నోఽవిషత్ ॥

దం॥ వృత్రుని జంపిన యింద్రుండు ఉత్సాహముకొఱకు బలముకొఱకు ఋత్విజుల చేత (స్తుతులతో) హెచ్చరింపఁబడెను. గొప్పయుద్ధములందా యింద్రునే పిలుచుచున్నాము. (మఱియు) ఇతనిని జిన్నయుద్ధములందును, గొప్పయుద్ధములందును, బిలుచుచున్నాము. ఆతఁడు యుద్ధములందు మమ్ము రక్షించునుగాక.

౮౬౫. అసి హి వీర సేన్యోఽసి భూరి పరాదదిః ।

అసి దభ్రస్య చిద్వృధో యజమానాయ శిక్షసి సున్వతే భూరి తే వసు ॥

దం॥ వీరుఁడవగు నోయింద్రా! సేనయంతటి బలవంతుడవు. విస్తారమైన సధనమును శత్రువులం బరాభవించి తెత్తువు. నిన్ను స్తుతించినవాఁడల్పుఁడయ్యును వానిని వృద్ధినొందింతువు. యాగము చేసినవానికిని, సోమమునభిషవించినవానికిని, విస్తారముగా ధనమిత్తువు.

౮౬౬. యదుదీరత ఆజయో ధృష్ణవే ధీయతే ధనా ।

యుక్ష్వా మదచ్యుతా హరీ కం హనః కం వసౌ దధోఽస్మాఁ ఇన్ద్ర వసౌ దధః ॥

దం॥ యుద్ధములు తటస్థించినపుడు జయించినవానికి ధనములు లభించును. శత్రువుల మదమణఁగించు నీరెండు గుఱ్ఱములును ఇంద్రా! పూన్చుము, ఒకని జంపుదువు, ఒకనికి ధనమిత్తువు, మాకును ధనమిమ్ము (అని గౌతముండు సృంజయదేశ రాజు పురోహితుండై యీ యింద్ర సూక్తము జపించెను.)

౯౬౭. క్రత్వా మహాఁ అనుష్వధం భీమ ఆ వావృధే శవః ।
శ్రియ ఋష్వ ఉపాకయో ర్నిశిప్రీ హరివాన్దధే హస్తయో ర్వజ్ర మాయసమ్॥

దం॥ కర్మచేత గొప్పవాఁడు, భయంకరుఁడునగు నింద్రుఁడు (సోమరూప) అన్నము-పానముచేసి బలమును వృద్ధిపఱచుకొనెను. గొప్పదవుడలు కలవాఁడును దర్శనీయుఁడునై యింద్రుఁడు హరియనెడు గుఱ్ఱములతోఁగూడి యినుముతోఁ జేయఁబడినవజ్రమును చేతులందు సంపదనిమిత్తము ధరించెను.

౯౬౮. ఆ పప్రౌ పార్థివం రజో బద్బధే రోచనా దివి ।
న త్వావాఁ ఇన్ద్ర కశ్చన న జాతో న జనిష్యతేఽతి విశ్వం వవక్షిథ॥

దం॥ ఇంద్రుఁడు పృథివిలోని వస్తువులను అంతరిక్షమును ఆవరించియుండెను. ద్యులోకమందునక్షత్రాదులనిల్పెను. (మేఘములదారి అంతరిక్షము) ఇంద్రా! నీవంటివాఁడిదివఱకు నెవ్వఁడు పుట్టలేదు, పుట్టంబోఁడు. నీవు జగత్తునంతటిని బాగుగ వహింపఁ గలుగుదువు.

౯౬౯. యో అర్యో మర్తభోజనం పరాదదాతి దాశుషే ।
ఇన్ద్రో అస్మభ్యం శిక్షతు వి భజా భూరి తే వసు భక్షీయ తవ రాధసః॥

దం॥ పాలకుఁడైన యింద్రుఁడు మనుష్యులుతిను సస్యమును హవిస్సులనిచ్చు (యజమానునకు) నిచ్చును. మాకిచ్చుటకు ధనము నింద్రా! వంతులు వేయుము. (ఏమంటే) నీకు విస్తారము ధనమున్నది. నీధనములోని భాగమునే ననుభవింతుము.

౯౭౦. మదేమదే హి నో దదిర్యూథా గవామృజుక్రతుః ।
సంగృభాయ పురూ శతోభయాహస్త్యా వసు శిశీహి రాయ ఆ భర॥

దం॥ సోమపానమదము గల్గినపుడెల్లఁ జక్కనిపనులుచేయు నింద్రుఁడు మాకు ఆలమందల నిచ్చువాఁడగును. ఇంద్రా! నీవు విస్తారమైన నూర్లకొలంది ధనములను రెండు చేతులతోను (మాకిచ్చుటకై) ధరింపుము. మమ్ములను జరుకుగలవారినిగాఁ జేయుము. ధనములనిమ్ము.

౮౭౧. మాదయస్వ సుతే సచా శవసే శూర రాధసే ।
విద్మాహి త్వా పురూవసు ముపకామా న్త్ససృజ్మహే థానో వితాభవ॥

దం॥ ఓ శూర! సోమమభిషవించఁగానే (మా) ధనముకొఱకు, బలముకొఱకును, నేస్తుఁడా! తృప్తిగాఁ ద్రావుము. నీవెక్కుడుధనము కలవాఁడవని మేమెఱుంగుదుము మాకోరికలను నీతోఁగలియఁబోతుము (సంప్రదించుట) మమ్ము రక్షించువాఁడవు కమ్ము.

౮౭౨. ఏతేత ఇన్ద్ర జన్తవో విశ్వం పుష్యన్తి వార్యమ్ ।
అన్తర్హి ఖ్యో జనానా మర్యో వేదో అదాశుషాం తేషాం నో వేద ఆభర॥

దం॥ ఓ యింద్రా! నీవారైన యీ యజమానులు కోరఁదగిన హవిస్సునంతయు వృద్ధిచేయుచున్నారు. హవిస్సుల నివ్వనివారిదగ్గఱనున్న ధనమును స్వామివైన నీవు చూచుచున్నావుకదా! ఆజనుల ధనమును దెచ్చి మాకిమ్ము.

---

## సూక్తము. ౮౨.

(ఋషి - గౌతముఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు ౧, ౫, పఙ్క్తిః; ౬, జగతీ.)

౮౭౩. ఉపో షు శృణుహీ గిరో మఘవ న్మాతథా ఇవ ।
యదానః సూనృతావతః కర ఆదర్థయాస ఇద్యోజాన్విన్ద్ర తే హరీ॥

దం॥ ధనవంతుఁడవగు నింద్రా! మాస్తుతులను సమీపమునకువచ్చి వినుము ఇదివఱకు మాయెడల నీవు ప్రవర్తించినదానికి వ్యతిరేకముగా నుండకుము. మమ్ము నెపుడు సత్యవచనులనుగాఁ జేయుదువో ఆవెంటనే యాచింపఁజేసుకొందువు; కనుక నోయింద్రా! నీరెండు గుఱ్ఱములును (రథమునకు) బూన్చుము.

౮౭౪. అక్షన్నమీమదన్త హ్యవప్రియా అధూషత ।
అస్తోషత స్వభానవో విప్రా నవిష్ఠయా మతీ యోజా న్విన్ద్ర తే హరీ॥

దం॥ ఇంద్రా! (నీవిచ్చిన) యన్నములను (యజమానులు) భక్షించిరి. తృప్తిని జెందిరి. శరీరములు కదల్చుచుకొనిరి. స్వాధీనదీప్తులుగల విప్రులు అత్యంతనూతన మగు స్తుతులతో స్తుతించిరి. కనుక నింద్రా! నీ రెండు గుఱ్ఱములును రథమునకుఁ బూన్చుము.

౮౭౫. సుసంవృశం త్వావయం మఘవ న్వందిషీమహి ।

ప్రనూనం పూర్ణవంధురః స్తుతో యాహి వశాఁ అను యోజా న్విన్ద్ర తే హరీ॥

దం॥ ఇంద్రా! అందమును బాగుగఁ జూచునట్టి నిన్ను మేముస్తుతింతుముగాక. నిండురథముతో నుండినవాఁడవై యీకోరుచున్న వారిగూర్చి తప్పక బయలు దేరుము. రెండుగుఱ్ఱాలు ఇత్యాదిపూర్వవతు.

౮౭౬. సఘాతం వృషణం రథ మధితిష్ఠాతి గోవిదమ్ ।

యః పాత్రం హారియోజనం పూర్ణమింద్రచికేతతి యోజా న్విన్ద్ర తే హరీ॥

దం॥ ఏయింద్రుఁడు హారియోజనమను పేరుగల్గి సోమరసముతో నిండిన పాత్రముగా నున్న రథము జ్ఞాపకముంచుకొనుచున్నాఁడో ఆయింద్రుఁడా! వర్షమును గురియునట్టి గోవులనిచ్చునట్టి ఆరథము నెక్కుము. రెండు గుఱ్ఱములు నీరథమునకుఁ బూన్చుము.

౮౭౭. యుక్తస్తే అస్తు దక్షిణ ఉతసవ్యః శతక్రతో ।

తేనజాయా ముపప్రియాం మన్దానో యాహ్యన్ధసో యోజా న్విన్ద్ర తే హరీ॥

దం॥ ఓ శతక్రతూ! (=అనేక కార్యములు సేయువాఁడా!) నీరథమందుఁ గుడి ప్రక్కననున్నదియు, నెడమప్రక్కనన్నదియు, గుఱ్ఱములు పూన్పఁబడుఁగాక. ఆ రథముతో (వచ్చి) సోమరూపాన్నమును బానము సేసి మదించినవాఁడవై ప్రియురాలగు భార్యను సమీపించుము. నీరెండు గుఱ్ఱము లిత్యాదిపూర్వవతు.

౮౭౮. యునజ్మి తే బ్రహ్మణా కేశినా హరీ ఉపప్రయాహి దధిషే గభస్త్యోః ।

ఉత్వాసుతా సోరభసా అమన్దిషుః పూషణ్వాన్వజ్రి న్త్సము పత్న్యామదః

వ॥ ఓ యింద్రా! బొజ్జగల నీరెండు గుఱ్ఱములు స్తుతిమంత్రములతోఁ బూన్తును. దానితో నీ యుఁడికిఁ బొమ్ము. చేతిలోఁ దెముఁబట్టుకొనుము. అభిషవించిన సోమములు వేగముగల నిన్ను ఎక్కువమత్తుకలవానిఁ జేసినవి. వజ్రీ! పుష్టిగల్గి నీభార్యతోఁ దృప్తిసందుము.

— -o-:—

## సూ క్త ము, ౮౩.

(ఋషి - గౌతముఁడు; ఛందస్సు - జగతి; దేవత - ఇంద్రుఁడు.)

౮౭౯. అశ్వావతి ప్రథమో గోషు గచ్ఛతి సుప్రావీ రిన్ద్ర మర్త్యస్తవోతిభిః।
తమిత్పృణక్షి వసునా భవీయసా సిన్ధుమాపోయథాభితో విచేతసః॥

వ॥ ఇంద్రా! మనుష్యుఁడు నీరక్షణలచేతఁ జక్కగా రక్షింపఁబడినవాఁడును, అనేకములైన గుఱ్ఱములుగల (యింటిలోనుండి) గోవులవిషయమున మొదటివాఁడై నడచును (గోవులను బుచ్చుకొనువారిలో ముందునడచుననియు, గుఱ్ఱములదివఱకే కలిగియున్నాఁడనియు తా॥) నీవతనినే విస్తారధనముతోను; విశేషజ్ఞానమును గలిగించు నుదకములు సర్వత్రా సముద్రుని బూరించునట్లు; పూరింతువు.

౮౮౦. ఆపోన దేవీ రుపయన్తి హోత్రియ మవః పశ్యన్తి వితతం యథారజః।
ప్రాచైర్దేవాసః ప్రణయన్తి దేవయుం బ్రహ్మప్రియం జోషయన్తేవరాఇవ॥

వ॥ హోతయొక్క పాత్రను ప్రకాశించు నుదకములు చేరునట్లు; విస్తీర్ణమయిన సూర్యకాంతిక్రిందికిఁబడునట్లు; దేవతలందఱు చుట్టుమూగి తమదృష్టులను సారింతురు. దేవతలందఱును గోరుకొను నీపాత్రను బ్రహ్మప్రియమను పేరి దానిని సిద్ధపఱతురు. దేవతలందఱు దానిని (కన్యను) వరులు కామించునట్లు కామింతురు.

౮౮౧. అధిద్వయో రదధా ఉక్థ్యం వచో యతస్రుచా మిథునా యాసపర్యతః।
అసంయత్తో వ్రతే తే క్షేతి పుష్యతిభద్రా శక్తిర్యజమానాయ సున్వతే॥

౯. యశ్చిద్ధి త్వా బహుభ్య ఆ సుతావాఁ ఆవివాసతి ।
ఉగ్రం తత్పత్యతే శవ ఇన్ద్రో అఙ్గ॥

వ॥ అనేక మనుష్యులలో నేయజమానుఁడు సోమమునభిషవించి నిన్ను సేవించునో యాతనికి ఉగ్రమయిన బలము నింద్రుఁడు శీఘ్రముగా నిచ్చును.

౧౦. స్వాదోరిత్థా విషూవతో మధ్వః పిబన్తి గౌర్యః ।
యా ఇన్ద్రేణ సయావరీర్వృష్ణా మదన్తి శోభసే వస్వీరను స్వరాజ్యమ్॥

వ॥ ఏగోవులు వర్షించువాఁడగు నింద్రునితోఁగూడి శోభార్థ సంచరించునో యాగోవులు రుచియయిన సోమరసమును సర్వయజ్ఞములలో నిల్చే ఇంద్రుఁడు త్రాఁవగా మిగిలినదానిని త్రావి మదించుచున్నవి. నివాసమునకు ముఖ్యోపయోగమగు పాల నిచ్చుచున్నవై యింద్రరాజ్యము తమదేయని భావించుచున్నవి.

౧౧. తా అస్య పృశనాయువః సోమం శ్రీణన్తి పృశ్నయః ।
ప్రియా ఇన్ద్రస్య ధేనవో వజ్రం హిన్వన్తి సాయకం వస్వీరను స్వరాజ్యమ్॥

వ॥ ఇంద్రుని స్పర్శనుగోరిన నానావర్ణగోవులు సోమరసమును తమపాలతోఁ గలుపుచున్నవి. ఇంద్రునకు ప్రియములగు నాధేనువులు శత్రువులఁ జంపునట్టి వజ్రమును (శత్రులమీఁద) విసరుచున్నవి. నివాసమునకు ముఖ్యాధారమయిన గోవు లింద్రరాజ్యము తమరాజ్య మిత్యాదిపూర్వవతు.

౧౨. తా అస్య నమసా సహః సపర్యన్తి ప్రచేతసః ।
వ్రతాన్యస్య సశ్చిరే పురూణి పూర్వచిత్తయే వస్వీరను స్వరాజ్యమ్॥

వ॥ ఆగోవులుత్కృష్టజ్ఞానముకలవై ఇంద్రుని బలమును (తమపాల) ఆహారముతో బోషించుచున్నవి. ఇంద్రుని బహువిధ కార్యములను దెలియుటకై మొదల చేయును. ప్రజల నివాసహేతువులైన గోవులిత్యాది పూర్వవతు,

౧౩. ఇన్ద్రో దధీచో అస్థభిర్వృత్రాణ్యప్రతిష్కుతః । జఘాన నవతీర్నవ॥

దం॥ ఇతరు లెదురుమాటలాడ శక్యముకాని యింద్రుఁడు దధీచ్యస్థి యెముకలతో నెనిమిది వందల యెనుబదిమంది వృత్రులను జంపెను. (అదెట్లనగా—మూఁడు లోకముల దేవతలంజయింప వృత్రునిమాయ మొదట మూఁడయ్యెను. అందొక్కొక్కటి భూతభవిష్యద్వర్తమాన దేవతల నిమిత్తము మూఁడేసి యయ్యెను. మొత్తము తొమ్మిది. అందొక్కొక్కటి యుత్సాహప్రభు మంత్రశక్తుల నాశ్రయించి మూఁడేసి కాగా మొత్త మిరువదియేడు. అవిసత్త్వర జస్తమో భేదమున నెన భై యొక్కటి యయ్యె. ఇట్టివి పదిదిక్కులనుంటచేత దేవతలు వృత్రునితో సాలలేక దధీచి స్వర్గమునకు వెళ్ళగానే యతని దేహమైన కలదాయని ప్రశ్నింప నతని యుపదేశమున కురుక్షేత్రమునకుఁబోయి దేవతలు వెదకిరట! అచటి నదీసమీపమున నతని గుఱ్ఱముతలకాయ కనంబడెనట! ఆతల యెముకముక్కలతో వృత్రాసురులను (౮౧౦) ఎనిమిదివందల పదిమందిని యింద్రుఁడు చంపెనట—ఇది పురాణములో దానికి భిన్నముగానున్నది.)

౮౯౮. ఇచ్ఛ న్నశ్వస్య యచ్ఛిరః పర్వతే ష్వపశ్రితమ్ । తద్విద చ్ఛర్యణావతి॥

దం॥ పర్వతములందు నశ్వశిరస్సు జారిపడినది. (అదే దధీచిది) దానినింద్రుఁడు కోరఁగా శర్యణావతి యను నదిలో ఆతల దొరకెను.

౮౯౯. అత్రాహ గోరమన్వత నామ త్వష్టు రపీచ్యమ్ । ఇత్థా చన్ద్రమసో గృహే॥

దం॥ గమనించునట్టి చంద్రునియొక్క యీ గృహమందే (అంటే మండలము) రాత్రి కనంబడనట్టి త్వష్టయొక్క (=సూర్యుఁడే: దీపించువాఁడనిభ్యు) తేజస్సు తెలిసికొనిరి. (చంద్రుని మండలమందు సూర్యమండలములో కాన్తి రాత్రి ప్రవేశించునని తా॥)

౯౦౦. కో అద్య యుఙ్క్తే ధురిగా ఋతస్య శిమీవతో భామినో దుర్హృణాయూన్ ।
ఆసన్నిషూన్హృత్స్వసో మయోభూన్య ఏషాంభృత్యామృణధ త్సజీవాత్॥

దం॥ ఈ కర్మదగ్గరకు వచ్చిన ఇంద్రరథము నొగలందు గమనశీలములును, వీర్యవంతులు, తేజోవంతులు, శత్రులకు సాధ్యముకాని కోపముకలవియు, నోటిలోనే బాణములుకలవియు, (శత్రువుల) గుండెలమీఁదఁ బాదము వేయునవియు నగు నింద్రుని గుఱ్ఱములను నేఁడు పూన్పఁగలఁడు? (శక్యముకాదనితా) ఈ వాక్కును బోషించువాఁడు బ్రతుకుఁగాత.

౯౦౧. కఈషతే తుజ్యతే కోబిభాయ కోమంసతే సన్తమిన్ద్రం కోఅన్తి।
కస్తోకాయ కఇభాయోతరాయే ఽధిబ్రవత్తన్వే౩ కోజనాయ॥

దం॥ (ఇంద్రుఁడనుగ్రహింప వచ్చినపుడు) ఎవఁడు శత్రువునకు భయపడి పాఱి పోవును? ఎవఁడు హింసింపఁబడును? ఎవఁడు భయపడును? మాసమీప మందున్న యింద్రునెవఁడు తెలిసికొనఁగలఁడు? ఏ యజమానుఁడు సంతానము కొఱకును ఏనుఁగులకొఱకును, ధనముకొఱకును, తనశరీరముకొఱకును, పరివారముకొఱకును, వేడుకొనును? (కోరకుండనే యింద్రుఁడిచ్చునని తా॥)

౯౦౨. కోఅగ్నిమీట్టే హవిషా ఘృతేన స్రుచా యజాతా ఋతుభిర్ధ్రువేభిః।
కస్మై దేవా ఆవహానాశు హోమకోమంసతే వీతిహోత్రః సుదేవః॥

దం॥ అగ్నినెవఁడు స్తుతింపఁగలఁడు? స్రుక్కులో నేయిపోసి యేయజమానుఁడు నిత్యములగు వసంతాది ఋతువులతో నగ్నిని యజించును? ఏయజమానునకు దేవతలు శీఘ్రముగా హోమవస్తువులను సమకూర్చఁగలరు? యజ్ఞమారంభించి శోభనదేవతలు గలయేయజమానుఁడు తెలిసికొనఁగలఁడు? (ఎవరికిని శక్యముకాదని తా॥) ఇచట నగ్నియనుమాటకునింద్రుఁడనియే సాయనార్థము. ఇంద్రసూక్తము మధ్యనున్నదికనుక.

౯౦౩. త్వమఙ్గ ప్రశంసిషో దేవః శవిష్ఠ మర్త్యమ్।
నత్వదన్యో మఘవన్నస్తి మర్డితేన్ద్ర బ్రవీమి తేవచః॥

దం॥ ఓయీ! గొప్పబలవంతుఁడా! ప్రకాశించునీవు మర్త్యుని మెచ్చుకొనుము. ఓధనవంతుఁడవగు నింద్రా! నీకంటె నితరుఁడు సుఖింపఁజేయువాఁడు లేడు. కనుక నీస్తుతిమంత్రముఁ బఠించుచున్నాము.

౯౦౪. మాతేరాధాంసి మాత ఊతయో వసోఽస్మాన్కదాచనా దభన్।
విశ్వాచన ఉపమిమీహి మానుష వసూని చర్షణిభ్య ఆ॥

దం॥ నివాసహేతువగు నోయింద్రా! నీయన్నములు, నీరక్షణములు మమ్ము బాధలుచెందకుండ రక్షించుగాక. మనుజులకు మేలుకూర్పువాఁడా! సమస్తధనములను మంత్రద్రష్టలమగు మాకుఁ దెచ్చిపెట్టుము.

ఇట్లు ప్రథమమండలమున బదుమూఁడవ యనువాకము. శ్రీ శ్రీ శ్రీ

---

## అనువాకము. ౧౪.

### సూక్తము. ౮౫.

(ఋషి - గోతముఁడు; దేవత - మరుత్తులు; ఛందస్సు - ౫, ౧౨, త్రిష్టుప్; తక్కినవి జగతి.)

౯౦౫. ప్రయేశుమ్భన్తే జనయోన సప్తయోయామన్రుద్రస్య సూనవః సుదంససః ।
రోదసీ హిమరుతశ్చక్రిరే వృధేమదన్తి వీరా విదథేషు ఘృష్వయః॥

దం॥ ప్రాకునట్టి స్వభావముగలిగి, శోభనకర్మలుకలిగి రుద్రపుత్రులగు మరుత్తులు ప్రయాణము చేయవలసి వచ్చినపుడు ఆడువారివలె నలంకరించుకొందురు. (స్త్రీలలంకారప్రియులని పూర్వమునుండి సహజము) ద్యావాపృథువులను మరుత్తులు వృద్ధిచేసిరి. వీరులును శత్రువులను దిరస్కరించువారునై యజ్ఞములందు (సోమపానము చేత) మదించుచున్నారు.

౯౦౬. తఉక్షితాసో మహిమాన మాశత దివిరుద్రాసో అధిచక్రిరే సదః ।
అర్చన్తో అర్కం జనయన్త ఇన్ద్రియ మధిశ్రియో దధిరే పృశ్నిమాతరః॥

దం॥ ఆమరుత్తులు దేవతలచేత నభిషేకింపఁబడినవారై మహత్త్వమొందిరి. రుద్రుని పుత్రులయి ద్యులోకమందెక్కువగా నివాసము చేసికొనిరి. పూజనీయుఁడయిన యింద్రుని బూజించుచు సామర్థ్యమును గలిగించుచు భూమిపుత్రులయి సంపదల నధికముగాఁ బొందిరి.

౯.౧. తేవర్ధన్త స్వతవసో మహిత్వనా నాకం తస్థురురుచక్రిరే సదః।

విష్ణుర్య ద్ధావస్వృషణం మదచ్యుతం వయోనసీదన్నధి బర్హిషి ప్రియే॥

దం॥ స్వంతబలముకల మరుత్తులు వృద్ధినందిరి. మహిమచే స్వర్గము నెక్కిరి. తమ నివాసము (ఆకసమని తా॥) విరివిచేసిరి. వర్షముకురిపించునట్టి మదమునుగలిగించు విష్ణువే యెవరికొఱకువచ్చి రక్షించునో ఆ మరుత్తులు పక్షులవలె శీఘ్రమువచ్చి ప్రియమయిన మాయజ్ఞమందుఁ గూర్చుందురు.

౮౧౨. శూరాఇవే ద్యుయుధయోన జగ్మయః శ్రవస్యవోన పృతనాసు యేతిరే।

భయన్తే విశ్వా భువనా మరుద్భ్యోరాజాన ఇవ త్వేషసందృశోనరః॥

దం॥ శూరులవలెను, యుద్ధము గోరువారివలెను త్వరగానడచు మరుత్తులు అన్నము కోరినవారివలె యుద్ధములలో నిటునటు తిరుగుదురు. మరుత్తులు రాజులవలె దీప్త దర్శనులు. కనుకనే యట్టివారికి సమస్తభూతములును భయపడుదురు.

౯౧౩. త్వష్టా యద్వజ్రం సుకృతం హిరణ్యయం సహస్రభృష్టిం స్వపా అవర్తయత్।

ధత్త ఇన్ద్రో నర్యపాంసి కర్తవే హన్వృత్రం నిరపామౌబ్జదర్ణవమ్॥

దం॥ మంచిపనివాఁడగుత్వష్టచక్కఁగాఁ జేసినదియు, సువర్ణమయము, వేయియంచులు గలదియు నగు వజ్రాయుధము నింద్రునకిచ్చెను. దానినింద్రుఁడు యుద్ధములందుఁ బనిచేయుటకై ధరించెను. దానితో వృత్రుని వధించెను. ఉదకరాశిని గార్చెను. (వర్షించెనని తా॥)

౯౧౪. ఊర్ధ్వం నునుద్రేవతంత ఓజసా దాదృహాణం చిద్బిభిదుర్విపర్వతమ్।

ధమంతో వాణం మరుతః సుదానవో మదేసోమస్యరణ్యాని చక్రిరే॥

దం॥ మరుత్తులు తమబలము మీఁదికెత్తిరి. తమకడ్డువచ్చిన పర్వతములనుగూడ ముక్కలు చేసిరి. మంచిదానముచేయు మరుత్తులు వాణమును (నూరుతీగల వీణ) వాయించుచు సోమపాన మదముగల్గి మెచ్చుకొనఁదగిన ధనములను (స్తుతికర్తలకు(

౯౦౭. గోమాతరో యచ్ఛుభయన్తే అఞ్జిభి స్తనూషు శుభ్రా దధిరే విరుక్మతః॥

బాధన్తే విశ్వ మభిమాతిన మపవర్త్మా న్యేషామనురీయతే ఘృతమ్॥

దం॥ గోరూపమయినభూమి తల్లిగాఁగల మరుత్తులు ఆభరణములతో నెపుడలంకరించుకొందురో యపుడు కాంతిగలవారై శరీరమునందలంకారములతో శోభిల్లుదురు. ప్రపంచమునంతటిని బాధించు శత్రుని హింసింతురు. ఈమరుత్తుల మార్గమును అనుసరించి యుదకములు కారును. (ఘృత=ఉదకము.)

౯౦౮. వియేభ్రాజన్తే సుమఖాసఋష్టిభిః ప్రచ్యావయన్తో అచ్యుతా చిదోజసా।

మనోజువో యన్మరుతో రథేష్వావృషవ్రాతాసః పృషతీర యుగ్ధ్వమ్॥

దం॥ మంచియజ్ఞములుకల మరుత్తులు ఆయుధములతో మిక్కిలి ప్రకాశించుచున్నారు. మనసువంటి వేగముగల్గి వర్షించుచే పనిగాఁగల మరుత్తులారా! మీరు ఆడలేళ్ల నెపుడు రథమందుఁ బూన్చుదురో అపుడు గదలింప శక్యముగాని వస్తువులను గదలించుచున్నారు.

౯౦౯. ప్రయద్రథేషు పృషతీరయుగ్ధ్వంవాజే అద్రింమరుతో రంహయన్తః

ఉతారుషస్య విష్యన్తి ధారాశ్చర్మే వోదభిర్వ్యున్దన్తి భూమ॥

దం॥ మరుత్తులారా! అన్నమునిమిత్తము మేఘమును వర్షమునకుఁ బ్రేరించుచు రథములం దాడలేళ్లను బూన్చినపుడు మిక్కిలి ప్రకాశించు సూర్యునియొక్క (అనఁగా వైద్యుతాగ్నియని తా॥) సమీపమునుండి వర్షోదకధారలను విడచుచున్నారు. నీటితోఁ జర్మము తడుపునట్లు; ఆధారలు భూమిని దడుపుచున్నవి.

౯౧౦. ఆవోవహన్తు సప్తయో రఘుష్యదో రఘుపత్వానః ప్రజిగాత బాహుభిః।

సీదతా బర్హిరురువః సదస్కృతం మాదయధ్వంమరుతో మధ్వోఅన్ధసః॥

దం॥ మరుత్తులారా! మిమ్మును శీఘ్రగమనముగల్గి చులకనగా నెగురునట్టి గుఱ్ఱములు తోడుకొనివచ్చునుగాక. మీబాహువులందు ధనముపట్టుకొని రండు. మీరు కూర్చుండుచోటు (వేదిమీఁదనని తా॥) విశాలముచేయఁబడెను. అచటి దర్భలపైఁ గూర్చుండుడు. మధురమగు సోమరూపాహారముతో మదించుడు.

ఇచ్చిరి. (గౌతమర్షి దాహముకలిగి ప్రార్థింప నొకనూతిని మీఁదికెత్తి తెచ్చుచుండ నొకకొండ యడ్డముగారాగా దానింబగులకొట్టి వచ్చి గౌతముఁడున్నచోట నూతినిదించి యాప్రక్కను జిన్నగోతినిదీసి దానితో నూతినీరుపోసి యానీటితో గౌతముని దృప్తి పఱచిరని కథ.)

౯౧౫. జిహ్మం నునుద్రేవతం తయా దిశాసించన్నుత్సం గోతమాయ తృష్ణజే।

ఆగచ్ఛన్తీం మవసా చిత్రభానవఃకామం విప్రస్యతర్పయన్త ధామభిః॥

దం॥ మరుత్తులు (గౌతమర్షి) యున్నచోటికి వంకరగానున్న నూతినెత్తుకొని పోయిరి. దాహముతోనున్న గౌతమునకు జలప్రవాహమును బోసిరి. నానావిధకాంతుల మరుత్తులీ ఋషిసమీపమునకు సర్వరక్షులతో వచ్చిరి. మేధావంతుఁడగు గౌతముని కోర్కె నుదకములతోఁ దృప్తిపఱచిరి. (వెనుక కథచూడుు.)

౯౧౬. యావః శర్మ శశమానాయ సన్తి త్రిధాతూని దాశుషే యచ్ఛతాధి।

అస్మభ్యం తాని మరుతో వియన్త రయిం నోధత్త వృషణః సువీరమ్॥

దం॥ మూఁడులోకములందు నివసించియున్న మరుత్తులారా! మిమ్ము స్తుతించు వాని కివ్వఁదగినవి, మీకు హవిస్సులనిచ్చువాని కివ్వఁదగినవి, యగు గృహములు మాకునిండు. వర్షించు స్వభావముగల మరుత్తులారా! మాకు మంచి పుత్రపౌత్రులతోఁగూడిన ధనమును ఇండు.

---

సూ క్త ము ౮౬.

(ఋషి - గౌతముఁడు; దేవత - మరుత్తులు; ఛందస్సు - గాయత్రి)

౯౧౭. మరుతో యస్యహి క్షయే పాథా దివో విమహసః। సను గోపాతమోజనః॥

దం॥ విశేషప్రకాశముగల యో మరుత్తులారా! ద్యులోకమునుండి వచ్చి యే యజమానుని గృహమందు సోమము పానము సేతురో యా యజమానుఁడు మంచి రక్షకులు కలవాఁడగును.

౯౧౮. యజ్ఞైర్వా యజ్ఞవాహసో విప్రస్య వా మతీనామ్ । మరుతః శృణుతా హవమ్॥

దం॥ యజ్ఞమును జరిపించునో మరుత్తులారా! యజమానులయొక్కయు, స్తుతికర్తలయొక్కయు, స్తుతిమంత్రములతోఁటి పిలుపుల వినుఁడు.

౯౧౯. ఉత వా యస్య వాజినో నువిప్ర మతక్షత । స గన్తా గోమతి వ్రజే॥

దం॥ మఱియు నేయజమానుని హవీరూపాన్నములతో ఋత్విజులారా! మేధావంతులయిన మరుత్తులను ఉత్సాహపఱతురో యాతఁడు గోవుల నేకములుగల మందగలవాఁడగును.

౯౨౦. అస్య వీరస్య బర్హిషి సుతః సోమో దివిష్టిషు । ఉక్థం మదశ్చ శస్యతే॥

దం॥ యజ్ఞదినములలో యజ్ఞవీరులగు మరుద్గణముల (యాగమునకు) సోమమభిషవింపఁబడెను. స్తుతులును, సోమమదమును మెచ్చుకొనంబడెను.

౯౨౧. అస్య శ్రోషన్త్వా భువో విశ్వా యశ్చర్షణీరభి సూరం చిత్స్రుషీరిషః॥

దం॥ ఏమరుద్గణము సమస్తశత్రువులఁ దిరస్కరింతురో యామరుద్గణము ఈ యజమానుని స్తుతివాక్కును విందురుగాక. స్తుతికర్తకు నన్నములు చేరునుగాక.

౯౨౨. పూర్వీభిర్హి దదాశిమ శరద్భిర్మరుతో వయమ్ । అవోభిశ్చర్షణీనామ్॥

దం॥ మరుత్తులారా! గతించిన బహుసంవత్సరములనుండి సర్వదర్శకులయిన మీ రక్షణములతో మేము హవిస్సుల మీకిచ్చుచున్నాము.

౯౨౩. సుభగః స ప్రయజ్యవో మరుతో అస్తు మర్త్యః । యస్య ప్రయాంసి పర్షథ॥

దం॥ బాగుగ యజింపఁదగిన మరుత్తులారా! యే యజమానుని హవిస్సులను మీరు స్వీకరించుచున్నారో యతఁడు మంచి ధనవంతుఁడగుఁగాక.

౯౨౪. శశమానస్య వా నరః స్వేదస్య సత్యశవసః । విదా కామస్య వేనతః॥

దం॥ నిజమయిన బలముగల్గి నాయకులగు మరుత్తులారా! మిమ్ము స్తుతించుచు నలసి చమర్చినవాఁడై ప్రకాశించు స్తుతిపాఠకునకు కోర్కెను ఇండు.

౯౨౫. యూయం తత్సత్యశవస ఆవిష్కర్త మహిత్వనా । విధ్యతా విద్యుతా రక్షః॥

దం॥ సత్యమయిన బలముగల మరుత్తులారా! ఆ మీమాహాత్మ్యమును ప్రకటింపుఁడు. దీపించు మహిమతో రక్షస్సులనణంచుఁడు.

౯౨౬. గూహతా గుహ్యం తమో వియాత విశ్వ మత్రిణమ్ ।

జ్యోతిష్కర్తా యదుశ్మసి॥

దం॥ మరుత్తులారా! గుహలోనున్న యీచీఁకటిని (మాకుఁగనఁబడకుండ) దాఁచివేయుఁడు. ప్రపంచమును దినివేయు (రాక్షసాదులను) జెదరఁగొట్టుఁడు. మే మే తేజస్సును గోరితిమో దానిని (అనఁగా సూర్యుని) జేయుఁడు,

---

సూక్తము. ౮౭.

(ఋషి - గోతముఁడు; దేవత - మరుత్తులు; ఛందస్సు - జగతి.)

౯౨౭. ప్రత్వక్షసః ప్రతవసో విరప్శినో నానతా అవిధురా ఋజీషిణః ।

జుష్టతమాసో నృతమాసో అఞ్జిభి ర్వ్యానజ్రే కేచి దుస్రా ఇవ స్తృభిః॥

దం॥ శత్రువులను జెక్కివేయునట్టి, మిక్కిలి బలముకలట్టి, ధ్వనించుచున్నట్టి, యితరులకు లొంగనట్టి, ఒకరినొకరు విడువనట్టి, మాకుడు కెదురుచూచుచున్నట్టి, (అనఁగా తృతీయ సవనములోఁ బిండివంటలు వండునపుడు మరుత్తులనే స్తుతింతురు.) లేదా-రసములనుగూడఁబెట్టునట్టి, (యజమానులచే) మిగుల సేవింపఁబడునట్టి, (మేఘాదికము) నడిపించునట్టి, మరుత్తులు తమశరీరములను గప్పియున్న యలంకారములతోఁ గొన్ని సూర్యకిరణములువలెఁ బ్రకాశించుచున్నారు.

౯౨౮. ఉపహ్వరేషు యదచిధ్వం యయిం వయ ఇవ మరుతః కేనచిత్పథా ।

శ్చోతన్తి కోశా ఉప వో రథేష్వా ఘృత ముక్షతా మధువర్ణ మర్చతే॥

దం॥ మరుత్తులారా! పక్షులేదో దారి నాకాశమునందు నడచునట్లు మీరునడచుచు సమీపమునందున్న యాకాశస్థలమునందు నడచుచున్న మేఘము నెపుడు వృద్ధిపొందించు చున్నారో అపుడు మేఘములు మీరథములందుఁ జిక్కుకొన్నవై వర్షోదకమును స్రవింపఁజేయుచున్నవి. మిమ్మును బూజించిన యజమానునకుఁ దేనెవంటి రంగుకల ఉదకమును ఇండు.

౫౨౯. ప్రైషా మజ్మేషు విథురేవ రేజతే భూమి ర్యామేషు యద్ధ యుఞ్జతే శుభే।

క్రీళయో ధునయో భ్రాజదృష్టయః స్వయంమహిత్వం పనయన్త ధూతయః॥

దం॥ శుభమయిన వర్షోదకముకొఱకు నెపుడు ఈమరుత్తులు (మేఘములను) సిద్ధపఱచుచున్నారో యపుడు ఎగురఁగొట్టు నీమరుత్తులు మేఘములను నడిపించుచుండఁగా భూమి విధవ వణంకినట్లు మిక్కిలి వణఁకుచున్నది. అట్టి విహారశీలురై చలనస్వభావులయి మెఱయు నాయుధములుగల మరుత్తులు (అన్నిఁటిని) గదలించు తమమహిమను దామే ప్రకటించుకొనుచున్నారు.

౫౩౦. సహిస్వసృత్పృషదశ్వో యువా గణోౕయా ఈశాన స్తవిషీభిరావృతః।

అసిసత్య ఋణయావా నేద్యోస్యాధియః ప్రావితాథా వృషాగణః॥

దం॥ తమంతతామే ప్రసరించునట్టి, లేళ్లు వాహనములుగాఁగలట్టి, నిత్యయౌవనవంతమయినట్టి, యామరుద్గణము గొప్పబలముతోఁగూడి యాసర్వజగంబునకునీశ్వరుఁడగుచున్నది. సత్కర్మలకర్తయై; (భక్తుల) ఋణములు తీర్చునట్టి, మరుద్గణము మా యీకర్మను తరువాత రక్షించునదై యున్నది.

౫౩౧. పితుః ప్రత్నస్య జన్మనా వదామసి సోమస్య జిహ్వా ప్రజిగాతి చక్షసా।

యదీమిన్ద్రం శమ్యృక్వాణ ఆశతాది న్నామాని యజ్ఞియాని దధిరే॥

దం॥ పురాతనుండైన మాతండ్రివల్లఁ బుట్టినందున మేము పల్కుచున్నాము. (అంటే మాతండ్రిచేవిన్న వృత్తాంతమని తా॥) ఏకారణమువల్ల మరుత్తులు (ఆతని) పనులలో నీయింద్రుని హెచ్చరించుచున్నవై వదలక అంటిపెట్టుకొనితరువాత యజ్ఞార్హనామములు ధరించినవో ఆకారణముచేత ప్రకాశించునట్టి సోమాహుతితో నాలుక మరుద్గణమును జేరుచున్నది. (అనఁగా స్తుతించుచున్నదని తా॥)

౯౩౨. శ్రియసే కం భానుభిః సంమిమిక్షిరే తే రశ్మిభిస్త ఋక్వభిః సుఖాదయః ।

తే వాశీమంత ఇష్మిణో అభీరవో విద్రే ప్రియస్య మారుతస్య ధామ్నః ॥

తా॥ ఆమరుత్తులు ప్రకాశించుటకై, సూర్యకిరణములతోఁగూడ వర్షోదకమును (ప్రాణుల) యుపయోగార్థము బాగుగా మోయఁగోరుదురు. మరుత్తులు ఋత్విక్కులతోఁగలసి చక్కని హవిస్సును భక్షించుచున్నారు మంచిస్తుతివాక్కులుగల్గి గమన స్వభావముగలవారయి, భయరహితులై మరుత్తులు అందఱకుఁ బ్రియమయిన మరుత్స్థానమును బొందిరి.

---

సూక్తము, ౮౮.

(ఋషి - గౌతముఁడు; దేవత- మరుత్తులు; ఛందస్సు - ౧ - ౯ ప్రస్తారపఙ్క్తి; ౨ - ౪ జగతి; ౫ - విరాట్టు.)

౯౩౩. ఆవిద్యున్మద్భి ర్మరుతః స్వర్కై రథేభిర్యాత ఋష్టిమద్భి రశ్వపర్ణైః ।

అవర్షిష్ఠయా న ఇషా వయో న పప్తతా సుమాయాః ॥

తా॥ మరుత్తులారా! విశేషకాంతికలవియుఁ, జక్కగానడచునవియు, ఆయుధములతో నిండినవియు, అశ్వములు పూన్చబడినవియు, నగు రథములతో రండు. (లేక, గమనస్వభావముగల మేఘముల నెడు రథములమీఁదరండు. అనికాని) శోభనకర్మవంతులారా! శ్రేష్ఠమయిన యన్నములతో మావద్దకు శీఘ్రముగా పక్షులవలె నెగిరిరండు.

౯౩౪. తేఽరుణేభి ర్వరమా పిశంగైః శుభే కం యాంతి రథతూర్భి రశ్వైః ।

రుక్మో న చిత్రః స్వధితీవాన్ పవ్యా రథస్య జంఘనంత భూమ ॥

తా॥ ఆమరుత్తులు పసుపు, ఎరుపు, కలిసిన రంగుగలిగి రథమును మోయు గుఱ్ఱములతో దేవతలంగోరుచు స్తుతించుచున్న యజమానునిగూర్చి శుభముంగూర్చుటకు వత్తురు. ఆమరుద్గణములు బంగారువలె మెఱయుచు వజ్రాయుధముగలవారై రథచక్రములయంచుతో భూమిని నలుగఁగొట్టుచున్నారు.

౩౫. శ్రియేకంవో అధితనూషు వాశీర్మేధా వనాన కృణవన్త ఊర్ధ్వా ।
యుష్మభ్యం కంమరుతః సుజాతా స్తువిద్యుమ్నా సోధనయన్తే అద్రిమ్॥

వ॥ ఓ మరుత్తులారా! మీభుజములందు వాడిసలు (ఆయుధవిశేషము) ఉన్నవిదా! అడవులవలె యజ్ఞములను వెలిగించుచున్నారు. ఓ శోభనకర్మకలవారలారా! మీకు సుఖముగలిగించు సభిషవశిలను ధనవంతులయిన యజమానులు స్వాధీనపఱచుకొనుచున్నారు.

౩౬. అహానిగృధ్రాః పర్యావ ఆగురిమాం ధియంవా ర్కార్యాంచ దేవీమ్ ।
బ్రహ్మ కృణ్వన్తో గోతమాసో అర్కైరూర్ధ్వంను నుద్ర ఉత్సధిం పిబధ్యై ।

వ॥ ఓ గౌతములారా! జలముకోరుచున్న మీకు మంచిరోజులు వచ్చినవి. కనుకనే ఉదకములతోఁ జేయవలసిన కర్మలను జక్కగాఁ జేయఁగలిగినారు. ఆరోజులలో మరుత్తులకై దివ్యమయిన స్తుతిమంత్రములఁ బలుకుచున్న గౌతములు తాము త్రాగుటకు నూతిని లేవనెత్తి తీసికొనిపోయిరి.

౩౭. ఏతత్త్యన్న యోజన మచేతి సస్వర్హ యన్మరుతో గోతమోవః ।
పశ్యన్హిరణ్య చక్రానయోదంష్ట్రా న్విధావతో వరాహూన్॥

వ॥ ఓ మరుత్తులారా! యీ స్తుతిమంత్రము ప్రసిద్ధమయిన స్తుతిగా నందఱెఱుగుదురు. బంగారురథమెక్కి ఇనుపచక్రధారలుగల్గి బహుధా యిటునటు తిరుగుచున్నవారినిగాను, శత్రువుల సంహరించువారినిగాను, లేక, వర్షోదకము తెచ్చువారినిగాను, మిమ్ము నెఱింగియే గౌతమర్షి మీకొఱకీసూక్తము ఉచ్చరించెను.

౩౮. ఏషాస్యావో మరుతోనుభర్త్రీ ప్రతిష్టోభతి వాఘతో నవాణీ ।
అస్తోభయ ద్వృథా సామను స్వధాంగ భస్త్యోః॥

వ॥ ఓ మరుత్తులారా! ఈ యీ మేము చేయు స్తుతి మీ గుణములను ప్రత్యేకము వర్ణించుచున్నది. మా చేతిలో మరుత్తులన్నము పెట్టునపుడు ఋత్విక్కుల స్తుతివాక్కు కూడ మిమ్ములనీఋక్కులతో స్తుతించును.

## సూక్తము ౮౯.

(ఋషి - గౌతముఁడు ; దేవత - విశ్వదేవతలు ; ఛందస్సు - ౧, ౫, ౭; జగతి; ౬ విరాట్టు ;
౮, ౯, ౧౦, త్రిష్టుప్.)

౯౩౯. ఆనోభద్రాః క్రతవో యన్తు విశ్వతో దబ్ధాసో అపరీతాస ఉద్భిదః ।
దేవానో యథాసద మిద్వృధే అసన్నప్రాయువో రక్షితారో దివేదివే॥

దం॥ కల్యాణప్రదములు, (నితరులచే) హింసింపఁబడనివి, శత్రువులచే నిరోధింపఁబడనివి, శత్రువులను భేదించునవి, యగు క్రతువులు మమ్ము నాశ్రయించుఁగాక. అశ్రే తాము రక్షింపవలసినదానిని విడువనట్టియుఁ బ్రతిదినమును (యజమానుల) రక్షించునట్టియు, దేవతలుకూడ మాయభివృద్ధికొఱకగుదురుగాక.

౯౪౦. దేవానాంభద్రా సుమతి ఋజూయతాం దేవానాం రాతి రభినోనివర్తతామ్॥
దేవానాం సఖ్యముపసేదిమావయం దేవాన ఆయుః ప్రతిరన్తు జీవసే।

దం॥ మంగళకరమైన యజమానులందనురాగముకల దేవతల యనుగ్రహబుద్ధి మాయందుఁ గలుగుఁగాక, దేవతలదానము మాకభిముఖమై ప్రవర్తిల్లుగాక, మేము కూడ దేవతల సఖ్యమును బొందుదుముగాక, ఆ దేవతలు మాజీవనమునకాయువు నిత్తురుగాక.

౯౪౧. తాన్పూర్వయా నివిదాహూమహేవయంభగం మిత్రమదితిందక్షమస్రిధమ్ ।
అర్యమణం వరుణం సోమ మశ్వినా సరస్వతీ నఃసుభగా మయస్కరత్ ॥

దర॥ సనాతన కాలమునుండి వచ్చుచున్న నిత్యమయిన వేదవాక్యముతో, భగుని, మిత్రుని, అదితిని, దక్షుని, మరుద్గణమును, అర్యముని, వరుణుని, సోముని, అశ్వినులను, యీ సర్వదేవతలను మేము బిలుచుచున్నాము. శోభన ధనముగల సరస్వతి మాకు సుఖముగలిగించుఁగాక.

౯౪౨. తన్నోవాతో మయోభువాతు భేషజం తన్మాతాపృథివీ తత్పితాద్యౌః ।
తద్గ్రావాణః సోమసుతో మయోభువస్త దశ్వినా శ్రుణుతం ధిష్ణ్యాయువమ్॥

దం॥ సుఖముగలిగించు నా యౌషధమును వాయువు మాకుఁ దెచ్చియిచ్చునుగాక. అందఱికిఁ దల్లియగు పృథివికూడ నా యౌషధమును తండ్రియైన ద్యులోకముకూడ దానినే తెచ్చియిచ్చుగాక. సోమునభిషవించి సుఖముగలిగించు శిలలుకూడ నా యౌషధము నిచ్చుఁగాక. బుద్ధిమంతులగు నశ్వినులారా! ఆయౌషధమును మీరును వినుఁడు (వినియుండని తా॥)

౯౩౩. తమీశానం జగత స్తస్థుషస్పతింధియం జిన్వమవసే హూమహే వయమ్ ।
పూషానోయథా వేదసా మసద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే॥

దం॥ ఐశ్వర్యవంతుఁడు, స్థావరజంగ మాత్మక జగత్తునకుఁ బతియుఁ, గర్మలందుఁ బ్రీతికలవాఁడు నగు నా యింద్రుని మా రక్షకై పిలుచుచున్నాము. పూష దేవత యెట్లు మాధనములు వృద్ధియగునో యట్లే శత్రువులచే బీడింపఁబడనివాఁడు మమ్ము రక్షించువాఁడునై మాసుఖమును రక్షించుఁగాక.

౯౩౪. స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః ।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు॥

దం॥ అధికస్తుతులుగల యింద్రుఁడు మాకు సుఖముకలిగించుఁగాక. సర్వజ్ఞుఁడయిన పూషమాకు సుఖమునిచ్చుఁగాక. పరులుహింసింపశక్యముకాని యాయుధములుకల గరుత్మంతుఁడు మాకు సుఖముగలిగించుఁగాక. దేవపతి మాకు సుఖముకలిగించుఁగాక.

౯౩౫. పృషదశ్వా మరుతః పృశ్నిమాతరః శుభం యావానో విదథేషు జగ్మయః॥
అగ్నిజిహ్వా మనవః సూరచక్షసో విశ్వేనో దేవా అవసాగమ న్నిహ॥

దం॥ ఆడలేళ్లు వాహనములుగాఁగలిగి నానావిధవర్ణములుగల గోవులు తల్లిగాఁగలవారు, యజ్ఞములకు నడచువారు, అగ్నిజిహ్వయందుఁగలవారు, సర్వజ్ఞులు, సూర్యునివంటి ప్రకాశముకలవారు నగు మరుత్తులను పేరుగల సర్వదేవతలును మావద్దకు సర్వరక్షలతో వత్తురుగాక.

వం॥ సుఖముగలిగించు నాయౌషధమును వాయువు మాకుఁదెచ్చియిచ్చునుగాక. జనకుఁడైన పృథ్వియు సుఖకరమైన నాయౌషధమును తండ్రియైన ద్యులోకముకూడ నానినే తెచ్చియిచ్చునుగాక. సోమునభిషవించి సుఖముగలిగించు శిలలుకూడ నా యౌషధము నిచ్చుఁగాక. బుద్ధిమంతులగు నశ్వినులారా! ఆయౌషధమును మీరును వినుఁడు (వినియుండని త్రా॥)

౫౮౩. తమీశానం జగతస్తస్థుషస్పతింధియం జిన్వమవసే హూమహే వయమ్ ।
పూషా నో యథా వేదసా మసద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే॥

వం॥ ఐశ్వర్యవంతుఁడు, స్థావరజంగమాత్మక జగత్తునకుఁ బతియుఁ, గర్మలందుఁ బ్రీతికలవాఁడు నగు నాయింద్రుని మారక్షకై పిలుచుచున్నాము. పూష దేవత యెట్లు మాధనములు వృద్ధియగునో యట్లే శత్రువులచేఁ బీడింపఁబడనివాఁడు మమ్ము రక్షించువాఁడునై మాసుఖమును రక్షించుఁగాక.

౫౮౪. స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

వం॥ అధికస్తుతులుగల యింద్రుఁడు మాకు సుఖముకలిగించుఁగాక. సర్వజ్ఞుఁడయిన పూష మాకు సుఖమునిచ్చుఁగాక. పరులుహింసింపశక్యముకాని యాయుధములుకల గరుత్మంతుఁడు మాకు సుఖముగలిగించుఁగాక. దేవపతి మాకు సుఖముకలిగించుఁగాక.

౫౮౫. పృషదశ్వా మరుతః పృశ్నిమాతరః శుభం యావానో విదథేషు జగ్మయః ।
అగ్నిజిహ్వా మనవః సూరచక్షసో విశ్వేనో దేవా అవసాగమ న్నిహ॥

వం॥ ఆడలేళ్లు వాహనములుగాఁగలిగి నానావిధవర్ణములుగల గోవులు తల్లిగాఁగల వారు, యజ్ఞములకు నడచువారు, అగ్నిజిహ్వయందుఁగలవారు, సర్వజ్ఞులు, సూర్యునివంటి ప్రకాశముకలవారు నగు మరుత్తులను పేరుగల సర్వదేవతలును మావద్దకు సర్వరక్షలతో వత్తురుగాక.

౯౭౬. భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।
స్థిరైరఙ్గైస్తుష్టువాంస స్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ॥

వ॥ దేవతలారా! మా చెవులతో శుభవచనమును వినుదుముగాక. యాగమందు పూజ్యులగు వారలారా! మా కన్నులతో శుభకార్యములను చూతుముగాక. దృఢమగు అవయవములతోను శరీరములతోను మేము మిమ్ము స్తుతించుచు దేవతలిచ్చినదే యాయువును బొందుదుముగాక.

౯౭౭. శతమిన్ను శరదో అన్తి దేవా యత్రా నశ్చక్రా జరసం తనూనామ్ ।
పుత్రాసో యత్ర పితరో భవన్తి మా నో మధ్యా రీరిషతాయుర్గన్తోః ॥

వ॥ దేవతలారా! మనుష్యులకు సులభము కానవి నూరు సంవత్సరములు కదా యాయువిచ్చియుండిరి! శరీరములకు ముదిమెప్పుడు కల్గునో, మెప్పుడు కొడుకులు తండ్రులై మమ్ము రక్షింతురో యాయువునకు ముందు మధ్యను మమ్ము హింసింపకుడు.

౯౭౮. అదితిర్ద్యౌరదితిరన్తరిక్ష మదితిర్మాతా స పితా స పుత్రః ।
విశ్వే దేవా అదితిః పఞ్చజనా అదితిర్జాతమదితిర్జనిత్వమ్ ॥

వ॥ (అదితి=దీనురాలుకానిది అని వ్యు॥) భూమియే ద్యులోకము, అదే యంతరిక్షము, అదేతల్లి, అదేతండ్రి, అదేపుత్రుడు, అదేయందఱు దేవతలు, అదేయయిదు విధముల మనుష్యులు (బ్రాహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర, నిషాదగాని గంధర్వ, పితృ, దేవ, అసుర, రక్షసులుకాని) అదేజన్మము, అదేపుట్టినవస్తువు. (సర్వమును భూమియే యన్ని తా॥)

—:-o-:—

## సూక్తము. ౯౦.

(ఋషి - గౌతముడు; దేవత - విశ్వేదేవతలు; ఛందస్సు - ౧-౽ గాయత్రి; ౯ అనుష్టుప్.)

౯౭౯. ఋజునీతీ నో వరుణో మిత్రో నయతు విద్వాన్ । అర్యమా దేవైః సజోషాః ॥

దం॥ మిత్రుఁడు (పగటి కభిమాన దేవత) వరుణుఁడు (రాత్ర్యభిమాన దేవత) తిన్ననిదారిలో మమ్ములను దెలిసినవారై నడిపింతురుగాక. దేవతలందఱితో సమాన ప్రీతిగల అర్యముఁడు (సూర్యుఁడే) మమ్ము నడిపించుఁగాక.

ఋ౪౦. తేహి వస్వో వసవానాస్తే అప్రమూరా మహోభిః। వ్రతా రక్షన్తే విశ్వాహా॥

దం॥ ఆమిత్రవరుణార్యములు ధనమును అంతటను బఱచునట్టివారు, ప్రాజ్ఞులు అగుచు కాంతులచేత నన్నిదినములును వ్రతములఁ బాలింతురు. (వ్రతము=జగన్నిర్వాహక కర్మయని తా॥)

ఋ౪౧. తే అస్మభ్యం శర్మయంస న్నమృతా మర్త్యేభ్యః। బాధమానా అపద్విషః॥

దం॥ మరణములేని యా దేవతలు మరణధర్మముగల (మాకు) సుఖమును గలిగింతురు గాక. మా శత్రువులను బాధించుచు మాకు సుఖము కలుగఁజేతురుగాక.

ఋ౪౨. వినః పథః సువితాయ చియం త్విన్ద్రో మరుతః। పూషా భగో వన్ద్యాసః॥

దం॥ అందఱిచేత నమస్కరింపఁదగిన యింద్రుఁడు, మరుత్తులు పూష, భగుఁడునను దేవతలు మా మార్గములను మంచిచోటికి (బోవునట్లు) కలిగింతురుగాక.

ఋ౪౩. ఉతనోధియో గోఅగ్రాః పూష న్విష్ణవేవయావః। కర్తానః స్వస్తిమతః॥

దం॥ ఓ పూషదేవ! ఓ విష్ణుదేవ! మరుత్తులారా! మీరందఱును మా సమస్త కర్మలను, పశువులు మొదలగు సొత్తును సుఖముగల దానిఁగాఁజేయుఁడు.

ఋ౪౪. మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సిన్ధవః। మాధ్వీర్నః సన్త్వోషధీః॥

దం॥ యజమానునికొఱకు వాయువులు మధురమయిన (కర్మ) ఫలములను వర్షించుచున్నవి. నదులు మధురరసమును వర్షించుచున్నవి. ఓషధులు మాకు మధురరసముగలవగునుగాక.

ఋ౪౫. మధునక్త ముతోషసో మధుమ త్పార్థివం రజః। మధు ద్యౌరస్తునః పితా॥

దం॥ రాత్రిమాకు సుఖమయినదగుఁగాక. ఉషస్సులు (అనఁగాఁ బగళ్లు సుఖకరము) లగుఁగాక. భూలోకము సుఖకరమగుఁగాక. మాతండ్రియగు ద్యులోకము సుఖకర మగుఁగాక.

౯౫౬. మధు మాన్నో వనస్పతి ర్మధుమాం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తునః॥

దం॥ వనస్పతి దేవత మాకు మధురఫలదాతయగుఁగాక. (వనస్పతియనఁగాఁ జెట్టు) సూర్యుఁడు సత్ఫలదాతయగుఁగాక. గోవులుమాకు మధురరసమునిచ్చునవగుఁగాక.

౯౫౭. శన్నో మిత్రః శంవరుణః శంనో భవత్వర్యమా।

శంన ఇన్ద్రో బృహస్పతిః శంనోవిష్ణు రురుక్రమః॥

దం॥ మిత్రుఁడు సుఖకరుఁడగుఁగాక. వరుణుఁడు సుఖకరుండగుఁగాక. అర్యముఁడు సుఖకరుఁడగుఁగాక. దేవతలఁ బాలించునట్టి యింద్రుఁడు మాకు సుఖమునిచ్చు వాఁడగుఁగాక. విస్తారముగఁ బాదన్యాసముచేయు (అనఁగా దూరముగానడుగులు చాపువాఁడని) విష్ణుఁడు మాకు సుఖమునిచ్చుఁగాక.

—:-०-:—

## సూ క్త ము. ౯౧.

(ఋ షి - గౌతముఁడు. దేవత - సోముఁడు. ఛందస్సు - ౫ - ౧౬ గాయత్రి: ౧౭ ఉష్ణిక్కు: తక్కినవి త్రిష్టుప్.)

౯౫౮. త్వంసోమ ప్రచికితో మనీషా త్వంరజిష్ఠ మనునేషి పన్థామ్।

తవప్రణీతీ పితరో నఇన్ద్రో దేవేషు రత్న మభజన్త ధీరాః॥

దం॥ ఓసోముఁడా! లేక సోమమా! నీవు మాబుద్ధిచేత బాగుగాఁదెలియఁబడితివి. మిక్కిలి తిన్నని మార్గమున మమ్ము క్రమముగా నీవు చేర్చుచున్నావు. చెమ్మగలిగించువాఁడా! నీవు సరియైనదారిలో నడిపించుటచేతనే మాపితరులు బుద్ధిమంతులై దేవతలలోనున్న ధనమును బొందిరి.

౯౫౯. త్వంసోమ క్రతుభిః సుక్రతు ర్భూ స్త్వం దక్షైః సుదక్షో విశ్వవేదాః ।
త్వం వృషా వృషత్వేభి ర్మహిత్వా ద్యుమ్నేభి ర్ద్యుమ్న్యభవో నృచక్షాః॥

త॥ ఓ సోమ! నీవు క్రతువులచేత (=కర్మలచే) సుక్రతుఁడవగుచున్నావు. బలము చేత మంచి బలవంతుఁడవు అగుచుంటివి. సర్వధనములుగల నీవు (కోర్కెల) వర్షించుటచేత మాహాత్మ్యముచేతను, (కామ) వర్షివియగుచున్నావు నరులకు (ఫలములను) జూపించుచు హవిస్సులతో నన్నవంతుఁడవగుచున్నావు.

౯౬౦. రాజ్ఞోను తే వరుణస్య వ్రతాని బృహద్గభీరం తవసోమ ధామ ।
శుచిష్ట్వమసి ప్రియోనమిత్రో దక్షాయ్యో అర్యమేవాసి సోమ॥

త॥ ఓ సోమమా! (బ్రాహ్మణులకు) రాజవయినట్టి, (గుప్తలో) మూఁతవేయఁబడినట్టి, నీవే సర్వవ్రతములును, అగుచున్నావు. (సోమమే కర్మలన్నిటికిం బ్రధానమని తా॥) నీతేజస్సు గొప్పది, గంభీరము. సూర్యునివలె (మిత్ర) పవిత్రుఁడవై యుండఁగ ననుకూలుఁడవగుచున్నావు. సోమ! సూర్యుని (అర్యము) వలె సకలమును, వృద్ధిసేయుచున్నావు. (రెండవయర్థము) ఓ సోముఁడా! (చంద్రుఁడని తా॥) నీవ్రతములు రాజగు వరుణునివి. సోముఁడన, దేవతకొకర్థము, సోమమునకు, రెండో అర్థము.

౯౬౧. యా తే ధామాని దివియా పృథివ్యాం యాపర్వతే ష్వోషధీ ష్వప్సు ।
తేభిర్నో విశ్వైః సుమనా అహేళన్రాజ న్త్సోమ ప్రతిహవ్యా గృభాయ॥

త॥ ఓ సోమా! నీకు ద్యులోకమందే కాంతులున్నవో, పృథివిలో నెన్నికలవో, పర్వతములందు, నోషధులందు నెన్నో, ఉదకములలో నెన్నో, ఆ యన్నికాంతులతోను, మంచిమనస్సుకలిగి, కోపములేకుండ నో సోమరాజా! మా హవిస్సుల స్వీకరింపుము.

౯౬౨. త్వంసోమాసి సత్పతి స్త్వంరాజోత వృత్రహా । త్వంభద్రో అసిక్రతుః॥

త॥ ఓ సోమమా! నీవు సత్కర్మలుచేయువారికి అధిపతివి. మఱియు నీవు ప్రకాశించుచున్నవాఁడవై వృత్రుని జంపుచున్నావు. నీవు శోభనమయిన క్రతురూపుఁడవగుచున్నావు.

౯౬౩. త్వంచసోమనో వశో జీవాతుం నమరామహే । ప్రియస్తోత్రో వనస్పతిః॥

దం॥ ఓ సోమ! నీవు మాకు జీవనౌషధము. స్తోత్రమును ప్రేమించువనములకధికారివయిన నీవు మాకు వశమైతే మేము మరణముచెందము.

౯౬౪. త్వంసోమ మహే భగం త్వంయూన ఋతాయతే। దక్షం దధాసి జీవసే॥

దం॥ ఓ సోమ! వృద్ధుఁడైన యజ్ఞకర్తకును, జీవనమునకు సరిపడినంత ధనమునిచ్చుచున్నావు. పిన్నవయసు యజ్ఞకర్తకునుంగూడ ధనమునిచ్చుచున్నావు.

౯౬౫. త్వంనః సోమ విశ్వతో రక్షారాజన్నఘాయతః । నరిష్యేత్త్వావతః సఖా॥

దం॥ ఓ సోమరాజా! పాపాత్ములు మాకుఁదలచిన సర్వబాధలనుండి కాపాడుము. నీవంటివానికి స్నేహితుఁడైనవాఁడు నశింపఁడు.

౯౬౬. సోమ యాస్తే మయోభువ ఊతయఃసన్తి దాశుషే । తాభిర్నోవితాభవ॥

దం॥ ఓ సోమ! యజమానునకు సుఖముకలిగించు నీరక్షణలు ఏవికలవో వానితో మమ్ము రక్షించుము.

౯౬౭. ఇమం యజ్ఞమిదం వచోజుజుషాణ ఉపాగహి । సోమత్వం నోవృధేభవ॥

దం॥ సోమ! యీ చేయుచున్న యజ్ఞమును స్తుతిని నీవు సేవించుచు సమీపమునకు రమ్ము. మావృద్ధికొఱకుంగమ్ము.

౯౬౮. సోమ గీర్భిష్ట్వా వయం వర్ధయామో వచోవిదః । సుమృళీకోన ఆవిశ॥

దం॥ స్తుతివాక్యనెఱింగిన మేము సోమా! మావాక్యలతో నిన్ను వృద్ధిపఱచుచున్నాము. మంచిసుఖముంగలిగించుచు మమ్ముంజేరుము.

౯౬౯. గయస్ఫానో అమీవహా వసువిత్పుష్టివర్ధనః । సుమిత్రః సోమనోభవ॥

దం। సోమ! నీవు ధనమును వృద్ధిపఱచునట్టి, రోగముల నణఁచునట్టి, ధనమును జెందఁజేయునట్టి, పుష్టినిగలిగించునట్టి, మంచిమిత్రులుగలట్టి, వాఁడవుగమ్ము.

౨౦. స్తోమ రారన్ధినో హృది గావోన యవసేష్వా । మర్యఇవ స్వఓక్యే॥

వం॥ గోవులు మంచితృణమునందుఁ బ్రీతినొందునట్లు మనుష్యుఁడు తనయింటిలో ప్రీతిచెందునట్లు; ఓ సోమా! మాహృదయమందు ప్రీతిచెందియుండుము.

౨౧. యః సోమ సఖ్యే తవరారణ ద్దేవ మర్త్యః । తందక్షః సచతే కవిః॥

వం॥ ప్రకాశించునట్టి, యోసోమ! నీసఖ్యమునకై యేనరుఁడు స్తుతించునో అతనిని తెలివికలవాఁడవును సమర్థుఁడవును అగు నీవనుగ్రహింతువు.

౨౨. ఉరుష్యాణో అభిశస్తేః సోమ నిపాహ్యంహసః । సఖాసుశేవ ఏధినః॥

వం॥ ఓ సోమ! నీవు మమ్ములను నిందనుండిరక్షింపుము పాపమునుండి చక్కఁగా రక్షింపుము. సుఖవంతుఁడవై మాకు హితమును గలుగఁజేయుము.

౨౩. ఆప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణ్యమ్ । భవా వాజస్యసఙ్గథే॥

వం॥ సోమ! నీవు వృద్ధిపఁబడుము. అన్నిచోట్లనుండి సామర్థ్యము నిన్ను జెందుఁ గాక. నీవు అన్నముఁగ్గజేయువాఁడవుకమ్ము.

౨౪. ఆప్యాయస్వ మదిన్తమ సోమ విశ్వేభి రంశుభిః ।

భవానః సుశ్రవస్తమః సఖావృధే॥

వం॥ మిక్కిలిమదించిన సోమ! సమస్తలతావయవములతో బాగుగవృద్ధినొందుము. నీవు మంచియన్నవిశేషముకలిగి మావృద్ధికై సఖుఁడవుకమ్ము.

౨౫. సంతేపయాంసి సముయన్తువాజాః సంవృష్ణ్యా న్యభిమాతిషాహః ।

ఆప్యాయ మానో అమృతాయ సోమ దివిశ్రవాంస్యుత్తమాని ధిష్వ॥

వం॥ సోమా! కాఁచుటకుఁదెచ్చినపాలు శత్రుసంహారకుఁడవయిన నిన్ను జేరుఁ గాక. హవిర్లక్షణాన్నములుకూడ నిన్ను జేరుఁగాక. సామర్థ్యముకూడ నిన్ను జెందుఁ

గాక. మరణము లేకుండుటకు వృష్టినందుచు ద్యులోకమందు తత్కృష్టములైన యన్నము లను ధరింపుము.

౯౭౬. యా తే ధామాని హవిషా యజన్తి తా తే విశ్వా పరిభూరస్తు యజ్ఞమ్।
గయస్ఫానః ప్రతరణః సువీరో వీరహా ప్రచరా సోమ దుర్యాన్॥

వం॥ సోమ! (యజమానులు) నీ తేజస్సులను బూజింతురు. ఆనీ యన్ని తేజస్సులును మా యజ్ఞమునంతటను వ్యాపించుఁగాక. తరతరాల గృహములను వృద్ధిసేయువాఁడవును, బాపములనుండి తొలఁగించువాఁడవును, వీరపురుషులతోఁగూడినవాఁడు పుత్రులను జంపనివాఁడవును, అగుచు మా యజ్ఞగృహము జేరుము.

౯౭౭. సోమో ధేనుం సోమో అర్వన్తమాశుం సోమో వీరం కర్మణ్యం దదాతి।
సాదన్యం విదథ్యం సభేయం పితృశ్రవణం యో దదాశదస్మై॥

వం॥ ఏ యజమానుఁడు సోమునకు హవిస్సులనిచ్చునో వానికి సోముఁడు పాలావు నిచ్చును. శీఘ్రమైన గుఱ్ఱమునిచ్చును. కర్మలలో నేర్పరియు, ఇంటి కుపయోగించు వాఁడును, యజ్ఞార్హుఁడును, సభకెక్కువాఁడును, తండ్రికిఁగీర్తితెచ్చువాఁడును, అగు కొమారు నిచ్చును.

౯౭౮. అషాఢం యుత్సు పృతనాసు పప్రిం స్వర్షామప్సాం వృజనస్య గోపామ్।
భరేషుజాం సుక్షితిం సుశ్రవసం జయన్తం త్వామను మదేమ సోమ॥

వం॥ యుద్ధములందుఁ దిరస్కరింపఁబడనివాఁడును, సేనలలో జయముకూర్చు వాఁడును, స్వర్గమునిచ్చువాఁడును, వర్షోదకములిచ్చువాఁడును, బలమును రక్షించు వాఁడును, యజ్ఞములందుఁ బుట్టినవాఁడును, మంచి నివాసముకలవాఁడును, సత్కీర్తి కలవాఁడును, శత్రువుల జయించువాఁడును, అగు నిన్ను జూచి సోమా! గర్వించు చున్నాము.

౯౭౯. త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వం గాః।
త్వమా తతన్థోర్వన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ॥

సం॥ ఓ సోమా! నీవు ఈ యోషధులన్నిటిని ఉత్పాదించితివి. ఉదకములను సమస్త గోవులను ఉత్పాదించితివి, అంతరిక్షమును విస్తరింపఁజేసితివి, చీకటిని ప్రకాశముతోఁ బోఁగొట్టితివి.

ఋ. ౨౩. దేవేన నో మనసా దేవ సోమ రాయో భాగం సహసావ న్నభి యుధ్య ।

మా త్వా తన దీశిషే వీర్య స్యోభయేభ్యః ప్రచికిత్సా గవిష్టౌ॥

సం॥ ప్రకాశముగల్గి బలవంతుండవైన సోమ! ప్రకాశించునట్టి నీబుద్ధితో ధనముయొక్క భాగమును మమ్ముంగూర్చి ప్రేరింపుము. నిన్ను ఏ శత్రువును గష్టపెట్టలేదు. ఇద్దఱియొక్క, (నీయొక్క, శత్రువుయొక్క,) వీర్యమునకు నీశ్వరుండవు నీవు. ఆ నీవు యుద్ధమందు (ఉపద్రవమును) పరిహరింపుము.

—:-౦-:—

## సూక్తము. ౯౨.

(ఋషి - గోతముఁడు; దేవత - ఉషస్సు, అశ్వినులు, ఛందస్సు - ౧-౪ జగతి; ౫-౧౨ త్రిష్టుప్; ౧౩-౧౮ ఉష్ణిక్కు)

ఋ. ౧. ఏతా ఉ త్యా ఉషసః కేతు మక్రత పూర్వే అర్ధే రజసో భాను మఞ్జతే ।

నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః ప్రతిగావో రుషీర్యన్తి మాతరః॥

సం॥ ఆ యీ యుషస్సులు ప్రకాశమును గలిగించెను. (కనుకనే) అంతరిక్షపూర్వార్ధమందు సూర్యునిం బయలువఱచినవి. యుద్ధముచేయువారు తమయాయుధముల వలెను; గమనశీలములు, తళతళ మెఱయుచున్నట్టి, సూర్యకాన్తిని గలుగఁజేయునట్టి, యుషస్సులు ప్రతిదినమునను (జగత్తును) సంస్కరించుచున్నవి.

ఋ. ౨. ఉద పప్త న్నరుణా భానవో వృథా స్వాయుజో అరుషీర్గా అయుక్షత ।

అక్ర న్నుషాసో వయునాని పూర్వథా రుశన్తం భాను మరుషీ రశిశ్రయుః॥

సం॥ అత్యంతము ప్రకాశించుచున్న కిరణములు తమంతతామే యుక్తములయినవి. ఉషస్సులు సులభముగాఁ బూన్పదగిన శుభ్రవర్ణములయిన మొదటి కిరణము

లను రథమందుఁ బూన్చినవి, (ఇట్లు రథమెక్కిన) ఉషస్సులు పూర్వమువలెనె (సర్వప్రాణులకు) జ్ఞానమును గలిగించినవి. తరువాత బాగుగఁ బ్రకాశించునట్టి యుషస్సులు శుభ్రవర్ణముగల సూర్యుని సేవించినవి. (ఉషస్సుల మొదటి కిరణములు గుఱ్ఱములని, తరువాతి కిరణములు రథమని వర్ణింపఁబడెను.)

౯౨౩. అర్చన్తి నారీ రపసో న విష్టిభిః సమానేన యోజనే నా పరావతః ।

ఇషం వహన్తీః సుకృతే సుదానవే విశ్వేదహ యజమానాయ సున్వతే ॥

దం॥ శోభనకర్మలు చేయునట్టి, ఋత్విక్కులకు దక్షిణారూపమైన ధనమునిచ్చునట్టి, సోమాభిషవమును జేయునట్టి, యజమానునకు సర్వవిధములగు నన్నమును దీసికొని వచ్చుచున్నవై నడిపించునట్టి, యుషస్సులు; యోధులు తమ యాయుధముల ధాటితో జగత్తు నంతటిని యొకేమారు వ్యాపించినట్లు; తమ తేజస్సులతో (తూర్పు నుండి) పశ్చిమదిక్కునఱకును అంతరిక్షమునందు వ్యాపించినవి.

౯౨౪. అధి పేశాంసి వపతే నృతూరి వాపోర్ణుతే వక్ష ఉస్రేవ బర్జహమ్ ।

జ్యోతి ర్విశ్వస్మై భువనాయ కృణ్వతీ గావో న వ్రజం వ్యు షా ఆవ స్తమః ॥

దం॥ నంగలి వెంట్రుకలు గోయునట్లు; ఉషస్సు చీకట్లను గోయుచున్నది. - (పాలు పిదుకునపుడు) ఆవు పొదుగును వెలిచునట్లు; తనవక్షస్థలమును విశాలము చేసి తన వెలి చుచున్నది. గోవులు తమమందను బొందినట్లు తూర్పుదిక్కునుబొంది యుష సమస్త ప్రపంచమునకును దేజస్సును గలిగించుచుఁ జీకటిని దొలంగించుచున్నది.

౯౨౫. ప్రత్యర్చీ రుశదస్యాః అదర్శి వితిష్ఠతే బాధతే కృష్ణ మభ్వమ్ ।

స్వరుం న పేశో విదథే ష్వఞ్జఞ్చిత్రం దివో దుహితా భానుమశ్రేత్ ॥

దం॥ ఈయుషస్సు యొక్క ప్రకాశించుచున్న తేజస్సు (మొదటఁ దూర్పున) గనఁబడెను. (తరువాత) అంతటను వ్యాపించెను. అధికమగు చీఁకటిని నశింపఁజేయుచున్నది. యజ్ఞములందు స్వరువను పేరుగ యూపమందున్న చిన్న శకలమును (=ముక్క) ఋత్విజులు నేతితోఁ బూయునట్లు ఉష తన కాంతి నంతటను బూయుచున్నది.

౯౩౬. అతారిష్మ తమసస్పార మస్యోషా ఉచ్ఛన్తీ వయునా కృణోతి ।
శ్రియే ఛన్దోన స్మయతే విభాతీ సుప్రతీకా సౌమనసా యాజీగః॥

దం॥ ఈరాత్రి సంబంధి చీఁకటి చివరను ఉషస్సు పుట్టెను. చీఁకటిని బోఁగొట్టుచు ప్రాణులన్నిటికిని విజ్ఞానమును గలిగించెను. సంపద కోరి యాచకుఁడు ధనవంతుని వద్దకుఁబోయి నవ్వునట్లు ఉష తవకాంతితో నవ్వుచున్నట్లుండెను. ఇట్లు చక్కని శోభకలదై యందరి యానందము కొఱకుఁ జీఁకటిని భక్షించెను

౯౩౭. భాస్వతీ నేత్రీ సూనృతానాం దివస్తవే దుహితా గోతమేభిః ।
ప్రజావతో నృవతో అశ్వబుధ్యా నుషోగోఅగ్రాఉపమాసి వాజాన్॥

దం॥ తేజోవతియై సత్యప్రియ వచనము గలిగించునట్టి ద్యులోక పుత్రికయైన యుష గోతమఋషులచేత స్తుతింపఁబడుచున్నది. ఓ యుషా! పుత్ర పౌత్రులు గలిగి, నౌకరులు గలిగి, గుఱ్ఱములు, గోవులు మొదలగు పశుసంతతి గలిగిన యన్నములను (మాకు) యిమ్ము.

౯౩౮. ఉష స్తమశ్యాం యశసం సువీరం దాసప్రవర్గం రయిమశ్వ బుధ్యమ్ ।
సుదంససా శ్రవసా యావిభాసి వాజప్రసూతా సుభగే బృహన్తమ్॥

దం॥ ఓ యుషోదేవీ! కీర్తితోఁగలిసిన యోగ్య పుత్రులుగల, మంచి నౌకరులుగల గుఱ్ఱములు మొదలగునవికల యాధనములను మేము పొందుదుముగాక. మంచిధనము గలదానా! శుభకర్మలతోఁగూడిన స్తుతిచేత నన్నములను గలిగించుచు గొప్పదగు నేధనమును (మాకుఁ) జూపింతువో ఆధనమును మేము పొందుదుముగాకయని పూర్వవాక్యాన్వయము.

౯౩౯. విశ్వాని దేవీ భువనాభి చక్ష్యా ప్రతీచీ చక్షు రుర్వియా విభాతి ।
విశ్వం జీవం చరసే బోధయన్తీ విశ్వస్యవాచ మవిదన్మనాయోః॥

దం॥ ప్రకాశమానయగు నుష సర్వలోకమును ప్రకాశింపఁజేసి సర్వమానవాభిముఖయై దృష్టినిగలిగించునదియగు నధికముచేయుచున్నదై విరాజిల్లెను. సర్వప్రాణులను ఉష నటు తిరుగుటకుఁ బ్రేరేపించుచు ఉష ప్రాణులయొక్క మనస్సుతోఁ గూడిన వాక్కును బొందును.

౯౯౦. పునః పునర్జాయమానా పురాణీ సమానం వర్ణమభిశుమ్భమానా।

శ్వఘ్నీవ కృత్నుర్విజ ఆమినానా మర్త్యస్య దేవీ జరయన్త్యాయుః॥

దం॥ (ప్రతిదినము ఉదయమందు) మరలమరలఁబుట్టుచున్నదియు, చాలకాలము నాఁటిదియు, ఒక్కరంగుతోనే ప్రకాశించునదియు నయివెలుంగు నుష; హింసాశీలయగు ఎఱుకత (=వ్యాధస్త్రీ) పక్షుల యాయువునువలె; మర్త్యుల యాయువును తగ్గించుచున్నది. (ఇచట మర్త్యులనఁగా మరణధర్మముగల ప్రాణులన్నిటి యని తా॥)

౯౯౧. వ్యూర్ణ్వతీ దివో అన్తాఁ అబోధ్యప స్వసారం సనుతర్యుయోతి।

ప్రమినతీ మనుష్యా యుగాని యోషా జారస్య చక్షసా విభాతి॥

దం॥ అంతరిక్షముయొక్క అంతమునుండి చీఁకటిని నివారించుచు ఉష తెలియంబడినది. (తరువాత) తనంతతానే జారిపోవుచున్న (రాత్రిని) యొక్కడనో త్రోసివేసెను. మనుష్యుల సంబంధమైన (కృతాది) యుగములను దగ్గించుచున్నదై సూర్యభార్యయగు నుష తనకాంతితో వెలుఁగుచున్నది.

౯౯౨. పశూన్న చిత్రా సుభగా ప్రథానా సిన్ధుర్న క్షోద ఉర్వియా వ్యశ్వైత్।

అమినతీ దైవ్యాని వ్రతాని సూర్యస్య చేతి రశ్మిభిర్దృశానా॥

దం॥ చక్కని ధనముగలిగి పూజనీయురాలగు నుష పశువులను గోపాలురడవిలోఁ బ్రసరింపఁజేయునట్లు (తన తేజస్సులను) విస్తరింపఁజేయుచుఁ దాను వృద్ధినందె ఉదకము పల్లపు నేలకుఁజేరి వ్యాపించునట్లు జగత్తంతటను తనకాంతులను వ్యాపింపఁజేసెను. అయుష దేవసంబంధ కర్మలను చక్కఁబఱచుచు సూర్యకిరణములతోఁగలిసి కనంబడెను.

౯౯౩. ఉష స్తచ్చిత్ర మాభరా స్మభ్యం వాజినీవతి ।

యేన తోకంచ తనయంచ ధామహే॥

దం॥ హవిరాద్యన్నక్రియలుగల యుషాదేవతా! దేనితో మేము పుత్రపౌత్రులను భరింతుమో యట్టి యోగ్యమయిన ధనమునిమ్ము.

౯౯౪. ఉషో అద్యేహ గోమత్యశ్వావతి విభావరి ।

రేవ దస్మే వ్యుచ్ఛ సూనృతావతి॥

దం॥ గోవులతోఁ గూడినట్టి, యశ్వములుగలట్టి, విశేషకాంతి గలట్టి, సత్యప్రియ వాక్యములుగలట్టి యోయుషా! ఈచోట నుదయకాలమందుమాకు ధనవంతమగు కర్మ సాగునట్లు చీఁకటిఁ దొలఁగింపుము. (తెల్లవారించుమని తా.)

౯౯౫. యుక్ష్వాహి వాజినీవత్యశ్వా అద్యారుణా ఉషః ।

అథానో విశ్వా సౌభగా న్యావహ॥

దం॥ హవిస్సు మొదలగు నన్నక్రియలు జరుపు నుషోదేవతా! ఎఱ్ఱరంగుగల గుఱ్ఱములను ఈకాలమందుఁ దప్పక (రథమునకు) పూనించుము. సమస్త సౌభాగ్యములు మాకుఁగలుగఁజేయుము.

౯౯౬. అశ్వినావ ర్తి రస్మ దాగోమ ద్దస్రా హిరణ్యవత్ ।

అర్వాగ్రథం సమనసా నియచ్ఛతమ్॥

దం॥ అశ్వినీదేవతలారా! శత్రువుల నణంచుచున్నవారై మీరు (మాకు) జీవనాధారమయిన గృహమును జాలగోవులు గలదిగాను, బంగారు కలదిగాను అగునట్లు ఏకమనస్సుగల మీరు మీరథమును మాయింటి కభిముఖముగాఁ దోలుకొనిరండు.

౯౯౭. యావిత్థా శ్లోకమాదివో జ్యోతిర్జనాయ చక్రథుః ।

ఆన ఊర్జం వహత మశ్వినా యువమ్॥

దం॥ ఓ యశ్వినులారా! యే మీ యుద్ధము య మ్యాలోకమునుండి స్తుతింపఁదగిన తేజస్సును యిట్టు జనులకొఱకుఁ గలిగించితిరో యట్టి మీరు మాకు బలమునిచ్చు నన్నమునిండు. (సూర్య చంద్రులకే యశ్వినులని పేరు కొందఱిమతము)

౯౯౮. ఏహ దేవా మయోభువా దస్రా హిరణ్యవర్తనీ।

ఉషర్బుధో వహన్తు సోమపీతయే॥

దం॥ తెల్లవారఁగానే మేల్కొనిన (గుఱ్ఱములు) ఈ యాగమందు సోమపానము కొఱకు సుఖమును గలిగించునట్టి, శత్రువుల నణంచునట్టి సువర్ణమయములైన మార్గములుగల యశ్వినీదేవతలను దోడ్కొనివచ్చుఁగాక!

---

సూక్తము ౯౩.

(ఋషి - గోతముఁడు; దేవత - అగ్నీషోములు; ఛందస్సు - ౧-౩ అనుష్టుప్; ౯-౧౧ గాయత్రి; ౮ జగతి; ౪, ౫, ౬, ౭, ౧౨ త్రిష్టుప్.)

౯౯౯. అగ్నీషోమా విమం సుమే శృణుతం వృషణా హవమ్।

ప్రతి సూక్తాని హర్యతం భవతం దాశుషే మయః॥

దం॥ వర్షించునట్టి అగ్నిషోములారా! యిప్పటి మాపిలుపును చక్కఁగా వినుఁడు. మేము చక్కఁగా నుచ్చరించిన స్తుతులను ఒక్కొక్కరు కోరుకొనుఁడు- యజమానునకు సుఖమునిచ్చువారుకండు.

౧౦౦౦. అగ్నీషోమా యో అద్య వామిదం వచః సపర్యతి।

తస్మై ధత్తం సువీర్యం గవాం పోషం స్వశ్వ్యమ్॥

దం॥ ఏ యజమానుఁడు ఈ కర్మయందు నీ స్తుతిరూపవాక్యను మీకుఁ బూజగా నిచ్చెనో వానికి మంచిసామర్థ్యము, చక్కని గుఱ్ఱములు గల్గిన గోవుల యభివృద్ధిని గలుగ జేయుఁడు.

౧౦౨౧. అగ్నీషోమా య ఆహుతిం యో వాం దాశాద్ధవిష్కృతిమ్ ।
స ప్రజయా సువీర్యం విశ్వమాయుర్వ్యశ్నవత్ ॥

వం॥ అగ్నీషోములారా! ఏయజమానుఁడు ఆజ్యాహుతిని మీయిద్దఱకు నిచ్చునో అట్లుగాక (చరు-పురోడాశాది) పురోడాశాదులుగల యాహుతిని గానియిచ్చునో యాతఁడు సంతతితోఁ గూడిన మంచివీర్యముగల సంపూర్ణాయువును బొందును.

౧౦౨౨. అగ్నీషోమా చేతి తద్వీర్యం వాం యదముష్ణీతమవసం పణిం గాః ।
అవాతిరతం బృసయస్య శేషోఽవిన్దతం జ్యోతిరేకం బహుభ్యః ॥

వం॥ ఏవీర్యముచేత గోహరణమును సన్నమును పణియను వానినుండి మీరపహరించితిరో యగ్నీషోములారా! ఆమీయిద్దఱి సామర్థ్యము (మాకుఁదెలిసెను) బృసయుఁడను అసురుని సంతానమును (అనఁగా బృసయుఁడని త్వష్టకు నామాంతరము- అతని కొడుకు వృత్రుఁడు) సంహరించితిరి. తరువాతఁ బ్రకాశించుచున్న సూర్యునొకని బహుజనులకొఱకు సంపాదించితిరి.

౧౦౨౩. యువమేతాని దివి రోచనాన్యగ్నిశ్చ సోమ సక్రతూ అధత్తమ్ ।
యువం సిన్ధూఁరభిశస్తేరవద్యాదగ్నీషోమావముఞ్చతం గృభీతాన్ ॥

వం॥ ఓ సోమా! నీవును, అగ్నియు సమాన కర్మలు గలవారే యగుచు (మేము రాత్రి జూచుచున్న) నక్షత్రాది జ్యోతిస్సులను ద్యులోకమందు నిలిపితిరి- అగ్నీషోములారా! నదులకు సర్వత్రా ప్రకటితమయినపాపమును దొలఁగించితిరి (ఇంద్రుఁడువృత్రాసురుని చంపినందున వచ్చినబ్రహ్మహత్యను నదులకును, స్త్రీలకును, వృక్షములకును, భూభాగములకును బంచిపెట్టితాను శుద్ధుఁడయినాఁడట. ఆనదులపాపము నీయగ్నీషోములు పాపినారట! )

౧౦౨౪. ఆన్యం దివో మాతరిశ్వా జభారామథ్నాదన్యం పరి శ్యేనో అద్రేః ।
అగ్నీషోమా బ్రహ్మణా వావృధానోరుం యజ్ఞాయ చక్రథురు లోకమ్ ॥

దం॥ అగ్నీషోములారా! మీలో నొకనిని (అగ్నిని) మాతరిశ్వుడు (వాయువు) స్వర్గలోకము నుండి (భృగువు కొఱకు) తెచ్చెను. రెండవవానిని సోముని డేగ (గాయత్రి) మేరుపర్వతము మీఁదనుండి తీసికొనివచ్చెను. మీరు మంత్రముచేత వృద్ధి పొందినవారై మీరిద్దఱును యజ్ఞముకొఱకై లోకమును విస్తృతము చేసితిరి. (అగ్నిలో రెండుభాగములుచేసి రెండుచివరలను అగ్నీషోములకు హోమము చేతురు. ఆమధ్యనితర దేవతలకు హోమము చేతురు. మీరిద్దఱు యితర దేవతల యజ్ఞముకొఱకు చోటు చేసిరను తాత్పర్యముతో నిట్లు వర్ణించినాడు.)

౧౦౦౫. అగ్నీషోమా హవిషః ప్రస్థితస్య వీతం హర్యతం వృషణా జుషేథామ్ ।
సుశర్మాణా స్వవసా హి భూతమథా ధత్తం యజమానాయ శం యోః॥

దం॥ అగ్నీషోములారా! (హోమార్థమై యాహవనీయ స్థానమునకు) తేఁబడిన హవిస్సును భక్షింపుఁడు. (పిమ్మట) మమ్మును గోరుఁడు. వర్షము గురిపించు వారలారా! మాసేవను గైకొనుఁడు. మంచి సుఖముకలవారలై శుభమయిన రక్షణకల వారలుకండు. అనంతరము యజమానునకు రోగశాంతిని, భయపరిహారమును జేయుదురుగాక!

౧౦౦౬. యో అగ్నీషోమా హవిషా సపర్యాద్దేవద్రీచా మనసా యో ఘృతేన ।
తస్య వ్రతం రక్షతం పాతమంహసో విశే జనాయ మహి శర్మ యచ్ఛతమ్॥

దం॥ ఏయజమానుఁడు అగ్నీషోములను దేవతలందు భక్తిగల మనస్సుతోఁ గూడి హవిస్సులతోను, నేతితోను సేవించునో యా యజమానుని కర్మను రక్షింపుఁడు. (యాగమందు) ప్రవేశించిన యజమానునకు విస్తారమయిన సుఖమునిండు.

౧౦౦౭. అగ్నీషోమా సవేదసా సహూతీ వనతం గిరః । సం దేవత్రా బభూవథుః॥

దం॥ అగ్నీషోములారా! మీరు సమాన (హవిస్సులను) ధనముగలవారు (అనఁగా మీరిద్దఱకు నొకటే యాహుతినిత్తురు.) సమానాహ్వానము కలవారును, అగుచు మా స్తుతులనంగీకొనుఁడు. సర్వదేవతలందు మీరిద్దఱు నుతికెక్కినారు.

యోగ్యమయిన మనస్సు మంగళమగునదికదా! అగ్నీ! నీయొక్క స్నేహముండఁగా మేము కష్టము నొందము. (మిగిలినది పూర్వవతు.)

౧౦౧౨. యస్మై త్వమాయజసే ససాధ త్యనర్వా క్షేతి దధతే సువీర్యమ్॥
సతూతావ నైనమశ్నో త్యంహతి రగ్నే సఖ్యే మారిషామావయంతవ॥

దం॥ అగ్నీ! యేయజమానునికై నీవు దేవతలను యజించుచున్నావో ఆ యజమానుఁడు అన్ని కార్యములను సాధించగలఁడు. అతఁడు శత్రువుచేతఁ దిరస్కరింపఁబడక ఉండును. మంచి బలమును, ధనమును బొందును. వృద్ధినొందును. ఇతనిని దరిద్రత్వము చేరదు, శేషము పూర్వవతు.

౧౦౧౩. శకేమ త్వాసమిధం సాధయా ధియస్త్వే దేవా హవిరదం త్యాహుతమ్ ।
త్వమాదిత్యాఁ ఆవహ తాన్హ్యు౧ శ్మస్యగ్నే సఖ్యేమారిషామా వయంతవ॥

దం॥ అగ్నీ! నిన్ను వృద్ధినొందువానిఁగాఁ జేయఁగలము. నీవు కూడ మాకర్మలను సాధింపుము. నీయందు హోమము చేసిన హవిస్సును దేవతలు భక్షించుచున్నారు. నీవు దేవతలఁదీసికొనిరమ్ము. మేము వారిఁగోరుచున్నాము. (తక్కినది సమానము)

౧౦౧౪. భరామేధ్మం కృణవామా హవీంషి తేచితయన్తః పర్వణా పర్వణావయమ్।
జీవాతవే ప్రతరం సాధయా ధియోగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

దం॥ ఓయగ్నీ! సమిధలను సంపాదించుచున్నాము. ప్రతి పర్వమందు (అనగాఁ బున్నమ, అమావాశ్య) నిన్ను ధ్యానించుచు హవిస్సులను జేయుచున్నాము. అట్టినీవు మేము చిరకాలము జీవించుటకు అగ్నిహోత్రాది కర్మల నెరవేర్పుము. అగ్నీ! నీస్నేహమున్నపుడు మాకేమికొఱత?

౧౦౧౫. విశాం గోపా అస్యచరన్తి జన్తవో ద్విపచ్చ యదుత చతుష్పదక్తుభిః ।
చిత్రః ప్రకేత ఉషసో మహాఁ అస్యగ్నే సఖ్యేమారిషామా వయంతవ॥

వం॥ ఈయగ్ని కిరణములు సర్వ ప్రాణులకు రక్షకములై యున్నవి ద్విపాద (=మనుష్యులు మొ.) చతుష్పాద (గోవులు మొ.) జంతువులు ఆ కిరణములతోఁ గూడియున్నవి. అగ్నీ! చిత్రకాంతి కలట్టి, తేజస్సును గలిగించునట్టి నీవు ఉషస్సు కంటె గుణములెక్కువ గలవాఁడవయి యున్నావు. నీస్నేహమున్నప్పుడు ఇత్యాది పూర్వవతు.

౧౦౧౬. త్వమధ్వర్యురుత హోతాసి పూర్వ్యః ప్రశాస్తా పోతా జనుషా పురోహితః ।
విశ్వా విద్వా ఆర్త్విజ్యా ధీరపుష్య స్యగ్నే సఖ్యే మారిషామ వయంతవ॥

వం॥ ఓయగ్నీ! నీవే అధ్వర్యుఁడవు. (యజుర్వేద కర్మలు నడిపించు ఋత్విజుని పేరు) నీవు హోతవు (ఋగ్వేదకర్మలు నడిపించు ఋత్విజుఁడు) అగుచున్నావు. ప్రశాస్త, పోత అను ఋత్విజుల రూపమున ముఖ్యుఁడవయి యున్నావు. సహజముగా పూర్వ దిక్కున నున్నవాఁడవు. లేక యాగమునకుఁ బురోహితుఁడ వగుచున్నావు. కనుక సకల ఋత్విక్కుల పనులను దెలిసికొనుచుఁ బ్రాజ్ఞుఁడవయి కర్మలనన్నిఁటిని బోషింఁ చుచున్నావు. ఇతరము పూర్వవతు.

౧౦౧౭. యోవిశ్వతః సుప్రతీకః సదృఙ్ఙసి దూరేచి త్సన్తళిదివాతి రోచసే ।
రాత్ర్యాశ్చిదన్ధో అతిదేవ పశ్య స్యగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

వం॥ సుందరాంగములుకల నీవంతటికంటె సదృశుఁడవు దూరముండున్నను సమీప మందున్నట్లు ప్రకాశింతువు. రాత్రి చీఁకటిని మించి వెలుఁగుదువు. నీ స్నేహమున్న పుడగ్నీ! ఇత్యాది,

౧౦౧౮. పూర్వో దేవా భవతు సున్వతో రథోస్మాకం శంసో అభ్యస్తు దూఢ్యః ।
తదాజానీ తోత పుష్యతా వచోగ్నే సఖ్యే మారిషా మావయంతవ॥

దం॥ సర్వదేవతలారా! సోమరసము తీయునట్టి యీయజమానుని రథము ముఖ్య మయిన దగుఁగాక! దుష్బుద్ధియగు మాశత్రువునకు మాశాపము తగులుఁగాక! అట్టి నావాక్కును దెలిసికొనుఁడు. మఱియుఁ దానిని (ఆవాక్కును) పోషించుఁడు. నేన న్నట్లు జరుగనిండని తా.) పూర్వవతు.

౧౦౧౯. వధైర్దుః శంసా అపదూఢ్యో జహి దూరే వాయే అన్తివా కేచిదత్రిణః।

అథా యజ్ఞాయ గృణతే సుగం కృధ్యగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

దం॥ అగ్నీ! నీవాయుధములచేత చెప్పరానిని దుర్బుద్ధులను జంపుము. ఎవరు దూరమందుండనీ, దగ్గఱనుండనీ, సర్వనాశకులగు రాక్షసాదులను జంపుము. తరువాత యాగకర్తకు సరియైన దారిని గనుబఱచుము ఇత్యాది.

౧౦౨౦. యదయుక్థా అరుషా రోహితా రథే వాతజూతా వృషభస్యేవ తేరవః।

ఆదిన్వసి వనినో ధూమకేతు నాగ్నే సఖ్యే మారిషా మావయంతవ॥

దం॥ ఓ యగ్నీ! ఎఱ్ఱనిరంగుగల్గి ప్రకాశించుచు వాయువేగముగల గుఱ్ఱములను నీరథమందెపుడు నీవు పూన్చుదువో యపుడు అరణ్యములను దహించు నీయొక్క ధ్వని వృషభము అంకెవాటివలెనగుచున్నది. తరువాత అరణ్యవృక్షములను పొగయను జండాతో వ్యాపించుచున్నావు. ఇత్యాది పూ॥

౧౦౨౧. అధస్వనాదుత బిభ్యుః పతత్రిణో ద్రప్సా యత్తే యవసాదో వ్యస్థిరన్।

సుగంతత్తే తావకేభ్యో రథేభ్యోగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

దం॥ అడవుల కాల్పఁ బ్రవేశించిన తరువాత నో యగ్నీ! నీ ధ్వనివల్లఁ బక్షులుకూడ భయపడుచున్నవి. అట్టి నీమంటల చివరలు గడ్డిని తినుట కొఱకునపుడు నీకడవియంతయు సుఖముగా నీయొక్క రథములు గమించుటకగుచున్నది. ఇత్యాది పూ॥

౧౦౨౨. అయం మిత్రస్య వరుణస్య ధాయసేవయాతాం మరుతాం హేళో అద్భుతః।

మృళాసునో భూత్వేషాం మనః పునరగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

దం॥ ఈయజమానుడు లేక స్తుతికర్త, మిత్రునియొక్కయు వరుణునియొక్కయు పోషణకొఱకు నగుఁగాక. అంతరిక్షమున సంచరించెడు మరుత్తులయొక్క కోపమధికమగుచున్నది. ఈ మరుత్తులమనస్సు తిరిగి సమరసమై మమ్ము సుఖించుఁగాక అగ్నీ! నీసఖ్యమిత్యాది. (అగ్నిని స్తుతించుటచేత మరుత్తులకుఁ గోపమువచ్చెనని దానిని శాంతి పరుపుమని ప్రార్థన).

౧౦.౨౩. దేవో దేవానా మసి మిత్రో అద్భుతో వసు ర్వసూనా మసి చారు రధ్వరే।
శర్మన్త్స్యామ తవ సప్రథ స్తమేగ్నే సఖ్యే మారిషామా వయంతవ॥

ద॥ ఓయగ్నీ! నీవు ప్రకాశించుచు నెల్లదేవతలకు గొప్ప మిత్రుఁడవగుచున్నావు. మనోహరుఁడవు నగుచున్నావు. యజ్ఞమందు ధనములకు నివాసస్థానమవగుచున్నావు. మిక్కిలి యధికమయిన నీయాగశాలలో నుందుముగాక. తక్కినది పూర్వవతు.

౧౦.౨౪. తత్తే భద్రం యత్సమిద్ధః స్వేదమే సోమాహుతో జరసే మృళయత్తమః॥
దధాసిరత్నం ద్రవిణంచ దాశుషేగ్నే సఖ్యేమా రిషామావయంతవ॥

ద॥ ఓయగ్నీ! నీస్వగృహమందు (అనగా ఉత్తరవేదిమీద) ప్రజ్వలించి సోమరసముతోఁ దృప్తినంది స్తుతింపఁ బడుచున్నావనునది నీకుఁ బ్రశంసనీయము. ఇట్లు మిగుల సుఖమునిచ్చువాఁడవయి రమణీయఫలములను, ధనమును గూడ యాగకర్తకు నిచ్చుచున్నావు. ఇత్యాది పూ॥

౧౦.౨౫. యస్మైత్వం సుద్రవిణో దదాశోనాగాస్త్వ మదితే సర్వతాతా।
యంభద్రేణ శవసా చోదయాసి ప్రజావతారా ధసా తేస్యామ॥

ద॥ ఎవుఁడవ ధనముగల్గి ఖండింప శక్యముగాని ఓయగ్నీ! సమస్తయాగముల యందుఁ బ్రవర్తించు నే యజమానునకు పాపము లేకుండఁజేసి కర్మాధిష్ఠాతను ఇచ్చుచున్నావో, ఏ యజమానుని శుభమగు బలముతోఁ గూర్చుచున్నావో ఆ యజమానుఁడు సమృద్ధుఁడగుచున్నాడు. మేము సంతానముతోఁగూడిన యన్నముతో లేక ధనముతో నుందుముగాక. అగ్నీ! నీస్నేహమున్నపుడు మాకుఁగొఱతయేమి?

౧౦.౨౬. సత్వమగ్నే సౌభగత్వస్య విద్వా నస్మాక మాయుః ప్రతిరేహ దేవ।
తన్నోమిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉతద్యౌః॥

ద॥ ఓయగ్నిదేవా! అట్టి నీవు సౌభాగ్యము నెఱుంగుచు ఈ యాగకర్మయందు మా నాయుష్యాయువును వృద్ధినొందింపుము. నీవు చేసిన యాయాయువు మిత్రవరుణులు, అదితి, జలనాయకుఁడు (సముద్రుఁడని తా॥) భూమి, స్వర్లోకము రక్షింతురుగాక.

—:o:—

భూమియందుండుటకిని సూర్యునికు— శ్రేష్ఠుడని తెలియజేసెను. (దిక్కుల భేదము, ఋతువుల భేదము సూర్యగమనము వల్లనే కలుగుచున్నవని తా॥)

౧౦౩౦. కఇమంవో నిణ్య మాచికేత వత్సో మాతౄర్జనయత స్వధాభిః ।
బహ్వీనాం గర్భో అపసాముపస్థా న్మహాన్కవిర్నిశ్చరతి స్వధావాన్॥

ద॥ (నీటను స్థావరజంగమము జంతువులలోను) అంతటను కనబడకుండ లోపల దాగియున్న యీ యగ్నిని మీలో నెవడెఱుంగును? (మేఘములకు) పుత్రుడై తల్లులైన యుదకములను హవిస్సులచే బుట్టించుచున్నాడు. (వైద్యుతాగ్ని కుదకములు తల్లులు) అనేక ఉదకములకు (మేఘములలో నున్నవాటికనితా) గర్భరూపుడును (పుత్రుడనితా) గొప్పవాడును, దూరము తెలిసినవాడు, హవిస్సు గలవాడు నగుటయగ్ని (సముద్రముయొక్క) ఉదకముల సమీపమునుండి ఉషః కాలమున బయలు వెడలుచున్నది. (అనగా సూర్యుడు సముద్రములో నుదయించునని తా॥)

౧౦౩౧. ఆవిష్ట్యో వర్ధతే చారురాసు జిహ్మానా మూర్ధ్వః స్వయశా ఉపస్థే ।
ఉభే త్వష్టు ర్బిభ్యతు ర్జాయమానా త్ప్రతీచీ సింహం ప్రతిజోషయేతే॥

ద॥ ఈ (మేఘములలోని) ఉదకములందున్న అగ్ని సుందర రూపుడై పుట్టి కుటిలగమనముగల నీళ్ల సమీపమున కీర్తికలవాడై యూర్ధ్వజ్వాలలు కలిగి వృద్ధి నొందుచున్నాడు. ద్యులోక భూలోకములు పుట్టిన యగ్నివల్ల భయపడుచున్నవి. భయంకరమైన (ఆయగ్నిని) అభిముఖములై (ద్యావాభూములు) సేవించుచున్నవి.

౧౦౩౨. ఉభే భద్రే జోషయేతే నమేనేగావోన వాశ్రా ఉపతస్థు రేవైః ।
సదక్షాణాం దక్షపతి ర్బభూవాఞ్జన్తి యందక్షిణతో హవిర్భిః॥

ద॥ ఆరెండును (ద్యావాభూములు కాని, రాత్రింబవళ్లుకాని) యిద్దఱు స్త్రీల విధమున సేవించుచున్నవి. అంభాధ్వనికల గోవులు తమ ఆదరముతో దూడను బోలె అగ్నిని, ఆరెండును సేవించుచున్నవి. కనుక ఆయగ్ని బలవంతులలో బలాధిపతియగుచున్నాడు. ఏమంటే దక్షిణ దిక్కున ఋత్విజులు ఆయగ్నిని హవిస్సులతో దృప్తిబొందించుచున్నారు కనుక.

౧౦౩౩. ఉద్యం యమీతి సవితేవ బాహూ ఉభే సిచౌ యతతే భీమ ఋఞ్జన్ ।

ఉచ్ఛుక్ర మత్కమజతే సిమస్మాన్నవా మాతృభ్యో వసనా జహాతి॥

ద॥ అగ్ని సూర్యునివలె జ్వాలను బ్రసరింపఁజేయుచు మీఁదికి లేచుచున్నది. ద్యావాభూములను భయంకరుఁడగు నగ్ని యలంకరించుచు వ్యాపారము చేయుచున్నాఁడు. సర్వపదార్థములనుండి ప్రకాశమానమయిన సారమైన రసమును (కిరణములతో) మీఁదికి లాగుచున్నాఁడు. తన తల్లులయిన వర్షోదకములనుండి క్రొత్తకాంతులను బయలు పఱచుచున్నాఁడు.

౧౦౩౪. త్వేషం రూపం కృణుత ఉత్తరం యత్సం పృఞ్చానః సదనే గోభి రద్భిః ।

కవిర్బుధ్నం పరిమ ర్మృజ్యతే ధీః సా దేవతాతా సమితి ర్బభూవ॥

దం॥ అంతరిక్షమందు సంచరించు నుదకములతోఁగూడి అందఱు జూడశక్యము కాని కాంతిని యెపుడు అగ్నిచేయుచున్నదో అపుడు దూరదర్శియు, అందఱిని బోషించుచున్నదగు నాయగ్ని అంతరిక్షమును దన తేజస్సుతోఁ గప్పుచున్నది. ఆవిస్తరించిన కాంతి మాచే స్తుతింపఁబడిన దయ్యెను.

౧౦౩౫. ఉరు తే జ్రయః పర్యేతి బుధ్నం విరోచమానం మహిషస్య ధామ ।

విశ్వేభిరగ్నే స్వయశోభి రిద్ధోదబ్ధేభిః పాయుభిః పాహ్యస్మాన్॥

దం॥ గొప్పవాఁడవగు నీ యొక్క శత్రువులదిరస్కరించునట్టి, మిగుల వెలుఁగునట్టి విస్తారముగల తేజస్సు అంతరిక్షమున వ్యాపించుచున్నది. ఓయగ్నీ ! ప్రజ్వలించిన వాఁడవై సమస్తమైన, యెవరికిని లొంగని, రక్షించునట్టి కాంతులతో మమ్ముఁ బాలింపుము.

౧౦౩౬. ధన్వన్ స్రోతః కృణుతే గాతుమూర్మిం శుక్రైరూర్మి భిరభి నక్షతి క్షామ్ ।

విశ్వా సనాని జఠరేషు ధత్తే న్త ర్నవాసు చరతి ప్రసూషు॥

ద॥ అన్తరిక్షమందు సంచరించునట్టి ఉదకమును (ఈ యగ్ని) ప్రవాహముగాఁ జేయుచున్నది. స్వచ్ఛమయిన కెరటములతో భూమిఁదడపుచున్నది. తరువాత సమస్తా

అంతట వ్యాపించిన తన తేజస్సు చేత ద్యులోకమును, అంతరిక్షలోకమును వ్యాపించు చున్నది. ధనమునిచ్చు నగ్నిని దేవతలు ధరించిరి. (ఇచట మనువు ఆదిమానవుడు)

౧౦౪౦. తమీళత ప్రథమం యజ్ఞసాధం విశ ఆరీ రాహుత మృఞ్జసానమ్ ।

ఊర్జః పుత్రం భరతం సృప్రదానుం దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్॥

దం॥ ఓ ఋత్విజులారా! అగ్ని ప్రభువుగాఁగల మీరు దేవతలలో ముఖ్యుఁడును, యాగమునుసాధించువాఁడు, హవిస్సులన్నియుహోమము సేయువాఁడు, స్తుతింపఁదగిన వాఁడు, అన్నమునకుఁ బుత్రుఁడు, ప్రాణములన్నిటి కాధారభూతుఁడు, ఎడతెగని ధనములనిచ్చునట్టి యీయగ్నిని స్తుతింపుఁడు- దేవతలు ధనదాతయగు నగ్నిని ధరించిరి.

౧౦౪౧. సమాతరిశ్వా పురువారపుష్టి ర్విదద్గాతుం తనయాయ స్వర్విత్ ।

విశాం గోపా జనితా రోదస్యో ర్దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్॥

దం॥ అంతరిక్షమందున్న వాఁడు, అందఱు మెచ్చఁదగిన బలము కలవాఁడు, స్వర్గము గలిగించువాఁడు, ప్రపంచము నంతను రక్షించువాఁడు, ద్యులోకములను బుట్టించినవాఁడునగు నాయగ్ని మాకొమాళునకు కర్మమార్గము కలుగఁజేయుగాక. దేవతలు ధనదాత లిత్యాది పూర్వవత్తు.

౧౦౪౨. నక్తోషాసా వర్ణమా మేమ్యానే ధాపయేతే శిశుమేకం సమీచీ ।

ద్యావాక్షామా రుక్మో అన్తర్విభాతి దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్॥

దం॥ రాత్రియుఁ బవలును ఒకదాని రూపము నింకొకటి బాధించుకొనుచుఁ గూడుచున్నవి. ఒకదాని కొడుకగు నగ్నిని పాలుత్రావించుచున్నవి. ప్రకాశించునట్టి యీయగ్ని భూమ్యంతరిక్షములు మధ్యమందుఁ బ్రకాశించుచున్నది ధనదాతయగు నగ్నిని దేవతలు ధరించిరి.

౧౦౪౩. రాయో బుధ్నః సంగమనో వసూనాం యజ్ఞస్య కేతుర్మన్మసాధనో వేః ।

అమృతత్వం రక్షమాణాస ఏనం దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్॥

దం॥ ఏయగ్ని ధనమునకు మూలమును, జీవనాధార ధనములను గలిగించువాఁడు, యాగములను దెలుపువాఁడు, భక్తునియొక్క కోర్కెను దీర్పునట్టివాఁడు, అయియున్నాఁడో ధనదాతయగు నాయగ్నిని అమృతత్వము రక్షించువారలు దేవతలు ధరించిరి.

౧౦౪౭. నూ చ పురా చ సదనం రయీణాం జాతస్య చ జాయమానస్య చ క్షామ్ ।
సతశ్చ గోపాం భవతశ్చ భూరేర్దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్॥

దం॥ ఇపుడును బూర్వమును ధనములకుఁ జోటు, పుట్టినదానికిఁ, బుట్టఁబోవుదానికిని జీవనాధారమయిన వాఁడు, నిత్యములగు నాకాశాదులకు నితరవస్తువులకును రక్షకుఁడు, ధనదాతయునగు నగ్నిని దేవతలు ధరించిరి.

౧౦౪౮. ద్రవిణోదా ద్రవిణసస్తురస్య ద్రవిణోదాః సనరస్య ప్రయంసత్ ।
ద్రవిణోదా వీరవతీమిషం నో ద్రవిణోదా రాసతే దీర్ఘమాయుః॥

దం॥ ధనమునిచ్చు నగ్నిచరమయిన ధనమును మాకిచ్చుఁగాక. ధనమునిచ్చు నగ్ని పుత్రులతోఁ గూడిన యన్నమును మాకు నిచ్చుఁగాక. ధనమునిచ్చు నగ్ని దీర్ఘాయువు నిచ్చుఁగాక.

౧౦౪౯. ఏవా నో అగ్నే సమిధా వృధానో రేవత్పావక శ్రవసే వి భాహి ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥

దం॥ పవిత్రముచేయు నగ్నీ! సమిధలు మొదలగు వాటితో వృద్ధినొంది మాకు ఐశ్వర్యాన్న సమృద్ధినిమ్ము. మిత్రుఁడు మొదలగు వారందఱు మమ్ము రక్షింతురుగాక.

## సూక్తము ౯౭.

(ఋషి - కుత్సుఁడు; ఛందస్సు - గాయత్రి; దేవత - అగ్ని.)

౧౦౪౭. అప నః శోశుచ దఘమగ్నే శుశుగ్ధ్యా రయిమ్ । అప నః శోశుచ దఘమ్॥

దం॥ ఓయగ్నీ! మాపాపము మమ్ము విడిచి మాశత్రువులను బాధించుఁగాక. అంతటను ధనమును మాకుఁ దెమ్ము. మాపాపము నశింపఁ జేయుము.

౧౦౪౮. సుక్షేత్రియా సుగాతుయా వసూయా చ యజామహే । అప నః శోశుచ దఘమ్

దం॥ మంచిక్షేత్రము (=పొలము - భార్య రెండర్థములు కలవు) సంపాదించు తలంపు, మంచిదారి కనుఁగొనవలెనను తలంపు, ధనము కావలయునను కోరిక కలిగి యగ్నిని బూజించుచున్నాము. ఆయగ్ని మాపాపమును నశింపఁ జేయుఁగాక.

౧౦౪౯. ప్ర యద్భన్దిష్ఠ ఏషాం ప్రాస్మాకాసశ్చ సూరయః । అప నః శోశుచ దఘమ్॥

దం॥ ఈస్తుతులలో నీకుత్సర్షి యేలాగు స్తుతించెనో ఆలాగు మాస్తుతికర్తలుకూడ స్తుతించుచున్నారు. ఆ యగ్ని మాపాపము తొలగించుఁగాక.

౧౦౫౦. ప్ర యత్తే అగ్నే సూరయో జాయేమహి ప్ర తే వయమ్ । అప నః శోశుచ దఘమ్॥

దం॥ ఏకారణముచేత నోయగ్నీ! నిన్ను స్తుతించువారలు పుత్రపౌత్రాభివృద్ధి కలిగియున్నారో, ఆకారణముచేతనే మేమును పుత్రపౌత్రాదులు కలిగి యుందుముగాక. మాపాపమగ్ని పోఁదోలుఁగాక.

౧౦౫౧. ప్ర యదగ్నేః సహస్వతో విశ్వతో యన్తి భానవః । అప నః శోశుచదఘమ్॥

దం॥ శత్రువులం దిరస్కరించు నగ్నియొక్క కాంతులు అన్నిచోట్లనుండి యేకారణముచేత బయలుదేరుచున్నవో అందువల్ల ఆయగ్ని మాపాపాలు పోఁగొట్టునుగాక,

౧౦౫౨. త్వం హి విశ్వతోముఖ విశ్వతః పరిభూరసి । అప నః శోశుచ దఘమ్॥

దం॥ అగ్నీ! నీవు అన్నిదిక్కుల వ్యాపించు జ్వాలలు కలవాడవుకదా! (కనుక) అన్నిదిక్కులను మమ్ము రక్షింపుము. ఆయగ్ని మాపాపము నశింపఁ జేయును.

౧౦౫౩. ద్విషో నో విశ్వతోముఖాతి నావేవ పారయ । అప నః శోశుచదఘమ్॥

తా॥ సర్వతో-లను ముఖములుకల యగ్నీ! ఓడవలె శత్రువులనుండి మమ్ము దాటించుము. ఆయగ్ని మాపాపము నోదోలుఁగాక.

౧౦౫౪. స నః సింధుమివ నావయాతి పర్షా స్వస్తయే । అప నః శోశుచ దఘమ్॥

తా॥ ఓయగ్నీ! ఆ నీవు మమ్ము ఓడచేత నదిని దాటించినట్లు క్షేమముకొఱకు శత్రువులనుండి దాటించుము. ఆయగ్ని మాపాపము నోదోలుఁగాక.

---

సూక్తము, ౯౮.

(ఋషి - కుత్సుఁడు. దేవత - అగ్ని. ఛందస్సు - త్రిష్టుప్.)

౧౦౫౫. వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః ।
ఇతో జాతో విశ్వమిదం వి చష్టే వైశ్వానరో యతతే సూర్యేణ ॥

తా॥ జనులందఱుఁ గోరఁదగినట్టి యగ్నియొక్క అనుగ్రహమునందుందుముగాక. ఆవైశ్వానరాగ్ని ప్రీతితో సేవింపఁబడువాఁడై సమస్తభూతములకును ప్రభువు గానున్నాఁడు. ఏయగ్ని యీయరణులవల్లఁ బుట్టినవాఁడయి ఈ ప్రపంచమును జూచుచున్నాఁడో ఆయగ్ని (ప్రాతఃకాలమందు) సూర్యునితోఁ గలియుచున్నాఁడు.

౧౦౫౬. పృష్టో దివి పృష్టో అగ్నిః పృథివ్యాం పృష్టో విశ్వా ఓషధీరా వివేశ ।
వైశ్వానరః సహసా పృష్టో అగ్నిః స నో దివా స రిషః పాతు నక్తమ్॥

తా॥ ఈవైశ్వానరాగ్ని ద్యులోకమున (సూర్యరూపమున) నున్నాఁడు. భూమియందు (అగ్నిరూపమున) నున్నాఁడు. అన్ని ఓషధులందుఁ గూడినవాఁడై ఆ యగ్ని (పార్థివాగ్ని) రూపమున బ్రవేశించెను. బలముచేతఁ బుట్టిన ఆయగ్ని రాత్రియందు, బగటియందు శత్రువులనుండి మమ్ముఁ గాపాడుఁగాక. (విశ్వ + నర = అందఱుప్రజలలోనున్న).

౧౦౫౭. వైశ్వానర తవ తత్సత్యమస్త్వస్మాన్రాయో మఘవానః సచన్తామ్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥

భా॥ ఓ వైశ్వానరాగ్నీ! నీచేత నాకర్మ సఫలము గుంగాక! ధనవంతులయిన పుత్రులు మమ్ము సేవింతురుగాక. వరుణుడు మిత్రుండు మొదలగు (ఈసూక్తమందలి) దేవతలు మమ్ము రక్షింతురుగాక.

---

## సూక్తము. ౯౯.

(ఋషి - మరీచిపుత్రుండగు కశ్యపుండు; ఛందస్సు - త్రిష్టుప్; దేవత - అగ్ని.)

౧౦౫౮. జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః ।
స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సిన్ధుం దురితాత్యగ్నిః॥

భా॥ అందఱి జనులచేతను దెలియఁబడు నగ్నికొఱకు సోమరసమును బిండుచున్నాము. ఆయగ్ని మమ్ము శత్రువులుగా దలంచిన వారిధనమును గాల్చివేయును గాక. సమస్తములగు మాకష్టముల నాయగ్ని ఓడతో నదిని దాటించునట్లు దాటించుంగాక. అగ్ని పాపములను దాటించుఁగాక.

—:-o-:—

## సూక్తము. ౧౦౦.

(ఋషి - వృషాగిరుండను మహారాజుయొక్క పుత్రులు ఋజ్రాశ్వాదులు అయిదుగురు రాజర్షులు; దేవత - ఇంద్రుండు; ఛందస్సు - త్రిష్టుప్.)

౧౦౫౯. స యో వృషా వృష్ణ్యేభిః సమోకా మహో దివః పృథివ్యాశ్చ సమ్రాట్ ।
సతీనసత్వా హవ్యో భరేషు మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఏ యింద్రుఁడు (కోర్కెల) వర్షించునో. వర్షణాది శక్తులతోఁ గూడి శ్రేష్ఠమగు ద్యులోకమునకును భూలోకమునకును ఏలఁడగుచున్నాఁడో, ఉదకములను బుట్టించువాఁడును, యుద్ధములందు (సాయమునిమిత్తము) పిలువంబడువాఁడును, మరుత్తులతోఁ గూడుకొన్నవాఁడును అగు నాయింద్రుఁడు మాకరక్షణ కొఱకగుఁగాక.

౧౦౬౦. యస్యానాప్తః సూర్యస్యేవ యామో భరేభరే వృత్రహా శుష్మో అస్తి ।
వృషంతమః సఖిభిః స్వేభిరేవైర్మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఏ యింద్రుని గమనము సూర్యగమనమువలె నెవరును బొందశక్యముగాదో తమస్నేహితులు, వేగముగలవారును అగు మరుత్తులతోఁగూడి వర్షించువాఁడును ప్రతియుద్ధమందును శత్రువులను శోషింపఁజేయుచున్నవాఁడును, ఏ యింద్రుడు అయ్యెనో, ఆయింద్రుఁడు మరుత్తులతోఁగూడి మారక్షకొఱకగుఁగాక.

౧౦౬౧. దివో న యస్య రేతసో దుఘానాః పన్థాసో యన్తి శవసాపరీతాః ।
తరద్ద్వేషాః సాసహిః పౌంస్యేభిర్మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఏ యింద్రుని కాంతులు వర్షోదకములను గలుగఁజేయుచు సూర్యకిరణములవలెనే బలముతోఁ గూడినవై చేరశక్యములుగాక స్వర్గలోకమునుండి బయలుదేరుచున్నవో, జయింపఁబడిన శత్రువులుకలవాఁడై, పౌరుషకార్యములతో శత్రువులనందఱిని తిరస్కరించునట్టి ఆ యింద్రుఁడు మరుత్తులతోఁగూడి యిత్యాది పూ॥

౧౦౬౨. సో అఙ్గిరోభిరఙ్గిరస్తమో భూద్వృషా వృషభిః సఖిభిః సఖా సన్ ।
ఋగ్మిభిరృగ్మీ గాతుభిర్జ్యేష్ఠో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఆ యింద్రుఁడు వేగముగా నడచు వారికంటె నతివేగము కలవాఁడు, వర్షించు వారికంటె నెక్కువగా వర్షించువాఁడు, సామాన్య స్నేహితులందఱికంటె నెక్కువ స్నేహితుఁడు, పూజ్యులందఱిలో మిగుల పూజ్యుఁడు, స్తవనీయులందఱిలో శ్రేష్ఠుఁడు. అగుచున్నాఁడు. తక్కినది పూ॥

౧౦౬౩ స సూనుభిర్న రుద్రేభిరృభ్వా నృషాహ్యే సాసహ్వాఁ అమిత్రాన్ ।
సనీళేభిః శ్రవస్యాని తూర్వన్మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

దం॥ కొమారులతోఁ గూడినట్లు రుద్రపుత్రులగు మరుత్తులతోఁగూడి గొప్పవాఁడయిన యాయింద్రుఁడు యుద్ధములందు శత్రువులను తిరస్కరించెను. సమానస్థానముగల వాయువులతోఁగూడి వర్షోదకములను మేఘములనుండి గర్జించుచున్న యింద్రుఁడు ఇత్యాది పూ॥

౧౦౬౪. స మన్యుమీః సదనస్య కర్తాస్మాకేభి ర్నృభిః సూర్యం సనత్ ।

అస్మిన్న హన్త్సత్పతిః పురుహూతో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

దం॥ ఆ యింద్రుఁడు శాత్రవులఁ జంపువాఁడు, యుద్ధము జేయువాఁడు, మాపురుషులతోఁగూడి మాకు సూర్యకాంతిని జూపుఁగాక. సత్పురుషులఁ బాలించువాఁడు, పలువురచేఁ బిలువఁబడువాఁడు నగు నాయింద్రుఁడు ఈదినమందు మరుత్తులతోఁ గూడినవాఁడై - ఇత్యాది పూ॥

౧౦౬౫. తమూతయో రణయ ఞ్ఛూరసాతౌ తం క్షేమస్య క్షితయః కృణ్వత త్రామ్ ।

స విశ్వస్య కరుణస్యేశ ఏకో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

దం॥ యుద్ధమందు వాయువులా యింద్రుని యుద్ధము చేయుమని ప్రోత్సహించుచున్నారు. మనుష్యులు ధనమును రక్షించువానింగాఁ జేయుచున్నారు. సమస్త ఇష్టముఫలము నిచ్చు కర్మకు నొక్కఁడే యధిపతి. అట్టి యింద్రుఁడు మరుత్తులతోఁ గూడి యిత్యాది. పూర్వవతు.

౧౦౬౬. తమప్సన్త శవస ఉత్సవేషు నరో నరమవసే తంధనాయ ।

సో అన్ధే చిత్తమసి జ్యోతిర్విద న్మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

దం॥ బలసాధ్యములయిన యుత్సవములందు అనఁగా యుద్ధాలలో రక్షణ కొఱకుఁ జయశీలుఁడగు నాయింద్రుని స్తుతికర్తలు ధనము కొఱకును ఆశ్రయించుచున్నారు. ఆ యింద్రుఁడు ఎందువల్ల జీకటిని జేయుయుద్ధమందు (అనగా మనస్సునకుఁ దోచని) విజయప్రకాశమును బొందువాఁడు నగు నా యింద్రుఁడు మరుత్తులతోఁ గూడి యిత్యాది.

౧౦౬౭. సనవ్యేన యమతి వ్రాధతశ్చి త్సదక్షిణే సంగృభీతా కృతాని ।
సకీరిణా చిత్సనితా ధనాని మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఆయింద్రుండు గొప్పబాధపెట్టు శత్రువులనుగూడ ఎడమచేతితోఁ జంపుచున్నాడు యజమానులిచ్చిన హవిస్సులను (కుడి) చేతితో నందుకొనుచున్నాఁడు. ఆయింద్రుండు స్తుతికర్తలచే స్తుతింపఁబడి ధనముల నిచ్చును. మరుత్తులతోఁగూడి యిత్యాది పూ॥

౧౦౬౮. సగ్రామేభిః సనితా సరథేభి ర్విదే విశ్వాభిః కృష్టిభి ర్న్వద్య ।
సపౌంస్యేభి రభిభూ రశస్తీ ర్మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ ఆయింద్రుండు మరుత్తులతోఁ గలిసి యిష్టము నిచ్చువాఁడగుచున్నాఁడు. అతఁడు సమస్తరథములతోను ప్రజలతోను ఈనాఁడు తెలియఁబడుచున్నాఁడు. తన బలముచేత శత్రువులను తిరస్కరించుచున్నాఁడు. ఆ యింద్రుండు మరుత్తులతో నిత్యాది పూ॥

౧౦౬౯. సజామిభి ర్యత్సమజాతి మీళ్హే ఽజామిభిర్వా పురుహూత ఏవైః ।
అపాం తోకస్య తనయస్య జేషే మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ పలువురిచేతఁ బిలువఁబడునట్టి యింద్రుండు మరుత్తులతోఁగూడి బంధువులతోను, బంధువులు కానివారితోను యుద్ధమునకు సిద్ధపడుచున్నాఁడు. తన్నాశ్రయించిన ఉభయవిధులయిన (బంధు - అబంధు అనితా) మనుష్యులయొక్క పుత్రపౌత్రుల జయముకొఱకు ఆ యింద్రుఁడగుచున్నాడు. ఆయింద్రుఁడు మరుత్తులతో నిత్యాది. పూ॥

౧౦౭౦. సవజ్రభృ ద్దస్యుహా భీమ ఉగ్రః సహస్రచేతాః శతనీథ ఋభ్వా॥
చమ్రీషోన శవసా పాఞ్చజన్యో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥

వం॥ వజ్రాయుధము ధరించినట్టి, దస్యులను జంపునట్టి (దస్యు = దొంగ. రాక్షసులు) భయంకరుండయి సర్వము నెఱింగినట్టి, పలువురిచేత స్తుతింపఁబడుచు గొప్ప

దం॥ ఎఱ్ఱనివి, నల్లనివియు, పొడవగు నవయవములుగలవియు, అలంకారములు కల వియు, ద్యులోకమందుండునవియు, ఋజ్రాశ్వుడను రాజర్షికి ధనమిచ్చుటకై బయలు దేరినరథమందు గాడికిబూన్పఁబడి మోయునట్టివియునగు గుఱ్ఱముల పంక్తి, గంభీరమై సైనికులందు మనుష్యులందుఁ గనఁబడుచున్నవి.

౧౦౭౫. ఏతత్యత్త ఇన్ద్ర వృష్ణఉక్థం వార్షాగిరా అభిగృణన్తి రాధః ।
ఋజ్రాశ్వః ప్రష్టిభి రమ్బరీషః సహదేవో భయమానః సురాధాః॥

దం॥ ఇంద్రా! (కోరికలు)వర్షము కురిపించునట్టి నీయొక్క ఆస్తోత్రమును సంతోష హేతువునుగా; వృషాగిరుఁడను రాజుయొక్క కొడుకులగు, అంబరీషుఁడు, సహదేవుఁడు, భయమానుఁడు, సురాధుఁడు అనెడి తన ప్రక్కనున్న (నల్గురు) రాజర్షులును ఋజ్రా శ్వుఁడనువాఁడును వర్ణించుచున్నారు.

౧౦౭౬. దస్యూఞ్ఛిమ్యూంశ్చ పురుహూత ఏవైర్హత్వా పృథివ్యాం శర్వానిబర్హీత్ ।
సనత్క్షేత్రం సఖిభిః శ్విత్న్యేభిః సనత్సూర్యం సనదపఃసువజ్రః॥

దం॥ ఇంద్రుఁడు మరుద్గణములతోఁగూడి భూమియందున్న శత్రువులను, రాక్షసు లను, వజ్రాయుధముతోఁ గొట్టి చంపెను. అలంకారములచేతఁ బ్రకాశించు దేహ ములుకల మిత్రులతో (అనఁగా వాయువులతో) గూడ శత్రుసంబంధమగు భూమి ననుభవించెను. సూర్యునాశ్రయించెను. ఉదకములను గూడ నింద్రుఁడు వజ్రాయు ధము ధరించి యాశ్రయించెను. (సర్వత్రా యింద్రుఁడున్నాఁడని తా॥)

౧౦౭౭. విశ్వాహేన్ద్రో అధివక్తానో అస్త్వపరిహ్వృతాః సనుయామ వాజమ్ ।
తన్నోమిత్రో వరుణోమామహన్తా మదితిః సిన్ధుఃపృథివీ ఉతద్యౌః॥

దం॥ ఎల్లకాలముండునట్టి యింద్రుఁడు మాయందుఁ బక్షపాతవచనములను బల్కు గాక. మేము కుటిలత్వములేక హవిస్సును సంపాదింతుము. మాచే నివ్వఁబడిన ఆ హవిస్సంపాన్నమును మిత్రుఁడు వరుణుఁడు మొదలగు దేవతలు రక్షించుదురుగాక.

## సూక్తము. ౧౦౧.

(ఋషి ఆంగిరసపుత్రుఁడగు కుత్సుఁడు. దేవత - ఇంద్రుఁడు. ఛందస్సు - ౧ - ౭ - జగతి,
౮ - ౧౧ త్రిష్టుప్).

౧౦౭౮. ప్రమన్దినే పితుమదర్చతా వచో యః కృష్ణగర్భా నిరహన్నృజిశ్వనా ।
అవస్యవో వృషణం వజ్రదక్షిణం మరుత్వన్తం సఖ్యాయ హవామహే॥

తా॥ ఓ ఋత్విజులారా! స్తవనీయుఁడైన యింద్రుని కొఱకు హవిస్సాధనముగా యన్నముతోఁ గూడిన స్తుతివాక్యమును గట్టిగాఁ బఠింపుఁడు. ఏయింద్రుఁడు ఋజిశ్వుని (రాజు) తోఁగూడి కృష్ణుఁడను రాక్షసుని, గర్భిణులైయున్న ఆతనిభార్యలను సంహరించెనో (కోరికల) వర్షము కురిపించునట్టి, వజ్రాయుధము కుడిచేతిలోఁ గలట్టి, మరుత్తుల సహాయముగలట్టి యింద్రుని రక్షణగోరుచున్న మేము సఖ్యము కొఱకుఁ బిలుచుచున్నాము.

౧౦౭౯ యోవ్యంసం జాహృషాణేన మన్యునా యః శమ్బరం
యోఅహన్పిప్రుమవ్రతమ్ ।
ఇంద్రోయః శుష్ణమశుషం న్యావృణఙ్మరుత్వంతం సఖ్యాయహవామహే॥

తా॥ ఏ యింద్రుఁడు వృద్ధినొందుచున్న కోపముతో బుజములు తెగిన వృత్రాసురుని, శంబరుని, యాగాది కర్మ విరోధియగు పిప్రుని సంహరించెనో, శుష్ణాసురు నెవఁడు మొదలంట నశింపఁజేసెనో ఆ మరుత్తులతోఁ గూడిన యింద్రుని సఖ్యమునకుఁ బిలుచుచున్నాము.

౧౦౮౦. యస్యద్యావా పృథివీపౌంస్యం మహద్యస్య వ్రతేవరుణో యస్య సూర్యః ।
యస్యేన్ద్రస్య సిన్ధవః సశ్చతి వ్రతం మరుత్వన్తం సఖ్యాయ హవామహే॥

తా॥ ఏ యింద్రుని గొప్పబలము ద్యులోక భూలోకములను అనుసరించుచున్నదో యేయింద్రు నాజ్ఞయందు వరుణుఁడున్నాఁడో, సూర్యుఁడుకూడ నేయింద్రుని ఆజ్ఞలో నున్నాఁడో, యేయింద్రునాజ్ఞను నదులు అనుసరించుచున్నవో యాయింద్రుని మరుత్తులతోఁ గూడిన యిత్యాది పూర్వవతు.

౧౦౫౧. యో అశ్వానాం యో గవాం గోపతిర్వశీ య ఆరితః కర్మణికర్మణి స్థిరః ।
వీళోశ్చిదిన్ద్రో యో అసున్వతో వధో మరుత్వన్తం సఖ్యాయ హవామహే॥

వ॥ ఏ యింద్రుడశ్వములకును, గోవులకును, (కామధేనువునకును) పతియై యున్నాఁడో యెవడు స్వతంత్రుఁడై సర్వకార్యములలోను స్థిరుఁడై పిలువఁబడు చున్నాఁడో, యేయింద్రుడు యాగవిరోధులగు శత్రువులను జంపునో - శేషము పూర్వవతు.

౧౦౫౨. యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిర్యో బ్రహ్మణే ప్రథమో గా అవిన్దత్ ।
ఇన్ద్రో యో దస్యూఁరధరాఁ అవాతిరన్మరుత్వన్తం సఖ్యాయ హవామహే॥

వ॥ బ్రతికియున్న సమస్తజగత్తునకును ఏ యింద్రుఁడధిపతియో, యేయింద్రుఁడు అంగిరసులకంటె ముందుగానే గోవులను (పణులపహరించిన వాటిని) పట్టుకొన్నాఁడో, దస్యులనే యింద్రుడు క్రిందఁ బడవేసి చంపెనో, మరుత్తులతోఁ గూడిన యాయింద్రుని, శేషము సమానము.

౧౦౫౩. యః శూరేభిర్హవ్యో యశ్చ భీరుభిర్యో ధావద్భిర్హూయతే యశ్చ జిగ్యుభిః ।
ఇన్ద్రం యం విశ్వా భువనాభి సన్దధుర్మరుత్వన్తం సఖ్యాయ హవామహే॥

వ॥ ఏ యింద్రుఁడు వీరులచేతఁ బిలువంబడువాఁడో, యే యింద్రుడు భయపడిన వారిచేతఁ బిలువఁబడునో, పరుగెత్తి పాఱిపోవువారిచేతనే యింద్రుఁడు పిలువఁబడునో యెవఁడు జయించినవారిచేతను బిలువబడునో (స్నేహమునకు) ఏయింద్రుని సమస్తభూతములు తమకార్యములందు ముందుంచుకొన్నవో మరుత్తులతోఁ గూడిన ఆ యింద్రుని. తక్కినది పూ॥

౧౦౫౪. రుద్రాణామేతి ప్రదిశా విచక్షణో రుద్రేభిర్యోషా తనుతే పృథుజ్రయః ।
ఇన్ద్రం మనీషా అభ్యర్చతి శ్రుతం మరుత్వన్తం సఖ్యాయ హవామహే ।

వ॥ వెలుఁగుచున్న యింద్రుడు రుద్రపుత్రులగు మరుత్తుల ఆకర్షణతో సంచరించు మన నడచుచున్నాఁడు. రుద్రపుత్రులగు మరుత్తులతో మధ్యమవాక్కు (ఆకాశవాణి)

చిక్కలి వేగమును గలిగించుచున్నది. ప్రఖ్యాతుండగు నింద్రుని స్తుతివాక్కు స్తుతిం చుచున్నది. మరుత్తులతోం గూడిన ఇత్యాది పూ॥

౧౦౭౫. యద్వా మరుత్వః పరమే సధస్థే యద్వావమే వృజనే మాదయాసే ।

అత ఆ యాహ్యధ్వరం నో అచ్ఛా త్వాయా హవిశ్చకృమా సత్యరాధః॥

దం॥ మరుత్తులతోం గూడిన యింద్రా! ఉత్కృష్ట స్థానమునందుం దృప్తుండవై యున్నావా? పురాతన గృహమందే తృప్తుడవై యున్నావా? యీ రెండు చోట్ల నుండి మా యాగమున కభిముఖముగా రమ్ము. శాశ్వతధనముగల యోయింద్రా! నిన్నుగోరు మేము హవిస్సును జేసియున్నాము.

౧౦౭౬. త్వాయేన్ద్ర సోమం సుషుమా సుదక్ష త్వాయా హవిశ్చకృమా బ్రహ్మవాహః ।

అధా నియుత్వః సగణో మరుద్భిరస్మిన్యజ్ఞే బర్హిషి మాదయస్వ॥

దం॥ ఓ బలశాలీ! యింద్రా! నిన్నుగోరి సోమరసమును బిండి సిద్ధపఱచితిమి. స్తోత్రములమీందం స్వారిచేసి వచ్చువాండా! నిన్నుంగోరి హవిస్సు లమర్చినాము. (ఆ హవనీయాగ్నిలోం బురోడాశము తయారు చేసితిమని తా.) అనేకములు గుఱ్ఱ ములు కలవాండా! మరుత్తులతోను, ఇతర దేవగణములతోను గలిసి యీ యజ్ఞమునం గూర్చొని తృప్తినొందుము. (సోమపానము చేసి మదింపు మని తా.)

౧౦౭౭. మాదయస్వ హరిభిర్యే త ఇన్ద్ర విష్యస్వ శిప్రే వి సృజస్వ ధేనే ।

ఆ త్వా సుశిప్ర హరయో వహన్తూశన్హవ్యాని ప్రతి నో జుషస్వ॥

దం॥ ఇంద్రుడా! గుఱ్ఱములతోం దృప్తినొందుము. ఏ గుఱ్ఱాలు నీ స్వభావముంగ లవో (అనంగాం బ్రావంబలంచియున్న వనితా) దవుడలను విప్పుము. జిహ్వను ఉప జిహ్వను దెఱువుము. (నాల్కదగ్గఱ చిన్ననాల్క యనునది నుండునని ఉపజిహ్వ. అదికూడ త్రాగుటకు సాధనమని తా.) మంచితోరగలవాండా! నిన్ను గుఱ్ఱాలు తెచ్చుంగాక. నీవును మామీంద మనసుంచి మాహవిస్సులను గ్రహింపుము.

౧౦౮౮. మరుత్స్తోత్రస్య వృజనస్య గోపా వయమిన్ద్రేణ సనుయామవాజమ్ ।
తన్నోమిత్రో వరుణో మామహన్తా మదితిః సిన్ధుః పృథివీ ఉతద్యౌః॥

వం॥ మరుత్తులతోఁ గలిసి స్తుతింపఁబడునట్టి, శత్రువుల నశింపఁజేయునట్టి యింద్రుని యొక్క రక్షణకల మేము ఇంద్రునిచేత నన్నమును బొందెదము. మాకాయన్నమును మిత్రాది దేవతలు రక్షింతురుగాక.

---

### సూక్తము ౧౦౨.

(ఋషి - కుత్సుఁడు ; దేవత - ఇంద్రుఁడు ; ఛందస్సు ౧ - ౧౦ జగతి ; ౧౧ త్రిష్టుప్.)

౧౦౮౯. ఇమాంతే ధియం ప్రభరే మహోమహీ మస్యస్తోత్రే ధిషణాయత్తఆనజే ।
తముత్సవేచ ప్రసవేచ సాసహిమిన్ద్రం దేవాసః శవసామదన్ననుః॥

వం॥ ఓ యింద్రుఁడా! శ్రేష్ఠుఁడవయిన నీయొక్క బుద్ధి యీ నాయొక్క స్తోత్రమందు ఏకారణముచేత నంటియుండెనో ఆకారణమువల్ల నీగొప్పదయిన యీస్తుతిని చేయుచున్నాను. శత్రువులం దిరస్కరించు నాయింద్రుని ఋత్విజులు స్తుతిబలముతో వృద్ధికొఱకు, సంతానము కొఱకు క్రమముగాఁ బ్రార్థించిరి.

౧౦౯౦. అస్యశ్రవో నద్యః సప్తబిభ్రతిద్యావాక్షామా పృథివీ దర్శతంవపుః ।
అస్మే సూర్యా చన్ద్రమసా భిచక్షే శ్రద్ధేక మిన్ద్ర చరతో వితర్తురమ్॥

వం॥ ఈ యింద్రుని కీర్తిని ఏడు నదులు భరించుచున్నవి. ద్యులోక భూలోకములు ఆకాశము కూడను ఈ (సూర్యరూప) మైనయింద్రుని చూడఁదగిన రూపమును భరించుచున్నవి. ఇంద్రుఁడా! మాకుఁదెలియఁబడుటకు, ఇది యీవస్తువనిచూచుటకు సూర్యచంద్రులు ఒకరితరువాత నొకరు వచ్చుచున్నారు.

౧౦౯౧. తంస్మా రథంమఘవన్ప్రావసాతయే జైత్రంయంతే అనుమదామ సఙ్గమే ।
ఆజాన ఇన్ద్ర మనసా పురుష్టుత త్వాయద్భ్యో మఘవఞ్ఛర్మ యచ్ఛనః॥

వ॥ ఓ యింద్రా! జయశీలమగు నే రథమును శత్రువులందఱు కూడినయుద్ధమం దు మేముస్తుతించుచున్నామో, అనేకుల చేత స్తుతింపఁబడు నింద్రా! మాధనలాభము కొఱకు ఆరథమునే ప్రేరేపింపుము. మఱియు నిన్ను గోరుచున్న మాకు సుఖము నిమ్ము.

౧౯౨. వయం జయేమ త్వయా యుజా వృతమస్మాకమంశముదవా భరేభరే।
అస్మభ్యమిన్ద్ర వరివః సుగం కృధి ప్రశత్రూణాం మఘవన్వృష్ణ్యా రుజ॥

వ॥ ఇంద్రుఁడా! మాతోఁ గూడియున్న నీతోఁ గలిసిన శత్రువును మేము జయింతుము. ప్రతియుద్ధమందును మాభాగమును (శత్రుబాధ లేకుండ) రక్షింపుము. ఇంద్రా! ధనము సులభముగా మాకు లభించునట్టి దానిగాఁ జేయుము. ఇంద్రా! శత్రువుల శక్తిని నశింపఁ జేయుము.

౧౯౩. నానా హి త్వా హవమానా జనా ఇమే ధనానాం ధర్తరవసా విపన్యవః।
అస్మాకం స్మా రథమా తిష్ఠ సాతయే జైత్రం హీన్ద్ర నిభృతం మనస్తవ॥

వ॥ ధనములను ధరించునట్టి యింద్రా! (ధనమిచ్చునట్టి అనికాని) రక్షణ నిమిత్తము నిన్ను బిలుచుచున్న స్తుతికర్తలగు జనులనేకులుకదా! (వారిలో) మాకు ధనమిచ్చుటకు రథమెక్కుము. ఇంద్రుఁడా! నీయొక్క జయశీలమగు మనస్సు నిశ్చలముగా నున్నదికదా!

౧౯౪. గోజితా బాహూ అమితక్రతుః సిమః కర్మన్కర్మఞ్ఛతమూతిః ఖజఙ్కరః।
అకల్ప ఇన్ద్రః ప్రతిమానమోజసాథా జనా వి హ్వయన్తే సిషాసవః॥

వ॥ ఇంద్రా! నీచేతులు గోవులను జయించినవి. (పణులపహరించిన వాటిని దెచ్చినాఁడని తా.) నీవు విశేషజ్ఞానము కలవాఁడవు. శత్రుహంతవు. ప్రతి కర్మయందును అనేక రక్షణలు కలిగియున్నావు. యుద్ధము చేయువాఁడవు. సాటిలేనివాఁడవు బలముచేత సర్వప్రాణులకు నుపమానభూతుఁడవు. (అనగా "ఇంద్రుఁడంత బలవంతుఁడ" ని వాడుక.) కనుక ధనము కోరిన జనులు పలువిధముల నిన్ను బ్రార్థింతురు.

౧౦౨-౫. ఉత్తే శతాన్మఘవన్నుచ్చ భూయస ఉత్సహస్రాద్రిరిచే కృష్టిషు శ్రవః ।
అమాత్రంత్వా ధిషణా తిత్విషే మహ్యధా వృత్రాణి జిఘ్నసే పురన్దర॥

వ॥ ఓ యింద్రా! మనుష్యులందు (నీవిచ్చిన) అన్నము అనేకముగాఁ బెఱుఁగు చున్నది. ఇంతా అంతా కాదు. అమితముగా. నిన్ను నాస్తుతి మెఱుఁగు పెట్టుచున్నది. శత్రుపట్టణములను బ్రద్దలుసేయువాఁడా! స్తుతించిన తరువాత మాశత్రువులను హింసించుచున్నావు.

౧౦౨-౬. త్రివిష్టిధాతు ప్రతిమానమోజస స్తిస్రో భూమీర్నృపతే త్రీణిరోచనా ।
అతీదం విశ్వం భువనం వవక్షిథా శత్రురిన్ద్ర జనుషా సనాదసి॥

వ॥ జనులకుఁ బతివైన ఇంద్రా! ఎందువల్ల నీవు చిరకాలమునుండి జన్మ మొదలు శత్రువులు లేనివాఁడవు అగుచున్నావో. అందుచే సకల ప్రాణుల బలములకును ముప్పిరిత్రాఁడువలె గట్టి శరీరము గలవాఁడవయి మూఁడు లోకములను మూఁడు తేజస్సులను ధరించుచున్నావు. ఈ ప్రపంచ మంతటిని ధరింపఁజూచుచున్నావు.

౧౦౨-౭. త్వాం దేవేషు ప్రథమం హవామహే త్వంబభూథ పృతనాసు సాసహిః ।
సేమన్నః కారు ముపమన్యు ముద్భిద మిన్ద్రః కృణోతు ప్రసవే రథం పురః

వ॥ ఓ యింద్రా! దేవతలలో శ్రేష్ఠుఁడవగు నిన్ను బిలుచుచున్నాము. యుద్ధములందు నీవు శత్రువులం దిరస్కరించువాఁడవు కాఁగలవు. ఇంద్రా! స్తుతికర్తయు, సర్వజ్ఞుఁడు, శత్రువుల జయించువాఁడు నగు పుత్రుని గలిగింపుము. యుద్ధము తటస్థించినపుడు నీరథమును ముందు నడుచుదానింగాఁ జేయుము.

౧౦౨-౮. త్వంజిగేథ నధనా రురోధిథార్భేష్వాజా మఘవ న్మహత్సుచ ।
త్వాముగ్ర మవసే సంశిశీమ స్యథాన ఇన్ద్ర హవనేషు చోదయ॥

వ॥ ఇంద్రా! నీవు శత్రువులజయించుచున్నావు, శత్రువుల నుండి హరించిన ధనములను స్తుతికర్తల కిచ్చెదవు. ధనవంతుఁడా! గొప్పవైనను కొంచెమైనను [illegible]

యుద్ధములలో మాకు కొఱకు ఉగ్రుడవయిన నిన్ను ప్రార్థించుచున్నాము. తరువాత నీవు యుద్ధములందుఁ బిలువఁగానే రథము తోలుకొని రమ్ము.

౧౦౯౯. విశ్వాహేన్ద్ర అధివక్తా నో అస్త్వపరిహ్వృతాః సనుయామ వాజమ్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥

వం॥ అన్నిదినములందు నో యింద్రా! మాపక్షముగా మాటాడువాఁడవు కమ్ము. కపటములేనివారమై మేము అన్నమును బొందుచున్నాము. ఆయన్నమును మిత్రుఁడు మొదలగు దేవతలు రక్షించుదురుగాక

—:-o-:—

## సూక్తము ౧౦౩.

(ఋషి - కుత్సుఁడు; దేవత - ఇంద్రుఁడు; ఛందస్సు - త్రిష్టుప్.)

౧౧౦౦. తత్త ఇన్ద్రియం పరమం పరాచైరధారయన్త కవయః పురేదమ్ ।
క్షమేదమన్యద్దివ్యన్యదస్య సమీ పృచ్యతే సమనేవ కేతుః ॥

వం॥ ఇంద్రా! నీయొక్క ప్రసిద్ధమై ఉత్కృష్టమయిన యీ బలమును బూర్వము కవులు, స్తుతికర్తలు ప్రత్యక్షముగా ధరించిరి. ఈ నీయొక్క తేజస్సు (అగ్నియనిగా) భూమియందుఁ గలదు. మఱియొక (సూర్యరూప) తేజస్సు అంతరిక్షమందుఁ గలదు. ఈ రెండువిధములగు తేజస్సులు యుద్ధమునందు ఎదురైన రెండుజెండాలవలెను ఒకదానితో నొకటి ఒరయుచున్నది.

౧౧౦౧. సధారయత్పృథివీం పప్రథచ్చ వజ్రేణ హత్వా నిరపః ససర్జ ।
అహన్నహిమభినద్రౌహిణం వ్యహన్వ్యంసం మఘవా శచీభిః ॥

దం॥ ఆయింద్రుఁడు భూమిని బోషించెను; తరువాత విస్తరింపఁజేసెను. మఱియు వజ్రముతో (వృత్రాదులను) చంపి ఉదకములను గురిపించెను. మేఘమును గొట్టెను. రోహిణుఁడను రాక్షసుని భేదించెను. ఇంద్రుఁడు తనకర్మలచే వృత్రాసురుని బుజములు తెగినవానినిగాఁ గొట్టెను.

౧౧౦౨. సజాతూభర్మా శ్రద్దధాన ఓజః పురోవిభిన్దన్న చరద్విదాసీః ।

విద్వాన్వజ్రిన్దస్యవే హేతి మస్యార్యం సహో వర్ధయాద్యుమ్న మిన్ద్ర॥

వ॥ వజ్రమాయుధముగాఁగలట్టి, బలముచే జేయఁదగిన కార్యముచేయు సమకట్టి నట్టి, యా యింద్రుఁడు శత్రుపట్టణములను బ్రద్దలు సేయుచు సంచరించెను. వజ్రాయుధముగల యింద్రా! స్తుతిని దెలిసినవాఁడవై నీవు స్తుతికర్తల శత్రువులమీఁద నాయుధమును విసరుము. స్తుతికర్తల బలమును వృద్ధిఁబొందించుము. ధనమునుకూడ వృద్ధిఁబొందింపుము (ఆర్య=స్తుతికర్తయని భాష్యం)

౧౧౦౩. తదూచుషేమానుషేమా యుగాని కీర్తేన్యం మఘవానామబిభ్రత్ ।

ఉపప్రయందస్యు హత్యాయ వజ్రీ యద్ధసూనుః శ్రవసే నామదధే॥

వ॥ శత్రులవంగఁదీయునట్టి, యింద్రుని బలమును స్తుతించుయజమానునకు స్తుతింపఁదగిన బలముధరించు నింద్రా! మనుష్యసంబంధమైన యీ కనఁబడుచున్న యుగములను (కృతత్రేతాదులను) ఇచ్చుచున్నావు. (ఇంద్రుఁడే సూర్యరూపమున నున్నందున కాలకర్తగాఁ జెప్పఁబడె) శత్రునాశమునకై యింటినుండి బయలుదేరిన వజ్రాయుధధారియు, శత్రువుల ప్రేరేంచువాఁడునగు నింద్రుఁడు శత్రువును లోఁబఱచు కొను బలమును స్తుతికర్తకొఱకు ధరించెనుగాదా!

౧౧౦౪. భూరికర్మణే వృషభాయ వృష్ణే సత్యశుష్మాయ సునవామ సోమమ్ ।

య ఆదృత్యా పరిపన్థీవ శూరో యజ్వనో విభజన్నేతి వేదః॥

వ॥ శూరుఁడయిన యే యింద్రుఁడు ఆదరించి యాగము చేయనివానియొక్క ధనమును దొంగవలె నపహరించుచు (ఆ ధనమును యజ్ఞము సేయువారికిచ్చుటకు) వచ్చుచున్నాఁడో, అనేక కార్యములుచేయునట్టి, శ్రేష్ఠుఁడగునట్టి, వర్షము గురిపించునట్టి, నిబ్బరమయిన బలముకలట్టి, యాయింద్రుని కొఱకు సోమమును పిండుచున్నాము.

౧౧౦౫. తదిన్ద్ర ప్రేవవీర్యం చకర్థ యత్ససన్తం వజ్రేణా బోధయోహిమ్ ।

అను త్వా పత్నీర్హృషితం వయశ్చ విశ్వే దేవాసో అమదన్ననుత్వా॥

వ॥ మదోన్మత్తుండై నిదురించు వృత్రుని వజ్రాయుధముతో ఏ వీర్యముతో మేల్కొల్పితివో (అందుచేత) సంతోషము కలిగియున్న నిన్ను ద్దేశించి దేవతల భార్యలు, వాయువులును, సమస్త యితర దేవతలును సంతోషించిరో ఓ యింద్రా! ఆవీర్యమును నీవు ప్రకటించినావు.

౧౧౦౬. శుష్ణం పిప్రుం కుయవం వృత్ర మిన్ద్ర యదావధీర్వి పురః శమ్బరస్య ।

తన్నో మిత్రో వరుణో మామహన్తా మదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥

వ॥ ఓ యింద్రా! నీవు ఎపుడు శుష్ణుని, పిప్రుని, కుయవుని, వృత్రుని (యీనల్గురు రాక్షసులు) వధించితివో అపుడే శంబరుని కోటలను బ్రద్దలుకొట్టితివి. ఈ మా ప్రార్థనను మిత్రుడు మొదలగు దేవతలు రక్షింతురుగాక.

---

## సూక్తము. ౧౦౪.

(ఋషి - కుత్సుడు; దేవత - ఇంద్రుడు; ఛందస్సు - త్రిష్టుప్,)

౧౧౦౭.. యోనిష్ట ఇన్ద్ర నిషదే అకారి త మానిషీద స్వానో నార్వా ।

విముచ్యా వయోవసాయాశ్వా న్దోషా వస్తోర్వహీయసః ప్రపిత్వే॥ ౧॥

వ॥ ఇంద్రా! నీవు కూర్చుండుటకు స్థానము (వేదిక) ఏర్పఱుపబడినది. సకిలించు గుఱ్ఱమువలె కళ్లెములను విడిచి యజ్ఞసమయము వచ్చినపుడు పగటియందుగాని రాత్రియందుగాని నీరథము నీడ్చునట్టి గుఱ్ఱాలను వదలిపెట్టి ఆవేదిక దగ్గఱ జేరి కూర్చుండుము.

౧౧౦౮. ఓ త్యే నర ఇన్ద్ర మూతయే గు ర్నూచిత్తాన్త్సద్యో అధ్వనో జగమ్యాత్ ।

దేవాసో మన్యుం దాసస్య శ్చమ్నంతే న ఆవక్ష న్త్సువితాయ వర్ణమ్॥ ౨॥

వ॥ ప్రసిద్ధులైన యజమానులు రక్షణకొఱకు నింద్రుని బిలుచుచు వచ్చుచున్నారు. ఆ యింద్రుడు వారిని శీఘ్రముగా వెంటనే (కర్మ) మార్గములను బొందించు

గాక. యాగము పాడుచేయువాని క్రోధమును సర్వదేవతలును నశింపఁజేతురుగాక. ఈ దేవతలు మాయజ్ఞము చక్కగా జరుగునట్లుగా యీ యింద్రుని దీసికొని వత్తురుగాక.

౧౧౦౯. అవత్మనా భరతే కేతవేదా అవత్మనా భరతే ఫేనముదన్ ।

క్షీరేణ స్నాతః కుయవస్య యోషే హతే తే స్యాతాం ప్రవణే శిఫాయాః॥ ౩॥

దం॥ (ఇతరుల) ధనముల నెఱింగిన కుయవుఁడు స్వయముగా నేపరుల ధనము నపహరించుచున్నాఁడు. వాఁడు నురుగుతోఁ గూడిన యుదకమును స్వయముగా నావరించియున్నాఁడు. ఆకుయవుని యిద్దఱు భార్యలు ఆనీటితో స్నానము చేయుచున్నారు. ఆ యిద్దఱుభార్యలు శిఫానదియొక్క లోతునీటిలోఁ జచ్చిన వారగుదురు.

౧౧౧౦. యుయోప నాభి రుపరస్యాయోః ప్రపూర్వాభి స్తిరతే రాష్టి శూరః ।

అఞ్జసీ కులిశీ వీరపత్నీ పయో హిన్వానా ఉదభి ర్భరన్తే॥ ౪॥

దం॥ ఉదకమధ్యమునుండి యితరుల బంధించు కుయవునియొక్క నివాసస్థానము ఎవరికిఁ దెలియఁబడదు. పూరించిన నీటితో నతఁడు వృద్ధినొందుచుండెను. శౌర్యము కలిగి ప్రకాశించుచున్నాఁడు. అంజసి కులిశి, వీరపత్ని అనునదులు ఉదకములతో నిండినవై తమ ఉదకములతో నతనిని బోషించుచున్నవి.

౧౧౧౧. ప్రతియత్స్యా నీథా దర్శి దస్యో రోకో నాచ్ఛా సదనం జానతీ గాత్ ।

అధ స్మా నో మఘవ ఞ్చర్కృతా దిన్మా నో మఘేవ నిష్షపీ పరాదాః॥ ౫॥

దం॥ ఎప్పుడు కన్నులకుఁ గనఁబడినట్టి మార్గము చూడఁబడెనో, ఆ మార్గమును ఇంద్రా! నీవు (ఆవు) దూడ యున్నచోటు నెఱింగి చేరినట్లు చేరుము. ఇంద్రా! అట్లుచేరి అతఁడు చేయు నుపద్రవములనుండి మమ్ముఁ గాపాడుము. జారుడు తన ధనమును బాడు చేయునట్లు మమ్ము నీవిపుడుమునుఁ బాడుచేయకుము. లేక ధనమును విడుచునట్లు మమ్ము విడువకుము. అనిగాని.

౧౧౧౨. స త్వం న ఇన్ద్ర సూర్యే సో అప్స్వనాగాస్త్వ ఆభజ జీవశంసే ।

మాన్తరాం భుజమారీరిషో నః శ్రద్ధితం తే మహత ఇన్ద్రియాయ॥ ౬॥

ద॥ ఇంద్రా! ఆ నీవు సూర్యుని బీతితో సేవించువారిగా మమ్ము జేయుము. ఉదకములందు బ్రీతిగలవారింగా జేయుము. పాపులందఱు గోచరమగిన పాపము జేయుండుటను కూర్చి ప్రీతిగలవారింగా మమ్ము జేయుము మాగర్భమందున్న సంతతిని ఏవిధముగాను చెఱుపకుము. నీయొక్క గొప్పబలమునందు మాకు నమ్మకముకలదు, (అనఁగా నీవెట్టి పనియైనను సాధింపఁగలవని తా.)

౧౦౧౩ అథామన్యే శ్రత్తే అస్మా అధాయి వృషాచోదస్వ మహతేధనాయ।

మానో అకృతే పురుహూత యోనా విన్ద్రక్షుధ్యద్భ్యోవయ ఆసుతిందాః॥౬॥

ద॥ తరువాత నింద్రా! నిన్ను మనసులో నెఱింగితిని. నీబలమును మేము నమ్మినాము. (కోర్కెల) వర్షించు నీవు అధికధనము కొఱకు మమ్ము బ్రేరేపింపుము. అనేకులచే బిలువఁబడు నింద్రా! ధనములేని యింటియందు మమ్ముంచకుము. ఆకలికలిగియున్న యితర స్తుతికర్తలకుంగూడ నన్నమును పానయోగ్యమయిన క్షీరాదికమును ఇమ్ము.

౧౦౧౪. మానోవధీరిన్ద్ర మాపరాదా మానః ప్రియా భోజనాని ప్రమోషీః।

అణ్డామానో మఘవఞ్ఛక్ర నిర్భేన్మానః పాత్రాభేత్సహజానుషాణి॥ ౮॥

ద॥ ఇంద్రా! మమ్ము హింసింపకుము. విడిచిపెట్టకుము. మాకిష్టమయిన భోగములను అపహరించకుము. ధనముగల యింద్రా! (శకరి = సమర్థుడని వ్యు) మాగర్భమందున్న సంతానమును జెఱుపకుము. మాతోఁగూడఁ బుట్టిన యజ్ఞపాత్రలను బోఁగొట్టకుము. (తమతోఁ బుట్టుటఁగా తము తాతతండ్రులనుండి యాగములనేతవల్లఁ బాత్రలు తాము పుట్టినప్పటికే యున్నవని తా. తమ తరువాత తమ సంతతివారు చేయుదురుగానఁ బాత్రలను బోఁగొట్టకుమన్న తా)

౧౦౧౫. అర్వాజేహి సోమకామం త్వాహురయం సుతస్తస్య పిబామదాయ।

ఉరువ్యచా జఠర ఆవృషస్వ పితేవ నఃశ్రుణుహిహూయమానః॥ ౯॥

వం॥ ఇంద్రుఁడా! నీవు అభిముఖుఁడవై రమ్ము. ఏమంటే, నిన్ను సోమము కోరిన వానిఁగా బూహ్వలనుచున్నారు. ఈసోమము సిద్ధపఱుపఁబడినది. వచ్చి మదము కొఱకు ఆసోమమును ద్రావుము. విశాలమగు కడుపుకలవాఁడవగుచు నీయుదర మంతయుఁ బోసికొనుము. ఇట్లు నీవు పిలువఁబడి తండ్రివలె మా మాటలను వినుము.

---

## సూక్తము. ౧౦౫.

(ఋషి - కుత్సుఁడు; దేవత - విశ్వేదేవతలు : ఛందస్సు - ౧౯ త్రిష్టుప్. ౮ మహా బృహతి; ౧-౬ మహాబృహతి; ౭, ౯-౧౮ పఙ్క్తి.)

౧౧౧౬. చన్ద్రమా అప్స్వ౧న్తరా సుపర్ణో ధావతే దివి ।
నవో హిరణ్యా నేమయః పదంవిన్దన్తి విద్యుతో విత్తంమే అస్యరోదసీ। ౧॥

వం॥ ఉదకముల మధ్యను చంద్రుఁడు సూర్యకాంతులతోఁ గూడి ద్యులోకమందుఁ బరువిడుచున్నాఁడు. ఈ చంద్రుని బంగారు కిరణములారా! మీస్థానమును దెలియఁజాలరు. (నేనుగూడఁ దెలియలేను) ఓ ద్యావాభూములారా? నా యీస్తోత్రములను దెలిసికొనుడు. (నన్ను రక్షింపుఁడని బావిలోఁబడియున్న త్రితుఁడు దేవతల స్తుతించుచున్నాఁడు. ఏకతుఁడు. ద్వితుడు, త్రితుఁడను ముగ్గురు ఋషులు నిర్జలారణ్యస్థలమున నివసించిరట. వారుముగ్గురు నీటికై పోయిపోయి యొకచో బావింగాంచిరి. బావినీరు త్రావి త్రితుఁడు మిగిలిన యుదకము దెచ్చి యిచ్చినాఁడట. వారానీరు త్రాగి ఆ నూతిలో త్రితుని బడద్రోసి మీఁద బండిచక్రమును మూతగావేసి వాని ధనమునపహరించి ఏకతద్వితులు లేచిపోయిరి. అనికథ. అతఁడు ఆ నూతిలోనుండి యిట్లు స్తుతించెను)

౧౧౧౭. అర్థమిద్వా ఉ అర్థిన ఆజాయా యువతే పతిమ్ ।
తుఞ్జాతే వృష్ణ్యం పయః పరిదాయ రసం దుహే విత్తంమే అస్యరోదసీ॥ ౨॥

వం॥ ధనము కోరుచున్న వారు ధనము సంపాదించుకొనుచున్నారు. భార్య పతిని ప్రీతితోఁ గలియుచున్నది. ఆదంపతులు ఉదకరూపమునున్న వీర్యము ఒకరితో నొకరుకలియుట చేతఁ గలిగించుచున్నారు. ఆరసమును భార్యధరించి బిడ్డనుగను

వ॥ ఓ దేవతలారా? మీరు కర్మఫలములను పోషించునట్టి ఎక్కడకుఁ బోయి నది? వరుణునియొక్క ప్రియమైనచూపు ఎచటఁబోయెను? (పాపముబోగొట్టుచూపు అని తా.) గొప్పవాఁడగు అర్యముని సన్మార్గమేది? మేము మాశత్రువుల నతిక్ర మించెదము. ఓ ద్యావాభూములారా! మాస్తోత్రముం దెలియుఁడు.

౧౧ ౨౨. అహంసో అస్మియః పురాసుతే వదామి కానిచిత్ ।

తంమా వ్యన్త్యాధ్యో వృకోన తృష్ణజం మృగంవిత్తంమే అస్య రోదసీ॥ ౭॥

వ॥ దేవతలారా! పూర్వకాలమందు సోమరసము తీయఁబడియుండఁగా ఏ నేను కొన్ని స్తుతులను జెప్పియుంటినో ఆతఁడనే నేను.

౧౧ ౨౩. సంమాతప న్త్యభితః సపత్నీరివ పర్శవః ।

మూషోనశిశ్నా వ్యదన్తి మాధ్యః స్తోతారంతే శతక్రతోవిత్తంమే అస్యరోదసీ॥ ౮॥

వ॥ ఓ యింద్రా! యీ బావి రెండు ఒడ్డు రెండుపార్శ్వముల యెముకలవలె (నా శరీరమును నొక్కుచు) యిద్దఱు సవతులు (పెనిమిటిని బాధించు) నట్లు నన్ను బాధించుచున్నవి. అధికప్రజ్ఞావంతుఁడవగు నింద్రా! నీ స్తుతికర్తనగు నన్ను మనః కష్టములు (నేతకై గంజిపూసి సరిచేసిన) దారములను ఎలుకలు కొఱికివేయునట్లు కొఱికివేయుచున్నవి. ద్యావాభూములారా! నాప్రార్థనను వినుఁడు.

౧౧ ౨౪. అమీయే సప్తరశ్మ యస్తత్రామే నాభిరాతతా ।

త్రితస్త ద్వేదాప్త్యః సజామిత్వాయ రేభతి విత్తంమే అస్యరోదసీ॥ ౯॥

వ॥ ఈ స్వర్గమందున్న యేయేడు సూర్యకిరణములు కలవో ఆ సూర్యకిరణము లందు నామనస్సు (లేక ప్రాణము) అంటుకొనియున్నది. ఉదకపుత్రుఁడయిన త్రిత ఋషి ఆ విషయము నెఱుంగుచున్నాఁడు. అతఁడు నూతినుండి బయటికి రాఁదలచి (కిరణములను) స్తుతించుచున్నాఁడు. ఓ ద్యావాభూములారా! వు॥

దం॥ ఓ యగ్నీ నీ యెన్నందగిన ఆ ప్రసిద్ధమగు బంధుత్వము దేవతలందుఁ గలదు. కనుక మిగుల బుద్ధిశాలివగు నీవునాయొక్క యజ్ఞమందుండి మనువు యాగమునందువలెను దేవతలను విధిప్రకారము పూజింపుము. ఓ ద్యావా భూములారా! నాప్రార్థన నెఱుంగుఁడు.

౧౧౨౯. సత్తో హోతా మనుష్వదా దేవాఅచ్ఛా విదుష్టరః ।

అగ్నిర్హవ్యా సుషూదతి దేవో దేవేషు మేధిరో విత్తంమే అస్యరోదసీ॥ ౧౪॥

దం॥ మనువు యజ్ఞమందువలెనే (మాయజ్ఞమందు) కూర్చొని దేవతలం బిలుచుచున్నవాఁడై, అధికజ్ఞానవంతుఁడై, దేవతలలో మేధాశాలియైన యగ్నిదేవుఁడు దేవతల కభిముఖముగా హవిస్సుల నిచ్చుచున్నాఁడు. ఓ ద్యావాభూములారా! నాస్తుతి నెఱుంగుడు.

౧౧౩౦. బ్రహ్మా కృణోతి వరుణో గాతువిదం తమీమహే ।

వ్యూర్ణోతి హృదామతిం నవ్యో జాయతామృతం విత్తంమే అస్య రోదసీ॥౧౫॥

దం॥ వరుణుఁడు రక్షణ కర్మనుజేయుచున్నాఁడు. (తరించు) మార్గము నెఱింగినట్టి ఆ వరుణుని బ్రార్థింతుము. స్తుతికర్త మనస్సుతో స్మరింపఁదగిన స్తవమును బ్రకటింపఁ జేయుచున్నాడు. స్తవనీయుఁడైన వరుణుఁడు సత్యమగువాఁడు (అనఁగా ఫలములిచ్చువాఁడని తా.) అగుఁగాక. ఓ ద్యావాభూములారా! ఇత్యాది పూ.

౧౧౩౧. అసౌ యః పంథా ఆదిత్యో దివి ప్రవాచ్యంకృతః ।

నసదేవా అతిక్రమే తంమర్తాసో నపశ్యథ విత్తంమే అస్యరోదసీ॥ ౧౬॥

దం॥ (బ్రహ్మలోకమును జేరువారికి) మార్గభూతుఁడయిన యే యీ సూర్యుఁడు ద్యులోకమందు స్తుతింపఁదగినవాఁడుగా నిలువఁబడెను. దేవతలారా! ఆ సూర్యుఁడు మీచే నతిక్రమింప శక్యుఁడుగాడు. మనుష్యులగు ఓ, ఏకత ద్వితులారా! మీరెఱుంగలేకపోతిరి. ఓ ద్యావాభూములారా! ఇత్యాది సమానం.

అనువాకము. ౧౬.

సూక్తము ౧౦౬.

(ఋషి - కుత్సుడు ; దేవత - విశ్వదేవతలు ; ఛందస్సు - ౧-౬ జగతి; ౭ త్రిష్టుప్)

౧౧౩౫. ఇంద్రం మిత్రంవరుణమగ్ని మూతయేమారుతంశర్ధోఅదితిం హవామహే ।

రథంన దుర్గా ద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౧॥

దం॥ రక్షణకొఱకు ఇంద్రుని, మిత్రుని, వరుణుని, అగ్నిని, మరుత్తులగణమును మేము ప్రార్థించుచున్నాము. మానివాసమునకుఁ గారణభూతులగునట్టి, మంచిదాతలయిన ట్టీయింద్రాదులు సమస్తమయిన పాపమునుండియు, దుర్గమప్రదేశమునుండి రథమును ఉద్ధరించి రక్షించినట్లు మమ్ము రక్షింతురుగాక.

౧౧౩౬. తఆదిత్యా ఆగతా సర్వతాతయే భూతదేవా వృత్రతూర్యేషు శంభువః ।

రథంన దుర్గాద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౨॥

దం॥ అదితిపుత్రులగు ఓ దేవతలారా! సకలశూరులు గలయుద్ధములోఁ దోడుపడుటకు రండు. యుద్ధములందు సుఖమునుగలుగఁ జేయువారుకండు. తక్కినదంతయు పూ-స.

౧౧౩౭. అవంతునః పితరః సుప్రవాచనా ఉతదేవీ దేవపుత్రే ఋతావృధా ।

రథంనదుర్గా ద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౩॥

దం॥ స్తుతింప యోగ్యులగు (అగ్నిష్వాత్తాది) పితృదేవతలు మమ్ము అనాయాసముగా రక్షింతురుగాక. దేవతలు కొమాళ్లుగాఁగలట్టి యజ్ఞము నభివృద్ధి పఱచునట్టి భూలోక ద్యులోకదేవులు మమ్ము రక్షించుఁగాక! తక్కినది పూ-స

౧౧౩౮. నరాశంసం వాజినం వాజయన్నిహక్షయద్వీరంపూషణం సుమ్నై రీమహే ।

రథంనదుర్గా ద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౪॥

దం॥ నరాశంసుఁడను (నరులచే స్తుతింపఁబడు) పేరుగలట్టి, అన్నముగలట్టి, అగ్నిని ప్రజ్వలింపఁ జేయుచు ఈకాలమందు స్తుతించుచున్నాము. ఆ విధముగా మిక్కిలి బలశాలియగు పూషదేవుని స్తోత్రములతోఁ బ్రార్థించుచున్నాము. మిగిలినది పూ॥

౧౧౩౯. బృహస్పతే సదమిన్నః సుగంకృధి సంయోర్యత్తే మనుర్హితం తదీమహే ।
రథం నదుర్గా ద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౫॥

దం॥ ఓ బృహస్పతీ! యెల్లపుడును సుఖమును మాకుఁజేయుము. రోగశాంతి చేయు సాధనమేది బ్రహ్మచే నీవద్ద నుంచబడెనో దానిని గోరుచున్నాము. తక్కినది పూర్వసమము.

౧౧౪౦. ఇంద్రంకుత్సో వృత్రహణం శచీపతిం కాటే నిబాళ్హ ఋషిరహ్వదూతయే ।
రథంనదుర్గా ద్వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన॥ ౬॥

దం॥ నూతిలోఁ ద్రోయఁబడిన కుత్సుఁడను ఋషి రక్షణము కొఱకు శత్రునాశకుఁడైనట్టి, సర్వకార్యములకు నీశుఁడగునట్టి, యింద్రునిఁ బిలిచెను. తక్కినది పూ॥స

౧౧౪౧ దేవైర్నో దేవ్యదితిర్నిపాతు దేవస్త్రాతా త్రాయతామప్రయుచ్ఛన్ ।
తన్నోమిత్రో వరుణోమామహంతా మదితిఃసింధుః పృథివీ ఉతద్యౌః॥ ౭॥

దం॥ దేవియయినఅదితి (కొమ్మాళ్లగు) దేవతలతోఁగూడ మమ్ము రక్షించుఁగాక. సర్వరక్షకుడైన సూర్యదేవుఁడు జాగ్రత్త కలవాఁడయి రక్షించుఁగాక. ఈ సూక్తమందున్న ప్రార్థనను మిత్రవరుణాదితి సింధువులు, ద్యావాభూలోక దేవతలును గౌరవింతురుగాక.

---

## సూక్తము, ౧౦౭.

(ఋషి - కుత్సుఁడు; దేవత - విశ్వేదేవతలు ; ఛందస్సు - త్రిష్టుప్)

౧౧౪౨. యజ్ఞో దేవానాం ప్రత్యేతిసుమ్న మాదిత్యాసో భవతా మృళయంతః ।
ఆవోర్వాచీ సుమతిర్వవృత్యాదం హోశ్చిద్యావరివో విత్తరాసత్॥ ౧॥

వ॥ దేవతల సుఖమును యజ్ఞము పొందుఁగాక. ఓ దేవతలారా! సుఖపెట్టువారు కండు. మీయనుగ్రహబుద్ధి మాకభిముఖముగా వచ్చుఁగాక. ఏ మీయనుగ్రహము దరిద్రునకు ధనమధికముగా నిచ్చునట్టిది యగునో, ఆ బుద్ధి మాకభిముఖముగా వచ్చుఁగాక.

౧౧౪౩. ఉపనో దేవా అవసాగమం త్వంగిరసాం సామభిస్తూయమానాః ।

ఇంద్ర ఇంద్రియై ర్మరుతో మరుద్భి రాదిత్యైర్నో అదితిః శర్మయంసత్॥ ౨॥

వ॥ అంగిరోఋషుల స్తుతులచేత స్తుతింపఁబడి సర్వదేవతలును రక్షణలతో మావ ద్దకుఁ జేరుదురుగాక. ఇంద్రుఁడు ధనములతో వచ్చుగాక. మరుత్తులు ప్రాణాది వాయువులతో వత్తురుగాక. తనకొడుకులతోఁగూడ అదితిదేవి మాకు సుఖము నిచ్చుఁగాక.

౧౧౩౪. తన్న ఇంద్ర స్తద్వరుణ స్తదగ్ని స్తదర్యమా తత్సవితాచనోధాత్ ।

తన్నో మిత్రో వరుణో మామహంతామదితిః సింధుః పృథివీ ఉతద్యౌః ॥ ౩॥

వ॥ మాచేఁ బ్రార్థింపఁబడిన యీ యన్నమును ఇంద్రుఁడు ఇచ్చుఁగాక. దానిని వరుణుఁడును, దానిని అగ్నియును; దానినర్యముఁడును, దానిని సవితృదేవుఁడును మాకు నిత్తురుగాక. ఆ యీ స్తుతిని మిత్రాది దేవతలు పూజింతురుగాక.

—:-o-:—

## సూక్తము. ౧౦౯.

(ఋషి - కుత్సుఁడు; దేవత - ఇంద్రాగ్నులు; ఛందస్సు - త్రిష్టుప్.)

౧౧౪౫. యమింద్రాగ్నీ చిత్రతమో రథోవామభి విశ్వాని భువనాని చష్టే ।

తేనాయాతం సరథం తస్థివాంసాథా సోమస్య పిబతం సుతస్య ॥౧॥

దం॥ ఓయింద్రాగ్నులారా! మిక్కిలి స్తుతింపఁదగిన మీయిద్దఱి యేరథము లోకములను బ్రకాశింపఁ జేయుచున్నదో ఆ రథముతో రథవంతులై రండు. వచ్చిన తరువాత పిండిన సోమరసమును ద్రావుఁడు.

౧౧౮౬. యావదిదం భువనం విశ్వమస్త్యురువ్యచా వరిమతా గభీరమ్ ।
తావాఁ అయం పాతవే సోమో అస్త్వరమింద్రాగ్నీ మనసే యువభ్యామ్ ॥ ౨॥

దం॥ సమస్తమయిన యీజగత్తు ఎంతవిరివిగాఁ దన గౌరవముతో గంభీరమై యున్నదో; యింద్రాగ్నులారా! మీరు త్రావుటకు ఈ సోమరసము; అంతయెక్కువగా మీమనస్సునకుఁ దృప్తి గలిగించుఁగాక.

౧౧౮౭. చక్రాథేహి సధ్ర్యఙ్నామ భద్రం సధ్రీచీనా వృత్రహణా ఉత స్థః ।
తావింద్రాగ్నీ సధ్ర్యంచా నిషద్యావృష్ణః సోమస్యవృషణా వృషేథామ్ ॥ ౩॥

దం॥ ఓ యింద్రాగ్నులారా! మీపేరు "ఇంద్రాగ్నులని" కలిసియుండునట్లు చేసికొన్నారేల? వృత్రసంహారులారా! కలిసియే మీ యిద్దఱు తిరుగుదు రేల? (ఇష్టార్థములు) వర్షము కురిపించువారలారా! ఆ మీరు కలిసి వేదికపైఁ గూర్చుండియే వర్షము కురిపించునట్టి సోమరసమును తృప్తిగాఁ ద్రావుఁడు.

౧౧౮౮. సమిద్ధేష్వగ్నిష్వానజానా యతస్రుచా బర్హిరు తిస్తిరాణా ।
తీవ్రైః సోమైః పరిషిక్తేభిరర్వాగేంద్రాగ్నీ సౌమనసాయ యాతమ్ ॥ ౪॥

దం॥ అగ్నులు వెలిగినవై యుండగా (దక్షిణాగ్ని-గార్హపత్యము ఆహవనీయమను మూఁడగ్నులు) నేతిలోఁదడిపిన హవిస్సులను స్రుక్కులను (గరిటెవంటిహోమసాధనము) పట్టుకొనియున్నట్టి వారై దర్భలమీఁదఁ గూర్చున్నట్టి (అధ్వర్యు - ప్రతిష్ఠాతలు) వారుఅయ్యిరి. ఓ యింద్రాగ్నులారా! తీవ్రముగా మదముగలిగించునట్టి పాత్రలలోఁ బోయఁబడినట్టి సోమరసముతో మాకెదురుగా మామీఁదనను గ్రహించుటకు రండు.

౧౧౪౯. యానీంద్రాగ్నీ చక్రథుర్వీర్యాణి యాని రూపాణ్యుత వృష్ణ్యాని ।
యా వాం ప్రత్నాని సఖ్యా శివాని తేభిః సోమస్య పిబతం సుతస్య॥ ౫॥

వం॥ ఇంద్రాగ్నులారా! (వృత్రవధాది) యే వీరకృత్యములు మీరు చేసితిరో యే యే మూర్తులను (గోవులు, అశ్వములు మొ॥) చేసితిరో మఱియు వర్షము కురి పించు నేయే పనులు చేసితిరో, మీయొక్క పురాతనమైన, మంగళకరమైన స్నేహము మొదలగునట్టి యేభావములు కలవో, ఆ యన్నిటితోనుగూడి పిండిన సోమరసమును మీరు త్రావుడు.

౧౧౫౦. యదబ్రవం ప్రథమం వాం వృణానో౽యం సోమో అసురైర్నో విహవ్యః ।
తాం సత్యాం శ్రద్ధామభ్యా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య॥ ౬॥

వం॥ ఇంద్రాగ్నులారా! కర్మలు ప్రారంభించునపుడే మిమ్ము వరించుచు (అనఁగా కోరుచు నని తా.) ఏ మాటను బల్కితిమో (సోమముతో మిమ్ముఁ బ్రీతులఁ జేతుమని సంకల్పం చెప్పినాను) సత్యమయిన శ్రద్ధకల అ మాటలను నమ్మిరండు. తరువాత పిండిన సోమరసమును త్రావుఁడు. ఋత్విజులచేత నీ సోమరసము చక్కఁగా హోమము చేయఁబడుచున్నది.

౧౧౫౧. యదింద్రాగ్నీ మదథః స్వే దురోణే యద్బ్రహ్మణి రాజని వా యజత్రా ।
అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య॥ ౭॥

వం॥ పూజ్యులగునో యింద్రాగ్నులారా! మీనివాసమందు సంతోషముగానుండి నను లేక యాగకర్తలున్నచోట్ల దృప్తిగానున్నను సరే! ఏ రాజుదగ్గఱ నున్నను (ఏస్థలమందున్నను) ఆచోటినుండి (కోర్కెల) వర్షము గురిపించునట్టివారలారా! తప్పక రండు. వచ్చి పిండిన సోమమును త్రావుఁడు.

౧౧౫౨. యదింద్రాగ్నీ యదుషు తుర్వశేషు యద్ద్రుహ్యుష్వనుషు పూరుషు స్థః ।
అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య॥ ౮॥

దం॥ ఇంద్రాగ్నులారా! మీరొకవేళ యదువుల దగ్గఱనో, తుర్వశులవద్దనో ద్రుహ్యులవద్దనో, పూరువంశస్థులవద్దనో, అనువంశస్థులవద్దనో ఉండినప్పటికిని అక్కడి నుండి మాయజ్ఞమువద్దకువచ్చి సోమము త్రాగుడని పూర్వవతు (ఇచట ఈపేళ్లు యయాతి కొమాళ్లపేళ్లు. అయినను వీటికి వేఱర్థములుకూడఁ గలవనివారికి ఎట్లన - యదు = హింసలేని నరులు. తుర్వశ = హింసకలనరులు. ద్రుహ్యు=ద్రోహు లగు నరులు. అను = జ్ఞాతులగు మానవులు. పూరు = కోర్కెలను పూర్తిచేయు వారు అని.)

౧౧౯౩. యదింద్రాగ్నే అవమస్యాం పృథివ్యాం మధ్యమస్యాం పరమస్యాముతస్థః।
అతః పరివృషణా వాహియాత మథాసోమస్య పిబతం సుతస్య॥ ౯

దం॥ ఓ యింద్రాగ్నులారా! సమీపమున నుండు భూమియందుఁగాని, అంతరిక్ష లోకమందుఁగాని, చాలదూరమగు ద్యులోకమందుగాని మీరున్ననుసరే, మా యాగమునకువచ్చి సోమము త్రాగుఁడన్నది. పూర్వవతు.

౧౧౯౪. యదింద్రాగ్నీ పరమస్యాం పృథివ్యాం మధ్యమస్యా మవమస్యాముతస్థః।
అతః పరివృషణా వాహియాత మథాసోమస్య పిబతమ్ సుతస్య॥ ౧౦

దం॥ పదములమార్పేకాని యర్థభేదములేదు.

౧౧౯౫. యదింద్రాగ్నీ దివిష్ఠోయత్ పృథివ్యాం యత్పర్వతేష్వోషధీష్వప్సు।
అతః పరివృషణా వాహియాత మథాసోమస్య పిబతమ్ సుతస్య॥ ౧౧

దం॥ ఇంద్రాగ్నులారా! ద్యులోకమందున్నను, లేక భూలోకమందున్నను, పర్వత ములమీఁదనున్నను, సస్యములోనున్నను, ఉదకములలోనున్నను మీరు వర్షము కురిపించువారగుచు. శేషము పూర్వసమము.

౧౧౯౬. యదింద్రాగ్నీ ఉదితా సూర్యస్య మధ్యే దివః స్వధయా మాదయేథే।
అతః పరివృషణా వాహియాత మథాసోమస్య పిబతం సుతస్య॥ ౧౨

ద॥ ఇంద్రాగ్నులారా! ఉదయించిన సూర్యునియొక్క ప్రకాశముగల యంతరిక్షముయొక్క మధ్యమందు మీ తేజస్సుతో ఎంతృప్తి గలిగియున్నారో, కాని, ఆచోటినుండి మా యాగమునకు వచ్చి యిత్యాది పూ॥స॥

౧౧౪౭. ప వేంద్రాగ్నీ పపివాంసా సుతస్య విశ్వాస్మభ్యం సంజయతంధనాని ।

తన్నోమిత్రో వరుణో మామహంతామదితిః సింధుః పృథివీ ఉతద్యౌః॥ ౧౩॥

ద॥ ఓ యింద్రాగ్నులారా! మేము పిండిన సోమము త్రావిన మీరు మాకొఱకు [illegible]

[illegible]

---

## సూక్తము. ౧౦౯.

(ఋషి - కుత్సుడు; దేవత - ఇంద్రాగ్నులు; ఛందస్సు - త్రిష్టుప్)

౧౧౪౮. విహ్యఖ్యం మనసా వస్య ఇచ్ఛన్నింద్రాగ్నీ జ్ఞాసఉతవా సజాతాన్ ।

నాన్యాయువత్ప్రమతిరస్తి మహ్యం సవాంధియం వాజయంతీ మతక్షమ్॥ ౧॥

ద॥ ఓ యింద్రాగ్నులారా! శ్రేష్ఠమయిన ధనమును కోరుచున్న నేను జ్ఞాతులను గాని, జ్ఞాతులు కానివారిని కాని తెలిసికొంటిని. మీకంటెను ఇతరులిచ్చిన బుద్ధి (మాకు లేదు) అట్టి బుద్ధికల నేను అన్నమునుగోరు స్తుతిని చేసితిని (అతక్షం = చెక్కడపుపనివాడు చెక్క వస్తువును తయారుచేసినట్లు తయారు చేయుటకుం జెల్లును.)

౧౧౪౯. అశ్రవంహి భూరి దావత్తరావాం విజామాతు రుతవాఘా స్యాలాత్ ।

అథా సోమస్య ప్రయతి యువభ్యామింద్రాగ్నీ స్తోమంజనయామి నవ్యమ్॥ ౨॥

ద॥ ఓ యింద్రాగ్నులారా! మేనమామకంటెను, మఱియు బావమఱిదికంటెను ఎక్కువ ధనమిచ్చువారింగా మిమ్ము వింటిని. అనన్తరము మీకొఱకు సోమరసదానముతోఁగూడ నూతనమయిన స్తుతిని బుట్టించుచున్నాను.

౧౧౬౦. మాచ్ఛేద్మరశ్మీఀరితి నాధమానాః పితౄణాంశక్తీ రనుయచ్ఛమానాః।

ఇంద్రాగ్నిభ్యాం కంవృషణో మదంతి తాహ్యద్రీ ధిషణాయా ఉపస్థే॥ ౩॥

దం॥ త్రాడువలె నెడఁతెగని సంతానమును తెగిపోఁజేసికొనఁగూడదని యాచించుచు తాతతండ్రుల శక్తివంటి శక్తిగల కొడుకులను, మనుమలను శాశ్వతముగ గోరుచు యజమాన దంపతులు ఇంద్రాగ్నులవలన సుఖమును స్తుతించుచున్నారు. ఏమంటే, శత్రువులను హింసించునట్టి యా యింద్రాగ్నులు స్తుతిసమీపమందు ఉందురు.

౧౧౬౧. యువాభ్యాం దేవీ ధిషణా మదాయేంద్రాగ్నీ సోమముశతీ సునోతి।

తావశ్వినా భద్రహస్తా సుపాణీ ఆధావతం మధునా పృఙ్క్తమప్సు॥ ౪

దం॥ ఓ యింద్రాగ్నులారా! మీయిద్దఱియొక్క మదము కొఱకు ప్రకాశించునట్టి స్తుతివాక్కు సోమరసమునుదంచి పిండుచున్నది. గుఱ్ఱములుకలట్టి, మంచిబాహువులు కలట్టి, మంచి చేతులుగలట్టి యిందాగ్నులారా! ప్రసిద్ధులయిన మీరు శీఘ్రముగరండు. ఉదకములందుండునట్టి తియ్యనిసారముతో సోమమును గూర్పుఁడు. (కలిపి త్రాగుఁడని తా.)

౧౧౬౨. యువామింద్రాగ్నీ వసునోవిభాగే తవస్తమాసుశ్రవ వృత్రహత్యే।

తావాసద్యా బర్హిషి యజ్ఞే అస్మిన్ప్రచర్షణీ మాదయేథాం సుతస్య॥ ౫॥

దం॥ ఓ యింద్రాగ్నులారా! (స్తుతికర్తలకుఁ బంచుటకై) ధనమును ఏర్పఱచిన మీరు మహాబలవంతులగునట్లు వృత్రసంహార నిమిత్తమున వింటిమి. సర్వమును జూచుచున్న యింద్రాగ్నులారా! మీరు ఈ యాగమందు దర్భలమీఁదఁ గూర్చుండి అభిషవించిన సోమముయొక్క (రసముత్రావి) మదించుఁడు.)

౧౧౬౩. ప్రచర్షణిభ్యః పృతనాహవేషు ప్రపృథివ్యారిరిచాథే దివశ్చ।

ప్రసింధుభ్యః ప్రగిరిభ్యో మహిత్వా ప్రేంద్రాగ్నీ విశ్వాభువనాత్యన్యా॥ ౬॥

దం॥ యుద్ధములకుఁ బిలుపులు వచ్చినపుడు ఇంద్రాగ్నులారా! సమస్తనరులకంటెను భూమియందుండు నందఱికంటెను, ద్యులోకముకంటెను, ఉదకములకంటెను, పర్వతములకంటెను, సకలభూతములకంటెను మహిమచేత మించియుంటిరి.

౧౧౬౪. ఆభరతం శిక్షతం వజ్రబాహూఅస్మాఁ ఇంద్రాగ్నీ అవతం శచీభిః।
ఇమేను తే రశ్మయః సూర్యస్యయేభిః సపిత్వం పితరోన ఆసన్॥ ౭॥

దం॥ వజ్రహస్తులగునో యింద్రాగ్నులారా! మానిమిత్తము ధనము తెండు. మాకిండు. కర్మలను జేయుమమ్ము రక్షించుఁడు. ఏయింద్రియాపుఁడగు సూర్యుని కిరణములచేత మాపితరులు బ్రహ్మలోకమును జెందిరో ఆ సూర్యుని కిరణములే కదా యివి!

౧౧౬౫. పురందరా శిక్షతం వజ్రాహస్తాస్మాఁ ఇంద్రాగ్నీ అవతం భరేషు।
తన్నోమిత్రో వరుణో మామహంతా మదితిః సింధుః పృథివీ ఉతద్యౌః॥ ౮॥

దం॥ వజ్రము చేతులందుఁగలట్టి శత్రుపట్టణముల నశింపఁజేయునట్టి ఓ యింద్రాగ్నులారా! మాకు ధనమిండు. మఱియు యుద్ధములందు మమ్ము రక్షింపుడు. ఆ మాప్రార్థనను మిత్రవరుణాదు లార్గురు దేవతలు రక్షింతురుగాక.

---

## సూక్తము ౧౧౦.

(ఋషి కుత్సుఁడు; దేవత - ఋభుఁడు; ఛందస్సు - ౫, ౯, త్రిష్టుప్; మిగిలినవి జగతి)

౧౧౬౬. తతంమే అప స్తదుతాయతే పునః స్వాదిష్ఠాధీతి రుచథాయ శస్యతే।
అయంసముద్ర ఇహ విశ్వదేవ్యః స్వాహా కృతస్యసము తృప్ణుత ఋభవః॥ ౧॥

దం॥ ఓ ఋభుదేవతలారా! నాచే కర్మలు విస్తారముగాఁ జేయబడెను. అదే మరల మరల చేయఁబడుచున్నది. ప్రీతిగలిగించు స్తుతికూడ స్తుతింపఁదగినవానికై పఠింపబడుచున్నది. ఈ యజ్ఞమందు సముద్రమువలె నధికముగానున్న సోమరసము సకల దేవతలకు సరిపడునంతగా సంపాదింపఁబడినది. స్వాహా అని హోమముచేసిన సోమముతోఁ దృప్తినొందుడు.

౧౧౬౭. ఆభోగయం ప్రయదిచ్ఛంత ఐతనాపాకాః ప్రాంచో మమ కేచిదాపయః ।
సౌధన్వనాసశ్చరితస్య భూమనాగచ్ఛత సవితుర్దాశుషోగృహమ్॥ ౨॥

దం॥ ఓ ఋభు దేవతలారా! పరిపక్వజ్ఞానములేని పూర్వులు మాజ్ఞాతులలోఁ గొంద అగు మీరు అనుభవింపఁదగిన సోమరసమును గోరుచుఁ (దపస్సుఁ జేసినప్పటికెప్పుడు అరణ్యమునకు) బోతిరో ఓ సుధన్వపుత్రులారా! హవిస్సులిచ్చినట్టి సోమమును అభిషవించినట్టి యజమానునియొక్క యాగగృహమునకు అపుడు చేసిన తపస్సు యొక్క ఆధిక్యముచేత రండు.

౧౧౬౮. తత్సవితావో మృతత్వ మాసువదగోహ్యం యచ్ఛ్రవయంతఐతన ।
త్యంచిచ్చమస మసురస్యభక్షణ మేకంసంత మకృణుతా చతుర్వయమ్॥ ౩॥

దం॥ ఋభువులారా! దాఁచశక్యముగాని సూర్యునిగురించి సోమపానమిఁ దలచినవారై మీరెపుడు వచ్చితిరో ఏకారణముచేత విశ్వకర్మ నిర్మించిన అసురునియొక్క పానపాత్రను నాల్గు పానపాత్రములగా నొనర్చితిరో అపుడు ఆ సూర్యుఁడు మీకు దేవత్వము నిచ్చెను.

౧౧౬౯. విష్ట్వీ శమీతరణిత్వేన వాఘతో మర్తాసః సంతో అమృతత్వ మానశుః ।
సౌధన్వనాఋభవః సూరచక్షసః సంవత్సరే సమపృచ్యంత ధీతిభిః॥ ౪॥

దం॥ ఋత్విజులతోఁగూడిన ఋభువులు (దేవతలు చెప్పిన) పనులను శీఘ్రము చేసి (తాము) మనుష్యులయ్యునుగూడ దేవత్వముఁ బొందిరి. సుధన్వపుత్రులగు ఋభువులు సూర్యసమానకాంతిగల వారయి ఆయాయీకాలములందుఁ జేయఁబడు కర్మలచేత హవిర్భాగములనుభవింప నర్హులయిరి.

౧౧౭౦. క్షేత్రమివ విమము స్తేజనేన ఏకంపాత్ర మృభవో జేహమానమ్ ।
ఉపస్తుతా ఉపమంనాధమానా అమర్త్యేషుశ్రవ ఇచ్ఛమానాః॥ ౫॥

దం॥ ఋభువులు (దగ్గఱనున్న ఋషులచేత) స్తుతింపబడుచుఁ ప్రశస్తమగు సోమ రూపాన్నమును యాచించుచు దేవతలలోనున్న హవిస్సును గోరినవారై (విశ్వకర్మ

చేసిన) ఒక్క చమసను (= పానపాత్ర) కొలకఱ్ఱతో భూమిని గొల్చినట్లు కొలిచి తీక్ష్ణమగు నాయుధముచేత నాల్గుగా నొనరించిరి.

౧౧౭౧. ఆమసీపా మన్తరిక్షస్యనృభ్యః స్రుచేవఘృతంజుహావామ విన్మనా ।
తరణిత్వాయే పితురస్యసశ్చిరఋభవో వాజమరుహా దివోరజః॥ ౬॥

వం॥ అన్తరిక్షమునకు సంబంధించిన ఋభువులకొఱకు స్రుక్కుతో నేయితోఁ గలిసిన హవిస్సును జక్కగా హోమము సేయుదుము. స్తుతినింగూడఁ జేతుము. ఏఋభువులు జగత్పాలకుఁడగు సూర్యునియొక్క ఎగిరిపోవుటలోఁగల నేర్పును పొందిరో ఆ ఋభువులు స్వర్గలోక సంబంధమగు సోమరూపాన్నము పొందిరి.

౧౧౭౨. ఋభుర్న ఇంద్రః శవసానవీయా నృభుర్వాజే భిర్వసుభిర్వసుర్దదిః ।
యుష్మాకందేవా అవసాహాని ప్రియే ౩ భిత్రిష్ఠేమ పృత్సుతీ రసున్వతామ్॥ ౭॥

వం॥ బలముచేత మిగుల స్తవనీయుఁడైన ఋభువనువాఁడు మాకుఁ బ్రభువు నివాసహేతువులగు ధనములతో ఋభువు మమ్ము బ్రతికించువాఁడు. కనుకనే, కోర్కెల నిచ్చువాఁడగునుగాక. దేవతలారా! మీసంబంధమైన రక్షణలతోఁ గూడిన మాకనుకూలమయిన దినమందు మేము యాగమునకు విరోధులగువారి సేనలను యుద్ధములం దెదిరింతుము.

౧౧౭౩. నిశ్చర్మణ ఋభవోగామపింశత సంవత్సేనాసృజతా మాతరంపునః ।
సౌధన్వనాసః స్వపస్యయానరో జివ్రీయువానా పితరాకృణోతన॥ ౮॥

వం॥ ఋభువులారా! మీరు ధేనువును చర్మముతోఁ జక్కగాఁ గూడినట్లు సంధించితిరి. తల్లియగు నావును దూడతో మరలఁ గూడునట్లు చేసితిరి. ఓ సుధన్వపుత్రులారా! యజ్ఞనాయకులగు ఋభువులు వృద్ధులగు తలిదండ్రులను మరల యౌవనవంతులుఁగా నొనరించిరిగాదా!

౧౧౭౪. వాజేభిర్నో వాజసాతా వవిడ్ఢ్యృభుమాఇంద్ర చిత్రమదర్షి రాధః ।
తన్నో మిత్రోవరుణో మామహంతా మదితిఃసింధుః పృథివీఉతద్యౌః॥ ౯॥

దం॥ ఇంద్రుండా! ఋభువులతోఁ గూడిననీవు అన్నదానసమయమందు అన్నములతో (మమ్ము) జేర్చుము. వృద్ధినొందిన ధనము మాకిమ్ము. మా ఈ కోర్కెను మిత్రాది దేవతలార్యుడును రక్షింత్రుగాక.

---

సూక్తము. ౧౧౧.

(ఋషి - కుత్సుఁడు. దేవత - ఋభువులు. ఛందస్సు - ౫ త్రిష్టుప్; ౧-౪ జగతీ.)

౧౧౭౫. తక్షన్రథంసువృతం విద్మనాపస స్తక్షన్హరీ ఇంద్రవాహావృషణ్వసూ ।

తక్షన్పితృభ్యామృభవో యువద్వయ స్తక్షన్వత్సాయ మాతరంసచాభువమ్॥ ౧॥

దం॥ గొప్పపనులు చేసిన ఋభువులు చూడ సుందరమైన చక్రములుగల రథమును (అశ్వినీదేవతలకు) నిర్మించిరి. ఇంద్రుని వాహనములగు బలముగల అశ్వములను నిర్మించిరి. తల్లిదండ్రులకొఱకు యౌవనముతోఁగూడిన వయస్సును గలిగించిరి. కూడనుండునట్టి తల్లి ఆవును దూడకొఱకు నిర్మించిరి.

౧౧౭౬. ఆనోయజ్ఞాయ తక్షతఋభుమద్వయః క్రత్వేదక్షాయ సుప్రజావతీమిషమ్ ।

యథాక్షయామ సర్వవీరయావిశాతన్నః శర్ధాయధాసథాస్వింద్రియమ్॥ ౨॥

దం॥ ఋభువులారా! మాయజ్ఞముకొఱకు ప్రకాశించునట్టి హవిస్సునుగలిగించుఁడు. సత్కర్మకొఱకు, బలముకొఱకు మంచిపుత్రపౌత్రులుగల అన్నమునుగలుగఁజేయుఁడు. పుత్రపౌత్రయుక్త సంతానముతోఁ గూడ నెట్లుసుఖముగానుందుమో (అందుకుఁదగినట్లు) ధనమును మాకుబలము కొఱకుఁ జక్కగానిండు.

౧౧౭౭. ఆతక్షతసాతి మస్మభ్యమృభవః సాతింరథాయసాతి మర్వతే నరః ।

సాతింనోజైత్రీంసంమహేత విశ్వహాజామిమ జామింపృతనాసుసక్షణిమ్॥ ౩॥

వ౦॥ యాగము వృద్ధినొందించు ఋభువులారా! కర్మలాచరించి మాకై పొందదగిన ధనమును జక్కగఁజేయుఁడు. కొడుకులు మొదలగు వారికి ధనమును నిర్మింపుఁడు. అశ్వముల కొఱకు ధనమునిర్మింపుఁడు. ఎల్లపుడును యుద్ధములందు బంధువునైనను బంధువుగాని వానినైనను మమ్ము దిరస్కరించువానిని దిరస్కరింతుముగాక. (నరః=యాగము వృద్ధిచేయుఅని)

౧౧౭౮. ఋభుక్షణమింద్రమాహువఊతయ ఋభూన్వాజాన్మరుతః సోమపీతయే ।

ఉభామిత్రావరుణా నూనమశ్వినా తేనో హిన్వంతుసాతయేధియే॥ ౪॥

వ౦॥ గొప్పవాఁడయిన యింద్రుని రక్షణకొఱకుఁ బిలుచుచున్నాము. ఋభువిభువాజులను ముగ్గురను, మరుత్తులను సోమపానముకొఱకుఁ బిలుచుచున్నాము. కలిసియున్న మిత్రావరుణులను అశ్వినీదేవతలను ముఖ్యముగాఁ బిలుచుచున్నాము. ఆదేవతలు మమ్ము ధనముకొఱకును కర్మలకొఱకును శత్రుజయముకొఱకును బ్రేరేపింతురుగాక.

౧౧౭౯. ఋభుర్భరాయ సంశిశాతు సాతిం సమర్యజిద్వాజో అస్మాఁ అవిష్టు ।

తన్నోమిత్రో వరుణో మామహంతా మదితిః సింధుః పృథివీఉతద్యౌః॥ ౫॥

వ౦॥ (మొదటివాఁడయిన) ఋభువనువాఁడు మాకుధనమును యుద్ధముకొఱకు అనుకూలముగాఁ గలుగఁజేయునుగాక. యుద్ధములందు జయశీలుఁడయిన వాజుఁడను మూఁడవ ఋభుఁడు మమ్ము రక్షించుఁగాక? మాప్రార్థనను మిత్రాదిదేవతలార్గురును రక్షింతురుగాక.

---

## సూక్తము. ౧౧౨.

(ఋషి - కుత్సుఁడు ; దేవత - మొదటి ఋక్కునందు మొదటి పాదమునకు ద్యావాభూములు, రెండవపాదమునకు అగ్ని, అవశిష్ట సూక్తమునకు నశ్వినీదేవతలు; ఛందస్సు - ౨౪.౨౫ త్రిష్టుపు - తక్కినవి జగతి)

౧౧౮౦. ఈళేద్యావాపృథివీ పూర్వచిత్తయేగ్నిం ఘర్మంసురుచంయామన్నిష్టయే ।

యాభిర్భరేకారమంశాయ జిన్వథస్తాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్॥ ౧॥

దం॥ ముందుగాఁ దెలియుటకుగా ద్యులోకభూలోకములను స్తుతించుచున్నాను. అశ్వినీదేవతలురాఁగా యాగముకొఱకు ప్రజ్వలించునట్టి, మంచికాన్తికలట్టి (ఆహవనీయ) అగ్నిని స్తుతించుచున్నాను. ఓ యశ్వినీదేవతలారా! యుద్ధమందు జయప్రాప్తి కొఱకు ఎటువంటి రక్షణలతోఁగూడవచ్చి శంఖమును గట్టిగా నూదుచున్నారో అట్టి రక్షణలతోఁగూడ మమ్ము రక్షించిరండు. (రక్షణ = సాధనము)

౧౧౮౧. యువోర్దానాయ సుభరా అసశ్చతో రథమాతస్థుర్వచసం నమన్తవే ।

యాభిర్ధియో వథః కర్మన్నిష్టయే తాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్॥ ౨॥

దం॥ చక్కఁగా స్తుతింపఁబడునట్టి, ఇతరాసక్తి లేనట్టి, ఓ యశ్వినులారా! మీయొక్క రథమును దానముకొఱకు పండితుఁడు తెలియఁదగిన యర్థమునకై వాక్కును స్వీకరించినట్లు అవలంబించితిరి. (పదము ఏ యర్థము సరిగా నిచ్చునో పండితుఁడెఱిఁగి వాడుకొనునని తా.) కర్మయందు యాగము కొఱకు బుద్ధిశాలురయినవారిని యేరక్షణలతో రక్షించుచున్నారో ఆరక్షణలతో ఇత్యాది పూ॥

౧౧౮౨. యువంతాసాం దివ్యస్యప్రశాసనే విశాంక్షయథో అమృతస్యమజ్మనా ।

యాభిర్ధేనుమస్వం పిన్వథోనరాతాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్॥ 3॥

దం॥ యజ్ఞము నెఱవేర్చునశ్వినులారా! ద్యులోకమందుఁ బుట్టిన సోమరసపానము వల్లఁ గల్గిన బలముతో మీరు మూఁడులోకములలోనుండు ప్రజలయొక్క శిక్షణ (= నేర్పుటలో) మందుసమర్థులగుచున్నారు ఏరక్షణలతో గొడ్డుటావును (శయుఁడను ఋషికి) పాలిచ్చునట్లు చేసితిరో ఆరక్షణతో నని పూర్వవత్తు.

౧౧౮౩. యాభిః పరిజ్మా తనయస్య మజ్మనా ద్విమాతా తూర్షు తరణి ర్విభూషతి ।

యాభిస్త్రిమన్తు రభవద్విచక్షణ స్తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౪॥

దం॥ వాయువు తన పుత్త్రుఁడగు నగ్నియొక్క బలముతోఁగూడి ద్యులోకభూలోకముల నిర్మించువాఁడయ్యెను. అశ్వినులారా! యేరక్షణలతో సూర్యుఁడు శీఘ్రముగ పనువెత్తువారిలో బాగుగాఁ జరుగెత్తువాఁడయ్యెనో, యేరక్షణలతో మూఁడుయాగములు తెలిసిన (పాకయజ్ఞ, హవిర్యజ్ఞ, సోమయజ్ఞములు) కక్షీవంతుఁడు మిక్కిలి తెలివికలవాఁడయ్యెనో అట్టిరక్ష. పూర్వవత్తు.

౧౧౭౪. యాభీ రేభం నివృతం సితమద్భ్య ఉద్వందన మైరయతం స్వర్ద్రుశే।
యాభిఃకణ్వం ప్రసిషాసంత మావతం యభిరూషు ఊతిభి రశ్వినా గతమ్॥ ౫॥

దం॥ అశ్వినీదేవతలారా! బావిలో ద్రోయబడినట్టి, కట్టివేయబడినట్టి రేభఋషిని యేరక్షణల బయటికిఁ దీసితిరో అట్లే వందనుఁడను ఋషిని సూర్యునిజూచుటకు (నీటిలోనుండి పైకి లేవనెత్తిరో) కణ్వుని సూర్యతేజస్సు చూడఁగోరువానిని (ఈఋషిని రాక్షసులంధకారములోఁ బడివేసిరట!) ఏరక్షణలతో రక్షించితిరో ఆరక్షలతో పూర్వవతు.

౧౧౭౫. యాభిరంతకం జసమాన మారణే భుజ్యుంయాభి రవ్యథిభి ర్జిజిన్వథుః।
యాభిః కర్కంధుం వయ్యంచ జిన్వథ స్తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౬॥

దం॥ శత్రువులచే నూతిలోఁ ద్రోయఁబడి హింసింపఁబడుచున్న అంతకుఁడను రాజర్షిని ఓ యశ్వినీదేవతలారా! యేరక్షణలతో రక్షించితిరో (సముద్రమధ్యను ద్రోయబడిన (భుజ్యుఁడను రాజర్షిని యేరక్షణలతో (సుఖకరమైన యెండలతో) దరిజేర్చి తృప్తినొందించితిరో కర్కంధవనువానిని, వయ్యుఁడను వానిని యేరక్షలతో రక్షించితిరో ఆ రక్షణ అని పూర్వవతు.

౧౧౭౬. యాభిఃశుచంతింధనసాం సుషంసదం తప్తంఘర్మ మోమ్యావంతమత్రయే।
యాభిఃపృశ్నిగుం పురుకుత్సమావతం తాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్॥ ౭॥

దం॥ అశ్వినీదేవతలారా! ధనముగల శుచంతియను వానిని మంచిసభతోఁ గూడినట్లు ఏరక్షణలతోఁ జేసితిరో, ఏ రక్షణలతో (బ్రహ్మంజనునిచే అగ్నిలోఁ బడవేయఁబడి) తపించిన ఘర్ముఁడను వీరుని అత్రికొఱకు సుఖవంతునిగా జేసితిరో, యేరక్షణలతోఁ బృశ్నిగుఁడనువానిని, పురుకుత్సుఁడను వానిని రక్షించితిరో అశ్వినులారా! ఆ మంచి రక్షణలతో మాయాగమునకు రండు.

౧౧౭౭. యాభిః శచీభిర్వృషణా పరా వృజంప్రాంధం శ్రోణం చక్షస ఏతవేకృథః।
యాభిర్వర్తికాం గ్రసితా మముంచతం తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౮॥

వ॥ (ఇష్టములను) వర్షము కురిపించు నశ్వినీ దేవతలారా! ఏ రక్షణలతో (కుత్సునికి సహాయుడగు) పరావృజుని రక్షించితిరో, అంధుని (గ్రుడ్డివాని) చూచుటకు సమర్థునిగ జేసితిరో, యేరక్షణలతో (మోకాళ్లు లేని) శ్రోణుని నడచుటకు జేసితిరో, యేరక్షలతో (తోడేలు మ్రింగిన) వర్తికయను పక్షిని విడిపించితిరో, ఆరక్షణలతో సుఖాగమనము చేయుడు.

౧౧౨౮. యాభిః సింధుం మధుమంతమసశ్చతం వసిష్ఠం యాభిరజరావజిన్వతమ్ ।
యాభిః కుత్సం శ్రుతర్యం నర్యమావతం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్॥౯॥

వ॥ ఓ యశ్వినీ దేవతలారా! నదిని మధురోదకములుకల దానినిగాను ప్రవహించునట్లు ఏరక్షణలతో జేసితిరో ముదిమిలేని యో యశ్వినులారా! వసిష్ఠమునిని ఏ రక్షణలతో సంతోషపఱచితిరో, యేరక్షణలతో కుత్సుడు, శ్రుతర్యుడు, నర్యుడు అను ఋషులను రక్షించితిరో అట్టిరక్షణలతో సుఖాగమనము చేయుడు.

౧౧౨౯. యాభిర్విశ్పలాం ధనసామథర్వ్యం సహస్రమీళ్హ ఆజావజిన్వతమ్ ।
యాభిర్వశమశ్వ్యం ప్రేణిమావతం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్॥ ౧౦

వ॥ అశ్వినులారా! ధనాపేక్షగలదియు (శత్రువులు ఛేదించుటచే) నడువలేనట్టి విశ్పలయను నామెను బహుధనసాధ్యమగు యుద్ధమునందు నడుచునట్టిదానిగా నేరక్షణలతో జేసితిరో (అగస్త్య పురోహితుడగు ఖేలుడనురాజు భార్య విశ్పల) ఏరక్షణలతో అశ్వ్యుడనువాని కొమారుడును, స్తుతించుచున్నవాడునగు వశుడను ఋషిని రక్షించితిరో ఆ రక్షణలతో స్వాగతము సేయుడు.

౧౧౩౦. యాభిః సుదానూ ఔశిజాయ వణిజే దీర్ఘశ్రవసే మధు కోశో అక్షరత్ ।
కక్షీవంతం స్తోతారం యాభిరావతం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్॥౧౧॥

వ॥ శుభదాతలగు నశ్వినులారా! యుశిజయనునామె కొడుకైనట్టి, వర్తకము చేయుచున్నట్టి దీర్ఘశ్రవుడను ఋషికి ఏరక్షణలతో మేఘము వర్షోదకముల నిచ్చెనో, స్తుతించునట్టి కక్షీవంతుని ఏరక్షలతో రక్షించితిరో ఆ రక్షలతో స్వాగతము చేయుడు (=సుఖముగా రండు)

౧౧౯౧. యాభీరసాం క్షోదసోద్నః పిపిన్వథు రనశ్వం యాభీరథ మావతంజిషే ।
యాభిస్త్రిశోక ఉస్రియా ఉదాజతం తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥

ద॥ అశ్వినీ దేవతలారా! ఎండిపోయిననదిని గట్లునిండ నేరక్షణలతో బూరించి తిరో గుఱ్ఱాలులేని మీ రథమును జయముపొందుటకు వసంతనదే నడచునట్లు చేసి తిరో, యేరక్షణలతో (కణ్వపుత్రు:డయిన) త్రిశోకుడనువాడు (అపహరింపఁబడిన) గోవులను (రాక్షసులనుండి) పొందెనో. ఆ రక్షణలతో సుఖముగారండు. (రక్షణ=సాధనము; సామర్థ్యము; ఉపాయము)

౧౧౯౨ యాభిఃసూర్యం పరియాథః పరావతి మంధాతారం క్షైత్రపత్యేష్వావతమ్ ।
యాభిర్విప్రం ప్రభరద్వాజ మావతం తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥౧౩॥

ద॥ అశ్వినీ దేవతలారా! దూరమునందుండు సూర్యుని (రాహువుమింగినపుడు) ఏ రక్షలతో రక్షింపసంచరించితిరో, మాంధాతయను ఋషిని ఎట్లుక్షేత్రపాలకుని కొఱకుఁ జేయుకర్మలందు రక్షించితిరో, ఏరక్షలతో బుద్ధిశాలియగు భరద్వాజుని రక్షించితిరో ఆరక్షలతో సుఖముగారఁడు.

౧౧౯౩. యాభిర్మహా మతిథిగ్వం కశోజువం దివోదాసం శంబరహత్య ఆవతమ్ ।
యాభిః పూర్భిద్యే త్రసదస్యు మావతం తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥౧౪॥

ద॥ అశ్వినీ దేవతలారా! గొప్పవాఁడయినట్టి, అతిథులాశ్రయింపఁదగినట్టి (రాక్షస బాధచేత) ఉదకముల మధ్యఁబడఁబోవునట్టి దివోదాసుఁడను రాజర్షిని శంబరుఁడను అసురుని జంపునపుడు ఏరక్షణలతో రక్షింతిరో, యుద్ధమందు పురుకుత్సుఋషికొమారుఁడయిన త్రసదస్యు ఋషినిరక్షించితిరో ఆరక్షణలతో సుఖాగమనముచేయుఁడు.

౧౧౯౪. యాభిర్వమ్రం విపిపానముపస్తుతం కలింయాభిర్విత్తజానిం దువస్యథః ।
యాభిర్వ్యశ్వ ముతపృథి మావతం తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥౧౫॥

ద॥ ఓ యశ్వినీదేవతలారా! (విఖనసుని కొడుకు) వమ్రుఁడను ఋషిని భూసారము మాత్రముఁ దినుచు నందఱిచే శ్లాఘింపఁబడుచున్నవానిని యేరక్షణలతో

రక్షించిరో, భార్యను బొందినట్టి కలియను ఋషిని యేరక్షణలతో రక్షించితిరో మఱియు గుఱ్ఱములు పోయినట్టి (కోలుపోయినట్టి) పృథియను ఋషిని యేరక్షణలతో రక్షించితిరో అట్టి రక్షణలతో రండు.

౧౧౨-౧౬. యాభిర్నరా శయవే యాభిరత్రయే యాభిః పురా మనవే గాతుమీషథుః ।

యాభిః శారీరాజతం స్యూమరశ్మయే తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ ౧౬॥

దం॥ సర్వకర్మలను ప్రేరించునట్టి (= నరా, అనుదానికి) అశ్వినులారా! పూర్వకాలమందు శయుఁడను ఋషికొఱకు దుఃఖము లేకుండు మార్గమును ఏరక్షణలతో మీరు చేసితిరో, అట్లే అత్రికొఱకును మార్గమును ఏరక్షణలతో జేసితిరో (నూఱు ద్వారాల యంత్రగృహములో అత్రిని రాక్షసులు పడవేసిరట! అతని కశ్వినులు దారి కల్పించిరి.) మనువను రాజర్షికి బ్రతుకు మార్గము చేసితిరో (వ్యవసాయము చేసుకొనుటకు దారి) స్యూమరశ్మియను ఋషికి వారుతోఁ జేసిన బాణమును శత్రువులమీఁదఁ బడునట్లు ఏ రక్షణలతో చేసితిరో ఆరక్షణలతో మమ్ము రక్షింపరండు.

౧౧౨-౧౭. యాభిః పఠర్వా జఠరస్య మజ్మనాగ్నిర్నాదీదేచ్చిత ఇద్ధో అజ్మన్నా ।

యాభిః శర్యాతమవథో మహాధనే తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్॥ ౧౭॥

దం॥ అశ్వినీదేవతలారా! శరీరముయొక్క బలముతోఁగూడిన పఠర్వుఁడను రాజర్షి యుద్ధమందునే మీరక్షలతో (కఱ్ఱలచే) వృద్ధిపొందిన యజ్ఞాగ్నివలెఁ బ్రకాశించెనో శర్యాతుఁడను వానిని (ఇంద్రునితో నెదిరించినవానిని) యేరక్షణలతో యుద్ధమందు రక్షించితిరో ఆరక్షణలతో రండు.

౧౧౨-౧౮. యాభిరంగిరో మనసా నిరణ్యథోఽగ్రం గచ్ఛథో వివరే గోఅర్ణసః ।

యాభిర్మనుం శూరమిషా సమావతం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్॥ ౧౮॥

దం॥ అంగిరసుని గోత్రమునందుఁ బుట్టినవాఁడా! నీవు స్తుతించుము. ఓ యశ్వినీ దేవతలారా! స్తుతిచేత (ప్రీతులరై) యేరక్షణలతో మిగుల మీరు సంతోషింపఁ జేయుదురో, గోరూపధనముయొక్క ద్వారమునందు (పణిదాచిన గోవులను వెదకింప

...తా.) ఏ రక్షణలతో కూడినవారై యుంటిరో; శౌర్యవంతుఁడైన మనువను వానిని ...నము చేరను (అనఁగా యవలు మొ విత్తులిచ్చి వ్యవసాయము చేయించిరని తా.) ...రక్షణలతో రక్షించితిరో ఆరక్షణలతో రండు.

౧౧౯౮. యాభిఃపత్నీర్విమదాయ న్యూహథురాఘవా యాభిరరుణీ రశిక్షతమ్ ।
యాభిఃసుదాస ఊహథుః సుదేవ్యం౧ తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౧౯॥

వం॥ అశ్వినీదేవతలారా! విమదుఁడను రాజర్షితో భార్యను నెట్టి రక్షణలతో కలిపితిరో (పురుమిత్రుని కూతురు తన పెనిమిటితో నెదిరించినది. ఆమెను బోధించి మగల కలిపినారట!) ఎట్టి రక్షణలతో నెఱ్ఱని గోవులను (స్తుతికర్తలకు) ఇచ్చితిరో సుదాసుఁడను రాజునకు శ్రేష్ఠమయిన ధనము నే రక్షణలతో నిచ్చితిరో ఆ రక్షణలతో రండు.

౧౧౯౯ యాభిఃశంతాతీభవథో దదాశుషేభు జ్యం యాభిరవథో యాభిరధ్రిగుమ్ ।
ఓమ్యావతీంసుభరా మృతస్తుభంతా భిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౨౦॥

వం॥ అశ్వినీదేవతలారా! హవిస్సులనిచ్చు యజమానునకు నేరక్షణలతో సుఖము నిచ్చు వారగుచున్నారో, యేరక్షలచేత భుజ్యుని రక్షించితిరో, వేటితో అధ్రిగువను వానిని ఋతస్తుప్పనువానిని (వీరు ఋషులే) సుఖముగల సుభరయనుదానిని చక్కఁగ రక్షించితిరో ఆరక్షణలతో రండు.

౧౨౦౦. యాభిః కృశాను మసనే దువస్యథోజవే యాభిర్యూనో అర్వంత మావతమ్ ।
మధుప్రియం భరథః యత్సరడ్భ్య స్తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౨౧॥

వం॥ ఓ యశ్వినులారా! (సోమలతనమ్ముకట్టి) కృశానుఁడను వానిని యుద్ధమందేరక్షణలతోరక్షించితిరో, ఏరక్షణలతో వేగముపర్వరించిన యౌవనవంతుఁడగు పురుకుత్సునియశ్వమును రక్షించితిరో, తేనెటీగల అందఱికిష్టమగు తేనెను ఏరక్షణలతో సంపాదించితిరో ఆరక్షణలతో రండు.

౧౨౦౧. యాభిర్నరంగోషుయుధం నృషాహ్యేక్షేత్రస్య సాతాతనయస్యజిన్వథః ।
యాభీరథాఅవథోయా భీరర్వతస్తాభిరూషు ఊతిభి రశ్వినాగతమ్॥ ౨౨॥

దం॥ అశ్వినులారా! [illegible] యేరక్షణలతో [illegible] రక్షణలతో [illegible] రక్షణములను, [illegible] రక్షణలతో రక్షించితిరో ఆరక్షణలతో రక్షింపుడు.

౧౨౦౨. యాభిః కుత్సమార్జునేయం శతక్రతూ ప్రతుర్వీతిం ప్రచదభీతి మావతమ్ ।

యాభిర్ధ్వసంతిం పురుషంతి మావతం తాభిరూషు ఊతిభిరశ్వినాగతమ్ ॥ ౨౩॥

దం॥ బహువిధకర్మలుగల అశ్వినీ దేవతలారా! యింద్రపుత్రుండైన కుత్సుండను వానిని యేరక్షణలతో రక్షించిరో తుర్వీతియను వానిని దభీతియను వానిని ధ్వసంతియను పేరుపొందిన పురుషంతి మహర్షిని యేరక్షణలతో రక్షించితిరో ఆ రక్షణలతో రండు.

౧౨౦౩. అప్నస్వతీ మశ్వినా వాచమస్మే కృతం నోదస్రా వృషణా మనీషామ్ ।

అద్యూత్యేఽవసే నిహ్వయేవాం వృధేచనోభవతం వాజసాతౌ॥ ౨౪॥

దం॥ అశ్వినులారా! మా వాక్కును విహిత కర్మలతోఁ గూడినదానింగాఁ జేయుఁడు. వర్షము గురిపించువారగు శత్రునాశకులారా! మా బుద్ధిని సర్వమునుం దెలియుదానింగా నొనర్పుఁడు. తెల్లవారుజామున మిమ్ము రక్షణము కొఱకుఁ బ్రార్థించుచున్నాను. మీరు మాయొక్క వృద్ధికొఱకు అన్నప్రదాతలగుదురుగాక. (విషయస్పష్టము)

౧౨౦౪. ద్యుభిరక్తుభిః పరిపాతమస్మా నరిష్టేభిరశ్వినా సౌభగేభిః ।

తన్నోమిత్రో వరుణో మామహంతామదితిః సింధుః పృథివీ ఉతద్యౌః॥ ౨౫॥

దం॥ అశ్వినులారా! పగళ్లతోను, రాత్రులతోను మమ్ము రక్షింతురుగాక. బాధింపఁబడక ఉత్సాహము కలిగించు ధనములచేత మమ్ము రక్షింపుడు. మాయొక్క ఆ ప్రార్థనను మిత్రాది దేవతలార్గురును రక్షింత్రుగాక.

—:-o-:—

## అష్టమాధ్యాయము.

---

### సూక్తము ౧౧౩.

కుత్సఋషి, త్రిష్టుప్ఛందము, ఉషదేవత.

౧.౨౦౫. ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగాచ్చిత్రః ప్రకేతో అజనిష్ట విభ్వా ।
యథా ప్రసూతా సవితుః సవాయ ఏవా రాత్ర్యుషసే యోనిమారైక్॥ ౧॥

సం॥ వెలుఁగులన్నిఁటిలోను ఉషస్సుయొక్క వెలుఁగు శ్రేష్ఠము. అది (తూర్పున) వచ్చెను. అదిరాగానే వృద్ధినొందినదాని సంబంధమైన కిరణము సర్వవ్యాపియై యుండుటకునయించెను. ఎట్లురాత్రి సూర్యునివల్ల బుట్టినదో అట్లే ఉషోదేవత తృప్తికై రాత్రియొక్కస్థానముగలిగించెను (రాత్రిఉషస్సును కన్నదనితా)

౧.౨౦౬. రుశద్వత్సా రుశతీ శ్వేత్యాగాదారైగు కృష్ణా సదనాన్యస్యాః ।
సమానబంధూ అమృతే అనూచీ ద్యావా వర్ణం చరత ఆమినానే॥ ౨॥

సం॥ ప్రకాశించుచున్నదియు ప్రకాశించు (సూర్య) పుత్రుఁడుగలదియునగు ఉష ఉదయించుచున్నది. ఈ యుషయొక్క జన్మములను రాత్రిసంపాదించుచున్నది. ఈ రాత్ర్యుషస్సులు రెండును సమానబంధునగు సూర్యునితోఁ గూడినవై యొకదానినొకటి వెంబడించుచు సర్వప్రాణుల రూపమును మదిమినొందించుచుఁ బ్రకాశించుచుఁ దిరుగుచున్నవి.

౧.౨౦౭. సమానో అధ్వా స్వస్రోరనన్తస్తమన్యాన్యా చరతో దేవశిష్టే ।
న మేథేతే న తస్థతుః సుమేకే నక్తోషాసా సమనసా విరూపే॥ 3॥

దం॥ అక్కచెల్లెండ్రగు రాత్ర్యుషస్సులయొక్క సంచారమార్గము ఒకటియే. ఆమార్గము అనన్తము. ఆమార్గమందు సూర్యునిచే ఆజ్ఞాపింపఁబడి ఒక్కొకటి నడచుచున్నది. మంచిజన్మములుకల రాత్ర్యుషోదేవతలు వేర్వేరు రూపములుకలవైనను ఐకమత్యముకలవై ఒకదానినొకటి బాధింపలేవు. ఒకప్పుడును నిలిచియుండవు (అనఁగాఁ దిరుగుచున్నవని తా.)

౧౨౦౭. భాస్వతీ నేత్రీసూనృతానా మచేతి చిత్రావిదురోన ఆవః ।

పార్ప్యా జగద్వ్యునో రాయోఅఖ్యదుషా అజీగర్భువనానివిశ్వా॥ ౪.

ద॥ మిగులఁ బ్రకాశించునట్టి, వాక్కులకు నధికారియగునట్టి యుషోదేవత (తెల్లవారఁ గానే అందఱు మాటలాడుదురు. పక్షులు కూయును అని తా.) తెలియఁ బడెను. తెలియఁబడిన ఆయుష మా ద్వారములను ప్రకాశింపఁ జేయుచున్నది. (చీకటిలో నుండి బయలఁదీసెనని తా.) సర్వప్రపంచమును బ్రకాశింపఁ జేసి మా ధనములను మిగుల బ్రకాశము కలవానిఁగఁ జేసెను. (ధనము = వస్తువు) ఆ యుష సకలలోకములను బయలువఱచుచున్నది. (చీకటిలో సమిసిపోయిన వానినని తా.)

౧౨౦౮. జిహ్మశ్యే౩చరితవే మఘోన్యాభోగయ ఇష్టయేరాయ ఉత్వం ।

దభ్రంపశ్య ద్భ్యఉర్వియా విచక్షఉషా అజీగర్భువనానివిశ్వా॥ ౫.

ద॥ ఒకనిని గుఱించి భోగములనుభవించుటకు, మఱియొకనిఁగూర్చి యాగము చేయుటకు, మఱొకని గుఱించి ధనముకొఱకు ఆయుష అగుచున్నది. కొద్దిగాఁ జూచు జనులకు మిక్కిలి వెలుఁగు కలుగుటకు, విస్తీర్ణమగు నుష సమస్త భువనములను తన ప్రకాశముచేత బయలువఱచుచున్నది. ధనవంతురాలయిన యుష వంకరగాఁ బరుండి నిద్రించువారు లేచి తిరుగునట్లు చేయుచున్నది.

౧౨౦౯. క్షత్రాయ త్వంశ్రవసే త్వంమహీయా ఇష్టయేత్వ మర్థమివత్వ మిత్యై ।

విసదృశా జీవితాభి ప్రచక్ష ఉషా అజీగర్భువనాని విశ్వా॥ ౬.

ద॥ ధనము కొఱకు ఒకనినిగూర్చి, అన్నముకొఱకొకనిఁగూర్చి గొప్పదగు యజ్ఞము కొఱకొకనినిగూర్చి ఉష ఉదయించుచున్నది. కావలసిన వస్తువును గుఱించి ఒకనిని, నానారూపకృషి వాణిజ్యాదుల గుఱించి యింకొకనిని మేల్కొల్పుచున్నది. (ఇట్లు) సకలభూతములను (చీకటిలోనుండి) బయలుపఱచుచున్నది. (ఓ యుషా! నీవొకనికి ధనముకొఱకై యింకొకని కన్నముకొఱకై నానావృత్తులకై యిత్యాదిగాఁ జూడ నన్వయింప వచ్చును.)

౧౩౧౧. ఏషా దివో దుహితా ప్రత్యదర్శి వ్యుచ్ఛన్తీ యువతిః శుక్రవాసాః ।

విశ్వస్యేశానా పార్థివస్య వస్వ ఉషో అద్యేహ సుభగే వ్యుచ్ఛ॥ ౭॥

వ॥ ద్యులోకమునకుఁ గూతురయిన యీ యుష చీకటిఁ బోగొట్టుచు ఫలమునిచ్చుచున్నదై, తెల్లనివస్త్రముగట్టుకొన్నదై, సకలమైన భూసంబంధమైన ధనంబునకు ప్రభువగునదియై కనఁబడుచున్నది. చాలధనముగల ఓ యుషా! నీవుయిపుడు ఈ యజ్ఞశాలలో అంధకారమును బోగొట్టుము.

౧౩౧౨. పరాయతీనామన్వేతి పాథ ఆయతీనాం ప్రథమా శశ్వతీనామ్ ।

వ్యుచ్ఛన్తీ జీవముదీరయన్త్యుషా మృతంకంచన బోధయన్తీ॥ ౮॥

వ॥ కడచనినట్టి, రాఁబోవునట్టి ఉషస్సుల స్థానమును ఇపుడీ యుష యనుసరించుచున్నది! అనేకోషస్సులకు మొదటిదై, చీకటిని దొలఁగించుచున్నదై, ప్రాణుల జీవములను మీఁదికి లేవనెత్తుచున్నదై, చచ్చినవానివలె నిద్రించుచుండినవానిని మేల్కొల్పుచున్నదగుచు (ఉష ప్రవర్తిల్లుచున్నది)

౧౩౧౩. ఉషో యదగ్నిం సమిధే చకర్థ వియదావశ్చక్షసా సూర్యస్య ।

యన్మానుషా న్యక్ష్యమాణాఁ అజీగస్తద్దేవేషు చకృషే భద్రమప్నః॥ ౯॥

వ॥ ఓ యుషస్సా! నీవు అగ్నిని (గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులను ఉదయమున ప్రజ్వలింపఁ జేసి హోమము సేతురు) ప్రజ్వలించుకొఱకు నేమి చేసితివి? జగత్తునంతటిని సూర్యకాంతితో చీకటినుండి తొలఁగించితివి, మనుష్యులను యాగములు చేయువారింగా చేసితివి. వీటన్నిఁటినిబట్టి ఓ యుషో దేవతా! దేవతలందఱిలో నీవే మంగళకరమైన కర్మను జేయుచున్నావు. (ఉషఃకాలమందే అందఱున్ని పనులు సేతురని)

౧౩౧౪. కియాత్యా యత్సమయా భవాతి యా వ్యూషుర్యాశ్చ నూనం వ్యుచ్ఛాన్ ।

అనుపూర్వాః కృపతే వావశానా ప్రదీధ్యానా జోషమన్యాభిరేతి॥ ౧౦॥

దం॥ ఓ యుషా! యీ సమాపించినయుషస్సు ఎంత కాలముండఁగలదు? (వేగమే పోవునని తా) పూర్వము ఏయుషస్సులు ఉదయించినవో యింక నేవి నిశ్చయముగా నుదయించఁగలవో! కడచిపోయిన ఉషస్సులను ఇప్పటియుషస్సు అనుకరించు చున్నది. (సాటియగుచున్నదని తా) మిగులఁ బ్రకాశించుచున్నయుష రాఁబోవు మనుష్యులతో కలసికొనుచున్నది. (అనఁగా నుషస్సు అన్నిదినములందుఁగలదని తా॥)

౧౨౧౫. ఈయుష్టేయే పూర్వతరా మపశ్యన్వ్యుచ్ఛన్తీ ముషసం మర్త్యాసః।

అస్మాభిరూను ప్రతిచక్ష్యా భూదో తే యన్తియే అపరీషు పశ్యాన్॥ ౧౧॥

దం॥ ఏ మనుష్యులు వెలుఁగునిచ్చుచున్న పురాతనమైన యుషస్సును జూచిరో అట్టివారు గతించిరి మాకు నిపుడు గనుపించు నుషస్సునుగూడ నట్టిదే యయ్యెను. రాఁబోవు రాత్రులందుఁగూడ నే మనుష్యులుషోదేవతను జూచుచున్నారో వారు అపుడే పోవుచున్నారు.

౧౨౧౬. యావయద్ద్వేషా ఋతపా ఋతేజాః సుమ్నావరీ సూనృతా ఈరయన్తీ।

సుమంగలీర్బిభ్రతీ దేవవీతిమి హాద్యోషః శ్రేష్ఠతమావ్యుచ్ఛ॥ ౧౨॥

దం॥ శత్రువులం బాఱఁదోలునట్టి, యజ్ఞము పాలించునట్టి, సుఖము నొసంగునట్టి, చక్కని వాక్కులను ప్రకటించునట్టి (పశుపక్ష్యాదులు ధ్వనించుననిని తా.) సుమంగలియగునట్టి, యజ్ఞమును బోషించునట్టి, ఉషోదేవత యేదియో ఆ యుషోదేవీ! శ్రేష్ఠురాలవైన నీవు ఈ మాయాగమందు నిపుడు చీఁకటిఁ దొలఁగించుము.

౧౨౧౭. శశ్వత్పురోషా వ్యువాస దేవ్యథో అద్యేదంవ్యా వో మఘోనీ।

అథో వ్యుచ్ఛా దుత్తరాఁ అనుద్యూన జరామృతా చరతిస్వధాభిః॥ ౧౩॥

దం॥ విహరించుచున్న ఉషోదేవత పూర్వకాలమందు నెల్లపుడు చీఁకటిని బోఁగొట్టుచునే యుండెను. తరువాత నిప్పుడు ధనవంతురాలగు నుషోదేవత (చీఁకటిలో మునిగిన) ఈ ప్రపంచమును బయలుపఱచెను. తరువాత రాఁబోవు దినములయందుఁ జీఁకటిం బోఁగొట్టును. ముదిమిలేని చావులేని ఉషోదేవత తన కాంతులతో సంచరించుచున్నది.

౧౨౧౮. వ్య౧ంజిభి ర్దివ ఆతాస్వద్యౌదప కృష్ణాం నిర్ణిజం దేవ్యావః ।

ప్రబోధయంత్యరుణేభి రశ్వైరోషా యాతిసుయుజా రథేన॥ ౧౪॥

దం॥ అంతరిక్షమునకు సంబంధించిన దిక్కులందు ఉషోదేవత ప్రకాశముగల తేజస్సులతో వెలుంగుచున్నది. ఈ యుషోదేవి అంధకారమును రూపులేని దానింగ జేసెను. ఎఱ్ఱనగు (అశ్వములవంటి) తన కిరణములతోఁ గూడిన రథముతో (నిద రించువారిని) మేల్కొల్పుచు వచ్చుచున్నది.

౧౨౧౯. ఆవహంతీ పోష్యా వార్యాణి చిత్రం కేతుం కృణుతే చేకితానా ।

ఈయుషీణా ముపమా శశ్వతీనాం విభాతీనాం ప్రథమోషా వ్యశ్వైత్॥ ౧౫॥

దం॥ పోషింపఁదగిన, కోరఁదగిన ధనములను గలుగఁజేయుచు సమస్తప్రపంచమును మేల్కొల్పుచు అధికజ్ఞానమును గలిగించుచున్నది. సంచరించుచున్న అనేకములైన ఉషస్సులయొక్క సమీపమందుఁ బ్రకాశించుచు రాఁబోవు నుషస్సులకు మొదటిదగు నుషోదేవత (తేజస్సుతో) వృద్ధిఁబొందెను.

౧౨౨౦. ఉదీర్ధ్వంజీవో అసుర్న ఆగాదప ప్రాగాత్తమ ఆజ్యోతిరేతి ।

ఆరైక్పంథాం యాతవే సూర్యాయాగన్మయత్ర ప్రతిరంతఆయుః॥ ౧౬॥

దం॥ (ఓ మనుష్యులారా!) పాన్పులమీఁదనుండి లేవండి. మన శరీరము నిల్చుటకుఁ బ్రాణము వచ్చినది. చీకటి పోయినది. ఆ (ప్రాణరూప) తేజస్సువచ్చుచున్నది. సూర్యునియొక్క మార్గమును ప్రకటించుచున్నది. జీవనమునకై యెచట నన్నము సమృద్ధిగ దొఱకునో యచటికిఁ బోదుము.

౧౨౨౧. స్యూమనా వాచ ఉదియర్తివహ్నిస్తవానో రేభఉషసోవిభాతీః ।

అద్యాతదుచ్ఛ గృణతే మఘోన్యస్మే ఆయుర్ని దిదీహి ప్రజావత్॥ ౧౭॥

దం॥ స్తోత్రముచేయుచున్న రేభఋషి వెలుఁగుచున్న యుషస్సులను స్తుతించుచున్నవాఁడై స్తుతికుపయోగించు మంత్రములను ఉచ్చరించుచున్నాఁడు. ధనవంతురాలగునో యుషా! యీసమయమున స్తుతికర్తకు ఆచీఁకటిని బోఁగొట్టుము. మాకొఱకు బుత్రపౌత్రులతోఁ గూడినయన్నమును ఇమ్ము.

౧౨౩౨. యా గోమతీరుషసః సర్వవీరా వ్యుచ్ఛన్తి దాశుషే మర్త్యాయ ।
వాయోరివ సూనృతానాముదర్కే తా అశ్వదా అశ్నవత్సోమసుత్వా ॥ ౧౮ ॥

వ॥ హవిస్సుల నిచ్చునట్టి యజమానుని కొరకై; అనేకవీరులు కలట్టి, గోవులు కలట్టి, యేయుషస్సులు; చీకటిని పోఁగొట్టుచున్నవో; వాయువువలె శీఘ్రము పరువెత్తునట్టి, స్తుతి వాక్కులయొక్క సమాప్తికలుఁగగానే గుఱ్ఱాల నొసంగునట్టి యా యుషో దేవతలను సోమమిచ్చి నీయజమానుఁడు పొందును గాక! (సోమమిచ్చియుషో దేవత నాశ్రయించుఁగాకని తా.)

౧౨౩౩. మాతా దేవానామదితేరనీకం యజ్ఞస్య కేతుర్బృహతీ వి భాహి ।
ప్రశస్తికృద్బ్రహ్మణే నో వ్యుచ్ఛా నో జనే జనయ విశ్వవారే ॥ ౧౯ ॥

వ॥ ఓ యుషోదేవతా! నీవు దేవతలకు తల్లివి. అదితిదేవికి ప్రతిస్పర్ధినివి (పెను రుతేగులునది) యజ్ఞమునకు జండావంటిదానవు (ప్రకటించునదని తా.) పూజ్యురాలవై విరాజిల్లుము. మాస్తుతిని మెచ్చుకొనునట్లు మా మంత్రములకొఱకు ఉదయించుము. అందఱిచేతను గోరఁబడుచున్న యో యుషోదేవతా! మమ్ము నిండజే జనులలో నుంపుము.

౧౨౩౪. యచ్చిత్రమప్న ఉషసో వహన్తీజానాయ శశమానాయ భద్రం ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ ౨౦ ॥

వ॥ కూడఁబెట్టఁదగిన యే ధనమును ఉషోదేవతలు తెచ్చుచున్నారో హవిస్సు లిచ్చిన స్తుతికర్తకొఱకు శుభమయిన ధనము కలుగుచున్నది. ఆ మాధనమును మిత్రాది యార్గురు దేవతలు రక్షింతురుగాక.

---

## సూక్తము. ౧౧౪.

౧౦ - ౧౧ త్రిష్టుభ, కుత్సఋషి, తక్కినవి జగతులు, రుద్రదేవత.

౧౨౨౫. ఇమా రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే మతీః ।
యథా శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురమ్ ॥ ౧॥

వం॥ ఏ విధముగా మా మనుష్యులకుఁ బశువులకును సుఖము కలుగునో అట్లు వృద్ధినొందిన జటాజూటముకలట్టి ధనికులయిన వాయువులు (శత్రువుల జయించునట్టి అని గాని) రుద్రుని కొఱకు ఈ స్తుతులను జేయుచున్నాము. అందువల్ల ఈ మా గ్రామమందు సమస్తప్రాణిసముదాయమును రోగరహితమై వృద్ధిపొందినదగుఁగాక.

౧౨౨౬. మృళా నో రుద్రోత నో మయస్కృధి క్షయద్వీరాయ నమసా విధేమ తే ।
యచ్ఛం చ యోశ్చ మనురాయేజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతిషు ॥ ౨॥

వం॥ ఓ రుద్రుఁడా! మాకు సుఖమును గలిగింపుము మఱియు మాకు సుఖమును జేయుము ధనికులగు వాయువులు పుత్రులుగాఁగల లేక శత్రుల జయించిన నిన్ను హవిస్సులతోఁ బూజించుచున్నాము. మా తండ్రియగు మనువు రోగశమనమును భయనివారణమును (దేవతలవలనఁ బొంది) మాకిచ్చెను ఓ రుద్రా! నీనీతిబోధలు గలవుడు వాటిఫలములను అనుభవింతుము (అనఁగా నీతిని బోధించి ఆఫలములు గూర్పుమని తా.)

౧౨౨౭. అశ్యామ తే సుమతిం దేవయజ్యయా క్షయద్వీరస్య తవ రుద్ర మీఢ్వః ।
సుమ్నాయన్నిద్విశో అస్మాకమా చరారిష్టవీరా జుహవామ తే హవిః ॥ ౩॥

వం॥ (ఇష్టార్థముల) వర్షించునట్టి రుద్రుఁడా! ధనికులగు వాయువులు కొమాళ్లుగాఁగలట్టి నీయొక్క యనుగ్రహమును నీవారలమయిన మేము ఆ దేవతల కొఱకైన యాగములచేఁ బొందఁగలము. నీవును సుఖము గోరినవాఁడవగుచునే మా ప్రజలను గూర్చి రమ్ము. అందువల్ల మేము హింసింపఁబడని సంతానముగలవారమై నీకొఱకు హవిస్సును హోమమొనర్చుచున్నాము. (క్షయద్వీర = శత్రువుల సంహరించిన యను నర్థముకూడఁ గలదు.)

౧౨౨౮. త్వేషం వయంరుద్రం యజ్ఞసాధం వంకుంకవిమవసే నిహ్వయామహే ।
ఆరేఅస్మద్దైవ్యం హేళో అస్యతు సుమతి మిద్వయమస్యా వృణీమహే॥ ౪॥

దం॥ రక్షణము కొఱకుఁ బ్రకాశించునట్టి, యజ్ఞము నెరవేర్చునట్టి, కుటిల గమనము కలట్టి, అధికజ్ఞానముగలట్టి రుద్రుని భక్తితోఁ బ్రార్థించుచున్నాము. ఆ రుద్రుఁడు దేవసంబంధమైన కోపమును మాకు దూరముగాఁ బాఱవేయుఁగాక. ఈ దేవుని యొక్క అనుగ్రహమునే మేము ప్రార్థించుచున్నాము.

౧౨౨౯. దివోవరాహ మరుషం కపర్దినం త్వేషం రూపం నమసా నిహ్వయామహే ।
హస్తేబిభ్రద్భేషజావార్యాణి శర్మ వర్మచ్ఛర్ది రస్మభ్యంయంసత్॥ ౫॥

దం॥ వరాహమువలె దృఢమయిన శరీరముకలట్టి, మిగుల కాంతి కలట్టి, జటాజూటముగలట్టి, దివ్యతేజస్సుకలట్టి (వేదాంతవేద్యమయిన) రూపముగలట్టి రుద్రుని, ద్యులోకమునుండి (రమ్మని) హవిస్సుతో పిలుచుచున్నాము. అందఱు కోరునట్టి ఔషధములను ఆ రుద్రుఁడు తనచేతియందు ధరించుచు మాకొఱకు ఆరోగ్యమును కవచమును, గృహమును ఇచ్చుఁగాక.

౧౨౩౦ ఇదంపిత్రే మరుతాముచ్యతే వచః స్వాదోః స్వాదీయో రుద్రాయవర్ధనం ।
రాస్వాచనో అమృతమర్త భోజనం త్మనేతోకాయ తనయాయమృళ॥ ౬॥

దం॥ మరుత్తులనెడు దేవతలకుఁ దండ్రియైన రుద్రుని కొఱకు తీపవస్తువు లన్నిటికంటెను మిగులఁ దియ్యనిది (రుద్రుని) ఉబ్బించునదియగు నీ స్తుతివాక్యము పలుకఁబడుచున్నది. మరణ ధర్మములేని యో రుద్రా! మనుష్యులకుపయోగించు భోజనమును మాకొఱకు నిమ్ము అట్లే నన్నును బుత్రుఁ పౌత్రునింగూడ సుఖపెట్టుము.

౧౨౩౧. మానోమహాన్తముత మానో అర్భకం మానఉక్షంతముతమానఉక్షితమ్ ।
మానోవధీః పితరం మోతమాతరం మానఃప్రియాస్తన్వో రుద్రరీరిషః॥ ౭॥

వా॥ ఓ రుద్రుండా! మాలోం బెద్దవానిని జంపకుము. మఱియు మాపిల్లవానినిం జంపకుము. మాలో యౌవనవంతునిగాని కడుపులోనున్న వానింగాని జంపకుము. మాతండ్రిని దల్లినిం గూడం జంపకుము. (ఎవ్వరిని జంపకుమని తా.)

౧౨౩౨. మానస్తోకే తనయే మానఆయౌమానో గోషుమానో అశ్వేషురీరిషః

వీరాన్మానో రుద్రభామితో వధీర్హవిష్మంత సదమిత్త్వాహవామహే॥ ౮॥

వా॥ ఓ రుద్రుండా! మాయొక్కపుత్రుని మనుమని హింసింపకుము. మా మనుష్యులను, మా గోవులను, మా అశ్వములను హింసింపకుము మావీరులయిన భృత్యులను కోపముకలవాండవయి (లేక వీర = యుద్ధభటుండు) చంపకుము. హవిస్సులుపట్టుకొన్న వారమయి యెల్లపుడు ప్రార్థించుచున్నాము.

౧౨౩౩. ఉపతేస్తోమాన్పశుపా ఇవాకరం రాస్వాపితర్మరుతాం సుమ్నమస్మే ।

భద్రాహితేసు మతిర్మృళయత్తమాథావయ మవఇత్తే వృణీమహే॥ ౯॥

వా॥ ఓ రుద్రా! పశుపాలకుండు పశువులను అధికారికి వప్పగించునట్లు స్తుతిమంత్రములను నీకొఱకు సమర్పించుచున్నాను. మరుత్తులతండ్రీ! నాకొఱకు సుఖము నిమ్ము. నీయొక్క అనుగ్రహము మిగుల సుఖముగలిగించునది, మంగళకరమయినది కదా! మేమునీరక్షణను కోరుచున్నాము.

౧౨౩౪. ఆరేతే గోఘ్నముత పూరుషఘ్నం క్షయద్వీరసుమ్న మస్మేతే అస్తు ।

మృళాచనో అధిచబ్రూహిదేవా ధాచనః శర్మయచ్ఛద్విబర్హాః॥ ౧౦॥

వా॥ శత్రువులనశింపం జేసినవాండా! (రుద్రా!) గోవులను గొట్టునట్టి, పురుషులను గొట్టునట్టి, నీయాయుధము మాకు దూరమునయుండుం గాక. మాయందు నీసంబంధమయిన ధనము, లేక, సుఖముకలుగుం గాక. మాకు సుఖకరుండవుకమ్ము. ప్రకాశించునట్టి యోరుద్రా! మావిషయమయి పక్షపాతముగాం బలుకుము. తరువాత జ్ఞానకర్మలకు బర్హణమగు నీవుమాకుసుఖము నిమ్ము.

౧౨౩౫. ఆవోచామ నమో అస్మా అవస్యవః శ్రుణోతు నో హవం రుద్రో మరుత్వాన్ ।
తన్నో మిత్రో వరుణో మామహంతా మదితిః సింధుః పృథివీ ఉత ద్యౌః ॥ ౧౧॥

దం॥ రక్షణను గోరుచున్న మేము (స్తుతి) సూక్తములు చెప్పితిమి. ఈరుద్రునికి నమస్కారము. మరుద్గణముతోఁ గూడినరుద్రుఁడు మాఆహ్వానమును అంగీకరించుగాక! మాఆస్త్రమును మిత్రాదిదేవతలాగ్రహ పూజింతురు గాక.

---

## సూక్తము. ౧౧౫.

కుత్స ఋషి - త్రిష్టుప్ఛంద - సూర్యదేవత.

౧౨౩౬. చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ।
ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥ ౧॥

దం॥ మిత్రవరుణాగ్నులకు నేత్రమగుచున్నట్టి, ఆశ్చర్యకరమైనట్టి, కిరణముల సముదాయము ఉదయించెను. (మిత్రవరుణాగ్నులుకల ప్రపంచమునకని తా.) ద్యులోకభూలోకాంతరిక్ష లోకములు నింపెను. స్థావరములు (చెట్లుకొండలుమొద) అగుప్రాణులకు సూర్యుఁడు జీవాత్మ అయియున్నాఁడు.

౧౨౩౭. సూర్యో దేవీ ముషసం రోచమానాం మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్ ।
యత్రా నరో దేవయంతో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥ ౩॥ ౨॥

దం॥ ఏ యుషస్సునందు దేవతలంగోరునట్టి యాగకర్తలు భార్యలతోఁగలిసి సత్కర్మను ఫలముకొఱకు వేఱువేఱుగ చేయుచున్నారో ఆ, ప్రకాశించునట్టి ఉషోదేవతను; యౌవనవంతుఁడయిన మనుష్యుఁడు భార్యను వెంబడించినట్లు; సూర్యుఁడు వెంబడించెను.

౧౨౩౮. భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః ।

నమస్యంతో దివ ఆపృష్ఠమస్థుః పరిద్యావాపృథివీ యన్తి సద్యః॥ ౩॥

దం॥ మంగళకరమైనట్టి, ఉదకములఁ బీల్చునట్టి శబల (= చిత్ర) వర్ణమైనట్టి (స్తుతులచే) సంతోషించుచున్నట్టి, విచిత్రమైనట్టి, నమస్కరింపఁబడుచున్నట్టి సూర్యకిరణములు ఆకాశముమీఁది భాగమునందు వ్యాపించినవి. ద్యులోకభూలోకముల నన్ని చోట్లను వ్యాపించినవి.

౧౨౩౯. తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యాకర్తోర్వితతం సంజభార ।

యదేదయుక్త హరితః సధస్థాదాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥ ౪॥

దం॥ కర్మల (వ్యవసాయము మొ) యొక్క మధ్యకాలమందు విస్తీర్ణమయిన కిరణముల సమూహమును ముడిచివేసికొనుచుంట యనెడునదియే సూర్యునియొక్క స్వాతంత్ర్యము. మాహాత్మ్యము. ఏ యొకేకాలమునందుఁ దనకిరణములను భూలోకమునుండి వేఱుచోటఁ జేర్చుచున్నాఁడో, ఆవెంటనే చీఁకటిని సర్వలోకమందు రాత్రి విస్తరింపఁజేయుచున్నది. (ఒకచోట అస్తమయమయిన కాలమందే యింకొకచోట సూర్యకిరణము లుదయించునని యిందుఁ జెప్పఁబడెను.)

౧౨౪౦. తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే ।

అనన్తమన్యద్రుశదస్య పాజః కృష్ణమన్యద్ధరితః సంభరన్తి॥ ౫॥

దం॥ ఆయుదయకాలమందే మిత్రావరుణులతోఁగూడిన (సర్వప్రపంచముయొక్క) దర్శనమునకై ఆకాశము మధ్యభాగమునందు సూర్యుఁడు తన తేజస్సును చేయుచున్నాఁడు. ఈ సూర్యునియొక్క రసమును బీల్చునట్టి కిరణములు అనంతమయినట్టి, ప్రకాశించునట్టి, చీఁకటిని బోఁగొట్టునట్టి అదొకవిధమయిన తేజస్సును సమకూర్చుచున్నవి. అస్తనల్లనయిన యింకొకదానిని (అనఁగాఁ జీఁకటిని) చేయుచున్నవి. (తామూ తొలగినందు వలన జీఁకటి వచ్చినందునఁ దాము చీఁకటిని జేసినట్లే)

౧౨౮౧. ఆద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సింధుః పృథివీ ఉత ద్యౌః ॥ ౬ ॥

దం॥ ఓ కిరణములారా! యీకాలమందు సూర్యునియొక్క యుదయమగుచుం డగాఁ దుష్టమగు పాపమునుండి (తొలఁగించి) రక్షింపుఁడు. మా ఆప్రార్థనను మిత్రాది దేవతలెల్లరు అంగీకరింతురుగాక!

---

## అనువాకము. ౧౭.

## సూక్తము. ౧౧౬.

ఋషి-కక్షీవంతుండు దేవత-అశ్వినీదేవతలు- ఛందస్సు - త్రిష్టుప్.

౧౨౮౨. నాసత్యాభ్యాం బర్హిరివ ప్రవృంజే స్తోమాఁ ఇయర్మ్యభ్రియేవ వాతః ।

యావర్భగాయ విమదాయ జాయాం సేనాజువా న్యూహతూ రథేన ॥ ౧ ॥

దం॥ సేనల నడిపించు రథముతో నేయశ్వినీదేవతలు బాలుఁడయిన విమదుఁడను రాజర్షి భార్య నతని యింటికిఁ జేర్చిరో (శత్రువులాతని భార్యను తీసికొనిపోతే వారిని పాఱఁదోలి ఆమెను విడిపించి భర్తవద్దకు వప్పగించిరని కథ.) యజ్ఞకర్త దర్భలను (కోసి) పరచునట్లు, గాలి మేఘములోని యుదకమును ప్రేరించునట్లు, నేనుఅశ్వినీ దేవతల కొఱకు స్తుతులను ప్రేరించుచున్నాను.

౧౨౮౩. వీళుపత్మభిరాశుహేమభిర్వా దేవానాం వా జూతిభిః శాశదానా ।

తద్రాసభో నాసత్యా సహస్రమాజా యమస్య ప్రధనే జిగాయ ॥ ౨ ॥

దం॥ అశ్వినులారా! బలముగలట్టి, శీఘ్రగమనము గలట్టి యింద్రాదులయొక్క గుఱ్ఱాలతో సమముగా నడిపింపఁబడునట్టి (మీవాహనమైన) గాడిద యమునకుఁ బ్రియమయినట్టి, మిగుల ధనముగలట్టి యుద్ధమందు ఆవేలకొలఁది బలమును (అందఱికంటె ముందు) జయించెను.

౧౨౮౪. తుగ్రో హ భుజ్యుమశ్వినోదమేఘే రయిం న కశ్చిన్మమృవాఁ అవాహాః ।

తమూహథు ర్నౌభిరాత్మన్వతీభి రంతరిక్షప్రుద్భిరపోదకాభిః॥ ౩।

దం॥ తుగ్రుఁడను వాఁడు సముద్రమందు భుజ్యుఁడను (తన కొమారుని) చచ్చిపోవు మనుజుఁడు ధనమును ఒక చోటికి జేర్చునట్లు (అనఁగా నంతజాగ్రత్తతో నని తా.) ఓడతోఁ బంపెను. అట్టివానిని అశ్వినులారా! నీటిమీఁద నడచునట్టి, మునుఁగకుండునట్టి మీ ఓడలతో (అతఁడు మునిఁగిపోకుండఁ దేలి) తండ్రివద్దకుఁ జేర్చితిరి.

౧౨౮౫. తిస్రః క్షపస్త్రిరహాతివ్రజద్భిర్నాసత్యా భుజ్యుమూహథుః పతంగైః ।

సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షళశ్వైః॥ ౪॥

దం॥ ఓ యశ్వినులారా! భుజ్యువనువానిని మూఁడురాత్రులు మూఁడుపగళ్లు మిఁచిపోవుచున్నట్టి, శీఘ్రము నడుచుచున్నట్టి, నూఱుచక్రములతోఁ గూడినట్టి, ఆఱు గుఱ్ఱములతోఁ గూడినట్టి, మూఁడురథములతో సముద్రమందును; ఎడారిలోను, సముద్రతీరమందును మీరు రక్షించితిరి.

౧౨౮౬. అనారంభణే తదవీరయేథామనాస్థానే అగ్రభణే సముద్రే ।

యదశ్వినా ఊహథుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాతస్థివాంసమ్॥ ౫॥

దం॥ నిరాధారమై నేలలేనట్టి, పట్టుకొనుటకు దన్ను లేనట్టి సముద్రమందు నూఱు తెడ్లుగల ఓడయందెక్కి యున్నట్టి భుజ్యుని (మీరు) వీరునిగఁ జేసితిరి. గృహమును జేర్చితిరి.

౧౨౮౭. యమశ్వినా దదథుః శ్వేతమశ్వమఘాశ్వాయ శశ్వదిత్స్వస్తి ।

తద్వాం దాత్రం మహి కీర్తేన్యం భూత్పైద్వో వాజీ సదమిద్ధవ్యో అర్యః॥ ౬॥

దం॥ అశ్వినులారా! (మీరు) చంపఁబడని గుఱ్ఱములుగల పేదుఁడను రాజర్షి కొఱకు తెల్లని యే యశ్వము నిచ్చితిరో ఆ యశ్వము వానికొఱకు మంగళమును ఎల్లపుడును చేసెను. మీయొక్క ఆ దానము గొప్పది కనుకనే అందఱు పొగడదగి

నది ఆమెను. అందువల్ల పేరుని యుద్ధమునందుపయోగించు గుఱ్ఱము ఎల్లప్పుడును (మాచే) పిలువఁ దగినది.

౧౨౪౮. యువంనరాస్తువతే పజ్రియాయకక్షీవతే అరదతం పురంధిమ్ ।

కారోతరాచ్ఛఫాదశ్వస్య వృష్ణః శతంకుంభాఁ అసించతం సురాయాః॥ ౭॥

వం॥ సర్వకర్మనాయకులగు నశ్వినీదేవతలారా! మీరు అంగిరసుల వంశమునఁ బుట్టిన స్తుతించుచున్న కక్షీవంతునకు అధికమైన బుద్ధినిచ్చిరి. కారోతరమను పాత్రమునుండి యౌవనముగల గుఱ్ఱముడెక్కవల్ల నూఱుకల్లుకుండలను నించితిరి. (అంగిరసవంశ్యులయిన ఋషులు సౌత్రామణియను యాగమందు కల్లుకావలెనని అశ్వినులను ప్రార్థింపఁగా తమ గుఱ్ఱాల డెక్కలలోనుండియే కల్లును అశ్వినులు వర్షము కురిపించిరట.)

౧౨౪౯. హిమేనాగ్నిం ఘ్రంసమవారయేథాం పితుమతీమూర్జ మస్మాఅధత్తమ్ ।

ఋభసే అత్రిమశ్వినావనీత మున్నిన్యథుః సర్వగణం స్వస్తి॥ ౮॥

వం॥ ఓ యశ్వినీదేవతలారా! ప్రజ్వరిల్లుచున్న ఉముకనిప్పును మంచువలె చల్లని నీళ్లతో ఆర్పివేసితిరి. (అత్రిని యుముకనిప్పులో రాక్షసులు పడవేసిరట) ఈయత్రికి రుచియగు నన్నముగల బలమయిన ఆహారమును బుష్టికొఱకిచ్చితిరి, చీకటిగృహమందుఁ దలక్రిందుగాఁ బడవేయఁబడిన యత్రిని యన్ని యింద్రియముల కలవానిఁగా జేసి ఆ యగ్నిగృహమునుండి బయటికిఁదీసి యిల్లు సేర్చితిరి.

౧౨౫౦. పరావతం నాసత్యానుదేథా ముచ్చాబుధ్నం చక్రథుర్జిహ్మబారమ్ ।

క్షరన్నాపోన పాయనాయ రాయే సహస్రా యతృష్యతే గోతమస్య॥ ౯॥

వం॥ అశ్వినీదేవతలారా! మీరు నూతిని (గోతమర్షి సమీపమునకు) తెచ్చితిరి. దానిని అడుగుభాగము మీఁదికున్నదానిగాఁ పైభాగముక్రిందనుండు దానిగాను చేసితిరి దప్పిఁగొనియున్న గోతమునియొక్క పానముకొఱకును వేలకొలఁది ధనము నకై యును ఉదకములనుగూడ బయలుఁ దేరించితిరి, (నిర్జలప్రదేశమున గోతముని ప్రార్థనపై నీరు కల్పించిరని ఆ నీటివల్ల నతనికి ధనలాభముకూడ గల్గెనని తా)

౧౨౪౧. జుజురుషో నాసత్యోత వవ్రిం ప్రాముంచతం ద్రాపిమివ చ్యవానాత్ ।
ప్రాతిరతం జహితస్యాయుర్దస్రాదిత్పతి మకృణుతం కనీనామ్॥ ౧౦॥

వ॥ ఓ యశ్వినీదేవతలారా! ముసలివాఁడయిన చ్యవనునిలోనుండి ముదిమిని కవచమును దీసివేయునట్లు తొలఁగించిరి. మఱియు ఓ అశ్వినులారా! (కొడుకులు మొదలగువారిచే) విడువంబడిన ఆ ఋషియొక్క ఆయుర్దాయమును వృద్ధిపొందించిరి. తరువాత (కన్యలకు మగనినిగా నతనిం జేసితిరి.)

౧౨౪౨. తద్వాం నరాశంస్యం రాధ్యంచాభిష్టి మన్నా సత్యావరూథమ్ ।
యద్విద్వాంసా నిధిమివా పగూళ్హముద్దర్శతా దూపథుర్వందనాయ॥ ౧౧॥

వ॥ బుద్ధిశాలురగు నో యశ్వినీదేవతలారా! మీరు భూమిలోఁ బూడ్చిపెట్టిన ధనమును బోలె వందనర్షిని మార్గస్థులచేఁ జూడఁబడు బావినుండి పైకిఁదీసితిరన్న మీపని యేదికలదో అది ఆరోగ్యము కలిగించు నశ్వినులారా! నభిముఖముగాఁ బొందఁదగినది. స్తుతింపఁదగినది. కోరఁదగినది, పూజింపఁదగినదియు నయ్యున్నది.

౧౨౪౩. తద్వాం నరా సనయే దంస ఉగ్రమావిష్కృణోమి తన్యతుర్న వృష్టిమ్ ।
దధ్యఙ్హ యన్మధ్వా థర్వణో వామశ్వస్య శీర్ష్ణా ప్రయదీమువాచ॥ ౧౨॥

వ॥ ఆరోగ్యముగలిగించు నశ్వినులారా! యితరులు చేయలేని మీ అద్భుత కార్యము ధనలాభముకొఱకు ఉఱుమునల్ల వర్షమువలె బయలువఱచుచున్నాను. అథర్వపుత్రుఁడయిన దధ్యఙ్ఙనువాఁడు గుఱ్ఱముయొక్క శిరస్సుచేత మీకు నిటువంటి మధువిద్యను, ప్రవర్గవిద్యను చెప్పెననునది యేదికలదో అదియు (ఇంద్రుఁ డథర్వపుత్రుఁడగు దధ్యఙ్ఙను వానికి మధువిద్య, ప్రవర్గవిద్య, అని రెండుమంత్రాలుపదేశించినాఁడట! అది యెవ్వరికిఁ జెప్పవద్దన్నాఁడట! అది యెఱింగి అశ్వినీదేవతలతని తలను నఱికి గుఱ్ఱముతల నదికి ఆ మంత్రములు చెప్పుకొన్నారట! యింద్రుఁడది తెలిసి ఆతని తలను నఱికెనట! అశ్వినులు తిరిగియు నతని మొదటి శిరస్సునదికిరట!)

౧౨౫౪. అజోహవీన్నాసత్యా కరావాం మహే యామన్పురుభుజాపురంధిః ।

శ్రుతంతచ్ఛాసురివవధ్రిమత్యా హిరణ్యహస్తమశ్వినావదత్తమ్॥ ౧౩॥

దం॥ సర్వరక్షకులగు నశ్వినులారా! పూజ్యమగు స్తోత్రముచేయుచుండఁగా ఇష్టఫలములిచ్చు మిమ్ము బుద్ధిమంతురాలయిన నపుంసకుని భార్యయయిన వధ్రిమతి పిలిచెను. మీరును ఉపాధ్యాయుఁడు చదువునిచ్చునట్లు బంగారము చేతిలోఁగల కొమారుని ఆమెకు ఇచ్చిరి (హిరణ్యహస్తుఁడని అతనిపేరు.)

౧౨౫౫. ఆస్నోవృకస్య వర్తికామభీకేయునంనరానాసత్యా ముముక్తమ్ ।

ఉతోకవిం పురుభుజాయువం హకృపమాణ మకృణుతం విచక్షే॥ ౧౪॥

దం॥ సర్వముం బ్రేరించునో యశ్వినులారా! మీరు యుద్ధమందు శునకమునియొక్క (ఇదివఱకు తోడేలనియర్థము వ్రాసిరి) నోటినుండి వర్తకయనెడు పక్షిని (=పిచ్చుక) విడిపించితిరి. మఱియు సర్వరక్షకులారా! మీరే దయగల మనసు గల్గి మిమ్ము స్తుతించిన బుద్ధిశాలురను వివిధముగా జూడఁదగునట్లు చేసితిరి. (అనఁగా దివ్యజ్ఞానము కలుగునట్లు చేసితిరనితా)

౧౨౫౬. చరిత్రంహి వేరివాచ్ఛేది పర్ణమాజాఖేలస్యపరితక్మ్యాయామ్ ।

సద్యోజంఘామాయసీం విశ్పలాయై ధనేహితే సర్తవే ప్రత్యధత్తమ్॥ ౧౫॥

దం॥ యుద్ధమందు ఖేలుఁడను వానియొక్క విశ్పలయనుదాని పాదముపక్షిఱెక్కవలె తెగినది. అశ్వినులారా! మీరురాత్రియందు (స్తుతింపఁబడి) వెంటనే శత్రువులందుంచఁబడిన ధనవిషయమై నడచిపోవుటకు ఇనుముతోఁ జేయఁబడిన పాదమును సంధించితిరి. (ఖేలునిభార్యవిశ్పల)

౧౨౫౭ శతంమేషాన్వృక్యే చక్షదానమృజాశ్వంతం పితాంధంచకార ।

తస్మాఅక్షీనాసత్యా విచక్ష ఆధత్తం దస్రాభిషజావనర్వన్॥ ౧౬॥

వం॥ ఏఋజ్రాశ్వుఁడు నూఱుగొఱ్ఱెలను (తాను బెంచిన) అడత్తోడేలునకు (ముక్కలుగాఁగొట్టి) యిచ్చెనో అట్టి గొఱ్ఱెలను ముక్కలు చేసిన ఋజ్రాశ్వుని తండ్రి (ఋషాగిరుఁడు-రాజు శాపము చేత, గ్రుడ్డివానిగాఁ జేసెను. సత్యరూపులారా! దేవవైద్యులగు నశ్వినులారా! పితృశాపమునఁ బోవగిన చోటికిఁబోజాలని ఋజ్రాశ్వునకు జక్కఁగాఁ జూడదగిన కన్నులను సంధించితిరి.

౧౩౪౮. ఆవాంరథందుహితా సూర్యస్య కార్ష్మేవాతిష్ఠ దర్వతా జయంతీ ॥

విశ్వేదేవా అన్వమన్యంతహృద్భిస్స ముశ్రియా నాసత్యాసచేథే॥ ౧౭॥

వం॥ అశ్వినీదేవలారా! మీరథమును పందెపు స్తంభమునువలె సూర్యుని కూతురు (అందరికంటె ముందు) ఎక్కెను. అందఱు దేవతలును యీవిషయమెఱిగిరి. అశ్వినులారా! స్త్రీలాభరూపమగు సంపదతో మీరు చేరుచున్నారు.

౧౩౪౯. యదయాతం దివోదాసాయ వర్తిర్భరద్వాజాయాశ్వినా హయంతా ।

రేవదువాహ సచనోరథోవాం వృషభశ్చ శింశుమారశ్చయుక్తా॥ ౧౮॥

వం॥ అశ్వినులారా! స్తుతులచేతఁ బిలువంబడు మీరు హవిస్సులను ధరించి యజమానుఁడైయున్నదివోదాసుఁడను రాజర్షి గృహమునకెప్పుడు వచ్చితిరో అప్పుడు మీరథముధనముతోఁ గూడిన యన్నమును తీసికొనివెళ్లెను. (అతనికిచ్చెనని తా.) మఱియు నా రథమందు ఎద్దును, మొసలియు (వాహనములుగా) పూన్పబడినవి.

౧౩౫౦. రయింసుక్షత్రం స్వపత్యమాయుః సువీర్యంనాసత్యా వహంతా ।

ఆ జహ్నావీం సమనసోప వాజై స్త్రి రహ్నోభాగం దధతీమయాతమ్॥ ౧౯॥

వం॥ అశ్వినులారా! మంచిబలముగల ధనమును, మంచిసంతానముగల్గి, బలముగల్గిన యన్నమును ధరించునట్టి మీరు ఏక మనస్సుకలవారై హవిస్సులరూపమయిన యన్నములుకల సోమయాగముయొక్క మూఁడుభాగములను (అనఁగా ప్రాతస్సవనము, మాధ్యందినసవనము, సాయంసవనము అని) కావించుచున్న జహ్నుమహర్షి సంతతి వద్దకు రండు.

౧౨౬౧. పరివిష్టంజాహుషం విశ్వతఃసీం సుగేభిర్నక్తమూహథూ రజోభిః ।
విభిందునా నాసత్యా రథేన విపర్వతాఁ అజరయూ అయాతమ్॥ ౨౦॥

వ॥ సర్వదిక్కులయందు (శత్రువులచే) చుట్టబడియుండిన జాహుషుని రాజును అశ్వినులారా! నిత్యయౌవనులగు మీరు శత్రువులను భేదించునట్టి రథముతో రాత్రియందు సుఖముగా నడువందగిన మార్గములద్వారా తోడ్కొని వచ్చితిరి. శత్రువులెక్కఁజాలని కొండల నెక్కితిరి. (శత్రువులనుండి రాజుందెచ్చి కొండమీఁది కెక్కించిరని తా.)

౧౨౬౨. ఏకస్యా వస్తోరావతం రణాయ వశమశ్వినా సనయే సహస్రా ।
నిరహంతం దుచ్ఛునా ఇంద్రవంతా పృథుశ్రవసో వృషణావరాతీః॥ ౨౧॥

వ॥ అశ్వినీదేవతలారా! వశుఁడను ఋషిని ఒకపగటియందు వేలకొలఁది ధనలాభము గల్గునట్లు రక్షించితిరి. (కోర్కెలను) వర్షించు నశ్వినులారా! ఇంద్రునితోఁ గూడిన మీరు దుఃఖము నొసంగునట్టి, మిక్కిలి కీర్తిగలట్టి శత్రువులను నిశ్శేషముగా సంహరించిరి.

౧౨౬౩. శరస్యచిదార్చత్క స్యావతాదానీ చాదుచ్చాచక్రథుః పాతవేవాః ।
శయవేచిన్నా సత్యా శచీభిర్జసురయే స్తర్యంపిప్యథుర్గామ్॥ ౨౨॥

వ॥ ఋచత్కుని పుత్రుఁడయిన శరుఁడను స్తుతికర్తయొక్క పానముకొఱకు అశ్వినులారా! లోతయిన నూతినుండి మీఁదికి నుదకము వచ్చునట్లుచేసితిరి. అట్లేమిమ్ము సేవించి యలసిన శయుఁడను ఋషికొఱకు మీప్రయత్నములతో గొడ్డుపోయిన ఆవును బాలిచ్చుదానింగాఁ జేసితిరి.

౧౨౬౪. అవస్యతేస్తువతే కృష్ణియాయ ఋజాయతేనా సత్యా శచీభిః ।
పశుంననష్టమివ దర్శనాయ విష్ణాప్వందదథుర్విశ్వకాయ॥ ౨౩॥

దం॥ తన్నురక్షింపఁగోరి స్తుతించుచున్న కృష్ణుఁడనువాని కొమారుఁడయిన, సన్మార్గమునపేక్షించియున్న విశ్వకుఁడను ఋషికొఱకు ఓయశ్వినీ దేవతలారా! కనబడకుండ నెచ్చటికో పోయిన విష్ణాప్వుని నష్టమయిన పశువును వెదకి తెచ్చునట్లు ఉపాయములతో తెచ్చి (తండ్రికి) గనఁబఱిచితిరి. (తండ్రి విశ్వకుఁడు, కొడుకు విష్ణాప్వుఁడు)

౧౨౬౪. దశరాత్రీర శివేనానవద్యూ నవనద్ధంశ్నథిత మప్స్వంతః ।
విప్రుతం రేభముదనిప్ర వృక్తము న్నిన్యథుః సోమమివ స్రువేణ॥ ౨౪॥

దం॥ ఉదకములమధ్యభాగమందు (రాక్షసులచే) ద్రోయఁబడిన, బాధించునట్టి త్రాటితోఁ గట్టఁబడిన, బాధపెట్టఁబడుచున్న, పదిరాత్రులు తొమ్మిది పగళ్లు నీటిలో మునిఁగియున్న, బాధపడుచునున్న రేభుఁడను ఋషిని అశ్వినీదేవతలారా! అధ్వర్యుఁడు సోమరసమును స్రువముతో నొక ప్రక్కకుఁ జేర్చినట్లు దరిజేర్చితిరి.

౧౨౬౫. ప్రవాందంసాం స్యశ్వినావతోచము న్యపతిః స్యాంసుగవః సువీరః ।
ఉతపశ్యన్నశ్ను వన్దీర్ఘ మాయు రస్తమి వేజ్జరిమాణం జగమ్యామ్॥ ౨౫॥

దం॥ ఓయశ్వినీదేవతలారా! మీయొక్కప్రాచీన కర్మలను వర్ణించిచెప్పితిని. అట్టి నేనుమంచియావులుకలవాఁడను, మంచిపుత్రులు గలవాఁడను, అయియీదేశమునకు ప్రభువునుకావలయును.ఇంద్రియసుఖములనుభవించుచు, దీర్ఘాయువున అనుభవించుచు (యజమానుఁడు) తనయింటికింబొందిన విధమున ముదిమినిబొందుదును గాక.

---

## సూక్తము, ౧౧౭.

(కక్షీవంతఋషి - త్రిష్టుప్ఛంద - ఆశ్వినీదేవత -)

౧౨౬౬. మధ్వఃసోమస్యాశ్వినా మదాయ ప్రత్నోహోతా వివాసతేవామ్ ।
బర్హిష్మతీరాతిర్విశ్రితా గీరిషాయాతంనా సత్యోప వాజైః॥ ౧॥

దం॥ అశ్వినీదేవతలారా! మాధుర్యముగల సోమరసముతో విూసంతోషము కొఱకు పూర్వకాలమునాటి వాఁడగు యజమానుఁడు మిమ్ము సేవించుచున్నాఁడు. మఱియు ఇయ్యఁదగినహవిస్సు దర్భలయందుంచఁబడినది. స్తుతివాక్కు-కూడఋత్విజుల చేతఁ జేయఁబడుచున్నది. కనుకఅశ్వినులారా! మాకివ్వఁదగిన యన్నముతో, బలముతో రండు.

౧౭౧౭. యోవామశ్వినా మనసోజవీయాన్రథః స్వశ్వోవిశ ఆజిగాతి ।

యేనగచ్ఛథః సుకృతోదు రోణం తేన నరావర్తి రస్మభ్యంయాతమ్॥ ౨॥

దం॥ సర్వప్రేరకులగు అశ్వినీదేవతలారా! మనస్సుకంటె మిక్కిలివేగముగలదియు మంచి గుఱ్ఱములనుగూర్చినది అగు విూరథముతో యజ్ఞకర్తయొక్క గృహమును గూర్చి పోవుచున్నారో ఆరథముతో మాయింటికి రండు.

౧౭౧౮. ఋషింనరావం హసః పాఞ్చ జన్యమృబీసాదత్రిం ముఞ్చథో గణేన ।

మినన్తా దస్యో రశివస్యమాయాఅనుపూర్వం వృషణా చోదయన్తా॥ ౩॥

దం॥ కర్మప్రేరకులై (కోర్కెల) వర్షము కురిపించునట్టి యశ్వినులారా! సర్వవర్ణముల వారికి హితకరుఁడగు (సూర్యుని) విడిపించువాఁడగు (రాహువుపట్టి కొన్నపుడు విడిపించెనని తా.) నట్టి పాపరూపమగు (శతద్వారయంత్రగృహమున నుంచఁబడిన) అత్రిఋషిని తనవారితోఁగూడను మునిప్పువల్ల రక్షించితిరి. శత్రువుల హింసించుచు అమంగళకరుఁడయిన దస్యుని మాయలను వరుసగా నివారించితిరి.

౧౭౨౦. అశ్వం నగూళ్హ మశ్వినాదురే వైఋషింనరావృషణా రేభమప్సు ।

సన్తంరిణీథో విప్రుతందంసో భిర్నవాంజూ య్యన్తి పూర్వ్యాకృతాని॥ ౪॥

దం॥ శత్రువ్ననిర్వేరకులు, వర్షముకురిపించువారు నయిన అశ్వినులారా! చెడ్డవారైన రాక్షసులచేత (నూతిలో) నీళ్లలోఁ ద్రోయఁబడిన రేభుఁడను ఋషిని అవయవములు శిథిలమైనపుడు గుఱ్ఱమును నేదదేర్చినట్లు నేదదేర్చితిరి. మీరుచేసిన పనులు నశింపవు.

౧౨౨౧. సుషుప్వాంసం ననిఋృతే రుపస్థేసూర్యం నదస్రాత మసిక్షియ న్తమ్ ।

శుభే రుక్మంనదర్శతం నిఖాత మ్మదూపథు రశ్వినా వన్దనాయ॥ ౫॥

దం॥ భూమియొక్క మధ్యభాగమందు నిద్రించువానినివలె చీఁకటి నూతిలో నివసించు సూర్యునివలెను అలంకారమునకై యుంచఁబడిన బంగారువలెను జూడఁదగిన (బావిలో) పడవేయఁబడిన వందనర్షిని దర్శనీయులగు నశ్వినులారా! మీరుద్ధరించితిరి. (చేయకముందు అలంకారము బంగారులో మూతవడియుండునట్లు నూతిలో మూత వడియున్నాఁడని తా.)

౧౨౨౨. తద్వాం నరాశంస్యం పజ్రియేణ కక్షీవతానా సత్యా పరిజ్మన్ ।

శఫాదశ్వస్య వాజినోజనాయ శతంకుంభాఁ అసిఞ్చతం మధూనామ్॥ ౬॥

దం॥ సత్కర్మప్రేరకులగు నశ్వినీదేవతలారా! జనులకొఱకు వేగముగల మీగుఱ్ఱముయొక్క డెక్కనుండి స్రవించిన మద్యముల కుంభముల నూటిని ప్రవహింపఁజేసితిరి అనునది యిష్టారము నొడగూర్చిన పనియేదో అది అంగిరసవంశ్యుఁడ నయిన నాచే స్తుతింపఁ దగినది.

౧౨౨౩. యువంనరాస్తువతే కృష్ణియాయ విష్ణాప్వందదథుర్వి శ్వకాయ ।

ఘోషాయైచిత్పితృషదే దురోణేపతిం జూర్యన్త్యా అశ్వినావదత్తమ్॥ ౭॥

దం॥ సత్కర్మప్రేరకులైన అశ్వినులారా! స్తుతించుచున్న కృష్ణుఁడనువానికొడుకు విశ్వకుఁడనువానికి విష్ణాప్వుఁడను కొడుకును ఇచ్చితిరి. అశ్వినులారా! తండ్రిసంబంధమయిన యింటిలో జీర్ణించుచున్న (కుష్ఠురోగముగల) ఘోషయను (బ్రహ్మవాదిని) కి భర్తనుగూర్చితిరి. (ఆ రోగము పోఁగొట్టి వివాహయోగ్యురాలిం జేసితిరని తా.)

౧౨౨౪. యువంశ్యావాయ రుశతీ మదత్తం మహఃక్షోణస్యాశ్వినా కణ్వాయ ।

ప్రవాచ్యంతద్వృషణా కృతంవాంయన్నార్షదా యశ్రవో అధ్యధత్తమ్॥ ౮॥

దం॥ వర్షము కురిపించు నశ్వినీదేవతలారా! నృషదుని కొడుకు (బధిరుఁడను) వానికి శ్రవణేంద్రియము నిచ్చితిరి కుష్ఠురోగముగల శ్యావర్షికి (ఆరోగ్యం పోగొట్టి) సొగసయిన స్త్రీని పెళ్ళి చేసితిరి. (గుప్తశత్రుల చేత) ఒకచోట నివసించిన కణ్వఋషికి చక్షురింద్రియము నిచ్చితిరి. ఆ పనులన్నియు మీగుల స్తుతింపదగియున్నవి.

౧౨౭౪. పురూవర్పాంస్యశ్వినా దధానా నిపేదవ ఊహథురాశుమశ్వమ్ ।

సహస్రసాంవాజినమప్రతీతమహిహనం శ్రవస్యం౧ తరుత్రమ్॥ ౯॥

దం॥ అశ్వినీదేవతలారా! అనేకములయిన పనులకొఱకు అనేకములయిన రూపములను ధరించినట్టి మీరు; వేగముగల్గి వేలకొలఁది ధనమిచ్చునట్టి బలముగలవగుటచేతనే శత్రువులకు దొరకనిది, శత్రువుల సంహరించునది, స్తుతింపదగినది, ఆపదలను దరింపఁజేయునది యగు గుఱ్ఱమును పేదువునకు నిచ్చితిరి.

౧౨౭౫. ఏతానివాం శ్రవస్యా సుదానూ బ్రహ్మాంగూషంసదనం రోదస్యోః ।

యద్వాంపజ్రాసో అశ్వినాహవన్తే యాతమిషాచ విదుషేచవాజమ్॥ ౧౦॥

దం॥ మంచిదాతలగు నశ్వినులారా! (వెనుక చెప్పఁబడిన) మీ పరాక్రమములు ప్రకటింపదగినవి. ద్యులోకభూలోక రూపులగు మీకుఁ బ్రియమయిన స్తుతిమంత్రము ప్రకటింపఁ బడినది. ఎపుడంగిరో గోత్రులు మిమ్ము నశ్వినులారా! పిలుచుచున్నారో యపుడు అన్నముతోఁ గూడ రండు. స్తుతి నెఱింగిన నాకు నన్నమిండు.

౧౨౭౬. సూనోర్మానేనాశ్వినా గృణానావాజం విప్రాయభురణా రదన్తా ।

అగస్త్యే బ్రహ్మణావావృధానా సంవిశ్పలాం నాసత్యారిణీతమ్॥ ౧౧॥

దం॥ పోషకులై సత్యస్వభావులయిన అశ్వినీదేవతలారా! (కుంభజన్ముఁడయిన) అగస్త్యునియొక్క స్తోత్రముచేత, స్తవనీయులైన మీరు బుద్ధిశాలియైన భరద్వాజర్షికి అన్నమును కలుగఁజేయుచు విశ్పలయను నామెకు పోయిన పాదమును మరల సంధించిరి.

౧౭౭. కుహయాన్తా సుష్టుతిం కావ్యస్య దివోనపాతా వృషణా శయుత్రా ।

హిరణ్యస్యేవ కలశం నిఖాతముదూపథుర్దశమే అశ్వినాహన్ ॥ ౧౨॥

తం॥ సూర్యపుత్రులయి, వర్షదాతలయి, శయుడనువానిని రక్షించినట్టి యశ్వినులారా! మీరు బంగారు చేసి పబడి భూమియందుంచిన కలశమువలె (రాక్షసులచేత నూతిలో) పాతిపెట్టబడిన రేభుడను వానిని పదవదినమందు దరిచేర్చితిరి. కవిపుత్రుని స్తుతిని (వినుటకు) బోవుచు నెక్కడ నుంటిరి? (కవికొడుకు శుక్రుడు.)

౧౭౮. యువంచ్యవాన మశ్వినాజరన్తం పునర్యువా నంచక్రథుః శచీభిః ।

యువోరథందుహితా సూర్యస్యసహశ్రియానా సత్యా వృణీత॥ ౧౩॥

తం॥ అశ్వినులారా! మీరు మీ ఔషధకర్మలచేత వృద్ధుడగుచున్న చ్యవనుడను ఋషిని మరల యౌవనవంతునిగా జేసితిరి. అసత్యరహితులారా! మీరథమును (సూర్య అనునది) సంపదతోగూడ జేరినది

౧౭౯. యువంతు గ్రాయపూర్వ్యేభిరేవైః పునర్మన్యావ భవతంయువానా ।

యువంభుజ్యు మర్ణసోనిః సముద్రాద్విభిరూహథు ఋజ్రేభిరశ్వైః॥ ౧౪॥

తం॥ యౌవనవంతులయిన యశ్వినులారా! మీరు పూర్వకాలమందలి స్తోత్రములచేత తుగ్రుడను వానికొఱకు మరల స్తుతింపదగినవారలయిరి. మీరు భుజ్యుడను వానిని అధికోదకముగల సముద్రమునుండి ఎగురునట్టి యెండలతో (అనగా పక్షివలె నెగురగల యని తా.) శీఘ్రగమనముగల గుఱ్ఱములతోను బయటకు దీసి (తండ్రిం జేర్చితిరి.)

౧౮౧. అజోహవీ దశ్వినాతౌగ్ర్యోవాం ప్రోహ్యః సముద్రమవ్యథిర్జగన్వాన్ ।

నిష్టమూహథుః సుయుజారథేన మనోజవసా వృషణాస్వస్తి॥ ౧౫॥

వ॥ అశ్విని దేవతలారా! తుగ్రపుత్రుడు భుజ్యుడు తండ్రిచే బంపబడి సముద్రముమీద బోవుచు బాధయేమియు లేకయే మిమ్ము బిలిచెను. వానిని మనోవేగముగల్గి వర్షదాతలగు నశ్వినులారా! మంచిగుఱ్ఱాలు బూన్చిన రథముతో క్షేమముగా నుద్ధరించితిరి.

౧-౨౮౨ అజోహవీ దశ్వినావర్తికా వామాస్నో యత్సీమముంచతం వృకస్య ।

విజయుషాయయథుః సాన్వద్రేర్జాతం విష్వాచో అహతంవిషేణ॥ ౧౬॥

దం॥ ఆడుపిచ్చుక తోడేలినోటినుండి మిమ్ముఁ బిలిచినంతలో నశ్వినులారా! ఎప్పుడువిడిపించితిరో అపుడది స్తుతించెను. మీరు జయశీలమయిన రథముతోఁ బర్వతముయొక్క చఱియయందుఁ జేర్చితిరి. (జాహుషుఁడను వానిని శత్రువులనుండి తప్పించి శత్రువులు చొరరాని కొండమీఁద నెక్కించిరట!) విష్వాముఁడను రాక్షసి కొమారుని విషముతో మీరు చంపితిరి.

౧-౨౮౩. శతంమేషాన్వృక్యే మామహానంతమః ప్రణీత మశివేనపిత్రా ।

అక్షీఋజ్రాశ్వే అశ్వినావధత్తం జ్యోతిరన్ధాయ చక్రథుర్విచక్షే॥ ౧౬॥

దం॥ నూఱు గొఱ్ఱెలను తోడేలురూపమయిన అశ్వినుల వాహనమయిన గాడిదకు సమర్పించినవాఁడును, దుష్టుఁడైన తండ్రిచేత గ్రుడ్డివాఁడుగాఁ జేయఁబడినవాఁడును అగు ఋజ్రాశ్వుని అశ్వినులారా! (తండ్రిశాపముపోయి) కన్నులు ఋజ్రాశ్వునకుఁ గలుగునట్లు చేసితిరి. గ్రుడ్డివానికి నేత్రములు కలుగునట్టి వెలుఁగును గలిగించితిరి.

౧-౨౮౪. శునమన్ధాయ భరమహ్వయత్సా వృకీరశ్వినా వృషణానరేతి ।

జారఃకనీన ఇవ చక్షదానఋజ్రాశ్వః శతమేకంచమేషాన్॥ ౧౮॥

దం॥ పోషణహేతువయిన సుఖమును గ్రుడ్డివానికి గోరుచుండు తోడేలు "ఎల్లచోట్ల వ్యాపించినవారలారా! వర్షదాతలారా! సుఖకర్తలారా!" అనిమిమ్ముఁ బిలిచెను. యౌవనవంతుఁడై పరస్త్రీలు గోరినజారుఁడు ధనమును నిర్లక్ష్యముగాఁ గచ్చుపెట్టునట్లు నూటొక్కగొఱ్ఱెలను ముక్కలుగొట్టి నాకిచ్చెను. (అనితోడేలివాక్యము)

౧-౨౮౫. మహీవామూతి రశ్వినామయో భూరుత స్రామంధిష్ణ్యా సంరిణీథః ।

అథాయువా మిదహ్వయత్పురన్ధిరాగచ్ఛతంసీం వృషణావవోభిః॥ ౧౯॥

వ॥ అశ్వినీదేవతలారా! మీశ్రేష్ఠమగుపరిపాలనము సుఖాధారముగా నున్నది. మఱియుస్తోత్రార్హులగు నోయశ్వినులారా! రోగవంతుఁడగువారిని ఆరోగ్యము గలయవయవములుగల వారిగాఁజేయుచున్నారు. మఱియు బుద్ధిమంతురాలయిన విశ్పల మిమ్ము (రోగముపోఁగొట్టుఁడని) ప్రార్థించెను. వర్షముకురిపించు నశ్వినులారా! అపుడే రక్షణలతో వచ్చితిరో వాటితో రండు.

౧౨౮౬. అధేనుం దస్రా స్తర్యం౧ విషక్తామపిన్వతం శయవే అశ్వినా గామ్ ।

యువం శచీభిర్విమదాయ జాయాం న్యూహథుః పురుమిత్రస్య యోషామ్॥౧౯॥

వ॥ దర్శనీయులగు నశ్వినులారా! కృశించినది, కనుకనే గొడ్డువోయి పాలులేనిది అగుగోవును శయువనువానికి పాలిచ్చుదానింగాఁ జేసితిరి. మఱియు పురుమిత్రుఁడను రాజుయొక్క కూతును విమదునికొఱకు భార్యనుగా మీరు మీ ఉపాయముతోఁ జేసితిరి. (విమదుఁడు శత్రులతోఁ బోరాడి బాధపడుచుండ నతనినా బాధనుండివిడిపించి యుతనిభార్యనుం గూడశత్రులచేతులనుండి తప్పించి యుద్ధజేనింటఁ జేర్చిరట.)

౧౨౮౭. యవంవృకేణాశ్వినా వపన్తేషం దుహన్తా మనుషాయ దస్రా ।

అభిదస్యుంబకురేణా ధమన్తోరుజ్యోతిశ్చక్రథు రార్యాయ॥ ౨౦॥

వ॥ ఆర్యుఁడను మనుష్యునకు నాగటితో(దున్నిన భూమియందు) యవధాన్యమును అశ్వినులారా! మీరు చల్లితిరి. అట్లే దస్యులను (=దొంగలు మొదలగు బాధకులు) వజ్రాయుధముతోఁ జంపితిరి. ఇట్లు పరాక్రమముచు జేసితిరి. (ఆర్య=పండితుఁడు అని భాష్యం)

౧౨౮౮. ఆథర్వణాయాశ్వినా దధీచే శ్వ్యంశిరః ప్రత్యైరయతమ్ ।

స వాంమధు ప్రవోచదృతా యన్త్వాష్ట్రం యద్దస్రా వపికక్ష్యం వామ్॥ ౨౧॥

వ! అశ్వినులారా! అథర్వణపుత్రుఁ డయినదధీచికి అశ్వసంబంధమగు శిరస్సును బిగలు చేసితిరి. అతఁడు మీకు మధువిద్యను, ప్రవర్గ్య విద్యనిత్తునని మాటయిచ్చినవాఁడై ఇంద్రునివల్ల లభించిన మధువిద్యను చెప్పెను. అశ్వినీదేవతలారా! మీకు రహస్యమయిన యేప్రవర్గ్య విద్యను గూడనుపదేశించెను.

౧౨౮౯. సదాకవీసుమతి మాచకేవాంవిశ్వా ధియోఅశ్వినా ప్రావతంమే ।

అస్మేరయింనాసత్యా బృహంతమపత్య సాచంశ్రుత్యం రరాథామ్॥ ౨౨॥

దం॥ బుద్ధిశాలురగు నశ్వినులారా! మీ యనుగ్రహబుద్ధి నెల్లప్పుడును గోరుచున్నాను. నాయొక్క సర్వకర్మలను మీరు రక్షింపుడు. సత్యవచనులారా! అధికమైన పుత్రపౌత్రాదులతోఁ గూడిన యెన్నికైన ధనమును మాకు నిండు.

౧౨౯౦. హిరణ్యహస్తమశ్వినారరాణా పుత్రంనరావధ్రిమత్యా అదత్తమ్ ।

త్రిధాహశ్యావమశ్వినా వికస్తముజ్జీవస ఐరయతం సుదానూ॥ ౨౩॥

దం॥ దాతలగునట్టి, సర్వకర్మప్రేరకులగునట్టి అశ్వినీదేవతలారా! హిరణ్యహస్తుఁడను పేరుగల పుత్రుని వధ్రిమతియను బ్రహ్మవాదినికి ఇచ్చితిరి. (ఈమెకుష్ఠు బాగు చేసి పెళ్లిచేయించి పుత్రుడు కలిగినట్లు చేసిరని తా.) మంచిదానములుకల అశ్వినులారా! మూఁడుభాగములుగ ఛేదింపఁబడిన శ్యావుఁడను ఋషిని బ్రతికించితిరి.

౧౨౯౧. ఏతాని వామశ్వినా వీర్యాణి ప్రపూర్వ్యాణ్యాయవోవోచన్ ।

బ్రహ్మకృణ్వంతో వృషణాయువాభ్యాం సువీరాసో విదథమావదేమ॥ ౨౪॥

దం॥ అశ్వినీదేవతలారా! మీయొక్క పూర్వకాలపు వీరకృత్యములు నాతండ్రి మొదలగు బంధువులు చెప్పిరి. (ఇష్టార్థము) వర్షించునో యశ్వినులారా! మీకొఱకు మేమును మంత్రరూపమయిన స్తవమును చేయుచు మంచి పుత్రపౌత్రాదులు కలవారమయి చదువరులైన యతిథులను (ప్రియవాక్కు-లతో) స్వాగతమడుగుదుముగాక.

## సూక్తము, ౧౧౮.

(కక్షీవంతఋషి - త్రిష్టుప్ఛంద - అశ్వినీ దేవత)

౧౭౯౨. ఆవాంరథో అశ్వినా శ్యేన పత్వాసుమృళీకః స్వవాంయాత్వర్వాఙ్ ।
యోమర్త్యస్యమనసో జవీయాస్త్రి వన్ధురో వృషణావాతరంహాః॥ ౧॥

ద౦॥ (కోరికలు) వర్షించునట్టి యశ్వినులారా! యే మీరథము; మనుష్యుని మనస్సుకంటెను వేగముకలది మూఁడు నొగలు (=సారథి కూర్చుండుచోట్లు) కలది, వాయువువంటి వేగముకలది, మంచి సుఖమునిచ్చునది, ధనముగలది, అయియున్నదో మాకభిముఖముగా వచ్చుఁగాక.

౧౭౯3. త్రివన్ధురే ణత్రివృతా రథేన త్రిచక్రేణ సువృతాయాత మర్వాక్ ।
పిన్వతంగాజిన్వత మర్వతో నోవర్ధయతమశ్వినా వీరమస్మే॥ ౨॥

త౦॥ మూఁడునొగలుకలది, మూఁడువిధములుగా దీర్చఁబడియున్నది, మూఁడు చక్రములుకలది, సుఖగమనముకలది యగు రథముతో మాకభిముఖముగా రండు. మాగోవులను పాడిగలవాటినిగాఁ జేయుఁడు. మాగుఱ్ఱములను ప్రియమయినవిగఁ జేయుఁడు. లేక జయశీలములంజేయుఁడు అశ్వినులారా! మాను పుత్రపౌత్రాదులనువృద్ధి నొందింపుఁడు.

౧౭౯౪. ప్రవద్యామనా సువృతారథేన దస్రావిమం శృణుతం శ్లోకమద్రేః ।
కిమఙ్గవాం ప్రత్యవర్తిం గమిష్ఠాహుర్విప్రాసో అశ్వినాపురాజాః॥ ౩॥

ద౦॥ దర్శనీయులగు నశ్వినులారా! శీఘ్రగమనముగల దృఢమయిన రథముతో స్తుతికర్తయొక్క యీ స్తుతివాక్యమును వినుఁడు. ఓ యశ్వినులారా! పూర్వకాలపు బుద్ధిమంతులు స్తుతికర్తల దారిద్ర్యశాంతికై మీ రాకను ఏమని చెప్పుచున్నారో?

౧౭౯౫. ఆ వాం శ్యేనాసో అశ్వినావహన్తు రథేయుక్తాస ఆశవఃపతఙ్గాః ।
యే అప్తురో దివ్యాసో నగృధ్రా అభిప్రయో నాసత్యావహన్తి॥ ౪॥

తా॥ ఏ యశ్వములు ఉదకమువలె వేగము బోవునవియో, ఆకాశమునందు సంచరించునట్టి డేగలవలె శీఘ్రము నడచునవో, హవిస్సుల గురించి అశ్వినులారా! మిమ్ము నేవి వహించి తెచ్చుచున్నవో; కపటమునకుం బూనుకొనక సర్వత్ర వ్యాపించి వడిగ నడచుచు స్తుతింపదగినట్టి ఆ మీయశ్వములు మిమ్ము తీసికొని వచ్చుగాక.

౧౩౪౬. ఆ వాం రథం యువతి స్తిష్ఠ దత్ర జుష్ట్వీ నరా దుహితా సూర్యస్య।

పరి వామశ్వా వపుషః పతఙ్గా వయో వహన్త్వరుషా అభీకే॥ ౫॥

తా॥ సర్వప్రేరకులగు నశ్వినిదేవతలారా! యౌవనము గల సూర్యుని కూతురు ప్రీతికలదై మీయెదుట మీరథము నెక్కెను. మంచిరూపము గలవి, ఎగురునట్టి శక్తి కలవి, వడిగాం బోవునవి, హింసకములు లేనివి యగు గుఱ్ఱములు (ఆ కాంతితోం గూడిన) మిమ్ము దోడ్కొనివచ్చుంగాక.

౧౩౪౭. ఉద్వన్దనమైరతం దంసనాభి రుద్రేభం దస్రా వృషణా శచీభిః।

నిష్టౌగ్ర్యం పారయథః సముద్రాత్పునశ్చ్యవానం చక్రథుర్యువానమ్॥ ౬॥

తా॥ అశ్వినీదేవతలారా! వందనుడను ఋషిని మీ సామర్థ్యముతో బావినుండి బయటికిం దీసితిరి. దర్శనీయులారా! (కోర్కెల) వర్షించువారలారా! మీ సామర్థ్యముల చేత రేభుండను ఋషిని బావినుండి పైకి తీసితిరి. తుగ్రపుత్రుండైన భుజ్యుని సముద్రమునుండి దరిచేర్చితిరి. ముసలివాండగు చ్యవనుని యౌవనవంతునిగాం జేసితిరి.

౧౩౪౮. యువమత్రయేఽవనీతాయ తప్తమూర్జమోమానమశ్వినావధత్తమ్।

యువం కణ్వాయాపిరిప్తాయ చక్షుః ప్రత్యధత్తం సుష్టుతిం జుజుషాణా॥ ౭॥

తా॥ అశ్వినులారా! మీరు (శతద్వారయంత్రమున) పడవేయంబడిన అత్రి పైని రగుల్కొనుచున్న యగ్నిని చల్లార్చితిరి. వానికి సుఖముగ బలమును గలిగించు నన్నమును గూర్చితిరి. మంచిస్తోత్రమును వినుండు. మీరు పొరలు గ్రమ్మిన నేత్రములుగల కణ్వునకు దృష్టినిచ్చితిరి.

౧౨౯౯. యువంధేనుంశ యవేనాధితాయా పిన్వతమశ్వినా పూర్వ్యాయ ।

అముఞ్చతంవ ర్తి కామంహ సోనిః ప్రతిజంఘాం విశ్పలాయా అధ త్తమ్॥ ౮॥

దం॥ అశ్వినులారా! మీరు యాచించుచున్న పూర్వకాలపు శయుఁడనుఋషి కొఱకు గోవును పాలిచ్చుదానిగాఁ జేసితిరి. ఆడపిచ్చుకను బాధనుండి తొలగించితిరి. విశ్పలయనునామెకు తెగిపోయిన పిక్కను మరల సంధించితిరి.

౧౩౦౦. యువంశ్వేతంపే దవ ఇంద్రజూత మహిహనమశ్వినా ద త్తమశ్వమ్ ।

జోహూత్రమర్యో అభిభూతి ముగ్రంసహస్రసాం వృషణంవీడ్వఙ్గమ్॥ ౯॥

దం॥ అశ్వినులారా! పేదుఁడను రాజుకొఱకు తెల్లనిది, యింద్రునిచే మీకీఁబడినది శత్రువులం జంపునది, అనేకమార్లు యుద్ధములకుఁ బిలువంబడినది, శత్రువునుదిరస్కరించునది, యౌవనముగలది, దృఢావయవములుకలది యగు నశ్వమును మీరిచ్చితిరి.

౧౩౦౧. తావాంనరా స్వవసే సుజాతా హవామహే అశ్వినానాధమానాః ।

ఆనఉపవసు మతారథే నగిరోజుషాణా సువితా యయాతమ్॥ ౧౦॥

దం॥ అశ్వినులారా! మంచి జన్మముకల ప్రసిద్ధులగు మిమ్ము ద్రవ్యమును యాచించుచున్న మేము రక్షణకొఱకు ప్రార్థించుచున్నాము. స్తుతివాక్కులను వినుచు ద్రవ్యముతో నిండినరథముతో మమ్మునుగూర్చి సుఖదానము చేయుటకై దయ చేయుఁడు.

౧౩౦౨. ఆశ్యేనస్య జవసానూతనే నాస్మే యాతంనా సత్యాసజోషాః ।

హవేహివా మశ్వినారాత హవ్యః శశ్వ త్తమాయా ఉషసోవ్యుష్టౌ॥ ౧౧॥

దం॥ అశ్వినీదేవతలారా! యేకారణమువల్ల హవిస్సులు సమర్పించిన వాఁడనై శాశ్వతమగు ఉషస్సుయొక్క అవసానమందుఁ బిలుచుచున్నానో, ఆకారణమువల్ల సత్యవచనులారా! సమానప్రీతికలవారలై అశ్వముయొక్క క్రొత్త వేగముతో మా వద్దకురండు.

## సూ క్త ము. ౧౧౯.

కక్షీవంతఋషి-జగతీచ్ఛంద - అశ్వినీదేవత

౧౩౦౩. ఆవాంరథం పురుమాయం మనోజువంజీరాశ్వం యజ్ఞియం జీవసేహువే ।

సహస్రకేతుం వనినం శతద్వసుం శ్రుష్టీవానం వరివోధామ భిప్రయః॥ ౧॥

వం॥ అశ్వినులారా! బహ్వైశ్వర్యములు గల్గి మనస్సువంటి వేగముగలదై శీఘ్రాశ్వములు గల్గినదయి యాగార్హమయిన అనేకధ్వజములుకలట్టి, వర్షము కురిపించునట్టి, వేలకొలంది ధనముగల సుఖమును గల్గించునట్టి, ధనమిచ్చునట్టి మీరథమును హావిస్సుల నందుకొను నిమిత్తము ఆయువునుగోరి పిలుచుచున్నాను.

౧౩౦౪. ఊర్ధ్వాధీతిః ప్రత్యస్యప్రయామన్యధాయి శస్మన్త్సమయన్త ఆదిశః ।

స్వదామిఘర్మం ప్రతియన్త్యూతయ ఆవామూర్జానీరథ మశ్వినారుహత్॥ ౨॥

వం॥ ఈ రథము నడచుచుండఁగా నశ్వినీదేవతాస్తుతియందు మాబుద్ధి ఊర్ధ్వముఖమైనిల్చెను. తరువాత స్తవములుకూడ నశ్వినులను జేరుచున్నవి. మఱియు నేనును స్రవించు నాజ్యముతోఁ గూడిన హావిస్సును రుచికలదానినిఁ జేయుచున్నాను. ఋత్విజులుకూడ హావిస్సంస్కారమునకు సహాయులగుచున్నారు. అశ్వినులారా! మీరథమును సూర్యపుత్రియెక్కెనా?

౧౩౦౫. సంయన్మిథః పస్పృధానాసో అగ్మత శుభేమఖా అమితా జాయవోరణే ।

యువోరహప్రవణే చేకితే రథోయ దశ్వినావహ థస్సూరిమావరమ్॥ ౩॥

వం॥ యజ్ఞముతోఁగూడి లెక్కలేని జయశీలురు యుద్ధమందు ధనముకొఱకు పరస్పరము పోటీచేయుచు నెప్పుడు కూడుచున్నారో యప్పుడు అశ్వినీదేవతలారా! మీయొక్క రథమేభూమియందుమఁ దెలియఁబడుచున్నది. ఏరథముతో స్తుతికర్తలనుగూర్చి ధనమును గొనికొని వచ్చెదరో ఆరథము.

౧౩౦౬. యువంభుజ్యుం భురమాణం విభిర్గతం స్వయుక్తిభిర్నివహన్తా పితృభ్య ఆ ।
యాసిష్టం వర్తిర్వృషణా విజేన్యం౧ దివోదాసాయ మహిచేతివామవః॥ ౪॥

వ॥ (ఇష్టార్థము) వర్షించువట్టి వారలారా! మీరు అశ్వములచే ధరింపఁబడుచున్న, సముద్రమునఁ బడియున్న భుజ్యుఁడను వానిని స్వయముగా రథముఁబూన్చుకొనునట్టి యశ్వములతో లేవనెత్తినవారయి దూరముననున్న తలిదండ్రులయింటివఱకు దెచ్చిరి. దివోదాసుఁడనువానికై మీరు చేయురక్ష (శంబరుని సంహారకాలమున) మేమెఱుంగుదుము.

౧౩౦౭. యువోరశ్వినావపుషే యువాయుజంరథం వాణీయేమతురస్య శర్ధ్యమ్ ।
ఆవాంపతిత్వం సఖ్యాయ జగ్ముషీయోషావృణీతజేన్యాయువాంపతీ॥ ౫॥

వ॥ అశ్వినీదేవతలారా! మీయొక్క స్తుతనీయములగు గుఱ్ఱములు మీచేఁ బూన్చబడు రథమును దాని నియమితస్థలమునకు (అనగా సూర్యుఁడున్నచోటికని తా.) కనఁబడేటందుకుఁ జేర్చెను. (దేవతలందఱికంటె ముందుమిమ్ముఁ దెచ్చెనని తా.) తరువాత జయింపవచ్చిన కన్య (సూర్యపుత్రి) స్నేహధర్మముకొఱకు "మీరిద్దఱు నా పతులు" అనిచెప్పివరించెను.

౧౩౦౮. యువంరేభం పరిషూతే రురుష్యథో హిమేనఘర్మంపరితప్తమత్రయే ।
యువంశయోరవసం పిప్యథుర్గవి ప్రదీర్ఘేణ వన్దనస్తార్యాయుషా॥ ౬॥

వ॥ మీరు రేభుఁడను ఋషిని యుపద్రవములనుండి రక్షించితిరి. అత్రికై మిగుల దహించు నుముకె నిప్పును చల్లనినీటితో వారించితిరి. శయుఁడను ఋషికి గొడ్డువోయిన ధేనువునందు రక్షకమగు క్షీరమును మీరు పూరింపఁ జేసితిరి. శిథిలావయవుఁడగు నందనర్షి దీర్ఘాయువుతో (సముద్రమునుండి) రక్షింపఁబడెను.

౧౩౦౯. యువంవన్దనం నిఋృతం జరణ్యయా రథం న దస్రా కరణా సమిన్వథః ।
క్షేత్రాదావిప్రంజనథో విపన్యయా ప్రవామత్రవిధతే దంసనా భువత్॥ ౭॥

## సూక్తము ౧౨౦.

కక్షీవంతుడు ఋషి - అశ్వినులు దేవత - ౧ గాయత్రి ౨ కకుప్ ౩ కావిరాట్ - ౪ నష్టరూప - ౫ తనుశిర ఉష్ణిక్కు ౬ విస్తారబృహతి - ౭ విరాటు - తక్కినవి గాయత్రులు।

౧౩౧౩. కారాధద్ధోత్రాశ్వినా వాం కోవాం జోషఉభయోః ।
కథా విధాత్యప్రచేతాః॥ ౧॥

వ॥ అశ్వినీదేవతలారా! యెట్టిస్తవము మిమ్ముఁ బూజించుచున్నది? ప్రీతిపొందుటలో మీయిద్దఱిలో నెవఁడు సమర్థుఁడు? మీ మహాత్మ్యమెఱుంగనివాఁడు ఏవిధమున మిమ్ము సేవించుచున్నాఁడు?

౧౩౧౪. విద్వాంసావిద్దురః పృచ్ఛేదవిద్వానిత్థాపరో అచేతాః ।
నూచిన్నుమర్తే అక్రౌ॥ ౨॥

వ॥ ఈవిధముగా తెలియనివాఁడు (స్తుతికర్త) సర్వజ్ఞులగు నశ్వినీదేవతలచేత సేవామార్గములను అడుగవలసినది. వారికంటె నితరుఁడు జ్ఞానరహితుఁడే. అశ్వినులిద్దఱును శత్రువులకు లొంగరు. స్తుతికర్తకు శీఘ్రముగానే ప్రత్యక్షమవుదురు.

౧౩౧౫. తావిద్వాంసా హవామహే వాంతానో విద్వాంసామన్మవోచేతమద్య ।
ప్రార్చద్దయమానో యువాకుః॥ ౩॥

వ॥ అశ్వినీదేవతలారా! విద్వాంసులయినట్టి మిమ్ముఁ బిలుచుచున్నాము. అట్లు పిలువఁబడినట్టి, జ్ఞానులయినట్టి మీరు మాకుఁ దెలియఁదగిన స్తోత్రమును ఇప్పుడు చెప్పవలెను. మిమ్ముఁగోరుచున్న నేను మీకొఱకు హవిస్సునిచ్చుచు స్తుతించుచున్నాను.

౧౩౧౬. విపృచ్ఛామిపాక్యాన దేవాన్వషట్కృతస్యాద్భుతస్యదస్రా ।
పాతంచసహ్యసో యువం చరభ్యసోనః॥ ౪॥

వ॥ అశ్వినీదేవతలారా! మిమ్ములనిక్కిలిగా వడుగుచున్నాను. పరిశుద్ధులగు యితర దేవతలను అడుగను. పూజ దగినట్టి మీకు నమస్కారముచేసి శ్రేష్ఠమైనదియు ఆశ్చర్యకరమై అధికబలమును గలిగించునట్టి సోమరసమును మీ భాగమును పానము చేయుఁడు. మమ్ముఁ బ్రాజ్ఞమయిన ఉద్యోగము కలవారినిగాఁ జేయుఁడు

౧౩౧౭. ప్రయాఘోషే భృగవాణేన శోభేయయావాచాయజతిపజ్రియోవామ్।

ప్రైషయుర్న విద్వాన్॥ ౫॥

వ॥ అశ్వినీదేవతలారా! ఏ మీ స్తుతివాక్కు ఘోషయను నామెకొడుకు (సుహస్త్యు) నందును, భృగుఋషియందును ప్రకాశించుచున్నదో ఆవాక్కు సమ మగుచున్నది. ఏవాక్కుచేత కక్షీవంతుఁడు మిమ్ము స్తుతించుచున్నాఁడో ఆవాక్కు ప్రకాశించుచున్నది. అన్నమునుగోరుచు స్తుతి నెఱింగిన కక్షీవంతుఁడు మీ యను గ్రహమువల్ల సఫలప్రయత్నుఁడగుఁగాక.

౧౩౧౮. శ్రుతంగాయత్రంతకవానస్యాహం చిద్ధిరేభాశ్వినావామ్ ।

ఆక్షీశుభస్పతీదన్॥ ౬॥

వ॥ అశ్వినులారా! గాయత్రిసామముతో తకవానుఁడను (నేను) చేయుస్తుతి వినుఁడు. కన్నులు మీవల్ల సంపాదింపఁదలచి ఋజ్రాశ్వుఁడు స్తుతించినట్లు (గాయత్రీసామముతోనే) నేను స్తుతించుచున్నాను.

౧౧౧౯ యువంహ్యాస్తం మహోరన్యువం వాయన్నిరతతంసతమ్ ।

తానోవసూసుగోపాస్యాతం పాతంనో వృకాదఘాయోః॥ ౭॥

వ॥ (అశ్వినీదేవతలారా!) ఎక్కువయిన ధనమును ఇచ్చువారు (ఎవనినైన) రక్షించువారు లేక నశింపఁజేయువారు అగుచున్నారు. క్షేమము కలుగఁజేయు ఆ మీరు మమ్ముఁ జక్కఁగాఁ గాపాడువారు కండు. చెఱుపును గోరునట్టి దొంగ నుండి మమ్ము రక్షింపుఁడు.

౧౩౨౦. మాకస్మై ధాతమభ్య మిత్రిణే నో మాకుత్రానో గృహేభ్యో ధేనవో గుః ।

సనాభుజో అశిశ్వీః॥ ౯॥

తం॥ అశ్వినీదేవతలారా! మైత్రిలేని యెవనికైనను మమ్ము నెపుడుగ నుంచకుఁడు. దూడలను లేక మనుష్యులను రక్షించునట్టి గోవులు దూడలులేనివి మేము చేరరాని స్థలమునకు మా యిండ్లనుండి పోకుండుఁగాక.

౧౩౨౧. దుహీ యన్మిత్ర ధితయే యువాకు రాయేచనో మిమీతం వాజవత్యై ।

ఇషేచనో మిమీతం ధేనుమత్యై॥ ౯॥

తం॥ (అశ్వినులారా! మిమ్ము స్తుతించు స్తుతికర్తలు మిత్రులపోషణకై ధనమును అందుకొనుచున్నారు. కనుక మమ్ము అన్నముతోఁగూడిన ధనముకలవారమయి యుండువారిగాఁ జేయుఁడు.

౧౩౨౨. అశ్వినో రసనంరథ మనశ్వంవాజినీవతోః । తేనాహం భూరి రచాకన॥ ౧౦॥

తం॥ బలముగల యశ్వినీ దేవతలయొక్క గుఱ్ఱములులేని రథమును నేను సంపాదించితిని. (అనగా స్తుతిమంత్రమే వారికి వాహనమని తా.) ఆరథముతో నేను ఎక్కువ శ్రేయస్సును గోరుచున్నాను.

౧౩౨౩. అ యంస మహ మాతనూహ్యతే జనాఅను సోమపే యంసుఖోరథః ॥౧౧॥

తం॥ ధనముతోఁ గూడినరథమా! ఈ నీవు నన్ను అభివృద్ధి నొందింపుము. సుఖముగలిగించునట్టి రథము స్తుతికర్తలవద్దకు సోమపానమును గురించి (అశ్వినుచే) తీసుకొని పోఁబడుచున్నది.

౧౩౨౪. అధస్వప్నస్య నిర్విదే భుఞ్జతశ్చ రేవతః । ఉభాతావస్రి నస్యతః॥ ౧౨॥

తం॥ ఇపుడు ప్రభాతసమయమందుఁ గలిగిన స్వప్నమును గురించి దుఃఖించుచున్నాను. అట్లే యితరరక్షణ మొనర్పని ధనవంతుఁడగు పురుషుని గురించి దుఃఖించుచున్నాను. వారిద్దఱు శీఘ్రముగ నశించుచున్నారు. (స్వప్నము, లోభియును శాశ్వతముగా నిల్వరని తా.)

జంపఁదగినదానితోఁ జేరునట్లు నిర్మించెను. మనుష్యుల హితముకొఱకు చతుష్పాద జంతువులకొఱకు, ద్విపాదజంతువులకొఱకు, గ్రిందబడకుండ ద్యులోకము నిల్పెను.

౧౩౨౫. అస్యమదే స్వర్యం దాఋతాయాపీవృత ముస్రియాణా మనీకమ్ ।
యద్ధప్రసర్గే త్రికకుమ్ని వర్తదపద్రుహో మానుషస్యదురోవః॥ ౪॥

ద॥ (ఓ యింద్రా!) యీసోమరసముయొక్క మదము గలిగినపుడు యజ్ఞముకొఱకు స్తుతింపఁదగిన (గుహలో) దాఁచబడిన గోవులయొక్క సమూహమును ఇచ్చితివి (అంగిరసులకని తా.) ఎప్పుడైతే యుద్ధమునందు ముల్లోకాలకు నాయకుఁడగు నింద్రుఁడున్నాఁడో అప్పుడు మనుష్యులకు దోహముచేయు (పణియనువాని) ద్వారములను బగులఁ గొట్టినాడే.

౧౩౨౬. తుభ్యంపయో యత్పితరావనీతాం రాధః సురేతస్తురణే భురణ్యూ ।
శుచియత్తే రేక్ణ ఆయజన్తసబర్దుఘాయాః పయఉస్రియాయాః॥ ౫॥

దం॥ ఓ యింద్రుఁడా! శీఘ్రముగఁ గార్యములు నెరవేర్చునట్టి నీ కొఱకు సర్వ జగత్పాలకములగు ద్యావాభూములు ఎపుడు సమృద్ధికల్గి జగదుత్పత్తి చేయునట్టి హవిస్సును గలుగజేసెనో, యెపుడు శుద్ధమయిన పాలుపితుకునట్టి, ధనముకంటెఁ బ్రియమయినట్టి గోవుక్షీరమును నీకు యజమానులిచ్చిరో (అపుడు నీవు గుహా ద్వారములు పగులఁగొట్టితివని పూర్వాన్వయము.)

౧౩౨౭. అధప్రజజ్ఞేతరణి ర్మమత్తు ప్రరోచ్యస్యా ఉషసోనసూరః ।
ఇన్దుర్యేభిరాష్టస్వే దుహవ్యైః స్రువేణసిఞ్చ జ్జరణాభిధామ॥ ౬॥

దం॥ ఇప్పుడు ఈ యింద్రుఁడు బాధలనుండి మమ్ము దాటించువాఁడై సంతోష వంతులఁ జేయుగాక. అతఁడు యీ యుషోదేవతయొక్క (సమీపమున నున్న) సూర్యునివలె మిగుల వెలుఁగుచున్నాఁడు. స్తుతింప దగిన సోమము ఆహవనీయస్థానముగుఱించి స్రువముతోఁ జల్లబడుచు తన సంబంధమయిన హవిస్సులుగల యే కర్మలతోఁ దృప్తిపొందింపఁ బడెనో?

౧౩౩౧. స్విధ్మాయ ద్వనధితిరపస్యా త్సూరో అధ్వరే పరిరోధనాగోః ।
యద్ధప్రభాసి కృత్వ్యాఁ అనుద్యూన నర్విశే పశ్విషే తురాయ॥ ౭॥

దం॥ సూర్యకిరణాలచే మిక్కిలి తపింపఁ జేయఁబడిన మేఘపంక్తి యెపుడు వర్షము కురియ నారంభించునో అపుడు (సూర్యరూపుఁడయిన) ఇంద్రుఁడు అంతరిక్షమునుండి వర్షోదకముయొక్క ఆవరణములను అంతట నివారించుచున్నాఁడు. సూర్యరూపుఁడగు నింద్రుడా! నీవు కర్మార్హములైన దినములను గుఱించి యెపుడు ప్రకాశించుచున్నావో అపుడు బండితోఁ గట్టెలకుఁ బోవువానికి, పశువుల నిమిత్తమై యరణ్యమునకుఁ బోఁవలచి త్వరపడు గోపాలునకుఁ గోర్కె సిద్ధించును.

౧౩౩౨ అష్టామహోదివ ఆదోహరీ ఇహద్యుమ్నా సాహమభియోధాన ఉత్సమ్ ।
హరింయత్తే మన్దినం దుక్షన్వృధే గోరభసమద్రిభి ర్వాతాప్యమ్॥ ౮॥

దం॥ మనోహరమయిన, మదకరమయిన, వీర్యవంతమైన వాయువేగముగల సోమరసము రాళ్లతో నీవృద్ధికై యెపుడు పిండుచున్నారో అపుడు ఇంద్రుఁడా! యెఱుకవయిన సోమముయొక్క భోజనముఁగూడిన హరియను గుఱ్ఱాలను ఈయజ్ఞమందు (దావఁగా మిగిలిన సోమమును) ద్రావింపుము. ధనమునపహరించునట్టి శత్రువును యుద్ధముజేయు శక్తిగల నీవు అట్లే తిరస్కరింపుము.

౧౩౩౩. త్వమాయసం ప్రతివర్తయో గోర్దివో అశ్మానముపనీతమృభ్వా ।
కుత్సాయయత్ర పురుహూతవన్వ చ్ఛుష్ణమనన్తైః పరియాసివధైః॥ ౯॥

దం॥ అనేకులచేతఁ బిలువఁబడునో యింద్రా! యెప్పుడు కుత్సుని కొఱకు శుష్ణాసురుని అధికములగు నాయుధములచేత హింసించుచు నెల్లచోట్లకుఁ బోవుచున్నావో అపుడు ఇనుముతోఁ జేయఁబడినట్టి, ద్యులోకముకంటెఁ బ్రకాశించునట్టి, (త్వష్టచే) దీసికొని రాఁబడినట్టి, శీఘ్రగమనముగలట్టి వజ్రాయుధమును పాఱిపోవుచున్న(శుష్ణాసురునకు) అభిముఖముగాఁ బ్రయోగించితివి.

౧౩౩౪. పురాయత్సూర స్తమసో అపీతే స్తమద్రివః ఫలిగం హేతిమస్య ।

శుష్ణస్య చిత్ పరిహితం యదోజో దివస్పరిసుగ్రథితం తదాదః॥ ౧౦॥

వ॥ పూర్వమందు సూర్యుఁడు చీఁకటిరూపమయిన శుష్ణాసురునియొక్క యుద ముననుండి యెప్పుడు వెడలివచ్చెనో యప్పుడు వజ్రాయుధధారివగు నింద్రా! ఆ మేఘ రూపముతో నావరించిన సంహారకుఁడగు రాక్షసుని నిరాకరించితివి. అట్లు ఏ రాక్ష బలము సూర్యుని మీఁద నావరించినదై వ్యాపించెనో ఆ బలమును వద లించితివి.

౧౩౩౫. అనుత్వామహీ పాజసీ అచక్రేద్యావాక్షామామదతా మిన్ద్ర కర్మన్ ।

త్వంవృత్ర మాశయానం సిరాసుమహో వజ్రేణ సిష్వపోవరాహుమ్॥ ౧౧॥

వ॥ ఓ యింద్రా! గొప్పవి, బలముకలవి, సర్వత్రవ్యాపించినవి అగు ద్యావాభూ ములు (వృత్రవధాది) కర్మలందు బ్రవర్తించిన నిన్నుగూర్చి సంతసించెను. తర్వాత నీవు అంతట వ్యాపించియున్న శ్రేష్ఠాహారముగల వృత్రాసురుని శ్రేష్ఠమయిన వజ్రా యుధముతో పాఱుచున్న యుదకములందుఁ జంపితివి.

౧౩౩౬. త్వమిన్ద్రనర్యోయాఁ అవోనౄన్తిష్ఠా వాతస్యసుయుజో వహిష్ఠాన్ ।

యంతే కావ్యఉశనామన్దినందాద్వృత్రహణం పార్యం తతక్షవజ్రమ్॥ ౧౨॥

వ॥ ఓ యింద్రుఁడా! మనుష్యులకు హితమొనరించునట్టి నీవు ఏ యశ్వములను రక్షించుచున్నావో ఆ వాయువేగముగల్గి సుఖముగా రథము బూన్పఁదగిన బాగుగ రథములాఁగఁదగిన గుఱ్ఱములను అధిష్ఠింపుము. కవి పుత్రుఁడయిన శుక్రుఁడు మత్తు నగలుగఁ జేయునట్టి యేవజ్రాయుధమును నీ కొఱకు నిచ్చెనో శత్రుసంహారసమర్థ మును వృత్రునిజంపఁదగినది యగుదానిని సానపట్టితివి.

౧౩౩౭. త్వంసూరో హరితో రామయోనౄన్భరచ్చక్రమేతశోనాయమిన్ద్ర ।

ప్రాస్యపారం నవతిం నావ్యానామపికర్తమవర్తయోయజ్యూన్॥ ౧౩॥

దం॥ ఓ యింద్రుఁడా! సూర్యస్వరూపముగఁ బ్రకాశించు నీవు నేతశుని రథాశ్వములను విహరింపఁజేసితివి. రథచక్రమును సూర్యుని యశ్వమువలె బోవునట్లు చేసితివి. ఓడచే దాటఁదగిన తొంబదినదులను నీవు దాటి తీరమందు యాగవిరోధులయిన వారిని బడవేసి చేయవలసిన పనిని జేసితివి.

౧౩౩౫. త్వంనో అస్యా ఇన్ద్ర దుర్హణాయాః పాహి వజ్రివో దురితాదభీకే ।
ప్రనో వాజాన్రథ్యో౩ అశ్వబుధ్యానిషే యన్ధి శ్రవసే సూనృతాయై॥ ౧౪॥

దం॥ వజ్రాయుధమును ధరించిన యింద్రుఁడా! నీవు కష్టముతోఁ బోఁగొట్టఁదగిన యీదారిద్ర్యమునుండి మమ్ము రక్షింపుము. పాపమునుండి ప్రాప్తించిన యుద్ధమందు మమ్ము రక్షింపుము. రథముతోఁగూడిన గుఱ్ఱములు మొదలగువానికిఁ గావలసినంత ధనములను మాకు అన్నము నిమిత్తము, ప్రియసత్యవాక్కు- వాక్కు- నిమిత్తము ఇమ్ము. (నీ విచ్చినధనముతో నన్నము, కీర్తి, సత్యము సంపాదింతుమని తా.)

౧౩౩౬. మాసాతే అస్మత్సుమతిర్విదసద్వాజప్రమహః సమిషో వరన్త ।
ఆనో భజ మఘవన్గోష్వర్యో మంహిష్ఠాస్తే సధమాదః స్యామ॥ ౧౫॥

దం॥ ద్రవ్యముచేతఁ బూజ్యుఁడవగునింద్రా! నీ సంబంధమగు ఆ ప్రసిద్ధమయిన యనుగ్రహబుద్ధి మాయందు తగ్గిపోకుండుఁగాక. అన్నము మాకు సమృద్ధిగా నుండుగాక. ధనముగల యింద్రుఁడా! ధనపతివగు నీవు మమ్ము గోవులయందుఁ జేర్పుము. నీకు నుత్సాహము గలిగించు మేము (స్తుతులతో నని తా) పుత్ర పౌత్రాదులతో నుత్సాహులమై యుందుముగాక.

ఇట్లు ప్రథమమండలమున ప్రథమాష్టకము సమాప్తము.

# ద్వితీయాష్టకము.

## ప్రథమాధ్యాయము.

---

### సూక్తము ౧౨౨.

కక్షీవాన్నృషి, త్రిష్టుప్ఛంద, విశ్వేదేవత.

౩౮౦. ఓమ్ ప్రవః ప్రాన్తం రఘుమన్యవోన్ధోయజ్ఞం రుద్రాయమీహ్ళుషేభరధ్వమ్।
దివో అస్తోష్య సురస్య వీరారిషుధ్యేవ మరుతో రోదస్యోః ౧॥

వ॥ కోపములేని ఋత్విజులారా! మిమ్ము రక్షించుసాధనమగుచున్న యాగము
డిపించు హవిస్సును ఫలప్రదుఁడగు రుద్రుని కొఱకుఁ గలుగఁ జేయుము. అమ్ము
హోదులవలె వీరులగు మరుత్తులతోఁగూడి ముల్లోకములనుండి అసురులఁబాఱఁ
ోలునట్టి ఆ దేవుని ద్యావాభూముల మధ్యనున్న మరుత్తులతోఁ గలిపి స్తుతించు
చున్నాను.

౩౮౧. పత్నీవ పూర్వహూతిం వావృధధ్యా ఉషాసానక్తా పురుధా విదానే।
స్తరీర్నాత్కం వ్యుతంవసానా సూర్యస్య శ్రియా సుదృ శీహిరణ్యైః॥ ౨॥

వ॥ పెనిమిటియొక్క మొదటిపిలుపును వృద్ధిఁబొందించుటకు (శీఘ్రము వచ్చు)
ార్యవలెను అహోరాత్రి దేవతలారా! అనేకవిధములస్తుతులఁ దెలిసికొనువారయి
మాపూర్వాహ్వానము విని) రండు. సూర్యునివలె బంగారుకాంతికల కిరణములచేత
వృద్ధినొంది ఎడతెగని రూపమును ధరించునట్టి సూర్యునికాంతితో ఆతనికిముందుఁబో
ప్రచుఁ జక్కఁగాఁగనంబడునట్టి, ఉషోదేవత మాపూర్వాహ్వానమును మన్నించుఁగావుత.

౩౮౨. మమత్తునః పరిజ్మా వసర్హా మమత్తువాతో అపాం వృషణ్వాన్ ।
శిశీత మిన్ద్రాపర్వతా యువంనస్తన్నో విశ్వే వరివస్యన్తు దేవాః॥ ౩॥

వ॥ (గార్హపత్యాది రూపముతోనున్న) సూర్యుఁడు మమ్ము సంతృప్తులఁ జేయుఁ
గాక. వర్షోదకములంగలిగించు వర్షవాయువు మమ్ముఁ దృప్తులఁ జేయుఁగాక. ఇంద్ర

పర్జన్యులారా! మీరు మామనస్సు నిర్మలముగా నుంచుఁడు. దానివల్ల సమస్త దేవతలు ను మాకు విస్తారమయిన యన్నము నిత్తురు గాక.

౧౩౪౩. ఉత త్యా మే యశసా శ్వేతనాయై వ్యంతా పాంతౌశిజో హువధ్యై ।
ప్రవో నపాతమపాం కృణుధ్వం ప్రమాతరా రాస్పినస్యాయోః ॥ ౪॥

వం॥ ఉశిజుని కొమారుఁడనగు కక్షీవంతుఁడను నేను నాకొఱకుఁ గీర్తిగలట్టి, (చరుపురోడాశాదుల) భక్షించునట్టి, (నేయిసోమము మొ॥) వాటిని పానము చేయు నట్టి, ప్రసిద్ధులయినట్టి, యశ్వినీదేవతలను ఉషఃకాలమందు ఆహ్వానముతోఁ బూజింతును. ఋత్విజులారా! మీరు ఉదకములకు మనుమఁడగు అగ్నిదేవుని మిగుల స్తుతింపుఁడు. (ఉదకమువల్లఁ జెట్లుపుట్టును. వాటిరాపిడి చేతనగ్నిపుట్టును. కనుక మనుమఁడనితా)

౧౩౪౪. ఆ వో రువణ్యుమౌశిజో హువధ్యై ఘోషేవ శంసమర్జునస్య నంశే ।
ప్రవః పూష్ణే దావన ఆఁ అచ్ఛా వోచేయ వసుతాతిమగ్నేః ॥ ౫॥

వం॥ ఓ దేవతలారా! ఉశిజుని కొడుకునగు కక్షీవంతుఁడను నేను మీ స్తవనీయమగు స్తోత్రమును మీయాహ్వానము కొఱకు పాండురోగమునశింపఁ జేసికొనఁగోరిన ఘోష యను బ్రహ్మవాదినివలె అభిముఖుఁడనై పలుకుచున్నాను. ఫలదాతయగు పూష దేవతకొఱకుఁ గూడ స్తుతినిబలుకుచున్నాను. అగ్నియొక్క ధనదానమును గూడ స్తుతించుచున్నాను.

౧౩౪౫. శ్రుతం మే మిత్రావరుణా హవేమోత శ్రుతం సదనే విశ్వతః సీమ్ ।
శ్రోతు నః శ్రోతురాతిః సుశ్రోతుః సుక్షేత్రా సింధురద్భిః ॥ ౬॥

వం॥ ఓ మిత్రావరుణులారా! యీమాకహ్వానములను వినుఁడు. మఱియుయజ్ఞగృహమందు అంతటను జేయఁబడుచున్న యీస్తోత్రమును గూడవినుఁడు. ఎల్లచోట్లను బ్రసిద్ధికెక్కిన ధనముగల మాయీ ఆహ్వానమువినునట్టి, జలాధిమాని దేవతమంచి క్షేత్రములను ఉదకముల చేత (పెంపుచు) మాయీస్తుతులను వినుఁగాక.

౧౩౪౬. స్తుషే సా వాం వరుణమిత్ర రాతిర్గవాం శతా పృక్షయామేషు పజ్రే ।
శ్రుతరథే ప్రియరథే దధానాః సద్యః పుష్టింనిరుంధానాసో అగ్మన్॥ ౭॥

టీ॥ ఓ మిత్రావరుణులారా! మీ ఆ ప్రసిద్ధమయిన అపరిమితమైన గోదానము కక్షీవంతుఁడనగు నాయందు అన్నదానముగల యజ్ఞములనిమిత్తము అగుఁగాక. మఱియు మిత్రాది దేవతలారా! ప్రసిద్ధమగు రథముతోఁగూడి ప్రియమైన రథముగల్గి కక్షీవంతుఁడనగు నాయందుఁ బ్రీతినుంచుచు వెంటనేపుష్టిని మాకు గల్గించుచు రండు.

౧౩౪౭. అస్య స్తుషే మహిమఘస్య రాధః సచా సనేమ నహుషః సువీరాః ।
జనో యః పజ్రేభ్యో వాజినీవానశ్వావతో రథినో మహ్యం సూరిః॥ ౮॥

టీ॥ పూజ్యమగు ధనముగల యీదేవతా సంబంధమయిన ధనమును స్తుతించుచున్నాను. పరస్పర స్నేహసంబంధముగల ముఖ్యులమగు కక్షీవంతులము పుత్రపౌత్రాదులుకలవారమై ఒకరియందొకరుమైత్రి కల్గియనుభవింతుము గాక. ఏదేవసంఘము అంగిరోవంశ్యులమగు మాకు అన్నముగలిగించి, యశ్వములు గల్గించి, రథములు గల్గించినదియయి నన్ను బ్రేరించుచున్నదో (ఆదేవధనమని పూర్వాన్వయము.)

౧౩౪౮. జనో యో మిత్రావరుణావభిధ్రుగపో న వాం సునోత్యక్ష్ణయాధ్రుక్ ।
స్వయం స యక్ష్మం హృదయే నిధత్త ఆప యదీం హోత్రాభిరృతావా॥ ౯॥

టీ॥ ఓ మిత్రావరుణులారా! మీకు ఏజనుఁడు ద్రోహము చేయుచున్నాఁడో, యెవఁడు మఱేవిధమయిన ద్రోహము చేయుచు మీకు సోమరసమును పిండఁడో, ఆయిద్దఱు (మొదటివాఁడు యాగము మానినవాఁడు రెండవవాఁడు సోమము మీకివ్వనివాఁడు)స్వయముగా రోగమును తమ హృదయమందుంచు కొనుచున్నారు. వీరిద్దఱుకాక యింకొకఁడు యజ్ఞముగల్గి స్తుతివాక్కులతో ఈ సోమరసమును దీయుచున్నాఁడు.

౧౩౪౯. స వ్రాధతో నహుషో దంసుజూతః శర్ధస్తరో నరాంగూర్తశ్రవాః ।
విసృష్టరాతిర్యాతి బాళ్హసృత్వా విశ్వాసుపృత్సు సదమిచ్ఛూరః॥ ౧౦॥

౧౩౪౩. హిరణ్యకర్ణం మణిగ్రీవమర్ణస్తన్నో విశ్వే వరివస్యన్తు దేవాః ।
అర్యో గిరః సద్య ఆ జగ్ముషీరోస్రాశ్చాకన్తూభయేష్వస్మే ॥ ౧౪॥

దం॥ బంగారుకుండలాల చెవులు కలట్టి, రత్నహారముల కంఠముగలట్టి, రమణీయ రూపములుగలట్టి పుత్రాదుల సంఘమును మాకు సమస్త దేవతలు ఇత్తురుగాక. ప్రసిద్ధము పూజ్యమునగు నా దేవసంఘము (తాము) వచ్చినవెంటనే స్తుతికర్తలమగు మా నోటినుండి వెడలిన స్తుతులను క్షీరాది హవిస్సులనుగూడ యీమా ఐహికాముష్మికధనముల నిచ్చుట కెంతకావలెనో యంతట గోరుదురుగాక.

౧౩౪౪. చత్వారో మా మశర్శారస్య శిశ్వస్త్రయో రాజ్ఞ ఆయవసస్య జిష్ణోః ।
రథో వాం మిత్రావరుణా దీర్ఘాప్సాః స్యూమగభస్తిః సూరో నాద్యౌత్ ॥ ౧౫॥

దం॥ నన్ను (అనఁగా కక్షీవంతుని) మశర్శారుఁడను రాజుయొక్క అజ్ఞానులగు నలుగురు పుత్రులు బాధించుచున్నారు. జయశీలుఁడయిన ఆయవసుఁడను రాజుయొక్క పుత్రులు ముగ్గురు బాధించుచున్నారు. మిత్రావరుణులారా! మీ రథము గొప్పరూపముగలది, సుఖకరమయిన కాన్తిగలదియయి సూర్యునివలెఁ బ్రకాశించుఁగాక.

---

## సూక్తము. ౧౨౩.

కక్షీవానృషి, త్రిష్టుప్, యుషో దేవత.

౧౩౪౫. పృథూ రథో దక్షిణాయా అయోజ్యైనం దేవాసో అమృతాసో అస్థుః ।
కృష్ణాదుదస్థాదర్యా విహాయాశ్చికిత్సన్తీ మానుషాయ క్షయాయ ॥ ౧॥

దం॥ సమర్థురాలగు ఉషోదేవతయొక్క విశాలమయిన రథము పూన్పఁబడినది. ఈ రథమును మరణరహితులయిన దేవతలు ఎక్కిరి. పూజ్యురాలు గొప్పదియగు ఆ యుషోదేవత మనుష్యసంబంధమగు నివాసముకొఱకు చీఁకటి దొలఁగించునదై వెల్లని చీఁకటిలోనుండి యుదయించెను.

౧౩౪౬. పూర్వా విశ్వస్మాద్భువనాదబోధి జయన్తీవాజం బృహతీసనుత్రీ ।

ఉచ్చావ్యఖ్యద్యువతిః పునర్భూరోషా అగన్ప్రథమా పూర్వహూతౌ॥ ౨॥

తా॥ (నిద్రపోవుచున్న) సమస్త లోకమునకంటె ముందుగా యజమానుల నిమిత్తమన్నమును గలుగఁజేయుచు ఉషోదేవత మేల్కొనెను. గొప్పదయి కాంతినిచ్చునది ప్రకాశించుచున్నది. గొప్పదియు, యౌవనవతియు, పర్యాయముగ (అనఁగా నాశమాయయిన తరువాత నిరోధమాయు) ఉదయించునదియు నగు ఉషోదేవత మొదటి యాహ్వానమునందే మొదటిదై యజ్ఞశాలకు వచ్చుచున్నది.

౧౩౪౭. యదద్యభాగం విభజాసినృభ్య ఉషోదేవి మర్త్యత్రాసుజాతే ।

దేవోనో అత్రసవితాదమూనా అనాగసోవోచతిసూర్యాయ॥ ౩॥

తా॥ శోభనజన్మగల ఉషోదేవీ! మనుష్యులఁ బాలించునట్టి నీవు ఇప్పుడు మనుష్యుల కొఱకు ఏ ప్రకాశభాగమును విభజించి యిచ్చుచున్నావో ఆయా భాగవిషయమునందు ఇష్టార్థముల నిచ్చు మనస్సుగలట్టి సవితృదేవుఁడు మమ్ము దోషరహితులనుగా సూర్యునకుఁ జెప్పుఁగాక. (సవితృఁడు సూర్యుఁడును ఒక్కఁడే యయ్యును పనులభేదమునుబట్టి పదభేదము. పాపపుణ్యము పరిశీలించుపని సవితృనిది. ఫలముల నిచ్చుపని సూర్యునిది.)

౧౩౪౮. గృహంగృహమహనాయాత్యచ్ఛాదివేదివే అధినామాదధానా ।

సిషాసన్తీ ద్యోతనా శశ్వదాగాదగ్రమగ్రమిద్భజతే వసూనామ్॥ ౪॥

తా॥ ఉషోదేవత ప్రతిదినమందును, ప్రతియజ్ఞగృహమునకు వెలుఁగు నిచ్చుచుఁ బోవుచున్నది. వస్తుప్రకాశము గలిగించు నిచ్ఛగలదై సమస్త ప్రపంచమును ప్రకాశింపఁజేయుచుఁ బ్రతిదినము వచ్చుచున్నది. హవిస్సులయొక్క అగ్రశ్రేష్ఠ భాగమును బొందుచున్నది.

౧౩౪౯. భగస్య స్వసావరుణస్య జామిరుషః సూనృతే ప్రథమాజరస్వ ।

పశ్చాసదఘ్యా యో అఘస్య ధాతాజయేమ తం దక్షిణయారథేన॥ ౫॥

వ॥ సర్వాత్మవర్తినిగను ఓ ఉషోదేవీ! నీవు సూర్యునకు చెల్లెలుగనున్నావు. నీవిత రదేవతలకంటె గొప్పదానవయి స్తుతింపఁబడుము. తరువాత నెవఁడు దుఃఖము గల్గించునో (శత్రువని తా.) వాఁడు పాఱిపోవుఁగాక. వానిని సహాయురాలవైన నీతోఁ జేరి రథముతో జయింతుము.

౧౩౬౦. ఉదీరతాం సూనృతా ఉత్పురంధీరుదగ్నయః శుశుచానాసో అస్థుః ।

స్పార్హా వసూని తమసాపగూళ్హా విష్కృణ్వన్త్యుషసో విభాతీః॥ ౬॥

వ॥ ప్రియసత్యవాక్యములు బయలువెడలుఁగాక. కార్యముచేయుదమన్న బుద్ధులు బయలుదేరుఁగాక. అగ్నిహోత్రములు మిగులఁ బ్రజ్వలించునవై పైకి లేచుగాక. అంధకారములో మునిగియుండి అందఱికిని కావలసియున్న హవిస్సు మొదలగు యజ్ఞసాధనములను ఏకారణముచేత ఉషోదేవత ప్రకటించుచున్నదో ఆకారణముచేత (అని పూర్వాన్వయము)

౧౩౬౧. అపాన్యదేత్యభ్యన్యదేతి విషురూపే అహనీ సంచరేతే ।

పరిక్షితోస్తమో అన్యా గుహాకరద్యౌదుషాః శోశుచతా రథేన॥ ౭॥

వ॥ నానారూపములయిన రేయింబగళ్లు తిరుగుచున్నవి. ఆ రెంటియందు ఒకటి (పగలు) అభిముఖముగ వచ్చుచున్నది. పర్యాయముగవచ్చునట్టి వాటిరెంటిలో నొకటి (అనఁగా రాత్రి) కప్పివేయునట్టి చీఁకటిరూపమయిన పాపమును చేయుచున్నది. పగటిలో నొకభాగమగు ఉష ప్రకాశించునట్టి రథముతో నంతట వెలుఁగు గల్గించుచున్నది. (పర్యాయముగ = ఒకదానితర్వాత నొకటిగా)

౧౩౬౨. సదృశీరద్య సదృశీరిదుశ్వో దీర్ఘం సచన్తే వరుణస్య ధామ ।

అనవద్యాస్త్రింశతం యోజనాన్యేకైకా క్రతుం పరియన్తి సద్యః॥ ౮॥

వ॥ ఉషోదేవతలు ఈ పగటియందు నొకదానికొకటి సమానమై, రేపుకూడ అన్యోన్యసమానములే అగుచున్నవి. దోషరహితములగు ఉషస్సులు విశాలమయిన వరుణునియొక్క (ఇచట సూర్యుఁడే వరుణశబ్దార్థము = పాపపుణ్యపరీక్షకుఁడు) చోటిని సేవించుచున్నవి (మేరుస్థానముచుట్టు ప్రతిదినము సేవించునని తా.) ముప్పది యోజనముల దూరము (ఎనిమిదిక్రోసులొక ఆమడ) సూర్యునకు ముందుపుట్టుచున్నవి.

క్షితిలో నాకొంటి (లంకాది భూభాగములందున్నవారి) గమనాగమనముల ననుసరించి యమునందే నిర్వహించుచున్నది. (భూమధ్యరేఖ లంకనుండి కలదని జ్యోతిషము)

౧౨౩-౯. జానత్యహ్నః ప్రథమస్య నామ శుక్రా కృష్ణాదజనిష్ట శ్వితీచీ ।
ఋతస్య యోషా న మినాతి ధామాహరహర్నిష్కృతమాచరన్తీ ॥ ౯॥

దం॥ ఉషోదేవత ముఖ్యమగు పగటియొక్క ఆగమనమును దెలియఁజేయుచున్నది. స్వయముగ ప్రకాశించుచు, తెల్లనై నల్లనిదియై చీకటిలోనుండి పుట్టుచున్నది. యజ్ఞము యొక్క స్థానమును బొందినదై ప్రతి (యాగ) దినమందు హవిస్సులు మొదలగు వస్తువులను ప్రకాశింపఁజేయుచు మేలుచేయుచున్నది.

౧౨౩-౧౦. కన్యేవ తన్వా౩ శాశదానాఁ ఏషి దేవి దేవమియక్షమాణమ్ ।
సంస్మయమానా యువతిః పురస్తాదావిర్వక్షాంసి కృణుషే విభాతీ ॥ ౧౦॥

దం॥ ఓ ఉషోదేవతా! నీవు కన్యకవలె శరీరముతో పోషకురాలవై (అనగా స్పష్టావయవములఁ గన్పడుచు నని తా.) యున్నావు. ఓ యుషోదేవీ! కోర్కెలిచ్చుటకు నిచ్ఛగల సూర్యుఁడనెడు ప్రియుని బొందుచున్నావు. యౌవనవతివై భర్తయెదుట చిఱునవ్వు నవ్వుచుఁ బ్రకాశించుచు సర్వాంగములను బ్రకటించుచున్నావు.

౧౨౩-౧౧. సుసంకాశా మాతృమృష్టేవ యోషావిస్తన్వం కృణుషే దృశే కమ్ ।
భద్రా త్వముషో వితరం వ్యుచ్ఛ న తత్తే అన్యా ఉషసో నశన్త ॥ ౧౧॥

దం॥ ఓ ఉషోదేవతా! తల్లిచే నలంకరింపబడిన స్త్రీవలె మిగుల బ్రకాశించుచున్న నీవు నీ దేహమును సర్వజనదర్శనమునకు సుఖముగునట్లు ప్రకాశింపఁ జేయుచున్నావు! కనుక అందఱిచే స్తుతింపఁబడి అంధకారమును బోఁగొట్టుము. మఱియు ఆ చీకటి నణంచుపని నితర ఉషస్సులు చేయఁజాలవు.

౧౨౩-౧౨. అశ్వావతీర్గోమతీర్విశ్వవారా యతమానా రశ్మిభిః సూర్యస్య ।
పరా చ యన్తి పునరా చ యన్తి భద్రా నామ వహమానా ఉషాసః ॥ ౧౨॥

వ॥ గుఱ్ఱములుగలవై, గోవులుగలవై, సర్వకాలములందుండునట్టి సూర్యునికిరణములతోఁ జీకటిని బోఁద్రోయ యత్నించుచున్నవై, స్తవనీయములయి అందఱికి మేలుచేయుచున్న ఉషస్సులు కడచిపోవుచున్నవి. మరల వచ్చుచున్నవి.

౧౩౬౭. ఋతస్య రశ్మి మనుయచ్ఛ మానా భద్రం భద్రం క్రతు మస్మాసు ధేహి ।
ఉషో నో అద్య సుహవా వ్యుచ్ఛాస్మాసు రాయో మఘవత్సు చస్యుః॥ ౧౩॥

వ॥ ఓ ఉషోదేవతా! సత్యస్వరూపుడగు సూర్యునియొక్క కిరణములను అనుసరించిన నీవు మాయందు ఆయా కళ్యాణప్రదమయిన కర్మములను ధనమును గలిగింతువుగాక.

---

## సూక్తము. ౧౨౪.

కక్షీవంతుడు ఋషి, త్రిష్టుప్ఛందము, ఉషోదేవత.

౧౩౬౮. ఉషా ఉచ్ఛన్తీ సమిధానే అగ్నా ఉద్యన్సూర్య ఉర్వియా జ్యోతిరశ్రేత్ ।
దేవో నో అత్ర సవితా న్వర్థం ప్రాసావీద్ద్విపత్ప్రచతుష్పదిత్యై॥ ౧॥

వ॥ ఓ యుషోదేవతా! అగ్నులు ప్రజ్వలింపఁబడుచుండ నంధకారమును బోఁగొట్టుచు ఉదయసూర్యునివలె అధికకాన్తినిఁ బొందుచున్న దానవు ఈ ప్రాతఃకాలకర్మమందు; సర్వకర్మప్రేరకుఁడగు సూర్యుఁడు మా కొఱకు; శీఘ్రముగా అపేక్షింపఁదగిన (మనుష్యులు మొ॥) ధనములను గలుగఁజేయుఁగాక. గవాదిధనమునకుఁగూడ రాకపోకలు గలిగించుఁగాక.

౧౩౬౯. అమినతీ దైవ్యాని వ్రతాని ప్రమినతీ మనుష్యా యుగాని ।
ఈయుషీణా ముపమా శశ్వతీనా మాయతీనాం ప్రథమోషా వ్యద్యౌత్॥ ౨॥

వ॥ దేవతాసంబంధములగు వ్రతములను అనుకూలింపఁజేయుచు మనుష్యులయొక్క సంయోగవియోగములను గలిగించుచు కడచినట్టి, రాఁబోవునట్టి, ఉషస్సులకు సాటియై (ఈదినమునకు) మొదటిదైన ఉషోదేవత మిగులఁ బ్రకాశించుచున్నది.

ద॥ ఈ యుషోదేవత ఇట్లే విస్తరించినదై; సుఖముగఁ జూచుటకు (దృష్టినిచ్చుటలో) ఇతరజాతివారిని (అనఁగా మనుష్యులని) విడువదు అట్లే తనజాతివారిని (దేవతల నని తా.) విడువదు. (అందఱికిని చూచునట్టి శక్తిగలిగించు నని తా.) నిర్మలమయిన శరీరముతో స్పష్టమైనదై ప్రకాశించుచు కొద్దివస్తువునుండి తొలఁగదు. ఉన్నత వస్తువునుండి తొలఁగదు.

౧౩౭౪. అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానామ్ ।

జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః॥ ౭॥

ద॥ అన్నదమ్ములు లేని స్త్రీ (మగనియింటనుండి ముఖము మరలుచుకొన్నదై) తల్లిదండ్రులను జేరునట్లు ఉష (తండ్రియగు) సూర్యుని చేరుచున్నది. ధనముల లాభము కొఱకు రాజాస్థానమును వితంతువు చేరునట్లు సూర్యస్థానము వేఁచున్నది. భర్త కొఱకుఁబోవ మంచి దుస్తులు ధరించు స్త్రీవలెను నవ్వుచు ఉషోదేవత తన హాసమును ప్రకటించుచున్నది. (అన్న దమ్ములు లేనిదాని నెవరును బెండ్లియాడరు కనుక నామెకు మగనియింటివైపు ముఖ ముండదు.)

౧౩౭౫. స్వసా స్వస్రేజ్యాయస్యై యోనిమారైగ పైత్యస్యాః ప్రతిచక్ష్యేవ ।

వ్యుచ్ఛన్తీ రశ్మిభిః సూర్యస్యాఞ్జ్యఙ్క్తే సమనగా ఇవవ్రాః॥ ౮॥

ద॥ చెల్లెలివంటిదయిన రాత్రి అక్కయయిన ఉషోదేవతకొఱకు జన్మస్థానమగు అపరరాత్రిని ఇచ్చెను. (చిన్నది పెద్దవానియెదుట నుండరాదని;) ఈ యుషకు చెప్పినట్లు దొలఁగిపోవుచున్నది. సూర్యుని కిరణములచేతఁ జీఁకటినిఁ బోగొట్టుచు స్పష్టమయిన ప్రపంచమును మెఱుపుల మొత్తమునలెఁ బ్రకాశింపఁ జేయుచున్నది.

౧౩౭౬. ఆసాంపూర్వాసా మహాసుస్వసౄణా మపరాపూర్వా మభ్యేతిపశ్చాత్ ।

తాఃప్రత్న వన్నవ్యసీర్నూన మస్మే రే వదుచ్ఛన్తు సుదినా ఉషాసః॥ ౯॥

ద॥ అక్కసెల్లెండ్ర భావముకల పురాతనములగు నుషస్సులలో ప్రతిదినము తర్వాతిది కడచిన యుషస్సు ననుసరించి వచ్చుచున్నది. క్రొత్త యుషస్సులుకూడ తప్పక పూర్వపు ఉషస్సులను బోలియే సత్కర్మానుష్ఠానదినములుకలవై మాకు బహుధనము గలుగునట్లు ప్రకాశించుఁగాక.

దం॥ స్తుత్యర్హలగు ఉషస్సులారా! నాయొక్క (రెండుసూక్తములలోని) మంత్రములతో స్తుతింపఁబడితిరి. మమ్ముఁ గోరిన మీరు మమ్ము వృద్ధిపఱచుఁడు. ప్రకాశమానులారా! మీయొక్క రక్షణముతో వేలఁకొలఁది ధనమును, అపరిమిత ధనమును యాచకులకు నిచ్చువారము మేమగుదుముగాక.

---

## సూక్తము, ౧౨౫.

కక్షీవంతుఁడు ఋషి, దానముదేవత, త్రిష్టుప్ఛందము.

౧౩౮౧. ప్రాతారత్నం ప్రాతరిత్వాదధాతి తంచికిత్వాన్ప్రతి గృహ్యానిధత్తే ।
తేనప్రజాం వర్ధయమాన ఆయూరాయస్పోషేణ సచ తేసువీరః॥ ౧॥

దం॥ తనవద్దకుఁ బొద్దున్నె వచ్చిన స్వనయుఁడను రాజు ప్రాతఃకాలమందే రమణీయధనములను ఇచ్చుచున్నాఁడు. ఆ ధనమును మంచిదని తెలిసినవాఁడై తీసికొని (కక్షీవంతుఁడు) తండ్రివద్దనుంచెను. ఆ ధనముతోఁ దనపుత్రపౌత్రాదులను బోషించుకొనుచు జీవితము వృద్ధిచేసికొనుచు మంచికొడుకులు కలిగి ధనములను మాటిమాటికి వృద్ధిపఱచుచు అతఁడు వర్తించును.

౧౩౮౨. సుగురసత్సు హిరణ్యః స్వశ్వోబృహదస్మైవయ ఇన్ద్రోదధాతి ।
యస్త్వాయన్తం వసునాప్రాతరిత్వో ముక్షీజయేవ పదిముత్సినాతి॥ ౨॥

దం॥ ప్రాతఃకాలమందు వచ్చిన యతిథివగు నోపుత్రా! యేరాజు బాటసారివగు నిన్ను త్రాటితో మృగములను, బక్షులను గట్టినట్లు ధనముతో నిరోధించుచున్నాఁడో అట్టి స్వనయుఁడను రాజు మంచి గోవులు కలవాఁడుగను, మంచి ధనసమృద్ధికలవాఁడుగను, మంచి అశ్వసమృద్ధికలవాఁడుగను అగుగాక. ఇంద్రుఁడు ఈ రాజునకు అధికమన్నమును ఇచ్చుచున్నాఁడు.

౧౩౮౩. ఆయమద్య సుకృతం ప్రాతరిచ్ఛన్నిష్టేః పుత్రం వసుమతారథేన ।
అంశోఃసుతంపాయయ మత్సరస్యక్ష యద్వీరంవర్ధయ సూనృతాభిః॥ ౩॥

తా॥ నిన్ను [illegible] [illegible]. [illegible] నిన్ను [illegible]
ధనముతోఁ గూడిన రథముతో యాగము చేయు [illegible] చేయుచున్నట్టిది. ఆ
ధనముతో కాంతిగలిగిన మనస్సు [illegible], [illegible], సోమరసముచ
[illegible]. శత్రువులను [illegible] పుత్రపౌత్రులతోఁ గూడిన ఆ రాజును ప్రియస
త్యవాక్యములతో [illegible].

౧౩౪౪. ఉపక్షరన్తి సిన్ధవో మయోభువ ఈజానం చ యక్ష్యమాణం చ ధేనవః ।

పృణన్తం చ పపురిం చ శ్రవస్యవో ఘృతస్య ధారా ఉప యన్తి విశ్వతః॥ ౪॥

తా॥ పాలనుస్రవించుచున్న సుఖమునుగలిగించునట్టి గోవులు, యాగము చేయు వానిని, యాగముచేయఁ బోవువానిని బొందినసంతసపడుచున్నవి. జనులనుసంతోషపెట్టువానిని, రక్షించువానిని. అన్నసమృద్ధి హేతువులగు నేతిధారలు అంతటఁజేరి సంతసపెట్టు చున్నవి.

౧౩౪౫. నాకస్య పృష్ఠే అధి తిష్ఠతి శ్రితో యః పృణాతి స హ దేవేషు గచ్ఛతి ।

తస్మా ఆపో ఘృతమర్షన్తి సిన్ధవస్తస్మా ఇయం దక్షిణా పిన్వతే సదా॥ ౫॥

తా॥ ఏమనుష్యుఁడు దేవతలను హవిస్సులతోఁ బ్రీతులఁగావించునో వాఁడుస్వర్గము పైభాగమందు ఆశ్రయించి ఉంటున్నాఁడు. దేవతలమధ్య వర్తిల్లుచున్నాఁడు కదా! అట్టివానికొఱకు ప్రవహించునుదకములు సారమును బొందుచున్నవి ఈ భూమికూడ సస్యాదుల నొసంగునదై సర్వకాలము సంతోషపడుచున్నది.

౧౩౪౬. దక్షిణావతామిదిమాని చిత్రా దక్షిణావతాం దివి సూర్యాసః ।

దక్షిణావన్తో అమృతం భజన్తే దక్షిణావన్తః ప్రతిరన్త ఆయుః॥ ౬॥

తా॥ దక్షిణలనిచ్చిన వారికే యీభూమియందలి రమ్యవస్తువులు కలుగుచున్నవి. దక్షిణనిచ్చిన వారికే స్వర్గమందు సూర్యానుగ్రహమువల్ల స్థానములుకలుగుచున్నవి. దక్షిణనిచ్చినవారలే మరణములేని మోక్షమును పొందుచున్నారు. దాతలగువారే ఆయువును పొందుచున్నారు.

దం॥ స్తుత్యర్హలగు ఉషస్సులారా! నాయొక్క (రెండుసూక్తములలోని) మంత్రములతో స్తుతింపఁబడితిరి. మమ్ముఁ గోరిన మీరు మమ్ము వృద్ధిపఱచుఁడు. ప్రకాశమానులారా! మీయొక్క రక్షణముతో వేలఁకొలఁది ధనమును, అపరిమిత ధనమును యాచకులకు నిచ్చువారము మేమగుదుముగాక.

---

## సూక్తము, ౧౨౫.

కక్షీవంతుడు ఋషి, దానము దేవత, త్రిష్టుప్ఛందము.

౧౩౮౧. ప్రాతారత్నం ప్రాతరిత్వాదధాతి తంచికిత్వాన్ప్రతి గృహ్యానిధత్తే ।
తేనప్రజాం వర్ధయమాన ఆయూరాయస్పోషేణ సచ తేసువీరః॥ ౧॥

దం॥ తనవద్దకుఁ బొద్దున్ననే వచ్చిన స్వనయుఁడను రాజు ప్రాతఃకాలమందే రమణీయధనములను ఇచ్చుచున్నాఁడు. ఆ ధనమును మంచిదని తెలిసినవాఁడై తీసికొని (కక్షీవంతుఁడు) తంద్రివద్దనుంచెను. ఆ ధనముతోఁ దనపుత్రపౌత్రాదులను బోషించుకొనుచు జీవితము వృద్ధిచేసికొనుచు మంచికొడుకులు కలిగి ధనములను మాటిమాటికి వృద్ధిపఱచుచు అతఁడు వర్తించును.

౧౩౮౨. సుగురసత్సు హిరణ్యః స్వశ్వోబృహదస్మైవయ ఇన్ద్రోదధాతి ।
యస్త్వాయన్తం వసునాప్రాతరిత్వో ముక్షీజయేవ పదిముత్సినాతి॥ ౨॥

దం॥ ప్రాతఃకాలమందు వచ్చిన యతిథివగు నోపుత్రా! యేరాజు బాటసారివగు నిన్ను త్రాటితో మృగములను, బక్షులను గట్టినట్లు ధనముతో నిరోధించుచున్నాఁడో అట్టి స్వనయుఁడను రాజు మంచి గోవులు కలవాఁడుగను, మంచి ధనసమృద్ధికలవాఁడుగను, మంచి అశ్వసమృద్ధికలవాఁడుగను అగుగాక. ఇంద్రుఁడు ఈ రాజునకు అధికమన్నమును ఇచ్చుచున్నాఁడు.

౧౩౮౩. అయమద్య సుకృతం ప్రాతరిచ్ఛన్నిష్టేః పుత్రం వసుమతారథేన ।
అంశోఃసుతంపాయయ మత్సరస్యక్షయద్వీరంవర్ధయ సూనృతాభిః॥ ౩॥

దం॥ నిన్న ప్రొద్దున్న కీర్తింపఁబడినవాఁడు. [illegible] నిన్ను [illegible] ధనముతోఁ గూడిన రథముతోఁ దానము చేయు [illegible] చేసి యాగమునకు వచ్చితివి. ఆ ధనముతో కాంతి కలిగించునట్టి, మనమును [illegible] పెంపొందించునట్టి, పోషించునుదు తాఁపము. శత్రువులను నిరోధించు పుత్రపౌత్రులతోఁ గూడిన ఆ రాజును ప్రియసత్యవాక్యములతో వృద్ధిపొందించుము.

౧౩౫౪. ఉపక్షరన్తి సిన్ధవో మయోభువ ఈజానం చ యక్ష్యమాణం చ ధేనవః ।

పృణన్తం చ పపురించ శ్రవస్యవో ఘృతస్య ధారా ఉపయన్తి విశ్వతః ॥ ౪॥

దం॥ పాలను స్రవించుచున్న సుఖమును కలిగించునట్టి గోవులు, యాగము చేయు వానిని, యాగము చేయఁబోవువానిని పొంది సంతోషపఱచుచున్నవి. జనులను సంతోష పెట్టువానిని, రక్షించువానిని. అన్నసమృద్ధి హేతువులగు నేతిధారలు అంతటఁ జేరి సంతసపెట్టుచున్నవి.

౧౩౫౫. నాకస్య పృష్ఠే అధి తిష్ఠతి శ్రితో యః పృణాతి స హ దేవేషు గచ్ఛతి ।

తస్మా ఆపో ఘృతమర్షన్తి సిన్ధవస్తస్మా ఇయం దక్షిణా పిన్వతే సదా॥ ౫॥

దం॥ ఏమనుష్యుఁడు దేవతలను హవిస్సులతోఁ బ్రీతులఁగావించునో వాఁడు స్వర్గము పైభాగమందు ఆశ్రయించి ఉంటున్నాఁడు. దేవతల మధ్య వర్తిల్లుచున్నాఁడు కదా! అట్టివానికొఱకు ప్రవహించు నుదకములు సారమును బొందుచున్నవి ఈ భూమికూడ సస్యాదుల నొసంగునదై సర్వకాలము సంతోషపఱచుచున్నది.

౧౩౫౬. దక్షిణావతామిదిమాని చిత్రా దక్షిణావతాం దివి సూర్యాసః ।

దక్షిణావన్తో అమృతం భజన్తే దక్షిణావన్తః ప్రతిరన్త ఆయుః॥ ౬॥

దం॥ దక్షిణలనిచ్చిన వారికే యీభూమియందలి రమ్యవస్తువులు కలుగుచున్నవి. దక్షిణనిచ్చిన వారికే స్వర్గమందు సూర్యానుగ్రహమువల్ల స్థానములు కలుగుచున్నవి. దక్షిణనిచ్చినవారలే మరణములేని మోక్షమును పొందుచున్నారు. దాతలైనవారే ఆయువును పొందుచున్నారు.

౧౩౭౭. మాపృణన్తో దురితమేన ఆరన్మాజారిషుః సూరయః సువ్రతాసః ।
అన్యస్తేషాం పరిధిరస్తు కశ్చిదపృణన్త మభిసంయన్తు శోకాః॥ ౭॥

ద౦॥ దేవతలఁ దృప్తిపఱచువారు దుఃఖకరమగు పాపమును బొందరు. దేవతల స్తుతించువారు ముదిమినొందరు. వ్రతములు (కృచ్ఛ-చాంద్రాయణాది) చేయువారు కూడముదిమినొందరు. వీరిముఫ్ఫురకంటె నితరుఁడెవడైనను బాపమును ధరించువాఁడగును. దేవతలకు యాగముచేయనట్టివానిని కష్టములు పొందుఁగాక.

---

## సూక్తము. ౧౨౬.

మొదటికి కక్షీవంతర్షి. ఉ బావయవ్యుడు ఽరోమశయను నామె. మొదటిని త్రిష్టుభములు తక్కినవి అనుష్టుభములు.

౧౩౭౮. అమన్దాన్త్స్తోమాన్ప్రభరే మనీషా సిన్ధావధిక్షియతో భావ్యస్య ।
యో మే సహస్రమమిమీత సవానతూర్తో రాజాశ్రవ ఇచ్ఛమానః॥ ౧॥

ద౦॥ ఇతరులచే హింసింపఁబడనట్టి యేరాజు నాకు వేయి సోమయాగములను కీర్తిని కోరి కలుఁగజేసెనో అట్టి సింధుదేశమున నివసించునట్టి స్వనయునకు అధిక స్తుతులను ప్రియమనస్సుతో సంపాదించుచున్నాను.

౧౩౭౯. శతంరాజ్ఞో నాధమానస్యనిష్కాఞ్ఛత మశ్వాన్ప్రయతాన్త్సద్య ఆదమ్ ।
శతంకక్షీవాఁ అసురస్య గోనాం దివి శ్రవో జరమాతతాన॥ ౨॥

ద౦॥ యాచింపఁబడుచున్న, ధనదాతయయిన స్వనయుఁడను రాజుయొక్క ఆభరణవిశేషములను అనంతములను వెంటనే కక్షీవంతుఁడనైన నేను బొందితిని. శుద్ధములై లక్షణవంతములైన యశ్వములను, అనేకములను బొందితిని. యజ్ఞములనేకములు స్వీకరించితిని. ఇట్లు ఆ రాజు ద్యులోకమందు శాశ్వతమయిన కీర్తిని విస్తరింపఁ జేసెను.

దం॥ ఎవతె సంభోగార్హురాలును, మిక్కిలి ప్రీతితోఁ బరిగ్రహింపఁ బడినదియును, బిడ్డను గన్నముంగిసవలె ఎప్పటికిని విడువనిదగునో మిక్కిలి వీర్యపుష్టిగల ఆ యీ రోమశ, అనేక సంభోగముల నాకు నిచ్చుచున్నది.

౧౩౭౮. ఉపోపమే పరామృశమామే దభ్రాణి మన్యథాః ।

సర్వాహమస్మిరో మశాగన్ధారీణా మివావికా॥ ౭॥

దం॥ (మీఁదిబుక్కు భావయవ్యుఁడు భార్యతోఁ బరిహాసముగా సంభోగము నిమిత్తము చెప్పినమాట. ఈ బుక్కు దాని కామె చెప్పిన జబాబు.) ఓ నాథా! నన్నుసమీపించి చక్కగా స్పర్శచేయుము. నాయవయవములు అల్పములని తలవకుము, ఏమంటే నేను గాంధారదేశమునందుండు గొఱ్ఱెవలె రోమములు కలిగి యున్నాను సంపూర్ణురాలను అగుచున్నాను.

---

## అనువాకము. ౧౯

## సూక్తము. ౧౨౭.

పరుచ్ఛేదఋషి - అగ్నిదేవత - అత్యష్టిఛందము.

౧౩౭౯. అగ్నింహోతారంమన్యే దాస్వన్తం వసుంసూనుం సహసో జాతవేదసం

విప్రం నజాతవేదసమ్ । యఊర్ధ్వయా స్వధ్వరో దేవో దేవాచ్యాకృపా ।

ఘృతస్యవిభ్రాష్టిమనువష్టి శోచిషా జుహ్వానస్య సర్పిషః॥ ౧॥

దం॥ యజ్ఞమును జక్కగా నిర్వహించు నేయగ్ని దేవుఁడు అధికమైనదేవతలను పూజించునట్టి సామర్థ్యముకలవాఁడై యెక్కువగా హోమము చేయఁబడుచు వ్యాపించుచున్న నేతియొక్క ప్రకాశించు నాహుతిని అనుసరించి తానుగూడ జ్వాలతోఁగోరుచున్నాఁడో అట్టి మిగులదాతయగునట్టి, సర్వజనుల నివాసహేతువయినట్టి, బలమునకుఁబుత్రుఁడయినట్టి, మిగులఁబ్రజ్ఞావంతుఁడయినట్టి, మేధావంతుఁడగు బ్రాహ్మణుని బోలి దేవతలంబిలుచుకోనివచ్చు నగ్నినిస్తుతించుచున్నాను.

సమూహమును బ్రోశించినట్లు ప్రవేశించుచున్నాఁడో, జ్వాలలచేత నశింపఁజేయుచున్నాఁడో, మెట్లు స్థిరముయినటువంటి ధాన్యము మొదలగు వస్తువులంగూడఁ బచనము చేయుచున్నాఁడో అట్టి తన తేజస్సుతో స్థిరములగు పాపములంగూడ నిశ్శేషముగా నశింపఁ జేయుచున్నాఁడు.

౧౩౯౯. తమస్య పృక్షముపరాసు ధీమహి నక్తంయః సుదర్శతరో దివాతరాత్ దప్రాయుషే. దివాతరాత్ । ఆదస్యాయుర్గ్రభణ వద్వీళుశర్మనసూనవే । భక్తమభక్తమవో వ్యన్తో అజరాఅగ్నయో వ్యన్తో అజరాః॥ ౫॥

తా॥ ఏ యగ్ని రాత్రియందు, పగటికంటెను మిగులఁ జూడదగియున్నాడో, పగలివల్ల ఆయుష్మంతుఁడగు నగ్నికొఱకు హవిస్సును యజ్ఞవేదిక సమీపమందుంచు హోమములయందుంతుము. అందువల్ల నీయగ్నికై హవిస్సులు పుత్రునకు దృఢమయిన శత్రుగృహము తీసికొనఁదగియున్నట్లు తీసికొనఁదగును. ఈ ఆహవనీయాది మూఁడగ్నులును సేవించువారలందఱు గ్రాహ్యులని యెఱుఁగుచు రక్షించుచున్నవి. హవిస్సులతోఁ దృప్తినంది ముదిమిలేనివై యిజమానులంగూడి ముదిమి చెందనీయవు.

౧౪౦౦. సహి శర్ధోనమారుతం తువిష్వణిరప్నస్వతీ షూర్వరాస్విష్టనిరార్తనాస్విష్టనిః । ఆదద్ధవ్యాన్యాదదిర్యజ్ఞస్య కేతురర్హణా । అధస్మాస్య హర్షతో హృషీవతో విశ్వేజుషన్తపన్థాం నరః శుభేన పన్థామ్॥ ౬॥

తా॥ సంస్కారకర్మలుగల (త్రవ్వుట, నీరుచల్లుట మొ॥) వేదికలయందు మరుత్తుల బలమువలె అధికధ్వనితోఁ బ్రజ్వలించువాఁడు, పూజనీయుఁడు, సైన్యములందు జయమునిమిత్తము పూజింపఁదగినవాఁడు, అగు నాయగ్నియే, హవిస్సులఁ బుచ్చుకొనుటయే స్వభావముగాఁ గలవాఁడు యజ్ఞమునకుఁ బ్రకాశకుఁడు, పూజనీయుడు అగుచున్నాఁడు. యజమానుల సంతోషపఱచువాఁడు (ఆహుతులతో) సంతసించువాఁడునగు నగ్నియొక్క మార్గమును మనుష్యులందఱు సుఖప్రాప్తి కొఱకు మంచిదారిని అనుసరించు విధమున ననుసరించుచున్నారు.

దం॥ ఓ యగ్నీ ! నీవుబలముచేత శత్రువుల దిరస్కరించువాఁడవు. మిక్కిలి తేజస్సుగలవాఁడవు. హవిర్భోక్తలగు దేవతలచేత విస్తారమయిన యజ్ఞము కొఱకు ధనమువలెను అరణులవల్లఁ బుట్టుచున్నావు. నీయొక్క సంతోషము ఎక్కువదికదా! మఱియు నీయొక్క కర్మ కీర్తిప్రదమైనది. అందువలన ముదిమిలేనట్టి యోయగ్నీ! బంట్రోతులవలె యజమానులు నిన్ను సేవింతురు.

౧౪౦౪. ప్రవోమహే సహసా సహస్వత ఉషర్బుధే పశుషే నాగ్నయేస్తో
మోబభూత్వగ్నయే। ప్రతియదీం హవిష్మా న్విశ్వాసుక్షాసు జోగువే।
అగ్రే రేభోనజ రత ఋషూణాం జూర్ణిర్హోత ఋషూణామ్॥ ౧॥

దం॥ ఓ ఋత్విజులారా! పూజ్యుఁడును బలముతో నితరుల దిరస్కరింప సమర్థుఁడు ప్రాతఃకాలమునఁ బ్రజ్వలించువాఁడును పశువుల నిచ్చువాఁడు నగు అగ్ని కొఱకు మీస్తోత్రము సమర్థమగుగాక. అందువల్ల నీ యగ్నిని గుఱించి యజమానుఁడు సమస్తములగు వేదికలందుఁ బోవుచున్నాఁడు. యజ్ఞమునకు వచ్చు దేవతలలో శ్రేష్ఠుఁడగు నగ్నిని స్తుతికుశలుఁడగు హోతయను ఋత్విజుఁడు ఇతరదేవతలకంటె ముందు ధనికుల స్తుతించు స్తుతిపాఠకునివలె స్తుతించుచున్నాఁడు.

౧౪౦౫. సనోనేదిష్ఠం దదృశాన ఆభరాగ్నే దేవేభిః సచనాః సుచేతునా
మహోరాయః సుచేతునా। మహిశవిష్ఠ నస్కృధి సంచక్షే భుజే అస్యై
మహిస్తోతృభ్యో మఘవన్సువీర్య మథీరుగ్రో నశవసా॥ ౧॥

దం॥ ఓ యగ్నీ! ఆ నీవు మాకు సమీపమునఁ గనఁబడుచు నితరదేవతలతో సమానుఁడవయి యున్నావు. మంచిమనసుగల వాఁడవయి మంచిమనసుతో పూజనీయములగు ధనములను దెచ్చి యిమ్ము. బలవంతుఁడవయిన ఓ యగ్నీ! మాకొఱకు శ్రేష్ఠమయిన అన్నమును దర్శనీయమగు ఈ భూమిపైనున్న యజమానుల భోగము నిమిత్తము; స్తుతికర్తల కొఱకును; ధనవంతుఁడా! మంచిపుత్రపౌత్రులుకల ధనమును గలిగించుము. బలముతోఁగూడినవాఁడవై మావిరోధులను క్రూరుఁడగుపురుషుఁడు బలముతో నితరుల నశింపఁజేయునట్లు. నశింపఁజేయుము.

## సూక్తము. ౧౨౮

ఋషిఛందస్సులు, పూర్వోక్తములు. అగ్ని దేవత.

౧౮౦౩. అయంజాయత మనుషో ధరీమణిహోతా యజిష్ఠ ఉశిజా మనువ్రత
మగ్నిః స్వమనువ్రతమ్ । విశ్వశ్రుష్టిః సఖీయతే రయిరివశ్రవస్యతే ।
అదబ్ధోహోతా నిషదదిళస్పదే పరివీత ఇళస్పదే॥ ౧॥

వ॥ ఇతరదేవతలం బిలుచునట్టి యీ యగ్ని అరణులమధ్యను యధ్వర్యునివలనఁ బుట్టుచున్నాఁడు. ధనము నపేక్షించు యజమానులయొక్క కర్మను అనుసరించియు స్వకీయకర్మను (అనఁగా హవిస్సుల నందుకొనుట) అనుసరించియు బ్రపంచవిషయ కర్మల కాధారమయిన యగ్ని మైత్రింగోరుచున్న యజమానుని యన్నము కొఱకు ధనమువంటి వాఁడగుచున్నాఁడు. మఱియు నీయగ్ని భూమిపై వేదికయందు ఎవని చేతను బాధింపఁబడనివాఁడై హోమనిష్పాదకుఁడై ఋత్విక్కులచేఁ జుట్టఁబడి యున్నాఁడు.

౧౮౦౪. తంయజ్ఞసాధ మపివాతయామస్యృత స్యపథానమ సాహవిష్మ
తా దేవతా తాహవిష్మతా । సనఊర్జాముపా భృత్యయాకృపాన జూర్యతి ।
యంమాతరిశ్వామనవే పరావతో దేవంభాః పరావతః॥ ౨॥

వ॥ యజ్ఞసాధకుఁడును వేదియందుంచఁబడినవాఁడునగు నగ్నిని యాగపురోడాశా దులుగల యజ్ఞభాగమందు తృప్తిగల్గుటకు సేవించుచున్నాము. వాయువు పూర్వ కాలమందు మనువుకొఱకు దూరముననున్న సూర్యునుండి ఏ యగ్నిని భూమియం దుంచెనో ఆ యగ్నిని (ఆవాయువే దూరమునుండి మాయాగశాలయందుంచునుగాక. ఆ యగ్ని మాసంబంధమగు చరుపురోడాశాదికమును గ్రహించువిషయమై యీసా మర్థ్యకల్పనతో నశింపకుండును. (తగినట్లు సమిధలు హవిస్సులు వేయుటవల్లఁ జెడదని తా.)

౧౪౦౮. ఏవేనసద్యః పర్యేతి పార్థివం ముహుర్గీ రేతో వృషభః కనిక్రదద్దధ ద్రేతః
కనిక్రదత్ । శతంచక్షాణో అక్షభి ర్దేవో వనేషు తుర్వణిః ।
సదో దధాన ఉపరేషు సానుష్వగ్నిః పరేషు సానుషు॥ ౩॥

దం॥ మాయాహ్వానము తరువాతనే వేదికాస్థానమందు అభిముఖముగా మాటిమాటికి స్తుతింపఁబడునట్టివాఁడు హవిస్సులు కలవాఁడును (కోర్కెల) వర్షించువాఁడు ధ్వనించువాఁడు, సామర్థ్యమును ధరించువాఁడు, ప్రకాశించువాఁడు, స్తుతులవిషయమై జ్వాలలతో నూఱుకన్నుల ప్రకాశించువాఁడు, శత్రువులం జంపువాఁడు ఉన్నతప్రదేశములయందును, యజమానగృహములందును నివాసముచు జేయువాఁడు నగు నీయగ్ని గమనముతో గొప్ప హవిస్సుల నిమిత్తము పోవుచున్నాఁడు. (పునరుక్తియాదరార్థము.)

౧౪౦౯. ససుక్రతుః పురోహితో దమేదమేగ్ని ర్యజ్ఞ స్యాధ్వరస్య చేతతి
క్రత్వా యజ్ఞస్య చేతతి । క్రత్వా వేధా ఇషూయతే విశ్వా జాతాని పస్పశే ।
యతో ఘృతశ్రీ రతిథి రజాయత వహ్ని ర్వేధా అజాయత॥ ౪॥

దం॥ ఆ యగ్ని గొప్ప కర్మగలవాఁడు, పురోహితునివలె యాగనిర్వాహకుఁడునై ప్రతిగృహమునందును నాశములేని, లేక హింసారహితమైన యజ్ఞముకొఱకు విరాజిల్లుచున్నాఁడు. ఈ యజమానుఁడుకూడ సత్కర్మతో యాగమును దెలియుచున్నాఁడు. ఈ యగ్ని గొప్పపనులతో అనేక ఫలములిచ్చువాఁడునై అన్నముగోరిన యజమానుని కొఱకు సమస్తములగు హవిస్సులను స్వీకరించుచున్నాఁడు. ఏకారణమువల్ల ఈయగ్ని నేతిని సేవించునట్టి అతిథివలె పూజ్యుఁడయిన వాఁడయ్యెనో ఆకారణమువల్ల యజమానుఁడును హవిస్సులను సంపాదించుకొని సమర్థుఁడయ్యెను.

౧౪౧౦. క్రత్వా యదస్యత విషీషు పృఞ్చతే౽గ్నే రవేణ మరుతాం న భోజ్యేషి
రాయ న భోజ్యా । సహిష్మాదాన మిన్వతి వసూనాంచ మజ్మనా ।
సనస్త్రాసతే దురితా దభిహ్రుతః శంసాదఘా దభిహ్రుతః॥ ౫॥

వ॥ ఏ హేతువు చేత యజమానులు యగ్నిజ్వాలల యందు చరుపురోడాశాది హవి
స్సులను తృప్తినిమిత్తమై వాయువు ప్రాణమును పొందునట్లుగా వాటిని జేర్చుచుండు చేర్చు
చున్నారో ఆకారణమువల్ల అన్నముకొరకు వానికి భోగవస్తువులనిచ్చునట్లు ఆయజ
మానుఁడు ధనము బలముతో హవిస్సులనిచ్చుచున్నాఁడు. అయగ్ని హోమముచేయ
బడిపాపములనుండి మమ్ము రక్షించుచున్నాఁడు. దుఃఖకరమగు పాపముచేతగు బా
ధను దొలఁగించుచున్నాఁడు.

౧౪౧౧. విశ్వోవిహాయా అరతిర్వసుర్దధే హస్తే దక్షిణే తరణిర్న ।
శిశ్రథచ్ఛ్రవస్యయా న శిశ్రథత్ । విశ్వస్మా ఇదిషుధ్యతే దేవత్రా
హవ్యమోహిషే విశ్వస్మా ఇత్సుకృతే వారమృణ్వత్యగ్నిర్ద్వారా వ్యృణ్వతి ॥౬॥

వ॥ సర్వహూపురుఁడుఁ గొప్పవాఁడు, తృప్తి లేనివాఁడు, నగు నీయగ్ని కుడిచేతిలోధ
నమును పట్టుకొనియున్నాఁడు. సూర్యునింబోలి యిచ్చుచున్నాడు. అన్నముకోరి యజ
మానుని విడువఁడు. ఓ యగ్నీ! దేవతలలో నీవుసమస్త హవిర్భాగములం గోరిన
వారికి హవిస్సును మోసికొనిపోవుచున్నావు. సర్వయజమానులకును అగ్ని కావలసిన
యన్నములను గలుగఁ జేయుచున్నాఁడు. అగ్ని పుణ్యలోకద్వారములను దెరుచు
చున్నాఁడు.

౧౪౧౨. సమానుషే వృజనే శంతమోహితో౽గ్నిర్యజ్ఞేషు జేన్యోనవిశ్పతిః
ప్రియో యజ్ఞేషు విశ్పతిః । సహవ్యా మానుషాణామిళాకృతా
నిపత్యతే । సనస్త్రాసతే వరుణస్య ధూర్తేర్మహో దేవస్య ధూర్తేః ॥౭॥

వ॥ ఆ యగ్ని యజమాన సంబంధమయిన పాపము నిమిత్తము యాగములందే
బాధలందొలగించి సుఖము చేయువాఁడు. ఈయగ్ని ఋత్విజులకుఁ బాలకుఁడు. జయ
శీలుఁడగు రాజువలె ఇష్టుఁడు. చేతిమీఁదనుంచి యజమానులిచ్చు హవిస్సులను గ్రహిం
చినచ్చుచున్నాఁడు. ఆ యగ్ని హింసకుఁడు గొప్పవాఁడునగు వరుణదేవతయొక్క
బాధనుండి మమ్ము రక్షించుచున్నాఁడు.

౧౪౧౩. అగ్నింహోతార మీళతే వసుధితిం ప్రియంచేతిష్ఠ మరతింన్యే రిరేహ
వ్యవాహంన్యే రిరే। విశ్వాయుం విశ్వవేద సంహోతారం యజతం కవిమ్।
దేవాసో రణ్వ మవసే వసూయవో గీర్భిరణ్వం వసూయవః॥ ౭॥

దం॥ ధనమునిచ్చువాఁడు కనుకనే సర్వజనులకుఁ బ్రియుఁడును జ్ఞానమిచ్చువాఁడు అధిపతియు హోమము జరిపించువాఁడు నగు నీ యగ్నిని స్తుతించుచున్నారు. సేవించుచున్నారు హవిస్సులను దేవతలకు మోసికొని పోవువాఁడు ప్రాణులజీవన హేతువు సర్వము నెఱింగినవాఁడు, ధ్వనించువాఁడు, మనోహరుఁడునగునగ్నిని ఋత్విక్కులు రక్షణనిమిత్తము ధనముకోరినవారై హవిస్సులనివ్వ దలచినవారై స్తోత్రములతో సేవించిరి.

---

## సూక్తము. ౧౩౯.

(పరుచ్ఛేఽఋషి - అత్యష్టిఛందము - ఇంద్రదేవత - ౮ - ౯ అతిశక్వరిఛంద ౧౧అష్టిభ - ౬వ దానికి చంద్రదేవత.)

౧౪౧౪. యంత్వంరథ మిన్ద్ర మేధ సాతయే పాకాస న్తమిషి రప్రణయసి
ప్రానవద్యనయసి। సద్య శ్చిత్త మభిష్టయే కరో వశశ్చవాజినమ్।
సాస్మాక మనవద్య తూతుజాన వేధసా మిమాం వాచం నవేధసామ్॥ ౧॥

దం॥ యజ్ఞములకుఁ బోవువాఁడా! యింద్రా! నీవు యాగము లభించుటకై అధిక ప్రజ్ఞకలవాఁడగుటచే పండితుఁడగు నే యజమానునిగూర్చి రథమును దోలుచున్నావో దోషములు లేనివాఁడా! యే యజమానుని గొప్పవానింజేయుచున్నావో, ఆతనిని వెంటనే ఫలప్రాప్తికొఱకు సమర్థునిగాఁ జేయుచున్నావు. హవిస్సులుకలవానిం జేయుచున్నావు. కోరుచున్నావు. పాపములేని యింద్రా! కర్మఫలములిచ్చువారిలో త్వరగలనీవు బుద్ధిశాలురమగు మాయొక్క హవిస్సును ఈ స్తుతివాక్కును వలెనే గ్రహింపుము.

దం॥ ఋత్విజులారా! మాయాగము నిమిత్తము స్నేహితుఁడైవచ్చువాఁడు శత్రు వుల నోర్చువాఁడు సహాయుఁడై యున్నవాడు. హవిస్సులనెడు అన్నముల నిమిత్తము యాగవిరోధుల నణఁచువాఁడు, మరుత్తులతోఁ గూడినవాఁడు నగు నింద్రుని ఫలము లఁగోరుచున్నాను. ఓ యింద్రా! మాయొక్క రక్షణకొఱకు సమృద్ధకర్మమును రక్షింపుము. ఏ శత్రువును నీవునివారించుచున్నావో వాఁడు మమ్ము సకలయుద్ధము లందును బాధింపలేదు.

౧౪౧౮. నిషూన మాతిమతిం కయస్య చిత్తే జిష్ఠాభిరరణిభిర్నోతి భిరుగ్రాభి
రుగ్రోతిభిః । నేషిణో యథా పురానేనాః శూరమన్యసే ।
విశ్వాని పూరోర పపర్షివహ్ని రాసావహ్ని ర్నోఅచ్ఛ॥ ౫॥

దం॥ ఇంద్రా! ఉగ్రుఁడా! భక్తుఁడయిన యజమానుని శత్రువును నీ శత్రువులగు వృత్రాదులనువలె రక్షణసాధనములతో యాగధనములతో లోఁగఁదీయుము. పూర్వకాలమందేలాగున మాహారికి యాగఫలములఁ జేర్చితివో అధికరక్షణలచే మాకు నట్లు యాగఫలమిమ్ము. ఓ శూరుఁడా నీవు పాపములేనివాఁడవు అని అందఱికిఁ దెలియును. ఇంద్రా! జగన్నిర్వాహకుడవై యజమానునియొక్క సకలపాపములను తొలఁగించుచున్నావు. కనుక మాయాగశాలలో ఇష్టములిచ్చువాఁడవై ప్రీతితోవచ్చి దుఃఖము తొలఁగించి యిష్టములు పూరించుము.

౧౪౧౯. ప్రతద్వోచేయం భవ్యా యేన్దవే హవ్యోనయ ఇష వాన్మన్మ రేజతి రక్షో
హామన్మ రేజతి । స్వయంసో అస్మదానిదో వధైరజేత దుర్మతిమ్ ।
అవస్రవేదఘశంసో వతర మవక్షుద్ర మివస్రవేత్॥ ౬॥

దం॥ ఏ సోముఁడు స్తోత్రమును గోరి మాయాహ్వానముతో యాగవిరోధుల హింసించుచున్న యింద్రునివలె వచ్చుచున్నాఁడో దినదినాభివృద్ధినొందు అట్టి సోమునికొఱకు (=చంద్రుఁడు) ఆ స్తుతిఁబఠించుచున్నాను. మమ్ము నిందించునట్టి శత్రువుయొక్క వధోపాయములచే గల్గిన దుర్బుద్ధిని మానుండి ఆ చంద్రుడు తొలఁగించుఁగాక. హింసనుదలంచిన దొంగ అతినీచముగాఁ దల క్రిందుగా లాగఁబడుఁగాక. నీరువలె కారిపోవుగాక. (అనఁగా స్వరూపనాశమొందునని తా.)

దం॥ ఓ యింద్రా! నీవు రాక్షసులు లేని, పాపములు లేని మా మార్గముతో ముందు రమ్ము. తలఁచినచోటగల్గునట్టి ధనముతోఁగూడినవాడవై రమ్ము. ఓ యింద్రా! దూరముననున్న యాగశాలలో హవిస్సులనందుకొమ్ము. దూరమగు స్వర్గమునుండి వచ్చి రక్షింపుము. సమీపముననున్న భూలోకమునుండి యాగనిర్వాహకాగమనములచేతఁ బాలింపుము.

౧౮౩౨. త్వంన ఇన్ద్ర రాయాతరూషసోగ్రం చిత్త్వామహి మాసక్షద వసేమహే

మిత్రంనాపసే । ఓ జిష్ఠ త్రాతర వితారథం కంచిదమర్త్య ।

అన్యమస్మద్రిరిషేః కంచిదద్రి వోరిరిక్షన్తం చిదద్రివః॥ ౧౦॥

దం॥ ఓ యింద్రా! నీవు మమ్ము ఆపదలనుండి తొలగించునట్టి ధనముతో ఉద్ధరించుము. ఓ యింద్రా! ఎక్కువబలముకల నిన్ను మాస్తుతివల్లఁ గలిగిన మాహాత్మ్యము అధిక రక్షణకొఱకును నీ ప్రీతికొఱకును సూర్యునివలెను ఉత్సాహపఱచుచున్నవి. అధికబలవంతుఁడా! రక్షకుఁడా! మరణము లేనివాఁడా! తృప్తిపొందించువాడా! యింద్రా! నీవు ఏదో యొకరథమును ఎక్కి మాయాగగృహమునకు రమ్ము. శత్రుహింసకుఁడా! మాకంటె నితరుఁడగు నెట్టి శత్రువునైనను బాధింపుము. ఆదరించువాఁడా! కుత్సితుఁడగువానిని బాధింపుము.

౧౮౩౩. పాహిన ఇన్ద్ర సుష్టుతస్రి ధోవ యాతా సదమిద్దు ర్మతీనాం దేవః

సన్దుర్మతీనామ్ । హన్తాపాపస్య రక్షసస్త్రాతా విప్రస్య మావతః ।

అధాహిత్వా జనితా జీ జనద్వసో రక్షోహణంత్వా జీ జనద్వసో॥ ౧౧॥

దం॥ బాగుగా స్తుతింపఁబడునట్టి యింద్రా! నీవు దుర్బుద్ధిగలవారి నెల్లపుడు నధోలోకమునకేకారణముచేత బంపుచున్నావో ఆ కారణముచేత దుఃఖమును దెచ్చిపెట్టు పాపమునుండి మమ్ము రక్షింపుము. ఇంద్రా! స్తుతులతో సంతుష్టిపొంది యాగవిఘ్నకారులను అధోలోకమునకుఁ బంపుదువు. పాపమును నివారింతువు. మావంటి యజమానులను రక్షింతువు. కావున అందఱినివాసములకు ఆధారభూతుడవయిన యింద్రా! నిన్ను సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు పుట్టించెను. ఓ రక్షకుఁడా! యింద్రా! నిన్ను రాక్షసుల సంహరించువానింగాఁ బుట్టించెఁగదా!

## సూక్తము, ౧౩౦.

పరుచ్ఛేపర్షి, ఇంద్రదేవత, చివరిది త్రిష్టుప్పు, తక్కినవి అత్యష్టులు.

౧౮ ౨౫. ఏన్ద్ర యాహ్యుప నః పరావతో నాయమచ్ఛా విదథానీవ సత్పతి
రస్తంరాజేవ సత్పతిః । హవామహే త్వా వయం ప్రయస్వన్తః సుతే సచా ।
పుత్రాసో న పితరం వాజసాతయే మంహిష్ఠం వాజసాతయే॥ ౧

దం॥ ఇంద్రా! సత్పురుషులు పాలించు నీయగ్ని యాగగృహమునకు వచ్చునట్లు నక్షత్రములకు రాజును రంజకుఁడునైన చంద్రుఁడు స్వస్థానమునకు వచ్చునట్లు దూరమందున స్వర్గమునుండి సమీపమునకు రమ్ము. హవిస్సులుగల ఋత్విక్కులతోఁ గూడినట్టి మేము నిన్ను సోమరసము నిమిత్తము పుత్రులు తండ్రిని అన్నము కొఱకుఁ బిలుచునట్లుఁ బిలుచుచున్నాము. మఱియు మహాత్ముఁడవగు నిన్ను హవిస్సులందు కొనుటకుం బిలుచుచున్నాము

౧౮ ౨౬. పిబా సోమమిన్ద్ర సువాన మద్రిభిః కోశేన సిక్త మవతం నవంసగస్తా
తృషాణో నవంసగః । మదాయ హర్యతాయ తే తువిష్టమాయ ధాయసే ।
ఆ త్వా యచ్ఛన్తు హరితో న సూర్య మహా విశ్వేవ సూర్యమ్॥

దం॥ ఇంద్రా! స్తుతింపఁదగిన గమనముగల నీవు రాళ్లతోఁ దంచి పిండఁబడినట్టి, దశాపవిత్రముతో శోధించినట్టి, జలముతోఁ గూర్పబడిన తొట్టివలె కొనియాడఁదగినట్టి సోమరసమును, నడచి మిక్కిలి దప్పికొన్న వృషభమువలె నీకు మదము కాంతి కొఱకును మాహాత్మ్యముకొఱకును, ధైర్యముకొఱకును త్రావుము. పచ్చనిసూర్యాశ్వములు నిన్ను సూర్యుని దెచ్చునట్లు సర్వకాలమందును యాగశాలకుఁ దోడి తెచ్చుఁగాక

౧౮ ౨౭. అవిందద్దివో నిహితం గుహానిధిం వేర్నగర్భం పరివీతమశ్మన్యనన్తే
అన్తరశ్మని । వ్రజంవజ్రీ గవామివసిషాసన్నఙ్గిరస్తమః ।
అపావృణో దిష ఇన్ద్రః పరీవృతా ద్వార ఇషః పరీవృతాః॥ ౩

దం॥ ఈయింద్రుఁడు ద్యులోకమునుండి తేఁబడి రహస్య స్థలమున నుంచఁబడినట్టి నాశరహితమైనట్టి, పక్షియొక్క శిశువువలెను గొప్పరాతియందు అపరిమితమైన పర్వతావుల **దు తీ**గలతోను పొదలతోను జుట్టికొనఁబడిన సోమమును వజ్రాయుధధారియై గోవులద్వారమును అంగిరశ్శ్రేష్ఠుఁడువలె పొందనిశ్చయించి చేరెను. మేఘములచేనావరింపఁబడిన ఉదకములయొక్క ద్వారములను తెరచెను. సస్యములనంతటను వ్యాపించునట్లు జేసెను.

౧౪౨౪. దాదృహాణో వజ్ర మిన్ద్రో గభస్త్యోః క్షద్మేవతిగ్మ మసనా యసంశ్య
దహిహత్యా యసంశ్యత్ । సంవివ్యాన ఓజసా శవోభి రిన్ద్ర మజ్మనా ।
తష్టేవ వృక్షంవనినో నివృశ్చసి పరశ్వేవ నివృశ్చసి॥ ౪॥

దం॥ ఈయింద్రుఁడు బాహువులందు వజ్రాయుధమును ధరించినవాఁడై శత్రువులమీఁదఁబ్రయోగించుటకొఱకు ఉదకమును మంత్రములతో తీవ్రపఱచునట్లు వాఁడికై సానపెట్టుచున్నాఁడు. వృత్రాసురుని జంపుటకుమరల సానపెట్టుచున్నాఁడు. ఓ యింద్రుఁడా! సైన్యములతోను, బలముతోను, పరాక్రమముతోను గూడికొన్నవాఁడవై వడ్లంగి అడవి వృక్షమును వలెను శత్రువులను నఱకుచున్నావు. గండ్రగొడ్డలితో వృక్షమును నఱికినట్లు శత్రువులనఱకుచున్నావు. (పునరుక్తి అతిశయార్థము)

౧౪౨౫. త్వంవృథా నద్య ఇన్ద్ర స ర్తవేచ్ఛా సముద్రమ సృజో రథాఇవవాజయతో
రథాఇవ । ఇతఊతీ రయుఞ్జత సమానమర్థ మక్షితమ్ ।
ధేనూరివ మనవే విశ్వ దోహసో జనాయ విశ్వదోహసః॥ ౫॥

దం॥ ఓ యింద్రా! యుద్ధముగోరినవారు రథములను, నడిపించునట్లు నీవు మాయాగమునకు అభిముఖముగా రథములను నడిపించునట్లును; అనాయాసముగ (మేఘములం జీల్చి) సముద్రమున కభిముఖములై పాఱుటకు నదులను బ్రవహింపఁ జేసితివి. సమస్తవస్తువుల నిచ్చు గోవులను మనుచక్రవర్తికిచ్చినట్లు; (క్షీరాది) సమస్తవస్తువుల నిచ్చుగోవులను సామాన్యజనుల కిచ్చినట్లును; మమ్ము (రక్షించుటయే) సమానప్రయోజనముగాఁగల యుదకములను బ్రవహించునదులను మాకుఁ గలిగించితివి.

౧౪౩౦. ఇమాం తే వాచం వసూయన్త ఆయవో రథం న ధీరః స్వపా అతక్షిషుః

సుమ్నాయ త్వామతక్షిషుః । శుమ్భన్తో జేన్యం యథా వాజేషు విప్ర వాజినమ్ ।

అత్యమివ శవసే సాతయే ధనా విశ్వా ధనాని సాతయే ౬॥

దం॥ ఇంద్రా! ధనమునపేక్షించి హవిస్సులు సమర్పించుచున్న ఋత్విజులు ఈస్తుతి వాక్కు-నునీకొఱకు నిర్మించిరి. బుద్ధిమంతుఁడు రథమును నిర్మించినట్లు సుఖము కొఱకు నిన్ను నిర్మించుచున్నాఁడు. బుద్ధిశాలివగునింద్రా! యుద్ధములందు వేగముగల నిన్ను గుణగణములచే బ్రోత్సాహపఱచుచు జయశీలుఁడగు శూరునివలె సంతోష పెట్టుచున్నారు ధనములయొక్క- లాభమునకు గుఱ్ఱమును వలెను గవాదిధనలాభ మునకై, బలమునకునైయు నిన్ను స్తుతించుచున్నాను.

౧౪౩౧. భినత్పురో నవతిమిన్ద్ర పూరవే దివోదాసాయ మహి దాశుషే నృతో వజ్రేణ

దాశుషే నృతో । అతిథిగ్వాయ శమ్బరం గిరేరుగ్రో అవాభరత్ ।

మహో ధనాని దయమాన ఓజసా విశ్వా ధనాన్యోజసా॥ ౭॥

దం॥ (దీనరక్షణమున) నాట్యముచేయునట్టి యింద్రా! నీవు హవిస్సు లిచ్చు యజమానునకై తొంబది శత్రుపట్టణములను బ్రద్దలుకొట్టితివి. శత్రులను దన్ని పోడుచు వజ్రాయుధముతో యజమానుని కొఱకు శత్రువులఁ జంపితివి. దివోదా సునికొఱకు అధికబలముగల యింద్రుఁడు శంబరాసురుని తన పరాక్రమముచేత నెక్కు-వధనములను స్వీయబలముచేత సాధించి పర్వతమునుండి క్రిందికిత్రోసివేసెను.

౧౪౩౨. ఇన్ద్రః సమత్సు యజమానమార్యం ప్రావద్విశ్వేషు శతమూతిరాజి

షు స్వర్మీళ్హేష్వాజిషు । మనవే శాసదవ్రతాన్త్వచం కృష్ణామరన్ధయత్ ।

దక్షన్న విశ్వం తతృషాణమోషతి న్యర్శసానమోషతి॥ ౮॥

దం॥ ఈ యింద్రుఁడు యుద్ధములందు యజమానుని రక్షించుచున్నాఁడు అనేక రక్షణాలు కల యింద్రుఁడు సమస్తయుద్ధములలోను యజమానుని రక్షించుచున్నాడు. స్వర్గసౌఖ్యమిచ్చు యుద్ధాలలో రక్షించుచున్నాఁడు. మనుష్యుల కొఱకింద్రుఁడు యాగవిద్వేషులను సంహరించుచున్నాఁడు. కృష్ణుఁడను రాక్షసునియొక్క- నల్లని

చక్రమును బలిచి చంపెను. దహించెను. హింసచేయు సర్వజంతువులను మిగుల్చ కూడ నశింపఁజేయును.

౧౪౩౩. సూరశ్చక్రం ప్రవృహజ్జాత ఓజసా ప్రపిత్వేవాచ మరుణో ముషాయతీ

శాన ఆ ముషాయతి । ఉశనా యత్పరావతో జగన్నూతయేకవే ।

సుమ్నాని విశ్వామనుషేవ తుర్వణి రహావిశ్వేవ తుర్వణిః॥ ౯॥

దం॥ ఈ యింద్రుఁడు సూర్యునియొక్క రథచక్రమును తీసికొని బలముచేత సధికుఁడై ప్రయోగించెను. తేజోవంతుఁడై సమీపమునకు వచ్చి శత్రువునియొక్క ప్రాణమును హరించినాఁడు. విద్వాంసుఁడవగు నింద్రా! యే నీవు ఉశనసుఁడను ఋషియొక్క రక్షకై దూరమునుండి వచ్చితివి. సమస్తసుఖసాధనములను మాకిచ్చువాఁడవై మనుష్యులవలె సహాయుఁడవుగమ్ము. అన్నిదినములందును (కోర్కెల) నిచ్చువాఁడవు కమ్ము.

౧౪౩౪. సనోనవ్యేభిర్వృషకర్మన్నుక్థైః పురాందర్తః పాయుభిః పాహిశగ్మైః ।

దివోదాసేభిరిన్ద్ర స్తవానో వావృధీథా అహోభిరివద్యౌః॥ ౧౦॥

దం॥ వర్షించుకర్మగలవాఁడవై శత్రుపురముల ముక్కలు సేయునోయింద్రా! ప్రసిద్ధుఁడవైననీవు నూతనములైన మాస్తోత్రములతో సంతుష్టుఁడవై రక్షణరూపములయిన కర్మఫలములచేత రక్షింపుము. ఇంద్రా! దివోదాసవంశస్థులచేత స్తుతింపఁబడుచు పగళ్లచేత సూర్యునివలెను వృద్ధినొందుము.

---

## సూక్తము ౧౩౧.

పరుచ్ఛేదఋషి - అత్యష్టిఛంద - ఇంద్రదేవత

౧౪౩౫. ఇన్ద్రాయ హిద్యౌరసురో అనమ్నతేన్ద్రాయ మహీపృథివీ వరీమభిర్ద్యుమ్న

సాతా వరీమభిః । ఇన్ద్రంవిశ్వే సజోషసోదేవాసోదధిరే పురః ।

ఇన్ద్రాయవిశ్వా సవనానిమానుషా రాతాని సన్తుమానుషా॥ ౧॥

దం॥ ఇతరులను నిరసించు స్వభావముకల దేవతలందఱు ఇంద్రునకు వశులై యున్నారు. భూమికూడ స్తుతులతో నింద్రునికే లొంగియున్నది. కీర్తికొఱకు హవిస్సులతోఁగూడిన యజమానులు లొంగియున్నారు. దేవతలందరు ఏకమత్యముతో నింద్రునే తమముందు నుంచుకొన్నారు. మనుష్యులచేయు ప్రాతస్సవనాదియాగములుమూఁడును ఇంద్రునికొఱకే. ఋత్విజులుచేయు పురోడాశాదిహవిస్సు లింద్రునికొఱకే.

౧౪౩౬. విశ్వేషుహిత్వా సవనేషు తుఞ్జతే సమానమేకం వృషమణ్యవః పృథక్స్వః

సనిష్యవః పృథక్ । తంత్వా నావం న పర్షణిం శూషస్య ధురిధీమహి ।

ఇన్ద్రంనయజ్ఞైశ్చితయన్త ఆయవః స్తోమేభిరిన్ద్రమాయవః॥ ౨

దం॥ ఓ యింద్రుఁడా! సర్వసమానుఁడవగు నీకు ఒక్కనికే సకలసోమయాగము లందును కోర్కెలనపేక్షించు యజమానులు ఆలోచించి స్వర్గమును పొందఁగోరి ప్రత్యేకముగా హవిస్సుల నిచ్చుచున్నారు. అట్టి నిన్ను దరిఁజేర్చునోడను గోరునట్లు సేనాగ్రమందుండఁ గోరుచు; యజమానులమగు మేము యజ్ఞములతో నీశ్వరుని వలెను భావించుచు; ఇంద్రుఁడవయిన నిన్ను స్తోత్రములతో ధ్యానించుచున్నాము.

౧౪౩౭. విత్వాతతస్రే మిథునా అవస్యవో వ్రజస్య సాతా గవ్యస్య నిఃసృజః

సక్షన్త ఇన్ద్రనిఃసృజః। యద్గవ్యన్తాద్వాజనా స్వర్యన్తా సమూహసి ।

ఆవిష్కరిక్రద్వృషణంసచాభువంవజ్రమిన్ద్ర సచాభువమ్॥ ౩॥

దం॥ ఇంద్రుఁడా! నిన్నుద్దేశించి భార్యలతోఁగూడి యజమానులు గోసమూహము నిమిత్తమై నీతృప్తినిగోరి హవిస్సుల నివ్వఁదలచి నిన్ను సేవించువారై పాపమును బోగొట్టుకొనుటకు యాగములు చేయుచున్నారు. నీవు ఎందువల్ల గోవుల నపేక్షించునట్టి, స్వర్గము నపేక్షించునట్టి యజమానదంపతులను స్వర్గమునకు జేర్చుచున్నావో (అందువల్లనని) ఇంద్రా! వర్షించు స్వభావముకలదై విడిచియుండనట్టి సామర్థ్యము కల వజ్రాయుధమును ప్రకటించుచున్నావు.

౧౪౩౮. విదుష్టే అస్య వీర్యస్య పూరవః పురో యదిన్ద్ర శారదీరవాతిరః సాసహానో
అవాతిరః । శాసస్తమిన్ద్ర మర్త్యమయజ్యుం శవసస్పతే ।
మహీ మముష్ణాః పృథివీ మిమా అపో మన్దసాన ఇమా అపః॥ ౪॥

దం॥ ఇంద్రా! నీయొక్క యీ పరాక్రమమును ఏ యజమానులు తెలిసికొనుచున్నారో యెందువల్ల అనేక సంవత్సరాలనుండి దృఢపడిన శత్రుపట్టణములను బాధించుచు నాశమొనర్చితివో, ఇంద్రా! ప్రసిద్ధులయి మరణధర్మముగల యజ్ఞవిఘాతకులగు రాక్షసులను శాసించుచున్నావో, బలమున కధిపతివగు ఇంద్రా! అందువల్లనే యీ గొప్పదగు భూమిని ఈ ఉదకములను నీవు అపహరించితివి (అనఁగా స్వాధీనము చేసుకొంటివని.) సంతసించుచు ఈ కార్యములగు (విద్యుత్తు, సస్యము మొ॥) జేసితివి.

౧౪౩౯. ఆదిత్తే అస్య వీర్యస్య చర్కిరన్మదేషు వృషన్నుశిజో యదావిథ సఖీ
యతో యదావిథ । చకర్థ కారమేభ్యః పృతనాసు ప్రవన్తవే ।
తే అన్యామన్యాం నద్యం సనిష్ణత శ్రవస్యన్తః సనిష్ణత॥ ౫॥

దం॥ వర్షించునింద్రా! నిన్నుగోరిన యజమానులను ఎందుచేత రక్షించుచున్నావో నీ స్నేహము గోరిన మమ్ము నెందువల్ల రక్షించుచున్నావో అందువల్ల సర్వయాగములందు మనముకొఱకు పరాక్రమించుటకు సోమము నిచ్చుచున్నాడు. ఈ యజమానులకొఱకు యుద్ధములందు రక్షణకై సింహనాదమును జేయుచున్నావు. ప్రతి కార్యమువిషయమై నీకు సమృద్ధికలదు. అన్నముకోరినవారు దానిఁబొందుచున్నారు.

౧౪౪౦. ఉతో నో అస్యా ఉషసో జుషేత హ్యర్కస్య బోధి హవిషో హవీమభిః
స్వర్షాతా హవీమభిః । యదిన్ద్ర హన్తవే మృధో వృషా వజ్రిఞ్చికేతసి ।
ఆ మే అస్య వేధసో నవీయసో మన్మ శ్రుధి నవీయసః॥ ౬॥

దం॥ ఈ యింద్రుడు మా యీ యుషఃకాలమునందు వచ్చునా? అర్చనసాధనమయిన హవిస్సును హోమవిధులచేత దెలిసికొనునా? ఇంద్రా! స్వర్గసాధనమయిన యజ్ఞమందు మా యాహ్వానములతో పిలువఁబడుము శస్త్రములు నివ్వఁదలఁచినవాఁడవై యింద్రా! (వజ్రధారీ!) హింసకులం జంపువాఁడవుగఁ దెలియఁబడుచున్నావు. ఇంద్రా! బుద్ధిశాలివయి క్రొత్త స్తుతికర్తనైన నా క్రొత్త స్తోత్రమును వినుము.

౧౪౪౧. త్వంతమిన్ద్ర వావృధానో అస్మయురమిత్రయన్తం తువిజాత మర్త్యం

వజ్రేణ శూర మర్త్యమ్। జహి యో నో అఘాయతి శృణుష్వ సుశ్రవస్తమః।

రిష్టం న యామన్నప భూతు దుర్మతిర్విశ్వాప భూతు దుర్మతిః॥ ౭॥

దం॥ మా స్తుతులతోఁ బూజింపఁబడిన పరాక్రమశాలీ! యింద్రా! ఏ మనుష్యుడు మాకు దుఃఖమును గలిగించుచున్నాఁడో వానిని, మమ్ముఁగోరి మాయందు శత్రుత్వముఁ దలఁచు మనుష్యునిం గూడను వజ్రాయుధముతోఁ జంపుము. శ్రవణశక్తి గలనీవు మంచిస్తోత్రములు వినుము. ఇంద్రా! మమ్ము జయింపవలెనన్న దుర్బుద్ధి నశించుఁగాక. సకలమార్గమునందును దోపిడిగాండ్ర బుద్ధివంటి దుర్బుద్ధి మమ్ము బాధింపకుండుఁగాక.

---

## సూక్తము. ౧౩౨.

పరుచ్ఛేదఋషి, అత్యష్టిఛంద, ఇంద్రదేవత.

౧౪౪౨. త్వయా వయం మఘవన్పూర్వ్యే ధన ఇన్ద్రత్వోతాః సాసహ్యామ పృతన్యతో

వనుయామ వనుష్యతః। నేదిష్ఠే అస్మిన్నహన్యధి వోచా ను సున్వతే।

అస్మిన్యజ్ఞే వి చయేమా భరే కృతం వాజయన్తో భరే కృతమ్॥ ౧॥

దం॥ ఓ యింద్రుడా! నీతోఁగూడిన మేము అతి ప్రబలుఁడవగు నీచే రక్షింపఁబడినవారమయి సేనలతోఁ గూడిన శత్రువులను దిరస్కరింపఁగలము. మమ్ముఁ జంపవచ్చువారిని మేమే జంపఁగలము. మొకటి ధనరూపమైన యీ యజ్ఞమందు మిగుల దగ్గఱగానున్న యీ దినమున సోమాభిషవము చేసిన యజమానునికొఱకు శీఘ్రము మేలుపలుకుము. ఇంద్రా! యజమానులమగు మేము యుద్ధమందు శత్రులంజంపునట్టి నీకు హవిస్సులిచ్చుచు శత్రుజయమందు జయకర్తవగు నిన్ను స్తుతించెదము.

౧౪౪౩. స్వర్జేషే భర ఆప్రస్య వక్మన్యుషర్బుధః స్వస్మిన్నఞ్జసి క్రాణస్య
స్వస్మిన్నఞ్జసి । అహన్నిన్ద్రో యథావిదే శీర్ష్ణా శీర్ష్ణో పవాచ్యః ।
అస్మత్రా తే సధ్ర్యక్సన్తు రాతయో భద్రా భద్రస్య రాతయః॥ ౨॥

దం॥ ఈ యింద్రుఁడు స్వర్గమునిచ్చు యుద్ధమందు శత్రువులఁ జంపఁదలఁచి వీరమార్గమందు కపటము లేక సంపాదించిన తన సుఖము నిమిత్తమై యింద్రప్రీతిఁగలిగించునట్టి, తెల్లవారుజాము మేల్కొనునట్టి యజమానునియొక్క శత్రువులను హింసించుచున్నాఁడు. కనుక యింద్రుఁడు ఎట్లు సర్వముం దెలిసిన యజమానునిచే శిరసానమస్కరింపఁదగి యున్నవాఁడో అందఱిచేతను అలాగున నమస్కరింపఁదగియే యున్నాఁడు. ఇంద్రా! నీ యొక్క ధనములు మాయందే కూడనుండుఁగాక. స్తవనీయుఁడవయిన నీ యొక్కదానములు సిద్ధములైనవిగా నుండుగాక.

౧౪౪౪. తత్తు ప్రయః ప్రత్నథా తే శుశుక్వనం యస్మిన్యజ్ఞే వార మకృణ్వత క్షయ
మృతస్య వారసి క్షయమ్ । వితద్వోచే రధద్వితాంతః పశ్యన్తి రశ్మిభిః ।
సఘావిదే అన్విన్ద్రో గవేషణో బన్ధుక్షిద్భ్యో గవేషణః॥ ౩॥

దం॥ ఇంద్రుఁడా! యాగమందు ఏ హవిస్సు ఇయ్యవలసినపుడు కోరఁదగిన వేదిస్థానమును ఋత్విజులు చేయుచున్నారో అప్రసిద్ధమగు మిగుల ప్రకాశించు హవిస్సు నీకిదిగో! యజ్ఞఫలమయిన స్వర్గమున నున్నావు. అందుచేత ద్యావాభూముల మధ్యమందున్న అంతరిక్షమందు సూర్యకిరణములచేత నరులు చూచుచున్నారు. ఆపనిని ప్రకటింపుము. (వర్షించుమనియని తా.) ఆ యింద్రుఁడే ఉదకమును వెదకువాఁడై

బంధుభావముగల యజమానులకు గోవుల నిచ్చినాఁడు. ఈలాగు వర్షమును కురిపించుచున్నాఁడు.

౧౪౪౫. నూ ఇత్థా తే పూర్వథా చ ప్రవాచ్యం యదఙ్గిరోభ్యోఽవృణోరప వ్రజ
మిన్ద్ర శిక్షన్నప వ్రజమ్ । ఐభ్యః సమాన్యా దిశాస్మభ్యం జేషి యోత్సి చ ।
సున్వద్భ్యో రన్ధయా కం చిదవ్రతం హృణాయన్తం చిదవ్రతమ్॥ ౪

వ॥ ఎందువలన నీవు అంగిరోగోత్రజుల కొఱకు మేఘములను భేదించితివో; యింద్రా! యాగము చేయనివారివల్ల నపహరించి గోసంఘమును యంగిరోవంశజుల కిచ్చుటకుఁ దెరచితివో; యీ ఋషులకై సమానముగా నెట్లిచ్చుచున్నావో అలాగున జయింపుము. యుద్ధము చేయుము. నీవు సోమాభిషవము చేసిన మాకొఱకు సమస్తయాగవిరోధులను సంహరింపుము. మాయందుఁ గుత్సితబుద్ధికల శత్రువులను సంహరింపుము నీకార్యములీప్రకారముగా మునుపటివలెనే శీఘ్రము స్తుతింపఁదగి యున్నవి.

౧౪౪౬. సం యజ్జనాన్క్రతుభిః శూర ఈక్షయద్ధనే హితే తరుషన్త శ్రవస్యవః
ప్ర యక్షన్త శ్రవస్యవః । తస్మా ఆయుః ప్రజావదిద్బాధే అర్చన్త్యోజసా ।
ఇన్ద్ర ఓక్యం దిధిషన్త ధీతయో దేవాఁ అచ్ఛా న ధీతయః॥ ౫

వ॥ ఏ యింద్రుఁడు పరాక్రమశాలియై దనకార్యములచేత సర్వజనులను సర్వము నెఱుంగునట్లు చేయుచున్నాఁడు. అన్నముకోరిన యజమానుల ఇష్టమయిన ధనము కొఱకు శత్రువుల హింసించుచున్నాఁడు. ఆకారణముచేత హవిస్సులింద్రునకిచ్చి యన్నవారై గొప్పయజ్ఞము లాచరించుచున్నారు. ఆ యింద్రుని కొఱకే హవిస్సంతానముతోఁ గూడినదగుచున్నది. యజమానులు తమ బలముతోఁగూడి శత్రువుల బాధించుటకుఁ బూజించుచున్నారు. కర్మలుచేయు యజమానులు ఇంద్రసమీపమందు నివాసస్థానముగా స్వర్గము సాధించు కర్మలు చేయుచు దేవతల నభిముఖముగాఁ జేసికొనుచున్నారు.

౧౫౪౭. యువం తమిన్ద్రా పర్వతా పురోయుధా యో నః పృతన్యాదప తన్తమిద్ధతం వజ్రేణ తంతమిద్ధతమ్ । దూరే చత్తాయ చ్ఛన్త్సద్గహనం యదినక్షత్ । అస్మాకం శత్రూన్పరి శూర విశ్వతో దర్మా దర్షీష్ట విశ్వతః॥ ౬॥

దం॥ ఇంద్రమేఘాభిమానదేవతలారా! మీరిద్దఱు యుద్ధమందు ముందునిల్చిమమ్ము నే శత్రువు చంపుటకు సేనకోరుచున్నాఁడో వానిని జంపుడు. శత్రువుల నందఱిని వజ్రములతోఁ జావగొట్టుఁడు. ఏ వజ్రము దూరమందగుపడక చంపనూహించు నతికఠినహృదయుఁడగు శత్రువుంగూడఁ జంపుచున్నదో, శూరుఁడా! మావిరోధు లను ఎల్లరను అంతటను అన్నియుపాయములతోను శత్రుభేదియగు నీవజ్రము చీల్చు చున్నది.

---

## సూక్తము. ౧౩౩.

పరుచ్ఛేదర్షి - ఇంద్రదేవత ౧ త్రిష్టుభము - ౨-౩-౪ అనుష్టుభ ౫ గాయత్రి ౬ ధృతి చివరిది అత్యష్టిఛందము.

౧౫౪౮. ఉభే పునామి రోదసీ ఋతేన ద్రుహో దహామి సం మహీరనిన్ద్రాః । అభివ్లగ్య యత్ర హతా అమిత్రా వైలస్థానం పరి తృళ్హా అశేరన్॥ ౧॥

దం ఓ యింద్రుఁడా! యజ్ఞముచేత ద్యావాభూముల రెంటిని పవిత్రముచేయు చున్నాను. ఇంద్రునకాశ్రయములు కాని భూములు, ద్రోహస్థానములగు భూము లను గాల్చుచున్నాను. ఏ భూములయందు శత్రువులు అంతటను జేరి మాచేత వెంటఁబెట్టబడిరో వారందఱు హింసింపబడి శ్మశానమునఁ బరుండిరో. (ఆ భూము లని పూర్వాన్వయం)

౧౫౪౯. అభివ్లగ్యా చిదద్రివః శీర్షా యాతుమతీనామ్ । ఛిన్ధి వటూరిణా పదా మహావటూరిణా పదా॥ ౨॥

దం॥ శత్రువులు నశింపఁజేయు నింద్రా! నీవు హింసకములగు శత్రుసేనల శిరస్సుల నంతటను వ్యాపించిన సర్వవ్యాపకమగు నైరావతపాదము చేతను అంతటను వ్యాపించిన నీ పాదముచేతను చిదుకఁద్రొక్కుము.

౧౮౫౦. అవాసాం మఘవఞ్జహి శర్ధో యాతుమతీనామ్।
వైలస్థానకే అర్మకే మహావైలస్థే అర్మకే॥ ౩॥

దం॥ ఓ యింద్రుఁడా! యీ సేనలయొక్క బలమును చూర్ణముచేయుము అట్లుచేసి పీనుఁగులచేనసహ్యమగు శ్మశానస్థానమందునుంచుము. సర్వసాధారణమగు కుత్సితమగు శ్మశానమందుఁద్రోయుము.

౧౮౫౧. యాసాంతిస్రః పఞ్చాశతోభిన్లఙ్గై రపావపః।
తత్సుతే మనాయతి తకత్సుతే మనాయతి॥ ౪॥

దం॥ ఓయింద్రుఁడా! పూర్వమంత్రముందుఁజెప్పిన సేనలయొక్క త్రిగుణితములగు ఏఁబదులను (౧౫౦ అనితా.) పరుగెత్తి పట్టుకొని నశింపఁజేసితివి. ఇంద్రా! సేనావధకర్మము మిక్కిలి సంతోషము గలిగించును. ఆనీపని స్వల్పముగ నెంచఁబడును.

౧౮౫౨. పిశఙ్గ భృష్టిమంభృణం పిశాచి మింద్రసమ్మృణ।
సర్వం రక్షోనిబర్హయ॥ ౫॥

దం॥ ఓ యింద్రుఁడా! యెఱ్ఱనిరంగుగలిగిన భయంకరమైన పిశాచమును జంపుము. సమస్తరాక్షసులను జంపుము.

౧౮౫౩. అవర్మహా ఇన్ద్రదాదృహి శ్రుధీనః శుశోచహిద్యౌః క్షానభీషా అద్రివో
ఘృణాం నభీషా అద్రివః। శుష్మిన్తమోహి శుష్మిభిర్వధై రుగ్రేభిరీయసే।
అపూరుషఘ్నో అప్రతీత శూరసత్వభిస్త్రి సప్తైః శూరసత్వభిః॥ ౬॥

దం॥ శత్రునాశకుండవగు ఓ యింద్రా! గొప్ప మేఘమును వలకొనవలెంజేల్చుము. మావాక్య విసుము. మేఘములుగల యింద్రా! వర్షము లేకుండుటచేత భూమి వలెను త్వష్టరూపముగా నున్న యగ్ని భయంచేత ద్యావాభూములవలెను, ద్యులోకమెందువల్లను ఏడ్చుచున్నది? ఇంద్రా! నీవు బలముచేత మిగుల బలవంతుండవు గదా! అందువల్ల మిగుల క్రూరములగు ఆయుధములు కల్గి శూరుండవై శత్రువులకు లొంగక యజమానులను బాధింపని నీవు ఇరువదొక్క భటులతోఁగూడి శత్రుల మీఁదికిఁ బోవుచున్నావు. (యజ్ఞములు లేకుంటే ద్యులోక మేడ్చును.)

౧౫౬౫. వనోతిహి సున్వన్క్షయం పరీణసః సున్వానో హిష్మాయ జత్యవద్విషో దేవానామవద్విషః। సున్వాన ఇత్సిషా సత్రిసహస్రా వాజ్యవృతః। సున్వానాయేన్ద్రో దదాత్యాభువంరయిం దదాత్యాభువమ్॥ ౬॥

దం॥ ఇంద్రుండా! సోమాభిషవము చేసిన యజమానుఁడు గృహమును బొందుచున్నాఁడుగదా! సోమయాగము చేసినవాఁడే అంతటను సన్నద్ధులగు శత్రువులను హింసించుచున్నాఁడు. దేవతలయొక్క శత్రువులంగూడ జయించును. సోమయాగము చేయువాఁడే యన్నము కలవాఁడై అపరిమితధనములను బొందనిచ్ఛయించుచున్నాఁడు. సోమయాగము చేయువానికై యీ యింద్రుఁడు జగత్ప్రసిద్ధమైన అతిసమర్థమైన ధనమును ఇచ్చుచున్నాఁడు.

---

## అనువాకము. ౨౦.

## సూక్తము. ౧౩౫.

పరుచ్ఛేదఋషి, అత్యష్టిఛందము, వాయుదేవత.

౧౫౬౬. ఆత్వా జువోరారహాణా అభిప్రయోవాయో వహన్త్విహ పూర్వపీతయే సోమస్య పూర్వపీతయే। ఊర్ధ్వాతే అనుసూనృతా మనస్తిష్ఠతు జానతీ। నియుత్వతారథే నాయాహి దావనేవాయో మఖస్యదావనే॥ ౧॥

టీ॥ ఓ వాయువా! మిక్కిలి త్వరగల్గి సమర్థములైన గుఱ్ఱాలు శీఘ్రముగ మునందు అందఱికంటెముందు సోమపానము చేయుటకు నిన్ను దీసికొని వచ్చుచుగాక. వాయువా! నీమనసును గుఱించి సత్యవాక్కు ఉన్నతమైన గుణము కలదియగునదై యుండుగాక. ఓ వాయువా! యజ్ఞసంబంధమైన హవిస్సు గ్రహించుటకు మా యభిమతము లిచ్చుటకును వాహనములచే బూన్పఁబడిన రథముతో రమ్ము.

౧౪౫౬. మన్దన్తు త్వా మన్దినో వాయవిన్దవోఽస్మత్క్రాణాసః సుకృతా అభిద్యవో గోభిః క్రాణా అభిద్యవః । యద్ధ క్రాణా ఇరధ్యై దక్షం సచన్త ఊతయః । సధ్రీచీనా నియుతో దావనే ధియ ఉప బ్రువత ఈం ధియః ॥ ౨॥

టీ॥ ఓ వాయూ! మేముసిద్ధము చేసినట్టి, మదము గలిగించునట్టి, సంతోషము కలిగించునట్టి, దశాపవిత్రముతో శోధింపఁబడినట్టి, మిగులఁ బ్రకాశించునట్టి, నేతి ముఖములైనట్టి సోమములు నిన్ను మదింపఁజేయుగాక. ఇది ప్రసిద్ధము. వాయువా! మాయాగమునకు రాఁగోరు నన్ను సేవించుచుఁ బలిమెజనేర్చునట్టి సంతోషము గలట్టి, కలిసి నడుచునట్టి, నియుత్తులను నశ్వములు హవిస్సులందుకొనుటకు కర్మలను గూర్చి యాగస్థలము చేరుచున్నవి. కనుకనే హవిస్సులు ధరించిన ఋత్విజులు (నీదగ్గఱఁజేరి) తమ యభిప్రాయమును జెప్పుచున్నారు.

౧౪౫౭. వాయుర్యుఙ్క్తే రోహితా వాయురరుణా వాయూ రథే అజిరా ధురి వోళ్హవే వహిష్ఠా ధురి వోళ్హవే । ప్ర బోధయా పురన్ధిం జార ఆ ససతీమివ । ప్ర చక్షయ రోదసీ వాసయోషసః శ్రవసే వాసయోషసః ॥ ౩॥

టీ॥ ఈ వాయువు ఎఱ్ఱని గుఱ్ఱములను కాడియందు (ప్రాఁజు అని కూడ వాడుదురు) కట్టుచున్నాఁడు. లేక పూన్చుచున్నాఁడు. వాయువు చిత్రవర్ణముల గుఱ్ఱములను రథమందు మోయుటకు కట్టుచున్నాఁడు. ఓ వాయూ! జారుఁడు పరస్త్రీని మేల్కొల్పునట్లు యజమానుని మేల్కొల్పుము. ద్యావాభూములను బ్రకాశింపఁజేయుము. ఉషస్సులను నిలుపుము. హవిస్సులు స్వీకరింపఁగలందులకు ఉషస్సులను నిలుపుము.

౧౪౫౮. తుభ్యముషాసః శుచయః పరావతి భద్రావస్త్రా తన్వతే దంసురశ్మిషు

షుచిత్రానవ్యేషు రశ్మిషు। తుభ్యంధేనుః సబర్దుఘా విశ్వావసూని దోహతే।

అజనయో మరుతో వక్షణాభ్యో దివ ఆ వక్షణాభ్యః॥ ౪॥

ద॥ ఓ వాయువా! ప్రకాశించు నుషస్సులు దూరమునను్న అంతరిక్షమందు ఆవరించిన కిరణములచేత మంగళకరములయిన వస్త్రములను నీకొఱకు విస్తరింపఁ జేయుచున్నవి. స్తుతింపఁబడుచున్న కిరణములచేత నానావర్ణవస్త్రములను పరుచుచున్నవి. వాయూ! గోవు నీకొఱకుఁ బాలిచ్చుచున్నది. సమస్తములయిన నేయి మొదలయిన వస్తువులను ఇచ్చుచున్నది! వాయువా! అంతరిక్షమునుండి వర్షము కొఱకు వాయువులను ప్రవహించుటకు నదులను గలిగించుచున్నావు.

౧౪౫౯. తుభ్యం శుక్రాసః శుచయస్తురణ్యవో మదేషూగ్రా ఇషణన్త భుర్వణ్య

పామిషన్త భుర్వణి। త్వాంత్సారీదసమానో భగమీట్టే తక్వవీయే।

త్వంవిశ్వస్మాద్భువనా త్పాసి ధర్మణా సుర్యాత్పాసి ధర్మణా॥ ౫॥

ద॥ ఓ వాయూ! నీ కొఱకుఁ బ్రకాశించుచున్నట్టి పవిత్రులగు యజమానులు త్వరగలవారై నీ మదముకొఱకుఁ దీవ్రములయిన సోమములను యాగమందు గోరుచున్నారు. ఉదకములయొక్క వర్షమునిమిత్తము మేఘమును గోరుచున్నారు. నీవు సమస్తభూతములనుండి హవిస్సులను గ్రహించుటచే రక్షించుచున్నావు. మా పోషణముగల్గి రాక్షసబాధనుండి రక్షించుచున్నావు. భయపడుచు వ్రతములచే క్షీణించినట్టి యజమానుఁడు సేవింపదగు నిన్ను యాగవిరోధులఁ బాఱఁదోలుటకు స్తుతించుచున్నాఁడు.

౧౪౬౦. త్వంనో వాయవేషా మపూర్వ్యః సోమానాంప్రథమః పీతిమర్హసి

సుతానాం పీతిమర్హసి। ఉతో విహుత్మతీనాం విశాంవవర్జుషీణామ్।

విశ్వా ఇత్తే ధేనవో దుహ్ర ఆ శిరం ఘృతం దుహ్రత ఆ శిరమ్॥ ౬॥

వం॥ ఓ వాయువా! నీవు మొదటసోమరసము త్రాగుటకుఁ దగువాఁడవు కనుకనే యందఱికంటె ముందు సోమరసములయొక్క పానమును బొందుచున్నావు. అభిష వించిన సోమముల పానముఁ గర్తవ్వాఁడవు. మఱియు విశేషాహ్వానములుగలట్టి, పాప ముపోఁగొట్టుచున్నట్టి, ఋత్విగ్యజమానుల సంబంధమైన సమస్తగోవులు గూడ నీ కొఱకు క్షీరమును పిదుకుచున్నవి. ఉపస్తరణయోగ్యమగు నేతిని యిచ్చుచు న్నవి. (ఏ హవిస్సునకైన క్రిందనువేసిన నేయి ఉపస్తరణ మనఁబడును.)

—:-o-:—

## సూక్తము. ౧౩౫.

పరుచ్ఛేపఋషి - వాయుదేవత - ఇంద్రదేవత ౭-౮ అష్టిఛందం, తక్కినవి అత్యష్టిఛందము

౧౪౬౧. స్తీర్ణం బర్హిరుపనో యాహి వీతయే సహస్రేణ నియుతా నియుత్వతే

శతినీభిర్నియుత్వతే। తుభ్యం హి పూర్వపీతయే దేవా దేవాయ యేమిరే।

ప్రతే సుతాసో మధుమన్తో అస్థిరన్మదాయ క్రత్వే అస్థిరన్॥ ౧॥

వం॥ ఓ వాయువా! మేము పరిచిరసర్వభ హవిర్భక్షణకొఱకు సహస్రసంఖ్యాక మగు శతసంఖ్యలగు అశ్వములతోఁ గూడి రమ్ము. ప్రకాశించునట్టి నీకొఱకు ఇతర దేవతలకంటె ముందుసోమము తాఁగుటకు ఋత్విజులు (ఆహవనీయాగ్నిసద్దకు సోమ మును)దెచ్చిరికదా! యీపిండిన మాధుర్యముగల సోమరసములు నీమదము కొఱకు నున్నవి. కర్మబుద్ధికొఱకు ఋత్విజులు ధరించిన సోమములను ద్రావుము.

౧౪౬౨. తుభ్యాయంసోమః పరిపూతో అద్రిభిః స్పార్హావసానః పరికోశమర్షతి

శుక్రావసానో అర్షతి। తవాయం భాగ ఆయుషుసోమో దేవేషు హూయతే।

వహవాయోని యుతో యాహ్యస్మ యుర్జుషాణో యాహ్యస్మయుః॥ ౨॥

వం॥ ఓ వాయువా! పవిత్రముతో సంస్కరించినది, కోరదగినది, నిర్మల కాంతు లను ధరించుచున్నదియగు ఈ సోమము నీ కడుపులోనికిఁ దగియున్నది. మనుష్యు లందఱుఁ బొందఁదగిన సోమము నీకు దేవతలమధ్యను ఇవ్వఁబడుచున్నది. ఓవాయువా!

ఆ సోమమునుగూర్చి మమ్ముగోరిన నీవు నియుత్తులను గుఱ్ఱములను బూన్పుము. స్వర్గమునకు బొమ్ము మాతోగూడి తృప్తిపొంది వెళ్లుము.

౧౮౬౩ ఆ నో నియుద్భిః శతినీభిరధ్వరం సహస్రిణీభిరుపయాహి వీతయే

వాయో హవ్యాని వీతయే। తవాయం భాగ ఋత్వియః సరశ్మిః సూర్యే సచా।

అధ్వర్యుభిర్భరమాణా అయంసత వాయో శుక్రా అయంసత॥ ౩॥

దం॥ ఓ వాయూ! యీ నీ భాగమయిన సోమము ఇవ్వదగిన సమయముకలద య్యెను. సూర్యోదయమందు సమానకాంతి కలదగుచున్నది. మఱియు ఆ సోమము అధ్వర్యులచేతఁ బట్టుకొనఁబడినదై శుద్ధముగనున్నది. మిగులఁ బ్రకాశించునట్టివై యున్నవి. ఓ వాయూ! నీవు మాయొక్క యాగమునుగూర్చి నూర్లకొలఁదియగు నట్టి, వేలకొలఁది యగునట్టి అశ్వములతో నీ కోర్కె పూర్తియగుటకు హవిస్సు లను భక్షించుటకు శీఘ్రముగారమ్ము.

౧౮౬౪. ఆ వాం రథో నియుత్వాన్ వక్షదవసే భిప్రయాంసి సుధితాని వీతయే

వాయో హవ్యాని వీతయే। పిబతం మధ్వో అన్ధసః పూర్వపేయం హి వాం

హితమ్। వాయవా చన్ద్రేణ రాధసా గత మిన్ద్రశ్చ రాధసా గతమ్॥ ౪॥

దం॥ ఓ వాయువా! యింద్రుని నిన్ను నియుత్తులను గుఱ్ఱాలంబూన్చిన రథము రక్షణకొఱకుఁ జక్కగ గ్రహింపఁబడిన సోమాదులను భక్షించుటకు చరుపురోడా శము మొదలగు వాటిని భక్షించుటకు పిలుచుకొనివచ్చుఁగాక. మధురమగు సోమ మును పానముసేయుఁడు ఎందుకంటే, అందఱి దేవతలకంటెను ముందుఁ ద్రావుటకు వాయువా! యింద్రా! మీ కిష్టముగనుక మనోహరమయిన గవాదిధనములతో రండు.

౧౮౬౫. ఆ వాం ధియో వవృత్యురధ్వరాఁ ఉపే మమిన్దుం మర్మృజన్త వాజిన

మాశుమత్యం న వాజినమ్। తేషాం పిబత మస్మయూ ఆ నో గన్తమిహోత్యా।

ఇన్ద్రవాయూ సుతానా మద్రిభిర్యువం మదాయ వాజదా యువమ్॥ ౫॥

దం॥ ఇంద్రవాయువులారా! మీకొఱకు స్తోత్రాదులను మాయజ్ఞములను దేశించి ప్రవర్తింపఁజేయుచున్నారు. మీకొఱకు వేగముగలట్టి యీసోమరసమును శీఘ్రగమనముగల అశ్వమునువలె దశాపవిత్రముచేత శోధించుచున్నారు. ఇంద్రవాయువులారా! ఆ యధ్వర్యులు కూర్చిన సోమములను పానముచేయుఁడు. ఇప్పుడు మాయజ్ఞముఁ గూర్చి రక్షణలతో రండు. మాయజ్ఞముఁ గోరుచున్న మీరు పాషాణములచేత దంచిపిండిన సోమములను మదముకొఱకు; మీరు అన్నము నిచ్చువారు కనుక; త్రావుఁడు.

౧౪౬౬. ఇమేవాం సోమా అప్స్వా సుతా ఇహా ధ్వర్యు భిర్భరమాణా అయంసత

వాయో శుక్రా అయంసత। ఏతేవామభ్య సృక్షతతిరః పవిత్రమాశవః।

యువా యవో తిరో మాణ్యావ్య యాసో మాసో అత్యవ్యయా॥ ౬॥

దం॥ ఓ వాయువా! మీ యిద్దఱిసంబంధమయిన యీ సోమరసములు మాచేఁ జేయఁబడుకర్మములందు ఈచోట దంచి పిండి అధ్వర్యులు ధరించినవై సిద్ధముగా నున్నవి. ఆ సోమములే ప్రకాశించునవియై యున్నవి. ఈ సోమములు అవిచ్ఛిన్నములగు రోమముల నతిక్రమించి పోవుచున్నవి. ఏ విధమయిన లోపము లేనివై సిద్ధపఱుపఁబడినవి. (రోమములంటే రోమముతోఁ జేసిన వస్త్రము.)

౧౪౬౭. అతివాయో ససతో యాహి శశ్వతో యత్రగ్రావా వదతితత్ర గచ్ఛతం

గృహమిన్ద్రశ్చ గచ్ఛతమ్। విసూనృతా దదృశే రీయతే ఘృతమా

పూర్ణయాని యుతా యాథో అధ్వర మిన్ద్రశ్చ యాథో అధ్వరమ్॥ ౭॥

దం॥ ఓ వాయువా! నీవు ఏప్రదేశమందు (సోమలతను దంచు) ఱాతిధ్వని వినఁబడుచున్నదో యెచటియజ్ఞగృహమును స్తుతివాక్కు ఎక్కువగాఁ జూడఁబడుచున్నదో హవ్యార్థమగు నేయి యెచటికి తీసికొని పోవఁబడుచున్నదో అచటికి నిద్రించుచుండు ననేక యజమానులను అతిక్రమించి రమ్ము. ఇంద్రుఁడుకూడ వచ్చుఁగాక. పుష్టిగలిగిన నియుదశ్వములతో మాయజ్ఞమునుద్దేశించి అభిముఖముగా మీరిద్దఱు రండు వాయూ! నీవును ఇంద్రుఁడును మాయాగమునుగూర్చి రండు.

౧౮౬౫. అత్రాహాతద్వహేథే మధ్వ ఆహుతిం యమశ్వత్థముప తిష్ఠన్త జాయవో

స్మే తే సన్తు జాయవః । సాకంగావః సువతే పచ్యతేయవో నతే వాయ

ఉపదస్యన్తి ధేనవో నాపదస్యన్తి ధేనవః॥ ౫॥

దం॥ ఇంద్రవాయువులారా! యీయజ్ఞమందే మధురమగు ఆ సోమరసము యొక్క ఆహుతిని ధరింపుడు. (పర్వతాదులందుండు) ఏ సోమమును యజమానులు కొనుటకుఁ జేరుచున్నారో (ఆ సోమరసమని పూర్వాన్వయము) మా సంబంధ మయిన కర్మనిర్వాహకులైన ఋత్విజులు యాగము నిర్వహింతురుగాక, ఇంద్రవాయువులారా! యీ యజ్ఞమందు గోవులు మీకు క్షీరమిచ్చుచున్నవి. యవాది ధాన్యాదులతోఁ బురోడాశము చేయఁబడుచున్నది. (ధాన్యం పిండిచేసి దానితో రొట్టె మాదిరి చేతురు అదిపురోడాశము) ఇంద్రవాయువులారా! ఆ గోవులు రోగాదులచేఁ గృశింపవు. ఆ ధేనువులు చోరాదులచే నపహరింపఁబడవు.

౧౮౬౬. ఇమే యేతే సువాయో బాహ్వో జసో న్తర్న దితే పతయన్త్యు క్షణో

మహివ్రాధ న్త ఉక్షణః । ధన్వఞ్చిద్యే అనాశవో జీరా శ్చి దగిరౌకసః ।

సూర్యస్యే వరశ్మయో దుర్నియ న్తవో హస్తయో దుర్ని యన్తవః॥ ౬॥

దం॥ ఓ వాయూ! సర్వావయవబలముగలట్టి, వయసులో నున్నట్టి, బాగుగ వృద్ధి నొందుచున్నట్టి, ఆబోతులువంటి, యే యశ్వములు కలవో అవి ద్యావాభూముల యొక్క మధ్యభాగమందు నిన్ను బొందించుచున్నవి. అన్తరిక్షమందుఁగూడ ఆలస్యము లేక శీఘ్రగమనముగల్గి యెచ్చటను నిలువనట్టి, సూర్యునియొక్క కిరణములు వలెను నిలుపనలవికానివై రెండు బాహువులచే బలాత్కారమున నిలుపఁబడనట్టివై చేర్చుచున్నవి.

## సూక్తము, ౧౩౬.

పరుచ్ఛేపఋషి, చివరది త్రిష్టుప్ఛంద, తక్కినవి అత్యష్టి. ౬, ౭ రుద్రదేవత,
తక్కినవి మిత్రావరుణ.

౧౮౭౦. ప్రసుజ్యేష్ఠంనిచిరాభ్యాంబృహన్న మోహవ్యంమతిం భరతామృళయ
ద్భ్యాంస్వాదిష్ఠం మృళయద్భ్యామ్ । తాసమ్రాజా ఘృతాసుతీ యజ్ఞేయజ్ఞ
ఉపస్తుతా । అథైనోఃక్షత్రం నకుతశ్చనా ధృషే దేవత్వం నూచిదాధృషే ॥౧॥

వం॥ ఋత్విజులారా! చిరకాలము నాటివారు యజమానుని సుఖింపఁజేయువారు రుచియయిన హవిస్సును భక్షించువారునగు మిత్రావరుణుల కొఱకు మిగుల మెచ్చదగిన స్తోత్రములను బూజ్యమగు హవిస్సునుగూడఁ జేయుఁడు. ఆ మిత్రావరుణులు మిగులఁ బ్రకాశించువారు వర్షము కలిగించువారు సను స్తయాగములందు ఋత్విజులచే స్తుతింపఁబడువారు. మఱియు నీ యిద్దఱియొక్క బలము ఏ శత్రువువల్లనుగూడఁ దొలఁగింప నశక్యము. ఈ యిద్దఱియొక్క దేవభావముగూడ నిరాకరింప నలవికానిది.

౧౮౭౧ అదర్శిగాతురురవే వరీయసీ పన్థా ఋతస్య సమయంస్త రశ్మిభిశ్చక్షుర్భ
గస్యరశ్మిభిః । ద్యుక్షంమిత్రస్య సాదనమర్యమ్ణో వరుణస్యచ ।
అథాదధాతే బృహదుక్థ్యంవయ ఉపస్తుత్యం బృహద్వయః॥ ౨॥

వం॥ సంచరించు స్వభావముకలట్టి, మిగుల శ్రేష్ఠమగునట్టి, యుషోదేవత విస్తీర్ణమయిన గమనవ్యాపారముకొఱకుఁ జూడఁబడెను. గమనశీలుఁడగు సూర్యునియొక్క మార్గము కిరణములచేత అందఱి కన్నులను జేరెను. మిత్రదేవతయొక్క స్థానమయిన యంతరిక్షము కాంతులకుఁ జేరియి కిరణములతోఁ గూడెను. వరుణుని స్థానము కూడ కిరణములతోఁ గూడెను. అందువల్ల స్తోత్రార్హమగు గొప్పహవిస్సును ధరించుచున్నారు. చేరువను స్తుతింపఁదగిన హవిస్సునుంగూడ ధరించుచున్నారు.

౧౪౭౨. జ్యోతిష్మతీ మదితింధారయత్క్షితిం స్వర్వతీమా సచేతే దివేదివే
జాగృవాంసా దివేదివే । జ్యోతిష్మత్క్షత్రమాశాతే ఆదిత్యాదానునస్పతీ ।
మిత్రస్య యోర్వరుణయో యాతయజ్జనోర్య మాయాత యజ్జనః॥ ౩॥

దం॥ ఈ యజమానుఁడు (అగ్నియొక్క) వెలుఁగుతోఁగూడి సంపూర్ణలక్షణములు గల ఉత్తరవేది స్థలమును ధరించుచున్నాఁడు. (అనఁగా బాగుచేయుచున్నాఁడు.) యాగమును నిర్వహించునట్టి యీ యుత్తరవేదిని ప్రతిదినమందు (మిత్రావరుణులు) ఆశ్రయించుచున్నారు. ప్రతిదినమందు మేల్కొల్పుచుఁ బ్రకాశించుచున్న బలమును అదితిపుత్రులు ఇష్టదాతలు నగు మిత్రుఁడు వరుణుఁడును బొందుచున్నారు. అర్యముఁడను దేవత ఆ యిద్దఱి మధ్యమునుండి స్వశక్తిచే వ్యాపారములందు జనులం బ్రేరించుచున్నాఁడు. వారివారికర్మలనుబట్టి పరలోకమునకు బంపుచున్నాఁడు.

౧౪౭౩. అయంమిత్రాయ వరుణాయ శంతమః సోమోభూత్వ వపానేష్వా భగో
దేవో దేవేష్వాభగః । తందేవాసో జుషేరత విశ్వేఅద్య సజోషసః ।
తథారాజా నాకర థోయదీ మహ ఋతావానాయ దీమహే॥ ౪॥

దం॥ ఈ (హోమముచేయుచున్న) సోమము మిత్రదేవునకుఁ బ్రీతిఁగలిగించునది అగుగాక. ముఖము వంచుకొని త్రాగుటతో ఆ మిత్రావరుణులు పొందఁదగినది యజమానులలోఁ బ్రకాశించునది సర్వదేవతలనుభవింపఁదగినది యగు ఆ సోమరసమును సమానప్రీతిగల్గి ప్రకాశమానులగు దేవతలందఱు ఈ దినమందు సేవించుచున్నారు. మిత్రావరుణులారా! యే కారణమువలన దేనిని కోరుచున్నామో దానిని మీరు అందుకై చేయుఁడు. ఓ సత్యవంతులగు (మిత్రావరుణు) లారా! ప్రార్థించుచున్నాము.

౧౪౭౪. యోమిత్రాయ వరుణాయావిధజ్జనో నర్వాణంతం పరిపాతో అంహసో
దాశ్వాంసంమర్తమంహసః । తమర్యమాభిరక్షత్యృజూయన్తమనువ్రతమ్ ।
ఉక్థైర్యఏనోః పరిభూషతివ్రతం స్తోమైరాభూషతి వ్రతమ్॥ ౫॥

వ॥ ఏ యజమానుఁడు మిత్రుఁడను దేవతను, వరుణుఁడను దేవతను సేవించుచున్నాఁడో యితరులను సేవింపనివాఁడై హవిస్సులనిచ్చునట్టి, ఆ మనుష్యుఁడయిన యజమానుని పాపమునుండి (మిత్రావరుణులు) రక్షింత్రుగాక. అర్యముడు కూడ సన్మార్గవర్తనుఁడగు యజమానుని యతని కర్మననుసరించి రక్షించును ఏ యజమానుఁడు స్తుతిమంత్రములచేత వారి నలంకరించుచున్నాఁడో వానిని రక్షించుచున్నారు.

౧౪౭౫. నమో దివే బృహతే రోదసీభ్యాం మిత్రాయ వోచం వరుణాయ మిాహ్ళుషే

సుమృళీకాయ మిాహ్ళుషే । ఇన్ద్రమగ్నిముపస్తుహి ద్యుక్షమర్యమణం

భగమ్ । జ్యోగ్జీవన్తః ప్రజయా సచేమహి సోమస్యోతీ సచేమహి॥ ౬॥

వ॥ ప్రకాశించునట్టి, గొప్పవాఁడయినట్టి సూర్యునకు నమస్కారమును పలుకుచున్నాము. ద్యావాభూములకు నమస్కారము పలుకుచున్నాము. మిత్రునకు వరుణునకును నమస్కారము పలుకుచున్నాము. సుఖమును గలిగించి యిష్టఫలములిచ్చు రుద్రునకు నమస్కారము చెప్పుచున్నాము. ఓ హోతా! యింద్రుని అగ్నిని దీప్తిగల అర్యముని భగుని సమీపించి స్తుతింపుము. చిరకాలము జీవించు మేము సంతతితోఁ గూడియుందుముగాక. సోముని రక్షణలతోఁగూడి యుందుముగాక.

౧౪౭౬. ఊతీ దేవానాం వయమిన్ద్రవన్తో మంసీమహి స్వయశసో మరుద్భిః ।

అగ్నిర్మిత్రో వరుణః శర్మ యంసన్ తదశ్యామ మఘవానో వయం చ॥ ౭॥

వ॥ ఇంద్రుఁడు కలవారమై కీర్తివంతులగు మరుత్తులచే ననుగ్రహింపఁబడిన మేము దేవతలరక్షణలం దలఁచుచున్నాము. అగ్ని, మిత్రుఁడు వరుణుఁడు సుఖమునిచ్చిరి. ఆ వరమును అన్నవంతులమగు మేము అనుభవింపఁగలము.

ఇట్లు ప్రథమాధ్యాయము సమాప్తము.

# ద్వితీయాధ్యాయము.

---

## సూక్తము. ౧౩౭

పరుచ్ఛేదఋషి. అతిశక్వరీఛంద, మిత్రావరుణదేవత.

౧౪౭౭. ఓమ్ సుషుమాయాత మద్రిభిర్గో శ్రీతామత్సరా ఇమే సోమాసో
మత్సరాఇమే । ఆరాజానాదివిస్పృశాస్మత్రా గన్త ముపనః ।
ఇమేవాంమిత్రా వరుణా గవాశిరః సోమాః శుక్రా గవాశిరః॥ ౧॥

దం॥ ఱాళ్లతో (దంచి) సోమరసము తీసియున్నాము. తృప్తిని గలిగించు ఈ సోమములు ఆవుపాలతోఁ గూర్పబడి యున్నవి. ఈ సోమములు (తక్కిన సోమముల కంటె) ఎక్కువ మదముగలిగించునవి. ప్రకాశించునట్టి, ద్యులోకవాసులైనట్టి మిత్రావరుణులారా! రండు. మమ్ము రక్షించుమీరు మాయజ్ఞమునకు రండు. ఓ మిత్రావరుణులారా! మీకొఱకు సోమరసములు క్షీరముతోఁ గూర్పఁబడి ఉదకముతోఁ గలిసి ప్రకాశించుచున్నవి,

౧౪౭౮. ఇమ ఆయాత మిన్దవః సోమాసో దధ్యాశిరః సుతాసో దధ్యాశిరః ।
ఉత వా ముషసో బుధి సాకం సూర్యస్య రశ్మిభిః ।
సుతో మిత్రాయ వరుణాయ పీతయే చారు ఋతాయ పీతయే॥ ౨॥

దం॥ ఓ మిత్రావరుణులారా! తృప్తిని గలిగించు నీ సోమరసములు పెరుగుతోఁ గూర్పఁబడినవై దంచి పిండబడినవై యున్నవి. రండు. మీ ప్రీతికొఱకు ఉషోదేవతయొక్కయు, సూర్యునియొక్కయు, గిరణములచేత గూడఁ బ్రకాశము గలిగి యుండగా సోమరసము పిండఁబడినది. మిత్రుని కొఱకు వరుణుని కొఱకును సోమరసము తీయఁబడినది. యజ్ఞమును నిర్వహించునట్టి పాపముకొఱకు భక్షింపఁదగిన సోమరసము తీయఁబడినది.

౧౪౭౯. తాంవాంధేనుం నవాసరీ మంశుం దుహన్త్యద్రిభిః సోమం

దుహన్త్యద్రిభిః । అస్మత్రా గన్త ముపనో ర్వాఞ్చా సోమపీతయే ।

అయంవాం మిత్రావరుణా నృభిః సుతః సోమ ఆపీతయే సుతః॥ ౩॥

దం॥ మమ్ము రక్షించు మిత్రావరుణులారా! మీసంబంధమైన లతారూపమైన సోమమును మిగుల పాలుగల ఆ గోవునుంబోలి పాషాణములచే పిదుకుచున్నారు. అట్టి సోమరసమును ఉదకముచల్లి పాషాణములచే పిండుచున్నారు సోమపానము కొఱకు మాకభిముఖులై యజ్ఞము గుఱించిరండు. మీ కొఱకీసోమము యజ్ఞనిర్వాహకులచేతఁ బిండబడినది. పూర్తిగ త్రాగఁదగినంత పిండఁబడినది.

---

## సూక్తము. ౧౩౮.

పరుచ్ఛేదఋషి - అత్యష్టిఛంద - పూషదైవత్యము

౧౪౮౦. ప్రప్రపూష్ణస్తు విజాతస్య శస్యతే మహిత్వమస్య తవసోనతన్దతే

స్తోత్రమస్య నతన్దతే । అర్చామిసుమ్న యన్నహమన్త్యూతిం మయోభువమ్ ।

విశ్వస్య యోమన ఆ యుయువే మఖో దేవ ఆ యుయువే మఖః॥ ౧॥

దం॥ అనేక యజమానుల రక్షించుటకుఁ బుట్టిన పూషదేవునియొక్క బలమాహాత్మ్యము మిగులఁబొగడఁబడుచున్నది. ఎవఁడును బాధింపఁజాలఁడు. ఈదేవుని స్తోత్రము ఎవఁడును విడువఁడు. అందువల్ల నేను (యజమానుఁడన్నమాట) సుఖము నపేక్షించువాఁడనై తోడనేరక్షించునట్టి సుఖమును గలుగఁజేయు నాదేవతను స్తుతించుచున్నాను. ఏదేవత యజ్ఞముకలవాఁడయి స్తోతలగు సకలఋత్విజులయొక్క మనస్సును సంతోషపెట్టుచున్నాఁడో ప్రకాశముగల యాదేవుఁడు యాగమును బూర్తిచేయుచున్నాఁడు.

౧౪౮౧. ప్రహి త్వా పూషన్నజిరం నయామని స్తోమేభిః కృణ్వ ఋణవో యథా

మృధఉష్ట్రోన పీపరో మృధః । హువే యత్త్వామయోభువం దేవం సఖ్యాయ

మర్త్యః । అస్మాక మాంగూషాన్ద్యుమ్ని నస్కృధి వాజేషు ద్యుమ్ని నస్కృధి॥ ౬॥

ద॥ ఓ పూష దేవుఁడా! యజ్ఞములను గుఱించి పోవునట్టి నిన్ను నీ గమనవిషయమై స్తోత్రములచే; శీఘ్రగమనవిషయమై అశ్వమును వలెను; స్తుతించుచున్నాను. మఱియు యుద్ధములను గుఱించి మీరు నడచునట్లు స్తుతించెదను. యుద్ధవీరులను ఒంటెవలెఁ గడ తేర్చుచున్నావు. కనుక నిన్ను సుఖకరుఁడగు దేవుఁడవని మనుష్యుఁడ నగు నేను స్నేహమునకై పిలుచుచున్నాను. ఇట్లు పిలువఁబడి మాయొక్క స్తుతి ధ్వనులను ప్రకాశించువానిగఁ జేయుము. యుద్ధములందు శత్రుజయముచే నన్నము గలవారలనుగఁ జేయుము.

౧౪౮౨. యస్య తే పూషన్త్సఖ్యే విపన్యవః క్రత్వా చిత్సన్తో వసా భుజిర ఇతి

క్రత్వా భుజిరే । త్వామను త్వా నవీయసీం నియుతం రాయఈమహే ।

అహేళమాన ఉరుశంస సరీభవ వాజే వాజే సరీభవ॥ ౭॥

ద౦॥ ఓ పూషదేవుఁడా! యే నీసఖ్యము విషయమై యోగ్యకర్మచేత సత్పురుషు లయిన స్తుతికర్తలు రక్షణతో భోగములనుభవించుచున్నారు. ఈలాగు సత్కర్మ లతో సంరక్షింపఁబడుచున్నారు. అట్టి స్తవనీయమైన రక్షను అనుసరించి నిన్ను నియుత (=లక్ష) సంఖ్యగల ధనమును యాచించుచున్నాము. మిగుల స్తుతింపఁదగు వాఁడా! నీవు కోపము లేనివాఁడవై మాచే నాశ్రయింపఁ దగువాఁడవుకమ్ము. నీవు ప్రతియుద్ధమందు ముందు నడచువాఁడవు కమ్ము.

౧౪౮౩. అస్యా ఊషుణ ఉపసాతయే భువోఽహేళ మానో రరివా అజాశ్వ

శ్రవస్యతామజాశ్వ । ఓషు త్వా వవృతీ మహి స్తోమేభిర్దస్మ సాధుభిః ।

నహి త్వా పూషన్నతిమన్య ఆఘృణే న తే సఖ్య మపహ్నువే॥ ౮॥

దం॥ ఓ, పూష దేవా! యీ మాలాభమునకు అనాదరము చేయక దాతవై బాగుగ సమీపమందున్నవాఁడవు కమ్ము. మఱియు అన్నము కోరిన మాకు మేకలను, గుఱ్ఱములను ఇచ్చుదేవా! నీవు దాతవై దగ్గఱ చేరినవాఁడవుకమ్ము. శత్రునాశకుఁడా! నిన్ను మిక్కిలి మంచివగు స్తోత్రములతో మరల్చుచున్నాము. ఓ పూష దేవా! వర్షముకురిపించువాఁడా! నిన్ను దిరస్కరింపము. నీయొక్క సఖ్యమును దాఁచక ప్రకటింతుము.

---

## సూ క్త ము, ౧౩౯.

పరుచ్ఛేదఋషి, ౫ బృహతి. చివరది త్రిష్టుప, ఇతరములు
అత్యష్టులు, విశ్వేదేవదేవత

౧౪౮౪. అస్తు శ్రౌషట్ పురో అగ్నిం ధియాదధ ఆనుత చ్ఛర్ధో దివ్యం వృణీమహ
ఇన్ద్రవాయూ వృణీ మహే । యద్ధక్రాణా వివస్వతి నాభా సందాయి నవ్యసీ।
అధ ప్రసూన ఉప యన్తు ధీత యో దేవా అచ్ఛా నధీతయః॥ ౧॥

దం॥ నేను ఉత్తరవేదియందు ఆహవనీయాగ్నిని కర్మచేతనిల్పితిని. అట్టి దివ్యమైన బలమును శీఘ్రిముగ పొందుచున్నాము. ఇంద్రవాయువులను సేవించుచున్నాము. ఎందువల్ల ప్రకాశించుచున్న యజ్ఞమందు స్వప్రకాశము గలిగించు స్తుతిరూపమయిన వాక్కుచేయఁబడుచున్నదో అందువల్ల. మాస్తుతి విద్ధువుగాక. అనన్తరము కర్మములు మిమ్ముఁ జక్కగాఁ జేరుఁగాక అగ్న్యాదిదేవతలను ప్రీతితోఁ బొందుటకుఁ జేయఁబడుకర్మలు వారివద్దకుఁ బోవునుగాక.

౧౪౮౫. యద్ధత్య న్మిత్రావరుణా వృతాదధ్యా దదాథే అనృతం స్వేనమన్యు నా
దక్షస్య స్వేనమన్యునా। యువో రిత్థాధి సద్మ స్వపశ్యా మహిరణ్యయమ్ ।
ధీభిశ్చన మనసా స్వేభి రక్షభిః సోమస్య స్వేభిరక్షభిః॥ ౨॥

దం॥ ఓ మిత్రావరుణులారా! సూర్యునివల్ల స్వయముగా మననీయమయిన స్వకీయమగు తేజస్సుచేత నశ్వరమయిన ఆ యుదకమును ఏ కారణమువల్ల నధికముగా మీరిచ్చుచున్నారో అందుచేత మిత్రావరుణులారా! మీ సంబంధమైన బంగారుతో నిండిన రూపమును ఈ విధముగా యజ్ఞగృహములందుఁ గర్మలచేతను మనస్సుతోను తమ చక్షురాదీంద్రియములతోను, మనస్సుతోను, ఇంద్రియములతోను చూచెదము. (సర్వత్రా పునరుక్తి ఆదరార్థము.)

౧౭౨౬. యువాంస్తోమే భిర్దే వయన్తో అశ్వినా శ్రావయన్త ఇవశ్లోక మాయవో

యువాం హవ్యాభ్యృతే యవః। యువోర్విశ్వా అధిశ్రియః పృక్షశ్చ విశ్వ

వేదసా। ప్రుషా యన్తే వాం పవయో హిరణ్యయే రథే దస్రా హిరణ్యయే॥ ౩॥

దం॥ ఓ అశ్వినీదేవతలారా! స్తోత్రములచేత ప్రార్థించుచు హవిస్సులతో మిమ్ముఁ గోరుచున్న యజమానులు మీస్తుతివాక్యమును పఠించుచున్నారు. అన్నముకూడ అధికముగఁ బొందుచున్నారు. శత్రునాశకులారా! మీ సువర్ణవికారమయిన దేనెతో నిండిన రథమందు కమ్ములు తేనెకార్చుచున్నవి. (హమ్మి—చక్రమునంచు) అట్టిమనోహర రథమందు మంచిహవిస్సును ధరింపుఁడు.

౧౭౨౭. అచేతిదస్రా వ్యు! నాకమృణ్వథో యుఞ్జతేవాం రథయుజో దివిష్టిష్వధ్వ

స్మానో దివిష్టిషు। అధివాం స్థామవన్ధురే రథే దస్రాహిరణ్యయే।

పథేవయన్తా వను శాసతారజో ఞ్జసా శాసతారజః॥ ౪॥

దం॥ ఓ యశ్వినులారా! మీపనియందఱకుఁ దెలియఁబడుచున్నది. దుఃఖరహితమైన యజ్ఞముగుఱించియు విశేషముగఁబోవుచున్నారు. అందునిమిత్తము మీసారథులు యజ్ఞమునకుఁ బోవుటకై రథమందు ఆకాశగమనమందును రథికుని, రథమును, నొప్పింపక మిమ్ము నుంచుచున్నారు. అశ్వినులారా! ఆకాశమందు స్వర్గముగుఱించిపోవుచున్నట్టి శత్రువులనుల్లాంగదీయునట్టి ప్రధానమయిన వర్షోదకమునుగలిగించునట్టి మిమ్ము మూఁడునొగలుగలుగు బంగారురథమందుంచుచున్నాము.

౧౭౮౮. శచీభిర్నః శచీవసూ దివానక్తం దశస్యతమ్ ।

మా వాంరాతి రుపదసత్కదాచ నాస్మద్రాతిః కదాచన॥ ౫॥

తా॥ కర్మ లేధనముగాఁగల యశ్వినులారా! మీరు కర్మలచేత రాత్రింబగళ్లు కోరి నఫలములిండు. మీదానము ఎల్లకాలమును లోపము లేకుండుఁగాక. మాదానము కూడ అన్నియవస్థలందును నశింపకుండుఁగాక.

౧౭౮౯. వృషన్నిన్ద్ర వృషపాణా స ఇన్ద వఇమే సుతా అద్రి షుతాస ఉద్భిదస్తుభ్యం

సుతాస ఉద్భిదః । తేత్వా మన్దన్తు దావనే మహే చిత్రాయరాధసే ।

గీర్భిర్గిర్వాహః స్తవమాన ఆగహి సుమృళీకోన ఆగహి॥ ౬॥

తా॥ వర్షించునట్టి యింద్రా! నీవు త్రాగఁదగినట్టి, రాళ్లచేఁ బిండఁబడినట్టి, వర్షముకలిగించునట్టి, జలమును బుట్టించునట్టి సోమరసములు అభిషవింపఁబడ్డవి (=దంచి పిండఁబడ్డవని తా.) అట్టి సోమములు నిన్ను దానముతో యజ్ఞములందు నెక్కువగా దినదినము వృద్ధినొందిన ధనముకొఱకు తృప్తినొందించుఁగాక. స్తుతులు ధరించినట్టి, యింద్రా! స్తుతులచేత స్తుతింపఁబడుచున్నవాఁడవై రమ్ము. మమ్ము సుఖపఱచువాఁడవై రమ్ము.

౧౭౯౦. ఓషూణో అగ్నే శృణుహిత్వమీళితో దేవేభ్యో బ్రవసియజ్ఞియేభ్యో

రాజభ్యో యజ్ఞియేభ్యః । యద్ధత్యామఙ్గిరోభ్యో ధేనుందేవా అదత్తన ।

వితాం దుహ్రే అర్యమాకర్తరీ సచాఁ ఏషతాం వేదమేసచా॥ ౭॥

తా॥ అగ్నీ! నీవు మా సంబంధమగు ఆవాహనమును (ఆవాహనము = పిలుపు) మాచే స్తుతింపఁబడుచుఁ బ్రీతితో వినుము. ప్రకాశించునట్టి హవిర్భాగార్హులయిన దేవతలకొఱకు యాగకర్తలమగు మాకర్మమును జెప్పుము. ప్రసిద్ధమయిన యే గోవును దేవతలు అంగిరోవంశసులగు ఋషులకొఱకు నిచ్చిరో ఆ ధేనువును అర్యముఁడు పిదికెను. ఈ యర్యముఁడను దేవత ఆ ధేనువును నాతోఁగూడఁ దెలిసికొనుచున్నాఁడు.

౧౪౯౧. మోషువో అస్మదభితాని పౌంస్యాసనా భూవంద్యుమ్నానిమోతజారిషు
రస్మత్పురోత జారిషుః । యద్వశ్చిత్రం యుగే యుగేనవ్యం ఘోషా
దమర్త్యమ్ । అస్మా సుతన్మరుతో యచ్చదుష్టరం దిధృతాయచ్చదుష్టరమ్॥౮॥

దం॥ ఓ మరుత్తులారా! మీసంబంధమైనట్టి ఆబలములు నిత్యములైనవి. ప్రకాశ ములైనవి. మమ్ముఁ దొలఁగిపోకుండుఁగాక. మఱియుమాధనములు క్షీణములుకాకుం డుఁగాక. మాసంబంధమగు పురాతన ప్రాణము నశింపకుండుఁగాక. మీసంబంధమై నచిత్రవర్ణమైన నూతనమైన మనుష్యదుర్లభమైన గౌమాదులు ప్రతికాలమందు మా కుఉండుఁగాక. మరుత్తులారా! యేదుస్తరమయినధనమును మీరుంచుకొనియున్నారో అదిమాయందుండుఁగాక. ఏధనము శత్రువులచే హింసింపఁబడునట్టిదో ఆ ధనమును మాయందుంచుడు.

౧౪౯౨. దధ్యఙ్మే జనుషం పూర్వో అఙ్గిరాః ప్రియమేధః కణ్వో అత్రిర్మ
నుర్విదుస్తే మే పూర్వే మనుర్విదుః । తేషాం దేవేష్వాయతిరస్మాకం
తేషునాభయః । తేషాంపదేన మహ్యానమే గిరేన్ద్రాగ్నీ ఆనమేగిరా॥ ౯॥

దం॥ దధ్యజ్ఞను ఋషి పూర్వుఁడయిన అంగిరోఋషి ప్రియమేదుఁడను ఋషి అత్రిమహర్షి (అత్రి = మూఁడు దుఃఖములు లేనివాఁడని వ్యు.) మనుమహర్షి కణ్వ మహర్షి యను పూర్వకాలీనులగు జ్ఞానులైన ఋషులు దివోదాసుని కొడుకున నయిన నాయొక్క జన్మమును ఎఱుఁగుదురు. ఆదధ్యఙ్ఙాదులకుఁ బూర్వఋషులందు దీర్ఘకాలసంబంధము కలదు. మాయొక్క ఫలయాగములు (= కామ్య) వారియందే ఉన్నవి. ఆ దధ్యఙ్ఙాదులయొక్క మహత్త్వముచేత స్తోత్రవాక్కుతో మిగుల నమస్క రించుచున్నాను. వారియొక్క అనుగ్రహముచేత యాగయోగ్యుఁడనయి యింద్రా గ్నులను స్తుతివాక్కుచే స్తుతించుచున్నాను.

౧౪౯౩. హోతా యక్షద్వని నోవన్త వార్యం బృహస్పతిర్య జతివేన ఉక్షభిః

పురువారేభిరుక్షభిః । జాగృభ్మా దూరఆదిశం శ్లోకమద్రేరధత్మనా ।

అధారయదర రిన్దాని సుక్రతుః పురూసద్మాని సుక్రతుః॥ ౧౦॥

దం॥ హోతయనుఋత్విజుఁడు యాజ్యను, (=అవాకమంత్రము) హవిస్సుకోరిన దేవతలు రమ్యమయిన సోమమును బొందుదురుగాక. అధ్వర్యుఁడు దేవతానుగ్రహమపేక్షించువాఁడై చలువనిచ్చునట్టి అనేకులు కోరునట్టి వర్షజలములను గలిగించునట్టి సోమములచే యాగమొనర్చుచున్నాఁడు. మేము (యజమానులము) దూరమునుండి ఆజ్ఞాపించునట్టి అభిషవశిలయొక్క ధ్వనిని చెవులార వినుచున్నాము. తరువాత సత్కర్మలుచేయునట్టి యీయధ్వర్యుఁడు అభిషవసాధకములగు నుదకములను ధరించుచున్నాఁడు. మంచిప్రజ్ఞకలట్టి యీయధ్వర్యుఁడు అనేకములగు గృహములను ధరించుచున్నాఁడు.

౧౪౯౪. యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యామధ్యేకాదశస్థ ।

అప్సుక్షితో మహినైకాదశస్థ తే దేవాసో యజ్ఞమిమం జుషధ్వమ్॥ ౧౧॥

దం॥ ప్రకాశించునో దేవతలారా! యే మీరు ద్యులోకమందు పదునొకండ్రై ఉన్నారో అట్లే భూమియందు పదునొకండ్రు ఉన్నారో ఆకాశనివాసులై పదునొకండ్రు మహత్త్వముతో నున్నారో దేవతలారా! ఆ మీరు ఈయజ్ఞసంబంధమైన హవిస్సును బొందుఁడు.

---

అనువాకము. ౨౧.

సూక్తము ౧౪౦.

దీర్ఘతమర్షి - ౧౨ - ౧౩ త్రిష్టుభలు తక్కినవి జగతులు - అగ్నిదేవత.

౧౪౯౫. వేదిషదే ప్రియధామాయ సుద్యుతే ధాసి మివప్రభరాయోనిమగ్నయే ।

వస్త్రేణేవ వాసయా మన్మనా శుచింజ్యోతీరథం శుక్రవర్ణం తమోహనమ్॥ ౧॥

దం॥ ఓ అధ్వర్యుఁడా! వేదియందున్నట్టి ఉత్తరవేదియందు ప్రేమగలట్టి మంచిప్రకాశముగలట్టిఅగ్నికొఱకు స్థానమును హవిస్సులనువలె సంపాదింపుము. నేయిమొదలగువాటికాధారమయిన ప్రకాశించువర్ణముగల అంధకారమును బోగొట్టుచున్న ఆ స్థానమును వస్త్రముతోనువలెను దర్భలతో ఆచ్ఛాదింపుము.

౧౪౯౬. అభిద్విజన్మాత్రి వృదన్నమృజ్యతే సంవత్సరే వావృధే జగ్ధమీ పునః।

అన్యస్యాసా జిహ్వ యాజేన్యో వృషాన్య న్యేనవనినో మృష్టవారణః॥ ౨॥

దం॥ రెండరణులనుండి పుట్టినఅగ్ని మూఁడువిధములైన (నేయి - పురోడాశము - సోమము) అన్నమును భక్షించుచున్నాఁడు. ఈతినఁయన్నము సంవత్సరము పూర్తికాఁగానే మరలయజమానుని వృద్ధినందించును (అనఁగాయాగసమర్థునిఁజేయును. ఈ యగ్నివర్షముకురిపించువాఁడు అయి యితరహవిస్సుయొక్క ముఖముతో జిహ్వారూపమగు సుక్కుతో (గరిటెవంటి హోమసాధనము) వృద్ధినొందుచున్నాఁడు. దావాగ్నిరూపముతో సర్వమును వారించుచు నరణ్యవృక్షములను దహించుచున్నాఁడు.

౧౪౯౭. కృష్ణప్రుతౌ వేవిజే అస్యసక్షితా ఉభాతరేతే అభిమాతరా శిశుమ్।

ప్రాచా జిహ్వాంధ్వనయన్తం తృషుచ్యుత మాసాచ్యంకుపయం వర్ధనంపితుః॥ ౩॥

దం॥ ఈ యగ్నియొక్క (మథనకాలమందు) నల్లనయినట్టి, సమానముగ నగ్నిని గలిగించునట్టి, ఇద్దఱుతల్లుల విధముగ నున్నట్టి యరణులు మాటిమాటికి జలించుచున్నవి. (అరణి = రాపాడిచి అగ్నినిదీయుకఱ్ఱలు) మొదటిజ్వాలయేనాల్కగాఁ గలయట్టి, జీకటిని ధ్వంసము చేయుచున్నట్టి, మూతవేయదగినట్టి, పాలకుఁడయిన యజమానుని వృద్ధిపొందించునట్టి, శిశుధర్మముగలట్టి అగ్నిని గలుగఁజేయుచున్నవి. (యజమానుఁడు తండ్రిగాను, అరణులు తల్లులుగాను, అగ్ని శిశువుగాను వర్ణించినాఁడు.)

౧౪౯౮. ముముక్ష్వో౩ మనవే మానవస్యతే రఘుద్రువః కృష్ణసీతా సఊజువః।

అసమనా అజిరాసో రఘుష్యదో వాత జూతా ఉపయుజ్యన్త ఆశవః॥ ౪॥

దం॥ జ్ఞానముగలట్టి ఋత్విజులనపేక్షించుచున్న యజమానుని బ్రహ్మలోకమును జేర్చునట్టి శీఘ్రగమనముగల్గి నల్లనికాంతిగలట్టి శీఘ్రకారులగునట్టి సమానముఖములుకానట్టి, చలించునట్టి, శీఘ్రముగ నెండించునట్టి, వాయువుచేతఁ బ్రేరింపఁబడినట్టి, సర్వత్రవ్యాపించు చున్నట్టి, అగ్నిజ్వాలలు (ఋత్విజులచేత) నుపయోగింపఁబడు చున్నవి.

౧౪౯౯. ఆదస్య తే ధ్వసయన్తో వృథేరతే కృష్ణమభ్వంమహివర్పః కరిక్రతః ।

యత్సీం మహీమవనిం ప్రాభిమర్మృశదభిశ్వసన్ స్తనయన్నేతి నానదత్॥ ౫॥

దం॥ ఆ తరువాత స్తుతింపఁబడుచున్న అగ్నియొక్క ప్రసిద్ధములై చీఁకటిఁబోఁగొట్టుచున్న నల్లనయి యితరులు చేరశక్యముగానట్టి యెక్కువయి ప్రకాశము నధికముగాఁ జేయునట్టి అగ్నికణములు గొప్పదగు భూమిని యెల్లచోట్ల నెపుడు వ్యాపించెనో అపుడుసర్వత్ర వ్యాపించిన ధ్వనిచేయునగ్ని మిగుల శబ్దించుచుఁ బోవుచున్నాఁడు.

౧౫౦౦. భూషన్నయో ధిబభ్రూషునమ్నతే వృషేవపత్నీ రభ్యేతి రోరువత్ ।

ఓజాయమాన స్తన్వశ్చశుమ్భతే భీమోనశృఙ్గాదవిధా వదుర్గృభిః॥ ౬॥

దం॥ ఏయగ్ని పచ్చని యోషధులయందు నెక్కువగాఁ బ్రవేశించుచున్నదో ఆ యగ్ని సకలమును అలంకరింపఁజేయునదివలెను, ఆఁబోతువలెను, దన్నుబాలించు నోషధులను మిగుల ధ్వనింపఁజేయుచున్నది. ఇట్లుచేసి తేజోరూపుఁడై తనజ్వాలలను అగ్ని పోషించుచున్నాఁడు. పట్టశక్యముగాక భయంకరమృగమువలె కొమ్ములవలెనున్న జ్వాలలను మిగుల జలింపఁ జేయుచున్నారు.

౧౫౦౧. ససంస్తిరో విష్టిరః సంగృభాయతి జానన్నేవజానతీ ర్నిత్య ఆశయే ।

పునర్వర్ధన్తే అపియన్తి దేవ్యమన్యద్వర్పః పిత్రోః కృణ్వతే సచా॥ ౭॥

దం॥ ఆ యగ్ని మూర్తఁబడి విస్తరించినవాఁడై ఓషధులను గ్రహించుచున్నాఁడు. ఈ యగ్ని యజమానుని యుద్దేశము తెలిసికొని జ్వాలలను ఎడ తెగక ఆశ్రయింప చున్నాఁడు. మరల నా జ్వాలలు వర్ధిల్లుచున్నవి. యాగయోగ్యమగు నగ్నిని బొందుచున్నవి. ఈ జ్వాలలు అగ్నితోఁగూడ. ద్యావాభూములకు విలక్షణ తేజోరూపమయిన ఆకారమును జేయుచున్నవి.

౧౫౦౨ తమగ్రుపః కేశినీః సంహి రేభిర ఊర్ధ్వాస్తస్థుర్మమ్రుషీః ప్రాయవే పునః ।

తాసాంజరాం ప్రముఞ్చన్నేతి నానదదసుం పరం జనయం జీవమస్తృతమ్॥ ౮॥

దం॥ ఆ యగ్నిని వ్రేళ్లవంటి నల్లదనముగలట్టి, జ్వాలలు ఆలింగనము చేసికొనుచున్నవి. బొగ్గుగానయినను తమవద్దకువచ్చు నగ్నికొఱకు ఊర్ధ్వముఖములై ఎదురుకొనుచున్నవి. ఆ యగ్ని ఆ జ్వాలలయొక్క ముదిమిని బోఁగొట్టుచు నిరతిశయము నిర్బాధమునగు ప్రాణధారణమును గలుగఁజేయుచుఁ బ్రసరించుచున్నాఁడు.

౧౫౦౩. అధీవాసం పరిమాతూరిహన్నహ తువిగ్రేభిః సత్వభిర్యాతి విజ్రయః ।

వయోదధత్పద్వతే రేరిహత్సదాను శ్యేనీ సచతే వర్తనీరహ॥ ౯॥

దం॥ ఈ దావాగ్ని భూమికిఁ బైకప్పుగానుండు పొదలను తుప్పలను అంతటఁ గలుఁగజేయును. మిగుల ధ్వనించు జంతువులతోఁగూడి వేగముతో పలువిధములఁ బోవుచున్నది. ప్రసిద్ధమేకదా! జంతువులకొఱకు వాటివాటికి దగినయన్నములను ఇచ్చుచు నెల్లపుడు గడ్డి మొదలగు వాటిని దహించుచు శ్యామవర్ణమైన మార్గము పోవుచున్న యగ్నిననుసరించు పోవుచున్నది. (కార్చిచ్చు దహించిన తనువాత వర్షముకురియఁగానే గడ్డితుప్పలు చెట్లు మొలచి భూమినలంకరించుచున్నవని. తా.)

౧౫౦౪. అస్మాకమగ్నే మఘవత్సుదీదిహ్యధశ్వసీవాన్వృషభో దమూనాః ।

అవాస్యాశిశుమతీరదీదేర్వర్మేవయుత్సు పరిజర్భురాణః॥ ౧౦॥

దం॥ ఓ యగ్నీ! మాసంబంధమైన యాగములందు ప్రజ్వరిల్లుము. తర్వాత జ్వాలలతోఁ బ్రజ్వలించి మాయుభయుతము నిచ్చువాఁడవు శాంతమనస్కుఁడవుకమ్ము.

ఆ నీవు చిన్నచిన్నజ్వాలలను వదలి యుద్ధములందు కవచమువలె (శత్రువుల) మాటిమాటికి రానివ్వకుండ జేసి మిగులఁ బ్రకాశింపుము.

౧౫౦౫. ఇదమగ్నే సుధితం దుర్ధితాదధిప్రియాదు చిన్మన్మనః ప్రేయో అస్తుతే ।

యత్తేశుక్రంతన్వో౽రోచతే శుచితే నాస్మభ్యం వనసే రత్నమాత్వమ్ ॥౧౧॥

దం॥ ఓ యగ్నీ! కష్టముతోఁ జేయఁబడిన కట్టెలమీఁదను ఉంచిన హవిస్సు నీకు మెచ్చుకొనఁదగిన వస్తువుకంటె బ్రియమైనది అగునుగాక. నీ శరీరమైన జ్వాలయొక్క నిర్మలమైన యే తేజస్సు ప్రకాశించుచున్నదో ఆ తేజస్సుతో రత్నములను నీవు మాకు నిచ్చుచు మమ్ముఁ బొందుము.

౧౫౦౬. రథాయనావ ముతనో గృహాయనిత్యారిత్రాం పద్వతీరాస్యగ్నే ।

అస్మాకంవీరాఁ ఉతనో మఘోనో జనాంశ్చయా పారయాచ్ఛర్మయాచ ॥౧౨॥

దం॥ ఓ యగ్నీ! సమర్థుఁడగునట్టి, సర్వాధారుఁడయినట్టి యజమానుని కొఱకు ఋత్విజులనెడు (ఓడగడపె) తెడ్డులుగలట్టి, (ద్రవ్య దేవతా మంత్రములనెడు) పాదములుగలట్టి, (సంసారమును దాటించు) ఓడను సంపాదించుము. మఱియు నే యోడ మాకుఁ బుత్రపౌత్రాదులు అన్నము (అనఁగా హవిస్సులు) కలవారిగాఁ జేయునో యేది యజమానులను సంసారములో నొడ్డుజేర్చునో, యేది సుఖమును గలిగించునో అట్టి (యోడయని పూర్వాన్వయము.)

౧౫౦౭. అభీనో అగ్న ఉక్థమిజ్జుగుర్యా ద్యావాక్షామా సింధవశ్చస్వగూర్తాః ।

గవ్యంయవ్యం యన్తో దీర్ఘాహేమం వరమరుణ్యో వరన్త ॥౧౩॥

దం॥ ఓ యగ్నీ! మాయొక్క స్తుతిమాత్రమును స్తుతించుము. భూమ్యాకాశములు మమ్ముఁ బ్రోత్సాహపఱచుగాక. (పంటలచేత - వర్షముచేత నని తా.) స్వేచ్ఛముగా స్రవించునదులు గోక్షీరాదులను (సస్యములద్వారా) పురోడాశాదులను గలిగించు (చుండుఁగాక) ఎఱ్ఱని ఉషస్సులు కలకాలము అన్నమును శ్రేష్ఠమగు నితర వస్తువులనుగూడఁ గలిగించుఁగాక.

## సూక్తము. ౧౪౧.

దీర్ఘతమస్సు, అగ్ని దేవత, చివరరెండు త్రిష్టుభులు, తక్కినవి జగతులు,

౧౫౦౮. బళిత్థా తద్వపుషే ధాయిదర్శతం దేవస్య భర్గః సహసో యతోజని ।
యదీముపహ్వరతే సాధతే మతిర్ఋతస్యధేనా అనయన్త సస్రుతః॥ ౧॥

దం॥ బలమువల్లఁ బుట్టినందున ప్రకాశించుచున్నదై జీవరాసులన్నిటి శరీర (వ్యవహార) మునకును ఆ కనఁబడుచున్న సూర్యుని తేజస్సును ధరింపఁబడుచున్నది. ఇది ప్రసిద్ధము అగ్ని తేజస్సును మాబుద్ధి చేయుచున్నది. అది కోర్కెలు సాధించుచున్నది (అగ్ని ప్రాణుల) వాక్కులును అగ్ని తేజస్సువల్ల సమానముగాఁ బ్రవర్తించుచున్నవి. జగద్వ్యవహారము నిర్వహించుచున్నవి. (మంత్రవాక్కులని తాత్పర్యము వ్రాసిరి.)

౧౫౦౯. పృక్షో వపుః పితుమాన్నిత్య ఆశయే ద్వితీయ మాసప్తశివాసు మాతృషు ।
తృతీయమస్య వృషభస్య దోహసే దశప్రమతింజనయన్త యోషణః॥ ౨॥

దం॥ ఈ యగ్ని యన్నసాధకము, శరీరాభివర్ధకము, హావిర్లక్షణాన్నము కలది, శాశ్వతమయినది. (భూమియందు) ఉన్నది. శుభమయినదై యేడులోకములందును రెండవయగ్ని (విద్యుద్రూపాగ్ని) కలదు. ఈ యెపటి సూర్యునిలోనుండి వర్షము కురిపించుటకు మూఁడవరూపము బయలుదేరినది. ఇట్లు పదిదిక్కులందుఁ బ్రసరించు బుద్ధికల యీతనిం బది దిక్కులుగన్నవి.

౧౫౧౦. నిర్యదీం బుధ్నాన్మహిషస్య వర్పస ఈశానాసః శవసా క్రన్త సూరయః ।
యదీ మనుప్రదివో మధ్వ ఆధవే గుహాసన్తం మాతరిశ్వా మథాయతి॥ ౩॥

దం॥ ఏ హేతువుచేత మొదటినుండి ఋత్విజులు మేధావంతులై బలముచేత యాగరూపమగు నీ యగ్నిని సాధించుచున్నారో; మఱియు నే హేతువుచేత దానిననాదికాలమునుండి మధురమయిన (హవిస్సులను) దానిలో వేయుటకు వేదియందు గూఢముగా (యజమాను) లుంచిరో; వాయువు ఏ యగ్నిని ప్రబలమగునట్లు చేయుచున్నాఁడో; ఆయగ్ని ఆకారణముచేత స్తుతింపఁదగును.

౧౫౧౧. ప్రయత్పితుః పరమాన్నీ యతే పర్యాపృక్షుధో వరుధోదం సుకోహతి ।
ఉభాయదస్య జనుషం యదిన్వత ఆదిద్యవిష్ఠో అభవఘృణాశుచిః॥ ४॥

టీ॥ ఎందుచే(పశురూపమయిన) హవిస్సు; దాని ఉత్కృష్టతకొఱకు అగ్నిచుట్టును త్రిప్పబడుచున్నదో (పశువు నగ్నిచుట్టును త్రిప్పెదరు) బాగుగ భక్షింపఁదగిన తుప్పలు తీగలును అగ్ని దంతములలో ప్రవేశించుచున్నవో, (జ్వాలలే యగ్నికి దంతములని తా.) ఏ హేతువుచేత రెండును (అరణులు) అగ్ని జన్మకు హేతువులగుచున్నవో, ఆకారణముచేత శుద్ధమయిన యీ యగ్ని కాన్తిగల్గి యౌవనవంతుఁడయ్యెను. (అరణి = మథించి యగ్నిని తీయు కఱ్ఱలు)

౧౫౧౨. ఆదిన్మాతౄరావిశద్యా స్వాశుచిరహింస్యమాన ఉర్వియావివావృధే ।
అనుయత్పూర్వా అరుహత్సనాజువో నినవ్యసీష్వవరా సుధావతే॥ ౫॥

టీ॥ తల్లులయిన యే (దిక్కులందు) ఇతరబాధలు లేకుండ నగ్నిఅధికముగా వృద్ధి నొందెనో ఆపది దిక్కులందు నీయగ్నిప్రకాశించుచు ఆవయసురాగానే ప్రసరించెను. ఏవయస్సునఁజాలకాలము వఱకును మొలవకుండి (అగ్నిసంపర్కములేని) నమొదటి తుప్పలుచెట్లు మొదలగునవి క్రమక్రమముగా మొలచినందున క్రొత్తవిచిన్నవియగు వాటియందు మెల్లగాఁ బ్రసరించెనో ఆ వయసు రాగానే యీ యగ్ని ప్రసరించెను. (అని పూర్వాన్వయ)

౧౫౧౩. ఆదిద్ధోతారం వృణతే దివిష్టిషు భగమివపపృచానా సఋఞ్జతే ।
దేవాన్యత్క్రత్వా మజ్మనా పురుష్టుతో మర్తం శంసంవిశ్వధావేతిధాయసే॥ ౬॥

టీ॥ దేవతలను బిలచు నగ్నిని ద్యులోకమార్గములందు సేవింతురు. అనన్తర మందు హవిస్సులతోఁ గూడిన యజమానులు; రాజును బూజించునట్లు; పూజింతురు. ఏ హేతువువల్ల నీ యగ్ని స్తుతులును సకలధనములు గలవాఁడగుచు బహుమందిచేత బహుధాస్తుతింపఁ బడుచు క్రతువుచేతను, మంత్రబలముచేతను ఒప్పుచున్న యజమాన ఋత్విజులను, హవిస్సులను గోరునో (అందుచేత బూజింతురని పూర్వాన్వయము.)

౧౫౧౪. వియస్థాద్య జతో వాతచోదితో హ్వారో నవక్వా జరణా అనాకృతః ।
తస్యపత్మన్ దక్షుషః కృష్ణజంహసః శుచిజన్మనో రజ ఆవ్యధ్వనః ౭॥

దం॥ వాయువుచేతఁ బ్రేరింపబడి యెపుడీయగ్ని యజ్ఞమున కర్హుడై; అనివారితుడై బహువక్తయగు విదూషకుఁడు (= హాస్యగాఁడు) వలె, వివిధకర్మలాచరించుచుండునో అపుడు తన మార్గమందు నన్నిటిని గాల్చుచు నల్లని మార్గము కలిగి పవిత్రమయిన జ్వాలలతో నుండు నగ్నిని లోకము సేవించును.

౧౫౧౫. రథో న యాతః శిక్వభిః కృతో ద్యామఙ్గేభి రరుషేభి రీయతే ।
ఆదస్య తే కృష్ణాసోదక్షి సూరయః శూరస్యేవ త్వేషథా దీషతే వయః॥ ౮॥

దం॥ తాళ్లతోఁ గట్టిన రథమువలె నీయగ్ని స్థాపితుఁడై ప్రసరించుచున్న జ్వాలలతో నంతరిక్షమునంటుచున్నాఁడు. ఆ తరువాత నీ యగ్నిమార్గములు కట్టెలను గాల్చును గనుక నల్లనివి యగుచున్నవి. ఆ యగ్ని దీప్తివల్ల మృగపక్ష్యాదులు; శూరుని పరాక్రమముచేత శత్రువులు భయపడునట్లు భయమంది పరువెత్తుచున్నవి.

౧౫౧౬. త్వయాహ్యగ్నే వరుణో ధృతవ్రతో మిత్రః శాశద్రే అర్యమా సుదానవః।
యత్సీమను క్రతు నా విశ్వథా విభురరాన్న నేమిః పరిభూ రజాయథాః॥ ౯॥

దం॥ అగ్నీ! నీచేతనేకదా వరుణుఁడు వ్రతముధరించెను! (వర్షించువ్రతమనితా). మిత్రుఁడుచీకటిని యణచుచున్నాఁడు. అర్యముఁడు సుంచిదాతయగుచున్నాఁడు. ఏమంటే- అగ్నీ! సర్వత్రకర్మచేతఁ బ్రపంచమునంతటిని అర్యముఁడు వ్యాపించిన విధముగాను రథచక్రముయొక్క రేకులమట్టును కమ్మివ్యాపించినవిధముగాను సర్వవ్యాపివై పుట్టుచున్నావు.

౧౫౧౭. త్వమగ్నే శశమానాయ సున్వతే రత్నంయవిష్ఠ దేవతా మిమిన్వసి ।
తంత్వానునవ్యం సహసో యువన్వయం భగంనకారే మహిరత్న ధీమహి॥ ౧౦॥

దా॥ ఓ యగ్నీ! వయస్సువాఁడా! నిన్నుస్తుతించి నీకై యభిషవించి దేవతలకై విస్తరించిన మేమిచ్చుహవిస్సును నీవు దేవతలకుఁ జేర్చుచున్నావు ఓ నిత్యయువకుఁడా! గొప్పరత్నములుకలవాఁడా! అత్యంతయుత్తమ మగు నిన్ను రాజునుస్తుతించునట్లుస్తుతించి శీఘ్రముధ్యానించుచున్నాము. (రత్నములు—కర్మఫలములనితా)

౧౫౧౮. అస్మే రయింన స్వర్థం దమూనసం భగం దక్షంన పపృచాసి ధర్ణసిమ్ ।
రశ్మీం రివ యోయమతి జన్మనీ ఉభే దేవానాం శంసమృత ఆచసుక్రతుః॥౧౧॥

దం॥ ఓ యగ్నీ! కోరఁదగిన ఉపాసింపఁదగిన ధనమును మాకిచ్చినట్లు అందఱును ఆశ్రయింపఁదగి ఉత్సాహవంతుఁడై విద్యావంతులుగల పుత్రునిచ్చినట్లు (సర్వము) నిచ్చుచున్నావు. ఏ యగ్ని తన కిరణములవలెను దన జన్మకాధారమగు నుభయ లోకములను నియమించుచున్నాఁడో యా యగ్ని శుభకర్మలుకల మాయాగమందు దేవతల స్తుతిని సర్వకాలములఁ దాను గ్రహించుచున్నాఁడు.

౧౫౧౯. ఉతనః సుద్యోత్మాజీరాశ్వోహోతా మన్ద్రః శృణవచ్చన్ద్రరథః ।
సనోనే షన్నేషత మైరమూరో గ్నిర్వామం సువితం వస్యోఅచ్ఛ॥ ౧౨॥

దం॥ ప్రకాశవంతుఁడును శీఘ్రగమనముగల గుఱ్ఱములు కలవాఁడును దేవతలం బిలుచువాఁడును, గంభీరుఁడును, అగు నా యగ్ని మాయాహ్వానమును వినునా? ఉత్తమబలుఁడు సుప్రసిద్ధుఁడు నగు నగ్ని మిక్కిలిగా మమ్ము (కర్మలలో) నడిపించునట్టి, అందఱుంగోరునట్టి, శుభముగాఁ బొందఁదగినట్టి (స్వర్గమును) పొందించునా?

౧౫౨౦. అస్తావ్యగ్నిః శిమీవద్భిరర్కైః సామ్రాజ్యాయ ప్రతరందధానః ।
అమీచయే మఘవానో వయం చమిహాంనసూరో అతినిష్ట్రతన్యుః॥ ౧౩॥

దం॥ ఈ యగ్ని మిక్కిలి గొప్పదగు సామ్రాజ్యమును ధరించుచున్నవాఁడై కర్మవంతములైన మంత్రములచేత స్తుతింపబడెను. ఈ ఋత్విజులును మేమును మేఘమును సూర్యుఁడు ధ్వనింపఁజేసినట్లు నీ యగ్నిని మిక్కిలిగా ధ్వనింపఁ జేతుము. (స్తుతింతుమని తా.)

---

## సూక్తము. ౧౮౨.

అనుష్టుభ. దీర్ఘతమఋషి, నానాదేవతః.

౧౫౨౧. సమిద్ధో అగ్న ఆవహాదేవాఁ అద్యయతస్రుచే ।
తన్తుంత నుష్వపూర్వ్యం సుతసోమాయదాశుషే॥ ౧॥

దం॥ చకచకాప్రకాశించునోయగ్నీ! నీవుయాగదినమందు హవిర్భోక్తలను తీసికొనిరమ్ము. చేతస్రుక్కు (గరిటెవంటిది) నుబట్టుకొన్నట్టి, సోమమునభిషవించి హవిస్సులనిచ్చునట్టి యజమానుని దేవతలకు హితమయినయజ్ఞమును విస్తారింపఁజేయుము.

౧౫౨౨. ఘృతవన్త ముపమాసి మధుమ న్తంతనూనపాత్ ।
యజ్ఞం విప్రస్య మావతః శశమానస్యదాశుషః॥ ౨॥

దం॥ తనూనపాత్తను అగ్నీ! (తను = గోవులు నపాత్ = మనుమఁడు. గోవువల్ల నెయ్యిపుట్టినది నేతివల్ల నుద్భవించినవాఁడు అగ్నికనక లేక తను = ఉదకములు, వాటినుండి యోషధివనస్పతులు వాటినుండి అగ్ని అని తాత్పర్యమట!) మేధావంతుఁడై నిన్ను స్తుతించుచున్న మావంటి (యజమానుని) యొక్క నేయికారుచున్న మధురమయిన సోమాదిద్రవ్యములు కల యజ్ఞమును సమీపించి పూర్తియగువఱకు నుందువు.

౧౫౨౩. శుచిః పావకో అద్భుతో మధ్వా యజ్ఞంమిమిక్షతి ।
నరాశంసస్త్రిరాదివో దేవోదేవేషు యజ్ఞియః॥ ౩॥

దం॥ శుచియుఁ బవిత్రత కలిగించునట్టి, ఆశ్చర్యము కలిగించునట్టి, ప్రకాశించునట్టి, యజ్ఞము సంపాదించునట్టి నరాశంసాగ్ని (నరులచే స్తుతింపఁబడునని తా.) ద్యులోకమునుండివచ్చి మధురరసముతో మాయజ్ఞమును మూఁడుమార్లు తడుపును. (సోమము త్రాగునపుడది కారినేల తడుచునని తా.)

౧౪౨ ౪. ఈళితో అగ్న ఆవహేన్ద్రం చిత్రమిహ ప్రియమ్ ।

ఇయంహి త్వా మతిర్మమాచ్ఛా సుజిహ్వ వచ్యతే ॥ ౪॥

దం॥ ఓ యగ్నీ! స్తుతింపఁదగినవాఁడా! ఈ యజ్ఞమునకు నాశ్చర్యకరమైన ప్రియుఁడైన యింద్రుని నీవు పిలువుము. మంచి నాలుకకలవాఁడా! మనఃపూర్వకమయిన యీ నాస్తుతివాక్కు అభిముఖముగా నిన్ను బొందుటకుఁ బలుకఁబడుచున్నది.

౧౪౨ ౫. స్తృణానాసో యతస్రుచో బర్హిర్యజ్ఞే స్వధ్వరే

వృఞ్జే దేవవ్యచస్తమ మిన్ద్రాయ శర్మ సప్రథః॥ ౫॥

దం॥ మంచి అధ్వరములు (యాగములోని చిన్నభాగములు) కల సోమయాగమందు దర్భలను పఱచుచున్నవారయి సోమసాధనపాత్రలుకల ఋత్విజులు దేవతల కత్యంతము నొందునట్టి, సర్వతః విస్తృతమయినట్టి, గృహమును ఇంద్రునికొఱకు సంపాదించుచున్నారు.

౧౪౨ ౬. విశ్రయన్తా మృతావృధః ప్రయై దేవేభ్యో మహీః ।

పావకాసః పురుస్పృహో ద్వారో దేవీ రసశ్చతః॥ ౬॥

దం॥ యజ్ఞద్వారములు దేవతలం బ్రవేశపెట్టుటకుఁ దెఱచియుండుఁగాక. ఆ ద్వారములు యజ్ఞమును వృద్ధిపఱచునవి, గొప్పవి, పవిత్రతకలిగించునవి, అందమైనవి దూరదూరముగా నున్నవి.

౧౪౨ ౭. ఆభన్దమానే ఉపాకే నక్తోషాసా సుపేశసా ।

యహ్వీ ఋతస్య మాతరాసీదతాం బర్హిరాసుమత్॥ ౭॥

దం॥ అందఱిచే స్తుతింపఁబడుచు దగ్గఱదగ్గఱగానున్నవై చక్కని రూపుగల్గి గొప్పవయి యజ్ఞము నిర్మించునట్టి యహోరాత్రములు స్వయముగా యజ్ఞమునకువచ్చి దర్భలమీఁదఁ గూర్చుండుఁగాక. (దేవతారూపముగా రాత్రింబవళ్ళు వచ్చునని తా॥)

౧౫౨౮. మన్ద్రజిహ్వాజు గుర్వణీ హోతారా దైవ్యాకవీ ।

యజ్ఞంనో యక్షతామిమం సిధ్రమద్య దివిస్పృశమ్॥ ౮॥

దం॥ (దేవతలను) మదింపఁజేయు జ్వాలలుకల్గి స్తుతికర్తలను మిక్కిలి సేవించుచున్న మేధావంతులై దేవతలం బిలుచుచున్న యగ్నులిద్దరును (భౌమ-వైద్యుత) ఫలసాధనమగుచు ద్యులోకమును స్పృశించుచున్న యీ యజ్ఞమును జక్కఁగా నిపుడు నెరవేర్తురుగాక.

౧౫౨౯. శుచిర్దేవేష్వర్పితా హోత్రా మరుత్సుభారతీ ।

ఇళాసరస్వతీ మహీంబర్హిః సీదన్తు యజ్ఞియాః॥ ౯॥

దం॥ శుద్ధమైనదియు దేవతలందుంచఁబడినదియు, హోమమును నిర్వహించునదియు సూర్యసంబంధమైన వాక్కును; భూమిసంబధమైన ప్రేషవాక్కును; గొప్పదగు సరస్వతి (గర్జన); యీ మూడువాక్కులును (అనఁగా ధ్వనులు) యజ్ఞాహారములగుచు బరిచిన దర్భలమీఁద గూర్చుండుఁగాక. (ధ్వనులనగా ధ్వన్యభిమాన దేవతలని తా॥)

౧౫౩౦. తన్నస్తురీపమద్భుతం పురువారం పురుత్మనా ।

త్వష్టాపోషాయ విష్యతురాయే నాభానో అస్మయుః॥ ౧౦॥

దం॥ శీఘ్రమువ్యాపించునట్టి, అద్భుతమైనట్టి ఆ ఉదకమును స్వయముగా త్వష్టయను వైద్యుతాగ్ని మమ్ముగోరి మా పోషణకొఱకు; మేఘముమధ్యనుండి విడిపించునుగాక.

౧౫౩౧. అవసృజన్ను పత్మనా దేవాన్యక్షివనస్పతే ।

అగ్నిర్హవ్యా సుషూదతిదేవో దేవేషుమేధిరః॥ ౧౧॥

దం॥ ఓ వనస్పతీ! (అ పేరుగలయగ్ని) ఋత్విజులను శీఘ్రము ప్రవర్తింపఁజేయుచు స్వయముగా దేవతలను సమీపించి పూజింపుము. ప్రకాశించుచున్న మేధావంతుఁడైన ఆహవనీయాగ్ని దేవతలకు హవిస్సుల నర్పించును.

౧౬౩౨. పూషణ్వతే మరుత్వతే విశ్వదేవాయవాయవే।

స్వాహాగాయత్రవేపసే హవ్య మిన్ద్రాయకర్తన॥ ౧౨॥

దం॥ పూషతోను, మరుత్తులతోను, సర్వదేవతలతోను, గూడుకొన్నవాఁడై గమన శీలుఁడయి సామవేదస్వరూపుఁడయిన యింద్రుని కొఱకు హవిస్సును (ఋత్విజులారా!) హోమము సేయుఁడు.

౧౬౩౩. స్వాహాకృతాన్యా గహ్యు పహవ్యాని వీతయే।

ఇన్ద్రాగహి శ్రుధీహవంత్వాం హవన్తే అధ్వరే॥ ౧౩॥

దం॥ ఓ యింద్రా! స్వాహాయనుచు వేల్వఁబడిన హవిస్సులను సమీపించి భక్షణకొఱకు రమ్ము, స్తోత్రములు వినుటకురమ్ము, మాపిలుపు వినుము, ఋత్విజులు యజ్ఞమందు నిన్ను బిలుచుచున్నారు.

—:-o-:—

సూక్తము. ౧౪౩.

దీర్ఘతమఋషి -అగ్నిదేవత -త్రిష్టుప్ .జగతి ఛందస్సు

౧౬౩౪. ప్రతవ్యసీం నవ్యసీంధీతి మగ్న యేవాచోమతిం సహసః సూనవే భరే।

అపాంనపాద్యో వసుభిః సహప్రియోహోతా పృథివ్యాంన్యసీ దదృత్వియః॥ ౧॥

దం॥ నేను వృద్ధికరమై క్రొత్తదయిన యాగకర్మను, స్తుతిని, బలమునకుఁ గొమారుఁడును, ఉదకములకు మనుమఁడునగు నగ్నికొఱకుఁ, జేయుచున్నాను. ఏ యగ్ని యజమానునకుఁ బ్రియుఁడును, హోమమును జేయువాఁడునో ఆ అగ్ని హోమకాలమునకు వేదికయందు నివాసయోగ్యధనములతోఁ గూర్చుండుఁగాక.

౧౬౩౫. సజాయమానః పరమేవ్యో మన్నా విరగ్ని రభవ న్మాతరిశ్వనే।

అస్య క్రత్వా సమిధానస్య మజ్మనా ప్రద్యావాశోచిః పృథివీ అరోచయత్॥ ౨॥

దం॥ పుట్టినవెంటనే గొప్పదగు నగ్ని వేదికయందు నంతరిక్షసంచారియగు వాయువు కొలుకుఁ బ్రత్యక్షమయ్యెను సమిధ (= పుల్లల) లచేతఁ బ్రజ్వరిల్లిచు భూమ్యాకాశములను బ్రకాశింపఁజేసెను.

౧౫౩౬. అస్య త్వేషా అజరా అస్య భానవః సుసందృశః సుప్రతీకస్య సుద్యుతః ।

భాత్వక్షసో అత్యక్తుర్న సిన్ధవో௨గ్నే రేజన్తే అససన్తో అజరాః ౩॥

దం॥ ఈ స్తుతింపఁబడుచున్న అగ్నికాన్తులు ముదిమిలేనివి. శోభన ముఖుఁడయిన యీతని కిరణములు చక్కఁగాఁ జూడఁబడునవై బాగుగఁ బ్రకాశించుచు విశేషబలముగనఁబఱుచుచుఁ జీకటిని తొలగించి సూర్యుని కిరణములవలెనే ముదిమిలేక చలుకుకలిగి విరాజిల్లుచున్నవి.

౧౫౩౭. యమేరిరే భృగవో విశ్వవేదసం నాభా పృథివ్యా భువనస్య మజ్మనా ।

అగ్నిం తం గీర్భిర్హినుహి స్వ ఆ దమే య ఏకో వస్వో వరుణో న రాజతి॥ ౪॥

దం॥ సర్వధనములుకల యగ్నిని భృగువంశ్యులు వేదికయొక్క ఒకభాగమందు అనఁగా నుత్తరవేదియందు భూతసంఘముయొక్క బలముచేత నభిముఖముగా స్థాపించిరి. ఆ యగ్నిని స్వకీయ గృహమందు స్తుతులతో సమీపించుము. ఏ యగ్ని సూర్యునివలె ధనములకు నీశ్వరుఁడయ్యెను. (వరుణ = సూర్య.)

౧౫౩౮. న యో వరాయ మరుతామివ స్వనః సేనేవ సృష్టా దివ్యా యథాశనిః ।

అగ్నిర్జమ్భైస్తిగితైరత్తి భర్వతి యోధో న శత్రూన్త్స వనా న్యృఞ్జతే॥ ౫॥

దం॥ వాయువుల ధ్వనివలెను, రాజంపిన సేనవలెను, అంతరిక్షమందుఁ బుట్టిన పిడుగువలెను, ఏ యగ్ని యితరులు వారింప శక్యముగానిదో ఆ యీయగ్ని తీక్ష్ణదంతములతో శత్రువులను భక్షించును. (జ్వాలలే దంతములని తా.) శూరునివలె శత్రులహింసించును. వనములను దహించును.

౧౫౩౯. కువిన్నో అగ్నిరుచథస్య వీరసద్వసుష్కవిద్వసుభిః కామమావరత్ ।

చోదః కువిత్తుతుజ్యాత్ సాతయే ధియః శుచిప్రతీకం తమయా ధియా గృణే॥ ౬॥

దం॥ ఈ యగ్ని అనేకమార్లు స్తుతిని గోరినవాఁడగుఁగాక. సర్వులకు సిద్ధివంటి వాఁడై బహువిధముల నుపయోగించుఁగాక. ఈ యగ్ని మమ్ము గర్మలలోఁ బ్రేరించును లాభముకొఱకు బహుగా దోఁపకరించుఁగాక. ఈ స్తుతి మంత్రముతో నేను స్తుతించుచున్నాను.

౧౫౮౦ ఘృతప్రతీకంవ ఋతస్య ధూర్షదమగ్నిం మిత్రంనసమిధాన ఋఞ్జతే।

ఇన్ధానో అక్రో విదథే షుదీ ద్యచ్ఛు క్రవర్ణాముదు నోయంసతే ధియమ్॥ ౭॥

దం॥ నేతితో మండుచున్నవాఁడు యజ్ఞమునకు ముందుండువాఁడు నగు నగ్నిని మిత్రునివలె యజమానుఁడు ఇధ్మములతో (పుల్లలు) దీపించును నలంకరించుచు న్నాఁడు. చక్కఁగా వెలుంగునట్టి. వ్యాపించుచున్నట్టి. యజ్ఞముల నిమిత్తము స్వయముగా దీపించునట్టి యగ్ని మాకర్మలను సంరక్షించుఁగాక.

౧౫౮౧. అప్రయుచ్ఛ న్నప్రయుచ్ఛ ద్భిరగ్నే శివే భిర్నః పాయుభిః పాహిశగ్మైః।

అదబ్ధే భిర దృపి తే భిరిష్టే నిమిషద్భిః పరిపాహినోజాః॥ ౮॥

దం॥ ఓ యగ్నీ! పొరపాటులేకుండ వర్తించుచుఁ బొరపాటులేని కళ్యాణకరమైన, సుఖమైన రక్షణలతో మమ్ము రక్షింపుము అందఱుచు గోరఁదగినవాఁడా! పుట్టుచునే హింసారహితమైన యితరులవమానింప శక్యముకాని చురుకైన (రక్షణము లతో) మమ్ములను బరిపాలింపుము.

---

## సూక్తము, ౧౮౯.

దీర్ఘతమఋషి, జగతిఛందః. అగ్నిదేవతే.

౧౫౮౨ ఏతి ప్రహోతా వ్రతమస్య మాయయో ర్ధ్వాందధానః శుచిపే శసంధియమ్।

అభి స్రుచః క్రమతే దక్షిణా వృతో యాఅస్యధామ ప్రథమంహనింసతే॥౧॥

తం॥ హోమమును జరిగించు (అధ్వర్యుఁడు) నీ యగ్నియొక్క వ్రతమును ప్రజ్ఞ చేతను అవలంబించుచున్నాఁడు. అతఁ డన్నిటిని మించి శోభనరూపములగు ప్రజ్ఞ నుధరించినాడు. ప్రదక్షిణముగాఁ బ్రవర్తించుచు స్రుక్కులను గ్రహించుచున్నాడు. ఏ స్రుక్కులు ముందుగా నీయగ్నిస్థానమందుండునో ఆ స్రుక్కులను (అని పూర్వాన్వయము.)

౧౪౪౩. అభీమృతస్య దోహనా అనూషత యోనౌ దేవస్య సదనే పరీవృతాః।

అపాముపస్థే విభృతో యదావస దధస్వధా అధయద్యాభిరీయతే॥ ౨॥

తం॥ ఉదకధారలు తమపుట్టుచోటయిన సూర్యునం దావరించియున్నవై యీ యగ్నిని స్తుతించుచున్నవి. అగ్ని యుదకముల మధ్య నెపుడు ధరింపఁబడియున్నాడో (యపుడు స్తుతించెనని.) ఏ యుదకములతో నీయగ్ని భూమియందు నందఱిని జేరుచున్నాఁడో ఆ యమృతమువంటి యుదకముల నందఱు త్రావుచున్నారు.

౧౪౪ . యుయూషతః సవయసాత దిద్వపుః సమానమర్థం వితరిత్రతా మిథః।

ఆదీరిభగోనహవ్యః సమస్మదామో హవ్యూర్న రశ్మీన్త్సమయంస్త సారథిః॥ ౩॥

తం॥ సమానసామర్థ్యముకలవారు అన్యోన్యము ఒకే పనిని వెంటనే ప్రత్యేకము చక్కగాఁ జేయుచున్నట్టి (హోత - అధ్వర్యుఁడు) వారై అగ్నిశరీరమును దమవ్యాపారములతోఁ గలుపఁదలఁచుచున్నారు. అనన్తరము ఆహవనీయాగ్ని యజ్ఞమునకు సారథియై కళ్లెములవంటి మానేతిధారలను సూర్యుఁడువలె, సర్వత్రా ధరించుచున్నాఁడు.

౧౪౪౫. యమీం ద్వాసవయసా సపర్యతః సమానేయోనా మిథునా సమోకసా।

దివానక్తం పలితో యువాజని పురూచరన్నజరో మానుషాయుగా॥ ౪॥

తం॥ సమాన సామర్థ్యముకల యిద్దఱును; ఫలమునకు సమానస్థలమగు యజ్ఞమందు దంపతులవలెను, సమాననివాసముకల రాత్రింబవళ్లవలెను, ఈ యగ్నిని బరిచరించుచున్నారు ఇట్టి యగ్ని ముదిసినను దరువాత వయసువచ్చినవాఁడై యయ్యెను. (నిప్పులున్నపుడు ముదుసలితనము, కట్టెలువేసిన తరువాత యౌవనమని తా) ఈ యిద్దఱి మనుష్యుల నుద్దేశించి బహుఘృతాది హవిస్సుల భక్షించుచు ముదిమిలేనివాఁడై యున్నాడు. (హోత - అధ్వర్యుఁడు ఇద్దఱని తా.)

౧౫౪౬. తమీంహిన్వన్తి ధీతయోదశ వ్రిశో దేవంమర్తాస ఊతయే హవామహే ।
ధనోరధి ప్రవత ఆసఋణ్వత్యభి వ్రజద్భిర్వయునా నవాధిత॥ ౫॥

దం॥ ప్రకాశించుచున్న ఆయీయగ్నిని చేతివ్రేళ్లు విడిసంతరింపఁ జేయుచున్నవి. మనుష్యులమయిన మేము రక్షణకొఱకు నగ్నినిబిలుచుచున్నాము. ధనుస్సునుండి ప్రసరించు బాణములు శత్రువుమీఁదబడునట్లు తనశరీరమునుండి వేగముగాఁ బ్రసరించుకిరణములను ఈయగ్ని విసరుచున్నది. (మిణుగురులని తా) ఇట్లువృద్ధిఁబొందిన యాగ్నియంతటను సంచరించుచున్న క్రొత్తప్రజ్ఞలను జ్ఞాపకముచేయుచున్నది.

౧౫౪౭. త్వంహ్యగ్నే దివ్యస్య రాజసిత్వం పార్థివస్య పశుపా ఇవత్మనా ।
ఏనీతఏతే బృహతీ అభిశ్రియా హిరణ్యయీ వక్వరీ బర్హిరాశాతే। ౬॥

దం॥ ఓ యగ్నీ ! నీవుకదా అంతరిక్షమందుఁ బుట్టినదానికెల్ల నధికారివయియున్నావు ! పృథివియందుఁ బుట్టినవాటికి నీశ్వరుఁడవగుచున్నావు. స్వయముగాఁ బశుపాలకుఁడువలె స్వతంత్రుఁడవగు చున్నావు. కనుక ఈవిస్తృతైశ్వర్యవంతలయినట్టి హితరమణీయమైనట్టి చిన్నశబ్దమునొనర్చుచు ద్యావాపృథువులు నీయొక్క యజ్ఞమునుబొందుచున్నవి.

౧౫౪౮. అగ్నే జుషస్వ ప్రతిహర్యత ద్వచో మన్ద్ర స్వధావ ఋతజాత సుక్రతో ।
యోవిశ్వతః ప్రత్యఙ్ఙసి దర్శతో రణ్వః సందృష్టౌ పితుమాఁ ఇవక్షయః॥ ౭॥

దం॥ ఓ యగ్నీ ! హవిస్సును స్వీకరింపుము. ప్రియమైన ఆస్తుతిని మరలఁగోరుము. మదించినవాఁడా ! హవిస్సులుకలవాఁడా ! యజ్ఞార్థముపుట్టినవాఁడా ! శుభకర్మకలవాఁడా ! యేనీవుసర్వ జగత్తునకును అనుకూలుఁడవయి యున్నావో దర్శనీయుఁడవో చక్కఁగాఁ జూచుటకు సంతసముపుట్టింతువో విస్తారాన్నముకల గృహస్థునివలె ఆ నిన్నందఱును సేవింతురు.

## సూక్తము. ౧౪౫.

దీర్ఘతమసఋషి - అగ్నిదేవత - ౫ త్రిష్టుప - తక్కినవి జగతి.

౧౫౪౯. తంపృచ్ఛతా సజగామాసవే దస చికిత్వా ఈయతే సాన్వీయతే ।
తస్మిన్త్సన్తి ప్రశిష స్తస్మి న్నిష్టయః స్వవాజస్య శవసం శుష్మిణస్పతిః॥ ౧॥

దం॥ ఓ యజమానులారా ! ఆయగ్నినడుగుడు. అతడు సర్వత్ర గమనింపగలడు అతడెఱుగును అతడుచైతన్యవంతుడు. అతడే (పొదగినచోటికి) బోవును. శీఘ్రముగాబోవును. ఆయగ్నియందుండవలసినవిషయములన్నియుగలవు. అతనియందన్ని భోగములును గలవు. అతడన్నమునకు బలమునకు నధిపతి. బలవంతుడగురాజునకుంగూడనీశ్వరుడు.

౧౫౫౦. తమిత్పృచ్ఛన్తి నసిమోవిపృచ్ఛతి స్వేనే వధీరో మనసాయ దగ్రభీత ।
నమృష తే ప్రథమంనా పరంవచోస్య క్రత్వాసచ తే అప్రదృపితః॥ ౨॥

దం॥ ఆయగ్నినే యడుగుదురు. అడిగినవాడు విపరీతముగానడుగడు. అడిగినను అతడు ధీరుడయి తన మనసుతో నేదేది గ్రహించునో దానినే చెప్పును. అగ్ని తనమాటకు ముందే మాటను సహింపడు. తనమాట తరువాతి మాటనుగూడ సహింపడు. కనుక అగ్ని గర్వికాడు, ఈ యగ్నియొక్క (రక్షణ) కర్మతో నంద అును బ్రదుకుచున్నారు.

౧౫౫౧. తమిద్గచ్ఛన్తి జుహ్వా స్తమర్వ తీర్విశ్వాన్యేకః శృణావద్వ చాంసిమే ।
పురుప్రైష స్తతురిర్యజ్ఞ సాధనో చ్ఛిద్రోతిః శిశురాదత్త సంరభః॥ ౩॥

దం॥ మనపిలుపులన్నియు నాయగ్నినే చెందుచున్నవి. స్తుతులన్నియు నతనినే చేరుచున్నవి. అతడొక్కడే నామాటలన్నిటిని వినుచున్నాడు. అనేకములను బ్రేరించునట్టి, తరింపజేయునట్టి, యజ్ఞమును సాధించునట్టి, అవిచ్ఛిన్నరక్షణముకల శిశువువలె బ్రియుడయినట్టి యగ్ని (కార్యమందు) ద్వరగలవాడై హవిస్సులను స్వీకరించుచున్నాడు.

౧౪౫ ౪. ఉపస్థాయంచరతి యత్సమారత సద్యో జాతస్తత్సార యుజ్యేభిః।

అభిశ్వాన్తం మృశతే నాన్ద్యే ముదే యదీంగచ్ఛన్త్యుశతీరపిష్ఠితమ్॥ ౪

ద౦॥ అధ్వర్యుఁ డెపుడు (అగ్నియొక్క) ఉత్పత్తికనుకూలించు వ్యాపారమును జేయుచున్నాఁడో (అంటే మథించుచున్నాఁడో అని తా.) అగ్ని యెపుడుత్పత్తి నొందెనో అపుడే ఫలములు సంపాదించుటకు సర్వత్ర పంచరించెను. ఆనందింపఁదగిన కర్మయందతని సంతోషము కొఱకు కోరిన ఆజ్యధారలు తనయందుఁ బడినపుడు, శాన్తుఁడగు యజమానుని అభిమర్శించుచున్నాడు. (అభిమర్శన = చేతితోఁ దడు చుచు లాలించుట.)

౧౪౫ ౫. స ఈం మృగో అప్యో వనర్గురుప త్వచ్యుపమస్యాం నిధాయి।

వ్యబ్రవీద్వయునా మర్త్యేభ్యోఽగ్నిర్విద్వాఁ ఋతచిద్ధి సత్యః॥ ౫

ద౦॥ అగ్నియే చర్మము పఱచినట్లు ఓషధులు పఱచిన వేదియందు ఉంచఁబడెను. వెదకునట్టి స్వభావముగలట్టి, కర్మలకుపయోగించునట్టి వనమందు సంచరించునట్టి యీయగ్ని మరణధర్మముగల యజమానులకుఁ బ్రజ్ఞానములను ఉపదేశించును. ఏమంటే ఈయగ్ని సర్వజ్ఞుఁడు, ఉదకముల నెఱింగినవాఁడు, లేక యజ్ఞము నెఱింగినవాఁడు, సత్యమయినవాఁడుగదా!

---

## సూక్తము. ౧౪౬.

దీర్ఘతమ, త్రిష్టుప్, అగ్ని.

౧౪౬ ౧. త్రిమూర్ధానం సప్తరశ్మింగృణీషే నూనమగ్నిం పిత్రోరుపస్థే।

నిషత్తమస్య చరతో ధ్రువస్య విశ్వా దివో రోచనాపప్రివాంసమ్॥ ౧

ద౦॥ మూఁడు (సవనములను) తలలుగలది యేడు (ఛందసులను) కళ్లెములుకలది అంగవైకల్యము లేనిది, ద్యావాపృథువుల సమీపమున నున్నది (అనగా యజ్ఞరూపాగ్ని యని తా.) నిశ్చలమయిన హవిస్సుల భక్షించుచున్నదియగు నీ యగ్ని సంబంధ

మయిన యాగములు ద్యులోకమందలి దేవవిమానములన్నిటిని బూరించుచున్నవి. దానిని స్తుతింపుము. (అగ్నికిఁగూడ నీ సూక్తమన్వయించును. ఆ పక్షమున ఏడు జిహ్వలు ద్యులోకభూలోకాంతరిక్షలోకములు మూఁడును మూఁడుతలలు. తక్కినది సమానము.)

౧౪౪౫. ఉక్షామహాఁ అభివవక్ష ఏనో అజరస్తస్థావిత ఊతిర్ఋష్వః ।

ఉర్వ్యాః పదో నిదధాతిసానౌ రిహన్త్యూధో అరుషాసో అస్య॥ ౨॥

దం॥ వర్షించువాఁడు మహాత్ముఁడునగుచు భూమ్యంతరిక్షములను అగ్ని వహించుచున్నాఁడు. ఇతఁడు ముదిమిలేనివాఁడు, గొప్పవాఁడు, రక్షణములుకలవాఁడు. అతఁడు మాయజ్ఞగృహమున కభిముఖుఁడగుచున్నాఁడు. విస్తారమయిన భూమియొక్కయున్నత ప్రదేశమున (అనఁగా వేదికయందని తా.) పాదములుంచుచున్నాఁడు. ఈ యగ్నిజ్వాలలు పొదుగువలెనున్న యంతరిక్షమును అంటుచున్నవి (దూడ పొదుగునాకినట్లు నాకుచున్నవని తా.)

౧౪౪౬. సమానంవత్సమభిసం చరన్తీవిష్వగ్ధేనూ విచరతః సుమేకే ।

అనపవృజ్యాఁ అధ్వనో మిమానే విశ్వాన్కేతాఁ అధిమహోదధానే॥ ౩॥

దం॥ ఒకేవత్సమయగుచున్న యగ్ని కభిముఖముగ సంచరించు రెండుధేనువులయియున్న పత్నీయజమానులు శోభనకర్మవంతులై యంతట సంచరించుచున్నారు. (సమిధాజ్యములతో నగ్నిని బెంచినందున పత్నీ యజమానులు తల్లిదండ్రులు) విడువందగని మార్గములను అగ్నిచుట్టును సిద్ధపఱచుచున్నారు. గొప్పవగు సర్వప్రజ్ఞానములను అధికముగా ధరించుచున్నారు.

౧౪౪౭. ధీరాసః పదంకవయో నయన్తినానాహృదా రక్షమణా అజుర్యమ్ ।

సిషాసన్తః పర్యపశ్యన్త సిన్ధుమావిరేభ్యో అభవత్సూర్యోనౄన్ ॥ ४

దం॥ బుద్ధిమంతులయిన అధ్వర్యుఁడు మొదలగువారు వృద్ధినొందుచున్న యగ్నిని వేదియందుంచుచున్నారు. వారు బహుతెలిసినవారు. అనేకవిధములయిన బుద్ధులతో

నగ్నిని రక్షించుచున్నవారునయి యజ్ఞఫలముల నిచ్చుచున్న యగ్ని నన్నివిధముల సేవించుచున్నారు అన్నిటిని బుట్టించు నీయగ్ని ఇష్టి భక్తులయిన మనుష్యుల కొఱకుఁ బ్రత్యక్షమయ్యెను.

౧౫౪౮. దిదృక్షేణ్యః పరికాష్ఠాసు జేన్య ఈళేన్యో మహో అర్భాయ జీవసే ।

పురుత్రా యదభవత్సూరహైభ్యో గర్భేభ్యో మఘవా విశ్వదర్శతః ॥ ౫

తా॥ ఈ యగ్ని అనుగ్రహదృష్టికలవాఁడై దిక్కులందు సర్వత్రా కనంబడుచు స్తుతింపఁదగి గొప్పవారగు దేవతలకుఁ జిన్నవారగు యజమానులకు రక్షణచేయుటకై యున్నాఁడు. అందుచేతనే యనేకచోట్ల హవిరన్నముగల్గి సర్వమునుజూచుచు శిశువులవంటి యీయజమానులను బ్రసవించుచున్నాఁడు.

---

## సూక్తము. ౧౪౭.

పూర్వసూక్తవతు.

౧౫౪౯. కథా తే అగ్నే శుచయన్త ఆయోర్దదాశుర్వాజేభి రాశుషాణాః ।

ఉభే యత్తోకే తనయే దధానా ఋతస్య సామన్రణయన్త దేవాః ॥ ౧

తా॥ ఓ యగ్నీ! నీకిరణములు వెలుఁగును గలిగించుచు (హవిస్సుల) శీఘ్రముగా నందుకొనుచు నన్నములతోఁగూడిన యాయుర్దాయమును ఎట్లిచ్చుచున్నవి? ఏమంటే అన్నాయువుల రెంటిని, కొమాళ్లను ధరించినట్లు; ధరించు యజమానులు యజ్ఞమందలి సామమన్త్రములను ఉచ్చరించుచుందురు. (వారి స్తుతి గానముచేతనే వారికన్నాయువులు కలుగుచున్నవని తా.)

౧౫౫౦. బోధా మే అస్య వచసో యవిష్ఠ మంహిష్ఠస్య ప్రభృతస్య స్వధావః ।

పీయతి త్వో అను త్వో గృణాతి వన్దారుస్తే తన్వం వన్దే అగ్నే ॥ ౨

దం॥ అత్యన్తసూనృతవంతుడవయిన ఓ యగ్నీ! హవిస్సులన్నముగాఁ గలవాఁడా! మిగుల పూజ్యములయిన ఉత్కృష్టముగా సంపాదించిన నా యీస్తుతియొక్క రీతిని తెలిసికొనుము. అగ్నీ! ఒకఁడు (యాగమును) విరోధించును. ఒకఁ డనుకూలుండై స్తుతించును. (అందులో) స్తుతించువాండ్రై నేను నీ మూర్తిని స్తుతించుచున్నాను.

౧౬౮౧. యే పాయవో మామతేయన్తే అగ్నే పశ్యన్తో అన్ధం దురితా దరక్షన్ ।

రరక్ష తాన్సుకృతో విశ్వవేదా దిప్సన్త ఇద్రిపవో నాహ దేభుః॥ 3॥

దం॥ అగ్నీ! నీసంబంధమయిన యేరక్షణములు మమతాపుత్రుని జూచుచున్నదై గ్రుడ్డితనము బోఁగొట్టి రక్షించినవో సుఖకరములయి సర్వము నెఱింగిన యారక్షణములు నీవద్దనున్నవి. హింసకులయిన శత్రువులిఁక మమ్ము బాధింపలేరు.

౧౬౮౨. యో నో అగ్నే అరరివాఁ అఘాయురరాతీవా మర్చయతి ద్వయేన ।

మన్త్రో గురుః పునరస్తు సో అస్మా అనుమృక్షీష్ట తన్వం దురుక్తైః॥ ౪॥

దం॥ ఓ యగ్నీ! ఎవఁడేని మాకుఁ బాపము దలచినవాఁడును, మాకివ్వవలసిన దానిని నోటితోనో, శరీరముతోనో అడ్డుపెట్టుచు బాధించువాఁడును గలఁడో మరల నా బాధలు వానికే అధికముగా నగునుగాక ఆదురుక్తులచేత వానిశరీరమే తుప్పుకొని పోవుగాక. (నశించుఁగాక తా.)

౧౬౮3. ఉత వా యః సహస్య ప్రవిద్వాన్మర్తో మర్తం మర్చయతిద్వయేన ।

అతః పాహి స్తవమానస్తువన్తమగ్నే మాకిర్నో దురితాయ ధాయీః॥ ౫॥

దం॥ మఱియు నో బలపుత్రుఁడా! (బలముతో మథనము చేసినందునఁ బుట్టినాఁడుకనుక) అగ్నీ! బాగుగాఁ దెలిసిన యే మర్త్యుఁడు (మీఁద వివరించిన) రెండు విధముల బాధలను మనుష్యులకుఁ గలిగించునో స్తుతింపఁబడిన ఓ యగ్నీ! స్తుతి చేయు నన్ను ఆ బాధనుండి రక్షింపుము. వాఁడు చేయుపాపమునకు దొఱకకుండ రక్షింపుము.

## సూక్తము. ౧౪౮.

పూర్వోక్తము.

౧౬౬౪. మథీద్యదీం విష్టో మాతరిశ్వా హోతారం విశ్వాప్సుం విశ్వదేవ్యమ్ ।

నియందధుర్మనుష్యా సువిక్షుస్వర్ణచిత్రం వపుషే విభావమ్॥ ౧॥

దం॥ దేవతలను బిలుచునట్టి అనేకరూపములుకలట్టి సర్వదేవతలకుపయోగించునట్టి యీ యగ్నిని వర్షవాయువు కట్టెలలోఁ బ్రవేశించినవాఁడై మథించెను. బుద్ధిశాలురయిన ప్రజలు యజ్ఞసిద్ధికై వివిధప్రకాశము గలిగి కోరఁదగిన సూర్యునివలెను ఉంచుకొనిరి.

౧౬౬౫. దదానమిన్నదదభన్త మన్మాగ్నిర్వరూథం మమతస్య చాకన్ ।

జుషన్త విశ్వాన్యస్య కర్మోపస్తుతిం భరమాణస్య కారోః ॥ ౨॥

దం॥ అగ్నికొఱకు స్తుతిచేయుచున్న నన్ను శత్రువులు హింసింపఁజాలరు. స్తుతిచేయుచున్న నాస్తుతిని నా సమస్తకర్మలను, సేవించుచున్నారు.

౧౬౬౬. నిత్యేచిన్నుయం సదనేజగృభ్రే ప్రశస్తిభిర్దధిరే యజ్ఞియాసః ।

ప్రసూనయన్త గృభయంత ఇష్టావశ్వాసో నరథ్యోరారహాణాః ॥ ౩॥

దం॥ యజ్ఞముసేయువారు ఏ యగ్నిని మథించి నిత్యగృహమందు (గార్హపత్యము) శీఘ్రముగా నిల్పిరో స్తుతులచే ధరించిరో యజ్ఞము నిమిత్తము గ్రహించిన యీ యగ్నిని, రథమునగట్టబడి వేగముగా నడుచు గుఱ్ఱమునువలె; ఇష్టమయిన చోటికి గొంచుఁబోవుచున్నారు. (గార్హపత్యాగ్నిని మొదటనిలిపి దానిలోనుండియే ఆహవనీయ దాక్షిణాగ్నులు ప్రణయింతురు = సృజింతురు.)

౧౬౬౭. పురూణిదస్మో నిరిణాతి జమ్భైరాద్రోచతేవన ఆవిభావా ।

ఆదస్య వాతో అనువాతి శోచిరస్తుర్నశర్యామసనామనుద్యూన్ ॥ ౪॥

దం॥ బహువస్తువులను గాల్చివేయు నీయగ్ని దంతములవంటి జ్వాలలతో వనమం దనేక వృక్షములను ధ్వంసము చేయును. అనంతరము వనమందు వివిధప్రకాశవంతుడై సర్వత్ర ప్రజ్వలించుచున్నాడు. తరువాత నితని జ్వాలలను, ఎగురునట్టి బాణములను విలుకాడు విసరునట్లు, అనుకూలవాయువు ప్రతిదినమందును విసరుచునే యుండును

౧౫౬౮. నయంరిపవో నరిషణ్యవో గర్భే సంతం రేషణా రేషయంతి ।

అంధాఅపశ్యా నదభన్న భిఖ్యానిత్యాసఈం ప్రేతారో అరక్షన్ ॥ ౫॥

దం॥ గర్భమువలె రక్షకమగు నరణియందున్న యే యగ్నిని హింసాస్వభావులయిన నరులు హింసింపజాలరు. ఈతని మహత్తును జ్ఞానములేనివారు, గన్నులు కానరానివారును హింసింపలేరు. నిత్యులై యగ్నిని దృప్తిచేయువారు దీనిం గాపాడు కొనుచున్నారు.

---

## సూక్తము. ౧౪౯.

దీర్ఘతమ, విరాటుఛంద, అగ్నిదేవత.

౧౫౬౯. మహఃసరాయ ఏషతే పతిర్దన్నిన ఇనస్యవసునః పదఆ ।

ఉపధ్రజ న్తమద్రయో విధన్నిత్ ॥ ౧॥

దం॥ పూజ్యమగు ధనమున కధిపతియైన ఆ యగ్ని యిష్టము నిచ్చుట నభిముఖముగా మా దేవయజనస్థానముఁ జేర్చి నడచును. అతఁడధికారుల కధికారి. అట్టి యగ్నిధనములకు నివాసమయిన వేదికయందుండెను. మమ్ముఁ జెందియున్న యీ యగ్నిని (అభిషవ) శిలలుపట్టుకొని యజమానులు సేవించుచున్నారు.

౧౫౭౦. సయోవృషా నరాం నరోదస్యోః శ్రవోభిరస్తి జీవపీతసర్గః ।

ప్రయః సస్రాణః శిశ్రీతయోనౌ ॥ ౨॥

దం॥ ఆ యగ్ని మనుష్యులకువలె ద్యావాపృథివీ లోకములకుంగూడ వర్షమును గురిపించువాఁడై, కీర్తికలవాఁడై ప్రవర్తిలె. ఏమంటే నానావిధప్రాణులచేత ననుభవింపఁబడిన సృష్టికలవాడగు యే యగ్ని గర్భాశయమందుఁ బ్రవేశించి (రేతస్సును) దేహముగా మార్చును. (శరీరమందున్న జఠరాగ్ని గర్భమందు సంయోగకాలమునఁబడినవీర్యమును దేహముగా మార్చును.)

౧౫౮౧. ఆయఃపురం నార్మిణీ మదీదేదత్యః కవిర్నభన్యో౽౽నార్వా।
సూరోనరురుక్వాఞ్ఛతాత్మా॥ ౩॥

దం॥ ఏ యగ్ని యజమానుల ఉత్తరవేది స్థానమును ప్రకాశింపఁజేయుచున్నాఁడో ఆ యగ్ని తాఁగోరిన చోటికిఁ బోఁగలవాఁడును మేధావియు వేగముగల యాకాశ వాయువువలె గమనించువాఁడు. (ఇంద్రవరుణాది సర్వదేవతలు నగ్నిరూపులే యగుదురు.)

౧౫౮౨, అభిద్విజన్మాత్రీరోచనాని విశ్వారజాంసి శుశుచానో అస్థాత్।
హోతాయజిష్ఠో అపాంసధస్థే॥ ౪॥

దం॥ రెంటివల్లఁబుట్టి (అరణులు, లేక ద్యావాపృథువులు) యీ యగ్ని మూఁడు లోకములను, సర్వలోకములను అంతటను ప్రకాశింపఁ జేయుచు దేవతను బిలచువాఁడైయాగకర్తయగుచుఉదకములున్నచోటనున్నాఁడు. (ఉదకములున్నచోటాకాశమునకు మేఘము.)

౧౫౮౩. అయం సహోతాయో ద్విజన్మా విశ్వాదధేవార్యాణి శ్రవస్యా।
మర్తోయో అస్మై సుతుకో దదాశ॥ ౫॥

దం॥ ఎవఁడు రెండింటివల్ల బుట్టెనో, ఎవఁడు హోమానములగలిగించునో వాఁడు అన్నములను (= హవిస్సులు) గోరుచు సకలవరములను ధరించుచున్నాఁడు. అట్టి యగ్నికొఱకు ఏ మనుష్యుఁడు హవిస్సుల నిచ్చునో వాఁడు మంచి కొడుకులు గల వాఁడగును.

సూక్తము ౧౫౦.

దీర్ఘతమ, అగ్నిదేవ, ఉష్ణిక్ఛం.

౧౫౭౪. పురుత్వా దాశ్వాన్వోచే రిరగ్నేతవస్విదా ।
తోదస్యేవ శరణ ఆమహస్య॥ ౧॥

దం॥ ఓ యగ్నీ! నిన్ను బహువిధముల స్తుతింతును. బహుదాతవు నీవు. నీయొక్క ఆభిముఖ్యముచేతనే హవిస్సులిచ్చువాఁడనయి, అధికారియింట నౌకరు సేవించునట్లు సేవించుచుంటిని.

౧౫౭౫. వ్యనినస్య ధనినః ప్రహోషే చిదరరుషః ।
కదాచనప్రజిగతో అదేవయోః॥ ౨॥

దం॥ నిన్ను స్వామిగాఁ గొలువని వానికిని ధనముగలిగి హోమమునకు దానినుపయోగింపని వానికిని, ఎపుడును దేవతలను గొలువని వానికిని, స్తుతింపని వానికిని, ఎపుడును నీవు ధనాది కోరిక లివ్వకుమని నేను నొక్కివక్కాణించుచున్నాను.

౧౫౭౬. సచన్ద్రో విప్రమర్త్యోమహో వ్రాధన్తమోదివి ।
ప్రప్రేత్తే అగ్నే వనుషః స్యామ॥ ౩॥

దం॥ మేధావంతుఁడవైన యో యగ్నీ! యే మనుష్యుఁడు నిన్ను యజించునో వాఁడు ద్యులోకమందుఁ జంద్రుఁడై యుండును. నీవు గొప్పదేవతలలోఁ గొప్పవాఁడవు. ఓ యగ్నీ! నీ భక్తులమై యత్యన్తము గొప్పవారమై యున్నాము.

## సూక్తము. ౧౫౧

దీర్ఘతమ, మిత్రావరుణౌదేవతా. జగతీఛందః.

౧౫౭౭. మిత్రం నయం శిమ్యాగోషు గవ్యవస్స్వాధ్యో విదథే అప్సు జీజనన్ ।
అరేజేతాం రోదసీపాజసాగిరాప్రతిప్రియం యజతం జనుషామవః ॥ ౧ ॥

ఫ॥ గోవులుకోరి ధ్యానించు యజమానులు గోవుల నిమిత్తము సామర్థ్యముచేత సూర్యునివంటి వైద్యుతాగ్నియై యున్నటువంటి సర్వప్రాణులకుఁ బ్రియమైన యాగముచేయఁదగినట్టియే యగ్నిని రక్షణముకొఱకుఁ బుట్టించిరో అట్టి యగ్నియొక్క బలముచేతను, ధ్వనిచేతను, ద్యావాపృథువులు కంపించినవి.

౧౫౭౮. యద్ధత్యద్వాం పురుమీహ్ళస్యసోమినః ప్రమిత్రాసోనదధిరే స్వాభువః ।
అధక్రతుం విదతంగాతుమర్చత ఉతశ్రుతం వృషణా పస్త్యావతః ॥ ౨ ॥

ఫ॥ మిత్రావరుణులారా! ఏకారణముచేత సోమయాజివిూకు కోర్కెల నివ్వవలసి మిత్రులవలెఁ బోషించుచున్నారో ఆకారణముచేత విూగమనమును బూజించువాని కర్మను దరువాతను తెలియుఁడు. వర్షదాతలారా! మఱియు విూరు యజ్ఞశాలగల యజమానుని స్తోత్రమును వినుఁడు.

౧౫౭౯. ఆవాం భూషన్ క్షితయో జన్మరోదస్యోః ప్రవాచ్యం వృషణా దక్షసేమహే ।
యదీమృతాయ భరథో యదర్వతే ప్రహోత్రయా శిమ్యావీథో అధ్వరమ్ ॥ ౩ ॥

ఫ॥ (కోర్కెలు) వర్షించునట్టి మిత్రావరుణులారా! ద్యావాపృథువులచే నుతింపఁబడిన విూజననమును గొప్పబలము కొఱకు యజమానులలంకరించుచున్నారు ఏకారణమువల్ల యజ్ఞసామర్థ్యమును, ఏకారణముచేత మిమ్ముఁ బొందిన వారికి నిష్టఫలమును విూరు ఇచ్చుచున్నారో ఆకారణముచేత స్తుతిరూపవాక్కువల్లను (హవిః ప్రదాన) కర్మవల్లను యజ్ఞమును బొందుచున్నారు.

౧౫౮౦. ప్రనాక్షితిరసురయా మహిప్రియఋతావానా వృతమా ఘోషథోబృహత్ ।

యువందివో బృహతో దక్షమాభువం గాంన ధుర్యుపయుజ్ఞాథే అపః॥ ౪॥

ద॥ బలవంతులగు నోమిత్రావరుణులారా! మీ యిద్దఱి ఏ స్థానము విశాలమై, ప్రియమైనదియో దానియందుఁ గూరుచుండుడు. కూర్చొని యాగకర్తలగు మీరు గొప్పదగు మాయజ్ఞమును సంపూర్ణము చేయుఁడు, ఏమంటే, మీరు గొప్పదగు ద్యులోకాగ్రమందుండి తృప్తిని గలిగించునట్టి సర్వతో ఉండునట్టి కర్మను (అనఁగా సోమయాగమును) శరీరపుష్టికై యావును సేవించునట్లు సేవించుచున్నారు.

౧౫౮౧. మహీ అత్రమహినావార మృణ్వథోరేణ వస్తుజఆ సద్మస్థేనవః ।

స్వరస్తితా ఉపరతాతి సూర్యమానిమ్ను చ ఉపస స్తక్వ వీరివ॥ ౫॥

ద॥ విశాలమయిన యీ పృథివియందు నే ధేనువులకుఁ గోరఁదగిన స్థలమును సంపాదించితిరో ఆ ధేనువులో మిత్రావరుణులారా! పాడిగలిగి నిర్దుష్టములయి మందలలోఁగలవు. ఆ యావులంతరిక్షమందు సూర్యునింజూచి ఉదయాస్తమయములందు, దొంగను బట్టుకొనువాఁడఱచునట్లు,అఱచుచు సంచరించుచున్నవి. (ద్యావాపృథువుల కధిదేవతలు మిత్రావరుణులగుటచేత సుఖసంచారము జంతువులకు తదధీనమని తా.)

౧౫౮౨. ఆవామృతాయకే శినీ రనూషతమిత్రయత్ర వరుణా గాతుమర్పథః ।

అవత్మనా సృజతం పిన్వతం ధియోయువం విప్రస్య మన్మనామి రజ్యథః॥ ౬॥

ద॥ మిత్రావరుణులారా! మీరిద్దఱును ఏ యాగమునకు వత్తురో ఆ యాగమందు అగ్నియొక్క కేశములవంటి జ్వాలలు మీకు హవిస్సుల నందించుచున్నవి. స్వయముగా వర్షము కురిపించుడు. మాకర్మలను వృద్ధినొందింపుడు. మేధావియగు యజమానుని స్తుతులకు మీరీశ్వరులై యున్నారు.

౧౫౮౩. యోవాంయజ్ఞైః శశమానో హదా శతికవిర్హోతాయజతింమన్మసాధనః ।

ఉపాహాతం గచ్ఛథో వీథో అధ్వరమచ్ఛాగిరః సుమతింగంతమస్మయూ ॥౭॥

దం॥ ఏ యజమానుఁడు మిమ్ము యాగములో స్తుతించుచు హవిస్సుల నిచ్చుచున్నాఁడో ఎవఁడు మేధావియై తగిన సాధనములతో యజ్ఞము నాచరించుచున్నాఁడో యాయజమానునిగూర్చి చనుఁడు, అతని యజ్ఞముఁగోరుఁడు. మమ్ముఁ గోరుచున్న మీరు మాస్తుతులను గూర్చిరండు.

౧౫౮౮. యువాం యజ్ఞైః ప్రథమా గోభి రఞ్జత ఋతావానా మనసో న ప్రయుక్తిషు ।
భరన్తి వాం మన్మనా సంయతా గిరో దృప్యతా మనసా రేవదాశాథే॥ ౮॥

దం॥ వర్షోదకమునిచ్చు మిత్రావరుణులారా! మొదటివారైన మిమ్ము (స్తుతి) వాక్కులతో యాగప్రయోగములలో యజమానులు మీయందు మనసుంచి పూజించుచున్నారు. మిమ్ముఁ జెందిన స్తుతులను మనసుతోఁ గూర్చుచున్నారు, కనుక తిరస్కారము లేని మనసుతో మీరు ధనముగలిగించు మాకార్యము నవలంబించుచున్నారు

౧౫౮౯. రేవద్వయో దధాథే రేవదాశాథే నరా మాయాభి రితఊతిమాహినమ్ ।
న వాం ద్యావో ఽహభిర్నోత సిన్ధవో న దేవత్వం పణయో నానశుర్మఘమ్॥ ౯॥

దం॥ మిత్రావరుణులారా! మీరు ధనముతోఁగూడిన యన్నమును ధరించుచున్నారు. కనుకనే మమ్ముఁగూర్చి గమనించు మీ ప్రజ్ఞలచేత నతిమహత్తైన ధనయుక్తాన్నమును మాకిచ్చుచున్నారు రాత్రియుఁ బవలును మీ దేవత్వమును బొందలేదు. నదులుఁగూడఁ బొందలేదు. అసురులును బొందలేరు, మీకున్నధనము వారికి లేదు.

---

## సూక్తము. ౧౫౨.

దీర్ఘతమఋషి. త్రిష్టుప్ఛందం, మిత్రావరుణదేవత.

౧౫౯౦. యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రా మన్తవో హ సర్గాః ।
అవాతిరతమనృతాని విశ్వ ఋతేన మిత్రావరుణా సచేథే॥ ౧॥

దం॥ మిత్రావరుణులారా! చిరుగులు లేని వస్త్రములను (ఇచట కాంతులే వస్త్రములుగా వర్ణింపబడెను) మీరు కట్టుకొనుచున్నారు. మీ సృష్టికార్యములు అవిచ్ఛిన్నములై యెన్నదగినవి. ఇట్టి మీరు సకల పాపములను నశింపజేయుచున్నారు. మీరు సత్యముతో గూడి యున్నారు.

౧౫౨౨. ఏతచ్చన త్వో వి చికేతదేషాం సత్యో మన్త్రః కవిశస్త ఋఘావాన్ ।

త్రిరశ్రిం హన్తి చతురశ్రిరుగ్రో దేవనిదో హ ప్రథమా అజూర్యన్॥ ౨॥

దం॥ వీరిద్దఱిలో నొకడే మెచ్చదగిన కర్మ నాచరించును. ఆ యొక్కడును ఇతరులచే బాధింపరానివాడు. ఆలోచనకలవాడు, బుద్ధిమంతులచేత నుతింపబడువాడు. శత్రువుల హింసించువాడు. మూడంచుల యాయుధముగల శత్రువును నాలుగంచుల యాయుధముతో జయించును. ఉగ్రుడై చంపును. దేవనిందకులు స్వయముగానే మొట్టమొదటనే నశింతురు (దేవతాస్తుతి చేయువాడు ఒకడు నింద చేయువాడు రెండవవాడని తా.)

౧౫౨౩. అపాదేతి ప్రథమా పద్వతీనాం కస్తద్వాం మిత్రావరుణా చికేత ।

గర్భో భారం భరత్యా చిదస్య ఋతం పిపర్త్యనృతం ని తారీత్॥ ౩॥

దం॥ ఓ మిత్రావరుణులారా! పాదములుగల జంతువులకంటె ముందుగానే పాదములు లేని యుషస్సు వచ్చుచున్నది. (సూర్యుని రథముమీదనే వచ్చుటచేత పాదములు లేవని తా.) మీ యిద్దఱి యీ ప్రసిద్ధకర్మ నెవరెఱుంగుదురు? ఈ లోకము యొక్క భారము మీ శిశువగు (సూర్యుడు) భరించుచున్నాడు. అతడు సత్యమును (అనగా ప్రకాశమని తా.) పూరించును. అనృతమును (అనగా నంధకారమును) నశింపజేయును.

౧౫౨౪. ప్రయన్తమిత్పరి జారం కనీనాం పశ్యామసి నోపనిపద్యమానమ్ ।

అనవపృగ్ణా వితతా వసానం ప్రియం మిత్రస్య వరుణస్య ధామ॥ ౪॥

వం॥ సొగసయిన కన్యకలగు ఉషస్సులకు జారుడయిన సూర్యుని నడచువాని గానే చూచుచున్నాము. క్షణమైనను కూర్చుండుట చూడము. ఆ సూర్యుడు విడివిడిగా వ్యాపించిన తేజస్సులను వ్యాపింపజేయుచున్నాడు. ఇతడు ప్రియుడు మిత్రునకు, వరుణునకు ప్రీతికరమైన నివాసస్థానమయి యున్నాడు.

౧౫౨-౫. అనశ్వో జాతో అనభీశురర్వా కనిక్రదత్పతయదూర్ధ్వసానుః ।
అచిత్తం బ్రహ్మ జుజుషుర్యువానః ప్రమిత్రే ధామ వరుణే గృణన్తః ॥ ౫॥

వం॥ ఆ సూర్యుడు గుర్రాలున్నూ కళ్ళాలును లేకుండ శీఘ్రముగా రక్షణముచే నడిపించుచు ప్రకాశము గలిగించుచు మీదమీదను ఎత్తుగా గమించుచున్నాడు. మనస్సున తెలియగ శక్యముగాని పూర్వోక్త కర్మను మిత్రుని యందును వరుణునందును ఆధారపడినదానిగా నారోపించుచు మిత్రావరుణుల సామర్థ్యమును స్తుతించుచు మిక్కిలిగా మనుష్యులు సేవించుచున్నారు.

౧౫౨-౬. ఆ ధేనవో మామతేయమవన్తీర్బ్రహ్మప్రియం పీపయన్త్సస్మిన్నూధన్ ।
పిత్వో భిక్షేత వయునాని విద్వానాసావివాసన్నదితిమురుష్యేత్ ॥ ౬॥

వం॥ మమతా పుత్రుడయిన (మమతయను స్త్రీ) దీర్ఘతముడను నన్ను స్తోత్రం చేయు శక్తిగలవానిని, రక్షించుచు గోవులు తమ పొదుగులందున్న క్షీరముతో తృప్తి నొందించుగాక (మిత్రావరుణులే పొదుగలో పాలుగలిగింతురట) హవిస్సు నిచ్చిన దీర్ఘతముడు కర్మజ్ఞానముకలిగి హవిశ్శేషాన్నమును నోటితో మిమ్ము నడుగుగాక. (మిమ్ము సేవించుచు కర్మను పరిపూర్తిగలిగించి కాపాడునుగాక.

౧౫౨-౭. ఆ వాం మిత్రావరుణా హవ్యజుష్టిం నమసా దేవావవసా వవృత్యామ్ ।
అస్మాకం బ్రహ్మ పృతనాసు సహ్యా అస్మాకం వృష్టిర్దివ్యా సుపారా ॥ ౭॥

వం॥ మిత్రావరుణ దేవతలారా! స్తుతింపబడి రక్షణకొఱకు మాటిమాటికిని హవిస్సును భక్షింపుడు. ఇపుడు మేము చేయుచున్న కర్మ యుద్ధములందు శత్రువులను సహించుగాక. ద్యులోకమునుండి కలుగువర్షము మాకు తృప్తిని గలిగించునదగుగాక.

---

## సూక్తము, ౧౫౩.

పూర్వసూక్తవతు.

౧౭౯౩. యజామహే వాం మహః సజోషా హవ్యేభిర్మిత్రావరుణా నమోభిః ।
ఘృతైర్ఘృతస్నూ అధ యద్వామస్మే అధ్వర్యవో న ధీతిభిర్భరంతి ॥ ౧

దం॥ నేతిని స్రవింపఁజేయు మిత్రావరుణులారా! సమాన ప్రీతికలవారమై (యజమానఋత్విజులము) హవిస్సులతోను, నేతులతోను, నమస్కారములతోను మహాత్ములగు మిమ్ముఁ బూజింతుము. మఱియు నేకారణముచేత మమ్మును మా అధ్వర్యులను స్వకర్మలచేతఁ బోషించుచున్నారో ఆ కారణముచేతఁ బూజింతుము.

౧౭౯౪. ప్రస్తుతిర్వాం ధామ న ప్రయుక్తిరయామి మిత్రావరుణా సువృక్తిః ।
అనక్తి యద్వాం విదథేషు హోతా సుమ్నం వాం సూరిర్వృషణావియక్షన్॥ ౨

దం॥ మిత్రావరుణులారా! మీ యాగమును గూర్చిన సంకల్పము మాత్రమే మీ తేజస్సును మావద్దనుంచుచున్నది. మీ మనస్సు నాకర్షించిన వారమయితిమి. ఓ వర్షదాతలారా! యజ్ఞములందు మిమ్ముఁ గూర్చి మా హోత యెపుడు హవిస్సుల ర్పించునో యపుడు మీ మాహాత్మ్యమెఱింగిన నేను యాగముసేయ నిశ్చయించిన వాఁడనై మీవల్ల సుఖమును బొందుచున్నాను. (యజమానుని వాక్యమిది.)

౧౭౯౫. పీపాయ ధేనురదితిరృతాయ జనాయ మిత్రావరుణా హవిర్దే ।
హినోతి యద్వాం విదథే సపర్యన్త్స రాతహవ్యో మానుషో న హోతా॥ ౩॥

దం॥ ఆ రాతహవ్యుఁడు (రాజుపేరు) మిమ్ము, హోతవలె యజమానుని ప్రీతినొందించునట్లు ఎపుడు తృప్తి నొందించుచున్నాఁడో అపుడు మిత్రావరుణులారా! మీ యజ్ఞమందు హవిస్సులిచ్చిన యజమానునికొఱకుఁ బ్రియమయిన గోవు బహుక్షీరయయి తృప్తిసేయుచుఁగాక.

౧౭౬౩. ఉతవాం విక్షుమద్యాస్వంధో గావ ఆపశ్చ పీపయంత దేవీః ।

ఉతో నో అస్య పూర్వ్యః పతిర్దన్వీతం పాతం పయస ఉస్రియాయాః॥ ౪॥

డం॥ మిత్రావరుణులారా! మీ యన్నములయిన హవిస్సులచేతను పురోడాశాదులచేతను శోభిల్లు గోవులును ఉదకములును మీవల్ల హర్షించు జనులందు వృష్టి నిగలిగించుఁగాక. మఱియు ప్రాచీనపాలకుఁడగు నగ్ని మా యీయన్నమునకు దాతయగుగాక, పాఁడిమొదవుయొక్క క్షీరమును త్రావుఁడు.

---

## సూక్తము. ౧౫౪.

దీర్ఘతమ, త్రిష్టుప్ఛం, విష్ణుదేవత.

౧౭౬౪. విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి ।

యో అస్కభాయ దుత్తరం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః ॥ ౧॥

దం॥ విష్ణువుయొక్క వరకర్మలను అతిశీఘ్రముగాఁ జెప్పుచున్నాను. పృథివీసంబంధమైన (మూఁడు) లోకములను మఱియు నావిష్ణువే విశేషముగా సృజించెను. మఱియు నావిష్ణువే అన్నిటికి మీఁదనున్న లోకమును నిశ్చలముగా స్థాపించెను. బహుమందిచేతను స్తుతింపఁబడువాఁడై మూఁడువిధములుగా నడచి లోకములను సృజించెను. (త్రివిక్రమావతారము సూచన)

౧౭౬౫. ప్రతద్విష్ణు స్తవతే వీర్యేణ మృగో నభీమః కుచరో గిరిష్ఠాః ।

యస్యోరుషు త్రిషు విక్రమణే ష్వధిక్షియన్తి భువనాని విశ్వా॥ ౨॥

దం॥ కుత్సితముగా హింసించునట్టి పర్వతము మీఁదనివసించునట్టి భయంకరమైనట్టి మృగమువలె ఆవిష్ణువు వరకర్మలచేత నందఱిచేతను స్తుతింపఁబడుచున్నాఁడు. మఱియు నావిష్ణువుయొక్క విశాలమయిన మూఁడడుగులందు సమస్తలోకములు నిమిడియున్నవి.

౧౫౯౯. ప్రవిష్ణవే శూషమేతు మన్మ గిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే ।

యఇదం దీర్ఘం ప్రయతం సధస్థమేకో విమమే త్రిభిరిత్పదేభిః ౩॥

దం॥ బహుమందిచే స్తుతింపఁబడినట్టి మంత్రమందు; లేక ఉన్నత స్థలమందు నివసించునట్టి ఆవిష్ణువు కొఱకు గొప్పదియు మేము నిర్మించినదియు నగు స్తోత్రము చెందుగాక. మఱియు నావిష్ణువు ఈ కనంబడుచున్న విశాలమయిన ఏకరీతినున్న కలిసియున్న యీ లోకమును మూఁడుపాదములతోను ఒక్కఁడే ఆక్రమించెను.

౧౬౦౦. యస్య త్రీ పూర్ణా మధునా పదాన్యక్షీయ మాణాస్వ ధయామదన్తి ।

యఉత్రిధాతు పృథివీ ముతద్యామేకో దాధార భువనానివిశ్వా॥ ౪॥

దం॥ ఏ విష్ణువుయొక్క మధురమైన పూర్ణమయిన మూఁడు పాదములు ఎపుడును అన్నముచే క్షీణింపనివై (ఆశ్రితులను) మదింపఁజేయుచున్నవి. భూమిని మఱియు ద్యులోకమును ఎవఁడయితే సమస్త లోకములను ఒక్కఁడే మూఁడుధాతువులుకల వాటినిగా నుత్పత్తిచేసెను. (పృథ్వ్యప్తేజస్సులు మూఁడు ధాతువులు.)

౧౬౦౧. తదస్య ప్రియమభిపాథో అశ్యాం నరో యత్ర దేవయవో మదన్తి ।

ఉరుక్రమస్య సహిబన్ధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వఉత్సః॥ ౫॥

దం॥ దేవునిగోరి యాగములుచేసిన నరులు ఏ స్థానమందు తృప్తినొందియుందురో విస్తారపాదన్యాసముగల యే విష్ణుని ఉత్కృష్టస్థానమందు మధురమైన ప్రవాహము గలదో ఆ విష్ణునకు ప్రియమైన ఆ స్థానమును నేను చేరుదునుగాక. అతఁడే యీ విధముగ నెల్లఱకు బంధువు.

౧౬౦౨. తావాం వాస్తూన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృఙ్గా అయాసః ।

అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పదమవభాతి భూరి॥ ౬॥

దం॥ ఏ స్థానములందు కిరణములు మిక్కిలి పొడవయినవి అతివిస్తారమైనవి అగుచున్నవో ఆ నివాసయోగ్యస్థానములు మీరు చేయుటకు ఓ పత్నీయజమానులారా మీకై కోరుచున్నాము. అచ్చటనే కదా, బహుమందిచే స్తుతింపఁబడునట్టి, వర్షించునట్టి ఉత్కృష్టమైనట్టి, విష్ణువుయొక్క ఆ స్థానము విశాలముగాఁ బ్రకాశించుచున్నది!

—:-౦-:—

## సూ క్త ము. ౧౫౫.

దీర్ఘతమ, జగతి, విష్ణు.

౧౬౦౩. ప్రవఃపాన్త మన్ధసో ధియాయతే మహే శూరాయ విష్ణవే చార్చత ।
యాసా నునిపర్వతానా మదాభ్యా మహస్తస్థతురర్వతేవ సాధునా॥ ౧॥

దం॥ స్తవములంగోరునట్టి, గొప్పవాఁడయినట్టి, శూరుఁడయినట్టి విష్ణువు కొఱకు నింద్రుని కొఱకును, ఓ అధ్వర్యుఁడు మొదలగు ఋత్విజులారా! మీరు పాలించు చున్న సోమరూపాన్నమును బాగుగ సంపాదింపుఁడు. ఇష్టమయిన చోటికి గమనింప గల వేగవంతమయిన గుఱ్ఱముంబోలి గొప్పవయి యితరులకు స్వాధీనముకాని మేఘోన్నతస్థానములను ఏయిద్దఱు నాక్రమించియున్నారో ఆ యిద్దఱకును అని యన్వయము. (ఇంద్ర, విష్ణువులిద్దఱని తా.)

౧౬౦౪. త్వేషమిత్థా సమరణం శిమీవతో రిన్ద్రావిష్ణూసుత పావా మురుష్యతి ।
యామర్త్యా యప్రతి ధీయమాన మిత్కృశా నోరస్తు రసనామురుష్యథః॥ ౨॥

దం॥ ఓ యింద్రావిష్ణులారా! కర్మలవంతులయిన మీ యిద్దఱి ప్రకాశవంత మయిన యీ చక్కనిగమనము యజమానుఁడు పూజించును. (ఇచట కర్మయన మేఘములఁ జీల్చుటనికూడ నర్థమువ్రాసిరి) ఓ యింద్రవిష్ణులార! యజమానున కివ్వవలసినట్టి ఫలరూపమయినట్టి, శత్రుతిరస్కారములేనట్టి, చలనశీలమయినట్టి, హవి ర్దానమును మీ యిద్దఱును అగ్నినుండి ప్రవర్తింపఁ జేయుచున్నారు. (సుత + పాః= సోమము త్రాగువాఁడనికూడ.)

౧౬౦౫. తా ఈంవర్ధయన్తి మహ్యస్య పౌంస్యం నిమాతరా నయతి రేతసే భుజే ।
దధాతి పుత్రోవరం పరంపితుర్నా మతృతీయ మధిరో చనేదివః॥ ౩॥

దం॥ ఆ సోమరూపహవిస్సులు ఈ యింద్రుని గొప్పపౌరుషమును వృద్ధిపఱచుచు న్నవి. ఆ యింద్రుఁడు తల్లులయిన ద్యావాపృథివులకు సోమపానమువల్లఁ గలిగిన సామర్థ్యమును, రేతస్సు కొఱకును భోగముకొఱకును ప్రకాశించునట్టి సూర్యమం

డలముమీఁది భాగమందుఁ జేర్చుచున్నాఁడు. నరుఁడు ఆ సామర్థ్యమె వేఱువేఱయి తాను మూఁడవవాఁడగు తండ్రిగాను, రెండవకొడుకుగాను ఒకటవమనుమఁడుగా నగుచున్నాఁడు.

౧౬౦౬. తత్తదిదస్య పౌంస్యంగృణీ మసీనస్య త్రాతురవృకస్య మీఢ్యుషః ।

యంపార్థి వాని త్రిభిరిద్విగామ భిరురుక్రమిష్టో రుగాయాయజీవసే॥ ౪॥

టీ॥ సర్వమునకుఁ బ్రభువును బరిపాలకుఁడును హింసారహితుఁడును వర్షము కురిపించువాఁడును అగు నీ విష్ణుని పౌరుషమును స్తుతికర్తలమగు మేము రక్షణకుగా స్తుతించుచున్నాము. ఏ విష్ణువు పృథివ్యాదిలోకములను మూఁడుపాదన్యాసముల తోనే పూర్తిగా నాక్రమించినాఁడో యావిష్ణు పౌరుషమని పూర్వాన్వయము.

౧౬౦౭. ద్వేఇదస్య క్రమణే స్వర్దృ శోభిఖ్యాయమర్త్యో భురణ్యతి ।

తృతీయమస్య నకిరా దధర్షతివయశ్చ నపతయ న్తః పతత్రిణః॥ ౫॥

టీ॥ స్వర్గమును జూచినట్టి యీ విష్ణుని రెండుపాదన్యాసములను మనుష్యుఁడు స్తుతించి సేవించుచున్నాఁడు. ఈ విష్ణుని మూఁడవపాదము (అనఁగా ద్యులోకము) ఎవఁడును మనసుతోఁ దెలియలేడు. సర్వత్రగమనము చేయువాయువులు పక్షు లును దెలిసికొనఁజాలవు.

౧౬౦౮. చతుర్భిగ సాకంనవతిం చనామభి శ్చక్రంన వృత్తం వ్యతీ రవీ విపత్ ।

బృహచ్ఛరీరో విమిమాన ఋక్వ భిర్యువాకుమారః ప్రత్యేత్యా హవమ్॥ ౬॥

టీ॥ (ఆదిత్యరూపుఁడగు) విష్ణువు తొంబదినాల్గు గమనములచేత వివిధగతులను వృత్తమువలెఁ ద్రిప్పుచున్నాఁడు. (అనఁగా సంవత్సరమొకటి రెండయనములు, ఆయి దఋతువులు, పండ్రెండుమాసములు, ఇరువదినాల్గు పక్షములు, ముప్పది యహోరాత్రములు, ఎనిమిదిజాములు ౧ + ౨ + ౫ + ౧౨ + ౨౪ + ౩౦ + ౮ = ౮౨ ౧౨ ద్వాదశరాశులు = ౯౪ మొత్తము తొంబదినాల్గు) ఇట్టి కాలాత్మకవిష్ణువు గొప్ప శరీరముకలవాఁడయి వివిధశరీరములుగాఁ గనంబడుచు నన్నిఁటిలోఁ గలిసి యధికుఁ డయి యాహ్వానమునుగూర్చి వచ్చుచున్నాఁడు. (సూర్యునే విష్ణువను పేరున నిందు వాడఁబడినది.)

---

## సూక్తము ౧౫౬.

పూర్వసూక్తవతు.

౧౭౮౯. భవామిత్రో నశేవ్యో ఘృతాసుతి ర్విభూతద్యుమ్న ఏవయా ఉసప్రథాః ।
అధాతే విష్ణో విదుషాచిదర్ధ్యః స్తోమో యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా ॥ ౧ ॥

దం॥ ఓ విష్ణూ! మిత్రునివలె సుఖముగలిగించువాఁడవు ఉదకమును బుట్టించువాఁడవు విస్తారముగా నన్నము గలిగించువాఁడవు రక్షించువాఁడవునై అన్నివిధముల గొప్పవాఁడవును నీవయియుందువుగాక. ఇట్టివాఁడవు కనుకనే నీస్తోత్రము నీమాహాత్మ్య మెఱింగిన యజమానునిచేత మాటిమాటికి హెచ్చింపఁ బడుచున్నది. నీయజ్ఞముకూడ హవిస్సులనిచ్చు నాయజమానునిచేత నారాధింపఁదగినదయ్యెను.

౧౭౯౦. యఃపూర్వ్యాయ వేధసే నవీయసే సుమజ్జానయే విష్ణవే దదాశతి ।
యోజాతమస్య మహతోమహి బ్రవత్సేదు శ్రవోభిర్యుజ్యం చిదభ్యసత్ ॥ ౨ ॥

దం॥ నిత్యుఁడయి వివిధజగత్కర్తయై నిత్యనూతనుఁడగుచుఁ దనంతటఁదానే పుట్టిన విష్ణువుకొఱకు నేమర్త్యుఁడు హవిస్సుల నిచ్చునో, మఱియు మహాత్ముఁడగు నీతని పూజ్యమయిన జన్మము నే మనుష్యుఁడు స్తుతించునో, ఆ హవిర్దాతయు స్తుతికర్తయు నన్నము కలిగి విష్ణుస్థానమునకే చేరును,

౧౭౯౧. తముస్తోతారః పూర్వ్యంయథావిద ఋతస్య గర్భంజనుషా పిపర్తన ।
ఆస్యజానన్తో నామచిద్వివక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే ॥ ౩ ॥

దం॥ ఓ స్తుతికర్తలారా! ఆ విష్ణువునే అనాదిసిద్ధునిగాను యజ్ఞరూపముగఁ బుట్టినవానిగాను, లేక ఉదకములు కలిగించువానిగాను యథావిధముగాఁ దెలిసికొంటిరో అవిధముగ స్వయముగానే స్తుతులను సంపాదింపుఁడు. ఈతని నామమునే తెలియుచు నంతటను జెప్పుఁడు. ఓవిష్ణూ! మహాత్ముఁడవైన నీశోభనమైన బుద్ధిని మేము సేవించుచున్నాము.

౧౬౧౨. తమస్య రాజా వరుణ స్త మశ్వినా క్రతుంస చన్త మారుతస్య వేధసః ।
దాధారదక్షము త్త మమహర్విదం వ్రజంచ విష్ణు స్సఖివా అపోర్ణుతే॥ ౪॥

దం॥ ఋత్విజులసమూహముకలట్టి, మేధావియగునట్టి, యజమానుని ప్రసిద్ధయాగమును వరుణుఁడు సేవించుఁగాక. అశ్వినీదేవతలు సేవింతురుగాక. విష్ణువు స్నేహముకలవాఁడై యుత్కృష్టమైన స్వర్గమును బుట్టించునట్టి బలమును ధరించెను. మేఘమునుగూఁడ దెఱచును.

౧౬౧౩. ఆయోవి వాయ సచథాయ దైవ్య ఇంద్రాయ విష్ణు స్సుకృతే సుకృత్తరః ।
వేధా అజిన్వ న్త్రి షధస్థ ఆర్యమృతస్య భాగే యజమాన మాభజత్॥ ౫॥

దం॥ ఏ విష్ణువు ద్యులోకమందుఁ బుట్టినవాఁడై మంచిఫలములిచ్చువారిలో శ్రేష్ఠుఁడగుచు యాగసాహాయ్యము కొఱకుఁ జక్కని స్తుతినొనర్చు యజమానునిగూర్చి వచ్చుగాక. (వచ్చి) అభిమతఫలములఁ గలిగించువాఁడయి మూఁడులోకముల నావరించిన విష్ణువు ఆర్యుఁడయిన యజమానుని బ్రీతునింజేయును. యజ్ఞభాగమతనికి నిచ్చును, (హుత శేషము యజమానుఁడు భక్షించును)

ఇట్లు మొదటి మండలమున నిరువదొకటవ యనువాకము.

---

## అనువాకము. ౨౨.

### సూక్తము. ౧౫౭.

అశ్వినీదేవత - తక్కినవి పూర్వవతు.

౧౬౧౪. అబోధ్యగ్నిర్జ్మఉదేతి సూర్యోవ్యుషా శ్చన్ద్రా మహ్యావో అర్చిషా ।
ఆయుక్షాతా మశ్వినాయాతవే రథంప్రాసా వీద్దేవ స్సవితా జగత్పృథక్॥ ౧॥

దం॥ ఈ యగ్ని భూమిసంబంధియని తెలియఁబడుచున్నాఁడు. సూర్యుఁడుదయించుచున్నాఁడు. గొప్పదగు నుష తేజస్సుతో లోకమును సంతోషపెట్టుచు రక్షించుచున్నది. కనుకనే ఓ యశ్వినులారా! మీరథమును నడచుటకుఁ బూన్పుఁడు. సవితృదేవుఁడు జగత్తును వేఱువేఱుపనులలో ననుమతించుఁగాక.

౧౬౧౫. యద్యుఞ్జాథే వృషణమశ్వినా రథం ఘృతేనన్నో మధునాక్షత్రముక్షతమ్ ।
అస్మాకం బ్రహ్మపృతనాసుజిన్వతం వయంధనా శూరసాతా భజేమహి ॥ ౨॥

దం॥ అశ్వినులారా! వర్షమును గురిపించురథమును మీరెపుడు పూన్చుచున్నారో అప్పుడు మాబలమును తేనెతోను, నేతితోను తడుపుడు. (అనఁగా వృద్ధినొందింపుడని తా.) మామనుష్యులలో బ్రహ్మతేజస్సు ప్రకాశించుఁగాక. శూరులతోఁ గల్గిన యుద్ధములో వారి ధనము మేము పొందుదుముగాక.

౧౬౧౬. అర్వాఙ్ త్రిచక్రో మధువాహనో రథో జీరాశ్వో అశ్వినోర్యాతు సుష్టుతః ।
త్రివన్ధురో మఘవా విశ్వసౌభగః శంన ఆవక్షద్ద్విపదే చతుష్పదే ॥ ౩॥

దం॥ మూఁడు చక్రములుకలది తేనెకలది వడిగల గుఱ్ఱములుకలది స్తుతింపఁదగినది మూఁడు నొగదండెలు కలది సర్వసౌభాగ్యములు కలది యయి యశ్వినులరథము మాకభిముఖముగా వచ్చుఁగాక. ద్విపాద చతుష్పాదజంతువులకు సుఖము గలిగించుఁగాక.

౧౬౧౭. ఆనఊర్జం వహతమశ్వినాయువం మధుమత్యానః కశయా మిమిక్షతం ।
ప్రాయుస్తారిష్టం నీరపాంసి మృక్షతం సేధతం ద్వేషోభవతం సచాభువా ॥ ౪॥

దం॥ అశ్వినులారా! మాయన్నమును గొనితెండు. తేనెతోఁ గూడిన వాక్కుతో మమ్ము తడుపుడు. ఆయుస్సును వృద్ధినొందింపుడు. పాపములను నశింపఁజేయుడు, శత్రువులను నశింపజేయుఁడు (మాతో) మీరు కలిసి మెలసి యుండుడు.

౧౬౧౮. యువం హ గర్భం జగతీషుధత్థో యువం విశ్వేషు భువనేష్వన్తః ।

యువమగ్నించ వృషణావపశ్చ వనస్పతీ రశ్వినా వైరయేథామ్॥ ౫॥

దం॥ అశ్వినులారా! నడచుగోవులయందు గర్భమును మీరేకదా ధరింపఁజేయు చున్నారు! మఱియు సమస్తభువనములందు గర్భమును ధరింపఁజేయుచున్నారు. ఇతర ప్రాణులకని తా. అనఁగా వర్షముద్వారా అన్నము దానివల్ల రేతస్సు (అందువల్ల గర్భమునని తా.) ఓ వర్షకర్తలారా! అగ్నిని ఉదకములను చెట్లను ప్రవర్తింపఁ జేయుచున్నారు.

౧౬౧౯. యువంహస్థో భిషజా భేషజేభిరథో హస్థో రథ్యా౩ రాథ్యేభిః ।

అథోహక్షత్ర మధిధత్థ ఉగ్రా యో వాంహవిష్మాన్మనసా దదాశ॥ ౬॥

దం॥ అశ్వినులారా! ఔషధములతో మీరుకదా వైద్యులయి యున్నారు మఱియు గుఱ్ఱాలతో రథవంతులయియున్నారు. ఇంకను మీబలమధికముకదా! కనుకనే సమర్థులారా! (మీయందుంచిన) మనస్సుతో నేయజమానుఁడు మీకు హవిస్సులిచ్చునో (వాని హవిస్సుల నందుకొనుఁడని.)

# తృతీయాధ్యాయము.

—(♦)—

## సూక్తము. ౧౫౮.

అశ్వినీదేవత - దీర్ఘతమఋషిః త్రిష్టుప్ఛన్దః,

౧౬౨౦. వసూ రుద్రా పురుమన్తూ వృధన్తా దశస్యతంనో వృషణావభిష్టౌ ।
దస్రా హ యద్రేక్ణ ఔచథ్యో వాం ప్రయత్సస్రాథే అకవాభిరూతీ॥ ౧॥

ద౧॥ వర్షించునట్టి యశ్వినులారా! నివాసము నిచ్చువారును దుఃఖమును బోఁగొట్టువారును అభిముఖముగాఁ బూజింపఁదగినవారును అగు మీరు ఇష్టము నివ్వఁదలుపుఁడు. ఏమనఁగా దీర్ఘతముఁడు మీ ధనమును ప్రార్థించుచున్నాఁడు, కనుక కుత్సితముకాని రక్షణలతో వరముల మిక్కిలిగా నివ్వఁదలంపుఁడు.

౧౬౨౧. కోవాందాశత్సుమతయే చిదస్యై వసూ యద్ధేథే నమసా పదే గోః ।
జిగృతమస్మే రేవతీః పురంధీః కామప్రేణేవ మనసా చరన్తా॥ ౨॥

ద౦॥ నివాసము గలిగించునట్టి యశ్వినులారా! మీ సంబంధమయిన యీ (చెప్పఁబోవు) బుద్ధికొఱకు నెవఁడు తగినట్లుగా హవిస్సులనివ్వగలఁడు? ఏ హేతువువల్ల భూతలమందు (అనఁగా వేదికయందని తా॥) హవిరూపమయిన యన్నముతో మంచి బుద్ధిని ధరించుచున్నారో ఆ హేతువుచేతఁ గోర్కెలనిచ్చు మనసుతోఁగలసి తిరుగుచు మీరిద్దఱును శరీరధారకమగు పాఁడి మొదవులనిండు.

౧౬౨౨. యుక్తో హ యద్వాం తౌగ్ర్యాయ పేరుర్వి మధ్యే అర్ణసో ధాయి పజ్రః ।
ఉపవామవః శరణం గమేయం శూరో నాజ్మ పతయద్భిరేవైః॥ ౩॥

ద౦॥ ఓ యశ్వినులారా! సముద్రమధ్యమందు తౌగ్ర్యుని (భుజ్యుని) కొఱకు మీ రథమున గుఱ్ఱములు కట్టఁబడెనుగదా! ఆతఁడు ఒడ్డునకుఁ దేఁబడినాఁడు. కనుక వేగముగల గుఱ్ఱాలతో యుద్ధమునకేగిన శూరునివలె మేము మీ రక్షణమును ఆశ్రయింతుము.

౧౬౨౩. ఉపస్తుతిరౌచథ్య మురుష్యే న్మామామిమే పతత్రిణీ విదుగ్ధామ్ ।

మామామేధో దశతయశ్చితో ధాక్ప్రియ దాంబద్ధస్త్మని ఖాదతిక్షామ్॥ ౪॥

దం॥ ఓ యశ్వినులారా ( మనసారమిమ్ము స్తుతించుస్తుతి ఉచథపుత్రుఁడగు నన్ను (దీర్ఘతముఁడు) రక్షించును. మాటిమాటికి మారుచు నీకనవచ్చుచున్న అహో రాత్రములు ప్రాణహీనునింజేయకుండుఁగాక. ఏ కారణమువల్ల మీవాడనగు నేను దారిద్ర్యతోఁ గట్టబడి భూమిపై దొర్లుచున్నానో ఆకారణమున నన్ను రక్షింపుడు.

౧౬౨౪ నమాగరన్నద్యో మాతృతమాదా సాయదీం ససముబ్ధమ వాధుః ।

శిరోయదస్య త్రైతనో వితక్షత్స్వ యందాస ఉరో అంసావపిగ్ధ॥ ౫॥

దం॥ తల్లులంబోలి జగమునుబోషించు నదులు నన్ను (దీర్ఘతముని) మునిగి పోకుండ నుంచుఁగాక. ఏమాటే దాసులు (అనఁగా గర్భదాసులు) ఈనన్ను గట్టిగా బన్ధించి బోరగిలఁ బడఁద్రోసిరి మరియు ఈనా శిరస్సును త్రైతనుఁడను దాసుఁడు గాట్లుపెట్టినాడు. వక్షస్థలమును బుజములనుగూడ గంట్లుపెట్టెను. (దీర్ఘతముని దాసులు అతనిసేవ సేయలేక యిట్లుచేయగా నశ్వినులు రక్షించిరట- పూర్వము పుట్టగానే మనుష్యులను వారి తలిదండ్రులనుండి కొనుక్కొని నౌకర్లుగా నుంచు కొందురట! వారే గర్భదాసులు జ్ఞానమువచ్చినతరువాత గొన్నవారు దాసులు. వీరు కుటుంబములోవారివలెనే ఒకరినొకరు విడువవీలులేదు. అందుచేత నౌకరీ చేయలేక వారీయజమానుని ట్లుచేసిరని కథ.)

౧౬౨౫. దీర్ఘతమామామతే యోజుజుర్వాన్దశమే యుగే ।

అపామర్థం యతీనాం బ్రహ్మాభవతి సారథిః॥ ౬॥

దం॥ దీర్ఘతమర్షి మమతాపుత్రుఁడు పదియుగములవఱకు (సుఖముగాఁ బుత్ర పౌత్రులతోఁ దులదూగెను.) తరువాత ముసలివాఁడై జీర్ణించి పురుషులుకోరునట్టి ప్రజలకు బ్రహ్మసమానుడై యుండును. దేవత్వముగూడఁ బొందును.

## సూక్తము. ౧౫౯.

దీర్ఘతమ - జగతి ద్యావాపృథివి

౧౬౨౬. ప్రద్యావా యజ్ఞైః పృథివీ ఋతావృధా మహీ స్తుషే విదథేషు ప్రచేతసా ।
దేవేభిర్యే దేవపుత్రే సుదంససేత్థా ధియా వార్యాణి ప్రభూషతః ॥ ౧ ॥

తా॥ యజ్ఞములు వృద్ధిపఱచునట్టి, విశాలములునట్టి, యజ్ఞములందు మాకు గలిగించునట్టి ద్యావాపృథువులను స్తుతించుచున్నాను. అవి యజమానులచేత సేవింపబడినవై శుభకర్మలుకలవై సత్యమయిన బుద్ధితో గోత్రాలను మాకిచ్చుగాక.

౧౬౨౭. ఉతమన్యే పితురద్రుహో మనో మాతుర్మహి స్వతవస్తద్ధవీమభిః ।
సురేతసా పితరా భూమ చక్రతురురు ప్రజాయా అమృతం వరీమభిః ॥ ౨ ॥

తా॥ మరియు ద్రోహముచేయని తండ్రియగు ద్యులోకముయొక్క స్వంతబలమును ఆ మనస్సును ఆహ్వానములచేత ప్రార్థించుచున్నాను. తల్లియగు పృథివియును (ద్యావాపృథువులు) శోభన సామర్థ్యముచేత శ్రేష్ఠమయిన రక్షణలచేత ప్రజకు విస్తారముగా నమృతమును (చావులేని తనమును) కలిగింతురుగాక.

౧౬౨౮. తేసూనవః స్వపసః సుదంససో మహీజజ్ఞుర్మాతరా పూర్వచిత్తయే ।
స్థాతుశ్చ సత్యం జగతశ్చ ధర్మణి పుత్రస్య పాథః పదమద్వయావినః ॥ ౩ ॥

తా॥ మీకొడుకులగు ఆప్రజలు మంచికర్మలు చేయువారు మంచి జ్ఞానవంతులును అయి మీ యనుగ్రహముకొఱకు మిమ్ముఁ దలిదండ్రులుగా నెఱుఁగుచున్నారు. (మిమ్ముఁదప్ప) రెండవదాని నెఱుఁగని స్థావరజంగమ రూపమయిన కొమారుల (అనఁగా జీవులనని తా॥) రక్షణనిమిత్తము ద్యావాపృథువులారా! సత్యస్థానము నిండు.

౧౬౨౯. తేమాయినో మమిరే సుప్రచేతసో జామీ సయోనీ మిథునా సమోకసా ।
నవ్యంనవ్యం తంతుమా తన్వతే దివి సముద్రే అంతః కవయః సుదీతయః ॥ ౪ ॥

దం॥ ఒకదానికొకటి అక్కసెల్లెండ్రయి యున్నట్టి ఒకేజన్మస్థానముగలట్టి ఒకదాని నొకటి విడువకుండునట్టి, ఒక్కచోటనున్నట్టి ఆ ద్యావాపృథువులను ప్రజ్ఞావంతము లయిన మంచిపనులుచేయు కిరణములు ఆవరించుచున్నవి (కప్పుచున్నవి) మఱియు మేధావులును ప్రకాశస్వభావములును అగు కిరణములు అంతరిక్షము మధ్యను (సముద్ర=అంతరిక్షము) క్రొత్తక్రొత్తగా విస్తరించినవై క్రమ్ముచున్నవి.

౧౬౩౦. తద్రాధో అద్య సవితుర్వరేణ్యం వయం దేవస్య ప్రసవే మనామహే।

అస్మభ్యంద్యావాపృథివీ సుచేతునార యింధత్తం వసుమంతం శతగ్విసమ్.॥ ౫॥

దం॥ మేము (యజమానులు) సవితృదేవునియొక్క అనుజ్ఞనొంద శ్రేష్ఠమయిన ఆ ధనమును ఇపుడిమ్మని కోరుచున్నాము. మా నివాసముకొఱకు యోగ్యమయిన నూర్లకొలది గోవులుకల ధనమును మాకిమ్మని ద్యావాపృథువులను యాచించు చున్నాము.

---

సూక్తము. ౧౬౧.

దీర్ఘతమ - జగతి - ద్యావాపృథివి

౧౬౩౧. తేహిద్యావా పృథివీ విశ్వశంభువ ఋతావరీరజసో ధారయత్కవీ।

సుజన్మనీ ధిషణే అంతరీయతే దేవోదేవీధర్మణా సూర్యశ్శుచిః॥ ౧॥

దం॥ శుద్ధమయి ప్రకాశమాను ఉదకమును ఇచ్చునట్టి సూర్యుఁడు; పోషణము లతోఁగూడి ప్రపంచమును సుఖింపఁజేయునట్టి విశేషముగా నుదకము ధరించు పాండిత్యముగలట్టి, ఉదకధారకులైన సూర్యుఁడుగలిగినట్టి, శోభనజన్మ కలట్టి, తమ వ్యాపారములందు ప్రగల్భములయినట్టి, ప్రకాశించునట్టి, యాద్యావాపృథువుల మధ్యను; సర్వదా గమనించుచున్నాఁడు.

౧౬౩౨. ఉరువ్యచసా మహినీ అసశ్చతా పితామాతాచ భువనానిరక్షతః।

సుధృష్టమేవపుష్యే౩ నరోదసీ పితాయత్సీమభిరూపైర వాసయత్। ౨॥

ద॥ విశాలమయినవి కనుకనే పెద్దవి ఒకదానితో నొకటి కలయిక వేఱువేఱుగా నున్నవి అగు; తండ్రియయిన ద్యులోకము తల్లియయిన పృథివియు లోకములను రక్షించుచున్నవి. మిక్కిలి ప్రౌఢములయిన ద్యావాపృథువులు సర్వప్రాణుల శరీరములను తలిదండ్రులవలె రక్షించుచున్నవి. ఏమంటే అన్నివిషయములలోను దాత్రియగు ద్యులోకమును రూపములతో (వర్షాది సాధనములతోనని తా॥) వ్యాపించి యున్నది.

౧౬౩౩. సవహ్నిః పుత్రః పిత్రోః పవిత్రవాన్పునాతి ధీరో భువనాని మాయయా ।

ధేనుంచ పృశ్నింవృషభం సురేత సంవిశ్వాహాశు క్రంపయో అస్యదుక్షత॥ ౩॥

ద॥ తలిదండ్రులయిన ద్యావాపృథువులకు బుత్రుండై బుద్ధిమంతుండై ఫలములను ధరించిన ఆసూర్యుండు తనప్రజ్ఞతో సమస్తభూతములను బవిత్రముచేయుచున్నాండు. అతండే తెల్లనియావును (అనంగా భూమిని) మంచి రేతస్సు (అనగా వర్షము)గల వృషభమును (అనంగా ద్యులోకము) సర్వదా తనప్రజ్ఞతోం బవిత్రము చేయుచున్నాండు. ఈ ద్యులోకమునుండి యుదకమును బిదుకుచున్నాడు.

౧౬౩౪. అయందేవానా మపసామప స్తమో యోజజానరోదసీ విశ్వశంభువా ।

వియోమమే రజసీ సుక్రతూయయా జరేభిః స్కంభనేభిః సమానృచే॥ ౪॥

ద॥ భూతములకు సుఖముగలిగించు ద్యావాపృథువులను ఏదేవుడు పుట్టించెనో, ఏదేవుండు ప్రాణుల సుఖముగలిగించు పనికోరి ఆరెండులోకములను స్పష్టమై కదలనివ్వని మేకులతో బిగించియుంచెనో ఆతండు దేవతలలో గొప్పదేవుండు పనివారలలో గొప్ప పనివాండు.

౧౬౩౫. తేనోగృణానే మహినీమహి శ్రవః క్షత్రంద్యావా పృథివీధాసథో బృహత్ ।

యేనాభి కృష్టీ స్తతనామ విశ్వహా పనాయ్యమోజో అస్మే సమిన్వతమ్॥ ౫॥

ద॥ ఆ ద్యావాపృథువులు మాచే స్తుతింపబడుచు నధికమయిన మా యన్నమును ధరించుచున్నవి. ఏబలముతో సర్వకాలము మేము పుత్రపౌత్రులతో వెలయుదుమో యట్టి యధికమయిన పౌరుషమును ధరించియున్నవి స్తుతింపందగిన శరీరబలమును మాయందుం జక్కగా వృద్ధిపొందించుచున్నవి.

## సూక్తము. ౧౬౧.

ఋభుదే - దీర్ఘతమ జగతులు

౧౬౩౬. కిము శ్రేష్ఠః కింయవిష్ఠోన ఆజగన్కిమీయతే దూత్యం౹ కద్యదూచిమ్ ।

నని న్దిమచమసం యోమహాకులోగ్నే భ్రాతర్ద్రుణ ఇద్భూతి మూదిమ ॥ ౧॥

దం॥ ఇతడు మనకంటె గొప్పవాఁడా! మనకంటెను బిన్నవయసువాఁడా! మావద్దకువచ్చినాడే! దేవదూత యేమియితడు? మన యీ సందేహము తీరుటెట్లు? ఓ యగ్నీ! అన్నయ్యా! చమస (=పానపాత్ర)ను ఎంగిలిచేయకుము అది మహా కులమందుఁ బుట్టినది! కఱ్ఱతోఁ జేసిన చమస యెట్లువచ్చినదో చెప్పకుము. (సుధన్వని కొడుకులు ఋభువులు ముగ్గురు వారు మొదట మనుష్యులే సత్కర్మచేత దేవతలయినారు. దేవతలతో సోమపానముచేయుటకు యజ్ఞసలమునకువచ్చిరి. అగ్ని వారిరూపమునుధరించి నాల్గవవాఁడుగా వారవద్ద నిలువఁబడెను. అప్పటి ఋభువుల మాటలివి.)

౧౬౩౭. ఏకంచమసం చతురః కృణోతన యద్వో దేవా అబ్రువన్తద్వ ఆగమమ్ ।

సౌధన్వనా యద్యేవాకరిష్యథ సాకం దేవై ర్యజ్ఞియాసో భవిష్యథ॥ ౨॥

దం॥ ఓ సౌధన్వనులారా! మీరు ఒక్క చమసను నాలుగు చమసలుగాఁ జేయుఁడు. ఆపని దేవతలుచెప్పిరి. ఆమాటజెప్పుటకు నేనువచ్చితిని మీరట్లుచేసితిరా దేవతలతోఁగూడ యజ్ఞార్హులగుదురు (అని అగ్నిపలికెను.)

౧౬౩౮. అగ్నిందూతం ప్రతి యద బ్రవీతనాశ్వః కర్త్వోరథ ఉతేహకర్త్వః ।

ధేనుః కర్త్వా యువశా కర్త్వా ద్వాతాని భ్రాతరనువః కృత్వ్యేమసి॥ ౩॥

దం॥ (ఋభువుల వాక్యములు) దూతవయిన నీతో దేవత లేకర్మచేయమన్నారో ఆ "ఒక యశ్వమునుండి యింకొక యశ్వమును జేయుమని, రథమునుండి యింకొక రథమును జేయుమని, (చర్మములేని) పాడియావును జేయుమని" అన్నా! అగ్నీ! యీపని చేసికొనివత్తుము.

దం॥ ఓ సౌధన్వులారా! చర్మములేని గోవువల్ల గ్రొత్తగోవును బుట్టించితిరి. (ఆచర్మముతో నింకొకావును జేసిరట) జీర్ణించిన యాయిద్దరిని చిన్నవయసువారిగా నొనర్చితిరి. (తమ తల్లిదండ్రులను యౌవనవంతులగా నొనర్చిరట.) అశ్వమునుండి యశ్వమును నిర్మించితిరి. కనుక మీరథముంబూన్చి దేవతల సమీపమునకు గమనింపుడు.

౧౬౪౩. ఇదముదకం పిబతేత్య బ్రవీతనే దంవా ఘాపిబతా ముఞ్జనేజనమ్ ।

సౌధన్వనా యదిశన్నే వహార్య థతృదీయేఘాసవనే మాదయాధ్వై॥ ౮॥

దం॥ ఓ సుధన్వ పుత్రులారా! ముంజగడ్డితో శోధించిన యీ ఉదకమును (అనగా సోమమే) మీరు త్రావుడు. అనిఅనుడు ఓ ఋభువులారా! ఆపనిని (సోమపానమును) కోరకుడు. మూడవసవనమందు మీరు తృప్తిగా సోమపానము సేయుడు.

౧౬౪౪. ఆపోభూయిష్ఠా ఇత్యేకో అబ్రవీదగ్నిర్భూయిష్ఠ ఇత్యన్యో అబ్రవీత్ ।

వధర్యన్తీం బహుభ్యః ప్రైకో అబ్రవీదృతావదన్తశ్చమసా అపింశత॥ ౯॥

దం॥ (మువ్వురిలో) నొకడు ఉదకములు గొప్పవనెను. ఇంకొకడగ్ని శ్రేష్ఠుండనెను. అన్నిటికంటె వజ్రము గొప్పదని యొకడనెను (వధర్యన్తీ అను పదమునకు వజ్రము-భూమికూడ రెండర్థములు కలవు ఏదిచెప్పినను సరియె) యథార్థవాక్కులం బలుకుచు చమసలను (పానపాత్రలు) చేసిరి.

౧౬౪౫. శ్రోణమేక ఉదకం గామవాజతిమాంసమేకః పింశతిసూనయాభృతమ్।

ఆనిమ్రుచః శకృదేకో అపాభరత్కింస్విత్పుత్రేభ్యః పితరా ఉపావతుః॥ ౧౦॥

దం॥ ఎఱ్ఱనీ నీటికిగూర్చి (ఋభువులలో) నొకడు గోవును బయటనుంచెను. (శ్రోణోదక మనగా రక్తము) ఒకడు మాంసమును కోతలతో సంపాదించుచున్నాడు. నిశ్శేషముగా మాంసము ఛేదించినతరువాత (దానికడుపులోనున్న) పేడను ఒకడు పారవేయుచున్నాడు. ఇట్లు కొమాళ్లు (ఋభువులు ఋత్విజుల రూపముననున్న వారని తా॥) చేసినతరువాత తలిదండ్రులు (అనగా యజమానదంపతులు) ఏమి పొందుదురు? (ఒకయావును నాల్గావులుగా జేసినపని నిచట వర్ణించెను.)

౧౬౪౬. ఉద్వత్స్వస్మా అకృణోతనా తృణం నివత్స్వపః స్వపస్యయా నరః ।

అగోహ్యస్య యదసస్తనా గృహే తదద్యేదమృభవో నానుగచ్ఛథ॥ ౧౧॥

దం॥ (వర్షోదకమును) బయలువెట్టి మీరు (ఋభువులు) ఉన్నతప్రదేశములందుఁ దృణములను బ్రాణులకొఱకుఁ గలిగించితిరి. పల్లపునేలయందు ఈ ప్రాణిజాతముకై సత్కార్యమనితలఁచి యుదకమును జేసితిరి. మఱియు మీరు పట్టుకొన శక్యముకాని సూర్యునిగృహమందు నెంతకాలముందురో అంతకాలమును ఉండుడు. ఈపట్టి ననుసరింపకుఁడు.

౧౬౪౭. సంమీల్య యద్భువనా పర్యసర్పత క్వస్విత్తాత్యాపితరావ ఆసతుః ।

అశపత యః కరస్నం వ ఆదదే యః ప్రాబ్రవీత్ప్రో తస్మా అబ్రవీతన॥ ౧౨॥

దం॥ ఋభువులారా! (ఇచటఁ గిరణములనే ఋభువులని వాడుచున్నాడు) ఎప్పుడు సమస్త భూతజాలమును మూఁతవేసి (అనఁగా మేఘముతోఁగప్పి యని తా॥) అంతటఁ బ్రసరించుచున్నారో అపుడు అప్పటి తలిదండ్రులు (అనంగా సూర్య చంద్రులు) ఎక్కడనున్నారు? ఇట్టిపనిచేయుచున్న మీబాహువులు ఎవఁడు పట్టుకొనునో (అనఁగా వర్షప్రతిబంధము గలిగించునో) వానిని నశింపఁజేయుఁడు. ఎవఁడెదిరించి మాట్లాడునో వానినిఁ గసరివేయుడు.

౧౬౪౮. సుషుప్వాంస ఋభవస్తదపృచ్ఛతాగోహ్య క ఇదం నో అబూబుధత్ ।

శ్వానం బస్తో బోధయితారమబ్రవీత్సంవత్సర ఇదమద్యా వ్యఖ్యత॥ ౧౩॥

దం॥ ఋభువులారా! (కిరణములే) మీరు నిద్రించుచున్నవారై (అనఁగా సూర్య మండలమునుండి యని తా॥) ఆసూర్యు నొకమాట నడుగుడు. ఏమంటే ఎవరిచేతను దాఁచశక్యముకాని యో యాదిత్యా! మా యీ రక్షణకర్మ కెవరు సాయపడుదురు? అని వాయువు భయపడునని సూర్యుఁడు పల్కెను. సంవత్సరము పూర్ణమయిన తరువాత నిప్పుడు జగత్తును వివిధముగా బ్రకాశింపఁజేసితిరి

౧౬౪౯. దివా యాన్తి మరుతో భూమ్యాగ్నిరయం వాతో అన్తరిక్షేణ యాతి ।

అద్భిర్యాతి వరుణః సముద్రైర్యుష్మాం ఇచ్ఛన్తః శవసో నపాతః॥ ౧౪॥

దం॥ వర్షానుకూలమయిన యిచ్ఛగలవారై సర్వదేవతలు; వర్షబలము దగ్గరుండజేయు మిమ్ము గూర్చి యో ఋభువులారా! ద్యులోకమునుండి వత్తురు. భూమిమీద నుండి యగ్ని వచ్చును. ఈవాయువంతరిక్షమునుండి వచ్చును. (ప్రతినస్తువురు) తమవంటి స్వభావముకల యుదకమునుండి వరుణుడు వచ్చును, (లేక మీకు సహాయులై వచ్చి వారివారి చోట్లను బోవుటకు కూడ శ్రద్ధ చేయుచున్నారిరి.)

—(•)—

సూక్తము ౧౬౨.

దీర్ఘతమః - అశ్వదేవత - ౩-౬ జగతి - తక్కినవి త్రిష్టుప్.

౧౬౫౦. మా నో మిత్రో వరుణో అర్యమాయురిన్ద్ర ఋభుక్షా మరుతః పరిఖ్యన్ ।

యద్వాజినో దేవజాతస్య సప్తేః ప్రవక్ష్యామో విదథే వీర్యాణి॥ ౧॥

దం॥ బహువన్నములు కలట్టి దేవతలవల్ల బుట్టినట్టి సర్పించుచు గుఱ్ఱముయొక్క పీపు కృత్యములను యజ్ఞమందు మేము వర్ణించుచున్నాము కనుక (నీచమానవులు మా దేవాశ్వములను వర్ణింతురాయని) మిత్ర వరుణార్యమ వాయువులు ఇంద్ర ఋభుక్షు మరుత్తులు నిందింపకుందురుగాక.

౧౬౫౧. యన్నిర్ణిజా రేక్ణసా ప్రావృతస్య రాతిం గృభీతాం ముఖతో నయన్తి ।

సుప్రాఙజో మేమ్యద్విశ్వరూప ఇన్ద్రాపూష్ణోః ప్రియమప్యేతి పాథః॥ ౨॥

దం॥ రూపముకలిగి బంగరు ఆభరణము చేత గప్పబడిన యశ్వమునుండు దాన మునకై పట్టుకొన్న ఏమేకను ఋత్విజులు తీసికొనిపోవుచున్నారో ఆ మేక చక్కగా గమనించుచు మేమే అని అఱచుచు ననేకరంగులుకలదై యింద్రాగ్నులకొరకు ప్రియమయిన పుష్టియై తృప్తినిగలిగించుచున్నది.

౧౬౫౨. ఏషచ్ఛాగః పురో అశ్వేన వాజినా పూష్ణో భాగో నీయతే విశ్వదేవ్యః ।

అభిప్రియం యత్పురోళాశ మర్వతా త్వష్టేదేనం సౌశ్రవసాయ జిన్వతి ॥ 3 ॥

దం॥ ఈ మేక శీఘ్రముగా నడచు గుఱ్ఱముతోఁగూడ పూషునిభాగమై సర్వదేవతలకు నర్హమై ముందుగా నేకారణముచేత తీసికొనిపోఁబడుచున్నదో యాకారణముచేత ప్రియమయినదిముందుగా నివేదనీయమగు మేకను గుఱ్ఱముతోఁగూడ శోభనమగు (దేవతల) యన్నముకొఱకుఁ బ్రియమగునట్లు త్వష్ట (అనఁగా ప్రజాపతి) చేయుచున్నాఁడు. (వండుచున్నాఁడని తా॥)

౧౬౫౩. యద్ధవిష్య మృతుశో దేవయానం త్రిర్మానుషాః పర్యశ్వం నయన్తి ।

అత్రా పూష్ణః ప్రథమో భాగ ఏతి యజ్ఞం దేవేభ్యః ప్రతివేదయన్నజః ॥ ౪ ॥

దం॥ హవిస్సున కర్హమయిన దేవతలకుఁ బ్రియమైన అశ్వమును ఋత్విజులు ప్రతి ఋతువునందు మూఁడుమార్లు అగ్నిచుట్టును త్రిప్పినపుడు అగ్నికి మొదట నిచ్చిన మేక దేవతలకు యజ్ఞమును జెప్ప ముందుగాఁ బోవుచున్నది.

౧౬౫౪. హోతాధ్వర్యు రావయా అగ్నిమిన్ధో గ్రావగ్రాభ ఉత శంస్తా సువిప్రః ।

తేన యజ్ఞేన స్వరంకృతేన స్విష్టేన వక్షణా ఆపృణధ్వమ్ ॥ ౫ ॥

దం॥ హోత (=దేవతలం బిలుచువాఁడు) అభిముఖముగా హవిస్సులఁ ద్రేల్చు అధ్వర్యుఁడు (=యజ్ఞమంతటిని నడిపించువాఁడు) అగ్నిమిన్ధుఁడు (అగ్నిని రవ్వలుఁకొల్పు వాఁడు) గ్రావగ్రాభుఁడు (అభిషవశిలను బట్టుకొన్నవాఁడు) మఱియు శంస్తయు (అనఁగాఁ బ్రశాస్తయనువాఁడు) మేధావియగు బ్రహ్మ (ఇతఁడన్నియు నెఱింగి పనులను సరిగాఁజూచువాఁడు) ఈ ఋత్విజులందఱును చక్కఁగాఁ జేసిన, బాగుగ సంపాదించిన ఆ యజ్ఞముతో నదులను బూరింతురుగాక. (నేతికాల్వలు పుట్టింతురని తాత్పర్యమట!)

౧౬౫౫. యూపవ్రస్కా ఉతయే యూపవాహాశ్చషాలం యే అశ్వయూపాయ తక్షతి ।

యేచార్వతే పచనం సంభరన్త్యుతో తేషా మభిగూర్తిర్న ఇన్వతు ॥ ౬ ॥

దం॥ యూపసంభమునకై (మేక మొదలయిన యజ్ఞపశువును గట్టునది) చెట్టు కొట్టినవారును కొట్టినదుంగను మోసికొనివచ్చినవారు అశ్వయూపమునకుఁ జషాలము (ఆ స్తంభముమీఁది తల) చెక్కినవారును గుఱ్ఱమునకై పాకసాధనము లమర్చువారు మఱియు మా యితరసహాయులునగు వారియొక్క సంకల్పము సఫలమగుగాక.

౧౬౫౬. ఉప ప్రాగాత్సుమన్మేధాయి మన్మ దేవానామాశా ఉపవీతపృష్ఠః ।
అన్వేనం విప్రాఋషయో మదన్తి దేవానాం పుష్టే చకృమా సుబన్ధుమ్॥ ౬॥

దం॥ మెచ్చఁదగిన ఫలము (అనఁగా నశ్వము) నావద్దనున్నది. అది బలిసినదై దేవతల యాశను బూరించుటకు స్వయముగాఁ బోవుఁగాక. శోభనబన్ధనములుగల్గిన యీ యశ్వమును దేవతలతృప్తికొఱకు జేతుము. మేధావంతులయిన బ్రాహ్మణులు ఋషులును మెత్తురుగాక.

౧౬౫౭ యద్వాజినో దామ సందానమర్వతో యా శీర్షణ్యా రశనా రజ్జురస్య ।
యద్వా ఘాస్య ప్రభృతమాస్యే తృణం సర్వా తా తే అపి దేవేష్వస్తు॥ ౭॥

దం॥ వేగవంతమయిన గుఱ్ఱము కంఠమందలి త్రాడును పాదములందలి త్రాడును శిరసునందలి త్రాడును దీనినోటిలోనున్న తృణమును, ఓ యశ్వమా! యీ నీ వస్తువులు దేవతలకొఱకగుఁగాక. లేక దేవత్వముఁ బొందుగాక.

౧౬౫౮. యదశ్వస్య క్రవిషో మక్షికాశ యద్వా స్వరౌ స్వధితౌ రిప్తమస్తి ।
యద్ధస్తయోః శమితుర్యన్నఖేషు సర్వా తా తే అపి దేవేష్వస్తు॥ ౮॥

దం॥ అశ్వముయొక్క ఏ పచ్చిమాంసభాగమును ఈఁగతినినదో అథవా ఏ కాటుక పశువునకు పెట్టబడినదో; పశువును ఛేదించునపుడు దానికాళ్ల కేదిపూయఁబడెనో. దానిగోళ్ల కేదిపూయబడెనో; ఈ యన్నియును ఓ యశ్వమా! నీసంబంధమయినవి దేవతల సంతోషముకొఱకగుఁ గాక. లేదా దేవత్వము నొందుఁగాకనికూడ నర్థము;

౧౬౫౯. యదూవధ్య ముదరస్యాపవాతియ ఆమస్య క్రవిషోగంధో అస్తి।
సుకృతా తచ్ఛమితారః కృణ్వంతూత మేధం శృతపాకం పచంతు॥ ౧౦॥

దం॥ కడుపులో జీర్ణమయిన యే సగము తృణము (అనఁగాఁ బేఁడ) బయటికి వచ్చుచున్నదో; చక్కఁగాఁ బక్వముకాని మాంసభాగములోని యేలేశమునకలదో; వాటిని గోతగాండ్రు బాగుచేయుదురుగాక. మఱియు యజ్ఞార్హమయిన శృతపాకమగునట్లు వండుదురుగాక! (శృతపాకము=సమమయిన పాకము దేవప్రీతి. అతిపాకము=అధికపాకము పితృప్రీతి. ఈషత్పాకము=కొంచెపు పాకము మనుష్యప్రీతి యట.)

౧౬౬౦. యత్తేగాత్రా దగ్నినా పచ్యమానా దభిశూలం నిహతస్యావధావతి।
మాతద్భూమ్యామాశ్రిష న్మాతృణేషు దేవేభ్యస్త దుశద్భ్యోరాతమస్తు॥ ౧౧॥

దం॥ ఓ యశ్వమా! అగ్నిచేఁ బచనముచేయఁబడుచున్న నీశరీరమునుండి యేరసము కారుచున్నదో, నిశ్శేషముగా హతమయిన నీసంబంధమయిన యేరసము శూలమునఁ గారుచున్నదోఁ అయ్యవయవములు భూమియందు బడిపోవకుండుగాక. ఆరసమును గోరుచున్న దేవతలకు దత్తమగుగాక.

౧౬౬౧. యేవాజినం పరిపశ్యంతి పక్వంయ ఈమాహుః సురభిర్నిర్హరేతి।
యేచార్వతో మాంసభిక్షా ముపాసత ఉతోతేషా మభిగూర్తిర్న ఇన్వతు॥ ౧౨॥

దం॥ పక్వమయిన యశ్వావయవము నెవ్వరుచూతురో; మంచి వాసనగలదానినెవ్వరికిమ్మని యందురో, మఱియు నెవ్వరు అశ్వమాంసభిక్షను గోరుదురో, అట్టివారియొక్క ఆ సంకల్పములు సఫలములగుఁగాక. (అని దేవతలనుకొనుచున్నారు)

౧౬౬౨. యన్నీక్షణం మాంస్పచన్యా ఉఖాయాయా పాత్రాణి యూష్ణఆసేచనాని
ఊష్మణ్యా పిధానా చరూణా మంకాః సూనాః పరిభూషంత్యశ్వం॥ ౧౩॥

దం॥ మాంసము వండునట్టి పాత్రయొక్క యేత్తెత్తుకలదో; ఉడికిన రసముయొక్క యేపాత్రలు కలవో; ఆరసమును జల్లార్చునట్టి యేపాత్రలుకలవో; చరువుల (హోమముచేయు మాంసము) పాత్రలేవికలవో; అంకము (హోమముచేయుటకు ముందు పశువు హృదయాది యవయవములు బలుసు కొమ్మమీద విప్పిపరతురు, ఆశాఖపేరు అంకము) లేవేవికలవో; సూనలేవేవికలవో (కత్తి); అవన్నియు గుఱ్ఱము నలంకరించుచున్నవి. (ఇవన్నియు నశ్వావయవములమీఁదఁ బలిజేయు చున్నవని తా॥)

౧౬౬౩. నిక్రమణం నిషదనం వివర్తనం యచ్చ పడ్వీశ మర్వతః ।

యచ్చ పపౌ యచ్చ ఘాసిం జ ఘాస సర్వాతా తే అపి దేవేష్వస్తు॥ ౧౪॥

దం॥ ఇటునటు నడచుట, నిలువఁబడుట, నేలఁబడిదొర్లుట యనునవేవికలవో పాద బంధనమేదికలదో, నీరుత్రాగుట, గడ్డిమేయుట లేవికలవో ఓయశ్వమా! ఆయీయన్ని పనులును దేవతలలోనుండుఁగాక (అనగా దేవత్వమునొందునుగాకయని తా.)

౧౬౬౪. మాత్వాగ్ని ర్ధ్వనయీ ద్ధూమగన్ధి ర్మోఖా భ్రాజ న్త్యభి విక్త జఘ్రిః ।

ఇష్టంవీత మభిగూర్తం వషట్కృతం తం దేవాసః ప్రతిగృభ్ణ న్త్యశ్వమ్॥ ౧౫॥

దం॥ ఓయశ్వమా! పొగతోఁగూడినయగ్ని నిన్ను ధ్వని చేయింపకుండుఁగాక. కాలుచువాసన క్రమ్ముచున్న వంటకుండ (వేడివలన) ముక్కలుముక్కలయి పోకుండుఁగాక. (అశ్వసంబంధమయిన) హోమమునకుద్దేశించిన భాగము, హోమమునకై తేఁబడినభాగము దేవతలకు నివ్వనెత్తినభాగము, దేవసంస్కారము చేయఁబడిన భాగము (గల) యిట్టియశ్వమును దేవతలు పుచ్చుకొందురుగాక.

౧౬౬౫. యదశ్వాయ వాస ఉపస్తృణ న్త్యధీవాసం యా హిరణ్యాన్యస్మై ।

సందాన మర్వన్తం పడ్వీశం ప్రియా దేవేష్వా యామయన్తి॥ ౧౬॥

దం॥ అశ్వమును (జంపునపుడు) మీఁదఁగప్పినబట్టయేదికలదో ఆయశ్వముకయి కల్పించిన బంగారు, వెండి మొదలగు పాత్రలేవికలవో దానిశిరసునఁగట్టిన త్రాఁడు ను పాదబంధనమును ఏదో ఇవన్నియును దేవతలకుప్రియములయి చెందుఁగాక.

౧౬౨.౧౭. యత్తే సాదే మహసా శూకృతస్య పార్ష్ణ్యా వా కశయా వా తుతోద ।
స్రుచేవ తా హవిషో అధ్వరేషు సర్వా తా తే బ్రహ్మణా సూదయామి॥ ౧౭

తా॥ ఓయశ్వమా! నీవు హుస్సుహుస్సుమని నడచునప్పుడు కాలిమడిమతోఁ గాని కొరడాతోఁగాని (కమ్చీ) బాధపెట్టుట మొదలగునవి యజ్ఞములందు హవిస్సులు దేవతల కిచ్చునట్లు మంత్రములతో వాటినన్నిటిని హవిస్సులనుగా దేవతలకర్పింతును.

౧౬౨.౧౮. చతుస్త్రింశద్వాజినో దేవబన్ధోర్వఙ్క్రీరశ్వస్య స్వధితిః సమేతి ।
అచ్ఛిద్రా గాత్రా వయునా కృణోత పరుష్పరురనుఘుష్యా విశస్త॥ ౧౮

తా॥ దేవతలకు బంధువయిన గుఱ్ఱముయొక్క ముప్పదినాలుగు పక్కటెముకలు స్వధితి (కత్తి) పొందుచున్నవి. (అనఁగాఁ గోయుచున్నదని తా.) ఈ యశ్వావయవములను అచ్ఛిద్రములగునట్లు ప్రజ్ఞానములు (గుర్తులు) (ఇదిహృదయము యిది జిహ్వ అని గుర్తులు) నిర్దేశించి కోతురుగాక.

౧౬౨.౧౯. ఏకస్త్వష్టురశ్వస్యా విశస్తా ద్వా యన్తారా భవతస్తథ ఋతుః ।
యా తే గాత్రాణామృతుథా కృణోమి తాతా పిణ్డానాం ప్ర జుహోమ్యగ్నౌ॥ ౧౯

తా॥ ప్రకాశించుచున్న యశ్వము కోయువాఁడొకఁడు. (కాలపురుషుఁడు) అట్లు నియమించు వారిద్దఱు. (అహోరాత్రములు-లేక ద్యావా పృథువులు) కాలమందు నీయేయేయవయవములను గోయుచున్నానో ఆయాముద్దల నగ్నియందు హోమము చేయుచున్నాను.

౧౬౨.౨౦. మా త్వా తపత్ప్రియ ఆత్మాపియన్తం మా స్వధితిస్తన్వ ఆ తిష్ఠిపత్తే ।
మా తే గృధ్నురవిశస్తాతిహాయ ఛిద్రా గాత్రాణ్యసినా మిథూ కః॥ ౨౦

ద౦॥ అశ్వమా! దేవతలనుగూర్చి పోవుచున్న నిన్ను ప్రియమయిన ఆత్మ (అనఁగా భోగశరీరము) బాధపడకుండుఁగాక. శస్త్రము నీ యవయవములను నీయందుఁ జిరకాలముంచకుండుఁగాక. నీ మాంసమును గోయువాఁడు కొంత నెఱుఁగక కేవలము కత్తితో పెచ్చుతగ్గుగా నడ్డదిడ్డముగా వ్యస్తముగాఁ గోయకుండుఁగాక.

౧౬౯౦. నవాఉ ఏతన్మ్రియసే నరిష్యసి దేవాఁ ఇదేషి పథిభి స్సుగేభిః ।
హరీ తే యుఞ్జా పృషతీ అభూతా ముపాస్థా ద్వాజీ ధురిరా సభస్య॥ ౨౧॥

ద౦॥ తక్కిన గుఱ్ఱాలవలె నిపుడు నీవు చావలేదు. కనుక హింసింపబడలేదు. (దేవత్వము వచ్చునని తా॥) శోభనమార్గముల ద్వారా దేవతలనే పొందుచున్నావు. హరియను పేర్లుగల యింద్రునిగుఱ్ఱాలు రెండును నీరథమునకుఁ బూన్చుకొనిపోఁబడుదువు. వాయువు గుఱ్ఱములుకూడ నిన్ను గొనిపోవును. అక్వినుల వేసడమునకు ముందున్న గుఱ్ఱముకూడ నిన్ను మోసికొనిపోవును.

౧౬౯౧. సుగవ్యంనో వాజీస్వశ్వ్యం పుంసః పుత్రాఁ ఉతవిశ్వా పుషంరయిం ।
అనాగా స్త్వంనో అదితిః కృణోతు క్షత్రంనో అశ్వో వనతాం హవిష్మాన్॥ ౨౨

ద౦॥ చంపఁబడుచున్న యశ్వము మాకు సకలమును బోషించునట్టి మంచి గోవులుగలట్టి ధనమును గలిగించుఁగాక. మఱియు దైన్యములేని యీ యశ్వము పాపములేకుండఁ జేయుగాక. హవిస్సుగా నయిన యీ యశ్వము మాకు క్షాత్రతేజస్సును గలిగించుఁగాక. (దీనిబట్టి క్షత్రియులే అశ్వమేధాధికారులని అనవలె)

---

## సూక్తము, ౧౬౩.

దీర్ఘతమ త్రిష్టుభఛం - అశ్వదేవత

౧౬౯౨. యదక్రన్దః ప్రథమం జాయమాన ఉద్యన్త్సముద్రా దుత వాపురీషాత్ ।
శ్యేనస్య పక్షాహరిణస్య బాహూ ఉపస్తుత్యం మహిజాతం తే అర్వన్॥ ౧॥

దం॥ ఓ యశ్వమా! గొప్పదగు నీజన్మము స్తుతింపదగినది, ఏమంటే అంతరిక్షమునుండి లేక సూర్యునుండి మొదట బుట్టినదానవై అదికాక ఉదకమునుండి పుట్టినదానవై గొప్పధ్వనినొనరించితివి కావునను నీ రెక్కలు డేగ రెక్కలవంటివి నీ బాహువులు లేడి బాహువులవంటివి కనుకను నీజన్మ స్తవనీయము. (పూర్వ సూక్తములోఁ జెప్పిన యశ్వమే యిదియును.)

౧౬౪౩. యమేన దత్తం త్రిత ఏనమాయునగిన్ద్ర ఏణం ప్రథమో అధ్యతిష్ఠత్।

గన్ధర్వో అస్య రశనామగృభ్ణాత్సూరాదశ్వం వసవో నిరతష్ట॥ ౨

దం॥ అగ్నిచేత నివ్వఁబడిన యీ యశ్వమును భూమ్యంతరిక్ష ద్యులోకములందున్న వాయువు (రథమందు) బూన్చెను. మొట్టమొదట దీనిమీద నింద్రుఁడు కూర్చుండెను. గన్ధర్వుఁడయిన సోముఁడు దీనికళ్ళెమును బట్టుకొనెను. ఓ సూర్య కిరణములారా! మీరీ యశ్వమును సూర్యునుండి ధరించిరి.

౧౬౪౪. అసి యమో అస్యాదిత్యో అర్వన్నసి త్రితో గుహ్యేన వ్రతేన।

అసి సోమేన సమయా విపృక్త ఆహుస్తే త్రీణి దివి బన్ధనాని॥ 3

దం॥ ఓయశ్వమా! నీవగ్నివి, సూర్యుఁడవునయియున్నావు. ఎవరికిని దెలియని కర్మచేత (వీఁచుట కనఁబడదని తా.) వాయువయియున్నావు. సోమునితోఁ గలిసియున్నావు. ద్యులోకమందున్నట్టి నీకు మూఁడు ఉత్పత్తికారణములు చెప్పుచున్నారు (కిరణములు, ఆదిత్యుఁడు, ద్యులోకము)

౧౬౪౫. త్రీణి త ఆహుర్దివి బన్ధనాని త్రీణ్యప్సు త్రీణ్యన్తః సముద్రే।

ఉతేవ మే వరుణశ్ఛన్త్స్యర్వన్యత్రా త ఆహుః పరమం జనిత్రం॥ ౪

దం॥ ఓయశ్వమా! నీకుద్యులోకమందు మూఁడుత్పత్తికారణములు కలవనియు భూమియందు మూఁడనియు నంతరిక్షమునందు మూఁడనియు పెద్దలు చెప్పుదురు. పాపమువారించునట్టి నీవు నాకుఁ జెప్పుచున్నావు. కనుక నీజన్మ యెక్కువనియందఱు ననుచున్నారు. (భూమియందు ౧ అన్నము ౨ బీజము 3 స్థానము. అంతరిక్షమందు ౧ మేఘము ౨ విద్యుత్తు ౩ గర్జితము. ద్యులోకమందు ౧ కిరణములు ౨ సూర్యుడు 3 వాయువు న )

౧౬౭౬. ఇమా తే వాజిన్నవమార్జనానీ మా శఫానాం సనితుర్నిధానా ।
అత్రా తే భద్రా రశనా అపశ్యమృతస్య యా అభిరక్షన్తి గోపాః ॥ ౫॥

వ॥ ఓ యశ్వమా! నీశరీరముఁ దుడుచుచోట్ల ఇదివఱకుఁ జెప్పిన ద్రవ్యలాభకా ములు యాగమునకుఁ జెందిన నీడెక్కలుంచుచోట్ల; కళ్యాణకరమయిన కట్టుత్రాళ్ళు ఇచ్చోటనే చూచితిని సత్యరక్షణ చేయువారాత్రాళ్ళనే రక్షించుచున్నారు.

౧౬౭౭. ఆత్మానం తే మనసారాదజానామవో దివా పతయన్తం పతఙ్గం ।
శిరో అపశ్యం పథిభిస్సుగేభిరరేణుభిర్జేహమానం పతత్రి ॥ ౬॥

వ॥ ఓ యశ్వమా! నీశరీరమును మనసుతో సమీపమందున్న దానిఁగా భావించుచున్నాను. భూమినుండి అంతరిక్షమువఱకు గమనించు సూర్యుని వ్యాపించి యున్నట్లు భావింతును చక్కఁగా నడచుటకు వీలయిన పాపములేని మార్గముల ద్వారా మీఁదుమీఁదుగా వ్యాపించుచు నెగిరిపడుచున్న దానిఁగా నీశిరస్సును భావించుచున్నాను.

౧౬౭౮. అత్రా తే రూపముత్తమమపశ్యం జిగీషమాణమిష ఆ పదే గోః ।
యదా తే మర్తో అను భోగమానళాదిద్గ్రసిష్ఠ ఓషధీరజీగః ॥ ౭॥

వ॥ భూమియొక్క స్థానమందు నన్నములంగూర్చి సర్వత్ర గమనింపఁదలచిన ఉత్తమమయిన నీరూపమును ఈచోట జూచుచున్నాను. ఎప్పుడుమనుష్యుఁడు నీయను భవమునకుఁ దగినయన్నమును నీ సమీపమునకుఁ దెచ్చునో ఆవెంటనే ఆసక్తిగలిగి యాయన్నము నత్యంతముఁ దినుచున్నావు.

౧౬౭౯. అను త్వా రథో అను మర్యో అర్వన్ననుగావో ను భగః కనీనామ్ ।
అను వ్రాతాస స్తవ సఖ్యమీయురను దేవా మమిరే వీర్యన్తే ॥ ౮॥

దం॥ అశ్వమా! నిన్ననుసరించి రథమునడచును. నిన్ననుసరించి మనుష్యులు నడతురు. నిన్ననుసరించి గోవులునడచును. కన్యలభాగ్యము నిన్ననుసరించియున్నది, గుంపులుగానుండిన (పశువులు మొదలగువారు) నీ సఖ్యమును పొందుచున్నారు. దేవతలు నీ వీరకృత్యములను స్తుతించుచున్నారు.

౧౬౮౦. హిరణ్యశృఙ్గోఽయో అస్య పాదా మనోజవా అవర ఇన్ద్ర ఆసీత్ ।

దేవా ఇదస్య హవిరద్యమాయన్యో అర్వన్తం ప్రథమో అధ్యతిష్ఠత్ ॥ ౯॥

దం॥ ఈయశ్వము మెడమీదజూలు (రోమముల సమూహము) బంగారువంటిది. ఇనుమువంటి డెక్కలు మనసుతో సమానమయినవేగము హవిర్భక్షణముకోరి దేవతలు దీనినాశ్రయింతురు. ఏయింద్రుడు మొదటివాడై దీనిని సవారి చేసెనో యా యింద్రుడు దీనికన్న తక్కువవాడే.

౧౬౮౧. ఈర్మాన్తాసః సిలికమధ్యమాసః సం శూరణాసో దివ్యాసో అత్యాః ।

హంసా ఇవ శ్రేణిశో యతన్తే యదాక్షిషుర్దివ్యమజ్మమశ్వాః॥ ౧౦॥

దం॥ అశ్వములు ముందువెనుక శరీరభాగము లధికముగా గలవి నడుము సన్నముగా గలవి పరాక్రమ స్వభావముగలవి. ద్యులోకమందు బుట్టినవి ఎల్లప్పుడు నడచునవి; ఇవి పఙ్క్తిగాగూడి పరుగెత్తదలచినపుడు హంసలవలె ద్యులోక మార్గములను వ్యాపించుచున్నవి.

౧౬౮౨. తవ శరీరం పతయిష్ణ్వర్వన్తవ చిత్తం వాత ఇవ ధ్రజీమాన్ ।

తవ శృఙ్గాణి విష్ఠితా పురుత్రారణ్యేషు జర్భురాణా చరన్తి॥ ౧౧॥

దం॥ ఓ యశ్వమా! నీశరీరము ఎగిరే స్వభావముకలది నీమనసు వాయువువలె శీఘ్రగమనముకలది. నీ మెడమీదవెంట్రుకలు బహువులుగా వివిధములుగా గలవు. ఆ వెంట్రుకలు అరణ్యములందు మనోహరములై చరించును. (శృఙ్గశబ్దమునకు కిరణములనికూడ నర్థము వ్రాసిరి.)

౧౬౭౩. ఉపప్రాగాచ్ఛసనం వాజ్యర్వా దేవద్రీచామనసా దీధ్యానః ।

అజః పురోనీయతే నాభిరస్యా నుపశ్చా త్కవయోయన్తి రేభాః॥ ౧౨॥

దం॥ ఈ నడచునట్టి యశ్వము చంపునట్టిచోటికి దేబడెను. దేవత్వము బొందెదనని తలంచుచు ధ్యానించుండెను. దీనిబంధువయిన మేక దీనికి ముందుగొనిపోబడు చున్నది. పిమ్మట మేధావంతులగు స్తుతికర్తలు దీని నాశ్రయించిరి.

౧౬౪౭. ఉపప్రాగాత్పరమంయత్సధస్థమర్వా అచ్ఛాపితరం మాతరంచ।

అద్యాదేవాన్జుష్టతమోహిగమ్యా అథాశాస్తే దాశుషే వార్యాణి॥ ౧౩॥

దం॥ తల్లిని తండ్రినిగూర్చి యీ యశ్వము అత్యంత పుణ్యవంతులందరు నివసించు స్వర్గముంగూర్చి పోవుచున్నదా యేమి? అశ్వమా! యిపుడు ప్రీతితో దేవతలం గూర్చి పోవుచున్నావు. తరువాత హవిర్దాతయగు (యజమానుడు) గోరందగిన ధనములను బ్రార్థించెను.

---

## సూక్తము. ౧౬౪.

దీర్ఘతమర్షి - విశ్వదేవ - వాగ్దేవత ఇత్యాది నానా దేవతలు - నానాఛందస్సులు.

౧౬౭౫. అస్యవామస్య పలితస్యహోతు స్తస్యభ్రాతామధ్యమో అస్త్యశ్నః ।

తృతీయోభ్రాతాఘృతపృష్ఠో అస్యాత్రా పశ్యం విశ్పతిం సప్తపుత్రం॥ ౧॥

దం॥ కోరందగినవాడును పాలకుడును, ఆహ్వానింపం దగినవాడును, అగు (నాదిత్యుని) భ్రాతమధ్యముడు కలడు (అనగా వాయువు) అతడు సర్వవ్యాపి. నేయి తన వీపునందుంగలవాడు. (అగ్ని సూర్య వాయువు లన్నదమ్ములు వర్షించుపనిలో ముగ్గురికిని వంతుకలదు.) వీరిలోం బ్రజలబాలించు నేడపకుమారుని యిచట జూచితిని. (అదితికొడుకులు మిత్రవరుణాదులలో ఆదిత్యుం డేడవవాండని యితిహాసము.)

౧౬౫౬. స ప్త యుఞ్జన్తి రథమేక చక్ర మేకో అశ్వోవహతి స ప్తనామా।
త్రినాభిచక్రమజరమ నర్వం యత్రేమా విశ్వాభువనాధితస్థుః॥ ౨॥

ఈ॥ ఒక్క చక్రముగల రథమును ఏడు (గుఱ్ఱములు) కట్టబడియున్నవి. స ప్త యని పేరుగల ఒకేయశ్వము ఆరథము లాగుచున్నది. ఆ చక్రము మూఁడు కన్నములు కలది. దానియందు నీ స ప్తలోకములు ఆధారపడియున్నవి? (ఇచట మండలమే సూర్యరథము, రసమునుబీల్చు నేడు జాతుల కిరణములే గుఱ్ఱము, మూఁడు కాలములు మూఁడు చక్రరంధ్రములు, ఈ కాలచక్రమందన్ని లోకాలు తిరుగు చున్నవని భాష్యం.)

౧౬౫౭. ఇమంరథ మధియే స ప్తతస్థు స్స ప్తచక్రం స ప్తవహ న్త్యశ్వాః।
స ప్తస్వసారో అభిసంనవన్తే యత్రగవాం నిహితా స ప్తనామ॥ ౩॥

ఈ॥ ఈరథము నే యేడంటియున్నవో ఆయేడుగుఱ్ఱములు ఏడు చక్రములరథమును మోయుచున్నవి. ఆయేడుగురు అక్కచెల్లెండ్రు దానికభిముఖముగాఁ దిరుగు చున్నారు. దేనియందు వాక్కులలోని స ప్తస్వరములు ఇమిడియున్నవో; ఆయేడు (నని పూర్వాన్వయము) ఇచట గోశబ్దమునకు వాక్కులేకాక ఉదకములనికూడ నర్థముకలదు. ఆ పక్షమున గంగాది స ప్తనదులని వ్యాఖ్యానించిరి.)

౧౬౫౮. కోదదర్శ ప్రథమం జాయమానమస్థన్వ న్తం యదనస్థాబిభ ర్తి।
భూమ్యా అసురసృగాత్మా క్వస్విత్కోవిద్వాంస ముపగాత్ప్రష్టుమేతత్॥ ౪॥

ఈ॥ మొట్టమొదఁట (సృష్టియందు) పుట్టుచున్నదాని నెవఁడుచూచెను? ఎముకలు కలదానిని (ప్రపంచము) ఎముకలులేని (ప్రకృతి) భరించుచున్నది. కనుక భూమి సంబంధమైన ప్రాణము ర క్తము ఆత్మ యెక్కడనున్నవి. (స్థూలశరీరము సూక్ష్మ శరీరము జీవుడు ఎక్కడనున్నవనియు ర క్తప్రాణములు పృధివీత త్త్వములని తా॥) ఈవిషయముదెలిసిన యెవని నెవఁడు ప్రశ్నించుటకు సమీపించును? (అనఁగాఁ జెప్పు వాఁడును అడుగువాఁడును లేరని తా॥)

౧౬౪౯. పాకః పృచ్ఛామి మనసావిజానన్ దేవానామేనా నిహితా పదాని।
వత్సే బష్కయేఽధి సప్త తన్తూన్వితత్నిరే కవయ ఓతవా ఉ॥ ౫॥

టీ॥ పరిపక్వబుద్ధికల్గి నేను మనసుతోఁ దెలియలేనివాడనై యడుగుచున్నాను. ఈ సంశయవిషయములు దేవతలకును గూఢములు. (అవేవంటే) సర్వమునకు నివాసభూతమయిన యొక్క యేడాది వత్సయయిన (ఆదిత్యునందు)అధికముగా నేడు తంతువులను బుద్ధిశాలురు నేయుటకై (జగద్రూపకవస్త్రమని తా॥) పరచిరి (ఏడు సోమయాగములు విస్తరించిరనియు నొకవిధముగా వ్యాఖ్యానించిరి. ఉభయపక్షము లందున జగద్వ్యాపారముగాని యజ్ఞములుకాని సూర్యునివల్లనే యగుచున్నవని తా॥)

౧౬౫౦. అచికిత్వాంశ్చికితుషశ్చిదత్ర కవీన్ పృచ్ఛామి విద్మనే న విద్వాన్।
వియస్తస్తమ్భ షళిమా రజాంస్యజస్య రూపే కిమపి స్విదేకం॥ ౬॥

టీ॥ తెలియనివాఁడనై (దేవతాతత్త్వము) తెలిసిన పండితులను దెలిసికొనుటకై ప్రశ్నించుచున్నాను. తెలిసి యడుగలేదు. "ఈయాఱు లోకములను ఎవఁడు నియమించెను? జన్మరహితుఁడయిన యాతని రూపమగు లోకమేదై యున్నది? (అని ప్రశ్న)

౧౬౫౧. ఇహ బ్రవీతు య ఈమఙ్గ వేదాస్య వామస్య నిహితం పదం వేః।
శీర్ష్ణః క్షీరం దుహ్రతే గావో అస్య వవ్రిం వసానా ఉదకం పదాపుః॥ ౭॥

టీ॥ దీని నెవఁడెఱుగునో శీఘ్రముగా వాఁడు ఇపుడు చెప్పునుగాక. ఈ యెదుట నడచుచున్న మనోహరమయిన ఆదిత్యుని స్థానము గూఢముగానున్నది. ఉన్నతమయిన యీతని కిరణములు ఉదకమునిచ్చుచున్నవి (గావః=కిరణములు క్షీరం=నీరు) ఈతని తేజస్సును వహించుచుఁ గొన్నికిరణములు ప్రసారముతో నుదకమును బీల్చుచున్నవి.

౧౬౫౨. మాతా పితరమృత ఆ బభాజ ధీత్యగ్రే మనసా సం హి జగ్మే।
సా బీభత్సుర్గర్భరసా నివిద్ధా నమస్వన్త ఇదుపవాకమీయుః॥ ౮॥

దం॥ తల్లియయిన పృథివి తండ్రియయిన ద్యులోకమందున్న యాదిత్యుని కర్మ చేత వర్షోదకముకొఱకు, పొందెను. అంతకుముందు (తండ్రియగు సూర్యుడు) మనసుతో (నామెయందు ప్రేమగల్గి) కవుంగలించెను. తరువాత ఆతల్లి (భూమి) గర్భవతికాఁగోరి గర్భోత్పత్తి నిమిత్తమయిన రసమును ధరించెను. అన్నముగలవారే దగ్గఱమాటలాడుదురు. (అనఁగా నన్నముకలిగినపుడే మంత్రములతో స్తుతింతు రని తా॥)

౧౬౪-౯. యుక్తామాతా సీద్ధురిదక్షిణాయా అతిష్ఠద్గర్భో వృజనీష్వన్తః ।
అమీమేద్వత్సో అనుగామపశ్యద్విశ్వరూప్యం త్రిషు యోజనేషు॥ ౯॥

దం॥ భూతములనిర్మించు తల్లియగు ద్యులోకము, కోర్కెల నీ సమర్థురాలయిన పృథివియొక్క నిర్వహణమందు సమర్థురాలయ్యెను (వర్షముతో భూమి నుద్ధరించెనని తా॥) ఎట్లంటే గర్భమయిన మేఘముల లోపలనుండెను. వత్సయగు వర్షోదకము మూఁడింటి కూర్పులలో (కిరణ - మేఘము - వాయువు) ధ్వనించును. (వర్షాన్తమున) జనులు భూమి నానారూపములుగలదానిగాఁ జూతురు. (సస్యములవల్ల నానా రూపత్వము)

౧౬౪-౧౦. తిస్రో మాతౄస్త్రీన్పితౄన్బిభ్రదేక ఊర్ధ్వస్తస్థౌ నేమవగ్లాపయన్తి ।
మన్త్రయన్తే దివో అముష్య పృష్ఠే విశ్వవిదం వాచమవిశ్వమిన్వాం॥ ౧౦॥

దం॥ ప్రధాన (పుత్రుడయిన ఆదిత్యుఁడు) ముగ్గురు తల్లులను ముగ్గురు తండ్రులను భరించుచు నున్నతుఁడై యుండెను. ఈతనిని యెవ్వరును బరాభవింపలేరు. ద్యులోకము మీఁదనుండినవారు ఈతనియొక్క ఆ సర్వవ్యాపియయి సమస్తము నెఱింగిన వాక్కును (గర్జితము) ఒకరితోనొకరు రహస్యముగాఁ జెప్పుకొందురు.

౧౬౪-౧౧. ద్వాదశారం నహి తజ్జరాయ వర్వర్తి చక్రం పరిద్యామృతస్య ।
ఆపుత్రా అగ్నే మిథునాసో అత్రసప్త శతాని వింశతిశ్చ తస్థుః॥ ౧౧॥

దం॥ ఉదకరూపుడయిన (ఆదిత్యునియొక్క) మండలము నరలమరల ద్యులోకము మీఁదఁ దిరుగుచుండును. ఆమండలము (చక్రము) పండ్రెండు రేకులతోనున్నది. (మేషాదిరాసులు) దానికి ముదిమిలేదు. ఓ అగ్నీ! యీ నీ చక్రమందు స్త్రీపుం రూపమయిన యేడువందల యిరువది ఆత్మజులుకలరు. (రాత్రి-స్త్రీ పగలు-పురుషుడు)

౧౬౯౬. పంచపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుఃపరే అర్ధే పురీషిణం ।

అథేమే అన్యఉపరే విచక్షణం సప్తచక్రే షళర ఆహురర్పితం॥ ౧౨॥

దం॥ అయిదు పాదములుకలది పండ్రెండాకారములు కలది వర్షోదకము గలది సర్వ మును పాలించునట్టిదియగు నొక వస్తువును ద్యులోకముయొక్క మీఁది సగభాగ మందు ఉంచబడినదని కొందరు చెప్పుదురు. మరియు నితరులు ప్రాణుల కాధార మయినదియు నేడు చక్రములు గలదియు ఆఱు రేకులు కలదియు వివిధదర్శనములు గలదియై నిలువఁబడినదని చెప్పుదురు.

౧౬౯౭. పఞ్చారే చక్రే పరివర్తమానే తస్మిన్నాతస్థు ర్భువనాని విశ్వా ।

తస్యనాక్ష స్తప్యతే భూరిభార స్సనాదేవ నశీర్యతే సనాభిః॥ ౧౩॥

దం॥ అయిదు రేకులు గలిగి తిరుగుచున్న ఆచక్రమందు సమస్త భువనములును నిలిచియున్నవి. అతిభారమున దానియిరుసు తపింపదు. నాభితో (చక్రముమధ్య నున్నకన్నము — తూమందురు) గూడినయాయిరుసు యెపుడును బద్ధలుకాదు. (హేమంత శిశిరము లొక్కటే ఋతువుగానొకమతముకావున నయిదేఋతువులట.)

౧౬౯౮. సనేమిచక్ర మజరం వివావృత ఉత్తానాయాం దశయుక్తా వహన్తి ।

సూర్యస్య చక్షూరజసైత్యావృతం తస్మిన్నార్పితా భువనాని విశ్వా॥ ౧౪॥

దం॥ ఏకవిధమయిన అంచుగల చక్రము యెపుడును క్షీణింపక మాటిమాటికిని దిరుగుచున్నది. ఊర్ధ్వముగానున్న ఆయిరుసునందు బదిమంది (అనఁగా నింద్రాది లోకపాలు రయిదుగురని, నిషాదపంచములగు మనుష్యులయిదు జాతులునని) నిర్వహించుచున్నారు. (తమతమ వ్యాపారములు సేయుచున్నారని తా.) సూర్యు నిమండలము ఉదకముతోనావరింపఁబడి గమనించుచున్నది. ఆమండలమందు సర్వలోకమును నిలిచియున్నది. (లోకముల జీవనాధారము సూర్యమండలమని.)

౧౬౯౯. సాకంజానాం సప్తథమాహురేకజం షళిద్యమా ఋషయో దేవజా ఇతి।

తేషామిష్టాని విహితాని ధామశః స్థాత్రే రేజంతే వికృతాని రూపశః॥ ౧౫॥

దం॥ ఆదిత్యునిలోనుండి కలిసిపుట్టినవాటిలో నేడవది యగు నొకటి (అదనపు నక్షత్ర మాస మొక ఋతువు క్రింద లెక్క.) యని పెద్దలందురు. తక్కిన ఋతువులు గమన శీలములయి సూర్య దేవునివలనఁ బుట్టినవని యందురు. (సూర్యసంక్రమణమధి మాసములలోనుండదు గనుక అదియ దేవజ మగును.) ఆ ఋతువుల రూపములు (లోక) ప్రియములు. వివిధరూపములతో నాయాచోట్ల నుంచఁబడినవి. లోకస్థితికై వానిమాటికిని చరించుచున్నవి. (జగద్వ్యవహారమంతయు ఋతువులఁబట్టియే యనితా.)

౧౭౦౦. స్త్రియస్సతీస్తాఉమే పుంస ఆహుఃపశ్య దక్షణ్వాన్నవిచేతదంధః।

కవిర్యఃపుత్రస ఈమాచికేత యస్తావిజానాత్స పితుష్పితాసత్॥ ౧౬॥

దం॥ నాకిరణములను పతివ్రతలగు స్త్రీలుగను, వానినే పురుషులుగను జెప్పుదురు. (ఉదకరూపగర్భము ధరించుట స్త్రీధర్మము. ఉదకరూపవీర్యధారణ పురుష ధర్మమును) కన్నులు కలవాఁడు ఈవిషయముఁ దెలియును. అంధుఁడు దీనిఁ దెలియఁజాలఁడు. మేధావియయిన పుత్రుఁ డెవఁడో వాఁడే (ఆదిత్యుఁడు తండ్రి, వర్షోదకము కొడుకు) దీనిం దెలియును. ఎవఁడు వాటిని దెలియునో వాఁడు తండ్రికిఁ దండ్రియై యుండును. (కిరణములు జగత్తునకుఁ దండ్రులు. వాటికిఁ దండ్రి యాదిత్యుఁడనితా)

౧౭౦౧. అవఃపరేణపర ఏనావరేణ పదావత్సం బిభ్రతీగౌరుదస్థాత్।

సాకద్రీచీకం స్విదర్ధంపరాగాత్క్వస్విత్సూతే నహి యూథే అంతః॥ ౧౭॥

దం॥ (సూర్యకిరణ సమూహమను) గోవు ముందు కాళ్ళతో నధఃప్రదేశమును వెనుక కాళ్లతో నూర్ధ్వప్రదేశమును (ఆవరించుచు) వత్సను (అగ్నిని) భరించుచు మీఁది కెగిరెను. (అగ్నిలో హోమమయిన పదార్థము గోరూపమున మీఁదికిబోవునని కూడఁ గలదట!) అది యెక్కడకు గమనించును? ఎవరిని గూర్చి పోవును? సగము దారిలోనే మరలిపోయినది. ఎక్కడ ప్రసవించునో? ఆలమందలోఁ బ్రసవించ లేదు. (లోకములో నావులుమందలోఁ బ్రసవించును.)

౧౭౦౨. అవః పరేణ పితరం యో అస్యానువేద పర ఏనావరేణ।

కవీయమానః క ఇహ ప్రవోచద్దేవం మనః కుతో అధి ప్రజాతం॥ ౧౮॥

దం॥ క్రిందనున్న యీ లోకమునకు దండ్రియగు నగ్నిని మీఁదనున్న యాదిత్యునితోఁగూడఁ గ్రమమున సంబంధము నెవఁడెఱుగునో, మీఁదనున్న యీలోకపితయగు నాదిత్యునకు క్రిందిలోకముననున్న యగ్నితో సంబంధము నెవఁడెఱుగునో అట్టి మేధావంతుడు ఈలోకమునందు నెవఁడు చెప్పగలడు? దేవునింగూర్చి యాలోచించుమనసు ఏ యదృష్టమువల్ల నధికముగాఁ బుట్టునో?

౧౭౦౩ యే అర్వాఞ్చస్తా఼ ఉ పరాచ ఆహుర్యే పరాఞ్చస్తా఼ ఉ అర్వాచ ఆహుః।

ఇంద్రశ్చ యా చక్రథుః సోమ తాని ధురా న యుక్తా రజసో వహన్తి॥ ౧౯॥

దం॥ (సూర్యసోమ మండలములలోని) యేకిరణములు క్రిందనున్నవో అవే మీఁదనున్నవిగాను జెప్పుదురు. ఏవి మీఁదుగానున్నవో వాఁటినే క్రిందుగానున్నట్లు చెప్పుదురు. ఓ సోముడా! నీవును ఇంద్రుడును (ద్వాదశాదిత్యులలో నొకనిపేరు ఇంద్రుఁడు) సూర్యుఁడును ఏమండల పరిభ్రమణములను జేయుచున్నారో అవి గుఱ్ఱములు కాఁడిని ధరించినట్లు ఏలోకమును వహించుచున్నవి.

౧౭౦౪. ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।

తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥ ౨౦॥

దం॥ రెండుపక్షులు కలిసియుండి యొకేజాతివి యొకేవృక్షమును ఆశ్రయించి యున్నవి. ఆరెంటిలో నొకటి పండి రుచియగుదానిని దినుచున్నది. తినకుండనే యుండవది ప్రకాశించుచున్నది. (ఇచట జీవపరమాత్మలు పక్షులని జీవుఁడు కర్మఫలములనుభవించునని పరమాత్మకుఁ గర్మానుభవము లేదని తాత్పర్యము వ్రాసిరి. సూర్యచంద్రులనవచ్చునేమో?)

౧౭౦౫. యత్రా సుపర్ణా అమృతస్య భాగమనిమేషం విదథాభిస్వరన్తి।
ఇనో విశ్వస్య భువనస్య గోపాః స మాధీరః పాకమత్రా వివేశ॥ ౨౧

దం॥ సూర్యమండలమందుండి శోభనగమనము చేయు నేకిరణములు ఉదకభాగము (నాకర్షించి) యెల్లపుడు తెలివితో దీపికొనిపోవుచున్నవి సమస్తభువనములకు పాలకుడును, ప్రభువునగువాడు (ఆదిత్యుడు) అతడు ధీమంతుడు అపరిపక్వ బుద్ధిగలనన్ను ఆ సూర్యమండలములోనికిఁ దీసికొనిపోవుగాక.

౧౭౦౬. యస్మిన్వృక్షే మధ్వదః సుపర్ణా నివిశన్తే సువతే చాధి విశ్వే।
తస్యేదాహుః పిప్పలం స్వాద్వగ్రే తన్నోన్నశద్యః పితరం న వేద॥ ౨౨

దం॥ (ఆదిత్యుడనెడు) నే వృక్షమందు ఉదకమును బీల్చునట్టి కిరణములు ప్రవేశించుచున్నవి. (రాత్రియందనితాత్పర్యము) ప్రకాశమును బుట్టించుచున్నవి (ఉదయమందని తా) ఈప్రపంచముమీఁదిభాగమున నావృక్షముయొక్క రుచికలఫలమున్నదని పూర్వతత్త్వవేత్తలనుచున్నారు. ఈవిషయము నెవ్వఁడెఱుఁగఁడో వాడాఫలమునుబొందలేడు. జగత్పితనెఱుఁగనివాఁడు (అనఁగా నతనిని ఉపాసించనివాఁడనితా) ఆఫలమును బొందడు. (సూర్యకిరణములలో గొన్నిటికి సువర్ణనామముకలదు)

౧౭౦౭. యద్గాయత్రే అధిగాయత్రమాహితం త్రైష్టుభాద్వా త్రైష్టుభం నిరతక్షత।
యద్వా జగజ్జగత్యాహితం పదం య ఇత్తద్విదుస్తే అమృతత్వమానశుః॥ ౨౩

దం॥ భూమిమీఁదనగ్ని మొదట సృజింపఁబడెనన్నవిషయమును; (గాయత్రి=భూమి గాయత్రం=అగ్ని॥) వర్షమేఘవిద్యుత్తులవల్ల (=త్రైష్టుభ) వాయువును దేవతలు సంపాదించిరన్నవిషయము; (ఊర్ధ్వ - అధః - తిర్యగ్గమనములు త్రైష్టుభము) మఱియు ద్యులోకమందు సూర్యుని నిల్పిరన్నవిషయమును; (జగత్ - ద్యులోకము - జగతి - సూర్యుడు॥ ఈమూఁటిని యెవరెఱుఁగుదురో వారు మరణములేని స్థానమును బొందుదురు (జగతి గాయత్రి - త్రిష్టుప్ అనిఛందస్సులనేట్లు గూడ నిందు

౧౭౦౮. గాయత్రేణ ప్రతిమిమీతే అర్కమర్కేణ సామ త్రైష్టుభేన వాకం ।

వాకేనవాకం ద్విపదా చతుష్పదాక్షరేణ మిమతే సప్తవాణీః॥ ౨౪॥

దం॥ మంత్రమును గాయత్రీఛందముతోఁ గొలుచుచున్నాఁడు. మంత్రముతో సామమునుగొలుచుచున్నాఁడు త్రైష్టుభముతో వాక్యమునుగొలుచుచున్నాఁడు. ద్విపదచతుష్పదములగువాకము (=వాక్యములే) లతోననువాకమును గొలుచుచున్నాఁడు. ఇట్లేడువిధములయిన ఛందములునక్షరములతోనే నిర్మింపఁబడును (అక్షరమేయన్నిటికిని మూలమనియక్షరస్తుతి॥ ౮ అక్షరముల పాదము గాయత్రి॥ ౧౧అక్షరాలదిత్రిష్టుభము॥ ౧౨అక్షరాలదిజగతి॥ ఇత్యాది॥)

౧౭౦౯. జగతాసింధుం దివ్యస్తభాయద్రథన్తరే సూర్యం పర్యపశ్యత్ ।

గాయత్రస్య సమిధస్తిస్ర ఆహుస్తతో మహ్నా ప్రరిరిచేమహిత్వా॥ ౨౫॥

దం॥ ఆజగతీఛందస్సుతో [బ్రహ్మ] ఆదిత్యునిద్యులోకమందు (సృష్టికాలమున) నిల్పెను. రథన్తరసామమందు సూర్యుఁడు నిల్చునట్లుచూచెను. గాయత్రసామమందు మూఁడుసమిధలు పుట్టెనని చెప్పుదురు. (సమిధలు=బుర్కులు॥) అందువల్లబలముచే మహత్తుచే (నితరసామములను) నిర్మించెను.

౧౭౧౦. ఉపహ్వయే సుదుఘాం ధేనుమేతాం సుహస్తో గోధుగుత దోహదేనాం ।

శ్రేష్ఠంసవం సవితాసావిషన్నోఽభీద్ధోఘర్మస్తదుషు ప్రవోచం॥ ౨౬॥

దం॥ ఈవచ్చుచున్న పాడిగలఆవును నేను (హోత) పిలుచుచున్నాను. మంచినేర్పుగల్గిపిదుకువాఁడు (అధ్వర్యుఁడు) దీనినిబాలుపిదుకును. సవితృదేవత మాయొక్క శ్రేష్ఠమయిన యజ్ఞమునననుమతించుఁగాక. ఉడుకుచున్న ఘర్మమునిమిత్తము పాలుపిదుకఁదలఁచిపిలచితిని. (ఉడుకుచున్న సోమములోఁబాలుపోయుటకు ఘర్మమందురు. రెండవయర్థము క్షీరము = వర్షోదకము- ధేనువు = మేఘము॥ ఘర్మము = గ్రీష్మము॥ ఆదిత్యుఁడు పిదుకువాఁడు సవితృదేవుడువర్షమునుమతించునని కూడవ్యాఖ్యానించిరి.)

౧౭౧౧. హింకృణ్వతీ వసుపత్నీ వసూనాం వత్సమిచ్ఛన్తీ మనసాభ్యాగాత్ ।

దుహామశ్విభ్యాంపయో అఘ్న్యేయంసా వర్ధతాంమహతే సౌభగాయ॥ ౨౭॥

దం॥ వసువులకు వసుపత్నియగుచు (వసు = ధన, పత్ని = పాలక) ఆ పిలువఁ బడిన యావు మనసున దూడనుగోరుచు హం అని అఱచుచువచ్చెను. ఆ గోవుపాలు అశ్వినీదేవతలకొఱకుఁ బితికిరి. ఈ గోవు గొప్పసౌభాగ్యము కొఱకు వృద్ధినందును గాక. (ఇచటఁగూడ మేఘము పక్షమున నన్వయముకలదు. వర్షము, వత్స. అశ్వినులు ద్యావాపృథువులు, హంకారము, గర్జన ఇత్యాది)

౧౬౪ ౨౮. గౌరమీమేదను వత్సం మిషన్తం మూర్ధానం హిఙ్ఙకృణోన్మాతవా ఉ।

సృక్వాణం ఘర్మ మభి వావశానా మిమాతి మాయుంపయతే పయోభిః॥ ౨౮॥

దం! కన్నులుమూసికొన్న దూడసమీపమునకు గోవుచేరి ధ్వనించెను. దూడతలను నాల్కతో నాకుటకు హమ్మనిధ్వనించెను. దూడదవుడలనుండి కారుచున్న పాలనురుగును (ఘర్మ) గోరుచున్నదై ధ్వనించెను. పాలతో (దూడను) దృప్తిపఱచెను. (వర్షము లేనందునఁ గన్నులు మూసికొని దుఃఖించు లోకము వత్స. దానితల భూమి. పయస్సంటే ఉదకము. అని మేఘపక్షము వ్యాఖ్యానించినారు.)

౧౬౪ ౨౯. అయంసశిఙ్క్తే యేనగౌరభీ వృతామిమాతి మాయుం ధ్వసనావధిశ్రితా।

సాచిత్తిభిర్నిహిచకార మర్త్యం విద్యుద్భవన్తీ ప్రతివవ్రి మౌహత॥ ౨౯॥

దం॥ ఈదూడ బయటికి వినఁబడనియొక విధమయిన ధ్వనిని జేయుచున్నది. ఆ దూడ తల్లిచుట్టును దిరిగెను. ఆ యావు ఆవుల సాలలో నఱచెను. ఆ యావు తెలివిచేత మానవునిం దనకంటె దక్కువవానింగాఁ జేయుచున్నది. (మనుష్యులు పిల్లలమీఁదఁ జూపుప్రేమకంటె నావుకు దూడమీఁదఁ బ్రేమ అధికమని తా.) బహుక్షీరములతోఁ బ్రకాశించుచు దనరూపమును గోవు ప్రకాశింపఁజేసెను.) (ఇచటంగూడ దూడ మేఘము. గోవు అనఁగా మాధ్యమివాక్కు. అంటే ఒకవిధమయిన ధ్వని బయటికి వినఁబడకుండ నాకాశమున నుండును. ఇత్యాదిగా నిరుక్తకారులు. ఈ ఋక్కును పలువిధములుగా వ్యాఖ్యానించిరి.)

౧౬౪ ౩౦. అనచ్ఛయే తురగాతు జీవమేజద్ధ్రువం మధ్య ఆపస్త్యానాం।

జీవోమృతస్య చరతిస్వధాభిరమర్త్యో మర్త్యేనా సయోనిః॥ ౩౦॥

దం॥ జీవుఁడు బ్రతికియున్నపుడు కదలుచు వ్యాపారము చేయుచు నుండును. (చని పోయినతరువాత) నిశ్చలమై గృహములలో (ప్రాణువునలె) నుండును. చచ్చినవాని జీవుఁడు మరణధర్మ లేనివాఁడయ్యు మరణధర్మముకల శరీరముతో సమానోత్పత్తిగల వాఁడయ్యెను. ఆ జీవుఁడు స్వధలచేత (అనగా శ్రాద్ధములని తా) జరించును.

౧౬౧౫. అపశ్యంగోపా మనిపద్యమాన మాచపరాచ పథిభిశ్చరన్తం।
సస్రధ్రీచీః సవిషూచీర్వసాన ఆవరీవర్తి భువనేష్వన్తః॥ ౩౧॥

దం॥ (లోకమును) పాలించువాఁడును ఎపుడును దుఃఖమెఱుఁగనివాఁడును వివిధ మార్గములద్వారా పరాఙ్ముఖుఁడై తిరుగుచున్న యాదిత్యునిం జూచుచున్నాను. ఆ యాదిత్యుఁడు తనతోఁగూడ నడ్డుగాఁ దిరుగుచున్న కాన్తులను భరించుచున్నవాఁడై భువనముల మధ్యను మరల మరలఁ దిరుగుచున్నాఁడు. (ఉదయాస్తమయములఁ గలిగించునని తా.)

౧౬౧౬. య ఈంచకార నసో అస్య వేదయ ఈం దదర్శ హిరుగిన్నుతస్మాత్ ।
సమాతుర్యో నాపరివీతో అన్తర్బహు ప్రజానిర్బుతి మావివేశ॥ ౩౨॥

దం॥ ఎవఁడీగర్భమును గలిగించెనో వాఁడుదాని నిజము నెఱుఁగఁడు. ఎవఁడు తల్లి (గర్భము) చూచెనో వాఁడంతర్హితుఁడైయే యున్నాఁడుగదా! తల్లిగర్భాశయమందుఁ జుట్టుకొని లోపలతిరుగుచు బహుజన్మము లెత్తుచు దుఃఖమును బొందెను. (ఇది విద్యారణ్యభాష్యము. యాస్కుఁడు నిరుక్తమున, అంతరిక్షముతల్లి, వర్షవాయువు తండ్రి, లేక మేఘుఁడు. వర్షము కొమారుఁడు, నిర్ఋతి, భూమి. ఇత్యాదిగా వ్రాసినాఁడు.)

౧౬౧౭. ద్యౌర్మేపితా జనితానాభిరత్ర బన్ధుర్మేమాతా పృథివీ మహీయం ।
ఉత్తానయో శ్చమ్వో3 ర్యోనిరన్తరత్రా పితాదుహితు ర్గర్భమాధాత్॥ ౩౩॥

దం॥ (ఇదిదీర్ఘతమునిపలుకు) నాయొక్క పాలకుఁడును బుట్టించువాఁడును ద్యులోకమయియున్నది. భూరసమిచటనున్నది. కనుకనే అది (ద్యులోకము) బన్ధువయియున్నది. ఈ గొప్పదగుభూమి నాతల్లి. (ఇచట ద్యులోకమనగా నాదిత్యుఁడే భూరస

మునగ్నమయ్యె దానివల్ల సస్యము, దానివల్ల నన్నము. అందువల్లఁ రేతస్సు, దానివల్లఁ బుత్రుఁడని తాత్పర్యం.) ఉత్తానములైయున్న సర్వజనస్తువులకు భోగసాధనములైన పృథివీద్యులోకముల మధ్యను సర్వభూతనిర్మాణముచేయు నంతరిక్షము కలదు. ఈ యంతరిక్షమందు పిత (ఆదిత్యుఁడు) దుహితను (= కూతురని యర్థము కలదు కాని భూమికిచట తా.) గర్భము కలిగించెను. దుహితకర్థమునకు నింకొకయర్థము ఫలములను బూరించునదనియుఁ గలదు.)

౧౭౧౮. పృచ్ఛామి త్వా పరమన్తం పృథివ్యాః పృచ్ఛామి యత్ర భువనస్య నాభిః ।
పృచ్ఛామి త్వా వృష్ణో అశ్వస్య రేతః పృచ్ఛామి వాచః పరమం వ్యోమ ॥ ౩౪ ॥

వం॥ (ఓ యజమానుఁడా!) భూమియొక్క చిట్టచివర యెక్కడనని నిన్నడుగుచున్నాను సమస్తభూతజాతమునకు ఆధారమెక్కడనున్నదని యడుగుచున్నాను వర్షమును గురిపించు నాదిత్యుని (అశ్వ = ఆదిత్యుఁడు గమించువాఁడని తా.) రేతస్సు ఏది? అని అడుగుచున్నాను. అన్నివాక్కులకు నాధారమయిన ఆకాశమెచటనున్నదని అడుగుచున్నాను. (వాక్కు = ధ్వని ఇవి నాల్గుప్రశ్నలు.)

౧౭౧౯. ఇయం వేదిః పరో అన్తః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః ।
అయం సోమో వృష్ణో అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ ॥ ౩౫ ॥

వం॥ (మీఁది ప్రశ్నములకు యజమానుని యుత్తరము) ఈవేదిభూమికి చిట్టచివర ఈ యజ్ఞము సర్వభూతజాతమునకును ఆధారము. ఈ సోమము వర్షించు నాదిత్యుని వీర్యము ఈ బ్రహ్మ (ఋత్విజునిపేరు) అన్నివాక్కులకును గొప్ప ఆధారమయినది యాకసము. (యజ్ఞము సర్వోత్తమమని స్తుతించు ఋక్కు.)

౧౭౨౦. సప్తార్ధగర్భా భువనస్య రేతో విష్ణోస్తిష్ఠన్తి ప్రదిశా విధర్మణి ।
తే ధీతిభిర్మనసా తే విపశ్చితః పరిభువః పరిభవన్తి విశ్వతః ॥ ౩౬ ॥

దం॥ గర్భకోశమున సగభాగమందు శిశువులుతిరుగునట్లు అంతరిక్షమునఁబ్రసరించు నట్టి వ్యాపనశీలుఁడయిన యాదిత్యుని వ్యాపారములో నొకభాగమై లోకధారకమైన యేడుకిరణములు ఒకభాగమునకలవు. ఆకిరణములు పమప్రజ్ఞలచేతను మనసుచేతను వ్యాపించుచున్నవి. సర్వప్రపంచమును వ్యాపించుచున్నవి. అవియే సర్వవ్యాపులు జ్ఞానవన్తములు.

౧౬౨౧. నవిజానామి యదివేద మస్మినిణ్యస్సన్న ద్ధోమనసాచరామి।

యదామాగ న్ప్రథమజా ఋతస్యా దిద్వాచో అశ్నువే భాగమస్యాః॥ ౩౭॥

దం॥ ఈవిశ్వమంతయు నేనయియున్నానని నేనెఱుగను. ఏమంటే నేపులోపలనణ గియుంటిని (తెలివిలేకయుంటిననితా) మనసుతో గట్టిగా బద్ధింపఁబడిసంచరించుచు న్నాను. బ్రహ్మయొక్క మొదటఁబుట్టిన యనుభావము నన్నెపుడుచెందునో ఆవెంట నే యీవేదవాక్కుయొక్క పొందఁదగిన భాగమును అనుభవింతును.

౧౬౨౨. అపాఙ్ ప్రాఙేతి స్వధయా గృభీతో మర్త్యో మర్త్యేనా సయోనిః।

తాశశ్వన్తా విషూచీ నావియన్తాన్య న్యం చిక్యుర్నని చిక్యురన్యం॥ ౩౮॥

దం॥ మరణధర్మములేని ఆత్మమరణధర్మముకల శరీరముతోఁగూడుకొని (రెండును) సమానముగాఁబుట్టి ఊర్ధ్వాధోలోకములకుఁ బోవును. ఆరెండును ఈలోకమందు సర్వత్రవ్యాపించుచు నితరలోకమందును దిరుగుచున్నవి. నరులొకదానిని జూచుచు న్నారు. (అనఁగా శరీరము) రెండవదానిని (ఆత్మను) చూడలేదు.

౧౬౨౩. ఋచోఅక్షరే పరమే వ్యోమ న్యస్మిన్దేవా అధివిశ్వే నిషేదుః।

యస్తంనవేద కిమృచా కరిష్యతి యఇత్తద్విదుస్త ఇమే సమాసతే॥ ౩౯॥

దం॥ వేదములచేఁ బూజింపఁదగిన యాదిత్యుఁడు నాశరహితమైన అన్నిఁటికిమీఁద నున్న ఆకాశమందుగలఁడు ఏయాదిత్యునందు సమస్తకిరణములు ఆశ్రయించుకొని యున్నవి. ఈవిషయము నెఱుంగనివానికి నెన్ని వేదములు తెలిసిననేమిప్రయోజనము? ఎవరయితే దానిం దెలియుదురో వారే సర్వసుఖముల నొందుదురు.

౧౬౨౪. సూయవసాద్భగవతీ హిభూయా అథోవయంభగవన్తః స్యామ ।

అద్ధితృణమఘ్న్యే విశ్వదానీం పిబశుద్ధముదక మాచరన్తీ॥ ౪౦॥

దం॥ ఓ గోవా ! తవుడుఁ బొట్టు తినుచున్న దానివై ధనవంతురాలవు కమ్ము. (క్షీరమేధ సమనితా) అటుపిమ్మట నీవల్ల మేము భాగ్యవంతుల మవుదుముగాక. ఎల్లపుడును గడ్డి ని మేయుము. అటునిటు సంచరించుచు శుద్ధమయిన యుదకమును త్రాగుము.

౧౬౨౫. గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ ।

అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమేవ్యోమన్॥ ౪౧॥

దం॥ వర్షోదకములను సమకూర్చుచున్నదై (వాయురూపమగు) నొకపాదముగల్గి (మేఘాన్తరిక్షములను) రెండుపాదములుగలదై (నాల్గుదిక్కులను) నాల్గుపదములు గల్గి (విదిక్కులను) నెనిమిదిపాదములుగల్గి, ఊర్ధ్వదిక్కును తొమ్మిదవ పాదముగల్గి యంతములేని యాకాశమందు అపరిమిత వ్యాప్తి కలదిగాఁ దలఁచుచున్నదై యొకవిధ మయినధ్వని (అనఁగా మాధ్యమికవాక్కు) ధ్వనించుచున్నది. (ఈయంతరిక్షవాక్కును గోవుగా వర్ణించె)

౧౬౨౬. తస్యాస్సముద్రాఅధి విక్షరన్తి తేనజీవన్తి ప్రదిశశ్చతస్రః ।

తతఃక్షరత్యక్షరం తద్విశ్వ ముప జీవతి॥ ౪౨॥

దం॥ (పూర్వోక్తమయిన) ఆగోవునుండి మేఘములధికముగా వర్షించుచున్నవి. ఆయుదకముచేత దిక్కులునాల్గు విదిక్కులు (నాల్గు) వీటియందున్న భూతములుఁ జీవించును. పిమ్మటనుదకము సస్యాదికమును బుట్టించును. ఆ సస్యము ప్రపంచము నంతటిని జీవింపఁజేయును.

౧౬౨౭. శకమయం ధూమ మారాదపశ్యం విషూవతా పరఏనావరేణ ।

ఉక్షాణం పృశ్నిమపచన్త వీరాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్॥ ౪౩॥

తా॥ ఎండిన ఆవుపేడకాలిన పొగను దగ్గఱనేచూచితిని. వ్యాపించుచున్న యీ నికృష్టమయిన పొగవల్ల దానికారణమైన యగ్నికనఁబడెను. ఫలమును వర్షించుతెల్ల నిసోమలతను వీరులు (ఋత్విజులు) అభిషవించిరి. ఆపనులు ప్రశస్తములైనవి.

౧౬౨౮. త్రయః కేశిన ఋతుథా విచక్షతే సంవత్సరేవ పతపక ఏషాం ।

విశ్వమేకో అభిచష్టే శచీభిర్ధ్రాజిరేకస్యదదృశేన రూపం॥ ౪౪॥

తా॥ కిరణములుగల ముగ్గురు (అగ్ని- వాయు- ఆదిత్యుఁడు) ఋతువులననుసరించి వివిధలక్షణములగల భూమినిజూతురు. వారిలోనొకఁడు సంవత్సరముదాఁకగానే (ఓషధులు మొదలగువాటిని) ఛేదించును. (అగ్నియనితా) మఱొకఁడుఁ ఆదిత్యుఁడు) తనకర్మచేతఁ బ్రపంచమునంతటిని జూచును. మూఁడవవాని గమనము తెలియును గాని రూపమెవరికినిగానరాదు. (వాయువునకనితా)

౧౬౨౯. చత్వారి వాక్పరిమితాపదాని తాని విదుర్బ్రాహ్మణా యేమనీషిణః ।

గుహాత్రీణి నిహితానేఙ్గయన్తి తురీయం వాచోమనుష్యా వదన్తి॥ ౪౫॥

తా॥ నాలుగువిధముల వాక్కులు (అనఁగా ధ్వనులు) గలవు. మేధావులయిన బ్రాహ్మణులు వాటినెఱుంగుదురు. అందులో మూఁడు గుహాలోనున్నవి. బయటికిం గనబడవు నాల్గవ వాక్కును మనుష్యులు పలుకుదురు. (దీనికిఁ బలువురు పలు విధముల వ్యాఖ్యాము చేసిరి. యాస్కుని వ్యాఖ్యానము ననుసరించిన వివరమిట్లు, సృష్టికాలమున నొకధ్వని పుట్టినది అది నాల్గువిధములయ్యెను. అగ్నిలో నొకటి వాయువులో నొకటి ఆదిత్యునిలో నొకటి నరులుచ్చరించువది నాల్గవది అగ్ని పృథివిలోను వాయువంతరిక్షమందు ఆదిత్యుఁడు ద్యులోకమందు ఆయాగోళములలో నాధ్వనులున్నవని తా. (వాయువులో ధ్వనికి మధ్యమ వాక్కనిపేరు. అదే వర్ణాధారమట అంతరిక్షువాయువన్నను ఇదే)

౧౬౩౦. ఇంద్రం మిత్రం వరుణ మగ్నిమాహురథోదివ్యః ససుపర్ణో గరుత్మాన్ ।

ఏకం సద్విప్రాబహుధా వదన్త్యగ్నింయమం మాతరిశ్వాన మాహుః॥ ౪౬॥

దం॥ ఇతనినే (ఆదిత్యుని) ఇంద్రునిగాను, వరుణునిగాను, మిత్రునిగాను, అగ్నినిగాను, జెప్పుదురు. మఱియు ద్యులోకమందున్న సుపర్ణుడు (=గరుత్మంతుడు) నితడే. మేధావులు లోకవస్తువునే (ఆయాపనులంబట్టి) అనేకవిధములుగా జెప్పుదురు. అగ్ని యముడు గాలి యని యందురు. (మిత్రుడు పగటికభిమానదేవత వరుణుడు రాత్ర్యభిమానదేవత, ఇంద్రుడు ఐశ్వర్యవంతుడు, అగ్ని విద్యుత్తు, యముడు నియామకుడు, మాతరిశ్వ = అంతరిక్షసంచారి వాయువు.)

౧౭౩౧. కృష్ణం నియానం హరయ స్సుపర్ణా అపో వసానా దివముత్పతన్తి।
తఆవవృత్రన్త్సదనా దృతస్యాదిద్ఘృతేన పృథివీవ్యుద్యతే॥ ౪౭

దం॥ ఉదకములను హరించునట్టి చక్కని ప్రసారముగలట్టి, సూర్యకిరణములు (సుపర్ణా) ఉదకములను నల్లని మేఘమందు బూరించుచున్నవై ద్యులోకమును గూర్చి పోవుచున్నవి. ఉదకమునకు జోటయిన యాదిత్యమండలమునుండి ఆ కిరణములు క్రిందికి వచ్చుచున్నవి ఆ వచ్చినవెంటనే ఉదకముతో భూమి విశేషముగా దడియుచున్నది.

౧౭౩౨. ద్వాదశ ప్రధయశ్చక్రమేకం త్రీణినభ్యాని క ఉతచ్చికేత।
తస్మిన్త్సాకం త్రిశతా నశఙ్కవో ర్పితాః షష్టిర్న చలాచలాసః॥ ౪౮

దం॥ పండ్రెండుపరిధులు (పరిధి=చుట్టునున్నఅంచు) నాభిన్నాశ్రయించిన బల్లలుమూడు ఒకటే చక్రము దీని నెవరెఱుగుదురు? ఆచక్రమందు మూడువందలఅఱువై కొయ్యలు మాటిమాటికి దిరుగునవికలవు (ఇది ఆదిత్యసంబంధకాలచక్రమున్నన ౧౨ నెలలు ౩౬౦ దినములు ౩ కాలములు, గ్రీష్మవర్షహేమన్త అని తా.)

౧౭౩౩. యస్తే స్తనశ్శశయో యో మయోభూర్యేన విశ్వా పుష్యసి వార్యాణి।
యో రత్నధా వసువిద్య స్సుదత్ర స్సరస్వతి తమిహ ధాతవే కః॥ ౪౯

దం॥ ఓ సరస్వతీ! నీ స్తనము (అనగా శిశుపోషణస్థానము) నీ దేహమునందు సుఖమును (బిడ్డలకు) గలిగించుచున్నడి. ఏ స్తనముచేత సమస్తధనములను గలిగించు

మన్నావో ఏ స్తవము రక్షములనుభరించుచున్నదో మంచిదానము చేయునది అగునో ఆ (సూక్తరూపమైన) స్తవము మేమీనాకర్ణయించు చావుటకునిమ్ము. సూక్తమనఁగాఁ గొన్ని ఋక్కుల మొత్తము.

౧౬౩౮. యజ్ఞేనయజ్ఞ మయజన్తదేవా స్తానిధర్మాణి ప్రథమాన్యాసన్ ।

తేహనాకం మహిమానస్సచన్తయత్రపూర్వే సాధ్యాస్సన్తిదేవాః॥ ౫౦॥

దం॥ యజమానులు అగ్నితో నగ్నిని సమకూర్చిరి. (అనగా మథించిన యగ్నితో నాహవనీయాగ్నిని గలుపుదురు)ఆ యగ్ని సాధనకర్మలుప్రశస్తమయినవి. ఆ యజమానులు మహిమకలవారై స్వర్గమును బొందిరి. పూర్వులయిన సాధ్యులెచట నుండిరో ఆ స్వర్గమును బొందిరని పూర్వాన్వయము.

౧౬౩౯. సమానమేత దుదక ముచ్చైత్యవచాహభిః ।

భూమిం పర్జన్యాజిన్వన్తి దివంజిన్వన్త్యగ్నయః॥ ౫౧॥

దం॥ ఈ కనంబడుచున్న నీరు ఏకరూపమే. కొన్ని దినములలో మీఁదికిఁ బోవును. క్రిందికివచ్చును, మేఘములు భూమినిబోషించును. అగ్నులు ద్యులోకమును బోషించును. (యజ్ఞములందు దేవతలను దృప్తులఁ జేయునని తా.)

౧౬౪౦. దివ్యంసుపర్ణం వాయసం బృహన్త మపాంగర్భందర్శత మోషధీనాం ।

అభీపతో వృష్టిభి స్తర్పయన్తం సరస్వన్త మవసే జోహవీమి॥ ౫౨॥

దం॥ ద్యులోకమందున్నది చక్కని గమనముగలది ఎల్లప్పుడు నడచే స్వభావము కలది గొప్ప వర్షోదకమును గర్భమందు ధరించినది, ఓషధులను బయలుపఱచునది పూరించునది వర్షములచే దృప్తిగలిగించునది ఉదకములు కలదియగు (దేవతలను ఋకఁగా నాదిత్యుని) మమ్ము రక్షించుటకు మాటిమాటికిం బిలుచుచున్నాను.

ఇట్లు ప్రథమ మండలమున యిరువదిరెండవ యనువాకము.

దా॥ మరుత్తులారా! అన్నికర్మములు (లేక) హవిస్సులునావి. స్తుతులన్నియు నాకే సుఖకరములు. అభిషవించిన సోమములన్నియునావే. బలముగల శత్రువులఁ జంపునావజ్రము విసరఁబడి తప్పక తగులును యజమానులందఱు నన్ను ప్రార్థింతురు. శస్త్రములు (స్తుతిమంత్ర) అన్నియు నన్ను గోరును ఈ నా గుఱ్ఱములు నేఁబోవు చోటికి మోసికొనిపోవును. (కనుక మీరు నాకు సహాయులైరండు.)

౧౭౮౧. అతో వయమన్త మేభిర్యుజానాః స్వక్షత్రేభిస్తన్వః శుమ్భమానాః ।
మహోభిరేతాఁ ఉపయుజ్మహేన్విన్ద్ర స్వధామనుహినో బభూథ॥ ౫॥

దా॥ (మరుత్తులవాక్యము) కనుకనే యింద్ర! మేముకూడ మిగుల దగ్గఱనున్నట్టి మంచిబలముగలట్టి గుఱ్ఱములతోఁగూడిన వారమై మాశరీరములను అలంకరించుచున్నాము. మహత్తులతోఁ గూడినమేము నీవు పోవుచున్న హవిస్సులనుకోరి అనుభవింతుము. నీవుకూడ మాసంబంధమయిన ఉదకము ననుభవించుచున్నావుగదా! (మేము కురిపించిన వర్షమువల్లఁ బుట్టిన సస్యములవల్ల నయిన హవిస్సులే నీవుతినునవని తా.)

౧౭౮౨. క్వ స్యా వో మరుతః స్వధాసీద్యన్మామేకం సమధత్తాహిహత్యే ।
అహంహ్యుగ్రస్తవిషస్తువిష్మాన్విశ్వస్య శత్రోరనమం వధస్నైః॥ ౬॥

దా॥ ఓ మరుత్తులారా! ఆయుదకముమీదెట్లగును? ఏయుదకమును నేనసహాయుడనైయే మేఘమునుబంజీల్చి సంపాదించితినిగదా! నేనుగదా ఉగ్రుఁడను ; బలవంతుడను కనుక శత్రువయిన మేఘమును వజ్రసాధనముల చేత లొంగఁదీసితిని.

౧౭౮౩. భూరిచకర్థ యుజ్యేభిరస్మే సమానేభిర్వృషభ పౌంస్యేభిః ।
భూరీణి హి కృణవామా శవిష్ఠేన్ద్ర క్రత్వా మరుతో యద్వశామ॥ ౭॥

దా॥ (మరుత్తులపల్కులు) ఓ యింద్రా! వర్షించువాఁడవునీవగుదువు. చాలపనిచేసితివి. (కావచ్చును) మాకున్న పౌరుషములతోనే నీవు చేసితివి. మేముపనులు చేసితిమి. పనిచేసి వర్షమునుగోరుదుము. మేము మరుత్తులము. మనముభయులముగలిసి వర్షముగోరుదుము.

౧౭౪౪. వర్ధీంవృత్రం మరుత ఇంద్రియేణ స్వేనభామేనత విషోబభూవాన్ ।

అహమేతామనవే విశ్వశ్చంద్రాః సుగా అపశ్చకరవజ్రబాహుః॥ ౮॥

దం॥ (ఇంద్రవాక్యము, మరుత్తులారా! పరాక్రమముచేత తగినంతకోపముచేత బల వంతుఁడనగుచు నేను వృత్రుని (అనఁగా మేఘమును) జంపితిని ఇష్టముకొఱకు ప్రపంచమును ఆనందింపఁజేయునట్టి చక్కని గమనముకలట్టి యుదకములను జేసితిని॥ వజ్రముచేతధరించితిని. కనుకనితరసహాయ్యముక్కఅలేకయే వర్షముకురిపింతును. (మీా సహాయమేలయనితా)

౧౭౪౫. అనుత్తమాతే మఘవ న్నకిర్నునత్వావాంఅస్తి దేవతా విదానః ।

నజాయమానో నశతేనజాతోయాని కరిష్యా కృణుహిప్రవృద్ధ॥ ౯॥

దం॥ (మరుద్వాక్యము) ఇంద్రా! ఆఁ! జ్ఞాపకమువచ్చినది! నీవుచేయనిపనియేది? నీవంటితెలివిగల దేవతయెవఁడు? అతిబలుఁడా! నీవుచేసిపని చేయువాఁడిదివఱకుఁ బుట్టలేదు. పుట్టుచుండలేదు. నీవేచేయుచున్నావు. నిజమే.

౧౭౪౬. ఏకస్యచిన్మేవిభ్వ స్త్వోజోయానునధృష్ణో నకృణవైమనీషా ।

అహం హ్యుగ్రో మరుతో విదానోయానిచ్యవమింద్ర ఇదీశఏషామ్॥ ౧౦॥

దం॥ (ఇంద్రవాక్యము) నాయొక్కనికున్నట్లు సర్వత్రగమనశీలము. బలము మఱెవరి కుండును? ఏయేపనులు నాలోచన చేయుదునో శీఘ్రముగాఁ జేయఁగలను. నే నతిబలుఁడను తెలివయినవాఁడను. ఏయేధనములిచ్చితినో వాటియన్నిటికిని నేనేయీా శ్వరుఁడను.

౧౭౪౭. అమన్దన్మా మరుతః స్తోమోఅత్రయన్మేనరః శ్రుత్యం బ్రహ్మచక్ర ।

ఇంద్రాయ వృష్ణే సుమఖాయ మహ్యం సఖ్యేసఖాయస్తన్వేతనూభిః॥ ౧౧॥

దం॥ (ఇంద్రవాక్యము) ఓ మరుత్తులారా! ఈ విషయమున (అనఁగా నుదకోత్పత్తి విషయమున నని తా॥) స్తోత్రము నన్నొఁడు మరిపించినది. సఖులారా! అందఱు వినందగు గొప్పపని చేసితిరి. ఐశ్వర్యవంతుఁడనైన, వర్షముకురిపించు పనికలవాఁడనైన, శోభనయజ్ఞములుగలట్టి సఖుఁడనైన నాకొఱకు మీారుచేయు పనులుఅన్నియు నగును గాక. నాశరీరమేమీారు.

౧౮౪౮. ఏవేదేతే ప్రతి మా రోచమానా అనేద్యః శ్రవ ఏషో దధానాః ।

సంచక్ష్యా మరుతశ్చంద్రవర్ణా అచ్ఛాంత మే ఛదయాథా చ నూనమ్॥ ౧౨॥

తా॥ మరుత్తులారా! యీలాగే మీరు నన్ను సంతోషపెట్టుచు మానముగా నున్న కీర్తిని యన్నమును ధరించుచు సువర్ణవర్ణులైరి నన్ను చక్కఁగాఁ బ్రశంసించుచు నిశ్చయముగాఁ గీర్తులతోఁ గూడికొనుచు (నన్ను కీర్తితో) గప్పివేయుఁడు.

౧౮౪౯. కో న్వత్ర మరుతో మామహే వః ప్ర యాతన సఖీఀరచ్ఛా సఖాయః ।

మన్మాని చిత్రా అపివాతయంత ఏషాం భూత నవేదా మ ఋతానాం॥ ౧౩॥

తా॥ మరుత్తులారా! మిమ్ము నీ లోకమందే మనుష్యుఁడు పూజించును? సఖులారా! సఖులయిన (యజమానులను) అభిముఖులుగాఁ జేసికొనఁబొండు. చిత్రవర్ణులారా! మీరు కోరఁదగిన ధనములనుగూడఁ బూర్ణముగాఁ గలిగించుడు నాయీ ధనముల వెలియువారు కండు.

౧౮౫౦. ఆ యద్దువస్యాద్దువసే న కారురస్మాంచక్రే మాన్యస్య మేధా ।

ఓ షు వర్త్త మరుతో విప్రమచ్ఛేమా బ్రహ్మాణి జరితా వో అర్చత్॥ ౧౩॥

తా॥ ఓ మరుత్తులారా! పరిచరింపఁదగిన స్తోత్రముచేతఁ బరిచర్యచేయుటకు నేర్పుగల మాన్యుఁడయిన; విద్వాంసుని బుద్ధి మనలనిపు డభిముఖులఁగా జేయదా యేమి? కనుక నో మరుత్తులారా! మీరు మేధావంతుడగు యజమానుని అభిముఖునిగా త్రిప్పుడు ఏమంటే ఈ కర్మలను గూర్చి స్తుతికర్త మిమ్ము బూజించును.

౧౮౫౧. ఏష వస్తోమో మరుత ఇయం గీర్మాందార్యస్య మాన్యస్య కారోః ।

ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుం॥ ౧౫॥

తా॥ మరుత్తులారా! యిపుడు చేయుచున్న స్తుతివంటిస్తుతి మీ సంతోషమునకు నగుఁగాక. ఈ స్తుతివాక్కు కూడ మీకొరకు. కనుక స్తుతులతో మగమును గలిగించి మన్నింపఁదగినట్టి స్తుతికర్తయొక్క యిచ్ఛతో శరీరము పోషించుటకు రండు. మేము కూడ నన్నమును బలమును జయశీలమయిన దానమును బొందుదుము.

ఇది ద్వితీయాష్టకములోఁ దృతీయాధ్యాయము సమాప్తము.

496

Pregnancy



# వండాన్వయాల తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 18 | ద్రావుమని | ద్రావుడని |
| 8 | 13 | ములక్ష్వరు | మలీక్ష్వరు |
| 45 | 3 | నంరిక్ష | నంతరిక్ష |
| 77 | 8 | సూవజ్ర | అవజ్ర |
| 80 | 6 | జంతువులకును | వులను |
| 81 | 13 | లక్తై నెవడు | లక్తై యెవడు |
| 84 | 17 | జజ్రము | వజ్రము |
| 85 | 4 | శిత్రాపుత్రు | శ్విత్రాపుత్రు |
| 102 | 16 | సోమమంత్ర | సామమంత్ర |
| 106 | 16 | మంని | మంచి |
| 108 | 10 | నగరమున | నగరమును |
| 109 | 11 | పహవఱకు | పదువఱకు |
| 110 | 11 | సంహారి | సంహార |
| 133 | 4 | ఎవిని | ఎవని |
| 133 | 20 | ఇతరర్థులు | ఇతరర్షులు |
| 139 | 22 | ఉక్థ్వ | ఉక్థ్వ |
| 147 | 3 | హవిస్బు | హవిస్సు |
| 148 | 14 | చిరగాల | చిరకాల |
| 152 | 19 | నన్ను | నిన్ను |
| 156 | 17 | ప్రాతఃతాల | ప్రాతఃకాల |
| 163 | 4 | స్సుయిచ్చిన | స్సునిచ్చి |
| 164 | 18 | రథముల | రథముగల |
| 168 | 12 | నీహుబా | నీబాహు |
| 188 | 21 | కార్య | కావ్య |
| 196 | 16 | దానినిసేవింపుము | వానినిసేవింపుము |
| 200 | 9 | కలవాడు | తెలివికలవాడు |
| 209 | 2 | షష్టనూధ్యా | షష్ఠాధ్యా |
| 209 | 13 | మైనవధ | మైనధ |
| 219 | 14 | తెలికొన | తెలిసికొన |
| 223 | 4 | దానితో | దానిలోసిరు |
| 224 | 16 | దిశములు | దినములు |
| 240 | 6 | తవకాన్తి | తనకాన్తి |
| 244 | 4 | అజ్యా | ఆజ్యా |
| 244 | 17 | జ్యోతిస్య | జ్యోతిస్సు |
| 250 | 6 | యంగశాల | యాగశాల |
| 251 | 11 | మంచిగల | మంచికాన్తిగల |
| 255 | 9 | ధనవాత | ధనదాత |
| 260 | 20 | వాదికంటె | వానికంటె |
| 267 | 22 | మంచితోర | మంచిమోర |
| 316 | 23 | నరికిరటు | నదికిరటు |
| 324 | 11 | అసత్య | సత్య |
| 335 | 3 | త్రేల్వ | ద్వేల్వ |
| 342 | 9 | జేయుము | జేయుడు |
| 359 | 7 | సూర్యునివె | సూర్యునివలె |
| 360 | 14 | గూడి | గూడ |
| 370 | 24 | నినాస | నివాస |
| 376 | 17 | చున్నాడు | చున్నారు |
| 385 | 13 | దర్భమహావి | దర్భమీఁదికి |
| 396 | 14 | హుమ్మ | కమ్మ |
| 420 | 8 | చున్నదై | చున్నవై |
| 423 | 18 | మునకుమేఘు | మునమేఘు |
| 423 | 20 | మరో | మర్గో |
| 427 | 16 | ప్రజ్ఞాల | ప్రజ్ఞల |
| 431 | 12-20 | వరకర్మ | వీరకర్మ |
| 436 | 14 | యలమాన | యజమాన |
| 443 | 11 | సమస | సమస్త |
| 450 | 3 | అశ్వయూప | అశ్వయూప |
| 451 | 15 | దేతలకు | దేవతలకు |
| 455 | 12 | చిరి | చితిరి |
| 460 | 13 | ఈమాఱు | ఈయాఱు |
| 457 | 9 | హారిర్భత్తు | హవిర్భత్తు |
| 464 | 19 | ఎండి | పండి |
| 464 | 20 | రుండవ | రెండవ |